# ధ్వని - మనుచరిత్రము

(DHWANI AND IT'S APPLICATION TO MANUCHARITRAMU)

Ph.D పట్టమునకై ఉస్మానియా విశ్వవిద్యాలయముచే
ఆమోదింపఁబడిన పరిశోధన నిబంధము

సంస్కృత సాహిత్యరత్న, విద్యాప్రవీణ

**డా॥ కే. రాజన్నశాస్త్రి**

M.A., Ph.D., M.O.L.

# ధ్వని - మనుచరిత్రము

(Dhwani and it's application to Manucharitramu)

Thesis approved by the Osmania University
for the award of Ph D.

ప్రథమ ముద్రణ . 1000 ప్రతులు

విభవ దీపావళి 1910 శా॥ శ॥
9-11-1988



ముఖచిత్రాలంకరణ : B రాములు

ప్రతులకు -
డా॥ కే. రాజన్న శాస్త్రి
M A, Ph.D, MOL
1. Dept. of Telugu, Osmania University
Hyderabad - Andhra Pradesh
2. 10-116 Near Temple, Dharmapuri,
Karimnagar Dt (A. P) Pin. 505 425

వెల రూ. 75/-

Printed at
Nagarjuna Printing Works, Hyderabad

తెలుగు విశ్వవిద్యాలయము వారి ఆర్థిక సహాయముతో
(రూ. 7,500) ముద్రింపఁబడినది.

'Vedanta Siromani', 'Vedanta Visarada', 'Vidvan'
డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు
M A Ph D (Skt), M A (Eng), M A (Hindi)
Recipient of President's Certificate of Honour
Emeritus Professor (U G C ) Dept of Sanskrit
Hon. Director, Sanskrit Academy
Osmania University Hyderabad, (A.P)
Hon Professor University of Hyderabad

# ప్రరోచన

కావ్యపురుషుని ఉత్పత్తిని గూర్చి రాజశేఖరుడు కావ్యమీమాంసలో ఒక చక్కని కథ కల్పించి చెప్పాడు సరస్వతీదేవి పుత్రార్థినియై హిమవత్పర్వతం మీద తపస్సు చేసింది బ్రహ్మ ఆమె తపస్సుకు సంతోషించి ఒక కుమారుణ్ణి ప్రసాదిస్తాడు. ఆతని పేరు కావ్యపురుషుడు అతడు పుట్టిన వెంటనే ఛందోబద్ధమైన వాక్కులతో, తానెవరో చెప్పకుంటూ తల్లికి నమస్కరిస్తాడు వేదంలో మాత్రమే ఉన్న ఛందస్సును లోకంలో కూడా ప్రవర్తింపచేసినందుకు తల్లిని (నన్ను) మించిన కుమారుడవైనావు అని ఆమె సంతోషిస్తూ, ఆ కుమారుణ్ణి ఈ విధంగా వర్ణిస్తుంది "శబ్దార్థాలు నీ శరీరం సంస్కృతభాష నీ ముఖం. ప్రాకృతభాష బాహువులు. అపభ్రంశభాష జఘనం, పైశాచభాష పాదాలు మిశ్రభాష నీ వక్షఃస్థలం నీవు సముడవుగాను ప్రసన్నుడవుగాను, మధురుడవుగాను, ఉదారుడవుగాను, ఓజస్వివిగాను ఉన్నావు. ని వాక్కు ఉక్తులలో అరితేరినది. నీకు రసమే ఆత్మ. ఛందస్సులు రోమాలు ప్రశ్న–ఉత్తర-ప్రహేళికాదులు నీ వాగ్విలాసము నిన్ను అనుప్రాసోపమాదులు అలంకరిస్తున్నాయి" ఈ కావ్యపురుషుడు పార్వతీమానసపుత్రియైన సాహిత్యవిద్యావధువును వివాహమాడుతాడు. ఐతే వివాహత్పూర్వం వీరిద్దరూ ఆయా దేశాలలో సంచరించేటప్పుడు వారి వేషభాషాదులను బట్టి రౌద్రమాగధ–పాంచాల మధ్యమాది ప్రవృత్తులు, సాత్వత్యాదివృత్తులు, పాంచాల్యాదిరీతులు ప్రచారంలోనికి వచ్చాయి. ఇది సంక్షిప్తరూపంలో కావ్యపురుషుని కథ ఈ కథ ద్వారా రాజశేఖరుడు కావ్యాంగాలన్నింటినీ సూచించాడు ఈ అంగాలన్నీ ఉంచేనే అంగి ఆయిన కావ్యం సర్వాంగసుందరం అవుతుంది.

రాజశేఖరుడు చేసిన కావ్యపురుష కల్పన ఫలితమే కాబోలు తరువాత వచ్చిన విద్యానాథాదులు కూడ మానవుని పరిపూర్ణత్వానికి కొంత సామగ్రి ఏ విధంగా అవసరమో కావ్యపరిపూర్ణత్వానికి కూడా కొంత సామగ్రి అవసరం అని ప్రతిపాదించారు

"శబ్దార్థౌ మూర్తి రాఖ్యాతౌ జీవితం వ్యఙ్గ్యవైభవమ్ ।
హారాదివదలఙ్కారా స్తత్ర స్యురుపమాదయః ॥
శ్లేషాదయో గుణా స్తత్ర శౌర్యాదయ ఇవ స్థితాః ।
ఆత్మోత్కర్షావహా స్తత్ర స్వభావా ఇవ రీతయః ॥
శోభామాహార్యకీం ప్రాప్తా వృత్తయో వృత్తయో యథా ।
పదానుగుణ్యవిశ్రాన్తిః శయ్యా శయ్యేవ సమ్మతా ॥
రసాస్వాదప్రభేదాః స్యుః పాకా పాకా ఇవ స్థితాః,
ప్రఖ్యాతా లోకవదియం సామగ్రీ కావ్యసంపదః ॥

(ప్ర. రు కావ్య ప్ర 2 — 5)

ఈ విధంగా కావ్యపురుషునికి శబ్దార్థాలు శరీరం, ధ్వని జీవితం, ఉపమాదులు హారాద్యలంకారాలు, శ్లేషాదిగుణాలు గుణాలు రీతులు స్వభావం వృత్తులు అహార్యశోభ. శయ్య శయ్య పాకాలు పాకాలు అనగా ఇవన్నీ కావ్యంలో ఉండాలని అర్థం ఇంకా కొంచెం సంక్షిప్తంగా చెప్పాలంటే — అలంకార శాస్త్ర ప్రమేయం—ప్రతిపాద్య విషయాలు — రస ప్రదానముత్రైన శబ్దార్థాలు, గుణ—అలంకార—వృత్తి—రీతులు అని అంటాడు విద్యానాథుడు.

"రసప్రధానాః శబ్దార్థాః గుణాలంకారవృత్తయః ।
రీతియశ్చేయతీ శాస్త్రప్రమేయం కావ్యపద్ధతిః" ॥

(ప్ర రు నాయక ప్ర. 4)

వీటి స్వరూపం తెలిస్తే అలంకార శాస్త్ర స్వరూపం తెలిసినట్లే, అప్పుడు కాని భారతీయభాషలలో ఏ భాషలో వ్రాసినదైనా ఒక ప్రాచీన మహా కావ్యాన్ని సరిగా అర్థం చేసుకోవడంగాని తత్సౌందర్యాన్ని ఆస్వాదించడంగాని కుదరదు. అందుచేతనే మిత్రులు శ్రీ రాజన్నశాస్త్రిగారు పి హెచ్. డి. ఉపాధి కోసం వ్రాసిన "ధ్వని — మనుచరిత్రము" అనే సిద్ధాంత వ్యాసంలో నాల్గువంతులలో మూడున్నరవంతుల గ్రంథాన్ని ధ్వనిప్రస్థాననిరూపణకోసం వినియో

గించారు ఇది కేవలం మనుచరిత్రాధ్యయనానికే కాకుండా తదితర ప్రబంధాల - అధ్యయనానికి కూడా ఉపకరిస్తుందని వేరుగా చెప్పవలసిన పనిలేదు

అలంకార శాస్త్రానికి సంబంధించిన సరియైన అవగాహన ఉన్న అంగుళీపరిగణనీయులైన ఆంధ్రులలో డా॥ శ్రీ రాజన్నశాస్త్రిగారు ఒకరు ధర్మసూరి రచించిన సాహిత్యరత్నాకరాన్ని నౌకామందరవ్యాఖ్యానాలతో పరిష్కరించి, ఆవశ్యకస్థానాలలో పాండితీసముంచితాలైన టిప్పణులే కాకుండా ఆయా విషయాలపై పరిశోధన పత్రాలను కూడా ప్రచురించిన డా॥ శ్రీ శాస్త్రిగారి అలంకారశాస్త్ర వైదుష్యం విద్వల్లోకవిదితమే

తొమ్మిది ప్రకరణాల ఈ పరిశోధనావ్యాసంలో ఎనిమిదవ ప్రకరణంలో మనుచరిత్రలోని వివిధ ధ్వనులు వర్ణింపబడ్డాయి మిగిలిన ఎనిమిది ప్రకరణాలు కూడా అలంకార శాస్త్రానికి సంబంధించిన అనేక విషయాలతో కిక్కిరిసి ఉన్నాయి శాస్త్రిగారు ప్రధానంగా ధ్వనిప్రస్థానాన్ని గురించిన విషయాలన్నీ ఒక్కటికూడా విడవకుండా ప్రతిపాదించారు వ్యంజన అభిధా–లక్షణలను ఆశ్రయించి అనగా తత్తద్వృత్త్యనంతరం ప్రవర్తించేదిగా ఉంటుంది లక్షణ అభిధాపుచ్ఛభూతమైనది ఆ రెండింటి స్వరూపం తెలుసేనే వ్యంజనాస్వరూపం స్పష్టంగా తెలుస్తుంది అందుచేత మొదటి ప్రకరణంలో (1–83 పుటలు) శబ్దవృత్తులు లక్షణోదాహరణపూర్వకంగా నిరూపించారు మరియు అన్వితాభిధానవాదము, అభిహితాన్వయవాదము మొదలైన ఎన్నో శాస్త్రీయవిషయాలు చక్కగా ప్రతిపాదించడం జరిగింది ద్వితీయ ప్రకరణంలో (పు. 84–152), ధ్వని స్వరూపము ధ్వనిభేదాలు నిరూపించబడినవి రసధ్వనికిగల వైశిష్ట్యం, పదపదాంశాలద్వారా రసధ్వని మొదలైన శాస్త్రీయ విషయాలు యథాధ్వన్యాలోకలోచనంగా చర్చించారు. తృతీయ ప్రకరణంలో (పు 153–196) "ధ్వనియే కావ్యాత్మ" అని నిరూపిస్తూ అలంకార–రీత్యాది ప్రాధాన్యవాదులమతాలు కూడా స్పష్టీకరించారు చతుర్థ ప్రకరణంలో (పు 197–251) ధ్వన్యాలోకంలో చెప్పిన విధంగా మూడు ధ్వన్యభావవాదాలు పూర్వపక్షాలుగా చూపి వాటిని ఖండించి ధ్వనిని తప్పక అంగీకరించవలసి ఉంటుందనే విషయాన్ని సమర్థించారు ఈ సందర్భంలో మహిమభట్టాదుల అనుమానాంతర్భావవాదం కూడ మమ్మటాదులు చెప్పినవిధంగా అసమంజసమే అని నిరూపించారు శ్లేషనుగూర్చి, దానికి శబ్దశక్తిమూలకధ్వనికీ ఉన్న

భేదాన్ని గూర్చి చాలామంది పండితులకు కూడా స్పష్టమైన అభిప్రాయం లేదు ప్రాచీన అలంకారశాస్త్రగ్రంథకారులు కూడా వేరువేరువిధాల వ్రాయడమే దానికి కారణం. ఈ విషయాలన్నీ సమగ్రంగా చర్చించి శాస్త్రిగారు పంచమ ప్రకరణంలో (పు. 252_305) వీటి భేదాన్ని స్పష్టీకరించారు. షష్ఠ ప్రకరణంలో (పు 306_321) గుణీభూతధ్వనిభేదాలను సోదాహరణంగా ప్రతిపాదించారు సప్తమప్రకరణం అంతా (పు 322_365) ప్రాచీనాలంకారికులూ కొందరు పాశ్చాత్యపండితులూ చెప్పిన కావ్యలక్షణాల విమర్శతో సాగింది చంపూకావ్యమే తెలుగు ప్రబంధాలకు మూలం అనే విషయం కూడా ఇక్కడ శాస్త్రిగారు సూచించారు అష్టమ ప్రకరణం (పు. 366_428) ప్రత్యక్షంగా మనుచరిత్రకు సంబంధించినది. మనుచరిత్రలో ఉన్న ధ్వనిభేదాలన్నీ దీనిలో సోదాహరణంగా చూపబడినవి చివరి నవమప్రకరణంలో (పు 429-452) అలంకారికులు చెప్పిన విధంగా ధ్వనికావ్యానికి ఉన్న వైశిష్ట్యం ప్రతిపాదింపబడింది. ఈ విధంగా శ్రీ శాస్త్రిగారు ఈ గ్రంథంలో ధ్వని ప్రస్థానానికి సంబంధించిన విషయాలు అన్నీ ప్రతిపాదిస్తూ తదుపష్టంభకంగా ధ్వన్యాలోక_లోచన - కావ్యప్రకాశ - రసగంగాధరాదులనుండి వాక్యాలను క్రింద ఉదాహరించారు విషయ ప్రతిపాదనం అంతా శాస్త్ర సంమతంగా ఉన్నది

రసాదులు కూడా సంలక్ష్యక్రమాలు అవుతాయా? అనే విషయంలో కొందరు- "పండితరాయలు రసానికి కొన్ని చోట్ల సంలక్ష్య క్రమ ధ్వనిత్వం ఉండవచ్చునని అంగీకరించాడు" అని అనుకొన్నారు ప్రాచీన వ్యాఖ్యాతలైన నాగేశభట్టాదులు ఈ అభిప్రాయం వెలిబుచ్చారు అయితే భావాదులకు సంలక్ష్యక్రమత్వం అంగీకరించి అలాంటి ధ్వనిని వస్తుధ్వనికోటిలో చేర్చవచ్చునని మాత్రమే పండితరాయల అభిప్రాయం కాని రసధ్వనికి సంలక్ష్యక్రమత్వాన్ని ఆయన అంగీకరించ లేదు అని శ్రీ శాస్త్రిగారు ప్రతిపాదించారు (పు 127) ఇదే సరియైన పండితరాజాభిప్రాయం. అదే విధంగా, పండితరాయలు చెప్పిన మార్గాన్ని అనుసరిస్తూ శ్రీ శాస్త్రిగారు భావశాంత్యాదిధ్వనులకు కూడా 'అంతతోగత్వా' భావధ్వనులలోనే అంతర్భావం అని సయుక్తికంగా నిరూపించారు (పు. 134). గుణాలనుగూర్చి గౌడవైదర్భమార్గాలనుగూర్చి దండి తన కావ్యాదర్శంలో విస్తృతంగా చర్చించడంచేత అతడు రీతి (గుణ) ప్రాధాన్యవాది అని కొందరు అభిప్రాయపడ్డారు. అది యుక్తంకాదు; దండి అలంకార

ప్రాధాన్యవాదియే అని శ్రీ శాస్త్రిగారు సయుక్తికంగా నిరూపించారు (పు 175-177) ఈ విధంగా ధ్వని ప్రస్థానసారాన్నంత యథాశాస్త్రంగా అందించిన ఈ గ్రంథం ఎతద్విషయజిజ్ఞాసువులకు సర్వథా ఉపకరిస్తుందనడంలో సందేహం లేదు అయితే విషయం అతివిస్తృతమూ గంభీరమూ అవడం. స్థానం సంకుచితం అవడం అనే రెండు కారణాలచేత ఈ గ్రంథంలో విషయాలను ఒక కిలో మిరాయిలను అరకిలో పెట్టెలో వేసి కట్టినట్లయినది పరిత సావధానంగా పైన (ఆంధ్రమూ) క్రింద (సంస్కృత లక్షణోదాహరణాదులూ) చూచుకుంటూ జాగ్రత్తగా విషయ పరిగ్రహణం చేయవలసి ఉంటుంది ఈ విషయంలో మరొకరి హస్తం (గురుసాహాయ్యాపేక్ష కూడా) అవసరం కావచ్చును.

ఒకటి రెండు చోట్ల నాకు సందేహాలు కలిగినాయి 370 వ పుటలో ప్రవరుడు ధీరశాంతుడు అతనియందే శృంగారము ఆశ్రయించి ఉన్నట్లు వర్ణించడంవల్ల పరస్పర విరుద్ధాలైన శాంతశృంగారాలను ఒక్కచోట నిబంధించడంలో రస విరోధం ఉన్నది కదా? అని ఆశంకించుకొని శాస్త్రిగారు సమాధానము చెప్పినారు ఈ ప్రశ్నకే అవకాశము లేదేమో అని నా అభిప్రాయం. ప్రవరుడు వైదికధర్మ నిరతుడవడంచేత అతనికి శృంగారంతో సంబంధం ఉండదనడం అవసరం లేదు అతడు భార్యాదులతో సంసారం గడుపుతున్న గృహస్థుడే కదా! ఏకపత్నీవ్రతం శృంగారవిరుద్ధం కాదు అందుచేత అతనిని ధీరశాంతుడనవలసిన పనిలేదు అసలు విషయమేమనగా -ఆలంబనం వేరు, ఆశ్రయం వేరుకదా? పెద్దనగారు ప్రవరుణ్ణి వరూథినిగతరతికి ఆలంబనంగా మాత్రమే చిత్రించినాడు గాని ఆశ్రయంగా (రతి ప్రవరునిలో ఉన్నట్లు) చిత్రించలేదు కదా! అందుచేత ఆ విరోధప్రశ్నే ఉదయించదు.

ఇక ఇక్కడ శృంగారమా? శృంగారాభాసమా? అనే ప్రశ్న. కొంతసేపటి తరువాత గంధర్వుడు ప్రవరవేషంతో వరూథినిని చేరుతాడు కాబట్టి ఇది శృంగారమే అని శ్రీ శాస్త్రిగారి సమాధానం అయితే పరితకు కలిగే రసాస్వాదం తరువాత రాబోయే దానినిబట్టి ఉండదు మొదటి ఘట్టంలో ప్రవరుడు ససేమిరా అంటుంటే వరూథిని మీదపడుతూన్నపుడు ఏకత్రైవానురాగము అని తెలిసిన పరితకు పరిపూర్ణరసాస్వాదం కలగదు కదా. అందుచేత ఈ ఘట్టంలో రసాభాసమనే చెప్పాలి అని నా అభిప్రాయం. న్యాయశాస్త్రంలో

హేత్వాభాసలను దోషం అన్నట్లు రసాద్యాభాసలు దోషమని మన అలంకారికు లనలేదు కథావస్తువులోని ప్రసంగాన్ని పట్టి రసాభాసాదులను కూర్చడంలో తప్పులేదు దుష్టులైన రావణాదులమరణానంతరం వారి బంధుపుత్రాదుల విలాపాలు పరితకుగాని, శ్రోతకుగాని ద్రష్టాదులకుగాని అంతగా శోకభావాన్ని పుట్టించవు. అలాంటి చోట అది కరుణరసాభావమే 'తావన్మాత్రేణ' అది అవర్ణ నీయం కాదు అన్నిరసాల విషయంలోను ఇంతే ఇది కేవలము నా స్వాభి ప్రాయము ఇలాంటి విషయాలలో రెండువిధాల వాదనలు చేయవచ్చు డా రాజన్నశాస్త్రిగారు తమ ప్రతిభాపాండిత్యాలను పూర్తిగా వినియోగించి, అలంకారశాస్త్రాన్ని మథించి, రచించిన ఈ గ్రంథం తెలుగు విద్యార్థులకే కాకుండా సంస్కృత విద్యార్థులకూ ఆంధ్రసంస్కృతోపాధ్యాయులకూ కూడా ధ్వనిసిద్ధాంత గ్రహణం విషయంలో తోడ్పడగలదని నా దృఢ విశ్వాసం

హైదరాబాదు
14-11-1988

పు శ్రీరామచంద్రుడు



డా॥ బిరుదురాజు రామరాజు
Emeritus Professor (U.G C)
Dept of Telugu Osmania University Hyd

# అభినందన

మహాకవులకృతులు సముద్రాలవలె గంభీరములు. వాని లోతుల్లోకి దిగి అన్వేషిస్తే అనర్ఘమణులు లభిస్తాయి సముద్రంపైనే విహరించే వారికి హోరుగాలి తరంగ బుద్బుద ఫేనములు మాత్రమే కనబడుతవి ఆంధ్రకవితా పితామహుడు అల్లసాని పెద్దనగారి స్వారోచిషమనుసంభవం సముద్రంవంటి మహాకావ్యం ప్రౌను కాలంనుండి ఈనాటి వరకు పండితులు విమర్శకులు పరిశోధకులు ఆ మహాకావ్యంలోని స్వారస్యాలు వెదకుతునే ఉన్నారు కొందరు దానిని రసాభాసకావ్యమన్నారు కుతపకాలం గురించి చర్చించిన మరికొందరు అసంబద్ధమన్నారు ఎవరేమన్నా ఆ మహాకావ్యం విలువ తగ్గలేదు వెదకిన కొలది అందులోని స్వారస్యాలు ఇంకా ఇంకా వెలువడుతునే ఉన్నవి ఇన్నాళ్ళకు ఆ మనుచరిత్రలోని వృత్తి అలంకార రసధ్వని వ్యంగ్యాది సాహిత్య శాస్త్ర మర్యాదలన్నిటికీ లక్ష్యలక్షణ సమన్వయం చెప్పే వ్యాఖ్యాన ప్రాయమైన సిద్ధాంత గ్రంథం వెలువడింది ఈ కార్యానికి కటిబద్ధులైన మిత్రులు కొరిడె రాజన్నశాస్త్రిగారు గురుకులక్లిష్టులు ఉభయభాషాసాహిత్యమర్మజ్ఞులు. సాహిత్య శాస్త్ర పారంగతులు, భర్తృహరి చెప్పిన "కుశలురు' ఇంకను ఆహితాగ్నులింటి సంప్రదాయాలు అనుభవంలో ఉన్నవారు. శాస్త్రిగారు మనుచరిత్రమనే బంగారాన్ని సాహిత్యశాస్త్రనికషోపలంమీద ఒరపిడి పెట్టి నిగ్గుతేల్చి చూపినారు. పాఠకుల సౌలభ్యంకోసం ఆయా సాహిత్య శాస్త్ర గ్రంథాలలోని విషయాలన్నీ అందుబాటులోనికి తెచ్చినారు. ఆ విధంగా ఆకరాలన్నీ గ్రథించటం మూలంగా ఈ పుస్తకంపైనున్న తెలుగు పాఠ్యానికి, క్రింద సంస్కృత వ్యాఖ్యానం ముద్రించినట్లున్నది. ఇందులోని తొమ్మిది ప్రకరణాలు మను చరిత్రమనే సముద్రం లోతులరసి వెలికి తీసిన నవరత్నాలు అనుబంధంగా కూర్చిన 'కుతపకాలనిర్ణయం' రాజన్నశాస్త్రిగారి వైదిక సంప్రదాయ జీవితానుభవానికి దర్పణం. శాస్త్రిగారి వంటి సహృదయులున్నంత కాలం ప్రాచీన సత్కృతులు బ్రతికే ఉంటాయి.

"యేష్వైవం పురుషాః కలాసు కుశలాస్తేష్వేవలోకస్థితిః" భర్తృహరి.

11.11 1988 బి. రామరాజు

ప్రొ. సి. నారాయణరెడ్డి
M A Ph D , D Litt
Vice-Chancellor
Andhra Pradesh Open University

Phone : Off 226391
Res 63062
6-3-645, Somajiguda
Hyderabad-500 482 (A P)

Date 16-11-1988

# అభినందన

డా॥ రాజన్నశాస్త్రిగారు సంస్కృతాంధ్ర భాషా లక్షణ లక్ష్య సారజ్ఞులు కవితాత్మ కందళించిన వ్యాకరణాభిజ్ఞులు చిరకాలంగా పఠన పాఠన పరిశోధన ప్రవణులు శాస్త్రిగారు తమ పి హెచ్‌డి పట్టంకోసం ఎన్నుకున్న విషయం విజ్ఞతా రసజ్ఞతల సమన్వయం.

మామూలుగా అయితే 'మనుచరిత్రలో ధ్వని' అని తీసుకుంటారు శాస్త్రిగారి నేపథ్యం అందుకు భిన్నంగా ఉందికదా అది ప్రేరకం 'ధ్వని - మనుచరిత్రము' అని తీసుకోవడానికి ఇంతకూ ఈ పరిశోధన ప్రధాన లక్ష్యం ధ్వని లక్షణ విస్తరవిశ్లేషణ ఈ విభాగం శాస్త్రిగారి పాండితీప్రాయానికి ఆజానజం. ధ్వని లక్షణ సముచ్చయాన్ని మనుచరిత్రకు అనువర్తింపజేయడం రెండో విభాగం శాస్త్రిగారు ఈ విభాగంలో కూడా తమ సునిశిత ధిషణను వ్యక్తీకరించారు ఇలా ఎందుకంటున్నానంటే బహుముఖీన ధ్వనిభేదాలకు ఆ కావ్యంలోనుంచి సరైన ఉదాహరణలను ఏరి చూపడం దుష్కరం కాబట్టి. రాజన్నశాస్త్రిగారిలోని సంప్రదాయ క్షుణ్ణ ప్రజ్ఞావైదుష్యాలు తీసుకున్న విషయానికి సమగ్రన్యాయం చేసినందుకు హార్దికంగా అభినందిస్తున్నాను.

సి. నారాయణరెడ్డి

డా॥ ఎం. కులశేఖరరావు
M A, Ph D
Prof & Head, Dept of Telugu
Osmania University

Phone Res 63357
10-3, Vigyanpuri,
Vidyanagar, Hyd -44

# అభినందన

డాక్టర్ కె రాజన్నశాస్త్రిగారు రచించిన ధ్వని-మనుచరిత్రము అనే సిద్ధాంత గ్రంథం సాహిత్యకులకు; అందున ప్రాచీనాంధ్రవాఙ్మయంపై శ్రద్ధ కలిగిన వారికి, ఆ సక్తిని కలిగించే గ్రంథం. మన సాహిత్యంపై ఆంగ్లభాషా సాహిత్యాల ప్రభావం కలిగి, నూతన ప్రక్రియలు వెలువడడం క్రొత్త ఆలోచనలు కలుగడం, ఇవి జరిగేదాక, తెలుగు సాహిత్యం సంస్కృత భాషా సాహిత్యాల ఛాయల్లోనే అనుగమించింది అప్పుడప్పుడు స్వతంత్ర కవులు కొందరు ద్విపద కావ్యాలు వ్రాసినా, దేశీయరూపకాలైన యక్షగానాలు రచించినా, సంస్కృత సాహిత్యంనుంచి మన సాహిత్యం బయట పడనే లేదు

క్రీ శ పదునారవ శతాబ్దంలో తెలుగులో ప్రబంధం అనే నూతన ప్రక్రియ వెలువడినట్లుగా మనవారు చెబుతారు. ఇంతవరకు తెలుగులో ప్రచురంగా లేని 'ప్రబంధ' శబ్దాన్ని శ్రీ కృష్ణదేవరాయలు ఆయన అనుయాయులు తమిళభక్త సాహిత్యంనుంచి గ్రహించిన మాట యథార్థమే కాని వారు తమ ప్రబంధాలను తీర్చిదిద్దే వరకు అవి సంస్కృత కావ్యనియమాల చట్రంలోనే బిగించి నిలిచినాయి. ఇంక నూతన ప్రక్రియ ఏ విధంగా వెలువడినట్లు ?

ఆంధ్ర ప్రబంధ కర్తల్లో అల్లసాని పెదనామాత్యుడు ప్రథమగణ్యుడు. ఆయన మనుచరిత్ర కావ్యమే ప్రథమాంధ్ర ప్రబంధంగా భావింపబడుతున్నది ఈ మహాకవి కావ్యరచనలో స్వాతంత్ర్యం చూపించినాడా అనే విచారణ చేస్తే, పూర్వకవుల్లాగా పురాణాన్ని అంతటిని గ్రహించక, కొద్దిభాగాన్ని— రమణీయమైన భాగాన్ని— గ్రహించి దానికి కావ్య స్వరూపాన్ని కలిగించినట్లుగా కనిపిస్తుంది. ఇదే ఆయన ప్రదర్శించిన స్వతంత్ర ప్రవృత్తి - అయితే ఈ భాగం రసప్రస్తారానికి వ్యంగ్యవైభవానికి వర్ణనాబాహుళ్యానికి అనుగుణంగా ఉండేది. ఈ కావ్యగుణాలే ఆ మహాకవిని ఆకర్షించినాయి. దాని పరిణామంగా మనకు మనోహరమైన మనుచరిత్ర లభించింది.

పెద్దన వస్తు గ్రహణంలో స్వల్పమైన సాహిత్యం కనబరచినప్పటికి కావ్యానికి ముఖ్యాంగాలైన వ్యంగ్య రస భావాదులు సంస్కృతసాహిత్య శాస్త్రానికి అనుగుణంగానే పోషించినాడు. మిగిలిన ప్రబంధ కవులుకూడ ఈ కవితా పితామహుణ్ని అనుసరించడంలో ఆశ్చర్యం లేదు

ఇటువంటి స్థితిలో ఏదైనా ప్రబంధాన్ని పరిశీలన చేయవలసి వచ్చినప్పుడు సంస్కృత లాక్షణికదృష్టితోనే వాటిని చూడవలసి ఉంటుంది. అందుచేతనే కాబోలు డా॥ కె రాజన్నశాస్త్రిగారు ఈ సిద్ధాంత గ్రంథంలోని ప్రథమార్ధంలో శబ్దవృత్తులు, ధ్వని—దాని భేదాలు మొదలైన విషయాలను గురించి సూక్ష్మాతిసూక్ష్మంగా వివేచించి ప్రదర్శించారు శ్రీ శాస్త్రిగారి యీ వివేచన మనుచరిత్రకే కాక, ఏ ప్రబంధానికైనా ఏ కావ్యానికైనా చక్కగా సమన్వయం చేసుకోవడానికి విద్యార్థులకు పరిశోధకులకు సుకరంగా ఉన్నది

మనుచరిత్రలోని కథను శ్రీ శాస్త్రిగారు చక్కగా విశ్లేషణ చేసినారు. స్వారోచిష మనుసంభవమని మనుచరిత్రకు యథార్థనామము ఆ పేరుకు తగ్గట్టుగానే దానిలోని కథాగమనముండవలె వరూథిని ప్రవరుల కథ దానిలోని ప్రధానవృత్తాంత మనిపిస్తుంది కాని అది కాదు ఎందుచేతనంటే స్వారోచిష మనువు పుట్టడమే దీని ఫలము ఈ స్వారోచిషమనువెట్లు పుట్టెనో నిరూపించడానికి రెండుతరాలకథ దానిలో చెప్పవలసి వచ్చింది ప్రవరుడు శమదమాది సద్గుణ సంపన్నుడు, బ్రాహ్మణుడింద్రియ వశగతి చరిస్తే బ్రహ్మానందాధి రాజ్య పదవికి దూరమవుతాడనే విశ్వాసం గలవాడు ఎంత జితేంద్రియుడో, అంత స్పృహణీయమూర్తి యశతనయేందు జయంత వసంతకంతులను చక్కదనంలో గెలువజాలిన వాడు ఇటువంటి ధీరశాంతుడైన ప్రవరుని అంశలో జన్మించినవాడా స్వారోచిషమనువు అతడు శాంతి దాంతి దయా సత్య శౌచ నిరతుడు అకాముడు అందుచేతనే మనువు కావడానికి అర్హత సంపాదించినాడు ప్రవరునికి, స్వారోచిషమనువుకు ఎటువంటి సంబంధం ఉన్నదో కూడ శ్రీ శాస్త్రిగారు చక్కగా నిరూపించినారు

ఇంక మనుచరిత్రకు—ధ్వనికి ఎటువంటి సంబంధం ఉన్నదో వినండి లోక ప్రఖ్యాతమైన పద్యం 'ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ' అని అమాయిక బ్రాహ్మణునిచేత పెద్దన చెప్పించినాడు, దానిలోని వాచ్యార్థం మనకు స్పష్టమే కాని వరూథిని దాని వ్యంగ్యాన్ని ఈ విధంగా భావించిందట. 'భీతహరిణేక్షణ'

అనే సంబోధనకు తన చూపుల సోయగానికి అతడు ముగ్ధుడైనట్లు భావించింది 'ఒంటిజరించెదోటలోకివ్వనభూమి' అనే ప్రశ్నకు, 'మన అభీష్టసిద్ధికి ఏ ఆటం కములేక ఉండే ఏకాంతప్రదేశమే కదా ఇది !' అని అర్థం చేసికొన్నది. 'నేను భూసురుదను-ప్రవరాఖ్యుదను' అని చెప్పితే గంధర్వకాంత ఐన తనకు భూసురునితో పొత్తు కుదురుతుందని చెప్పినట్లుగా భావించింది అతడు తన ప్రస్తుతస్థితిని చెప్పడానికి 'త్రోవతప్పితిని' అన్నాడు దానిని తన కాంక్షకు అతని బ్రాహ్మణ్యము అడ్డురాదనుకొన్నది. 'క్రొవ్వున నిన్నగాగ్రమునకుం జనుదెంచితి' అంటే, తనను చూచిన బ్రాహ్మణుడు పారవశ్యం చెందినాడని కల్పించుకొన్నది. 'తెల్పగదవే తెరువెద్ది' అని ప్రార్థిస్తే అతని దారి తానే నిర్దే శించవలెనని చెబుతున్నాడు కాబోలు అని భావించుకొన్నది. అందుచేతనే తరు వాతి విషయాలు క్రమంగా జరిగినవి

ఒక్క పద్యంలోనే ఇన్ని ధ్వన్యాత్మకమైన పదాలుంటే ప్రబంధమంతా ఎంత చక్కటి వ్యంగ్యం భాసించిందో తెలిసికోవడానికి డాక్టరు శాస్త్రిగారు రచించిన ఈ గ్రంథం చదువవలసిందే ఒక్క విషయం చెప్పి ముగిస్తాను. ఈ గ్రంథంలో ధ్వనిని గురించి ఎచట చెప్పినా దాన్ని సూత్రబద్ధం చేసినారు శాస్త్రిగారు అందుచేత ఈ గ్రంథంలో లక్షణము, లక్ష్యము చాల చక్కగా సమన్వితమైనాయి డా॥ శాస్త్రిగారికి నా అభినందనలు.

విజ్ఞానపురి

హైదరాబాదు,

15 11 88

ఎం. కులశేఖరరావు

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం
M A , Phd
'తెలుగు సాహితి' (తెలుగు విభాగం)
హైదరాబాదు విశ్వవిద్యాలయం
హైదరాబాదు_500 044

Phone Resi 63275
'శ్రీవాణి'
1-8-702/105 నల్లకుంట,
హైదరాబాదు_500 044

# అభినందనము

నాకు తెలిసినంతవరకు మన రాష్ట్రములో ప్రస్తుతము సంస్కృతాలంకారశాస్త్రమును మథించి సాధికారముగా పారము చెప్పగల పండితులలో డాక్టర్ కె రాజన్నశాస్త్రిగారు మొదటి నలుగురైదుగురిలో ఒకరు వారు చది విన చదువు పుస్తకములకు పరిమితము కాలేదు జిహ్వాగ్రమున లాస్యము చేయుచుండును ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు రాజన్నశాస్త్రిగారిని మిత్రునివలె గౌరవించెడివారు. అంతేకాదు సంస్కృత వ్యాకరణాలంకారాది శాస్త్ర విషయములందు జంగమగ్రంథాలయముగా నుపయోగించుకొనెడివారు. నాకవిమిత్రులలో శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యులవారొకరు వారెప్పుడును కవితాచర్చలు చేయుటయందు నిమగ్నులైయుందురు లక్ష్యలక్షణ సమన్వయ విజ్ఞానముతోకూడిన లాక్షణిక గ్రంథ పాండిత్యము వారికిని కలదు. వారికి డాక్టర్ కె. రాజన్నశాస్త్రిగారు ప్రమాణము మిత్రులమందరము కలిసి సాహిత్య చర్చలు జరుపుకొనునప్పుడు ఒకరు కావ్యముగా, మరొకరు వ్యాఖ్యానముగా, ఇంకొకరు చర్చగా మారి మాటలాడుకొనునప్పుడు డాక్టర్ రాజన్నశాస్త్రిగారు శాస్త్రమునకు ప్రాతినిధ్యము వహించెడివారు. శాస్త్రిగారు కవిత్వము కూడ వ్రాసెదరు. వారు మా దృష్టిలో శాస్త్రకవి. వారి పరిశోధన మీ సిద్ధాంత నిబంధనము.

డాక్టర్ రాజన్నశాస్త్రిగారి సాహితీ వ్యక్తిత్వము ఈ పరిశోధన గ్రంథమున ప్రతిఫలించుచున్నది. ఎన్నుకొనిన వస్తువు – "ధ్వని_మనుచరిత్రము", ఈ అంశమునందు సహజముగా రెండంశములు కలవు ఒకటి ధ్వనివిచారము; రెండు మనుచరిత్ర ప్రబంధ కవితాతత్త్వ సమాలోచనము ఒకటి లక్షణచర్చ. మరియొకటి లక్ష్య సమన్వయము. శాస్త్రిగారు శాస్త్రపక్షపాతులు; శాస్త్రము

పురుషస్వభావము కలది. ప్రబంధము స్త్రీ స్వభావము కలది మనుచరిత్రము నందు ప్రవరుడు వరూథిని బాహుబంధములందు చిక్కలేదు కాని, ఈ సిద్ధాంత వ్యాసమున శాస్త్ర పురుషుని కౌగిలిలో మనుచరిత్రము ఒదిగినది. ఇట్టి సిద్ధాంత వ్యాస రచనమునకు ఆచార్య దివాకర్లవారి పర్యవేక్షణము కారణమని డాక్టర్ రాజన్నశాస్త్రిగారు పేర్కొనినారు దివాకర్లవారట్టి సూచననిచ్చుటకు కారణము లేకపోలేదు

నేటి విద్యార్థులకు ధ్వనిని గురించిన శాస్త్రవిజ్ఞానమును తెలుగులోనందించుట యవసరము. ఆ అందించుటలో ఉభయభాషా పాండిత్యము శాస్త్ర వ్యుత్పత్తి, ప్రయోగవిజ్ఞానము గల పరిశోధకుని కృషి యెంతయో తోడ్పడును అట్టి పరిశోధకుడు అవధానిగారికి దొరికినాడు. ధ్వనిని గురించిన సర్వాంశములను తెలుగులో ప్రామాణికముగా ప్రవచించుటకు వారిని కోరినారు అందు వలన ఈ గ్రంథములోని తొమ్మిది అధ్యాయములలో ఆరు అధ్యాయములు ధ్వని సిద్ధాంత వివరణమునకు అంకితమైనవి. తెలుగులో చెప్పెడి అంశముల కన్నింటికి సంస్కృతమునందలి ఆకరములను అందించుట ఈ రచనలోని విశేషము. దీనివలన విద్యార్థులకు మూలముకూడ అందుబాటులోనికి వచ్చినది సమన్వయమునకును, అవగాహనకును అవకాశము సులభమైనది. పరిత పరిశోధకుని పట్ల కృతజ్ఞతలను ప్రకటించుననుటలో ననుమానము లేదు.

సప్తమ ప్రకరణమున కావ్యప్రబంధలక్షణవిచారము సాగించినారు శాస్త్రిగారు. ప్రబంధమును ఆధునికాంధ్ర విమర్శకులు ప్రత్యేకమైన ప్రక్రియగా గుర్తించెదరు దాని లక్షణములను వివేచించుటకు యత్నించెదరు ఈ మార్గమునకు భిన్నముగా కావ్యప్రబంధము లొకేప్రక్రియకు మారుపేర్లను అభిప్రాయమును కొందరు ప్రకటించెదరు. వీరిలో నెక్కువమంది సంస్కృత లక్షణగ్రంథ సంప్రదాయముననుసరించి ప్రబంధమును నిర్వచించువారు. వీరి దృష్టిలో కావ్యప్రబంధముల కంతగా భేదము కానరాదు డాక్టర్ రాజన్నశాస్త్రి గారు ఈ వాదమునకు సంబంధించినవారు. 351వ పుటలో ప్రబంధ స్వరూప స్వభావములను క్రోడీకరించుచు వెలువరించిన వారి యభిప్రాయమిందులకు తార్కాణము. "ఈ తెలుగునందలి కావ్యప్రక్రియా విశేషమునకు దృశ్యశ్రవ్య మహాకావ్య కథాఖ్యాయికాది సర్వసాధారణవాచకమగు 'ప్రబంధ'పదము గాక మఱేపదము వ్యవహారయోగ్యమగును?' అని ప్రశ్నించుచున్నారు రాజన్న

శాస్త్రిగారు. వారి నిర్ణయముతో మనమేకీభవింపవచ్చును లేకపోవచ్చు కాని వారి శాస్త్రదృష్టిని అభినందింపకుండ నుండలేము

అష్టమ నవమప్రకరణములు మనుచరిత్రమునందలి ధ్వనిభేదములను నిరూపించు ఘట్టములు లక్ష్యలక్షణ సమన్వయాత్మకములు. సిద్ధాంత వివరణమునందు శాస్త్రిగారెంతటి నియమనిష్ఠలను పాటించెదరో దానిని కావ్యమున కన్వయించుపట్ల నంతటి భావుకత్వమును భజించెదరు ధ్వనిమార్గము ననుసరించు విమర్శకుల కీలక్షణము లత్యావశ్యకములు ఈ గ్రంథభాగమును చదివిన సహృదయుడు అల్లసానివాని కవితయందలి ధ్వనిప్రపంచమును దర్శించుటయే కాక, ధ్వనికావ్య విమర్శల విధానమును గూడ తెలిసికొనగలడు అందువలన నీ గ్రంథభాగము అనువర్తిత విమర్శ కొక చక్కని యుదాహరణ మగుచున్నది.

ధ్వనిమార్గమును తెలుగుసాహిత్యమున కన్వయించెడి సాహిత్యవిమర్శలో వస్త్వలంకారరసధ్వనులను కావ్యార్థములలో నిరూపించెడి విధమునకు నిర్దిష్టమైన నిర్దుష్టమైన పద్ధతులు రూపుకట్టలేదు విశ్వనాథ వారామార్గమునకు మొదట నొక బాట వైచినారు శాస్త్రదృష్టిగల విమర్శకుల కంటె విలక్షణమైన కళాదృష్టి విశ్వనాథవారిది లక్ష్యమును అనుశీలించుచు లక్షణమును పరితకు వ్యంగ్యముగా నందింపగలిగెడి ప్రజ్ఞ వారిది. తెలుగులో ధ్వని సిద్ధాంతమును కావ్యముల కన్వయించుచు పరిశోధనలు కొన్ని వెలువడినవి. అవియన్నియు చాలవరకు శాస్త్రదృష్టులే. లక్షణము ప్రకారము లక్ష్యమును అన్వయించు పద్ధతియే అందు ప్రధానము. డాక్టర్ రాజన్నశాస్త్రిగారి రచనయు నామార్గము నందే సాగినది పరిశోధనలో ఈమార్గమే సమాదరణీయమని విద్వాంసుల అభిప్రాయము కాబోలు ! ఏమైనను డాక్టర్ రాజన్నశాస్త్రిగారు మనుచరిత్ర మహాప్రబంధమునందలి వస్త్వలంకారరసధ్వనులను నిరూపించిన పద్ధతి ప్రామాణికముగా నున్నది. సాహితీ విద్యార్థులకు కరదీపికగా నుపయోగపడ గలిగినదిగా నున్నది.

ప్రబంధములు రచనాప్రధానములా ? రసప్రధానములా ? యను చర్చ నేటికని సాగుచున్న ఈ తరుణములో మనుచరిత్రప్రబంధమునందు ధ్వని భేదములను నిరూపించెడి ఈ సిద్ధాంతగ్రంథము ప్రబంధ ప్రక్రియా విచారము

నందు మరికొన్ని ఆలోచనలు రేకెత్తింప గలదని విశ్వసించుచున్నాను ఆంధ్ర సాహిత్య విమర్శయనెడి గోడగడియారములోని "పెండ్యూలమ్‌ను" సంస్కృత సంప్రదాయ పండితులొకవైపుకు ఆంధ్రసాహిత్య సంప్రదాయజ్ఞులు మరియొక వైపుకు లాగుట ఈనాటిమాటకాదు అటు నిటు కొట్టుకొనినప్పుడే గడియారము నడుచుట కాలగతిలో అభ్యుదయము ఈ పరిశోధన మా ప్రగతిలో ఒక గతి మిత్రులు డాక్టర్ రాజన్నశాస్త్రిగారి ఈ విశిష్ట ప్రయత్నము నభినందించు చున్నాను.

14-11-1988

జి. వి. సుబ్రహ్మణ్యం



డా. ఎన్. కృష్ణకుమారి
Professor of Telugu
Osmania University
Hyderabad-500 007

Phone Dept 71951 Ext 294
Res 37136
8-3-898/2, Nagarjuna nagar
Hyderabad-500 873
1-12-1988

# మంచి ఆకర గ్రంథము

డాక్టర్ కె రాజన్న శాస్త్రి గారి 'ధ్వని_మనుచరిత్రము' అను గ్రంథ మును సాకల్యముగా చూచితిని ఇది వారి సిద్ధాంత గ్రంథము. శాస్త్రిగారు సంస్కృతాంధ్రముల పాండిత్యమును గడించిన వారు శాస్త్ర విషయావలోక నమునందు, తద్విశ్లేషణమునందు వారికున్న లౌల్యము ఈ గ్రంథమున శతధా కనిపించుచున్నది గ్రహించిన విషయము ప్రధానముగా మనుచరిత్రమందలి ధ్వని యే అయినను, దానికి వారు సంతరించిన నేపథ్యము మిక్కిలి విపులము.

శబ్దవృత్తులు, ధ్వని భేదములు, కావ్యాత్మ ధ్వనియేయని నిరూపించుట, శ్లేషకు ధ్వనికిని గల భేదములు ధ్వని కావ్య వైశిష్ట్యము, ఈ గ్రంథమునందు చక్కగా పరామర్శింపబడినవి_ ఇదంతయు సిద్ధాంతపరమైన భాగము. ఎనిమిదవ ప్రకరణము మనుచరిత్రలోని ధ్వని విశేషములను వెల్లడించు ప్రాయోగిక ప్రకరణము

ఒనగూడినంత వరకు సిద్ధాంత భాగమునకు మనుచరిత్ర నుండియే ఉదాహరణము లిచ్చిన బాగుండెడిది అటు చేయకపోవుటవలన సిద్ధాంతమును, ప్రయోగమును, తీర్థమును ప్రసాదమును వలె దేనికదిగా భాసించుచున్నది

పలువురు ఆలంకారికులు చెప్పిన కావ్యశాస్త్ర సారాంశమంతయు నీ గ్రంథమున పిండీభూతమై, పరిశోధకవిద్యార్థుల కిది మంచి ఆకరగ్రంథముగా రూపుదాల్చినది ఈ గ్రంథప్రయోజనమిట్లు శాశ్వతమైనది

నాయని కృష్ణకుమారి



సంస్కృత సాహిత్యరత్న, విద్యాప్రవీణ

డా॥ కే. రాజన్నశాస్త్రి
M.A, Ph.D, MOL

Lecturer Dept of Telugu
Osmania University
Hyderabad - (A.P.)

| | |
|---|---|
| ఉపకులపతి | సంస్కృత ప్రచార సమితి — హైదరాబాదు |
| బిరుదము | 'సంస్కృత సాహిత్యరత్న' బిరుదము పూరీ గోవర్ధనపీఠ శంకరాచార్య గారిచే — |
| జన్మ | శ్రీముఖ జ్యేష్ఠ శుద్ధ నవమి 2-6-1933 |
| జన్మస్థలము · | ధర్మపురి, కరీంనగర్ జిల్లా ఆం ప్ర |
| రచనలు | సుమనోంజలిః (సంస్కృత కవితా సంకలనమ్) ఆంధ్రాను వాదము. దేవీ భాగవతము (3 స్కంధములు) |
| పరిష్కరణ | ధర్మసూరి ప్రణీత. 'సాహిత్యరత్నాకర' (అలంకార శాస్త్రం) గ్రంథ పరిష్కరణ, నౌకామందర వ్యాఖ్యలు, స్వవిరచిత లఘు టిప్పణముతో — |
| సారస్వతసేవ | సారస్వతీ సుషమా (వారాణసీ) సాగరికా (సాగర్ విశ్వ విద్యాలయము) మున్నగు ప్రముఖ సంస్కృత పత్రికలలో, భారతి మున్నగు తెలుగుపత్రికలలో వ్యాసములు ప్రకటితములు<br>ఎన్నియో ప్రసంగములు, కవితలు 'అమరవాణి" మున్నగు రేడియో కార్యక్రమములలో ప్రసారితములు — |
| అముద్రితములు | 'వసుమతీ సుధాకరమ్' భూసంస్కరణలపై రేడియోలో ప్రసారము చేయబడిన సంస్కృత నాటకం — కవితలు — వ్యాసములు మున్నగునవి — |

|| శ్రీః ||

# ఉపోద్ఘాతము

ప్రాచీన పద్ధతిగా సంప్రదాయబద్ధముగా సంస్కృత సాహిత్యాది శాస్త్రముల నభ్యసించిన నేను 'మధురవాణీ" సంస్కృతమ్ (సాప్తాహికం) మున్నగు ప్రముఖ సంస్కృత పత్రికలలో కవితలు విమర్శాత్మక నిబంధములు ప్రకటించి యుంటిని— ఆ ప్రతిభకు గుర్తింపుగా నాకు పూరీ గోవర్ధనపీఠ శంకరాచార్య హస్తాంకితమగు 'సాహిత్యరత్నమ్' అను బిరుదము 2014 (విక్రమసంవత్) న సంస్కృతమ్" (సాప్తాహిక సంస్కృత పత్రిక-అయోధ్య) వార్షికోత్సవ సందర్భమున లభించినది— అటు పిమ్మట ఆంధ్ర విశ్వవిద్యాలయము నుండి సాహిత్య విద్యాప్రవీణ పరీక్షయందు ఉత్తీర్ణుఁడనై కొంత కాలముపాధ్యాయ వృత్తి నవలంబించితిని పిమ్మట ఉస్మానియా విశ్వవిద్యాలయమునందలి 'సంస్కృత - అకాడెమీ'లో కేంద్ర ప్రభుత్వము వారి యుపకార వేతనము ఫలితముగా నౌకా మందర వ్యాఖ్యా సమేతముగను స్వవిరచిత లఘు టిప్పణము తోడను విశేషాంశములను చేర్చి ధర్మసూరి విరచితమైన 'సాహిత్య రత్నాకర'మను నలంకార శాస్త్ర గ్రంథమును పరిష్కరించితిని - (ఈనాఁడా గ్రంథము మూడు భాగములలో 'సంస్కృత— అకాడెమీ' O U, వారిచే ముద్రితమయి యుపలబ్ధమగుచున్నది) తరువాత నాంధ్రమున MOL, MA, పరీక్షలయందును ఉత్తీర్ణుఁడనై సర్దార్ పటేల్ కళాశాలలో నుపన్యాసకునిగా నియుక్తుడనగుటయు Ph D పట్టమునకై రిజిష్టర్ చేసికొనుటయు సంభవించెను— ఆనాటి తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారి సూచననను సరించి నేను గ్రహించిన పరిశోధన విషయము— 'ధ్వని—ఆంధ్ర పంచకావ్యములు' అనునది

1974 జనవరి నెలలో Pre Ph D పరీక్షలో నుత్తీర్ణుఁడనైతిని కాని అనివార్య పరిస్థితులచే పరిశోధన కార్యము సాగదయ్యెను తరువాత U G C. వారి F I P ననుసరించి నాకు 'టీచర్ ఫెలోషిప్' లభించుటచే పరిశోధన నిమిత్తము సమయమంతయు వినియోగించు నవకాశము లభించినది— దిగిన

కాని లోతు తెలియదన్నట్లు వ్రాయుట కారంభింపఁగనే విషయమతివిస్తృత మయినదని తెలియవచ్చెను అప్పటి యాంధ్రశాఖాధ్యక్షులు ఆర్ట్సు ఫ్యాకల్టీ డీన్ గారును అగు ఆచార్య బి రామరాజుగారి యొక్కయు నాకు పరిశోధన పర్యవేక్షకులయిన ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారి యొక్కయు సమ్మతినను సరించి విషయమును ఆంధ్ర ప్రబంధములలో తలమానికమైన మనుచరిత్రమున కొక్కదానికి పరిమితము చేసికొంటిని— రెండున్నర వత్సరములు అహోరాత్రములు శ్రమించి రచించిన ఈ ధ్వని-మనుచరిత్రము అను పరిశోధన నిబంధమును ఆమోదించి 1980 సెప్టెంబర్‌లో ఉస్మానియా విశ్వవిద్యాలయము నాకు Ph D పట్టము నొసంగినది— పిమ్మట నేను ఉస్మానియా విశ్వవిద్యాలయమున నుపన్యాసకునిగా నియమింపఁబడితిని

ఇది గ్రంథ రచనా పూర్వరంగము

'ధ్వని-మనుచరిత్రము' అను నీ పరిశోధన నిబంధమున ప్రధానాంశములు రెండు ఒకటి- ధ్వని స్వరూప నిరూపణము. రెండు- మనుచరిత్రమున దాని సమన్వయము తొమ్మిది ప్రకరణములుగా విభక్తమయిన నీ గ్రంథమున మొదటి ఆరు ప్రకరణములలో ధ్వని స్వరూపము సమగ్రముగా నిరూపితమయినది ధ్వని స్వరూప నిరూపణ మొనరించుటకు సంస్కృతాంధ్రములందలి ముఖ్యములైన లక్షణ గ్రంథములన్నియు పంశీలింపఁబడినవి— ధ్వని భేదములకు సంస్కృత లక్షణ గ్రంథములయందే సముచితములయిన యుదాహరణములు లభించుటచే వాని నుండియే పెక్కుదాహరణములు గ్రహింపఁబడినవి— ఆ యుదాహరణములకు ఆంధ్రమున వివరణము కూడ చేయబడినది— శబ్దశక్తి మూలధ్వనికి శ్లేషకు చాల సూక్ష్మమయిన భేదము గలదు. దానిని నిశితముగా అయిదవ ప్రకరణమున వివరించుట గమనించఁదగును— ఆరవ ప్రకరణమున ధ్వని—గుణీభూత వ్యంగ్యములకు గల భేదము నిరూపింపబడినది— ఏడవ ప్రకరణము కావ్య—ప్రబంధము అనునది. దీనిలో సంస్కృత లాక్షణికులు నిర్వచించిన కావ్య స్వరూప నిర్వచనాదులు— తెనుఁగున విశిష్ట కావ్యప్రక్రియగా రూపుదిద్దుకొనినదానికి ప్రబంధనామము స్థిరపడుటలో గల యౌచిత్యము మున్నగు విషయములు పరామర్శింపబడినవి. లక్షణ నిరూపణ విషయమున ఆయా లాక్షణికుల మత భేదములు చర్చింపఁబడినవి— మఱియు ప్రతిపాదిత విషయములయందు ప్రామాణ్యబుద్ధి జనించుటకై సమగ్ర విషయావగాహన చేసికొనుటకయియును ఆయా యాకరగ్రంథోద్ధరణములు క్రింద నధోజ్ఞాపికలో నీయఁబడినవి.

ఇఁక అష్టమ ప్రకరణమున మనుచరిత్రము నందలి ధ్వని విశేషములను ప్రదర్శించి లక్ష్యలక్షణ సమన్వితములు గావింపబడినవి నవమ ప్రకరణమున ధ్వని కావ్యవైశిష్ట్యము నిరూపితమయినది 'ధ్వని' అను విషయము మిక్కిలి గహనమయినది— అందలి భేదము లసంఖ్యాకములు వానినన్నింటిని మను చరిత్రము నుండి ఎత్తి చూపుట అలవి కానిపని ఈ ప్రబంధము ధ్వని భేదము లను ప్రదర్శించుటకయి కవి రచించి యుండలేదు కదా ! లక్షణ గ్రంథకర్తలు మాత్రమే అట్లు చేయుదురు. అయినను ప్రతిభావంతులైన మహాకవుల రచనలలో అప్రయత్నముగనే కావ్యాత్మతాగౌరవము నొందిన ధ్వని భేదములెన్నియో గోచరించుచుండును— అల్లసాని పెద్దన ప్రథమశ్రేణికిఁ జెందిన కవి పుంగవుఁ డగుటచే నతని కావ్యమున ధ్వని భేదములనేకములు గోచరించినవి వాని నన్నింటిని యథామతి వివరించుట జరిగినది

మఱొక్క మాట— చివర నొక అనుబంధము చేర్చియుంటిని— "స్వారోచిషమనుసంభవమున ప్రవరునకు గల సంబంధము— ప్రవరునింటికి సిద్ధుడేతెంచిన కుతపకాల స్వరూపము—సిద్ధుడు పూసిన కాలి పసరుతో ప్రవరుడు హిమాలయమును దర్శించబోయిన సమయము"— ఈ యంశములు బహు కాలము నుండి విమర్శకలోక చర్చావిషయములగుట తెలియనిదికాదు— కావున అనుబంధమున ఆ యంశములు చర్చించి నిర్ణయింపబడినవి—

నా యీ యత్నమెంతవఱకు సఫలమయినదో సహృదయులే ప్రమాణము—

"ఆ పరితోషా ద్విదుషాం న సాధుమన్యే ప్రయోగ విజ్ఞానమ్"
అని కదా అభియుక్తోక్తి.

ఇట్లు
విద్వజ్జన విధేయుడు
కే. రాజన్న శాస్త్రి
ఉపన్యాసకులు, తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయము
(ఆంధ్రప్రదేశీయ "కరీంనగర్" మండలా-
(జిల్లా) న్తర్గత ధర్మపురీ వాస్తవ్యులు)

హైదరాబాద్—(ఆం.ప్ర)
1910 తమ శాలివాహన శక
విభవ దీపావళి
9—11—1988

# కృతజ్ఞతాంజలి

1980 లో Ph D పట్టమునకై ఉస్మానియా విశ్వవిద్యాలయము వారి ఆమోదము పొందిన 'ధ్వని–మనుచరిత్రము' అను ఈ పరిశోధన నిబంధము సుమారు 9 వత్సరములు గడిచిన పిమ్మట ఆలోకభాగ్యము నొందుచున్నది– ఆనాడు నాకు సహకరించిన వారిని పెరుపేరున పేర్కొని నా కృతాంజలులను సమర్పించుకొనుచున్నాను–

Ph D పట్టమునకు పరిశోధన చెయునవకాశ మొసంగిన ఉస్మానియా విశ్వవిద్యాలయాధికారులకు తదుపాధ్యక్షులకును, పరిశోధన చేయుటకు F I ప్రోగ్రాం క్రింద నాకు స్థానమొసంగిన యు జి సి వారికిని, పరశోధన కాలమున నాకు సెలవొసంగి పరిశోధన చేయునవకాశము కల్పించిన సర్దార్ పటేల్ కళాశాల యాజమాన్య సంఘము వారికిని కళాశాలాధ్యక్షులకును వివిధ సందర్భములందు సలహాలొసంగిన ఆనాటి తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య బి రామరాజు గారికిని, ఇతర ఆచార్య బృందమునకును ఆర్థిక సాహాయ్య విషయమున ఆనాటి U G C శాఖా పర్యవేక్షకులను శ్రీ శాస్త్రి గారికిని, వారి సహచరులకును, పరిశోధన పర్యవేక్షకులై నాకు పలయు విధానము నెఱింగించి ఎడనెడ అమూల్యములగు సలహాల నొసంగుచు నా విజ్ఞానాభివృద్ధికి సర్వ విధముల తోడ్పడిన కీ॥ శే॥ ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధాని గారికిని,

మఱియు ఈనాడు–

వ్యయప్రయాస సాధ్యమగు గ్రంథ ముద్రణమును రూ 7,500 ఆర్థిక సాహాయ్యమొనరించి సుగమము చేసిన తెలుగు విశ్వవిద్యాలయము వారికి, ప్రరోచనను ప్రస్తావించి గ్రంథ ప్రాశస్త్యమును చాటి చెప్పినవారు ఉభయభాషా నిష్ణాతులు ఉస్మానియా విశ్వవిద్యాలయ భూతపూర్వ సంస్కృత శాఖాధ్యక్షులు ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు గారికిని,

అభినందనలరూపమున తమ యమూల్యాభిప్రాయములను వెలువరించి గ్రంథ గౌరవము నినుమడింపఁజేసిన పెద్దలు–

నైకగ్రంథ పరిష్కర్తలైన ఆచార్య బిరుదురాజు రామరాజుగారికిని సార్వత్రిక విశ్వవిద్యాలయ వైశ్చాన్సలర్ ఆచార్య C. నారాయణరెడ్డి గారికిని [ఉస్మానియా విశ్వవిద్యాలయ–తెలుగు శాఖాధ్యక్షులు] ఆచార్య కులశేఖరరావు గారికిని ప్రఖ్యాత విదుషీమణి ఆచార్య నాయిని కృష్ణకుమారికిని విమర్శక మూర్ధన్యులు ఆచార్య G V సుబ్రహ్మణ్యం గారికిని మఱియు – ముఖచిత్రా లంకృతి నొనరించిన శ్రీ B. రాములకును శ్రద్ధతో అందముగా నిర్దుష్టముగా నీ గ్రంథమును ముద్రించిన నాగార్జున ప్రింటింగ్ వర్క్స్ అధినేత శ్రీ N V నారాయణ గారికిని

ఇవే నా కృతజ్ఞతాంజలులు

ఇట్లు
కే. రాజన్న శాస్త్రి



# విషయసూచిక

## ద్వితీయ ప్రకరణము- 'ధ్వని-వానిభేదములు' 84-152

# ఆకరగ్రంథ సంకేతనామ వివరణ పట్టిక

| సంకేతము | గ్రంథ నామము |
|---|---|
| తై బ్రా | తైత్తిరీయబ్రాహ్మణము |
| వా ప /వాక్య | వాక్యపదీయము |
| ప్ర రు కావ్య ప్ర. | ప్రతాపరుద్రీయకావ్యప్రకరణము |
| కా ప్ర / కావ్య | కావ్యప్రకాశః |
| సా ద | సాహిత్యదర్పణః |
| ముక్తా - శబ్ద | ముక్తావళీ - శబ్దఖండః |
| బా వ్యా. - త సూ | బాలవ్యాకరణతత్సమసూత్రము |
| ర గం / రసగం | రసగంగాధరః |
| సా ర / సా రత్నా | సాహిత్యరత్నాకరః |
| ధ్వన్యా | ధ్వన్యాలోకః |
| న్యా సూ భా | న్యాయసూత్రభాష్యమ్ |
| రుద్ర / రుద్రటకావ్యా | రుద్రటకావ్యాలంకారః |
| అలం. స / అలం సర్వ | అలంకారసర్వస్వమ్ |
| గౌ. న్యా సూ | గౌతమన్యాయసూత్రమ్ |
| శ వ్యా. వి. | శబ్దవ్యాపారవిమర్శః |
| వై సి ల మం | వైయాకరణసిద్ధాంతలఘుమంజూషా |
| కావ్యాను | కావ్యానుశాసనమ్ |
| అభిధా / అ. వృ మ | అభిధావృత్తిమాతృకా |
| అలం. ర | అలంకార రత్నాకరః |
| ఆం. సా. ద | ఆంధ్రసాహిత్య దర్పణము |
| ఆం ప్ర రు. య | ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము |
| శృం. ప్ర. | శృంగార ప్రకాశః |
| ఏకా. | ఏకావళి |
| కుమా. / కుమార | కుమారసంభవకావ్యమ్ |

| సంకేతము | గ్రంథ నామము |
|---|---|
| భామినీ శృం | భామినీవిలాసః శృంగారవిలాసః |
| గిరిజా. | గిరిజాకళ్యాణము |
| ఆం. ధ్వన్యా. | ఆంధ్ర ధ్వన్యాలోకము |
| అలం - మహో | అలంకారమహోదధిః |
| రసార్ణవ. | రసార్ణవసుధాకరః |
| ఉద్భటకావ్యా | ఉద్భటకావ్యాలంకారః |
| భామహకావ్యా | భామహకావ్యాలంకారః |
| దండి-కావ్యా / కా. ద | దండికావ్యాదర్శః |
| దండి - కావ్య | దండికావ్యలక్షణమ్ |
| సా. సౌ. ద | సాహిత్య సౌందర్య దర్శనము |
| వ్యక్తి. | వ్యక్తివివేకః |
| శిశు. | శిశుపాలవధ కావ్యమ్ |
| సా. శి. స. | సాహిత్య శిల్ప సమీక్ష |
| సా. దర్శ. / సా దర్శన | సాహిత్య దర్శనము |
| కావ్యా. చూ | కావ్యాలంకార చూడామణి |
| నృ. సిం. పు. | నృసింహపురాణము |
| వసు. | వసుచరిత్రము |
| సరస్వతి. | సరస్వతీకంఠాభరణమ్ |
| చంద్రా. | చంద్రాలోకః |
| ఆముక్త. | ఆముక్తమాల్యదము |
| పాండు. | పాండురంగమాహాత్మ్యము |
| మను. | మనుచరిత్రము |

***

# ఉదాహృత పద్యానుక్రమణిక

## తెలుఁగు

## సంస్కృతము

*****

# స వ ర ణ

| తప్పు | ఒప్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| నాగోజీ జట్టు | నాగోజీ భట్టు | 9 | 25 |
| ప్రయోజనము | ప్రయోజకము | 31 | 4 |
| అగ్ని నిర్మాణవకః | అగ్నిర్మాణవకః | 32 | 12 |
| అజుహత్స్వార్థ | అజహత్స్వార్థ | 39 | 9 |
| జుహల్లక్షణ | జహల్లక్షణ | 39 | 12 |
| కలిగనది | కలిగినది | 73 | 16 |
| శబ్దార్ద | శబ్దార్థః | 80 | 8 |
| ప్రచారస్త్రి, త్యత్ర | ప్రచరస్త్రీ" త్యత్ర | 82 | 25 |
| ప్రాధాన్యాచ్చ | ప్రాధాన్యాత్ సత్యాఅప్యర్థ- శక్తే రప్రాధాన్యాచ్చ | 104 | 19 |
| హిమవద్యర్ణన– | హిమవద్వర్ణన– | 119 | 8 |
| ప్రాధన్యఖ్యాపనార్థః | ప్రాధాన్యఖ్యాపనార్థః | 121 | 13 |
| విప్రలంబస్త్పైవ | విప్రలంబస్యైవ | 121 | 25 |
| రసభావాతి– | రసభావాది | 126 | 25 |
| –యెడ నూనినయుత్సా– | యెడ నూనినయుత్సా– | 132 | 10 |
| జుగుప్సా చ | జుగుప్సా చ | 133 | 23 |
| ర్నాశః తదభివ్యక్త– | ర్నాశః తదభివ్యక్త | 135 | 27 |
| దుర్లభురాలు | దర్లభురాలు | 139 | 7 |
| జీవితమిర్థ్యః | జీవితమిత్యర్థః | 187 | 13 |
| వాదిభిరంగకృతా | వాదిరంగీకృతా | 220 | 13 |
| భ్రమ దార్మిక | భ్రమ ధార్మిక | 239 | 16 |
| | | 240 | 1 |

| తప్పు | ఒప్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| ఎవం వాదిని | ఏవం వాదిని | 248 | 6 |
| క్షేవకతాం | క్షేపకతాం | 261 | 13 |
| వల్లుకరాభి— | వల్గుకరాభి | 291 | 12 |
| తన్నిన్నిబంధన— | తన్నింబధన | 295 | 10 |
| ఎవం జాతీయకః | ఏవం జాతీయకః | 305 | 11 |
| సింననలు | సింగనలు | 352 | 29 |
| అనిమేషత్యము | అనిమేషత్వము | 368 | 13 |
| కాలియందెలి | కాలియందెల | 407 | 2 |
| లిటు నూపు | లిటు సూపు | 414 | 17 |
| 'ఇష్టాగోష్ఠి' | 'ఇష్టాగోష్ఠి' | 455 | 2 |
| తెల్పఁబడినది | తెల్పఁబడినది | 456 | 21 |
| గ్రామైరాత్ర | గ్రామైకరాత్ర— | 459 | 18 |



# అంకితము

ప్రభవ మార్గశీర్ష–మాఘ మాసములలో (1987–88)

కీర్తిశేషులైన అస్మజ్జననీజనకులు



లII సౌII గంగుబాయమ్మ

బ్రII శ్రీII కొరిడె కృష్ణయ్య గారల

దివ్యస్మృతికి

॥ శ్రీః ॥

గ్రంథ రచయిత, వారి అర్ధాంగి



డా॥ కే. రాజన్న శాస్త్రి          శ్రీమతి సులోచన

శ్రీః

# ధ్వని - మను చరిత్రము

## ప్రథమ ప్రకరణము

### శబ్దవృత్తులు - వాని నిర్వచనము

దేవీం వాచమజనయన్త దేవా-
స్తాం విశ్వరూపాః పశవో వదన్తి
సా నో మన్ద్రేష మూర్జం దుహానా
ధేనుర్వాగస్మానుప సుష్టుతైతు

(తై బ్రా 2 4 6 10)

(తా॥ దేవతలందఱు వాగ్రూపయగు దేవతను సృజించిరి ద్విపాత్తులు చతుష్పాత్తులు మున్నగు వివిధములగు పశువులును, అనగా మానవులు పశు-పక్ష్యాదులును తమతమ భాషా రూపమున దాని నుచ్చరించుచున్నారు అట్టి వాగ్రూపయగు కామధేనువు వైదిక మంత్రములచే స్తుతింపఁబడి సంతుష్టయై మాకు అన్నమును క్షీరాదిరసమును అనగా మాయభీష్టితములను నెఱవేర్చుచు మమ్ముఁ జేరుగాక[1])

వాక్కు సర్వవ్యవహారములకు మూలము[2] పరస్పరాభిప్రాయము

---

1. దేవాః సర్వే వాచం దేవీ మజనయంత। తాం వాచం విశ్వరూపా ద్విపాచ్చతుష్పాత్తదవాన్తరభేదేన బహువిధాః పశవః స్వస్వభాషారూపేణ వదన్తి। సా వాగ్రూపా ధేనుః నోఽస్మదర్థమ్, ఇషమన్నమ్ ఊర్జం క్షీరాదిరసం, సంపాదయన్తీ సుష్టుతాఽస్మాభిః సుష్ఠు వైదికైః స్తోత్రైః స్తుతా, మన్ద్రా, హృష్టా సతీ, అస్మాన్ ప్రత్యాగచ్ఛతు॥

(తై బ్రా సాయణభాష్యము 2 4 6 10)

2 "యద్వై వాఙ్నాభవిష్యత్, న ధర్మో నాధర్మో వ్యజ్ఞాపయిష్యన్న సత్యం నానృతమ్॥" (ఛాందోగ్యోపనిషత్. 7 2 1)

తెలియుటకై వాక్కునకంటె ప్రధానసాధన మెద్దియు లేదు[3] అట్టి శబ్దజ్యోతి రూపమగు వాక్కే లేనిచో ఈ జగముస్థితి అంధకారబంధురమే యయియుండెడిది[4] కావుననే బృహదారణ్యకోపనిషత్తున యాజ్ఞవల్క్యమహర్షి జనకునకు వాక్కును జ్యోతీ రూపమున వర్ణించి చెప్పెను[5] చేష్టాదులును భావ వ్యక్తీకరణమునకు సాధనములేయైనను వానివలన సుస్పష్ట ప్రతిపత్తి యుండదు

భావవ్యక్తీకరణమునకు ప్రధానసాధనమగు నీ వాగ్వ్యవహారమును గమనించితిమేని ఎన్నియో విశేషములు కానవచ్చును ఒకచో పదముల యర్థమొకటై యుండగా వక్త్రభిప్రాయానుగుణమగు నర్థము వేఱొకటయి యుండును గానకుశలుఁడనగా "గానమున నేర్పరి" యని కదా యర్థము వాస్తవముగా కుశలుఁడను పదమునకు "కుశాన్ లాతీతి కుశలః" అను వ్యుత్పత్తిచే కుశలను గ్రహించువాఁడని యర్థము కాఁగా "నేర్పరి" యను నర్థము వివక్షితమగుచున్నది ఇట్లే "ప్రవీణుఁడు" మున్నగు పదముల వ్యుత్పత్త్యర్థము ప్రకృత వ్యవహారానుపయుక్తము కాగా అర్థవిశేషము ప్రకృతోపయోగియగుచున్నది

మఱియొకచో పదములు స్వార్థముతోపాటు ఇతరార్థములను గూడ సంగ్రహించుచున్నవి.

---

3 "శ్లో॥ న సోఽస్తి ప్రత్యయో లోకే
యః శబ్దానుగమాదృతే।
అనువిద్ధమివ జ్ఞానం
సర్వం శబ్దేన భాసతే॥" (వాక్యపదీయము 1 123)

4 శ్లో॥ ఇదమంధం తమః కృత్స్నం
జాయేత భువన త్రయమ్।
యది శబ్దాహ్వయం జ్యోతి-
రా సంసారం న దీప్యతే॥ (కావ్యాదర్శ 1 4)

5 "వాగేవాస్య జ్యోతిర్భవతీతి వాచైవాయం జ్యోతి
షాఽఽస్తే పల్యతే కర్మ కురుతే విపల్యేతీతి" (బృహదారణ్యక 4.3 5)

"ఇదిగో పెరుగు, పిల్లి వచ్చిన కొట్టుము" అను తల్లి పలుకులాలకించి తెలివిగలబాలుఁడు పిల్లినే కాక కుక్క, కాకి మున్నగువానినిగూడ తరిమి పెరుగును కాపాడుచుండుట కాంచుచునే యున్నాము 'పిల్లి'యను పదమునకు 'కుక్క' 'కాకి' అను నర్థములు నెచ్చటను లేవు అయినను బాలుఁడట్లు ప్రవర్తించుటకు కారణము? "పిల్లి" పదముచే తదన్యార్థములుగూడ సంగ్రహింపఁబడినవియని చెప్పక తప్పదు గదా! వాక్యపదీయమున నీ యర్థమిట్లు సంగ్రహింపఁబడియున్నది

శ్లో॥ కాకేభ్యో రక్ష్యతాం సర్పిరితి బాలోఽపి చోదితః।
ఉపఘాతపరే వాక్యే న శ్వాదిభ్యో న రక్షతి॥ (వా ప 2/312)

(తా॥ కాకులవలన నేయి కాపాడుమన విని బాలుఁడు కుక్కలు మున్నగు వానినుండియు కాపాడుట లేదా)

ఇట్లే 'రామునివెంట నయోధ్యయు కదలినది' "ఇల్లు గొల్లున నేడ్చెన్" "వంకాయలూ! ఇటు రారా!" ఈ మున్నగు వాక్యములలోని "అయోధ్య, ఇల్లు, వంకాయలూ" ఈ మున్నగు పదములు స్వార్థముతోపాటు ఇతరార్థమును గూడ సంగ్రహించుకొనకున్న వాక్యార్థము పొసగదు కదా!

వేఱొకచో పదములు స్వార్థమనుపయుక్తము కాగా విరుద్ధార్థమును గ్రహించుచున్నవి

శ్లో॥ పరోక్షే కార్యహన్తారం ప్రత్యక్షే ప్రియవాదినమ్।
వర్జయేత్తాదృశం మిత్రం విషకుంభం పయోముఖమ్॥ (హితోపదేశః)

ఏతాదృశ లక్షణ లక్షితుఁడగు విషకుంభపయోముఖుఁడయిన మిత్రుని గాంచి— "నీ చేసిన మేలెన్నటికిని మఱవలేను నీ సౌజన్యము చెప్పనలవికానిది" అని పలికిన పలుకులలోని 'మేలు' 'సౌజన్యము' అను పదములు, స్వార్థము కదర్థితమగుటచే తద్విరుద్ధార్థములగు 'కీడు' 'దౌర్జన్య'మను నర్థముల స్ఫురింపఁ జేయుచున్నవి ఇట్టి మాటలెన్నియో మన నిత్య వ్యవహారమునఁ గాననగు చున్నవి కొండొక విశేషము—

'ప్రొద్దు గ్రుంకినది' అను మాటకు సూర్యుఁడస్తమించినాడని కదా యర్థము తన చెలి పలికిన ఈ పలుకుల నాలకించిన స్వకీయ / ఖానభిసరణాను

కూలమగు వేషధారణకై సమాయత్తమగుచున్నది- చెలి పలికిన పలుకులకు— "అభిసరణానుకూలమగు వేషధారణకై త్వరపడుము" అనునదియే యర్థము గాకున్న వినిన మఱుక్షణముననే అట్లు సమాయత్తమగుటకు కారణము కానరాదు

ఇట్లే వణిజుఁడు తన భృత్యునితో నుడివిన ఈమాటకు "త్వరగా సామాను సర్దుము, కొట్టు మూసివేయవలయు"ననియు, ఈ పలుకే గురువు శిష్యునితో ననగా— ఇఁక నధ్యయనము చాలింపుమనియు, ఇట్లే ఈ చిన్నిమాట ఆయా సందర్భములలో నెన్నియో యర్థములకు దారి తీయును- ఆ మాటలోని పదముల యర్థమునకును, ఇఁక గ్రహించిన యర్థమునకును నెక్కడి పొంతనయో!

ఇట్లు కొన్ని మాటలేవేవో యర్థవిశేషముల స్ఫురింపఁజేయుచుండ మఱి కొన్ని పదములు స్వార్థమున ప్రయోగార్హతను గోల్పోయినవి. పంకజాది పదములు కమలాది ప్రసిద్ధార్థములలో ప్రయుక్తములగుట అటుండనిండు పంకజము 'బురదలో పుట్టునది' అను వ్యుత్పత్త్యర్థము నాశ్రయించి 'నత్తగుల్ల' అను నర్థమున నెందుకు ప్రయోగింపఁగూడదు?

ఇఁక నానార్థకపదప్రయోగదశలో వక్త్రభిప్రాయానుగతార్థమాత్ర మునే ఏల పరిగ్రహింపవలెను కోశాదిప్రమాణసమ్మతములయిన యితరార్థములును ఉపస్థితములగుచున్నవి కదా! అట్లని "సైంధవమును తెమ్మ"ని పలుకగా ఉప్పు గాక గుఱ్ఱమును మహానసమునకు గొనిపోయినవానిని మూర్ఖుడందురే కాని ప్రాజ్ఞుఁడందురా? ఇట్టి నానార్థస్థలమున అర్థాంతర వ్యావృత్తియయి ఏకమాత్రార్థోపస్థితి ఎట్లు కలిగినది?

ఇట్టి పదములు స్వార్థబోధనలో విలక్షణతఁ గాంచినవి. కావున ఈ విలక్షణత స్పష్టముగాఁ దెలియుటకై పద పదార్థముల కొక నియతసంబంధము ప్రయోగ వైలక్షణ్యముతో నేదేని ఒక వ్యవస్థయు కావలసియుండును లేదేని ఆయా వాక్యవ్యవహారమున వక్త్రభిప్రాయానుగుణార్థము గాక ఏదేని అసంబద్ధార్థము గ్రహించినను విప్రతిపత్తి యుండకపోవలసివచ్చును. అట్లైన వాగ్వ్యవహారము స్పష్టముగా భావాభివ్యక్తీకరణ సాధనమెట్లగును?

కావున అర్థ ప్రతిపత్తిలో ననుగమ ముండితీరవలెను

ఏతదర్థమే (అర్థప్రతిపత్తిలో ననుగమము సాధించుటకయియే) లాక్షణికులు శబ్దమున కర్థబోధనలో సహకారులుగా 'అభిధ' 'లక్షణ' 'వ్యంజన', యను మూడు వృత్తుల నేర్పఱచిరి

**అభిధ**

అభిధయన సంకేతితమగు నర్థము బోధించు శబ్దవ్యాపారము [6] శబ్దము వలన ప్రథమోపస్థితమగునది సంకేతితార్థమే కావున దీనిని ముఖ్యార్థ మందురు[7]. ఈ ముఖ్యార్థమును తెలియఁజేయునది యగుటచే ఈ యభిధావృత్తి ప్రథమోపాత్తమైనది [8] ఘటాదిపదోచ్చారణసమనంతరమే తదర్థములగు కంబుగ్రీవాదిమత్పదార్థాదులు బుద్ధి విషయములగుటచే పదపదార్థములకు నేదేని ఘనిష్ఠ సంబంధముండి తీరవలెను.[9] ఆ సంబంధ విశేషమే శక్త్యపరపర్యాయ మగు నభిధ[10] ఈ పదము వలన నీ యర్థము బోధపడవలెననునది ఒక

---

6 తత్ర సంకేతితారగోచరః శబ్ద వ్యాపారోఽభిధా (ప్ర రు కావ్యప్ర)

7 స ముఖ్యోఽర్థస్తత్ర ముఖ్యో వ్యాపారోఽస్యాభిధోచ్యతే (కా. ప్ర 2/8)

8 "తత్ర సంకెతితార్థస్య బోధనాదగ్రిమాఽభిధా॥" (సా. ద 2/4)

9 పదజ్ఞానస్య హి ఏక సంబంధి జ్ఞానధియా పదార్థోప స్థాపకత్వమ్ (ముక్తావళీ శబ్ద)

10 1) "శక్తిశ్చ పదేన సహ పదార్థస్య సంబంధః" (ముక్తావళీ. శబ్ద)

11) "శక్త్యాఖ్యో శబ్దస్యార్థగతః అర్థస్య శబ్దగతో వా సంబంధ విశేషోఽభిధా" (రసగంగాధర ద్వితీ అభిధా)

111) "తస్మాత్ శక్తిః సంబంధ ఇతి సర్వమనవద్యం" (సాహిత్య రత్నాకర ద్వితీయ. అభిధాలక్షణ)

1V) సంబధశ్చ వాచ్యవాచకయోః శక్తిరేవ। సాచోభయవర్తిన్యేకైవ వాచ్యనిష్ఠా వాచ్యశక్తి ర్వాచక శక్తిరితి చోభయథా వ్యపదిశ్యతే। యథాహుః కారికాయామాచార్యాః - శక్తిరేవ హి సంబంధో భేదశ్చాస్యా న విద్యతే ఇతి (ఏకావళీ 2/1 పై తరళ వ్యాఖ్య)

సంకేతము ఈ సంకేతరూపమగు శక్తి ఈశ్వరేచ్ఛయని ప్రాచీనులు,[11] లొకేచ్ఛయే యని నవ్యులు నందురు[12]. ఘటాది పదములు కంబుగ్రీవాదిమత్ పదార్థాద్యర్థములను బోధించును అట్లా పదపదార్థములకు నియతమగు సంబంధ మనాది సిద్ధమైనది చక్షురాదీంద్రియములకు రూపాది విషయ గ్రహణ యోగ్యత ఎట్లనాదిసిద్ధమో ఇదియు నట్టెయని వాక్యపదీయకారులనిరి[13] ఇట్లనాదిసిద్ధమని ఎంచియే కాబోలు సంకేతము సాక్షాదీశ్వరకృతమని ప్రాచీను లభిప్రాయపడిరి[14] అనాది సిద్ధ సంకేతమును కాదని అశ్వపదమును తదన్య మగు గోరూపార్థమున ప్రయోగించితిమేని ఇతరులీయర్థమును తెలియుదురా?[15] కావున పదములకు పదార్థములయందు సంకేతము నియతమైయున్నది ఈ సంకేత జ్ఞానమునే శక్తిగ్రహమందురు వ్యాకరణాదులవలన మన మా సంకేత మును తెలియవచ్చును[16] వ్యాకరణము, ఉపమానము, కోశము, ఆప్త

---

11 అస్మాత్ పదాదయమర్థో బోద్ధవ్య ఇతి ఈశ్వర సంకేతః శక్తిః"
(తర్కసంగ్రహ శబ్ద)

12 "నవ్యాస్తు ఈశ్వరేచ్ఛా న శక్తిః కిన్త్విచ్ఛైవ' (ముక్తావళీ శబ్ద.)

13 శ్లో॥ ఇంద్రియాణాం స్వవిషయేష్వనాదిర్యోగ్యతా యథా।
అనాదిరర్థైః శబ్దానాం సంబంధో యోగ్యతా తథా॥
(వా.ప 3/29)

14 "అత ఏవ న్యాయ వాచస్పత్యే ఉక్తమ్ -
స్వర్గాదిభువాం మహర్షిదేవతా నామీశ్వరేణ సాక్షాదేవ
కృతః సంకేతః, తద్వ్యవహారాచ్చాస్మదాదీనామపి
సుగ్రహస్తత్సంకేతః॥ (పరమలఘు మంజూషా, శక్తివిచార)

15. 'యో హి గామశ్వ ఇతిబ్రూయాత్ న జాతుచిత్ సంప్రత్యయః స్యాత్"
(1-2-64 సూత్రస్థ వ్యాకరణమహాభాష్యము)

16. శ్లో॥ శక్తిగ్రహం వ్యాకరణోపమాన–
కోశాప్తవాక్యాద్ వ్యవహారతశ్చ।
వాక్యస్య శేషాద్ వివృతేర్వదంతి
సాన్నిధ్యతః సిద్ధపదస్య వృద్ధాః॥ (ముక్తా - శబ్ద)

వాక్యము, వ్యవహారము, వాక్యశేషము వివరణము ప్రసిద్ధ పదసన్నిధి, అను వీనిని శక్తి గ్రహోపాయములుగా ప్రాచీనులు పేర్కొనిరి ఈ పదమున కియ్యది యర్థమని వీనివలన నెట్లు తెలియవచ్చునో వివరించెదను

## శక్తిగ్రహోపాయములు

**1. వ్యాకరణము –**

ప్రకృతి ప్రత్యయ విభాగము చేసి పదముయొక్క అర్థము నిర్ణయించునది వ్యాకరణము ఉదా · 'చాకిత'

సూ॥ తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీవాచ్యం
బగునపుడు మతుబర్థంబునందగు (బా వ్యా త సూ 19)

అను సూత్రముచే జాతి వాచకమగు 'చాకి'యను పదమునకు స్త్రీ రూపార్థమున మతుబర్థక తవర్ణకంబు విహితమగుటచే సిద్ధమయిన 'చాకిత' యను పదమునకు 'చాకలి కులము గల యాడుది' అనునర్థము వ్యాకరణము వలన తెలియనైనది.

**2. ఉపమానము .– ఉదా . 'గవయము'**

'గవయము గోవునుబోలిన యాకృతి గలిగియుండును' అని తెలిసికొని యుండుటచే గోరూపమగు నుపమానముద్వారా తత్సదృశమగు గవయమును (అడవిమృగమును) గుర్తించవచ్చును

**3. కోశము – ఉదా · 'ఏకదంతుడు'**

"శ్లో॥ అప్యేకదంత హేరంబ లంబోదర గజాననాః"

అను కోశమును పర్యాలోచించుటచే 'ఏకదంత' పదమునకు 'గణేశుడ'ను నర్థము తెలియవచ్చును

**4. ఆప్తవాక్యము ·– ఉదా· 'పికము'**

'పిక' పదమునకు 'కోకిల' యనునర్థము గురువు మున్నగు నాప్తులు చెప్పుటవలన తేటతెల్లమగును

5. వ్యవహారము — ఉదా 'గోవు'

శిశువులు పెద్దల పలుకులాలకించి ఆయా పదముల యర్థమును తెలిసి కొనుచునే యున్నారు ఎట్లన ? మధ్యమవృద్ధుఁడు గోవును తెచ్చుటకు కారణమైన 'గోవునుతెమ్ము' అను నుత్తమవృద్ధుని వాక్యమును, పిమ్మట గోవును బంధించుటకు కారణమైన 'గోవును బంధింపుము' అను వాక్యాంతరమును తదర్థానురూపమగు మధ్యమవృద్ధుని చేష్టలను గుర్తించుచున్న బాలుఁడు ఆనయనబంధనక్రియావిశిష్టమగు సాస్నాదిమత్పదార్థము వాక్యద్వయమున ననుగతముగా నున్న గోపదమునకర్థమనియు తదన్య పదములకు ఆనయనాదులర్థమనియు నిర్ణయించుకొనును ఇట్లు వ్యవహారమువలనను అర్థనిర్ణయమగును

6. వాక్యశేషము :—

'యవమయశ్చరుర్భవతి' అను వాక్యమున 'యవ' పదము ఆర్యేతర వ్యవహారానురూపమగు కంగు (కొఱ్ఱలు) రూపార్థమునఁగాక ఆర్యవ్యవహారానుసారియగు దీర్ఘశూక (పొడవైన ముండ్లుగలవి=యవలు) రూపార్థమున —

"యత్రాన్యా ఓషధయో మ్లాయంతే ఽథైతే మోదమానా ఇవోత్తిష్ఠన్తి"

"వసన్తే సర్వసస్యానాం జాయతే పత్రశాతనమ్।
మోదమానాశ్చ శోభన్తే యవాః కణిశశాలినః॥"

అను శ్రుతిస్మృతివాక్యశేష పర్యాలోచనచే నిర్ణయింపఁబడుచున్నది కొఱ్ఱలు అను నర్థమున ఆర్యేతరవ్యవహారము భ్రాన్తిమూలక మనియే చెప్పవలెను [17]

7) వివృతి (వివరణము) :-

'ఘటమన కలశమ'ను పర్యాయపదవివరణమువలన ఘటపదమునకర్థము తెలియఁబడుచున్నది

---

17 "వాక్యశేషాద్దీర్ఘశూకే శక్తిర్నిర్ణీయతే కంగౌతుశక్తిభ్రమాత్ ప్రయోగః నానాశక్తికల్పనే గౌరవాత్॥" (ముక్తా. శబ్ద)

8) సాన్నిధ్యము (ప్రసిద్ధార్థక పదసన్నిధి)

ఇది నానార్థకపదమున కర్థవిశేషనిర్ణయమున హేతువగుచుండును దీనిని సంయోగాదులలో వివరించెదను

## అర్థ విశేష నిర్ణయ హేతువులు :-

నానార్థములుగల పదము ప్రయోగించునపుడు ఆ పదమునకు గల అనేకార్థములు బుద్ధి విషయములగుచుండును అయినను ప్రయోక్త్రభిప్రాయానుగుణమగు నర్థమిదియే కాని తదితరములు కావని తదర్థవిశేషనిర్ణయములో నేదేని హేతువుండవలెను ఆ యర్థ విశేష నిర్ణయహేతువులే సంయోగాదులు—

శ్లో॥ [18]సంయోగో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా।
అర్థః ప్రకరణం లింగం శబ్దస్యాన్యస్య సన్నిధిః॥
సామర్థ్య మౌచితీ దేశః కాలో వ్యక్తిః స్వరాదయః।
శబ్దార్థస్యానవచ్ఛేదే విశేషస్మృతిహేతవః॥

(వాక్యపదీయ 2/315, 316)

సంయోగము, విప్రయోగము, సాహచర్యము, విరోధిత, అర్థము, ప్రకరణము, లింగము అన్యశబ్దసన్నిధి, సామర్థ్యము, ఔచితి, దేశము, కాలము, వ్యక్తి, స్వరాదులు, అను వీనిని అర్థ విశేష నిర్ణయ హేతువులుగా భర్తృహరి సంగ్రహించెను. ప్రాచీనాలంకారికులందఱును నీ కారికలను వ్యాఖ్యానించిరి [19] ఎట్లన?

---

18 'సంసర్గో' అని వాక్యపదీయపాఠము

19 i) మమ్మటాచార్యులు (కా ప్ర 2/19)

ii) ధర్మసూరి సా ర. 4/2

iii) విశ్వనాథ కవిరాజు (సా. ద 2/25)

iv) పండిత రాయలు (ర గం ద్వి వ్యంజనా)

vi) నాగోజీ బట్టు (పరమ లఘుమంజూషా)

1. సంయోగము -

ఉదా - "హరి సశంఖచక్రుఁడు ఇట 'హరి'యను పదమున కింద్రా ద్యనేకార్థములున్నవి[20] అయినను శంఖ-చక్ర సంబంధము గలిగియున్న హరి విష్ణువగునే కాని తదన్యుఁడు కానేరడు. ఇంద్రాదులు శంఖచక్రముల నియతముగా ధరించువారు కారు కదా॥ ఇట్లు 'హది' శబ్దార్థ విశేష నిర్ణయమున శంఖ చక్రసంయోగము హేతువగుచున్నది

2. విప్రయోగము :-

ఉదా.- "శంఖ చక్రములు లేని హరి"

శంఖ చక్రములు లేకుండుట యనగా పూర్వముండెననియేకదా॥ కావున ఎతత్కాలీన శంఖ చక్ర సంబంధ రాహిత్యము (విప్రయోగము) నానార్థక హరి పదమును విష్ణురూపార్థమున నియమించుచున్నది.

3. సాహచర్యము -

ఉదా॥ "రామలక్ష్మణులు"

ఇట 'పరశురాముఁడు, బలరాముఁడు', ఈమున్నగు[21] ననేకార్థములు గల రామశబ్దమును దశరథ రాముఁడను నర్థమున నియమించుటకు రామాంత రానుపపద్యమానమగు లక్ష్మణసాహచర్యమే కారణము సంయోగ సాహ చర్యములకంత భేదము కానరాదు. అయినను సంయోగము (సంబంధ సామాన్యము) శబ్దోపాత్తమగునేని సంయోగమున కుదాహరణమనియు, సంబంధియే ద్వంద్వాదిపదోపాత్తుఁడగునేని సాహచర్యోదాహరణమనియు

---

20. శ్లో॥ యమానిలేంద్ర చంద్రార్క విష్ణుసింహాంశు వారిషు
శుకాహికపిభేకేషు హరి ర్నా కపిలే త్రిషు॥"
(అమర. నానార్థ. 175)

21 రామః పశు విశేషే స్యాజ్జామదగ్న్యే హలాయుధే।
రాఘవే చాసితే శ్వేతే మనోజ్ఞేఽ పి చ వాచ్యవత్॥ (విశ్వకోశము)

గ్రహించవలెనని ప్రాచీనుల యాశయము[22] (ఇట్లు రసగంగాధరకారులు నుడివియున్నారు)

**4. విరోధిత -**

విరోధితయన ప్రసిద్ధవైరమేకాక సహానవస్థానము (కూడి యుండక పోవుట)కూడ ఇట్టిది రెండు విధములు— ప్రసిద్ధ వైరమునకు—

ఉదా - "రామార్జునులు'

ఇట రామపదమే కాక అర్జునపదమును కార్తవీర్యార్జునుఁడు పాండవ మధ్యముఁడను నర్థద్వయము కలిగియున్నది అయినను 'రామార్జును'లన ప్రసిద్ధమగు వైరము గలిగియున్న భార్గవ రామ కార్తవీర్యార్జునులే యను నర్థ నిర్ణయము చేయుటలో 'విరోధిత' హేతువగుచున్నది

సహావస్థాన రూప విరోధితకు— "ఛాయా తపములు" అనునది యుదాహరణము. నీడయు నెండయును కలసియుండునవి కావు కాన ఛాయా పదమునకు నీడయే యర్థము కాని తదన్యములు ప్రతి[23]బింబాదులు గావని నిర్ణయించుటలో హేతువు విరోధిత

**5. అర్థము (ప్రయోజనము) -**

ఉదా .- "భవబంధవిచ్ఛిత్త్యై స్థాణువును భజింపుము" ఇచ్చో 'స్థాణు' పదమున కర్థము. "మొద్దా! శివుఁడా"[24] అని సంశయము- సంసారబంధ

---

22 సంయోగ శబ్దస్య సంబంధ సామాన్య పరతయా యత్ర శబ్దాపాత్తం ప్రసిద్ధం సంబంధ సామాన్యం శక్తి నియామకం తదాద్యస్య, యత్ర తు ద్వంద్వాదిగతః సంబంధ్యేవ కేవలస్తదా సాహచర్యస్యోదాహరణమితి ప్రాచా మాశయాత్" (రసగంగాధర- ద్వితీ వ్యంజనా.)

23. శ్లో॥ ఛాయా సూర్య ప్రియాకాంతిః ప్రతిబింబ మనాతపః"
(అమర. నానార్థ. 158)

24 శ్లో॥ "స్థాణుర్వా నా ధ్రువః శంకుః" అని
శ్లో॥ స్థాణూ రుద్ర ఉమాపతిః" అనియు, అమరము

విచ్ఛిత్తి రూప ప్రయోజనము శివునివలననే సిద్ధించుటచే 'స్థాణు' పదమునకు శివుఁడనియే యర్ధమని నిర్ణయించుటలో 'అర్ధము" (ప్రయోజనము) హేతు వగుచున్నది

6. ప్రకరణము (సందర్భము) :-

ఉదా - "దేవరకు సర్వము తెలియును"

(సర్వం జానాతి దేవః)

ఇట దేవుఁడు రాజు[25], అని నానార్ధములు గలిగిన దేవ(ర) పదము మునకు మీరు (రాజు) అను నర్థము నిర్ణయించుటలో ప్రకరణము హేతువగు చున్నది ఇట్లే 'సైంధవమును తెమ్మ'ని భోక్త పలికినచో భోజన ప్రకరణము 'సైంధవ' పదశక్తిని 'ఉప్పు' అను నర్థమున నియమించుచున్నది[26]

7. లింగము (చిహ్నము) :-

ఉదా - "మకరధ్వజుఁడు కోపించెను"

ఇట "మకరధ్వజ" పదమునకు 'సముద్రుఁడు, మన్మథుఁడ'నియు రెండర్థములు[27]. సముద్రుఁడ చేతనుఁడు కోపము చేతన ధర్మము. కావున కోపరూప చిహ్నము సముద్రుని కాదని మన్మథునే'మకరధ్వజ' పద వాచ్యునిగాఁ జేయుట లేదా?

8. అన్యశబ్ద సన్నిధి (ప్రసిద్ధార్థక పదాంతర సన్నిధి)

ఇదియే పూర్వోక్త (శక్తిగ్రహోపాయ) సాన్నిధ్యము

---

25. "శ్లో॥ దేవో మేఘే సురే రాజ్ఞి" అని విశ్వకోశము.

26 "శ్లో॥ హయసైంధవ సప్తయః" అని అశ్వార్థమున
"శ్లో॥ సైంధవోఽస్త్రీ శీతశివం మాణిమంథం చ సింధుజే" అని సైంధవ లవణార్థమునను అమరము.

27. మకరో నామ నక్రో జంతు విశేషస్తదాకారః సఏవ వా ధ్వజో యస్యేతి విగ్రహే నానార్థకస్య మకరధ్వజశబ్దస్య వాచకతా మకరాకారధ్వజ— సముద్రాఖ్యాం వ్యావృత్తేన సమవాయసంబంధవతా కోపరూపలింగేన మన్మథే నియమ్యతే॥ (కా ప్ర. 2/19 నాగేశ్వరీటీకా)

ఉదా - పురారాతియగు దేవునకు (దేవరకు) ఇట 'దేవ' పదమునకు రెండవ యర్థమగు రాజు[28]నందు పురవైరిత్వము సంభవింపకపోవుటచే 'పురారి' పద సన్నిధి దేవశబ్దమునకు 'శివుఁడని'యే యర్థమని నిర్ణయించుటలో హేతువగుచున్నది

## 9. సామర్థ్యము :-

ఉదా - 'మధువుచేఁ గోకిల మదించినది'

ఇచ్చట మధు పదవాచ్యములగు మద్య వసంతులలో[29] మద్యమునకుఁ గాక వసంతునకే కోకిలలకు మదము గలిగించు సామర్థ్యమున్నది కావున 'మధు' పదమునకు వసంతుఁడను నర్థము నిర్ణయించుటలో సామర్థ్యము హేతువగుచున్నది

## 10. ఔచితి (ఔచిత్యము)

ఉదా - "ప్రియురాలి ముఖము మిమ్ముఁ (కామార్తులను) గాపాడుగాక'

ఉత్కంఠిత మనోరథ సాధనౌచిత్యము ప్రియురాలి సాముఖ్యమునకే కాని వదనమునకు లేదు గాన ముఖపదమునకు వదనమను నర్థముగాక సాముఖ్యమను నర్థము నిర్ణయించుటలో నౌచిత్యము హేతువు

## 11. దేశము :-

ఉదా, "వైకుంఠమున హరి వెలయుచున్నాఁడు

వైకుంఠమున వెలయువాఁడు విష్ణువే కాని ఇంద్రాదులు కారు కావున వైకుంఠ రూపదేశము నానార్థక హరిశబ్ద శక్తిని విష్ణు రూపార్థమున నియమించుచున్నది

---

28. "శ్లో॥ దేవో మేఘే సురే రాజ్ఞి' అని విశ్వకోశము.
(ఇది ప్రకరణమునను ఉదాహృతము)

29. మధు పుష్పరసే క్షౌద్రే మద్యే నా తు మధుద్రవే
వసంతదైత్య ..." అని మేదినీకోశము

**12.** కాలము

ఉదా :- "చిత్రభానువు ప్రకాశించుచున్నాడు

ఇచ్చట 'చిత్రభాను' పదమునకు, వాక్య ప్రయోగ కాలము దివసమైన 'సూర్యుఁ'డనియు రాత్రియైన 'నగ్ని'యనియు అర్థవిశేష నిర్ణయము చేయుటలో ఆయాకాలము హేతువగుచున్నది

**13.** వ్యక్తి (లింగము)

ఉదా "మిత్రమొప్పుచున్నది"

ఇచ్చట మిత్రశబ్దమునకు చెలికాఁడను నర్థము నిర్ణయముచేయుటలో 'మిత్రము' అను నపుంసకలింగ ప్రయోగమే హేతువగుచున్నది మిత్రుఁడని పుంలింగమున ప్రయోగించిన సూర్యుఁడునగును ఇటలింగమే అర్థనిర్ణాయక హేతువు.

**14.** స్వరము (ఉదాత్తానుదాత్త స్వరితములు)

ఉదాత్తాది స్వరములు వేదముననే అర్థవిశేష ప్రత్యాయకములగును.

ఉదా. 'ఇంద్రశత్రుర్వర్ధస్వ'

ఇచ్చట ఇంద్రునకు శత్రువు (షత) అనునర్థమున 'ఇంద్రశత్రు' పదమును అంత్యోదాత్తముగా నుచ్చరింపవలెను ఇఁక ఇంద్రుఁడే శత్రువు (శాసకుఁడు)గా గలవాడు (బహువ్రీహి) అనునర్థమున అద్యుదాత్తముగా నుచ్చరింపవలెను ఇట్టి స్వరవిశేషమర్థవిశేష నిర్ణయములో హేతువగును

త్వష్టయను ప్రజాపతి ఇంద్రునిపై పగఁబూని 'స్వాహేన్ద్రశత్రుర్వర్ధస్వ' (మై సం 2.4.4) అను మంత్రములోని ఇంద్రశత్రు పదమును అంత్యోదాత్త స్వరమునఁ గాక ఆద్యుదాత్తస్వరమున నుచ్చరించుచు హోమము చేసెను దాన స్వరభేదముచే నర్థభేదమగుటవలన తద్ధోమకుండ సముద్భూతుఁడగు వృత్రుఁడు ఇంద్రహంత కావలసియుండగా నింద్రహతుఁడాయెను [30] ఈ యర్థము పాణినీయశిక్షలో నిట్లు సంగ్రహింప బడియున్నది.

---

30 (1) శ్లో॥ హతపుత్రస్తతస్త్వష్టా జుహావేంద్రాయ శత్రవే ।
ఇంద్రశత్రో । వివర్ధస్వ మాచిరం జహి విద్విషమ్॥
(శ్రీమద్ భాగవత 6, 9/99)

(11) "ఇతీంద్రస్యాహైనగ్ం శత్రుమచీకర్ద దింద్రమస్య శత్రుమకరోత్।'
(మై సం. 2.4.4.)

"మంత్రో హీనః స్వరతో వర్ణతో వా
మిథ్యాప్రయుక్తో న తమర్థమాహ
స వాగ్వజ్రో యజమానం హినస్తి
యథేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్॥" (పా. శి శ్లో 20)

"స్వరాదయః" అను నాదిపదముచే నభినయాదులు గ్రాహ్యములు—

**15. అభినయము**

"ఇంతింత కన్నుల సోయగము"

ఇట 'ఇంతింత' అను పదమునకు అభినయానుగుణముగా 'కలువ రేకులవలె దీర్ఘములైన' అనునర్థము పర్యవసితమగుచున్నది— ఇట్లభినయాదులును అర్థవిశేష నిర్ణయమున హేతువులు

ఈ విధమున నానార్థక పదప్రయోగ సందర్భములలో అర్థవిశేష నిర్ణాయకములగు నీ సంయోగాదులన్యార్థమున వాచకతాశక్తిని వారించి ప్రకృతార్థ విశేషమున నియమించుటచే తాత్పర్యము సుగ్రహమగుచున్నది

సంయోగాదులచే నియంత్రితమైన శక్త్యపరపర్యాయమగు నభిధచే బోధితమగు నర్థమును శక్యార్థము వాచ్యార్థము, అభిదేయము, అను పదములచే వ్యవహరింతురు అట్టి పదమును శక్తము, వాచకమనియుననందురు

## పదముల చాతుర్విధ్యము

ఈ శక్యార్థము-జాతి, గుణము క్రియ, ద్రవ్యము, అని నలుతెఱంగులు[31] కాగా, పదమును—జాతివాచకము, గుణవాచకము, క్రియావాచకము, ద్రవ్యవాచకము లేక యదృచ్ఛాశబ్దము అని చతుర్విధత్వము నొందుచున్నది

---

31. i) 'సంకేతితశ్చతుర్భేదో జాత్యాదిర్జాతిరేవ వా' (కా ప్ర 2/8)

ii) "సచ (అభిధేయః) జాతిగుణక్రియాయదృచ్ఛాత్మకః"
(ర గం ద్వితీ అభిధా)

iii) సంకేతో గృహ్యతే జాతౌ గుణద్రవ్యక్రియాసు చ' (సా ద 2/4)

iv) "జాతిర్గుణః క్రియాద్రవ్యం సాంకేత్యం జాతిరేవ వా
(సె ర ద్వి వాచకశబ్దార్థ నిరూపణము)

v) "శబ్దః సంకేతితః పూర్వైర్జాత్యాద్యర్థ చతుష్టయే
(అలంకారమహోదధి 2/3)

**1.** జాతివాచకము -

ఉదా. 'గోవు' అనునది గోజాతిని తెలుపుపదము కావున జాతివాచకము

**2.** గుణవాచకము:-

ఉదా. 'శుక్ల నీల పీతాది శబ్దములు' ఇవి ఆయా గుణములఁ దెలుపునవి కావున గుణవాచకములు.

**3.** క్రియావాచకములు:-

ఉదా 'పాకాదులు' అధిశ్రయణాద్యవశ్రయణాంత క్రియాకలాపాదులను దెలుపునవి కావున క్రియావాచకములు.

**4.** ద్రవ్యవాచకములు లేక యదృచ్ఛాశబ్దములు[32]

వీనినే సంజ్ఞావాచకములనియు నందురు ఉదా· రాముడు, కృష్ణుడు, డిత్థము మున్నగునవి మహాభాష్యకారులును "చతుష్టయీ శబ్దానాం ప్రవృత్తిః- జాతిశబ్దాః గుణశబ్దాః క్రియాశబ్దాః యదృచ్ఛాశబ్దాశ్చతుర్థాః అని పదములను చతుర్విధములుగా విభజించియున్నారు 'గోవును తెమ్మ'నగాఁ దెచ్చుటకు యోగ్యమైనది గోరూపవ్యక్తియేకాని గోత్వరూపజాతి కాదు అయినను అనంత్యవ్యభిచారదోషప్రసక్తిచే వ్యక్తియందు సంకేతమంగీకరింపఁబడలేదు[33]

---

32 "స్వేచ్ఛయా ఏకస్యాం వ్యక్తౌ సంకేత్యమానః శబ్దః యదృచ్ఛాశబ్దః' (వ్యాకరణ మహాభాష్యోద్యోతము 1 1.2)

33 1) 'యద్యప్యర్థక్రియాకారితయా ప్రవృత్తి నివృత్తి యోగ్యా వ్యక్తిరేవ, తథాऽప్యానంత్యాద్ వ్యభిచారాచ్చ తత్ర సంకేతః కర్తుం న యుజ్యతే' (కా ప్ర 2/8_1)

11) 'అనంత్యాద్వ్యభిచారాచ్చ వ్యక్తీనామభిదేయతాయా అకల్పనాత్ (ర గం. ద్వితీ అభిధా)

111) "నను వ్యక్తీనామర్థక్రియా కారిత్వాత్ తత్రైవ సంకేతః కిం న స్యాదితి చేత్, తత్ర పృచ్ఛామః కిం సర్వాసు వ్యక్తిషు, ఉతైకదేశే? నాద్యః, ఆనన్త్యాత్ । నేతరః, ఇతర వ్యక్తౌ గోవ్యవహారదర్శనేన వ్యభిచారాత్। కించ 'గౌః శుక్లశ్చలో డిత్థః' ఇత్యర్థభేదాభావేన పర్యాయత్వ ప్రసంగః" (సాహిత్య రత్నాకర 2/35 అభిధా)

మీమాంసకులు జాతిమాత్రము శక్యార్థమని చెప్పఁగా నైయ్యాయికులు జాతివిశిష్టవ్యక్తియనియు, సౌగతులు అన్యాపోహ [34] (గోభిన్నాశ్వాదివ్యావృత్తి) మనియు చెప్పుదురు [35]

సాహిత్యరత్నాకరముల ధర్మసూరి ఈ మతములనన్నింటిని విపులముగా చర్చించి జాత్యాదులే కాని జాతియే కాని శక్యార్థమని మమ్మటాదిమతానుగుణముగా నిర్ణయించి యున్నాడు. (సా. ర 2/35 కా. వృత్తి)

**రూఢములు**

పదముల స్వరూపస్వభావములఁ బట్టి అర్థబోధనశక్తి విచిత్రముగా నుండును కొన్ని పదములు కేవల సముదాయశక్తి (రూఢిశక్తి)చేతనే అర్థ ప్రత్యాయనము చేయును 'డిత్థము' అను పదమునకు 'మొద్దు' అని యర్థము దీనికిది యదృచ్ఛాకల్పిత సంజ్ఞయే కాని ఇట అవయవార్థము బొత్తిగాలేదు * అవయవార్థము లేకున్నను ప్రసిద్ధిని బట్టియే అర్థప్రత్యాయనము చేయు పదములను రూఢములందరు [36]

---

34 "గోశబ్దశ్రవణాత్ సర్వాసాం గోవ్యక్తీనాముపస్థితౌ అతస్మాదశ్వాదితో వ్యావృత్తిదర్శనాత్ వ్యావృత్తిరూపో౽పోహో వాచ్య ఇతి బౌద్ధానాం మతిః" (కా ప్ర 2/8 1 బాలబోధినీ వ్యాఖ్య)

35 "సంకేతగ్రహశ్చ జాతిగుణక్రియాద్రవ్యేషు జాతావేవ జాత్యాలింగిత వ్యక్తౌ వా అన్యాపోహే వా మతభేదేన భవతి" (సా ర పుట 172)

* అసత్స్వవయవార్థేషు యో౽న్యత్రార్థే ప్రయుజ్యతే।
తత్రానన్యగతిత్వేన సముదాయః ప్రసిద్ధ్యతి॥
(ప్రతాపరుద్రీయ రత్నాపణ వ్యాఖ్య రూఢి శబ్ద నిర్వచనము)
(వావిళ్ళ) పుట. 42

36 "యత్రావయవశక్తి నైరపేక్ష్యేణ సముదాయశక్తిమాత్రేణ బుధ్యతే తద్రూఢమ్" (ముక్తా శబ్ద)

**యౌగికములు**

ఇఁక కొన్ని శబ్దములు కేవలావయవశక్తి (యోగశక్తి) చేతనే అర్థబోధకములగును పఠించువాడు పాఠకుడు 'వంటవాఁడ'ను పదమునకర్థము వంటఁజేయు వాఁడెవఁడైనను కావచ్చును. ఇట్టి పదములకు అవయవార్థమే కాని సముదాయశక్తిచే నొక ప్రత్యేకార్థము కానరాదు [37] కావున వీనిని యౌగికములందురు విద్యానాథుఁడు ధర్మసూరి (రామరాజభూషణుఁడు) మున్నగువారీరెండు భేదములనే చెప్పియున్నారు. కావ్యప్రకాశకారులు సాహిత్య దర్పణకారులును నీ విషయము ప్రస్తావించలేదు

**యోగరూఢములు**

ఇవిగాక మఱియొక శ్రేణికిఁ జెందిన పదములును కానవచ్చుచున్నవి ఎట్లన– పంకజమను పదము సముదాయశక్తిచే కమలమను నర్థమునఁ బ్రసిద్ధమైనది కాని ఈ పదము రూఢమనుటకు వీలులేదు పంకమున జనించినది కాన అవయవార్థము గూడ కలిగియున్నది కదా రూఢము అవయవార్థ–సంకలితము కాదు [38] అవయవార్థము ప్రవృత్తినిమిత్తము కాదు కావున యౌగిక మనుటకును వీలుపడదు ఇట్టి పంకజాదిపదములు ఉక్తభేదద్వయాంతర్భూతములు కాకుండుటచే యోగరూఢములని వ్యవహరించిరి [39]

---

37 యత్రావయవార్థ ఏవ బుధ్యతే తద్యౌగికం,
యథా పాచకాది పదమ్॥ (ముక్తా–శబ్ద)

38. రూఢిః అశ్వకర్ణాదివదవయవార్థాభావేన సముదాయ ప్రసిద్ధిః।
(సాహిత్యరత్నాకరనౌకా వ్యాఖ్య (S A.O U Edı) పుట 202)

39 i) ఉభయశక్తి సాపేక్షమేకార్థప్రతిపాదకత్వం యోగరూఢిః।
(అప్పయదీక్షితులు వృత్తివార్తిక)

ii) "సేయమభిధా త్రిధా - కేవల సముదాయశక్తిః, కేవలావయవశక్తిః సముదాయావయవశక్తి సంకరశ్చేతి। . ఏతా ఏవ విధా యోగ- రూఢి- యోగరూఢిశబ్దైర్వ్యపదిశ్యంతే"
[జగన్నాథపండితరాయలు. ర. గం ద్వి. (నిర్ణయ) పు 178]

రూఢిశక్తి యోగశక్తిని* హరించునది కావున పంకజాది పదముల కవయవార్థము ప్రవృత్తినిమిత్తము కాఁజాలదు

యౌగిక రూఢములు

మఱియొక విశేషము:— కొన్నిపదములు పంకజాదిపదమువలెఁగాక రూఢిశక్తిచే నొక యర్థవిశేషమునను యోగశక్తిచే వేఱొకయర్థమునను ప్రసిద్ధిఁ గాంచును. ఎట్లన?—

"ఉద్భిదా యజేత పశుకామః" అను శ్రుతి వాక్యమున ఉద్భిత్పదము యాగ విశేషమున రూఢమై యున్నది మఱియు 'ఉద్భిదాదులు' అను వ్యవహారమున "ఉద్భిదన్తి భువమిత్యుద్భిదః" పుట్టినప్పుడు భూమిని ప్రక్కలించునవి కావున తరుగుల్మలతాదు లనునర్థమున యోగశక్తిచేఁ బ్రసిద్ధమైనది మొదటి యర్థమున కేవల సముదాయశక్తి (రూఢి) యే కారణము కాగా రెండవ యర్థమున కేవలావయవశక్తి (యోగశక్తి)యే కారణమగుచున్నది. ఇట్టి పదము పూర్వోక్త భేదత్రయమున నంతర్భవింపదు

కావున ఏతాదృశములగు అశ్వగంధా-అశ్వకర్ణ-నిశాంత-కువలయాది పదములను యౌగికరూఢములని చతుర్థభేదముగా పరిగణించిరి[40] ఇట్లర్థ

* "రూఢిర్యోగాపహారిణీ' (వై సి ల మం. శక్తినిరూపణమ్) యోగాపహారిణీతి. ఏవం చ సతి ప్రకరణాదికే యోగార్థబాధ ఇతి భావః రూఢేర్బలవత్త్వే బీజంతు- అవయవార్థానుసంధాన మూలక యౌగికార్థాపేక్షయా రూఢ్యర్థస్య ప్రథమోపస్థితత్వమేవ- [రత్నప్రభ (వై సి ల మంజూషవ్యాఖ్యా) శక్తినిరూపణం]

40 1) యత్రతు యౌగికార్థరూఢ్యర్థయోః స్వాతంత్ర్యేణ బోధః, తద్యౌగికరూఢమ్। యథా-ఉద్భిదాదిపదమ్॥ (ముక్తా-శబ్ద)

11) అశ్వగంధాదిపదమోషధివిశేషే రూఢమ్, అశ్వ సంబంధిగంధవత్తయా వాజిశాలాబోధే యౌగికమ్। ఇదం యౌగికరూఢమిత్యుచ్యతే। (పరమలఘు మంజూషా శక్తివిచార 14 పుట)

111) "చతుర్థ ఏవాభిధాయాః ప్రకార ఇత్యప్యన్యే '
(రసగంగాధర. -అభిధా)

బోధకతాస్వభావమునుబట్టి శబ్దములు యౌగికములు రూఢములు యోగరూఢములు యౌగికరూఢములని చాతుర్విధ్యము నొందుచున్నవి ఇది యభిధ

**ఇఁక లక్షణ -**

ఇది రెండవ శబ్దవృత్తి-

**ఆవశ్యకత -**

దీని యావశ్యకత ఇట్లున్నది-

పూర్వోదాహృతములగు 'ఇల్లు గొల్లున నేడ్చెన్' 'రాముని వెంట నయోధ్యయు నరిగినది, మున్నగు వాక్యములకు యథాస్థితార్థమునే గ్రహించిన వాక్యార్థము పొసఁగదు. చేతన సాధ్యములగు గమనాదులు అచేతన గృహాది సాధ్యములెట్లగును? కావున వాచ్యార్థోపపత్తికై 'ఇల్లు' మున్నగు పదముల కింటిలోని వారందఱును అను నర్థము గ్రహించితీరవలెను ఈ యర్థవిశేషమును బోధించునది యభిధ కాదు- 'ఇల్లు' అను పదమున కా యర్థవిశేషమున సంకేతమెక్కడిది? కావున నర్థవిశేష ప్రతిపత్తికై లక్షణయను రెండవ శబ్దవృత్తి యవసరమగుచున్నది

**లక్షణా నిర్వచనము -**

ఇది వాచ్యార్థముతో సంబంధముక్న యర్థవిశేషమునే బోధించునది[41] కావున వాచ్యార్థముతో లక్ష్యార్థమునకుండు సంబంధమే లక్షణ యని నిర్వచించిరి[42] ఇఁక మమ్మటాదులు - ముఖ్యార్థమున కనుపపత్తి కలుగఁగా దానికి (ముఖ్యార్థమునకు) సంబంధించిన యర్థ విశేషమును బోధించు

---

41 i) ఉక్తం చాన్యత్ర (భట్టవార్తికే)- "అభిదేయావినాభూతప్రతీతిర్లక్షణోచ్యతే" (తంత్రవార్తిక 1/4/22) (కావ్యప్రకాశ ద్వితీ లక్షణా)

ii) స్వాభిదేయావినాభూతప్రతీతే వస్తుని క్వచిత్।
శబ్ద వ్యాపారవిశ్రాంతి హేతుతా లక్షణోచ్యతే॥
(భావప్రకాశ షష్ఠ. పుట 155)

42 i) "శక్యసంబంధో లక్షణా (రసగం ద్వితీ. లక్షణా)

ii) "లక్షణా శక్యసంబంధ స్తాత్పర్యానుపపత్తితః" (ముక్తా. శబ్ద)

వ్యాపారమనియు, అట్లు బోధించుటలో రూఢియే కాని ప్రయోజనమే కాని హేతువగుననియు నిర్వచించిరి [43] లక్షణచే బోధ్యమగు నర్థ విశేషమును లక్ష్యార్థమనియు తదర్థబోధకమగు పదమును లక్షకమనియు నందురు [44]

ఉదా "గంగలో గొల్లపల్లె" (గంగాయాం ఘోషః). గంగ ప్రవాహ రూపము ప్రవాహమున పల్లె యుండుట యసంభవము కావున లక్షణచే ప్రవాహరూపార్థము స్వసమీపతరవర్తియగు తీరమును లక్షించుచున్నది–అనగా గంగాప్రవాహమున కానుకొనియున్న తీరమున పల్లె యున్నదని అర్థము

---

43 1) ముఖ్యార్థాసంభవాత్ సేయం ముఖ్యార్థాసత్తిహేతుకా
రూఢేః ప్రయోజనాద్వాపి వ్యవహారేఽవలోక్యతే॥
(అభిధావృత్తిమాతృకా)

ii) ముఖ్యార్థ బాధాది సహకార్యపేక్షార్థప్రతిభాసనశక్తిర్లక్షణాశక్తిః
(ధ్వన్యాలోకలోచన 1/21)

iii) ముఖ్యార్థబాధే తద్యోగే రూఢితోఽథ ప్రయోజనాత్।
అన్యోఽర్థో లక్ష్యతే యత్ సా లక్షణాఽఽరోపితా క్రియా॥
(కావ్యప్రకాశ 2/9)

iv) ముఖ్యార్థబాధే తద్యుక్తో యయాఽన్యార్థః ప్రతీయతే।
రూఢేః ప్రయోజనాద్ వాఽసౌ లక్షణాశక్తి రర్పితా॥ (సా ద 2/9)

v) ముఖ్యార్థ బాధే నిమిత్తే ప్రయోజనే చ భేదా భేదాభ్యా మారోపితో గౌణః। ముఖ్యార్థ సంబద్ధ స్తత్త్వేన లక్ష్యమాణో లక్ష్యః ।
(కావ్యానుశాసనం లక్షణా. పుట 28)

vi) ముఖ్యార్థబాధే తద్యోగే రూఢితోఽథ ప్రయోజనాత్।
అన్యోఽర్థో లక్ష్యతే యత్సా లక్షణారోపితా క్రియా॥(భావప్రకాశ షష్ఠ)

vii) వాచ్యార్థానుప పత్త్యా తత్సంబధిన్యారోపితః శబ్దవ్యాపారో లక్షణా.
(ప్ర రు కావ్యప్రకరణ)

viii) వాచ్యార్థబాధే తద్యోగే రూఢితో వా ప్రయోజనాత్ ।
యయాఽన్యం బోధయేచ్ఛబ్దో వ్యాపృత్యా సాఽన్యలక్షణా॥
(సా. ర 3/2)

44. వాచక లక్షక వ్యంజకత్వేన త్రివిధం శబ్దజాతం। వాచ్య లక్ష్య వ్యంగ్య త్వేనార్థజాతమపి త్రివిధమ్। (ప్ర రు కావ్య )

శబ్దవృత్తిత్వ వ్యవహారము —

ఇట గంగాశబ్దముచేఁ గాక ప్రవాహరూపార్థముచేతనే తీరరూపార్థము బోధితమైనది అనగా అర్థమే లక్షకమయినది కావున లక్షణ యర్థవృత్తి యనుటయే లెస్స. అయినను అర్థధర్మమును శబ్దమున నారోపించి శబ్దవృత్తి యని వ్యవహరించిరి [45]

లక్షణాబీజము -

ఇట్లు లక్ష్యార్థముచే వాచ్యార్థానుపపత్తి పరిహరింపఁబడుటచే వాచ్యార్థానుపపత్తి లక్షణాబీజమని పేర్కొనిరి

వాచ్యార్థానుపపత్తి లక్షణాబీజమనుటకు బదులు తాత్పర్యానుపపత్తి లక్షణాబీజమని యనుట తగునని రసగంగాధరకారాదు లభిప్రాయపడిరి [46]

---

45 అత్ర యద్యపి స్వార్థం ప్రత్యాయ్య ఉపరతవ్యాపారస్య శబ్దస్య పునర్వ్యాపారాంతరాయోగాత్ అర్ద ఏవ లక్షక ఇత్యర్థవ్యాపారో లక్షణా, తథాపి వాచ్యధర్మో వాచక ఉపచర్యత ఇతి లక్షణాయాః శబ్దవృత్తిత్వవ్యవహార ఇతిజ్ఞేయమ్ (రత్నాపణ (ప్ర. రు వ్యాఖ్య 2/8)

46 1) కింతు తాత్పర్య విషయాన్వయే ముఖ్యార్థతావచ్ఛేదకరూపేణ ముఖ్యార్థ ప్రతియోగితాయా అభావో రూఢి ప్రయోజనయోరన్యతరచ్చ తన్నిమిత్తమ్। ముఖ్యార్థన్వయానుపపత్తెస్తన్నిత్వే తు "కాకెభ్యో దధి రక్ష్యతా' మిత్యత్ర లక్షణోత్థానం నస్యాత్
(రసగం. ద్వితీ లక్షణా)

11) యద్యన్వయానుపపత్తిర్లక్షణాబీజం స్యాత్, తదా "యష్టీః ప్రవేశయే త్యత్ర లక్షణా న స్యాత్, యష్టిషు ప్రవేశాన్వయస్యానుపపత్తేరభావాత్। తేన తత్ప్రవేశే భోజనతాత్పర్యానుపపత్త్యా యష్టిధరేషు లక్షణా। ఏవం "కాకేభ్యో దధి రక్ష్యతా" మిత్యాదౌ కాకపదస్య దధ్యుపఘాతుకే లక్షణా। సర్వతో దధిరక్షాయాస్తాత్పర్య విషయత్వాత్॥ (ముక్తా. శబ్ద)

11) వస్తుతస్తు - తాత్పర్యానుపపత్తిప్రతిసన్ధానమేవ తద్బీజమ్। అన్యథా 'గంగాయాం ఘోష' ఇత్యాదౌ ఘోషాదిపదే ఏవ మకరాది లక్షణాపత్తిః, తావతాఽప్యన్యథానుపపత్తిపరిహారాత్॥
(పరమలఘు మంజూషా (పుట 17) లక్షణావిచార.)

ఏలన ? "పిల్లివలన పెరుగు కాపాడు మను తల్లి పలుకులలో వాచ్యార్థమున కేవిధమైన అనుపపత్తి లేకున్నను యథాస్థితార్థమునే గ్రహించిన పెరుగును సర్వవిధాలుగా కాపాడవలెనను తల్లి యభిప్రాయము నెరవేరదు కాన పిల్లి అను పదముచే పెరుగు పాడుచేయువానినెల్లను గ్రహించియే తీరవలెను గదా!

కావున నిట 'దధ్యుపఘాతుక' రూపలక్ష్యార్థము తాత్పర్యానుపపత్తివలన నేర్పడినది పూర్వోక్తోదాహరణములలోను తాత్పర్యానుపపత్తి యుండనే యున్నది కదా

కాన తాత్పర్యానుపపత్తియే లక్షణాబీజమనుట యుక్తము

**మరియొక విశేషము :—**

శత్రుగృహమున భుజింపఁదలఁచిన తన తనయునితో - "ఇంత విషము తినరాదా" అను తల్లి పలుకులు, యథాస్థితార్థమునే గ్రహించిన ప్రమాణము లెట్లగును ఇట్లే— 'ఆదిత్యో యూపః' 'గంగాయాం ఘోషః' ఈ మున్నగు వైదిక లౌకిక వాక్యములలో ముఖ్యార్థమే గ్రహించిన వాక్యము లప్రమాణము లగును [47]

కావున వాక్యప్రామాణ్యానుపపత్తి లక్షణాబీజమని మీమాంసకులభిప్రాయ పడిరి.[48]

'ఇంత విషము తినరాదా' అను వాక్యమున తనయుని విషము తినుమని తల్లియభిప్రాయము కాదుగదా! కావుననే వాక్యమప్రమాణమంటిమి

ఇట్లు తాత్పర్యానుపపత్తి యన్నను వాక్యప్రామాణ్యానుపపత్తి యన్నను అంత భేదము కానరాదు.

---

47 అస్తిచ- 'గంగాయాం ఘోషః ప్రతివసతి' 'ఆదిత్యోయూపః' ఇత్యాది లౌకిక వైదిక వాక్యేషు ముఖ్యార్థమాత్రపరత్వే వాక్యప్రామాణ్యానుపపత్తిః" (సా ర. లక్షణా)

48 ఉక్తం హి —
వాక్యప్రామాణ్య భంగః స్యాత్ స్వాభిధేయపరే పదే ।
లక్షణా తత్ర విజ్ఞేయా వాక్యే వైదిక లౌకికే ॥ (సా.ర లక్షణా)

అయినను అపౌరుషేయములయి స్వతఃప్రమాణములగు వైదికవాక్యములలో వక్త్రభిప్రాయాపరపర్యాయమగు తాత్పర్య శబ్దమును పరిహరించుటయే వారట్లు వ్యాఖ్యానించుటకు హేతువైనది

**లక్షణా ప్రయోజనము -**

ఇట్లు వాచ్యార్థము పొసఁగకున్నను అట్లు మాటాడుటలో హేతువేమి ?

"గంగలో పల్లె" యనుటకు బదులు 'గంగాతీరమున పల్లె' యని యందుమేని గంగకు దూరతీరముననున్న పల్లెయు కావచ్చును గంగనానుకొనియున్న తీరమునగల పల్లెకున్న పావనత్వశైత్యాదులు దూరతీరస్థితమగు పల్లెకెట్లుండును ఇట్లా పల్లె మిక్కిలి పవిత్రమైనదియు చల్లనిదియునునని చెప్పక చెప్పుటకయియే గంగలో పల్లె' యని వ్యవహరించుటలోఁగల యౌచిత్యము ఈ శీతత్వపావనత్వాదిరూప వ్యంగ్యార్థమును ప్రయోజనమందురు [49]

ఇట్లు వ్యంగ్యార్థరూప ప్రయోజనమున్ననే కాని లాక్షణిక పదప్రయోగము చేయరాదు

**రూఢియు లక్షణా ప్రయోజకమే :-**

విశేషమేమన—కొన్ని పదములు ప్రయోజనాపేక్షలేకయే లక్ష్యార్థమున రూఢములైయున్నవి

ఉదా - లావణ్యాదులు

[50]లావణ్యపదము లవణరసయుక్తమను స్వార్థమునఁగాక సౌందర్య

---

49 i) " గంగాతటే ఘోషః' ఇత్యాదేః ప్రయోగాత్ యేషాం న తథా ప్రతిపత్తిః, తేషాం పావనత్వాదీనాం ధర్మాణాం తథా ప్రతిపాదనాత్మనః ప్రయోజనత్వాచ్చ - (కావ్యప్రకాశ-లక్షణా 2/9)

ii) గంగాతటే ఘోష ఇతి ప్రతిపాదనాదలభ్యస్య శీతత్వపావనత్వాతిశయస్య బోధనరూపం ప్రయోజనమ్॥ (సా ద. 2/9)

50. లావణ్యాద్యా యే శబ్దాః స్వవిషయాల్లవణరసయుక్తత్వాదేః స్వార్థాదన్యత్ర హృద్యత్వాదౌ రూఢాః॥ (లోచన- [ధ్వ. వ్యా] 1/19)

విశేషరూపార్థమున ప్రయోగింపఁబడుచున్నది[51] ఇట వ్యంగ్యార్థమేదియును లేదు కావున ప్రయోజనము లేదు. అట్లు పదప్రయోగమున హేతువు రూఢియే.

ధ్వనికారులు దీనినిట్లు సంగ్రహించి యున్నారు-

శ్లో॥ రూఢా యే విషయేఽన్యత్ర శబ్దాః స్వవిషయాదపి ।
లావణ్యాద్యాః ప్రయుక్తాస్తే న భవంతి పదం ధ్వనేః ॥

(ధ్వన్యా 1/19)

కావున లావణ్యాదిపదముల నాయా యర్థ విశేషములలో ప్రయోగించుటకు రూఢియేకాని వ్యంగ్యరూప ప్రయోజనము లేదు[52]

ఇట్లు రూఢియేకాని వ్యంగ్యరూపప్రయోజనమే కాని యున్నచో తాత్పర్యానుపపత్తిని లెక్కచేయక లాక్షణికముగా పదమును ప్రయోగింపవచ్చునని తేలినది

**లక్షణానిమిత్తము -**

ఒక పదము తన యర్థమును కాదని అన్యార్థము లక్షించుటలో నిమిత్తము వాచ్యార్థమునకు లక్ష్యార్థముతో నుండు సంబంధమే

---

51. ముక్తాఫలేషు చ్ఛాయాయా స్తరళత్వ మివాంతరా ।
ప్రతిభాతి యదంగేషు తల్లావణ్య మిహోచ్యతే ॥ (శిశు వ్యా)

52. ఆదిగ్రహణేన ఆనులోమ్యం ప్రాతికూల్యం సబ్రహ్మచారీత్యేవమాదయః శబ్దా లాక్షణికా గృహ్యంతే । న చాత్ర ప్రయోజనం కించిదుద్దిశ్య లక్షణా ప్రవృత్తేతి న తద్విషయో ధ్వననవ్యవహారః । (లోచన. 1 19)

ప్రాచీను లాసంబంధమును పంచవిధములుగాఁ బేర్కొనిరి [53]

---

53. 1) యచ్చ తన్ముఖ్యార్థాసన్నతరత్వం తత్పంచప్రకారతయా ఆచార్య భర్తృమిత్రేణ ప్రదర్శితమ్ —

"శ్లో॥ అభిధేయేన సంబంధాత్ సాదృశ్యాత్ సమవాయతః।
వైపరీత్యాత్ క్రియాయోగాల్లక్షణా పంచధా మతా॥
ఇతి శ్లోకేన/— (అభిధావృత్తిమాతృకా)

11) యశ్చసంబంధో లక్షణాయా నిమిత్తం, తం పంచవిధమాహుః, యథోక్తమ్" — అభిదేయేన సంబంధాత్" ఇత్యాది
(శబ్దవ్యాపారవిమర్శః)

111) అభినవ గుప్తపాదులు తన లోచనమున ప్రసంగవశమున సీకారిక నిట్లు వ్యాఖ్యానించిరి — [వారి వ్యాఖ్యననుసరించి కారికాపార మిట్లున్నది-

శ్లో॥ అభిదేయేన సంయోగాత్ సామీప్యాత్ సమవాయతః।
వైపరీత్యాత్ క్రియాయోగాల్లక్షణా పంచధా మతా॥]

సాచ పంచధా, తద్యథా—అభిదేయేన సంయోగాత్, ద్విరేఫ శబ్దస్యహి యోఽభిదేయో భ్రమరశబ్దః ద్వౌ రేఫౌ యస్యేతి కృత్వా తేన భ్రమర శబ్దేన యస్య సంయోగః సంబంధః షట్పదలక్షణస్యార్థస్య, సోఽర్థో ద్విరేఫశబ్దేన లక్ష్యతే। అభిదేయసంబంధం వ్యాఖ్యాతరూపం నిమిత్తీ-కృత్య । సామీప్యాత్ 'గంగాయాం ఘోషః' । సమవాయాదితి - స్వసం బంధాదిత్యర్థః । యష్టీః ప్రవేశయేతి యథా । వైపరీత్యాత్- యథా-శత్రు ముద్దిశ్య కశ్చిద్బ్రవీతి - 'కిమివోపకృతం న తేన మమః' ఇతి । క్రియా యోగాదితి - కార్యకారణభావాదిత్యర్థః । యథా-అన్నాపహారిణి వ్యవ హారః "ప్రాణానయం హరతి" ఇతి ఏవమనయా లక్షణయా పంచ విధయా విశ్వమేవ వ్యాప్తమ్। (ధ్వన్యాలోకలోచన 1/21)

"భాక్తమాహుస్తమన్యే (ధ్వన్యా 1/1) అను శ్లోకాంశ వ్యాఖ్యావసర మున ఈ కారికాపాఠమిట్లున్నది -

భక్తిర్ధర్మో ఽభిధేయేన సారూప్యాదిః। తత ఆగతో భాక్తో లాక్షణికోఽర్థః। యదాహుః — "అభిధేయేన సారూప్యాత్'

అని సంయోగస్థానమున సారూప్యశబ్దము పఠింపఁబడినది మిగిలినది సమానము —

1 సంబంధము (సామీప్యాదిసంబంధ సామాన్యము)
2 సాదృశ్యము (ఔపమ్యము)
3 సమవాయము (సాహచర్యము)
4 వైపరీత్యము (విపరీతభావము)
5 క్రియాయోగము (తత్కార్యకారిత్వము)

ఇక మహాభాష్యకారులు చతుర్విధ సంబంధములను పేర్కొనిరి-

1 తాత్స్థ్యము (స్థానము)
2 తాద్ధర్మ్యము (తత్క్రియాకార్యతము)
3 తత్సామీప్యము (సమీపవర్తిత్వము)
4 తత్సాహచర్యము (సమవేతత్వము) అనునవి—[54]

పరమలఘుమంజూషకారులు మహాభాష్యోక్తసంబంధచతుష్టయముతో పాటు తాదర్థ్యమనుదాని నధికముగా పేర్కొనెను [55]

---

54 చతుర్భిః ప్రకారైరతస్మిన్ స ఇత్యేతద్భవతి "తాత్స్థ్యాత్, తాద్ధర్మ్యాత్, తత్సామీప్యాత్ తత్సాహచర్యాత్" ఇతి। తాత్స్థ్యాత్ తావత్ మంచా హసంతి, గిరిర్దహ్యతే। తాద్ధర్మ్యాత్-జటినం యాంతం బ్రహ్మదత్త ఇత్యాహ। బ్రహ్మదత్తే యాని కార్యాణి జటన్యపి తాని క్రియంత ఇత్యతో జటీ బ్రహ్మదత్త ఇత్యుచ్యతే। తత్సామీప్యాత్—గంగాయాం ఘోషః, కూపే గర్గకులమ్। తత్సాహచర్యాత్—కుంతాన్ ప్రవేశయ, యష్టీః ప్రవేశయేతి। (వ్యా మ. భా 4 1.48)

55 సా చ లక్షణా తాత్స్థ్యాదినిమిత్తకా। తదాహ—

శ్లో॥ తాత్స్థ్యాత్తథైవ తాద్ధర్మ్యాత్తత్సామీప్యాత్ తథైవ చ।
తత్సాహచర్యాత్ తాదర్థ్యాత్, జ్ఞేయా వై లక్షణా బుధైః॥

తాత్స్థ్యాత్ మంచా-హసంతి, గ్రామః పలాయతః।
తాద్ధర్మ్యాత్-సింహో మాణవకః, గౌర్వాహీకః। తత్సామీప్యాత్—గంగాయాం ఘోషః। తత్సాహచర్యాత్ - యష్టీః ప్రవేశయ। తాదర్థ్యాత్-ఇన్ద్రార్థా స్థూణా ఇంద్రః॥ (ప. ల. మం. లక్షణావిచారః)

న్యాయసూత్రకారులచే దశవిధ సంబంధములు చెప్పబడినవి—[56]

"1 సాహచర్యము 2 స్థానము 3 తాదర్ధ్యము 4 వృత్తము (సాదృశ్యము) 5 మానము (కొలత) 6. ధారణము (ధరించుట) 7 సామీవ్యము 8 యోగము (కూడిక) 9. సాధనము (కారణము) 10 ఆధిపత్యము (స్వస్వామిభావము) అనునవి

పూర్వోక్త సంబంధములలో నేదేని యొక సంబంధమును పురస్కరించుకొనియే లక్షణ అర్థవిశేషమును బోధించును

కావున సంబంధము లక్షణా నిమిత్తమని ప్రాచీనులు పేర్కొనిరి

లక్షణలో గమనించవలసిన ముఖ్యాంశములు మూఁడు—

1. తాత్పర్యానుపపత్తి (ముఖ్యార్థబాధ)

---

56 1) "సహచరణ-స్థాన-తాదర్థ్య-వృత్త మాన-ధారణ-సామీప్య- యోగ-సాధనా - ధిపత్యేభ్యో బ్రాహ్మణ-మంచ-కట రాజ-సక్తు- చందన-గంగా శాటకాన్న-పురుషేష్వతద్భావేఽపి తదుపచారః॥'

(గౌ న్యా సూ 2.2 61)

II) ఈః సూత్రముపై వాత్స్యాయనీయన్యాయసూత్రభాష్యము — "అతద్భావేఽపి తదుపచార ఇతి। అతచ్ఛబ్దస్య తేన శబ్దేనాభిధానమితి। సహచరణాత్" - యుష్టికా భోజయేతి। యష్టికాసహచరితో బ్రాహ్మణోఽభిధీయత ఇతి। స్థానాత్-మంచాః క్రోశంతీతి మంచస్థాః పురుషా అభిధీయంతే। తాదర్థ్యాత్ కటార్థేషు వీరణేషు వ్యూహ్యమానేషు కటం కరోతీతి భవతి వృత్తాత్—యమో రాజా, కుబేరో రాజా, తద్వద్వర్తత ఇతి। మానాత్ - ఆఢకేన మితాః సక్తవః ఆఢకసక్తవ ఇతి। ధారణాత్ — తులాయాం ధృతం చందనం తులాచందనమితి। సామీప్యాత్—గంగాయాం గావశ్చరంతీతి దేశోఽభిధీయతే సన్నికృష్టః। యోగాత్-కృష్ణేన రాగేణ యుక్తః శాటకః కృష్ణ ఇత్యభిధీయతే। సాధనాత్—అన్నం ప్రాణా ఇతి। ఆధిపత్యాత్—అయం పురుషః కులం, అయం గోత్రమితి॥"

2. సంబంధము (సామీప్యాదులు)

3 రూఢి లేదా ప్రయోజనము, అనునవి

వీనినే లక్షణాప్రయోజకములందురు [57]

**లక్షణాద్వైవిధ్యము –**

రూఢిచే నిరూఢ (రూఢిలక్షణ)యనియు ప్రయోజనముచే ప్రయోజనవతి (ప్రయోజనలక్షణ)యనియు రెండు విధములుగా లక్షణను విభజించిరి [58]

**నిరూఢలక్షణ –**

ఉదా "కర్మణి కుశలః (పనిలో కుశలుఁడు)

'కుశల'పదమునకు కుశలను గ్రహించువాఁడని యర్థము [59] ఇది ప్రకృతమున ననుపయుక్తము కావున-ఉపయుక్తగ్రహణ-అనుపయుక్తపరిత్యాగ

---

57 1) "ముఖ్యార్థబాధః సంబంధః ప్రసిద్ధి (రూఢి) ప్రయోజనయోరన్యతరచ్చ లక్షణాప్రయోజకానీత్యర్థః। (సా. ర లక్షణా)

11) "సా(లక్షణా) ముఖ్యార్థస్య ప్రమాణాంతరబాధితత్వేనాసంభవాత్ లక్ష్యమాణస్య చార్థస్య ముఖ్యార్థం ప్రత్యాసన్నత్వాత్ సాంతరార్థగ్రహణస్య చ స్వప్రయోజనత్వాదిత్యేవంవిధకారణసామిగ్రీసమాశ్రయణేన వృద్ధవ్యవహారే పరిదృశ్యతే॥" (అభిధావృత్తిమాతృకా–కారికా 9)

8 1) "ఇయం తావద్ద్వివిధా–నిరూఢా, ప్రయోజనవతీచ।" (రసగం ద్వితీ లక్షణా)

11) "అత్ర రూఢితో వా ప్రయోజనాత్" ఇత్యేతల్లక్షణావిభాగపరమ్। (సా ర 3/2)

59 'కుశం లాతి' ఇతి వ్యుత్పత్తిలభ్యః 'కుశగ్రాహి'రూపో ముఖ్యోఽర్థః ప్రకృతే అసంభవన్ వివేచకత్వాది సాధర్మ్యసంబంధసంబంధినం దక్షరూపార్థం బోధయతి।" (సా ద. 2/9)

రూప వివేచకత్వాది[60]-సాదృశ్యమున నేర్పరి యనునర్థము లక్షితమైనది ఇట రూఢియే తప్ప ప్రయోజనము లేదు.

నీలాది గుణవాచకపదములును నిరూఢలక్షణోదాహరణములు-ఎట్లన

[61]'నీలో ఘటః' అనునప్పుడు "నీలగుణము ఘటము" అనునర్థము కుదరదు కావున గుణ విశిష్టమనునర్థము లక్షణచేఁ దెలియఁదగినది ఇచ్చటను అనాదిప్రయోగప్రవాహరూపమగు రూఢియే కాని ప్రయోజన మేదియును లేదు ఇట సమవాయ సంబంధము[62]—

గౌణి శుద్ధ యను వ్యవహారము —

సాదృశ్య సంబంధముచే గౌణియనియు తదితరసంబంధముచే శుద్ధ యనియును లక్షణను వ్యవహరింతురు[63]

---

60 వివేచకత్వంచ సతో గ్రహణమసతః పరిత్యాగరూపమ్ ।
తచ్చ కుశగ్రాహిణి చతురేచాస్తి॥

[నాగేశ్వరీ (కావ్యప్రకాశవ్యాఖ్య) 2/9]

61. నీలాదిపదానాం లాఘవాద్గుణగతజాతేరేవ శక్యతావచ్ఛేదకతయా గుణ ద్రవ్యయోః 'నీలో ఘటః' ఇత్యాదౌ సామానాధికరణ్యేనాన్వయస్యాను పపత్తేః సమవాయాత్మనా గుణరూప శక్యస్య సంబంధేన నీలాదిగుణై ర్గుణినో లక్ష్యంతే। (రసగం లక్షణా)

62 సమవాయమన నిత్యసంబంధము 'గుణగుణినోః సమవాయః అని తార్కిక సమయము.

63. "భేదావిమౌ చ సాదృశ్యాత్ సంబంధాంతరతస్తథా।
గౌణీశుద్ధౌ చ విజ్ఞేయౌ" (కా. ప్ర. 2/12)

కావున కుశలాదిపదములు గౌణనిరూఢలక్షణకు నీలాదిపదములు శుద్ధ నిరూఢలక్షణకు ఉదాహరణములగును కాన నిరూఢలక్షణయు గౌణీత్వ శుద్ధాత్వములచే ద్వివిధ మనియందురు 64

**రూఢిలక్షణా ప్రయోజనము కాదా ?**

కుశలాది65 పదము లనాదిప్రయోగప్రవాహవశమున పంకజాది పదములవలె ఆయా యర్థవిశేషమున రూఢములైయున్నవి వ్యుత్పత్తిలభ్యమగు కుశగ్రాహిత్వాదిరూపార్థము ప్రవృత్తినిమిత్తము కాదుగదా– అది ముఖ్యార్థమెట్లగును కావున లక్షణాబీజమగు ముఖ్యార్థబాధయే లేదు ఇంక లక్షణయెట్లు? కావున రూఢిలక్షణా ప్రయోజకము కాదని కుమారిలభట్ట-ఆచార్య హేమచంద్రాదు లభిప్రాయపడిరి 66

---

64 తత్రాద్యవర్గే సాదృశ్య సంబంధేన ద్వితీయవర్గే చ తదితరసంబంధేన లక్షణాయాః ప్రవృత్తేర్నిరూఢాయామపి గౌణీత్వశుద్ధత్వాభ్యాం ద్వైవిధ్యమామనంతి (రసగం ద్వితీ లక్షణా)

65 తదన్యే న మన్యంతే– 'కుశగ్రాహి' రూపార్థస్య వ్యుత్పత్తిలభ్యత్వే ఽపి దక్షరూపస్యైవ ముఖ్యార్థత్వాత్। అన్యద్ధి శబ్దానాం వ్యుత్పత్తి-నిమిత్తమన్యచ్చ ప్రవృత్తి నిమిత్తమ్। వ్యుత్పత్తిలభ్యస్య ముఖ్యార్థత్వే 'గౌః శేతే' ఇత్యత్రాపి లక్షణా స్యాత్ గమేర్డోః (ఉ సూ 2/69) ఇతి 'గమ్' ధాతోర్డో ప్రత్యయేన వ్యుత్పాదితస్య గో శబ్దస్య శయనకాలేఽపి ప్రయోగాత్ (సా ద 2/9)

66 1) నిరూఢా లక్షణాః కాశ్చిత్ సామర్థ్యాదభిధానవత్।
క్రియంతే సాంప్రతం కాశ్చిత్ కాశ్చిన్నైవ త్వశక్తితః।
(తంత్రవార్తికం 3/1/8)

ii) "కుశల ద్విరేఫ ద్విరదాదయస్తు సాక్షాత్సంకేతవిషయత్వాత్, ముఖ్యా ఏవేతి న రూఢిర్లక్ష్యార్థస్య హేయత్వే నాస్మాభిరుక్తా ॥
(కావ్యానుశాసనమ్ లక్షణా)

iii) 'రూఢిర్లక్షణా త్వభిధాతుల్యైవ తేనాత్ర నోదాహ్రియతే"
(అలం మహో. ద్వితే పుట 33)

అయినను ఇట గమనించవలసిన విషయమేమన- కుశలాది పదములు కుశగ్రాహిత్వ రూపార్థమున మొదట ప్రయుక్తములై కాలక్రమమున వివేచకత్వాది సాదృశ్యమును పురస్కరించుకొని దక్షత్వాద్యర్థమున స్థిరపడినవి ఇదియే, ధ్వనికారులు తదనుయాయులగు మమ్మటాదులును కుశలాదిపదవిషయమున నిరూఢలక్షణయని చెప్పుటలో హేతువుగా కానవచ్చుచున్నది

కావున రూఢియు లక్షణా ప్రయోజకమే.

గౌణియనియు శుద్ధయనియు పరిగణించుట ప్రయోజనములోనే కాని రూఢిలో అంతగా ప్రసిద్ధము కాదు కావున నిరుపపదముగా గౌణియనియు శుద్ధయనియు వ్యవహరించిన ప్రయోజనవతి యగునే కాని నిరూఢ కాదు

ఈ గౌణినే గౌణవృత్తియని మీమాంసకులు వ్యవహరింతురు

**గౌణవృత్తి –**

ఉదా 'మాణవకుఁడగ్ని' ("అగ్నిర్మాణవకః )

67అగ్నిగతపైంగళ్యది గుణయోగముచే మాణవకుఁడగ్నియని వ్యవహారము అగ్నిపదమునకగ్నిసదృశుఁడని లక్ష్యార్థము

**గౌణవృత్తి లక్షణలో నంతర్భవించదా ?**

గౌణవృత్తి లక్షణలో నొక భేదమే కాని మీమాంసకులన్నట్లు తదన్యము కాదు 68

---

67 తథాచోక్తమ్-
అగ్నిత్వలక్షితాదర్థాద్ యత్పైంగళ్యాది గృహ్యతే।
తేన మాణవకే బుద్ధిః సాదృశ్యాదుపజాయతే॥
(సా ర తృతీ భాట్టమతఖండన)

68 ఏతేన లక్షణాయాః పృథగ్భూతా గౌణీవృత్తిరితి తాంత్రికసమయః పరాస్తో వేదితవ్యః। (సా ర. తృతీ లక్షణా)

లక్షణకుండవలసిన ముఖ్యాంశములు మూఁడు — సంబంధానుపపత్తి-ప్రయోజనములు, ఇచ్చటను ఉన్నవి కదా '

1) మాణవకుఁడగ్నియగునా ? కాడు కావున అగ్నిశబ్దప్రయోగము అనుపపన్నము ఇట్లు ముఖ్యార్థబాధ

2) అగ్నిగతపైంగళ్యాది గుణరూప సాదృశ్యము సంబంధము

3) తాద్రూప్య ప్రతిపత్తి ప్రయోజనము[69]

కావున నిది లక్షణలోనే యంతర్భవించునని యాలంకారికు లభిప్రాయపడిరి [70]

గౌణసారోపః-

ఇట 'మాణవకుఁడగ్ని' యని పృథఙ్నిర్దిష్ట పదములచే నభేదము చెప్పఁబడినది కాన దీనిని గౌణసారోపయందురు సారోప యన ఆరోపముతో కూడినది

ఆరోపము —

ఆరోపమనగా విడివిడిగా (స్వస్వవాచక పదములచే) నిర్దేశింపఁబడిన విషయము (మాణవకుఁడు) విషయి (అగ్ని) యనువానికభేదము చెప్పుట [71]

---

69 'తాద్రూప్య ప్రతిపత్తిః ప్రయోజనమ్' (సా ర తృ లక్షణా)

70 'గౌణవృత్తి రపి లక్షణా ప్రభేద ఏవ, సంబంధానుపపత్తిమూలకత్వాత్; యథా 'అగ్నిర్మాణవక' ఇత్యత్ర అగ్నిసాదృశ్యవిశిష్టతీరప్రతిపత్తి ర్వివక్షితా, తథా 'గంగాయాం ఘోషః' ఇత్యత్ర గంగాసంబంధ విశిష్టతీరప్రతిపత్తి ర్వివక్షితా" (ప్ర ప కావ్య లక్షణా)

71. "విషయ విషయిణోః పృథఙ్నిర్దిష్టయో రభేద ఆరోపః" (రసగం. ద్వి. లక్షణా)

**గౌణసారోప రూపకాలంకారమునకు మూలము -**

ఇది రూపకాలంకారమునకు మూలము

ఉదా. శ్లో॥ సువిమలమౌక్తిక తారే ।
ధవళాంశుక చంద్రికా చమత్కారే ।।
వదన పరిపూర్ణచంద్రే ।
సుందరి । రాకాసి నాత్ర సందేహః ॥
(రసగం ద్వి రూపక.)

ఇది రసగంగాధరకారుల రూపకోదాహరణము [72]

(సువిమల మౌక్తికములు తారలై యొప్పఁగా తెల్లనికోక వెన్నెల కాంతుల వెదచల్లఁగా ముఖము పూర్ణసుధాకరుఁడై వెలుఁగఁగా నో సుందరీ ! నీవు నిజముగా పున్నమరాత్రివే)

ఇట 'నీవు పున్నమరాత్రివి, అని చెప్పుటచే కలిగిన వాచ్యార్థానుపపత్తి రాకాసాదృశ్యవిశిష్టయను లక్ష్యార్థముచే పరిహరింపఁబడినది తాదూప్య ప్రతిపత్తి ప్రయోజనము

**గౌణసాధ్యవసాన -**

అధ్యవసానముతో కూడినది సాధ్యవసానయగును

**అధ్యవసానమనగా -**

విడిగా (స్వవాచకపదముచే) నిర్దేశింపఁబడకయున్న విషయమునకు విషయితో నభేదము చెప్పుట. [73]

---

72 "అత్ర సుందర్యాం విషయభూతాయాం రాకాతాదాత్మ్యావగమాత్ స్ఫుటమేవ తావద్రూపకమ్॥" (రసగం ద్వి. రూపకం)

73 అపృథగ్నిర్దిష్టే విషయే విషయ్యభేదో ఒధ్యవసానమ్ । (రసగం ద్వి. లక్షణ)

ఉదా - శ్లో॥ కాకతీయకులాంభోధేః ప్రభవత్యేష చంద్రమాః।
కృతః కువలయోల్లాసో యేనోదయముపేయుషా॥
(ప్ర రు 2/11)

(తాను పుట్టినంతనే కువయోల్లాసము[74] కలుగఁజేసిన ఈ చంద్రుడు (ప్రతాపరుద్రుఁడు) కాకతీయకుల మను సముద్రమునుండి ఉదయించినాఁడు)

ఇట ప్రతాపరుద్రుని 'ఈ చంద్రుడు' అని నిర్దేశించుటచే వాచ్యార్థానుపపత్తి. ప్రతాపరుద్రవాచకపదాంతరము లేకయే 'ఈ చంద్రుఁడు' (ఏష చంద్రమాః) అని చంద్రాభేదము చెప్పుటచే అధ్యవసానము ఇది సాదృశ్య మూలకమగుటచే గౌణియును

విషయివిషయములకు లేశమైనను భేదము కానరాకుండునట్లు అభేద ప్రతిపత్తి ప్రయోజనము [75]

ఇచ్చట రూపకాతిశయోక్తియను నలంకారము [76]

**గౌణసాధ్యవసాన రూపకాతిశయోక్తికి మూలము:-**

కావున నిది రూపకాతిశయోక్త్యలంకారమునకు మూలమగుచున్నది[77]

విషయనిగరణపూర్వకాభేదాధ్యవసానమే ఆ యలంకార స్వరూపము [78]

---

74. కువలయ మన భూమండలము, కలువయనియు నర్థము

75 గౌణభేదయోర్భేదేఽపి తాద్రూప్యప్రతీతిః సర్వథైవాభేదావగమశ్చ ప్రయోజనమ్ (కా ప్ర 2/12)

76 "అధ్యవసితప్రాధాన్యే త్వతిశయోక్తిః" (అలం స సూ 23)

77 'ఇయమతిశయోక్తేర్బీజమ్ ।' (సా ర. తృ లక్షణా)

78 "రూపకాతిశయోక్తిః స్యాన్నిగర్యాధ్యవసానతః" (చంద్రాలోకః శ్లో 36)

శుద్ధయందును ఆరోపాధ్యవసానములు :-

ఈ యారోపాధ్యవసానములు సాదృశ్యేతర కార్యకారణభావాది సంబంధ మూలకములు కూడ నగును కావున గౌణియందువలె 'శుద్ధ" యందును ఆరోపాధ్యవసానములచే రెండు భేదములేర్పడును

శుద్ధసారోప:-

ఉదా ఘృతమాయువు (ఆయుర్ఘృతమ్)

'ఘృతమాయు'వని చెప్పుటచే వాచ్యార్థానుపపత్తి 'ఆయు''వను పదమునకు కార్యకారణభావసంబంధముచే ఆయుష్కారకమని లక్ష్యార్థము అన్యముల కంటె విలక్షణముగా ఆయుష్కారియని చెప్పుట ప్రయోజనము

శుద్ధసారోప హేత్వలంకారమునకు మూలము :-

ఇది హేత్వలంకారమునకు మూలము కార్యకారణభావసంబంధముచే నభేదారోపమే హేత్వలంకారము [79]

ఉదా: "శ్లో॥ నేత్రానందేన చంద్రేణ మాహేన్ద్రీ దిగలంకృతా"

ఇట "చంద్రుఁడు నేత్రానంద"మని కార్యకారణభావ సంబంధ మూలకమగు నభేదారోపము కాన హేత్వలంకారము

చంద్రుఁడు కన్నులకానందము కలుగఁజేయువాఁడే కాని కన్నుల కానందము కాడుకదా కావున శుద్ధసారోప లక్షణ

కార్యకారణభావసంబంధ మూలకమగు నారోపముకూడ రూపకాలంకారమని కొందఱు.

---

79. 'హేతుహేతుమతోరైక్యం హేతుం కేచిత్ ప్రచక్షతే'

(చంద్రా. శ్లో. 169)

వారీగౌణశుద్ధసారోపలక్షణలు రెండును రూపకాలంకారమునకు మూలమని చెప్పుదురు [80]

సూక్ష్మముగా పరిశీలించినచో సాదృశ్యమూలకారోపమే రూపకము[81]. కార్యకారణభావసంబంధమూలకారోపము కాదు విచ్ఛిత్తివిశేషముండుటచే రుద్రటాదు లలంకారాంతరము (హేత్వలంకారము)గా పరిగణించిరి [82]

కావున శుద్ధసారోప హేత్వలంకారమునకు మూలమనుటయే లెస్స

కార్యకారణభావసంబంధమే కాక తాదర్థ్యము మున్నగు మఱి నాలుగు సంబంధములనిట లాక్షణికులుదాహరించి యున్నారు.

---

80 i) ఇయం ద్వివిధాఽపి రూపకాదేర్బీజమ్। 'ముఖం చంద్రః', 'నేత్రానందశ్చంద్రః' ఇతి చోభయమూలత్వేనాపి రూపకస్యోక్తితేః॥
(సా. ర త్న లక్షణా)

ii) కేషాంచిదపి సంబంధాంతరహేతురప్యారోపో రూపకాంగమేవేతి మతమ్। యిదాహాలంకారభాష్యకారః — లక్షణాపరమార్థం యావతా రూపకస్వరూపమిత్యువక్రమ్య 'సారోపాఽన్యాచ సాదృశ్యాద్వా సంబంధాద్వా' ఇత్యాది.
[విమర్శినీ (అలం స. వ్యాఖ్య) రూపక ]

81 i) 'ఉపమైవ తిరోభూతభేదా రూపకముచ్యతే' (కావ్యాదర్శః)

ii) తద్రూపకమభేదో య ఉపమానోపమేయయోః॥'
(కావ్యప్రకాశః)

iii) 'సాదృశ్యమూలకమేవ చ తాదాత్మ్యం రూపకమామనంతి"
(ర గం. రూపక )

82 హేతుమతా సహ హేతోరభిధానమభేదకృద్భవేద్యది।
సోఽలంకారో హేతుః స్యాదన్యేభ్యః పృథగ్భూతః॥
(రుద్ర 7/82)

1. తాదర్థ్యము

ఉదా - "ఇంద్రార్థా స్థూణా ఇంద్రః"

ఇష్టప్రదత్వరూప ప్రయోజనము నాశించి ఇంద్రార్థమగు స్థూణనింద్రుఁడని వ్యవహరించుట

*ఇట్లే అన్నము వండుచున్నాఁడు చాప నేయుచున్నాఁడు మున్నగు నవియు ఇట ఉదాహరింపవచ్చును

2 స్వస్వామిభావము -

ఉదా "రాజకీయః పురుషో రాజా"

రాజకీయాధికారిని అనుల్లంఘనీయాజ్ఞత్వరూపప్రయోజనముచే రాజని వ్యవహరించుట.

3 అవయవావయవిభావము :-

ఉదా "అగ్రహస్త ఇత్యగ్రమాత్రేఽవయవే హస్తః"

బలాధిక్యప్రయోజనము నాశించి హస్తాగ్రమును హస్తమని పేర్కొనుట

4. తాత్కర్మ్యము :

ఉదా "అతక్షా తక్షా"

పనిలో నైపుణ్యమును తెలయఁజేయుటకై వడ్లవాఁడు కాకున్నను వడ్లవాఁడని వ్యవహరించుట

మహాభాష్యకార - గౌతమ - ప్రాచీనాలంకారికోదాహృత — సాదృశ్యేతర సంబంధములన్నియు ఈ లక్షణములోనే సమన్వయము నొందును.

శుద్ధసాధ్యవసానః—

ఉదా:- "ఆయురేవేదమ్"

---

* తాదర్థ్యాత్-కటార్థేషు వీరణేషు వ్యూహ్యమానేషు కటం కరోతీతి భవతి. (న్యా. సూ. భా 2/2/61)

ఘృతమును నిర్దేశించుచు 'ఆయువిది' యని వ్యవహరించుట

నిశ్చితరూపమున కార్యకారిత్వరూప ప్రయోజనము నాశించి ఘృతమున ఆయుష్ట్వాధ్యవసానము చేయఁబడినది

ఇట్లితర సంబంధములచేతను ఉదాహరింపవచ్చును

**శుద్ధలక్షణయందే స్వార్థ పరిత్యాగాపరార్థ గ్రహణములు —**

ఇట్లీ శుద్ధలక్షణ ఆరోపాధ్యవసానములచే రెండువిధములే కాక హానోపాదాన (స్వార్థత్యాగాపరార్థగ్రహణ) ములచేతను మఱి రెండు భేదములనొందుచున్నది [83]

వీనినే జహత్స్వార్థ, అజహత్స్వార్థయని యందురు

**జహత్స్వార్థ :—**

జహత్స్వార్థయన స్వార్థమును త్యజించునది. దీనినే లక్షణలక్షణ యనియు జహల్లక్షణయనియును వ్యవహరింతురు

ఉదా "గంగలో గొల్లపల్లె (గంగాయాం ఘోషః)

ఇట "గంగ"యను పదము ప్రవాహరూప స్వార్థమును పరిత్యజించి స్వసమీపతరవర్తియగు తటరూపార్థాంతరమును లక్షించుచున్నది.

సామీప్యము సంబంధము- శీతత్వపావనత్వాదులు ప్రయోజనము

ఇట్లే—

తాద్స్థ్య (స్థాన) సంబంధమునకు —

"ఇల్లు గొల్లున నేడ్చెన్", "రాముని వెంట నయోధ్యయు నరిగెను" "మంచెలు మ్రోసె", మున్నగునవి ఉదాహరణములు

---

83 స్వసిద్ధయే పరాక్షేపః పరార్థం స్వసమర్పణమ్।
ఉపాదానం లక్షణం చేత్యుక్తా శుద్ధైవ సా ద్విధా॥ (కా. ప్ర 2/10)

జహత్స్వార్థ యప్రస్తుత ప్రశంసాలంకారమునకు మూలమా ?

శ్లో॥ అన్తశ్ఛిద్రాణి భూయాంసి కంటకా బహవో బహిః।
కథం కమలనాలస్య మా భూవన్ భంగురా గుణాః॥
(అలం స / కువలయా. అప్రస్తుత)

"లోపల ఛిద్రములు వెలుపల కంటకములు, ఇఁక తామర తూఁడు లోని గుణము (తంతువు)లెట్లు భంగురములు కాక యుండు" నను వాచ్యార్థము వెలుపల ఖలులు రంధ్రాన్వేషణపరులై యుండఁగా స్వభ్రాతృ పుత్రాదులతో నంతఃకలహము చేయుచున్న ప్రస్తుత పురుష వృత్తాంతమున పర్యవసించు చున్నది.[84]

ఇది అప్రస్తుత ప్రశంసాలంకారము [85]

[86]ఇట కంటకములు బిసతంతువులను భంగురములనుగా నొనర్చుటకు తగియున్నను ఛిద్రములు తగినవి కావుగదా! కావున వాచ్యార్థ మనుపపన్న మగుచు సారూప్యసంబంధముచే ప్రస్తుత పురుష వృత్తాంతము నాక్షేపించు చున్నది

---

84. "అత్ర కమలనాలవృత్తాంతకీర్తనం తత్సరూపే బహిః ఖలేషు జాగ్రత్సు భాతృపుత్రాదిభిరంతఃకలహం కుర్వాణే పురుషే పర్యవస్యతి"
(కువలయానంద-అప్రస్తుత)

85 "అప్రస్తుత ప్రశంసా స్యాత్ సా యత్ర ప్రస్తుతాశ్రయా"
(చంద్రా. శ్లో 66)

86. అత్ర వాచ్యేఽర్థే కంటకానాం భంగురీకరణే హేతుత్వం సంభవి, ఛిద్రాణాం త్వసంభవీత్యుభయరూపమ్ (అలం స. అప్రస్తుత)

ఇట్లప్రస్తుత ప్రశంసాలంకారమునకు జహత్స్వార్థ మూలమని కొందఱాలంకారికులు పేర్కొనిరి [87]

కాని [88]అప్రస్తుత ప్రశంసలో అప్రస్తుతము వాచ్యము ప్రస్తుతము

---

87 i) సూ - "అప్రస్తుతాదన్యప్రతీతి రప్రస్తుత ప్రశంసా" ఇయం చాసంబంధప్రలాపితా ప్రసంగేన అప్రస్తుతస్యాభిధాతుమయుక్తత్వాత్ బాధితముఖ్యార్థతయా సామాన్యవిశేషభావ-కార్యకారణత్వ-సాదృశ్య-విరోధాదికే సంబంధే చారూఢ ప్రతీత్యాది లక్షణే ప్రయోజనే చ సతి ప్రస్తుతమర్థం ప్రతిపాదయన్తీ లక్షణామూలైవ యుక్తా। న తు వ్యంజనాత్మికా। వాచ్యస్యాబాధితత్వేన పర్యవసితత్వే వ్యంజనస్య సంభవాత్॥ (అలంకారరత్నాకర సూ 38)

ii) "స్వసిద్ధయే పరాక్షేపః పరార్థం స్వసమర్పణం। ఉపాదానం లక్షణంచ' ఇత్యుక్త్యా లక్షణాద్వయాశ్రితత్వాదనయోః (పర్యాయోక్తాప్రస్తుతప్రశంసయోః) అవాంతరోఽపి విషయభేదోఽస్తి॥
(అలం స విమర్శినీ అప్రస్తుత)

iii) ఇయ మప్రస్తుతప్రశంసాదేరలంకారస్య మూలమ్। సామాన్య విశేష కార్యకారణ రూపాణామన్యతమస్య కథనాత్ తేషామేవాన్యతమస్య ప్రతియోగినః ప్రస్తుతస్య గమ్యత్వే హ్యప్రస్తుత ప్రశంసా। తత్ర-అప్రస్తుతస్యాప్రస్తుతత్వాదేవ కథనమనుపపన్నం సత్ స్వార్థత్యాగేన ప్రస్తుతమాక్షిపతీతి యుక్తమస్యా జహల్లక్షణామూలకత్వమ్॥ (సా ర త్న లక్షణా)

88 i) 'కించ—అప్రస్తుత ప్రశంసాయాం ప్రస్తుతం వ్యంగ్యమితి నిర్వివాదమ్॥' (రస. గం అప్రస్తుత)

ii) అప్రస్తుతప్రశంసాయాం ప్రస్తుతే న లక్షణా కింతు వ్యంజనైవేతి సర్వసమ్మతమ్. (రసగం. ద్వి. పర్యాయోక్త)

వ్యంగ్యమే కాని లక్ష్యార్థము కాదు "[89]అన్తశ్ఛిద్రాణి" మున్నగు కొన్ని యుదాహరణములలోనే తప్ప వాచ్యార్థానుపపత్తి పరిహారమునకై పరార్థాక్షేప మనునది సర్వత్ర లేదు ఆ కొన్నింటను నొకవేళ లక్షణ నంగీకరించినను నది గౌణసాధ్యవసానయగును ఇంక రూపకాతిశయోక్తికిని దీనికిని భేదమేమి? లక్షణలో లక్ష్యార్థము వాచ్యార్థానుపపత్తిని తొలగించును పూర్వోదాహరణమునన్నట్లు కాననగుట లేదు కావుననే అప్రస్తుతప్రశంసాలంకారమున వాచ్యార్థ వ్యంగ్యార్థములు తటస్థములై యుండునని యాలంకారిక సమయము [90]

ఇట్లు ప్రస్తుతము వ్యంగ్యమే యగును కాన లక్షణ లేదు

కావున జహల్లక్షణ యప్రస్తుత ప్రశంసాలంకారమునకు మూలము కాదు.

**జహత్స్వార్థ అత్యంత తిరస్కృత వాచ్యధ్వనికి మూలము -**

కాని అత్యంత తిరస్కృత వాచ్యధ్వనికి మూలమగుచున్నది

తదుదాహరణము ధ్వన్యాలోకమునుండి[91]_

---

89 కించాత్రోదాహరణే 'అంతశ్ఛిద్రాణీ' త్యాదౌ వా యది లక్షణా తదా శుద్ధా గౌణీ వా ? నాద్యా ! తస్యాః సాదృశ్యేతరసంబంధమూలత్వాత్ । యది ద్వితీయా, సాఽపి సారోపా సాధ్యవసానా వా? నాద్యా, విషయస్య నిగీర్ణత్వాత్ । ద్వితీయా చేత్ అతిశయోక్తిరస్తు, కిమలంకారాంతర కల్పనయా ? కథం వా పదమాత్రాన్వయబోధహేతుకాయాః వాక్యబోధే ప్రవేశః॥". యది చాంతశ్ఛిద్రాణీత్యాదౌ లక్షణా, తత్ర ముఖ్యార్థబాధే వాక్యార్థాన్వయోపపాదకం కిం నామ లక్ష్యతే ? కుటుంబే దుశ్చరితాసీతిరూపొఽర్థశ్చేత్, తస్యాపి న కమలనాలభంగురీకరణ మపాస్తమ్॥ [విజ్ఞప్రియా. (సా ద వ్యాఖ్య) 10/77]

90 వాచ్యార్థతాటస్థ్యేనైవ వ్యంగ్యార్థ ప్రతీతేః సర్వసహృదయసమ్మతత్వాత్. (రసగం ద్వి. అప్రస్తుతప్రశంసా )

91. "అత్యంత తిరస్కృత వాచ్యో యథాఽఽదికవేర్వాల్మీకేః—
"రవి సంక్రాంత సౌభాగ్యస్తుషారావృతమండలః ।
నిశ్వాసాంధ ఇవాదర్శశ్చంద్రమా న ప్రకాశతే"॥ అని పూర్తిపాఠము.

"నిశ్వాసాంధ ఇవాదర్శశ్చంద్రమా న ప్రకాశతే"। ఇతి అత్రాంధ శబ్దః
(ధ్వన్యా ద్వితీ కారిక. 1)

ఇట 'అంధ' శబ్దమునకు ఉపహత దృష్టికత్వరూప స్వార్థము ఆదర్శ మున బాధితము కాఁగా పదార్థస్ఫుటీకరణాశక్తత్వ మను నర్థము లక్షణచే బోధింపఁబడుచున్నది అసాధారణవిచ్ఛాయత్వానుపయోగిత్వాదులు వ్యంగ్యములు[92]

**విపరీతలక్షణ -**

ఈ జహత్స్వార్థయే స్వాభిధేయవిపరీతార్థమును లక్షించిన విపరీత లక్షణయగును[93]

ఉదాహరణము సాహిత్యదర్పణమునుండి-

శ్లో॥ ఉపకృతం బహు తత్ర కిముచ్యతే
సుజనతా ప్రథితా భవతా పరమ్।
విదధదీదృశమేవ సదా సఖే!
సుఖిత మాస్స్వ తతః శరదాం శతమ్॥ (సా ద 2/11)/(కావ్య 4.24)

[94]విషకుంభపయోముఖుఁడగు మిత్రునితో- "నీ యుపకారము చెప్పనలవి

---

92 అంధశబ్దోఽత్ర పదార్థ స్ఫుటీకరణాశక్తత్వం నష్టదృష్టిగతం నిమిత్తీకృత్య ఆదర్శే లక్షణయా ప్రతిపాదయతి అసాధారణ విచ్ఛాయత్వానుపయోగిత్వాది ధర్మజాత మసంఖ్యం ప్రయోజనం వ్యనక్తి॥
(ధ్వన్యాలోకలోచన. 1/1)

93 యదా పునః స్వాభిధేయవిపరీతమర్థం లక్షయతి తదా సా జహత్స్వార్థైవ విపరీతలక్షణేత్యుచ్యతే। (సా ర. తృతీ లక్షణా)

94. మమ్మటుఁడు తన 'శబ్దవ్యాపార విచార'మను గ్రంథమున నిదే శ్లోకము నుదాహరించి ఇట్లు వ్యాఖ్యానించెను-
"బహుభిరపకారైః తప్యమానస్య కస్యచిదుక్తి రియం। అతో వక్తృ మహిమ్నా మూర్ఖే 'బృహస్పతి' శబ్దేన మూర్ఖత్వమివ-అపకారిణి దుర్జనత్వాద్యత్ర లక్ష్యతే- (శ. వ్యా. వి. కారిక 4)

కానిది నీవెంతయో సౌజన్యము కనఁబఱచినావు ఇట్లే చేయుచు నూరు వత్స రములు మనుము" అని పలికిన పలుకులలో నిజమున కతఁడట్టివాఁడు కాఁడు కావున స్వార్థము కదర్థితము కాఁగా, తద్విరుద్ధములగు అపకార దౌర్జన్యాదులు ఉపకారాది పదములచే లక్షింపఁబడుచున్నవి అపకారాతిశయము వ్యంగ్యము.

దీని నత్యంత తిరస్కృత వాచ్యధ్వనియందురు [95]

ఇట స్తుతి నిందాపర్యవసాయి యగుటచే వ్యాజస్తుతియను నలంకారము

**విపరీతలక్షణ వ్యాజస్తుత్యలంకారమునకు మూలము -**

కావున ఈ విపరీతలక్షణ వ్యాజస్తుతికి మూలమని యందురు [96]

**లక్షితలక్షణ -**

పరంపరా సంబంధము నిమిత్తమగునేని దీనినే లక్షిత లక్షణయందురు [97]

ఉదా - "ద్విరేఫము

ద్విరేఫపదము రేఫద్వయ ఘటితమగు భ్రమరపదమును లక్షించి తద్వారా అనగా భ్రమరపదమున కభిదేయము తుమ్మెద కావున తుమ్మెదయను నర్థ

---

95 క్వచిదనుపపద్యమానతయా అత్యంతం తిరస్కృతం యథా - 'ఉప కృతం' (కావ్య 4-24) ఏతదపకారిణం ప్రతి విపరీతలక్షణయా కశ్చిద్ వదతి। (కావ్యప్రకాశ చతుర్థ 24)

96. 1) ఇయంతు వ్యాజస్తుతేర్బీజమ్। 'యత్ర వాచ్యయా నిందయా స్తుతిః స్తుత్యా వా నిందా గమ్యతే' సా హి వ్యాజస్తుతిః, తత్ర విపరీతార్థ ప్రతిపత్తిర్విరుద్ధలక్షణామూలైవ॥ (సా. ర. తృ లక్షణా.)

11) సూ॰ "స్తుతి నిందాఖ్యాం వ్యాజస్తుతిః'
అన్యప్రతీతి రి త్యనుషంగః। ఏషాఽపి లక్షణామూలైవ। తేనాత్ర నిందాస్తుత్యోర్లక్ష్యత్వేన న పునర్వ్యంగ్యతయా గమ్యత్వమ్। వక్తృ ప్రకరణాదిపర్యాలోచనేన అముఖ ఏవ వాచ్యబాధాత్॥"
(అలం ర. వ్యాజస్తుతి )

97. యత్ర తు శక్యార్థస్య పరంపరాసంబంధరూపా లక్షణా సా లక్షిత లక్షణే త్యుచ్యతే। యథా ద్విరేఫాదిపదే। (ముక్తా శబ్ద.)

మును స్వబోధ్యపదవాచ్యత్వరూపపరంపరాసంబంధముచే లక్షించుచున్నది నైయ్యాయికులు మాత్రము దీనిని పేర్కొనిరి

[98] ప్రాచీనాలంకారికులు "అభిధేయేన సంబంధాత్" అను సంబంధపంచకమును వివరించుచు-

"ద్విరేఫ" పదమున కభిధేయము భ్రమరరూప పదము, దానికి సంబంధించినది 'తుమ్మెద'యను నర్థము, కావున (గంగాపదము స్వాభిధేయప్రవాహ సంబంధియగు తటమునువలె) 'ద్విరేఫ' పదము స్వాభిధేయ సంబంధియగు తుమ్మెదను లక్షించుచున్నదని నుడివిరి కావున విశేషము లేకుండుటచే అనంతరలాక్షణికు లీ లక్షితలక్షణను పేర్కొన లేదు

వైయ్యాకరణమతానుసారము ఆచార్య హేమచంద్రుఁడు ద్విరేఫపదము రూఢిశక్తిచేతనే షట్పదరూపార్థబోధకమనియనెను [99]

---

98. 1) సాచ పంచధా। తద్యథా_అభిధేయేన సంయోగాత్- ద్విరేఫశబ్దస్య హి యోఽభిధేయో భ్రమరశబ్దః ద్వౌరేఫౌ యస్యేతి కృత్వా తేన భ్రమరశబ్దేన యస్య సంయోగః సంబంధః షట్పదలక్షణస్యార్థస్య సోఽర్థో ద్విరేఫ శబ్దేన లక్ష్యతే, అభిధేయ సంబంధం వ్యాఖ్యాత రూపం నిమిత్తీకృత్య। (ధ్వన్యా లోచన 1/21)

ii) "తత్ర ద్విరేఫశబ్దస్య భ్రమరాదిః శబ్దోఽభిధేయః। తత్సంబంధాత్తేన షట్పదో లక్ష్యత ఇతి అభిధేయ సంబంధనిమిత్తా॥"
(శబ్ద వ్యాపార-పుట 8)

99 1) ద్విరేఫపదం రూఢిశక్త్యా భ్రమరబోధకమ్। అవయవార్థ ప్రతీతిస్తు నాస్త్యేవ రథంతరాదివత్।

న చ స్వబోధ్యపదవాచ్యత్వ సంబంధేన ద్విరేఫపదం లక్షణయా భ్రమరం బోధయతీతి యుక్తమ్। అనుపపత్తి ప్రతిసంధానం వినాఽపి బోధాత్। గౌణ్యతిరిక్తసలే సాక్షాత్సంబంధస్యైవ లక్షణా బీజత్వాత్॥ (వై సి ల. మం లక్షణా)

ii) కుశలద్విరేఫద్వికాదయస్తు సాంకేతవిషయత్వాన్ముఖ్యా ఏవేతి న రూఢిర్లక్ష్యార్థస్య హేతుత్వేనాస్మాభిరుక్తా॥
(కావ్యానుశాసనమ్)

అజహత్స్వార్థ

స్వార్థమును త్యజించకయే పదార్థమును లక్షించునది.[100]
దీనినే అజహల్లక్షణయనియు ఉపాదానలక్షణ యనియును వ్యవహరింతురు [101]

ఉదా - కుంతాః ప్రవిశంతి"
(ఈటెలు ప్రవేశించుచున్నవి)

కుంతము లచేతనములు కావున ప్రవేశాన్వయసిద్ధికై స్వసంబంధి పురుషుల నాక్షేపించి వారితో నివియు ప్రవేశాన్వయము నొందుచున్నవి

తైక్ష్ణ్యమిట వ్యంగ్యము సాహచర్యము సంబంధము

అభిధావృత్తి మాతృకాకారుఁడు దీనినే సమవాయమని పేర్కొనెను.[102]

---

100 "శబ్దః స్వార్థ క్రియాసిద్ధ్యై స్వార్థత్యాగేన లక్షయేత్।
అర్థాంతరం స్వార్థయుతం సాఽజహత్స్వార్థికా భవేత్॥
(సా ర త్న లక్షణా)

"కుంతాః ప్రవిశంతీత్యాదౌ తు వాచ్యగతతైక్ష్ణ్యాది లక్ష్యం (వ్యంగ్యం)"
ఈ రసగంగాధర వాక్యమునకు మధురానాథ శాస్త్రి టిప్పణమిది—

"వాచ్యార్థః కుంతః తద్గతం యత్తైక్ష్ణ్యాది తత్‌లక్ష్యం యస్య ఈదృశం వ్యంగ్యం, అర్థాత్ వాచ్యగతం తైక్ష్ణ్యం లక్ష్యే కుంతవతి వ్యంగత్వేన ప్రతీయతే"
[రసగం (నిర్ణయసాగర్) ద్వితీ లక్షణా మూలధ్వని]

101. ముఖ్యార్థస్యేత రాక్షేపో వాక్యార్థాన్వయ సిద్ధయే।
స్యాదాత్మనో ఉప్యుపాదానా దేషోపాదాన లక్షణా॥ (సా ద. 2/10)

102 సమవాయాద్ యథా - ఛత్రిణో యాంతీతి। అత్ర బహువచన ప్రయోగాన్ముఖ్యః శబ్దార్థబాధః। న హ్యేకస్మిన్ ఛత్రిణి బహువచనప్రయోగ ఉపపద్యతే। అతోఽత్ర గమనలక్షణాయాం క్రియాయాం ఛత్రిణా సహ యోఽసౌ ఛత్ర శూన్యానాం సమవాయః సాహచర్యం తద్వశాత్ ఛత్రి శబ్దేన ఛత్రశూన్యా అపి లక్షణయాఽవగమ్యంతే। ప్రయోజనం చాత్ర ఛత్రశూన్యానాం సర్వాత్మనా ఛత్రోపేతస్వామ్యనుయాయితయా ప్రతిపాదనమ్॥ (అ వృ మా పుట 18)

సమవాయ పదమును అభినవగుప్తమమ్మటులు సంబంధ సామాన్యపర ముగా వాఖ్యానించిరి [103]

**అజహత్స్వార్థ పర్యాయోక్త— సమాసోక్త్యలంకారములకు మూలమా?**

ఇది పర్యాయోక్తమునకు మూలమని అలంకారరత్నాకరకారులు సమాసోక్త్యాదులకు మూలమని సాహిత్యరత్నాకరకారులు పేర్కొనిరి [104]

---

103 1) "సమవాయాదితి సంబంధాదిత్యర్థః। యష్టిః ప్రవేశయేతి యథా॥"
(ధ్వన్యాలోక—'లోచన' —2.21)

11) సమవాయః ఉక్తసంబంధేభ్యోఽన్యః సంబంధః। తతో యథా- । సామీప్యాత్ - గంగాయాం ఘోష ఇతి। తథా సాహచర్యాత్-ఛత్రిణో యాంతీతి। అత్రహి ఛత్రిసాహచర్యాదఛత్రా అప్యేవం వ్యపదిశ్యంతే।
(శబ్దవ్యాపార విమర్శః - పుట 8)

104. 1) సాపేక్షత్వే తు కుంతాః ప్రవిశంతీతివదర్థప్రతీతిర్లక్షణయా, న తు వ్యంజనేన, ఉపాదానలక్షణాయా అస్తమయప్రసంగాత్। తేనైవమాదౌ లక్ష్యత్వేనార్థాంతరస్య వ్యంగ్యత్వాభావాత్ గుణీభూత వ్యంగ్య భేదత్వం న వాచ్యమ్। [అతః]

శ్లో॥ ముఖ్యార్థసాకాంక్షతయా ప్రతీతి రాక్షేపతోఽర్థస్య హి లక్షణైవ। వ్యంగ్యత్వ గంధోఽపి న విద్యతేఽత్ర ధ్వనిత్వశంకాపి న తేన కార్యా॥"
(అలంకారరత్నార— పర్యాయోక్త.)

11) ఇయమజహల్లక్షణా సమాసోక్త్యాదేర్బీజమ్। ప్రస్తుతవిశేషణ సామ్యాదప్రస్తుతస్య గమ్యత్వే హి సమాసోక్తిః। తత్ర ప్రస్తుత స్వరూపానుపమర్దేనైవ విశేషణమహిమ్నాఽప్రస్తుతాక్షేపాత్"
(సాహిత్యరత్నాకర- తృ. లక్షణా.)

అపరార్థము లక్షితమగునేని అదియే (లక్ష్యార్థమే) ప్రధానము కావలసి వచ్చును.[105] కాని అట్లు కానవచ్చుటలేదు ఈ యలంకార ద్వితయమునందును వాచ్యార్థమే ప్రధానముకాఁగా అపరార్థము తదు (వాచ్యార్థో) పస్కారకమేయగుచున్నది[106] కావున అపరార్థమున వ్యంజనయే కాని లక్షణ లేదు ధ్వనికారులీ విషయమునిట్లు సంగ్రహించిరి

శ్లో॥ వ్యంగ్యస్య యత్రా ప్రాధాన్యం వాచ్యమాత్రానుయాయినః ।
సమాసోక్త్యాదయ స్తత్ర వాచ్యాలంకృతయః స్ఫుటాః॥ (ధ్వన్యా 1-14)

కావున అజహల్లక్షణ సమాసోక్త్యాదులకు మూలము కాదు

**అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వనిలో అజహల్లక్షణ —**

కాని ఇది అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వనికి మూలమగుచున్నది.

తదుదాహరణము—

"రామోఽస్మి సర్వం సహే[107]"

---

105 "లక్షణాయాం హి లక్ష్యస్యైవ ప్రాధాన్యం స్యాత్, న వాచ్యస్య"
(రసగం ద్వి పర్యాయోక్త)

106 1) సమాసోక్తౌ వ్యజ్యమానస్యాప్రకృత వ్యవహారస్యో పస్కారకత్వమేవ, న ప్రాధాన్యమ్॥ (రసగం ద్వితీ. సమాసోక్తి.)

ii) "అస్మింశ్చాలంకారే (పర్యాయోక్తౌ) వ్యంగ్యం వాచ్యపరమ్।"
(రసగం ద్వి పర్యాయోక్తి)

107. దీని పూర్తిపాఠమిది —

శ్లో॥ స్నిగ్ధశ్యామల కాంతిలిప్తవియతో వేల్లద్బలాకా ఘనా
వాతాః శీకరిణః పయోదసుహృదామానందకేకాః కలాః।
కామం సన్తు దృఢం కఠోరహృదయో రామోఽస్మి సర్వంసహే
వైదేహీ తు కథం భవిష్యతి హహా ! హా! దేవి! ధీరా భవ॥
(ధ్వన్యా. ద్వి అర్థాంత సంక్రమిత) (కావ్య. 4.112)

ఇట 'రామ'పదము స్వార్థమున ననుపపన్నమై సకల దుఃఖ పాత్రత్వ విశిష్ట రామరూపార్థమును లక్షించుచున్నది [108] దుఃఖములు పదాంతరములచే చెప్పశక్యము కాకుండుట వ్యంగ్యము–ఎన్నియో దుఃఖములు (రాజ్యభ్రంశ వనవాసాదులు) సహించిన నాకు ఈ వియోగదుఃఖము సహించుటొక లెక్కయా యని కదా తాత్పర్యము

జహదజహల్లక్షణ -

స్వార్థమున కించిదంశపరిత్యాగము కించిదంశోపాదానము చేయునది

వేదాంతిమతానుసారము దీనిని సాహిత్యరత్నాకరకారులు ఏకావళీ కారులును లక్షించిరి

శ్లో॥ అంశభేదముపాదాయ జహాతి న జహాతి చ।
శబ్దః స్వార్థం యది జహదజహత్స్వార్థలక్షణా (సా ర త్న. లక్షణా)

అంశేనైకేన పునర్జహాతి న జహాతి చాన్యేన।
శబ్దః స్వార్థం యది జహదజహత్స్వార్థా సమాఖ్యాతా॥ (ఏకా- 2.8)

ఉదా - "తత్త్వమసి"*
(నీవు ఆ బ్రహ్మమవు)

'త్వం' (నీవు) అనగా కించిజ్జ్ఞత్వాది ధర్మవిశిష్ట చైతన్యము (జీవుడు) 'తత్' (ఆ బ్రహ్మము) అనగా సర్వజ్ఞత్వాదివిశిష్టచైతన్యము (బ్రహ్మము) 'అసి' అగుచున్నావు వీరిద్దరికి అభేదము కుదురదు కించిజ్జ్ఞుడు సర్వజ్ఞు

---

108 తేన - శుద్ధేఽర్థే ముఖ్యే బాధా, నిమిత్తం తత్రార్థే తద్ధర్మిసమవాయః।
తేన నిమిత్తేన రామశబ్దో ధర్మాంతరపరిణతమర్థం లక్షయతి
(లోచన– ధ్వన్యా. 1.1 కారికావ్యాఖ్య)

స్వార్థైకాంశత్యాగా దంశాంతరమేవ లక్ష్యతే యత్ర।
సా జహదజత్స్వార్థా తత్త్వమసీత్యాదివిషయదృశ్యేయమ్॥
(ఏకా. 2.8 పై తరళవ్యాఖ్య)

డెట్లగునః కావున కించిజ్జత్వ సర్వజ్ఞత్వాది ధర్మములఁ బరిత్యజించి కేవల చైతన్యములే లక్షింపఁబడుచున్నవి ఇట్లభేదము పొసఁగును ధర్మాంశము త్యజించి చైతన్యాంశము మాత్రము గ్రహించుటచే దీనిని జహదజహత్స్వార్థ (జహదజహల్లక్షణ) యందురు

"సో౽యం దేవదత్తః" మున్నగునవి దీని కుదాహరణములగును

**ఆలంకారికులు దీని నుపేక్షించుటలో హేతువు –**

విచ్ఛిత్తి విశేషము లేకుండుటచే కావ్యమున దీని యుపయోగము లేదు. కావుననే ఆలంకారికులు దీని నుపేక్షించిరి.

**ఇయత్త (లక్షణలు మొత్తమెన్ని?) –**

1) ఉపాదానలక్షణ (అజహత్స్వార్థ) 2) లక్షణలక్షణ (జహత్స్వార్థ) 3) సారోప 4) సాధ్యవసాన యను నాలుగు శుద్ధాభేదములు, 5) సారోప 6) సాధ్యవసాన యను రెండు గౌణలక్షణాభేదములు. ఇట్లాఱువిధములు లక్షణ యని కావ్యప్రకాశకారులు పేర్కొనిరి [109]

**నిరూఢలక్షణయు కావ్యప్రకాశకారసమ్మతమే -**

"కర్మణి కుశలః ఇత్యాదౌ దర్భగ్రహణాద్యయోగాత్" అని లక్షణా సామాన్యలక్షణమున నుదాహరించియు నిరూఢలక్షణ యని నామనిర్దేశపూర్వకముగా కావ్యప్రకాశమున పేర్కొనకున్నను తన 'శబ్దవ్యాపారవిచార' మున పేర్కొనియున్నారు–

"శ్లో॥ నిరూఢా కాచిదన్యా తు కార్యా సా కాచిదన్యథా॥"

వృ॥అనులోమ ప్రతికూలాది శబ్దేషు కాచన సా వాచ్యమర్థం పరిహృత్య లక్ష్య ఏవార్థే వాచకవన్నిరూఢా॥" (శబ్ద. వ్యాకారికా 5)

---

109. "లక్షణా తేన షడ్విధా" (కావ్య 2.12)

కావున రసగంగాధరకారులు నిరూఢను పేర్కొని సప్తవిధలక్షణల నుదాహరించియున్నారు *

ఇఁక విశ్వనాథుఁడు పూర్వోదాహృతషడ్విధలక్షణలలో ఉపాదాన లక్షణలక్షణలకును (అజహత్స్వార్థజహత్స్వార్థలకును) ఆరోపాధ్యవసానము లచే ప్రత్యేకద్వైవిధ్యమును విశేషించి చెప్పుటచే ప్రయోజనలక్షణ అష్టవిధ మగుచున్నది

110 ఆ ప్రయోజనరూపమగు వ్యంగ్యము- గూఢము, అగూఢము, ధర్మ గతము, ధర్మిగతము, అను చాతుర్విధ్యమునందుటచే ప్రయోజనలక్షణ ($8\times4=32$) ముప్పదిరెండువిధములగుచున్నది

మఱి నిరూఢలక్షణయు హానోపాదానములు ఆరోపాధ్యవసానములు అను వానిచే చాతుర్విధ్యమునొంది గౌణశుద్ధత్వకృతభేదములచే అష్టవిధ మగును

ప్రయోజనలక్షణాభేదములు (32) నిరూఢలక్షణాభేదములును (8) కలిసి ప్రధానముగా ($32+8=40$) నలుబది యగుచున్నవి

ఈ నలువబదియు పదవాక్యగతములై మొత్తము అశీతి (ఎనుబది) విధములగుననియు చెప్పియున్నాడు

వాస్తవమునకు వ్యంగ్యగత గూఢాగూఢత్వాది భేదములు పదవాక్యగత త్వములును లక్షణావిభాగప్రయోజకములుగా పేర్కొనుట అతిమాత్రమే

---

* ఇయం తావద్ద్వివిధా- నిరూఢా ప్రయోజనవతీ చ।
ఇతి ప్రయోజనవతీ షడ్విధా సంపద్యతే- (రసగం ద్వి లక్షణా)

110 వ్యంగ్యస్య గూఢాగూఢత్వాద్ ద్విధాఽస్య ఫలలక్షణా।
ధర్మిధర్మగతత్వేన ఫలస్యైతా అపి ద్విధా॥
తదేవం లక్షణాభేదాశ్చత్వారింశన్మతా బుధైః।
పదవాక్యగతత్వేన ప్రత్యేకం తా అపి ద్విధా॥ (సా. ద 2.16, 17)

అయినది కావుననే కావ్యప్రకాశకారులు- "లక్షణా తేన షడ్విధా" అని స్వాభిప్రాయముద్ఘాటించి, ఇవియు వ్యంగ్యగత గూఢత్వాగూఢత్వములచే మఱి రెండు విధములగునని పరమతానువాదము చేసి యున్నారు [111] ఇట్లే సాహిత్య రత్నకరకారులు ఏకావళీకారులును వ్యంగ్యమగు ప్రయోజనము గూఢ-మగూఢమనియు రెండువిధములని చెప్పి వ్యంగ్యప్రస్తావమున నుదాహరించి యున్నారు [112] ఏకావళీకారులు సాహిత్యరత్నాకరకారులును జహదజహల్లక్షణ నధికముగా పేర్కొనుటచే వీరిమతమున ప్రయోజనలక్షణ సప్తవిధము లయినది [113]

విద్యానాథుఁడు హానోపాదాన–ఆరోపాధ్యవసానకృతభేదములచే లక్షణ చతుర్విధమనియే పేర్కొనెను [114] శుద్ధసారోప – శుద్ధసాధ్యవసానలను పేర్కొనలేదు.

---

111 వ్యంగ్యేన రహితా రూఢౌ సహితా తు ప్రయోజనే।
తచ్చ గూఢమగూఢం వా తదేషా కథితా త్రిధా॥ (కావ్య 2 13)

112 i) "తచ్చ వ్యంగ్యం ప్రయోజనం ద్వివిధం–గూఢమగూఢం చ।
గూఢం యథా" (సా ర వ్యంజనాతరంగ పుట 316)

ii) "వ్యంగ్యం తు ద్వేధా గూఢమగూఢం చ"
(ఏకావళీ 2 13 కారికావృత్తి)

113. i) ఇత్యస్మాభిర్భేదాః సప్త లక్షణాయాః ప్రదర్శితాః (ఏకావళీ 2 10)

ii) "ఏవం ఫలతోలక్షణా సప్తవిధేతి విభాగం సిద్ధవత్కృత్య"
(సా. ర. తృ లక్షణావిభాగ)

114 'సాదృశ్యనింబంధనా సంబంధనిబంధనా చేతి ద్వివిధా లక్షణా, సంబంధ నిబంధనా చ జహద్వాచ్యాఽజహద్వాచ్యా చేతి ద్వివిధా - సాదృశ్య నిబంధనా సారోపా సాధ్యవసాయా చేతి ద్వివిధా, ఏవం లక్షణా చతుర్విధా॥" (ప్ర. రు కావ్య లక్షణా)

అది న్యూనతగా భావించి రత్నాపణకారులు "సాదృశ్య" పదమును త-దితరకార్యకారణభావాదిసంబంధముల కుపలక్షకముగా వ్యాఖ్యానించెను [115]

కావున కావ్యప్రకాశకారాదికృతలక్షణావిభాగమే సకలాలంకారిక సమ్మతమై యొప్పుచున్నది ఇది లక్షణ.

**వ్యంజన -**

ఇఁక వ్యంజన యను శబ్దవృత్తి మూడవది

**ఆవశ్యకత:-**

దీని యావశ్యకత యిట్లున్నది-

'గంగాయాం ఘోషః (గంగలో గొల్లపల్లె) అను నీ వాక్యమున "గంగ"యను పదము సమీపతరవర్తియగు "తట"మను నర్థమున ప్రయోగింపఁబడుటకు కారణము— ఆ పల్లె చల్లనిదే కాక పవిత్రమై యున్నదను విశేషార్థప్రతిపత్తి గలుగుటకే కదా? ఈ విశేషార్థప్రతిపత్తి చేయునది యభిధ కాదు. గంగాపదమున కాయర్థవిశేషమున సంకేత మెక్కడిది? ఇఁక లక్షణయో, గంగాపదమునకు తీరరూపార్థము చెప్పి విరతమైనది. కావున నీ శీతత్వపావనత్వాదిరూపవిశేషార్థప్రతిపత్తికై మఱియొక శబ్దవృత్తి యావశ్యకమగుచున్నది ఒకవేళ ఇదియు లక్షణచేతనే బోధితమగునని యంగీకరించినచో దీనికిని మఱియొక ప్రయోజనమంగీకరించి తీరవలయును ఇదియు లాక్షణికమగుట ప్రయోజనసాపేక్షమే యగును కదా! ఆ ప్రయోజనమును లక్షణచేతనే యనిన, మఱి దాని ప్రయోజనమో? ఇట్లనవస్థ యేర్పడును తీరరూపార్థము లక్ష్యార్థమే కాని వాచ్యార్థము కాకుండుటచే

---

115 అత్ర సాదృశ్యశబ్దేనారోపాధ్యవసాయహేతవోఽన్యేఽపి కార్యకారణభావాదయః సంబంధా ఉపలక్ష్యంతే- (రత్నాపణ-కావ్య-లక్షణా)

వాచ్యార్థానుపపత్తియు లేదు, లక్షణ ఎట్లు? కావున వేఱొక శబ్దవృత్తి యంగీకరించక తప్పదు [116]

ఇట్లే – 'ప్రొద్దు గ్రుంకిన'దను మాటలో నెన్నియో అర్థవిశేషము లాయాసన్నివేశములను బట్టి కలుగుచుండుట తెలియనిది కాదు. ఈయర్థ విశేషము లభిధచె బోధితములయిన వనుటకు వీలులేదు సూర్యుఁడస్తమించె ననుటయే అభిధచే బోధితమగు వాచ్యార్థము అభిధచే నియతార్థప్రతిపత్తియే యగును కాని ఇట్లసంకేతితమగు విలక్షణార్థస్ఫూర్తి కలుగనేరదు [117] వాచ్యార్థమున కనుపపత్తియే లేదు కావున లక్షణకవకాశమే లేదు కావున నిట్టిచోటుల యందు కాననగు నర్థవిశేషప్రతిపత్తికయినను మరియొక శబ్దవృత్తి యవసరము కాక తప్పదు కదా!

ఇంతే కాక మఱియొకవిశేషము—

పథిక! నాత్ర స్రస్తరమస్తి మనాక్ ప్రస్తరస్థలే గ్రామే।
ఉన్నతపయోధరం ప్రేక్ష్య యది వససి తదా వస॥

(కావ్య 4/58)

---

116 1) నాభిధా సమయాభావాత్ హేత్వభావాన్న లక్షణా।
లక్ష్యం న ముఖ్యం నాప్యత్ర బాధో యోగః ఫలేన నో॥
న ప్రయోజనమేతస్మిన్న చ శబ్దః స్ఖలద్గతిః।
ఏవ మప్యనవస్థా స్యా ద్యా మూలక్షయకారిణీ॥

(కావ్య. 2/15, 16)

11) న తావదభిధయా బోధయతి। తస్యాః సంకేతితార్థైకవిషయత్వాత్। న హి గంగాదిపదానాం పావనత్వాదౌ సంకేతో దృష్టచరః। నాపి లక్షణయా, ముఖ్యార్థబాధాద్యభావాత్। న వా తస్య బాధః। నాపి తస్యాత్యంతపావనత్వాదినా సంబంధః। నాపి ప్రయోజనలక్ష్యతాయాం కించిత్ ప్రయోజనమ్॥ (సా ర చతుర్థ. వ్యంజనా)

117. న హి 'గతోఽస్తమర్కః' ఇత్యాదౌ వాచ్యోఽర్థః క్వచిదన్యథా భవతి ప్రతీయమానస్తు తత్తత్ప్రకరణవక్తృప్రతిపత్త్రాదివిశేషసహాయతయా నానాత్వం భజతే॥ (కావ్యానుశాసన. 1-19 సూ. వివేక.)

ఓ బాటసారీ! ఈ పల్లెయంతయు పాషాణప్రాయము శయనించుటకు తగిన యాస్తరణాదు లేమియును లేవు- అయినను పయోధరముల (మేఘముల, స్తనములయు) ఔన్నత్యము చూచి యుండఁదలఁచితివేని యుండుమని యొక నెఱజాణ బాటసారితో సాభిప్రాయముగా పలికిన పలుకులివి ఇట గ్రామములో నున్నవారందఱును మందబుద్ధులు, రసికులు కారనియు నీవు నాయందమునను భవింప సమర్థుఁడవేని ఈ రాత్రికిక్కడనుండిపొమ్మను నర్థవిశేషము సూచిత మైనది.[118] సంకేతితార్థమాత్రమునే బోధించు నభిధ ఈయర్థవిశేషమును బోధింప నెట్లు సమర్థమగును ఇఁక వాచ్యార్థమున కనుపపత్తియే లేదు కాన లక్షణకు నవకాశము లేదు అర్థవిశేషస్ఫూర్తిలో ప్రధానపాత్ర వహించిన "పయోధర"పదమునకు స్తనరూపార్థమునను సంకేత మున్నను నది యభిధచే బోధింపఁబడినదని చెప్పనలవికాదు తాత్పర్యనిర్ణాయకములగు సంయోగాదు లచే[119] నియంత్రితమైన అభిధకు నర్థాంతరబోధనమున శక్తి యెక్కడిది? ఈ రాత్రికిక్కడ నుండిపోవచ్చునా? యను బాటసారి ప్రశ్నకు మేఘాడంబ రము చూచి యుండఁదలచిన నుండిపొమ్మను సమాధానము ప్రాకరణికార్థము ఇదియే అభిధచే బోధితమైనది కాని విశేషార్థము కాదు కావున అర్థవిశేష ప్రతిపత్తికై వేఱొక వ్యాపారమవసరమగుచున్నది

ఈ వ్యాపారవిశేషమునే (శబ్దవృత్తినే)వ్యంజన యని వ్యవహరింతురు.

**వ్యంజనా నిర్వచనము –**

పదముల యర్థములు పరస్పరాన్వయము నొంది వాక్యార్థము నిరా కాంక్షితమై బోధపడగా, నావాక్యార్థమునకు వన్నెతెచ్చు నొకానొక యర్థవిశేష

---

118 అత్ర యద్యుపభోగక్షమోఽసి తదాఽఽస్స్వేతి వ్యజ్యతే-
(కావ్య 4.58)

119 i) 'సంయోగో విప్రయోగశ్చ' (వాక్యపదీయ. 2.315, 316) అనునవి పూర్వము వివరింపబడినవి (పుట 9)

ii) సంయోగాద్యై ర్వాచకతాయా నియంత్రణం చ- ఏకార్థమాత్రవిష యకతాత్పర్యనిర్ణయజననద్వారా శాబ్దబుద్ధ్యనుకూలత్వమ్॥
(రసగం. ద్వితీ ధ్వని)

మును తోపింపఁజేయు శబ్దవ్యాపారము వ్యంజనయని నిర్వచించిరి [120]

**వ్యంజనా స్వరూప స్వభావములు –**

అభిధాలక్షణలయనంతరమున దీని యవసర మేర్పడును [121] దీనిలో ముఖ్యార్ధమునకు బాధ యనునది లేదు మఱి ముఖ్యార్థమునకు సంబంధించిన యర్ధవిశేషమే యయియుండవలెనను నియమమును లేదు ఈ శబ్దమున కీ యర్థము ప్రసిద్ధము కాదుకదా! యనునది కూడ ఇట పరిగణింపఁబడదు ప్రసిద్ధము అప్రసిద్ధము అను భేదము లేక ఏ యర్థమైనను దీనిద్వారా అవగత మగును ఒకే వాక్యము ఆయా సందర్భముల పురస్కరించుకొని విభిన్నము లగు నర్ధవిశేషములను గూడ తోపింపఁజేయును [122] ఇట్లు వ్యంజనచే కలిగిన

---

120. 1) అన్వితేషు పదార్థేషు వాక్యార్థోపస్కారార్థమర్థాంతరవిషయః శబ్ద వ్యాపారో వ్యంజనావృత్తిః॥

(ప్ర రు కావ్య. వ్యంజనా)

11) శ్లో॥ అన్వితేషు పదార్థేషు యోఽర్థాంతరగోచరః ।
వాక్యార్థోపస్క్రియాయై స వ్యాపారో వ్యంజనా భవేత్॥

(సా. ర 4-2)

121 విరతాస్వభిధాద్యాసు యయాఽర్థో బోధ్యతేఽపరః ।
సా వృత్తిర్వ్యంజనా నామ శబ్దస్యార్థాదికస్య చ॥

(సా. ద. 2 13)

122. ముఖ్యార్థబాధనిరపేక్షబోధజనకః ముఖ్యార్థసంబంధాసంబంధసాధారణః ప్రసిద్ధాప్రసిద్ధార్థవిషయకో వక్త్రాదివైశిష్ట్యజ్ఞానప్రతిభాద్యుద్బుద్ధః సంస్కారవిశేషో వ్యంజనా

(ప ల. మం వ్యంజనావిచారః)

యర్థవిశేషమును వ్యంగ్యార్థమనియు, ఆ వ్యంగ్యార్థమును తోపింపఁజేయు శబ్దార్థములను వ్యంజకములనియునందురు *

ఉదా-

శ్లో॥ లావణ్యకాంతిపరిపూరితదిఙ్ముఖేఽస్మిన్
స్మేరేఽధునా తవ ముఖే తరళాయితాక్షి।।
క్షోభం యదేతి న మనాగపి తేన మన్యే
సువ్యక్తమేవ జడ(ల)రాశిరయం పయోధిః॥

(ధ్వన్యా. 22వ కారికోదాహరణము)

"ఓ ప్రియా! నీ ముఖము చిఱునగవు వెదచల్లుచు దిక్కులనంతట తన లావణ్యకాంతులు నింపినను ఈ సముద్రుఁడు చలింపకయున్నాఁడు. కాన నిజముగా నీతఁడు జడ(ల)రాశియే" అని తన ప్రియ ననునయించుచు పలికిన కాంతుని పలుకులలో— రోషకషాయితమై యుండి, ప్రియుని చాటువాక్యముల వలన రోషాపగమమున చిఱునగవొలుకుచున్న ప్రియురాలి ముఖము చంద్రుఁడనియు దశదిశలఁ జిందించు దరహాసము వెన్నెల యనియును, ఇట్టి నీ ముఖచంద్ర సందర్శనమున సహృదయుఁడెవ్వఁడైనను చాంచల్యము నొందకుండ నుండఁజాలఁడనియు అయినను సముద్రుఁడు క్షోభనొందకుండుట గాంచిన అది యతని జడస్వభావమునకు నిదర్శన మనియు తాత్పర్యము

ఇట సముద్రమునకు క్షోభ కలిగించువాఁడు చంద్రుఁడే కావున 'ప్రియురాలి ముఖము చంద్రుఁ'డనునంశమున రూపకాలంకారము అదియు ప్రతీయ

---

* 1) క్రమేణాభిధాలక్షణావ్యంజనావ్యాపారైరర్థావబోధనాః శబ్దాః వాచకలాక్షణికవ్యంజకాః, తైరేవ బోధ్యా అర్థా వాచ్యలక్ష్యవ్యంగ్యా ఇతి వివేకః (రత్నాపణవ్యాఖ్య ప్ర. రు కావ్యప్రకరణం)

11) అర్థోఽపి వ్యంజకస్తత్ర సహకారితయా మతః। (కావ్య 2-20)

మానమే కాని వాచ్యము కాదు కదా ఈ ప్రతీయమానచ్ఛాయయే ఇట వాక్యార్థమునకు వన్నె తెచ్చినది [123]

ఇట్లు వాక్యార్థమునకు వన్నె తెచ్చుటయే వ్యంజనములో నుండు ప్రత్యేకత *

**వ్యంజనా వ్యవస్థాపన —**

కావుననే-

I) అభిధయందు వలె నిట సంకేతితార్థమే బోధింపఁబడవలెనను నియమము లేదు—

**ఉదా -**

శ్లో॥ భ్రమ ధార్మిక ! విస్రబ్ధం స శునకోఽద్య మారితస్తేన।
గోదానదీ కచ్ఛకుంజ వాసినా దృప్తసింహేన॥ (ధ్వన్యా ప్రథమ)

దీని యనువాదము సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి కావ్యాలంకార సంగ్రహవివరణమునుండి-

కం ఇఁకఁ దిరుగవచ్చు నిట న
మ్మకముగ నో పూజరిః పరిమార్చెను సుమ్మీ
నికటోద్ధతమగు గోదా-
నికుంజగతసింహ మొకటి నేఁ డా కుక్కన్॥
(కావ్యా సం. పుట 150)

---

123 అత్ర క్షోభో మదనవికారాత్మా సహృదయస్య త్వన్ముఖావలోకనేన భవతీత్యభిధాయా విశ్రాంతతయా రూపకం ధ్వన్యమానమేవ। వాచ్యా— లంకారశ్చాత్ర శ్లేషః। అనురణరూపం యద్రూపకమర్థశక్తివ్యంగ్యం తదాశ్రయేణే హి కావ్యస్య చారుత్వం వ్యవతిష్ఠతే॥
(ధ్వన్యాలోకలోచన- 2.28)

ముఖ్యా మహాకవిగిరా మలంకృతిభృతామపి।
ప్రతీయమానచ్ఛాయైవ భూషా లజ్జేవ యోషితామ్॥ (ధ్వన్యా 3-38)

తన సంకేతస్థానమున నేకాంతముగా విహరించుట కంతరాయమును కలుగఁజేయుచున్న ధార్మికుని పీడ వదలించుకొనుటకై ఒక నెఱజాణ పలికిన ఈ పలుకులలో స్వేచ్ఛగా తిరుగవచ్చు నను నర్థమే సంకేతిత (వాచ్య)మై యుండఁగా – "సింహమున్నది జాగ్రత అట తిరుగకు" మను నిషేధము వ్యంజనచే బోధితమైనది [124]

II) అభిధయందువలె నిట సంయోగాదులనియంత్రణ యుండదు–

ఉదా –

శ్లో॥ పథిక ! నాత్ర స్రస్తరమస్తి మనాక్ ప్రస్తరస్థలే గ్రామే।
ఉన్నతపయోధరం ప్రేక్ష్య యది వససి తదా వస॥[125]

(కావ్య 458)

ఇట "పయోధర" పదమునకు 'మేఘము, స్తనము' అను రెండర్థము లున్నవి ప్రకరణవశమున నభిధ మేఘరూపార్థమునే బోధింప సమర్థ మగు చున్నది కాని వ్యంజనకట్టినియంత్రణ లేదు కావున స్తనరూపార్థస్ఫూర్తిని కలుగఁజేసి ఉపభోగసమర్థుఁడవేని ఈ రాత్రికిక్కడ నుండుమనునర్థవిశేషము తోపింపఁజేయుటలో ప్రధానసహకారిగా పయోధరపదము నొనర్చుచున్నది

III) అభిధయందువలె నిట 'రూఢి యోగాపహారిణి' కాదు కావున రూఢా (ప్రసిద్ధా)ర్థమును లెక్కచేయక యోగా(అప్రసిద్ధా)ర్థమునైనను తలపింపఁజేయును–

---

124. 1) కస్యాశ్చిత్ సంకేతస్థానం జీవితసర్వస్వాయమానం ధార్మికసంచరణాంతరాయదోషాత్ తదవలుప్యమానపల్లవకుసుమాదివిచ్ఛాయీకరణాచ్చ పరిత్రాతుమియముక్తిః। (ధ్వన్యాలోకలోచన- ప్రథమో)

II) అత్ర విస్రబ్ధో భ్రమేతి విధివాక్యే "తత్ర నికుంజే సింహస్తిష్ఠతి త్వం చ శునోఽపి బిభేషి తస్మాత్ త్వయా తస్మిన్న గంతవ్య" మితి నిషేధః ప్రతీయతే॥ (శృంగారప్రకాశః–సప్తమ–పుట 247)

125 ఈ శ్లోకార్థము ఇంతకుముందే వివరింపఁబడినది. (పుట 54)

ఉదా॰—

శ్లో॥ అబలానాం శ్రియం హృత్వా వారివాహైః సహానిశమ్।
తిష్ఠన్తి చపలా యత్ర స కాలః సముపాగతః॥
(రసగం ద్వితీ వ్యంజనా.)

స్త్రీల సౌందర్యమును హరించి విద్యుత్తులు మేఘములతో కలసియుండు వర్షాకాలము వచ్చినదని వాచ్యార్థము కాఁగా, అశక్తులగు భర్తల సంపద నపహరించి జఘనచపలలగు (పుంశ్చలులగు) స్త్రీలు జలవాహకులగు పురుషులతో రమించుచున్నారనునర్థము వ్యంజనచే బోధింపఁబడినది 126

ఇట అబలాది పదములకు 'స్త్రీలు' మున్నగు నర్థములు రూఢములనియు 'అశక్తులు' మున్నగు నర్థములు యౌగికములనియు స్పష్టమే కదా!

IV) లక్షణయందువలె నిట వాచ్యార్థమున కనుపపత్తి కాని వాచ్యార్థముతో నియతసంబంధముగల యర్థమే బోధింపఁబడవలెనను నియమము కాని లేదు.

ఉదా.-

కస్య వా న భవతి రోషో
దృష్ట్వా ప్రియాయాః సవ్రణ మధరమ్।
సభ్రమరపద్మాఘ్రాయిణి!
వారితవామే! సహస్వేదానీమ్॥ (సా ద 5-2-/ కావ్య 5-135)

దీనియనువాదము వేదంవారి యాంధ్రసాహిత్యదర్పణమునుండి— "ప్రేయసి మోవియందు క్షతముం గాంచిన ఎవనికి కోపము రాదు ఓసీ! విప

---

126. అత్ర అశక్తానాం ద్రవ్యమపహృత్య జలవాహకైః పురుషైః సహ పుంశ్చల్యో రమంత ఇత్యర్థాంతరం న తావదబలావారివాహచపలాశబ్దై ర్యోగరూఢ్యా శక్యతే బోధయితుం, మేఘత్వవిద్యుత్త్వాద్యఘటితస్యైవ తస్యార్థస్య ప్రతీతేః, అన్యథా చమత్కారో న స్యాత్॥
(రసగం. ద్వితీ. వ్యంజనా )

రీతమతీ! నేను వలదన్నను మానక తేఁటితోడితమ్మిని మూర్కొంటివి. ఇప్పుడు నాయకునిచేత చీవాట్లు తిను" (ఆం సా ద. 5-45)

[127] ఉపపతిఖండితాధరయగు తన చెలి తప్పును కప్పిపుచ్చుటకై పతి సమీపించుచుండఁగా నతనినిఁ జూడనిదానివలె నటించుచు సకియ పలికిన పలుకులివి

ఇట- 'ఇప్పుడనుభవింపుము' అను వాచ్యార్థము చెలియనుద్దేశించినది వాచ్యార్థమునకెట్టియనుపపత్తియునులేదు కదా

[128]ఇఁక వ్యంగ్యార్థములు— "ఈయమ నిరపరాధురాలు మీ రన్యథా శంకింపకుడనునది భర్తను గురించియు, ప్రియురాలు కావుననే స్రవణాధరావ

---

127. అత్ర కాచిత్ స్వైరిణీ కేనచిదుపపతినా ఖండితాధరా తదుపపతిసన్నిధిం నిశ్చితవతి ప్రియతమే తమనవలోకమానయేవ కయాపి విదగ్ధయా సఖ్యా తదపరాధప్రచ్ఛాదనాయేదమభిధీయతే। ఇహ సహస్వేదానీమితి వాచ్యం స్వైరిణీవిషయం। (ఏకావళీ- ప్రథమ పుట 4)

128 1) అనపరాధత్వమస్యా ఇతి వ్యంగ్యం పునః ప్రియతమవిషయమ్। సహస్వేత్యపి చ తద్విషయం। వల్లభేన సుతరాముపాలభ్యమానాయామస్యాం తద్వ్యలీకశంకితేతి పునరవినయగోపనేన తత్ప్రత్యాయనం ప్రాతివేశిక విషయమ్। ప్రియాయా ఇతి పదోపాదానాత్ సౌభాగ్యాతిశయప్రతిపాదనం తదవినయోపాలంభసంభూతప్రమోదసపత్నీవిషయమ్। అత ఏవ సహస్వేతి ప్రియతమవిషయం చ। ప్రకటాపరాధప్రచ్ఛాదనేన స్వవైదగ్ధ్య ప్రకాశనం తటస్థవిదగ్ధజనవిషయమ్। ఉపలక్ష్యమాణోపభోగచిహ్నా పునరియం న త్వయా కర్తవ్యేతి ప్రచ్ఛన్నకాముకవిషయం। ఇత్థం మయైవాపహ్నుతమేతన్న భవతీభిరిత్యపరసఖీవిషయమిత్యనయో- ర్విషయభేదాద్భేదః॥ (ఏకావళీ-ప్రథమోన్మేషః. పుట. 47)

ii) ఈ శ్లోక వివరణము - కావ్యప్రకాశ (5/13) కావ్యప్రదీప (పంచమ) కావ్యానుశాసన (1/19 సూ) ధ్వన్యాలోకలోచన (ప్రథమ) సాహిత్య దర్పణ(పంచమ)ములలోను కాననగును.

లోకనమున కోపించును, అప్రియయే యగుచో త్యజించియుండెడువాడు, ఇఁక మీ రానందపడకుడనునది సవతులను గూర్చియు, ఇప్పుడు చచ్చిచెడి సమర్థించితిని, మఱెన్నడును నీవిట్లు ప్రవర్తింపకూడదనునది ఉపపతిని గూర్చియు, ఉపపతులవలన చుంబనాదులనే గ్రహించవలయును కాని దంతక్షతాదులను కాదనునది కులటానాయికలఁ గూర్చియు, నే నీదోషము నెట్లు కప్పిపుచ్చితినో చూచితిరా యనునది తటస్థులగు విదగ్ధజనులనుద్దేశించియు నుండుటచే పలువిధములై యొప్పుచున్నవి కావున వాచ్యార్థముతో నియతసంబంధము లేదు[129] పలుకునకియ యొకతెయే యయినను వినువారు పలువురగుటచే వ్యంగ్యము పలువిధములుగా భాసించినది.

V) పలుకుమాటయొకటే యయినను ఒకఁడొకనితో పలుకఁగా నొక యర్థవిశేషమును మఱియొక డింకొకనితో పలుకఁగా వేఱొకయర్థవిశేషమును స్ఫురింపఁజేయుచుండును—

ఉదా - "గతోఽస్తమర్కః" (ప్రొద్దు గ్రుంకినది)

అను నీ మాట గురువు శిష్యులతో పలుకఁగా నధ్యయనము చాలించుఁడనియు, యజమానుఁడు భృత్యునితో పలికిన అమ్మకపు సామాను సద్దుమనియు నిట్లొకమాట ఎన్నియో యర్థవిశేషముల నాయాసందర్భములలో కురిపించును[130]

---

129. "కస్య వా న భవతి' ఇత్యాదౌ అనియతసంబంధః"

(కావ్యప్రకాశః-పంచమ వ్యంజనా)

130. న హి "గతోఽస్తమర్కః" ఇత్యాదౌ వాచ్యోఽర్థః క్వచిదన్యథాభవతి ప్రతీయమానస్తు తత్తత్ప్రకరణవక్తృప్రతిపత్త్రాదివిశేషసహాయతయా నానాత్వం భజతే॥ (కావ్యానుశాసనం 1_19 సూత్రవ్యాఖ్య)

కావున మహాకావ్యము పరిశీలించవలెనన్న కేవలశబ్దార్థశాసనజ్ఞానము సరిపోదు [131] అర్థవిశేషముల నవగత మొనర్చుకొనునట్టి ప్రతిభయు సహృదయతయు నావశ్యకములు

ఇట్లభిధా లక్షణలకంటెను విశేషముండుటచే వ్యంజన యను మూడవ శబ్దవృత్తి విధిగా గుర్తింపబడినది

వాచ్యార్థము వ్యంగ్యార్థమునకు పునాదివంటిది వాచ్యార్థము లేనిదే వ్యంగ్యార్థప్రతిపత్తి లేదు పదముల యర్థములు వాక్యార్థమున కుపకరించినట్లు వాచ్యార్థము వ్యంగ్యార్థమున కుపకరించును కావుననే కవులు వాచ్యార్థ విషయమునను శ్రద్ధ వహింతురు వెలుగు కావలసినవారు దీపపుజ్వాలవిషయమునను ప్రయత్నించుట చూచుచునే యున్నాము కదా [132]

**వ్యంజనా ద్వైవిధ్యము** –

ఇట్లు వాచ్యార్థమే కాక తటాదిలక్ష్యార్థములును శీతత్వపావనత్వాద్యర్థ విశేషములను స్ఫురింపజేయుచునే యున్నవి కావున వ్యంజన - (1) అభిధా మూలయనియు (2) లక్షణామూలయనియు రెండు విధములుగా చెప్పి యున్నారు [133]

---

131 శ్లో॥ శబ్దార్థశాసనజ్ఞానమాత్రేణైవ న వేద్యతే।
వేద్యతే స హి కావ్యార్థతత్త్వజ్ఞైరేవ కేవలమ్॥ (ధ్వన్యా 1/7)

132 యథా పదార్థద్వారేణ వాక్యార్థః సంప్రతీయతే।
వాచ్యార్థపూర్వికా తద్వత్ ప్రతిపత్ తస్య వస్తునః॥
ఆలోకార్థీ యథా దీపశిఖాయాం యత్నవాన్ జనః।
తదుపాయతయా తద్వదర్థే వాచ్యే తదాదృతః॥ (ధ్వన్యా 1.10, 9)

133 అభిధాలక్షణామూలా శబ్దస్య వ్యంజనా ద్విధా॥ (సా ద. 2.20)

**అభిధామూలవ్యంజన :—**

అభిధామూలవ్యంజన నిట్లు నిర్వచించియున్నారు

అనేకార్థశబ్దమునకుఁ గల ప్రకృతార్థము తాత్పర్య నిర్ణాయకము లగు సంయోగాదులచే నిర్ణీతము కాఁగా అర్థాంతరస్ఫూర్తిని గలుగఁజేయు శబ్ద వ్యాపారము అభిధామూల వ్యంజన [134]

ఉదా:—

శ్లో॥ ఉన్నతః ప్రోల్లసద్ధారః కాలాగురుమలీమసః ।
పయోధరభరస్తస్యాః కం న చక్రేఽభిలాషిణమ్ ॥
(ధ్వన్యా ద్వితీ 22. కా ఉదా /అలం చూడా. 1-62)

[135]ఔన్నత్యము గలదియును ప్రకాశించుచున్న హారముగలదియును కాలాగురులేపనముచే నలుపు వన్నె కలదియును అగు, ఆ సుందరియొక్క స్తనభరము ఏ యువకుని సాభిలాషుని చేయదు" అనునది ప్రకృతార్థము కాఁగా ఉన్నతమైనదియు ప్రకాశించుచున్నధారలు గలదియును కాలాగురువువలె నల్లనైనదియును అగు ఆ వర్షాకాలముయొక్క మేఘభరము ఏ పథికుని సౌత్కంఠునిగా నొనర్పదనున ప్రకృతార్థము, ప్రోలసద్ధార (ప్రోల్లసత్ + హార, ప్రోల్లసత్ + ధార) పయోధరాదిశబ్దశక్తిచే ధ్వనించుచున్నది ఇట పయోధరాది శబ్దములకుగల స్తనాదిరూపార్థమునే యభిధ బోధించును అప్రాకరణికమగు నర్థాంతరమును బోధింప నభిధ సమర్థముకాదు సంయోగాదులచే నర్థాంతర

---

134 అనేకార్థస్య శబ్దస్య సంయోగాద్యైర్నియంత్రితే।
ఏకత్రార్థేఽన్యధీహేతుర్వ్యంజనా సాఽభిధాశ్రయా॥ (సా ద. 2-21)

135 ఉన్నత ఇతి-ప్రోల్లసన్ హారో యత్ర ప్రోల్లసన్తీ ధారా యత్ర చ సః, కాలానుగురుణా స ఇవ చ మలీమసః నీలః పయోధరః స్తనః జలధరశ్చ, తస్యాః కామిన్యాః ప్రావృషశ్చ। కం యువానం పథికం చ॥
[ధ్వన్యా. 2-22 బాలప్రియ. (లోచనవ్యాఖ్య)]

వాచకతాశక్తి నియంత్రితమైనది కదా కావున రెండవయర్థప్రతీతి అభిధా మూలవ్యంజనచేతనే కలిగినది [136]

ఇట మొదటిది ప్రాకరణికమగు వాచ్యార్థము కాగా రెండవది యప్రాకరణికమగు వ్యంగ్యార్థ మగుచున్నది ఇట్లు విభిన్నములగు నీ రెండర్థములకు ఉపమానోపమేయభావరూపసంబంధమును కల్పించి యుపమాలంకారధ్వని యని ప్రాచీనులు సిద్ధాంతీకరించిరి [137]

**లక్షణామూలవ్యంజన:-**

[138]ఏ ప్రయోజనమునాశించి లాక్షణికముగా పదము ప్రయోగింపఁబడునో ఆట్టిప్రయోజనమును బోధించునది లక్షణామూలవ్యంజన-

---

136 సంయోగాదిభిరభిధాయాం నియమితాయాం యద్యనేకార్థస్య శబ్దస్య అర్థాంతరమపి యత్ర క్వచన ప్రతీతిగోచరీభవతి తత్ర వ్యంజనా వ్యాపార ఏవ ప్రగల్భతే॥ (ఏకావళి 2 3)

137 1) అత్ర వాక్యస్యాసంబద్ధార్థత్వం మా ప్రసాంక్షీదిత్యప్రాకరణిక ప్రాకరణికయోరుపమానోపమేయభావః కల్పనీయ ఇత్యత్రోపమా ఽలంకారో వ్యంగ్యః. (కావ్యానుశాసనం 1 62)

11) ఏషూదాహరణేషు శబ్దశక్త్యా ప్రకాశ్యమానే సత్యప్రాకరణి కేఽర్థాంతరే వాక్యస్యాసంబద్ధార్థాభిధాయిత్వం మా ప్రసాంక్షీదిత్యప్రాకరణిక ప్రాకరణికార్థయో రుపమానోపమేయభావః కల్పయితవ్యః (ధ్వన్యా ద్వితీ )

138. 1) లక్షణోపాస్యతే యస్య కృతే తత్తు ప్రయోజనమ్।
యయా ప్రత్యాయ్యతే సా స్యాద్వ్యంజనా లక్షణాశ్రయా॥
(సా ద. 2.22)

11) యస్య ప్రతీతిమాధాతుం లక్షణా సముపాస్యతే।
ఫలే శబ్దైకగమ్యేఽత్ర వ్యంజనాన్నాపరా క్రియా॥ (కావ్య. 2 14)

ఉదా:—

శ్లో॥ త్వా మస్మి వచ్మి విదుషాం సమవాయోఽత్ర తిష్ఠతి।
ఆత్మీయాం మతిమాస్థాయ స్థితిమత్ర విధేహి తత్॥
(సా. ద. చతుర్థ)/(కావ్య 4 23)

దీని యనువాదము-139

I) వేదంవారి యాంధ్రసాహిత్య దర్పణమునుండి -

"నీకు నేను చెప్పుచున్నాను విద్వాంసుల బృందము ఇక్కడ నున్నది కావున నీ (స్వీయమైన) తెలివిని తెచ్చుకొని యిచ్చట నునికిం గావింపుము
(ఆం సా. ద. 4.20)

II) సన్నిధానంవారి కావ్యాలంకార సంగ్రహ వివరణము నుండి —

కం॥ నినుఁ గూర్చి నేను మాటొక
టనుచుంటిని విబుధనివహమదరు నిచట దా
నిని సావధానమతివై
వినుమీ ః చెవి యొగ్గి యోర్మి పేర్మి చెలంగన్॥"
(కావ్యా. సం ద్వి పుట 192)

140 విద్వత్సభకు వెళ్ళుచున్న నొకానొకనిని గుఱించి పలికిన యాప్తుని వలుకులలో 'త్వామస్మి వచ్మి' (నీకు నేను చెప్పుచున్నాను) అనునది యనువ

---

139. ఈ రెండింటిలో వేదంవారియనువాదమే మూలానుసారియైయున్నది.

140. 1) త్వామస్మీతి - విద్వత్సభాం గచ్ఛన్తం ప్రతి కస్యచిదాప్తస్యోక్తి రియమ్। యతోఽత్ర విదుషాం విలక్షణజ్ఞానవతాం సమవాయః సముదాయస్తిష్ఠతి, తత్ తస్మాత్ ఆత్మీయాం స్వకీయాం మతిం బుద్ధిం ఆస్థాయ ఆలంబ్య అత్ర సభాయాం స్థితిం సావధానవర్తనం విధేహి కురు ఇతి, త్వాముపదేశార్హం। 'అస్మి' అహమిత్యర్థకావ్యయం, అహమాప్తః వచ్మి ఉపదిశామీత్యర్థః। అత్ర సంబోధ్యముద్దిశ్య వక్తవ్య-

యుక్తము చెప్పవలసిన విషయము సంబోధించి చెప్పిన నది యతనిని గూర్చి తాను చెప్పినట్లే యగును కావున వాచ్యార్థ మనుపపన్నమైనందున 'నేను' అను మాటకు ఆప్తుఁడనగు నేననియు, 'నీకు' అను పదమునకు ప్రత్యేకించి నిన్ను గుఱించియే యనియు 'చెప్పుచున్నాను' అనుదానికి ఉపదేశించుచున్నా ననియు లక్ష్యార్థములు దీనిచే నేఁజెప్పునది నీకు హితసాధన మనునది వ్యంగ్యము విద్వాంసు లచ్చట నున్నటుల చూచుచుండియు, మఱి 'యున్నా'రని చెప్పుట అనుపయుక్తమై ఆ యున్న విద్వాంసులందఱు సకలశాస్త్రవేత్తలు, అనునర్థవిశేష మును లక్షించుచున్నది 'ఆత్మీయాం మతిమాస్థాయ, (తన బుద్ధి నవలంబించి) అను మాటయు ననుపయుక్తమే ఎవఁడైనను తన బుద్ధిపైననే ఆధారపడును కదా కావున 'తన బుద్ధి' యన ప్రమాణ పరిగృహీతమగు బుద్ధియను నర్థవిశే షము ఇట్లన్నియు విశేషార్థముతో స్వాతిశయమును వ్యంజింపఁజేయుచున్నవి

---

కథనేనైవ సిద్ధే పునః 'త్వామస్మి వచ్మి'తి కథన మనుపయుక్త మితి త్వాముపదేశ్యం 'అస్మి' ఆప్తోఽహం, వచ్మి ఉపదిశామీతి లక్ష్యం, తేన హితసాధనత్వం అన్యథాచరణే ఉపహసనీయత్వం చ వ్యంగ్య మితి బోధ్యమ్॥ [నాగేశ్వరీ (కావ్యప్రకాశవ్యాఖ్యా) 4.23]

ii) అత్ర ప్రతిపాద్యస్య సమ్ముఖీనత్వాదేవ లబ్ధే ప్రతిపాద్యత్వే త్వామితి పునర్వచనమన్యవ్యావృత్తివిశిష్టం త్వదర్థం లక్షయతి, ఏవం వచ్మీ త్యనేనైవ కర్తరి లబ్ధే అస్మీతి పునర్వచనం, తథా విదుషాం సము దాయ ఇత్యాది. వచనేనైవ వక్తుః ప్రతిపాదనే సిద్ధే పునః వచ్మీతి వచనం ఉపదిశామీతి వచనవిశేషరూపమర్థం లక్షయతి। ఏతాని చ లక్షితాని స్వాతిశయం వ్యంజయంతి ఏతేన మమ వచనం తవా- త్యంతం హితం, తదవశ్యం కర్తవ్యమిత్యభిప్రాయః॥

(సా ద చతుర్థ వ్యంజనా)

iii) ఏవం విద్వత్ప్రత్యక్షేఽపి 'విదుషామ్' ఇతి. ఆత్మమతేః సార్వ కాలికత్వేఽపి 'ఆత్మీయామ్' ఇతి చ యథాక్రమం సర్వశాస్త్రవిశారద రూపేణ ప్రమాణపరతంత్రతయా చ పరిణతమ్॥

[బాలబోధినీ (కా. ప్ర వ్యాఖ్య) 4.23]

దీనిచే_ నేఁజెప్పునది నీ కవశ్యాచరణీయమనియు లేకున్న నలుగురిచే నగుబాట్ల పాలగుదువనియును వ్యంగ్యము

పదములు స్వాయత్తములై యుండ నిట్టి విలక్షణశబ్దప్రయోగమునకు వ్యంగ్యార్థప్రత్యాయనమే హేతవు కావున లక్షణ కీ వ్యంగ్యార్థమే ప్రయోజనము. ఈ ప్రయోజనరూపవ్యంగ్యార్థము లక్షణచే బోధింపబడునది కాదు. అట్లైని దానికి మఱియొక ప్రయోజన ముండితీరవలెను అదియు లక్షణచేతనే యనిన, మఱిదాని ప్రయోజనమో? ఇట్లనవస్థ యేర్పడును కావున నీ యర్థాంతరము వ్యంజనచేతనే కలిగినది కేవలమిట నర్థాంతరస్ఫూర్తిని గలుగఁ జేయుటలో లక్షణ సహకరించినది కావున లక్షణామూలవ్యంజన యిది

అభిధా-లక్షణా-మూలకములగు వ్యంజనల నీ రెంటిని గూడ శబ్దశక్తి మూలములని వ్యవహరింతురు [141]

**వ్యంజనాత్రైవిధ్యము .-**

కావుననే వ్యంజనను- "శబ్దశక్తి మూలము, అర్థశక్తి మూలము, ఉభయ శక్తిమూల"మని ముప్విధముల విభజించిరి [142]

**ఇఁక—అర్థ శక్తి మూలవ్యంజన .-**

[143]వక్త (పలుకువాడు) బోద్ధవ్యుడు (పలుకునది ఎవని నుద్దేశించియో వాడు) వాక్యము అన్యసన్నిధి, వాచ్యార్థము, ప్రకరణము, దేశము కాలము,

---

141 "శబ్దశక్తిమూలో ద్వివిధః—అభిధామూలో లక్షణామూలశ్చ"
(రసగం-ద్వితీ.)

142 "సా త్రివిధా - శబ్దార్థోభయశక్తిమూలకత్వేన'
(ప్ర రు కావ్యప్రకరణం)

143 1) వక్తృబోద్ధవ్యవాక్యానామన్యసన్నిధివాచ్యయోః ।
ప్రస్తావదేశకాలానాం కాకోశ్చేష్టాదికస్య చ।
వైశిష్ట్యాదన్యమర్థం యా బోధయేత్ సాఽర్థసంభవా ॥
(సా. ద. 2/23)

కాకుస్వరము, చేష్ట, ఈ మున్నగు వానియొక్క వైశిష్ట్యముచే నర్థాంతర స్ఫూర్తిని గలుగజేయునది అర్థశక్తిమూలవ్యంజన ఇట అర్థమే అర్థాంతర స్ఫూర్తిఁ గలుగజేయునది [144] ఆ యర్థము వాచ్యలక్ష్యవ్యంగ్యములు[145] మూడును కావచ్చును

ఉదా –

1) వక్తృవైశిష్ట్యముచే నగు వ్యంగ్యము -

శ్లో॥ అతిపృథులం జలకుంభం గృహీత్వా సమాగతాఽస్మి సఖి! త్వరితమ్।
శ్రమస్వేదసలిలనిశ్వాసనిస్సహా విశ్రమ్యామి క్షణమ్॥
(కావ్యప్రకాశః 3.13)

ఓ చెలీ! పెద్దనీటికుండనెత్తికొని వేగిరపాటున వచ్చితిని-అలసటచే చెమట క్రమ్ముకొనుచున్నది - నిట్టూర్పులకు తట్టుకొన లేకున్నాను - ఒక క్షణము విశ్రమింతును-

ఈ పలుకులొలుకఁబోయునది యొక పుంశ్చలి యగుట గుర్తించితి మేని ఆయమ తన యవినయమును కప్పిపుచ్చుటకయి ఇట్లుపలికినదని తెలియ వచ్చును. కావున నిట చౌర్యరతగోపనము వ్యంగ్యము-సౌశీల్యవతియే యిట్లు

---

11) వక్తృబోద్ధవ్యకాకూనాం వాక్యవాచ్యాన్యసన్నిధేః।
ప్రస్తావదేశకాలాదేర్వైశిష్ట్యాత్ ప్రతిభాజుషామ్।
యోఽర్థస్యాన్యార్థధీహేతుర్వ్యాపారో వ్యక్తిరేవ సా॥
(కావ్య 3.22)

144 "వక్త్రాదివైశిష్ట్యాదర్థస్యాపి వ్యంజకత్వమ్॥" (కావ్యానుశాసనం 1.21)

145 "బోద్ధవ్యః ప్రతిపాద్యః, కాకుర్ధ్వనివికారః, ప్రస్తావః ప్రకరణం, అర్థస్య వాచ్యలక్ష్యవ్యంగ్యాత్మనః॥" (కావ్యప్రకాశః 3 22 కారికా వివరణం)

పలికిన ఆ పలుకులు యథార్థములయి యుండును కాన నీ యర్థాంతరస్ఫూర్తి కవకాశము లేదు 146

కావున నిట వ్యంగ్యము వక్తృవైశిష్ట్యముచేఁ గలిగినదిగా నెన్నఁదగినది.

11) బోద్ధవ్యవైశిష్ట్యముచేనగు వ్యంగ్యము:—

ఇట్లొకచో పలుకువారిస్వభావమును పర్యాలోచించుటచే నర్థాంతర స్ఫూర్తి కలుగఁగా వెఱొకచో పలుకునదెవరిని గుఱించియో వారిస్వభావము గమనించినఁగాని యర్థాంతరస్ఫూర్తి కలుగదు.

ఉదా:—

శ్లో॥ ఉపకృతం బహు తత్ర కిముచ్యతే సుజనతా ప్రథితా భవతా పరమ్।
విదధదీదృశమేవ సదా సఖే! సుఖితమాస్స్వ తతః శరదాం శతమ్॥
(కావ్యామృతం. 2 10)

"నీ మేలు మఱవరానిది. నీ వెంతయో సౌజన్యము కనఁబఱచినావు. ఇట్లే చేయుచు నూరువత్సరములు మనుము" అని (విషకుంభపయోముఖుఁడగు) నొక మిత్రునితో పలికిన పలుకులివి. 'నిజమున కామిత్రుఁడట్టివాఁడు కాఁడు. తేనెపూసిన కత్తి' అని యాతని (బోద్ధవ్యుని) స్వభావము గమనించుటచే నీ చేసిన యపకారముల కంతు చిక్కుట లేదనియు, ఇంత చేసినను నీ విషయమున సౌమ్యముగా వ్యవహరించుచున్న నా యెడల అడుగడుగున వంచనచేయు నీ పాపిష్ఠత్వమేమని చెప్పుదుననియు వ్యంగ్యము.147

---

146. "అత్ర వక్త్రీ కామినీ, తస్యాః దుఃశీలత్వవైశిష్ట్యం విజానతాం చౌర్యరతగోపనం వ్యక్తిభవతి"॥ (కావ్యప్రదీపః 3.2 కారికోదాహరణం)

147. 1) ప్రతిపాద్యవైశిష్ట్యాద్యథా—'ఉపకృతం' (2 10) ఏతదపకారిణం ప్రతి విపరీతలక్షణయా కశ్చిద్వక్తి— అపకారాతిశయో వ్యంగ్యః॥"
(కావ్యామృతం 2.10)

ఒకవేళ సన్మిత్రమును గూర్చియే ఇట్లు పలికిన నీ యర్థాంతరస్ఫూర్తి యుండదు కావున నిది బోద్ధవ్య (ప్రతిపాద్య) వైశిష్ట్యమున కుదాహరణ మయినది.

iii) వక్తృబోద్ధవ్య వైశిష్ట్యముచేనగు వ్యంగ్యము –

ఒకచో వక్తృబోద్ధవ్యులు అనునీ యిరువురియొక్కయు స్వభావమును పర్యాలోచించినఁ గాని వ్యంగ్యార్థస్ఫూర్తి కలుగదు

ఉదా :-

శ్లో॥ శ్వశ్రూ రత్ర నిమజ్జతి, అత్రాహం దివసకం ప్రలోకయ।
మా పథిక। రాత్ర్యంధక। శయ్యాయామావయోర్నిమంక్ష్యసి॥
(కావ్యప్రదీప తృతీ)

(ఇచట మాయత్త పండు నే నిటఁబరుండుఁ
బగటనే లెస్స గని గుర్తుపట్టుకొనుము
రేయి చీకటిఁ గానక యోయి పాంథ।
పడకుమీ మాదుమంచాలపైనిఁ దప్పి*॥)

---

ii) త్వయైవమపకారేఽపి క్రియమాణే మయా ప్రియమేవోచ్యేత, ఇతి స్వసాధుత్వం వ్యంగ్యం। తవోపకారాపకారవివేకో నాస్తీతివా॥
(కావ్యప్రదీపః 41 కా. ఉదా.)

iii) ఎతత్సజాతీయశ్లోకమును వ్యాఖ్యానించుచు పండితరాయలు – "త్వయా కృతేఽప్యపకారే పరమఖేదహేతౌ మధురమేవ యో భాషేయ, న పరుషం, తస్మిన్నేవంజాతీయకే మయి పాపమాచరత స్తవ పాపిష్ఠత్వం కథం శక్యతే వక్తుమితి వ్యంగ్యమ్"
(రసగం. ద్వితీ. లక్షణామూల.)

సన్నిధానం వారి కావ్యాలంకారసంగ్రహవివరణమునుండి ఈ అనువాదము మూలము– గాథాసప్తశతి. 767
(కావ్యా. సం ద్వితీ పుట. 150)

ఈ యింటనుండునది నేను గాక మాయత్త ఒక్కతెయే యనియు ఆయమయు ముదుసలి కావున నిద్రలో మునిగితేలుననియు 'అత్రాహం' అనగా నేనిట నొంటరిదానను, మన్మథపీడచే నాకసలు నిద్రెక్కడిది? కావున నీకై వేచియే యుందుననియు[148], నీవు నిశ్శంకముగా నా శయ్యకు రావలయు ననియు వ్యంగ్యార్థము

ఒక బాటసారి తా నారాత్రి పరుండుటకునై సాభిప్రాయముగా వసతి నర్థించఁగా నతనికి తన మనోగతమును సాకూతముగా వివరించు ప్రోషిత భర్తృక వాక్యమిది కావున వీరిద్దరును వ్యభిచరణశీలురే యని గమనించితి మేని యీ యర్థాంతరస్ఫూర్తి గలుగును[149] మఱెవ్వరైన సచ్ఛీలురు పలికిన నీయర్థాంతరప్రతీతి యుండదు.

కావున నిది వక్తృబొద్ధవ్యవై శిష్ట్యముచేనగు నర్థశక్తిమూలవ్యంజన

**iv) అన్య సన్నిధి వై శిష్ట్యముచేనగు వ్యంగ్యము .—**

ఒకచో నెవరితోనో పలికిన పలుకులు పొంచియున్న వ్యక్తి స్వరూప స్వభావముల పరిశీలించినఁ గాని యర్థాంతరమును స్ఫురింపఁజేయవు

ఉదా -

శ్లో॥ నుదత్యనార్ద్రమనాః శ్వశ్రూర్మాం గృహభరే సకలే।
క్షణమాత్రం యది సంధ్యాయాం భవతి న వా భవతి విశ్రామః॥
(కావ్య 3_18/కావ్యప్రదీప 3_2 కా. ఉదా )

---

148 అత్ర స్వాపబోధకపదానుక్త్యా మన్మథపీడయా తస్యా నిద్రారాహిత్యం. [బాలబోధినీ (కావ్యప్రకాశవ్యాఖ్య) పుట. 81]

149. వసతిం ప్రార్థయమానం సంజాతకామం పథికం ప్రతి ప్రోషితభర్తృకాయా వ్యభిచారిణ్యాః స్వయందూత్యా ఉక్తిరియం।. అత్ర గృహే శ్వశ్రూరహం చ, శ్వశ్రూశ్చ జరత్త్వేన బధిరా నిష్పందా చ। జనాంతరసంచారస్తు నాస్త్యేవ। అతో యథేష్టం మమ శయ్యాయామేవ స్వపిహీతి వ్యంగ్యం, వ్యభిచారిణోర్వక్తృబోద్ధవ్యయోర్వైశిష్ట్యాత్ ప్రతిభాజుషాం ప్రతీయతే॥ [బాలబోధినీ- (కావ్య. వ్యాఖ్య) పుట. 81]

'మాయత్త కిసుమంతైన దయ లేదు నన్ను ప్రౌఢంతయు ఇంటిపని చేయించుచు వేధించును సంజవేళ నొక క్షణమాత్రము విశ్రాంతి యుండు నేమో? అంతే' అని ఎదురింటియావిడతో తన దయనీయపరిస్థితిని జెప్పునెపమున నొకనెఱజాణ తనకై మాటున వేచియున్న ప్రియునకు సంజ వేళ సంకేతకాలమని సూచించుచున్నది ఇట ప్రియుఁడు పొంచియుండుటను పరిశీలించుటచేతనే యర్థాంతర స్ఫూర్తి కలిగినది[150]

కేవల మిది వారిద్దరి (మధ్య) సంభాషణమాత్రమే యయిన ఈ యర్థాంతరము స్ఫురించుట కవకాశము లేదు

కాన నిది యన్యసన్నిధిచేనగు వ్యంగ్యము

ఇట్లు ప్రత్యేకముగను సమిష్టిగను వక్త్రాది వైశిష్ట్యమును పురస్కరించు కొని ఈ యర్థశక్తి మూలవ్యంజనలో నెన్నియో భేదముల నుదాహరింపవచ్చును.

**v) వాచ్యలక్ష్యార్థములచేనగు వ్యంగ్యార్థములు –**

1) పూర్వోపదర్శితమగు "త్వామస్మి" (కా ప్ర 4–23) అను లక్షణా మూలవ్యంజనోదాహరణమున లక్ష్యార్థముచే వ్యంగ్యార్థస్ఫూర్తి గలుగఁగా 11) 'శ్వశ్రూరత్రి' (కావ్యప్రదీప) అను నర్థశక్తిమూలవ్యంజనోదాహరణ మున వాచ్యార్థముచేతనే వ్యంగ్యార్థస్ఫూర్తి కలిగనది

**vi) వ్యంగ్యార్థముచేతనగు వేఱొక వ్యంగ్యార్థము –**

వాచ్యార్థ లక్ష్యార్థములచేతనే కాక వ్యంగ్యార్థము చేతను వేఱొక వ్యంగ్యార్థస్ఫూర్తి కలుగును

---

150. 1) అన్యసన్నిధిః సన్నిహితోఽన్యః। తేన ప్రతివేశినీం ప్రతి ప్రవర్తితే వాక్యే ప్రచ్ఛన్నపురుషరూపస్యాన్యస్య సన్నిధేర్వైశిష్ట్యాత్ సన్నిహితం ప్రతి "సంధ్యా సంకేతసమయ"ఇతి వ్యజ్యతే॥"
(కావ్యప్రదీప 3 2 వృత్తి)

11) అత్ర 'సంధ్యా సంకేతకాల'ఇతి తటస్థం ప్రతి కయాచిద్ద్యోత్యతే"
(కావ్య. 3.18 వృత్తి)

ఉదా .—

పశ్య నిశ్చలనిష్పందా బిసినీపత్రే రాజతే బలాకా ।
నిర్మలమరకతభాజనప్రతిష్ఠితా శంఖశుక్తిరివ ॥

(సా ద. ద్వి. అర్థవ్యంజకత)

(చూడు, నిర్మలమయిన మరకంతపు గంచమందు శంఖరచితశుక్త్యా కార పాత్రమువలె తరలక కదలక తామరాకున బెగ్గురు పక్షి రాజిల్లుచున్నది -అం సా- ద. 25)

[151] సంకేతస్థానము నుపనాయకునకు సూచించుచు దూతి పలికిన పలుకులివి. ఇట కొంగ కదలకుండనున్నదని చెప్పుటచే నా ప్రదేశ మెప్పుడును జనశూన్యమయియే యుండుననియు అందుకే ఆ సారసపక్షి కంతటి విశ్వాస మనియు వ్యంగ్యము — ఈ వ్యంగ్యార్థముచే సంకేతస్థల మిదియే యను నర్థాంతరము సూచితమగుచున్నది [152] ఇది యర్థశక్తి మూలవ్యంజన

151. "సంకేతస్థానముపనాయకే దర్శయన్త్యా దూత్యా ఉక్తిరియమ్"

—విజ్ఞప్రియా (సా. ద వ్యాఖ్య)

152 క) అత్ర బలాకాయా నిష్పందత్వేన విశ్వస్తత్వం, తేన—అస్య దేశస్య విజనత్వం, అతః సంకేతస్థాన మేతదితి కయాఽపి సన్నిహితం ప్రచ్ఛన్నకాముకం ప్రత్యుచ్యతే। అత్రైవం స్థాననిర్జనత్వరూపవ్యంగ్యార్థ వైశిష్ట్యం ప్రయోజనం॥

(సా ద ద్వి అర్థశక్తిమూలవ్యంజనా.)

ఖ) వ్యంగ్యార్థస్య(వ్యంజకతా) యథా— పశ్య నిశ్చలనిష్పందా'ఇత్యాది.

(సా. ద. ద్వి. అర్థశక్తిమూలవ్యంజనా)

గ) ఉచ్యమానస్య నాయకస్య సాన్నిధ్యాత్ సంకేతస్థలప్రదర్శనం సామాజికై ర్వ్యంజనయాఽవగమ్యత ఇత్యర్థః ...నాయకేన తు బలాకాప్రదర్శనరూపాత్ వక్త్రాః వైలక్ష్యణ్యాత్ సంకేతస్థలం వ్యంజనయా బుధ్యతే । —విజ్ఞప్రియా (సా.ద.ద్వి. పుట 64)

ఇ(క ఉభయశక్తి మూలవ్యంజన —

శబ్దశక్తికి అర్థశక్తికిని ఇట సమప్రాధాన్యముండును

ఉదా —

శ్లో॥ విజితారిపురో మూర్తౌ విలసత్సర్వమంగళః ।
రాజమౌళిరసౌ భాతి రుద్రదేవో జగత్పతిః ॥

(ప్ర రు కావ్య 14)

(భూరితేజు(డు ప్రతిపక్షపురహరుండు
మహిత తను విలసత్సర్వమంగళుండు
రాజశేఖరు( డితఁడు విరాజమాను(
డయ్యె రుద్రుండు లోకనాయకు(డనంగ

—ఆం ప్ర రు. య 2.11)

'శత్రుపురములు జయించినవా(డును సకలవిధ మంగళ చిహ్నములతో మెఱయు శరీరము గలవా(డును రాజశ్రేష్ఠు(డును అగు రుద్రదేవు(డు జగత్పతియై విలసిల్లుచున్నా(డు' అను నీ ప్రకృతార్థము వాచ్యము కా(గా త్రిపురాసురుని జయించినవాడు(ను తన శరీరమున ప్రకాశించుచున్న సర్వమంగళ (పార్వతీదేవి) గలవా(డును రాజ(చంద్ర) మౌళియు జగత్పతి యును అగు శివు(డు ప్రకాశించుచున్నాడను నర్థాంతరము వ్యంగ్యము. ఈ రెండర్థములును అసంబద్ధములు కాకుండుటకై ప్రతాపరుద్రుడు శివుని బోలిన వా(డని ఉపమానోపమేయభావరూప సంబంధము కల్పించి 'ఉపమా లంకారధ్వని'యని ప్రాచీనులు పేర్కొనిరి [153]

---

153. క) అత్ర ప్రతాపరుద్రశంకరయో రుపమాలంకారధ్వనిః। (ప్ర. రు 2 14)

ఖ) ఏషూదాహరణేషు శబ్దశక్త్యా ప్రకాశ్యమానే సత్యప్రాకరణికేఽర్థాంతరే వాక్యస్యాసంబంద్ధార్థాభిదాయిత్వం మా ప్రసాంక్షీదిత్యప్రాకర ణిక —ప్రాకరణికార్థయోరుపమానోపమేయభావః కల్పయితవ్యః। (ధ్వన్యా. 2.22 కా వృ.)

గ) అత్ర వాక్యస్యాసంబంద్ధార్థాభిధాయకత్వం మా ప్రసాంక్షీదితి ప్రాక రణికాప్రకరణికార్థయో రుపమానోపమేయభావః కల్పనీయ ఇత్య త్రోపమాలంకారో వ్యంగ్యః। (కావ్యప్రకాశః 4 54)

ఇట సర్వమంగళా', 'రాజ' శబ్దములు రెండర్థములు గలవియగుటచే శబ్దశక్తియు, అరిపురములన శత్రునగరములని ప్రకృతార్థము కాఁగా, త్రిపురాసురుఁడను నర్థాంతరము, శివసంబంధమును పర్యాలోచించగాఁ దోచును కాన నర్థశక్తియును, ఈ రెండును ఉపమాలంకారధ్వనిలో హేతువగుటచే నిది యుభయశక్తి మూల యయినది [154]

[155] శబ్ద శక్తిమూలవ్యంజనలో నర్థశక్తియు, అర్థశక్తిమూల వ్యంజనలో శబ్దశక్తియు సహకారులగుమనే యున్నవి కావున ఉభయ శక్తిమూల యను ప్రత్యేకభేదమవసరము లేదనియు ఇది శబ్దశక్తిమూలచేతనే గతార్థమగుననియు[156] ఆచార్య హేమచంద్రు లభిప్రాయపడిరి. అయినను శబ్ద శక్తిమూలవ్యంజనలో నర్థశక్తి సహకారియే కాని ప్రధానము కాకుండుటయు అర్థశక్తిమూలవ్యంజనలో శబ్దశక్తికి ప్రాధాన్యము లేకుండుటయు నుభయ శక్తిమూలవ్యంజనలో నుభయశక్తులకును ప్రాధాన్యముండుటయును గమనించి ప్రాచీనాలంకారికులు వ్యంజనాత్రైవిధ్యమును గుర్తించిరి. [157] ఇది వ్యంజన

---

154 అత్ర 'విజితారిపుర' ఇత్యర్థశక్తి మూలత్వం, విలసత్సర్వమంగళో రాజమౌళి'రితి శబ్దశక్తిమూలత్వమిత్యుభయశక్తి మూలత్వమ్॥
(ప్ర రు 2.14)

155 "శబ్దబోధ్యో వ్యనక్త్యర్థః శబ్దోఽప్యర్థాంతరాశ్రయః।
ఏకస్య వ్యంజకత్వే తదన్యస్య సహకారితా॥" (సా ద 2 25)

156 "ఉభయశక్తిమూలస్తు శబ్దశక్తిమూలాన్నాతిరిచ్యతే। శబ్దస్యైవ ప్రాధాన్యేన వ్యంజకత్వాత్." (కావ్యానుశాసనం 1 22)

157 యద్యపి శబ్దశక్తిమూలేఽప్యర్థస్య, అర్థశక్తిమూలేఽపి శబ్దస్య వ్యంజకత్వమస్తీతి ఉభయశక్తిమూలత్వం సర్వత్రైవాస్తి, తథాపి తత్ర తయోర్గుణప్రధానభావేనేతి ప్రాక్ 34సూత్రే 38 సూత్రే చ ప్రతిపాదితం। అత్ర తు ద్వయోరేవ ప్రాధాన్యేన వ్యంజకత్వమిత్యుభయశక్తిమూలత్వమ్॥
—బాలబోధినీ (కావ్య 4 55 సూ. వ్యాఖ్య.)

ఇఁక తాత్పర్యశక్తి—

'గామానయ' (గోవును తెమ్ము) ఈ మున్నగువాక్యములలో కారక క్రియలకుగల సంబంధము తాత్పర్యశక్తిచేతనే బోధింపబడును. కాని అభిధా-లక్షణలచేఁ గాదు 'గో' పదమున కర్థము, 'గోత్వము' కాఁగా వ్యక్తి (గో) రూపార్థము ఆక్షేపలభ్యమగును ఇఁక 'గాం' (గోవును) అను ద్వితీయా విభక్తికి కర్మత్వమర్థము ఈ కర్మత్వము నిరూపకతాసంబంధముచే ఆనయన రూప—(తెచ్చుటయను) క్రియలో నన్వయించుచున్నది ఇట్టిరెండు పదములకు ఏకవాక్యతను గూర్చు సంబంధము, ఈ రెండింటిలో దేనియర్థమును కాదు గదా ! కావున సమన్వయరూపమగు నీసంబంధము తాత్పర్యశక్తిచే వచ్చినది.

తేలినదేమనగా—'గామానయ' (గోవును తెమ్ము) అనునప్పుడు ఆ రెండు పదముల యర్థము మాత్రము అభిధచే బోధింపఁబడును. ఇఁక ఈ పదముల యర్థములు పరస్పరాన్వయము నొందినఁ గాని వాక్యార్థమేర్పడదు కదా ! పరస్పరాన్వయమే లేకున్న "పప్పుకు పప్పు, ప్రసాదమునకు ప్రసాదము" అను నట్లే యుండును. కావున ఈ సమన్వయరూపక్రియాకారకసంసర్గము బోధింప వేఱొకవృత్తి- అదియే "తాత్పర్యశక్తి" యనునది అవసరమగునని అభిహితాన్వయవాదులగు మీమాంసకు లభిప్రాయపడిరి [158]

---

158 క) ఆకాంక్షయోగ్యతాసన్నిధివశాద్ వక్ష్యమాణస్వరూపాణాం పదార్థానాం సమన్వయే తాత్పర్యార్థో విశేషవపురపదార్థోఽపి వాక్యార్థః సముల్లసతీత్యభిహితాన్వయవాదినాం మతమ్ ॥

(కావ్యప్రకాశః 2.6)

ఖ) "లాఘవాత్ పదానాం పదార్థమాత్రే శక్తిః న త్వన్వయాంశే । గౌరవాదన్యలభ్యత్వాచ్చ తదంశో హి తాత్పర్యార్థో వాచ్యాద్వర్థ విలక్షణశరీర ఆకాంక్షాయోగ్యతాసత్తివశాదపదార్థోఽపి ప్రతీయతే । న చాపదార్థప్రతీతావతిప్రసంగః । స్వరూపసతః శక్యాన్వయస్య నియామకత్వాత్ ।" ఇత్యభిహితాన్వయవాదినాం మతమ్॥

(కావ్యప్రదీప — 2.1)

**అన్వితాభిధానవాదుల మతము**

పదములకు పరస్పరాన్వయమును బోధించుటకై తాత్పర్యశక్తియను నొకదాని నంగీకరించనవసరము లేదనియు, ప్రవృత్తి నివృత్తి విధాయకవాక్య వ్యవహారమువలననే వ్యుత్పిత్సువగు బాలునకు పరస్పరాన్వయమునొందిన పదముల యర్థములు తెలియుటచే నన్వితములగు పదముల యర్థమే వాక్యార్థ

---

గ) "తాత్పర్యాఖ్యాం వృత్తిమాహుః పదార్థాన్వయబోధనే।
తాత్పర్యార్థం తదర్థం చ వాక్యం తద్బోధకం పరే॥
(సా ద 2 27)

ఘ) అమూని పదాని స్వం స్వమర్థమభిధాయ నివృత్తవ్యాపారాణి, అథేదానీం పదార్థా అభిహితాః సంతో వాక్యార్థమవబోధయంతి।
(శాబరభాష్య — 1 1 25)

ఙ) "అభిధాత్రీ మతా శక్తిః పదానాం స్వార్థనిష్ఠతా।
తేషాం తాత్పర్యశక్తిస్తు సంసర్గావగమావధిః॥
(శృం ప్ర అష్టమ పుట 296)/(న్యాయమంజరీ)

చ) సమయాపేక్షావగమనశక్తిర్హ్యభిధా, సమయశ్చ తావత్యేవ న విశేషాంశే, ఆనంత్యాద్వ్యభిచారాచ్చైకస్య తతో విశేషరూపే వాక్యార్థే తాత్పర్యశక్తిః పరస్పరాన్వితే, "సామాన్యాన్యన్యథాసిద్ధేర్విశేషం గమయంతి హి' ఇతి న్యాయాత్॥
—లోచనం [ధ్వన్యా ప్రథమ (పుట 56)'భ్రమధార్మిక' శ్లోకవ్యాఖ్యలో]

ఛ) ఏతదుక్తంభవతి — పదార్థజ్ఞానాంతరం తేషా మాకాంక్షాదివశా దన్వయే పదార్థాతిరిక్తో వాక్యార్థో విశేషాత్మా తాత్పర్యార్థో య-ద్బలాత్ సముల్లసతి తత్ తాత్పర్యాఖ్యం వ్యాపారాంతర మస్త్యేవ। అతఏవ — 'పదార్థావగమనానంతరభావినీ సమన్వయశక్తిః తాత్పర్యమ్' ఇత్యలంకారసర్వస్వసంజీవినీకారోఽపి॥
మల్లినాథతరళవ్యాఖ్య— (ఏకా. పుట. 57) 2.2.

మగుననియు, అనగా సంసర్గరూపవాక్యార్థము వాచ్యమే యగుననియు, కావున పదముల యన్వయమును అనగా సంసర్గరూపవాక్యార్థమును బోధించుటకై వేఱొక వృత్తి నంగీకరించునవసరము లేదనియు అన్వితాభిధానవాదులగు మీమాంసకు లభిప్రాయపడిరి [159] కాని—

---

159 క) ఏకార్థపదసమూహో వాక్యమ్। యథా శిబికాయా ఉద్యంతారః సర్వే శిబికాముద్యచ్ఛంతి, యథా గ్రావాణ ఉఖాం బిభ్రతి। తథా సర్వాణ్యపి పదాని వాక్యార్థమవబోధయంతి । న తు ఏకైకమనన్వితమర్థమ్॥
[న్యాయమంజరీ (చౌ.సం) పుట 366]

ఖ) అన్వయరూపే వాక్యార్థేఽపి పదార్థానాం శక్తిః, వ్యవహారేణాన్విత స్యైవోపస్థానాత్। తత్రైవ శక్తిగ్రహాత్ । కించ—అన్వయభాగస్య అశక్యత్వేఽనుభవవిషయత్వం న స్యాత్। తద్విషయే శక్యత్వస్య ప్రయోజకత్వాత్। అశక్యస్యాప్యనుభయ(వ)ప్రవేశేఽతిప్రసంగాత్। ఇత్యన్వితాభిధానవాదినాం మతమ్॥ (కావ్యప్రదీప 2 1)

గ) వాచ్య ఏవ వాక్యార్థ ఇత్యన్వితాభిధానవాదినః॥
(కావ్యప్రకాశః 2.6)

ఘ) వ్యవహారమువలన శక్తిగ్రహ(ణ)మెట్లు కలుగునో కావ్యప్రకాశమున వివరింపఁ బడినది—

యేఽప్యాహుః—
"శబ్దవృద్ధాభిధేయాంశ్చ ప్రత్యక్షేణాత్ర పశ్యతి ।
శ్రోతుశ్చ ప్రతిపన్నత్వమనుమానేన చేష్టయా॥
అన్యథానుపపత్త్యా తు బోధేత్ శక్తిం ద్వయాత్మికామ్।
అర్థాపత్త్యాఽవబోధేత సంబంధం త్రిప్రమాణకమ్॥"

ఇతి ప్రతిపాదితదిశా - 'దేవదత్త ! గామానయ' ఇత్యాద్యుత్తమ వృద్ధవాక్యప్రయోగాత్ దేశాద్దేశాంతరం సాస్నాదిమంతమర్థం మధ్యమవృద్ధే నయతి సతి " అనేనాస్మాద్ వాక్యాదేవంవిధోఽర్థః ప్రతిపన్నః" ఇతి తచ్చేష్టయాఽనుమాయ తయోరఖండవాక్య

మీమాంసకులలో నొక తెగవారు –

విధేయరూపవిశేష వాక్యార్థము తాత్పర్యశక్తిచేతనే కలుగుననిరి
వారి యభిప్రాయమిది –

శ్లో॥ ఉపమాం స పశ్యన్ ఋజునైవ చక్షుషా (కుమా 5 32) అను నప్పుడు కన్నుతోఁగాక ఇతరేంద్రియముతో చూచుటయే సంభవింపనేరదు కావున కన్నుతో చూచుచున్నాడని చెప్పుటలో నే విశేషమును లేదు కాని ఋజువగునేత్రముతో చూచుటలో నొకవిశేషము కలదు అదే ఆ దృష్టి ఋజువైనదని చెప్పుట కావున "యత్పరః శబ్దః స శబ్దార్థ" అను న్యాయాను సారము ఆ వాక్యమునకు దృష్టి ఋజువై యుండుటయే తాత్పర్యము అనగా విధేయరూపవిశేషవాక్యార్థము ఇది తాత్పర్యశక్తిచేతనే కలుగుననిరి 160

---

వాక్యార్థయో రర్థాపత్త్యా వాచ్యవాచకభావలక్షణం సంబంధమవ ధార్య బాలస్తత్ర వ్యుత్పద్యతే, పరతః "చైత్ర! గామానయ, దేవ దత్త! అశ్వమానయ, దేవదత్త! గాం నయ" ఇత్యాది వాక్య ప్రయోగే తస్య తస్య శబ్దస్య తం తమర్థమవధారయతీతి అన్వయ వ్యతిరేకాభ్యాం ప్రవృత్తినివృత్తికారి వాక్యమేవ ప్రయోగయోగ్య మితి వాక్యస్థితానామేవ పదానా మన్వితైః పదార్థైరన్వితానామేవ సంకేతో గృహ్యతే ఇతి విశిష్టా ఏవ పదార్థా వాక్యార్థో న తు పదార్థానాం వైశిష్ట్యమ్। యద్యపి వాక్యాంతరప్రయుజ్యమానాన్యపి ప్రత్యభిజ్ఞాప్రత్యయేన తాన్యేవైతాని పదాని నిశ్చీయంతే ఇతి పదార్థాంతరమాత్రేణాన్వితః పదార్థః సంకేతగోచరః, తథాపి సామాన్యాచ్ఛాదితో విశేషరూప ఎవాసౌ ప్రతిపద్యతే వ్యతిషిక్తానాం పదార్థానాం తథాభూతత్వాదిత్యన్వితాభిధానవాదినః॥

(కావ్యప్రకాశ పంచమ 69 సూత్రవృత్తి)

160. క) అనువాద్యానా మర్థానాం విధేయార్థపరత్వం తాత్పర్యం నామ వ్యాపారాంతరం పరైరభ్యుపగతమ్

"ఉమాం స పశ్యన్ ఋజునైవ చక్షుషా।
ప్రచక్రమే వక్తుమనుజ్ఝితక్రమః॥" (కుమా. 5 32)

ఈ యంశమును ఖండించుచు అన్వితాభిధానవాదులు —

"ఈ విధేయరూపవిశేషవాక్యార్థప్రతిపత్తికై నను తాత్పర్యశక్తి యను వృత్త్యంతరమునంగీకరింపఁ బని లేదనియు ఈ యర్థము కూడ అభిధా వ్యాపారముచేతనే బోధింపబడుననియు, "యత్పరః శబ్దః స శబ్దార్థః" అనగానే ప్రయోజనము నాశించి ఆ శబ్దమట్లు వ్యవహరింపఁబడినదో ఆ యర్ద మంతయు నా శబ్దవాచ్యమే యగుననియు, సమర్థుఁడైన విలుకాఁడు ప్రయో

---

ఇత్యత్ర దర్శనస్య చక్షుకరణత్వావ్యభిచారాత్ తదుపాదానం తద్విశేషణార్థం, తదేవ చాత్ర విధేయం, తత్పరత్వమేవ తాత్పర్యమ్॥
[ఏకావళీ (సం॥ త్రివేదీ) ద్వితీ పుట 57]

ఖ) అనువాద్యానామర్థానాం విధేయార్ధపరత్వే తాత్పర్యం నామ వృత్త్యంతరం పరైరంగీకృతం తత్ర సార్థకం పునర్వచన మనువాదః, సోఽర్థః ప్రయోజనం యేషాం తే అనువాద్యాః, తేషామిత్యర్థః। తచ్చ ప్రయోజనమ్ప్రాప్తస్యార్థస్య ప్రాప్తసంబంధితయా వాక్యాంతరప్రాప్తానువాదస్య తదేవ తాత్పర్యం, యథా— దధ్నా జుహోతి' ఇత్యత్ర 'అగ్నిహోత్రం జుహోతి' ఇతి వాక్యాంతరప్రాప్తో హోమః, తదనువాదస్య దధిహోమసంబంధవిధానార్థం తదేవ తాత్పర్యం। లోకేఽపి—

"ఉమాం స పశ్యన్ ఋజునైవ చక్షుషా ।
ప్రచక్రమే వక్తు మనుజ్ఝితక్రమః॥ (కుమా 5 32)"

ఇత్యత్ర యద్దర్శనం తచ్చక్షుషేతి వ్యాప్త్యా ప్రాప్తస్య చక్షుషోఽనువాదో ఋజునేత్యార్జవరూపవిశేషణార్థః, న చ విధానార్థ మనువాదో న విశేషణార్థమితి శంక్యమ్। తద్విశేషణ మార్జవమేవాత్ర విధేయమ్, విశేష్యస్య చక్షుషః ప్రాప్తత్వాత్। యథా—'లోహితోష్ణీషా ఋత్విజః ప్రచారన్తి', త్యత్ర లోహితోష్ణీషత్వం, తద్వత్। తథాచ—విధేయార్థ పర్యవసితత్వం తాత్పర్యమ్॥
—నౌకావ్యాఖ్యా—(సా ర. చతుర్థ పుట 312)

గించిన బాణము ఒకే వ్యాపారమున శత్రువుల కవచశరీరాదుల బేదించి ప్రాణములను గూడ తీయుట చూచుచునే యున్నామనియు కావున నొకే యభిధావ్యాపారము విధేయరూపవిశేషవాక్యార్థమువఱకును కొనసాగుటలో దోషము లేదనియు నుడివిరి [161]

కొందఱాలంకారికులును-ఆకాంక్షాయోగ్యతాదులవలననే పరస్పరాన్వయము భాసించుచుండుటచేత, విధేయరూపవిశేషార్థము (వాక్యార్థము) కూడ శబ్దోపాత్తమే యగునని దీనికొఱకు ప్రత్యేకముగా తాత్పర్యశక్తి యను నొక వృత్తి నంగీకరింపఁ బనిలేదనిరి [162]

---

161 క) యోఽప్యన్వితాభిధానవాదీ— "యత్పరః శబ్దః స శబ్దార్థః" ఇతి హృదయే గృహీత్వా శరవదభిధావ్యాపారమేవ దీర్ఘదీర్ఘ మిచ్ఛతి—

—లోచనం - (ధ్వన్యా ప్రథమ పుట 64)

ఖ) అయమర్థః—యథా ఖలు ధనుష్మతా ముక్తో బాణః ఏకేనైవ వేగ వ్యాపారేణ శత్రోః కవచాదికమనేకం భినత్తి తథైక ఏవ శబ్దస్య వ్యాపారో యావదుద్దేశ్యం బోధయతి

- సాహిత్యదర్పణలోచనవ్యాఖ్య (సా ద 51)

162. క) కించ-తాత్పర్యం నామ వృత్త్యంతరం న సంభవతి, వృత్తిత్రయాను స్యూతస్య తస్య వృత్త్యంతరత్వానుపపత్తేః। క్లృప్తేనైవ వృత్తి త్రయేణ సకల వ్యవహారోపపత్తౌ బాహ్యేంద్రియసహకారిణో మనస ఇంద్రియాంతరత్వకల్పనావత్ తస్య వృత్త్యంతరత్వకల్పన మయుక్తమేవేతి కేచిత్॥

(సా. ర చతుర్థ పుట 313)

ఖ) అత్ర సంసర్గరూపో వాక్యార్థః కథం ప్రతీయత ఇతి చేత్, తార్కికాణామివ వాక్యమహిమ్నా, న పునః తాత్పర్యేణ మీమాంసకానా మివేతి బ్రూమః॥

—రత్నాపణ. (ప్ర. రు. కావ్యప్రకరణం)

ఈ తాత్పర్యశక్తిచేఁ గాని దీర్ఘదీర్ఘతరమగు నభిధావృత్తిచేతఁ గాని వ్యంజనను గతార్థముచేయఁబూను మీమాంసకులమతము నాలంకారికులందఱును సోపపత్తికముగా ఖండించి వ్యంజనను వ్యవస్థాపించియేయున్నారు [163]

ఇట్లీ అభిధాలక్షణావ్యంజనలు అను మూడు శబ్దవృత్తులును వక్త్రభిప్రాయానుగుణమగు నర్థమును తెలియుటలో సహకారులగుచు భావవ్యక్తీకరణమును సుగమము చేయుచున్నవి



---

గ) తతశ్చ యావదేవ విధేయం తావత్యేవ తాత్పర్యం, విధేయం చ శబ్దోపాత్తమేవేతి సుష్ఠూక్తం శబ్దోపాత్త ఏవ తాత్పర్యమితి॥
(కావ్యప్రదీప. పంచమ పుట 150)

163 ఈ విషయము ముందు వివరింపఁబడును.



# ధ్వని - మనుచరిత్రము

## ద్వితీయ ప్రకరణము

### ధ్వని — దానిభేదములు

ధ్వని పద నిర్వచనము:—

ధ్వని యనగా—

"1) ధ్వన్యతే అనేనేతి ధ్వనిః వ్యాపారవిశేషః (వ్యంజనా)

2) ధ్వనతీతి ధ్వనిః వ్యంజకః శబ్దః వాచ్యాదిరర్థశ్చ

3) ధ్వన్యత ఇతి ధ్వనిః వ్యంగ్యార్థః

4) ధ్వన్యతేఽస్మిన్నితి ధ్వనిః కావ్యవిశేషశ్చ"

అనువ్యుత్పత్తులనాశ్రయించి—

1) అర్థాంతరమును ధ్వనింపఁజేయు వ్యాపారవిశేషమగు వ్యంజనయు

2) i) అట్టి యర్థమును ధ్వనించువ్యంజకమగు శబ్దమును

ii) ఆయర్థమును ధ్వనించువ్యంజకములగు వాచ్యాద్యర్థములును

3) అట్లు ధ్వనింపఁబడువ్యంగ్యార్థమును

4) ఇట్టి ధ్వని యుండు కావ్యవిశేషమును అగుచున్నవి.[1]

---

1. క) స ఇతి। అర్థో వా శబ్దో వా వ్యాపారో వా, అర్థోఽపి వాచ్యో వా ధ్వనతీతి, శబ్దోఽప్యేవమ్। వ్యంగ్యో వా ధ్వన్యత ఇతి। వ్యాపారో వా శబ్దార్థయోర్ధ్వననమితి। కారికాయాంతు ప్రాధాన్యేన సముదాయ ఏవ కావ్యరూపో ముఖ్యతయా ధ్వనిరితి ప్రతిపాదితః॥

—లోచన (ధ్వన్యా. 1.13 కా. వృత్తి పుట. 105)

ఇట్లు సాహితీక్షేత్రమున 'ధ్వని' యను పద మీ నాలుగింటికిని వర్తించి ప్రసిద్ధిఁగాంచినది

**వ్యంగ్యము ధ్వని యనుటకు హేతువు -**

నిజమునకు శబ్దమువలన పుట్టు వేరొక శబ్దమును ధ్వనియందురు భర్తృహరి తన వాక్యపదీయమున దీనినిట్లే నిర్వచించెను-

శ్లో॥ యః సంయోగవిభాగాభ్యాం కరణైరుపజన్యతే।
స స్ఫోటః, శబ్దజాః శబ్దాః ధ్వనయోఽన్యైరుదాహృతాః॥
(వాక్య. 1 103)

జిహ్వాగ్రాదిస్థానప్రయత్నములచే నుత్పన్నమగు శబ్దము స్ఫోటమనియు దానినుండి పుట్టు శబ్దసంతతి (శబ్ద తరంగములు) ధ్వని యనియు "స్ఫోటమనిత్య" మని చెప్పు వైయాకరణుల (ఉత్పత్తివాదుల) మతము [2]

ఇట్లు ఒక శబ్దము వలన కలిగిన మఱియొక శబ్దమును ధ్వని యని వ్యవహరించుట వైయాకరణ సంప్రదాయానుసారము ప్రసిద్ధమయి యుండుటఁ

---

ఖ) తేన-వాచ్యోఽపి ధ్వనిః వాచకోఽపి ధ్వనిః ద్వయోరపి వ్యంజకత్వం ధ్వనతీతి కృత్వా।సంమిశ్ర్యతే విభావానుభావసంవలనయేతి వ్యంగ్యోఽపి ధ్వనిః ధ్వన్యత ఇతికృత్వా। శబ్దనం శబ్దః శబ్దవ్యాపారః, న చాసావభిధాది రూపః, అపి త్వాత్మభూతః, సోఽపి ధ్వననం ధ్వనిః కావ్యమితి వ్యవ దేశ్యశ్చ యోఽర్థః సోఽపి ధ్వనిః, ఉక్తప్రకారధ్వనిచతుష్టయ మయత్వాత్॥

—లోచనం (ధ్వన్యా. 1.13 కా. వృ. పుటః 135)

2 అన్యైరితి। ఉత్పత్తివాదిభిరిత్యర్థః। యథోక్తం వృత్తికృతా-అనిత్యపక్షే స్థానకరణప్రాప్తివిభాగపూర్వకం ప్రథమమేభిర్నిర్వృత్తో యః శబ్దః స స్ఫోట ఉచ్యత ఇత్యాది। —బాలప్రియా (లోచనవ్యాఖ్య)-
(ధ్వన్యా. 1.13 కా. వృత్తి. పుట 133)

గాంచిన ఆనందవర్ధనాచార్యులు ఒక శబ్దమువలననో లేదా అర్ధమువలననో కలిగిన అర్థాంతరమునకు ధ్వనియని పేరిడెను [3]

**వ్యంజకములగు శబ్దమును, వాచ్యాద్యర్థములును ధ్వనిపదవాచ్యములగుటకు హేతువు.-**

వర్ణములు త్రిక్షణవృత్తిధ్వంసప్రతియోగులు అనగా ఉచ్చరించిన మూడవలక్షణమున నశించునవి కావున 'గ్+ఓ+వ్+ఉ"అను వర్ణసముదాయ రూపమగు 'గోవు' అను పదము నుచ్చరించుటయే తడవుగా ఆ పూర్వపూర్వ వర్ణములు నశించుటవలన చివరివర్ణమునుచ్చరించునప్పుడు వర్ణసముదాయరూప మగు ఆపదముయొక్క స్ఫూర్తియే లేకుండుటచే అర్థప్రతిపత్తి ఎట్లుకలుగునను శంకను నివారించుటకై వైయాకరణులు (స్ఫోటనిత్యత్వవాదులు)— "స్ఫోట మనునఖండశబ్దము నిత్యమై ఆకాశముననుండుననియు అదియే ఈధ్వని రూపములగు వర్ణములచే నభివ్యక్తీకరింపఁబడి అర్థప్రత్యాయనము చేయుననియు తెల్పిరి

---

3 క) ప్రథమే హి విద్వాంసో వైయాకరణాః, వ్యాకరణమూలత్వాత్ సర్వ విద్యానామ్। తే చ శ్రూయమాణేషు వర్ణేషు 'ధ్వని' రితి వ్యవహరంతి। తథైవాన్యైః తన్మతానుసారిభిః సూరిభిః కావ్యతత్త్వార్థదర్శిభిః। వాచ్య వాచక సమ్మిశ్రః శబ్దాత్మా కావ్యమితి వ్యపదేశ్యో వ్యంజకత్వసామ్యా ద్ధ్వని రిత్యుక్తః॥

(ధ్వన్యా. 1.13 కా. వృత్తి పుట. 135)

ఖ) శ్రూయమాణేతి। శ్రోత్రశష్కులీం సంతానేన గతా అన్త్యాః శబ్దాః శ్రూయంత ఇతి ప్రక్రియాయాం శబ్దజాః శబ్దాః శ్రూయమాణా ఇత్యుక్తం। తేషాం ఘంటానురణనరూపత్వం తావదస్తి। తే చ ధ్వని శబ్దేనోక్తాః। యథాహ భగవాన్ భర్తృహరిః- "యః సంయోగవిభా గాభ్యాం" (వాక్య 1 103 ఇతి। ఏవం ఘంటాదినిర్హ్రాదస్థానీయోఽను రణనాత్మోపలక్షితో వ్యంగ్యోఽప్యర్థో ధ్వనిరితి వ్యవహృతః॥

—లోచన (ధ్వన్యా 1 13 కా. వృత్తి. పుట 133)

ఇట గమనించవలసినదేమన - ధ్వనులు స్ఫోటమునకు వ్యంజకము లయినవికదా! అట్టి వ్యంజకత్వసామ్యమున అర్థాంతరమును తోపింపఁజేయు (వ్యంజకములగు) శబ్దార్థములును ధ్వనిపదవాచ్యములయినవి.[4]

**వ్యంజనావ్యాపారము 'ధ్వని'యని నిర్దేశించుటకు హేతువు:-**

ఏ శబ్దము నెట్లుచ్చరింపవలెనో అందఱును అట్లే ఉచ్చరింతురు. అయినను వృద్ధులు విలంబితముగాను బాలురు ద్రుతముగాను కొందఱు మంద్రముగాను, మరికొందఱు తారస్వరముననుఉచ్చరింతురు జిహ్వాగ్రాదిస్థానప్రయత్నములచేనగు నుచ్చారణావ్యాపారము బాలవృద్ధాదులయందేకరూపమే యయినను అట్లు ద్రుతవిలంబితాదివృత్తిభేదమునకు వైకృతధ్వనులు నిమిత్తములగుచున్నవి.[5]

ఇట్లు వైకృతధ్వనులచే విభిన్నమయిన ద్రుతవిలంబితాదిరూపమగు నుచ్చారణావ్యాపారమును ధ్వనియని వ్యవహరించుట వైయాకరణుల సంప్రదాయము.

ఇట గమనించవలసినదేమన - ప్రసిద్ధమగు జిహ్వాగ్రాదిస్థానప్రయత్నరూపమగు నుచ్చారణావ్యాపారమునకంటె నతిరిక్తమైన ద్రుతవిలంబితాదిరూపమగు నుచ్చారణావ్యాపారమును ధ్వనియని వ్యవవహరించినట్లు, ప్రసిద్ధమగు

---

4 తథా శ్రూయమాణా యే వర్ణా నాదశబ్దవాచ్యా అంత్యబుద్ధినిర్గ్రాహ్యస్ఫోటాభివ్యంజకాస్తే ధ్వనిశబ్దేనోక్తాః। యథాహ భగవాన్ స ఏవ—

"ప్రత్యయై రనుపాఖ్యేయై ర్గ్రహణానుగుణైస్తథా।
ధ్వనిప్రకాశితే శబ్దే స్వరూప మవధార్యతే॥"
తేన వ్యంజకౌ శబ్దార్థావపీహ ధ్వనిశబ్దేనోక్తౌ॥

—లోచన (ధ్వన్యా 1.13 కారికావృత్తి పుట 133)

5. వర్ణస్య గ్రహణే హేతుః ప్రాకృతో ధ్వనిరిష్యతే ।
వృత్తిభేదే నిమిత్తత్వం వైకృతః ప్రతిపద్యతే ॥

(వాక్యప. 1.75)

నభిధాదిశబ్దవృత్తులకంటెనతిరిక్తమగు వ్యంజనావృత్తిని ధ్వనియని ధ్వన్యాచార్యులు వ్యపదేశించిరి [6]

**కావ్యవిశేషమునకు ధ్వనియని పేరిడుటకు కారణము:—**

ఇట్లు వ్యంగ్యమగునర్థమును, వ్యంజకములగు శబ్దార్థములును వ్యంజనావ్యాపారమును అనునీనాలుగును ధ్వనిపదమున వ్యవహృతములగుట యీనాలుగింటిసంబంధముకలిగియున్న కావ్యవిశేషమును కూడ ధ్వనియని వ్యవహరించుటకు కారణమైనది [7]

ఇట్లు వైయాకరణులస్ఫోటవాదమునూతఁగాఁగొని ఆనందవర్ధనాచార్యులు ధ్వనిపదమును సాహితీక్షేత్రమున నవతరింపఁజేసిరి

---

6 కించ-వర్ణేషు తావన్మాత్రపరిమాణేష్వపి సత్సు। యథోక్తం—
"అల్పీయసాఽపి యత్నేన శబ్దముచ్చారితం మతిః।
యది వా నైవ గృహ్ణాతి వర్ణం వా సకలం స్ఫుటమ్॥" ఇతి।
తేషు తావత్స్వేవ శ్రూయమాణేషు వక్తుర్యోఽన్యో ద్రుతవిలంబితాది వృత్తిభేదాత్మా ప్రసిద్ధాదుచ్చారణావ్యాపారాదభ్యధికః స ధ్వనిరుక్తః। యదాహ స ఏవ—

"శబ్దస్యోర్ధ్వమభివ్యక్తేర్వృత్తిభేదే తు వైకృతాః।
ధ్వనయః సముపోహన్తే స్ఫోటాత్మా తైర్న భిద్యతే॥"। ఇతి।
అస్మాభిరపి ప్రసిద్ధేభ్యః శబ్దవ్యాపారేభ్యోఽభిధాతాత్పర్యలక్షణారూపేభ్యోఽతిరిక్తో వ్యాపారో ధ్వనిరిత్యుక్తః॥
— లోచన- (ధ్వన్యా. 1.13 కారికావృత్తి)

7. ఏవం చతుష్కమపి ధ్వనిః, తద్యోగాచ్చ సమస్తమపి కావ్యం ధ్వనిః॥
— లోచన (ధ్వన్యా. 1.13 కా. వృత్తి)

ధ్వనిభేదములు..

ధ్వని యన వ్యంగ్యార్థము - అది వస్త్వలంకారరసాదిరూపమున మువ్విధము.[8]

వస్తుధ్వని -

శ్లో॥ రాజ్ఞో మత్ప్రతికూలాన్మే మహద్భయముపస్థితమ్।
బాలేః వారయ పాంథస్య వాసదానవిధానతః॥
[రసగం(నిర్ణ. ప్ర) ద్వితీ పుట. 163]

మత్ప్రతికూలుఁడగు రాజువలన గొప్పభయము దాపరించినది ఓబాలాః ఈ పాంథునకు తలదాచుకొనుటకు కొంతచోటిచ్చి యాదుకొనుమని పదుగురు వినుచుండ నొకబాటసారిపలికిన ఈపలుకులలో - ఈ రాజు అనగా చంద్రుడు విరహినగు నన్నేఁచుచున్నాఁడనియు ఉపభోగమునిచ్చి నన్నాచంద్రునిబారి నుండి కాపాడుమనియు నర్థాంతరము ధ్వనించుచున్నది-

శబ్దశక్తి మూల వస్తుధ్వని·—

ఇది శబ్దశక్తిమూలవస్తుధ్వని-ఎట్లనః ఈ వ్యంగ్యార్థము నిరలంకారమగు వస్తురూపము-మఱియు — ఇట ప్రధానముగా నానార్థకమగు 'రాజ'పదమునకుఁగలరెండవయర్థము చంద్రుఁడనునదియే ఈ వ్యంగ్యార్థమును స్ఫురింపఁజేయుచున్నది 'రాజ' పదము కాక దానిస్థానమున తత్పర్యాయములగు నృపాది

---

8 క) స చ (వ్యంగ్యోఽర్థః) ధ్వన్యతే ద్యోత్యతే ఇతి ధ్వనిరితి పూర్వాచార్యైః సంజ్ఞితః। అయం చ వస్త్వలంకారరసాదిభేదాత్త్రిధా ॥
కావ్యానుశాసన (1.19 సూత్రవృత్తి)

ఖ) "యద్యప్యనేకధా వ్యంగ్యం వ్యంజకాదివిభేదతః ।
తథాపి వస్త్వలంకారరసాత్మత్వాత్ త్రిధైవ తత్ ॥"
(అలం. మహో. 3 6)

పదములనుంచినచో నీయర్థస్ఫూర్తి కలుగదు కావున నిది శబ్దశక్తిమూలక మయినది [9]

నిగూఢమగు తనయభిప్రాయము పదుగురికి తెలియకుండుటకయియే ఆ బాటసారి ఇట్లు రెండర్థములుగల రాజశబ్దమును వాడియుండుటచే రాజశబ్దమునకుగల నృపుఁడనునర్థము చంద్రుఁడనునర్థాంతరమును కప్పిపుచ్చుచున్నది కావున ఆచ్ఛాద్యాదకభావమునొందిన చంద్రనృపులకుపమానోపమేయభావము కల్పించి యుపమాలంకారధ్వనియనుటకు వీలులేదు అకారణముననిది వస్తుధ్వనియయినది.[10]

ఇఁక అర్థశక్తి మూలవస్తుధ్వని -

శిఖిపిచ్ఛకర్ణపూరా జాయా వ్యాధస్య గర్వీణీ భ్రమతి।
ముక్తాఫలరచితప్రసాధనానాం మధ్యే సపత్నీనామ్॥

(గాథాసప్తశతీ 2.73)

---

9. తత్ర-శబ్దా యత్ర పరివృత్తిం న సహంతే స శబ్దశక్త్యుద్భవః॥

(కావ్యపరీక్షా 2 28)

10 అత్ర—ఉపభోగం దేహీతి వస్తు రాజపదశక్తిమూలానురణనవిషయః, రాజపదాచ్చంద్రోపస్థితావేవ చంద్రజనితభయవారణకారణత్వేనోపభోగస్యాభివ్యక్తేః। న చాత్ర నృపచంద్రయోరుపమానోపమేయభావః భేదాపోహరూపం రూపకం వా తథాఽస్త్వితి వాచ్యం। ఇహ నృపరూపస్యార్థస్య చంద్రరూపార్థగోపనమాత్రార్థముపాత్తత్వేన యుగప దుల్లసితోపమానోపమేయకయోరుపమారూపకయోస్తాత్పర్యవిషయతాయా అయోగాత్। న చాసంసృష్టార్థబోధనే వాక్యభేద ఇతి వాచ్యం। తుల్యకక్షతయా ద్వయోరసంసృష్టయోరర్థయోః ప్రతిపిపాదయిషితత్వ ఏవ తస్యాభ్యుపగమాత్। ఇహ త్వాచ్ఛాదకప్రతీతిసమయే ఆచ్ఛాద్యాప్రతీతిః, ఆచ్ఛాద్యప్రతీతౌ చాచ్ఛాదకస్యగ్నావ ఏవేతి నాస్తి తుల్యకక్షతా॥

(రసగం ద్వితీ పుట 163)

"తనసవతులు ముత్తెములయాభరణములు దాల్చియుండ తాను నెమిలి పింఛములకర్ణాభరణములు దాల్చినదైనను ఈ వ్యాధునిభార్య సవతులనడుమ గర్వముతో దిరుగాడుచున్నది" అను నీ వాచ్యార్థముచే – సవతులవారమున (వంతున) దూరదేశమునకైనను వెళ్ళి గజముల వేటాడి ముత్తెములఁదెచ్చి వారినలంకరించువాఁడనిన వారిని విడిచిపోలేకయుండునంత అనురాగాతిశయము లేదనియు, ఇఁక ఈయమ వారముననో సమీపప్రదేశములయందున్న మయూరములనే వేటాడి నెమిలిపింఛములచేతనే ఈయమనలంకరించువాఁడనియు, అందుకు కారణము ప్రియను వీడి దూరదేశము వెళ్ళలేక పోవునంత యనురాగాతిశయము కలిగియుండుటయే యనియు తెలియుచున్నది. దీనిచే వ్యాధవధువుసౌభాగ్యాతిశయము సపత్నులదౌర్భాగ్యాతిశయమును ధ్వనించుచున్నది [11]

---

11. క) అనేనాపి వాక్యేన వ్యాధవధ్వాః శిఖిపిచ్ఛకర్ణపూరాయా నవపరిణీతాయాః కస్యాశ్చిత్ సౌభాగ్యాతిశయః ప్రకాశ్యతే, తత్సంభోగైకరతో మయూరమాత్రమారణసమర్థః పతిర్జాత ఇత్యర్థప్రకాశనాత్। తదన్యాసాం చిరపరిణీతానాం ముక్తాఫలరచితప్రసాధనానాం దౌర్భాగ్యాతిశయః ఖ్యాప్యతే తత్సంభోగకాలే స ఏవ వ్యాధః కరివరవధవ్యాపారసమర్థ ఆసీదిత్యర్థప్రకాశనాత్॥

(ధ్వన్యా తృతీ పుట. 300)

ఖ) శిఖిమాత్రమారణమేవ తదాసక్తస్య కృత్యం। అన్యాసు త్వాసక్తో హస్తినోఽప్యమారయదితి హి వచనేనోక్తముత్తమసౌభాగ్యమ్। రచితాని వివిధభంగీభిః ప్రసాధనానీతి తాసాం సంభోగవ్యగ్రిమాభావాత్ తద్విరచనశిల్పకౌశలమేవ పరమితి దౌర్భాగ్యాతిశయ ఇదానీమితి ప్రకాశితం। గర్వశ్చ బాల్యావివేకాదినాపి భవతీతి నాత్రాస్యోక్తిసద్భావః శంక్యః। ఏష చార్థో యథా యథా వర్ణ్యతే, ఆస్తాం వా వర్ణనా, బహిరపి యది ప్రత్యక్షాదినాఽవలోక్యతే తథా తథా సౌభాగ్యాతిశయం వ్యాధవధ్వా ద్యోతయతి॥

–లోచన (ధ్వన్యా 2 24. కా. ఉదా పుట 256)

వాచ్యార్థముచేనగు వస్తుధ్వని –

ఇట్టియర్థాంతరస్ఫూర్తిని కలుగఁజేసినది వాచ్యార్థమే కావుననిది వాచ్యార్థముచేనగు వస్తుధ్వనియయినది.

స్వతఃసంభవియగు (లోకసిద్ధమగు) వాచ్యార్థముచే వస్తుధ్వని –

ఈ వ్యాచ్యార్థము కూడ లోకరీతిననుసరించి యున్నదే కాని కవి కల్పనావైచిత్రిచే నేర్పడినది కాదు కావున దీనిని స్వతఃసంభవియగు వాచ్యార్థమందురు.[12] దీనిచే నేర్పడినది కావున నీ వస్తుధ్వని స్వంతఃసంభవియగు వాచ్యార్థముచేనగు వస్తుధ్వనియయినది

కవిప్రౌఢోక్తిచేనగు వస్తుధ్వని –

ఒకచో నీ వాచ్యార్థము కవిప్రౌఢోక్తి (కవికల్పనా వైచిత్రి)చే నేర్పడి యర్థాంతరమును ధ్వనించును

ఉదా -

తదవధి కుశలీ పురాణశాస్త్రస్మృతిశతచారువిచారజో వివేకః।
యదవధి న పదం దధాతి చిత్తే హరిణకిశోరదృశో దృశోర్విలాసః॥
[భామినీ శృ 13 / రసగం ద్వితీ అర్థశక్తిమూలధ్వని]

"లేడికన్నుల జవరాలి క్రీఁగంటిచూపులు తనమనమున పదమునిడకుండునంతవఱకే పురాణశాస్త్రాదిపరిశీలనాజన్యమగు వివేకము కుశలియై యుండును." అను నీ వ్యాచ్యార్థముచే "కురంగనయనా దృగ్విలాసము చిత్తము నాయత్తమొనర్చుకొనిన నిఁక వివేకమునకు కుశలమెట్లుండు"నను వస్తువు వ్యంగ్యము

---

12 స్వతః సంభవీ య ఔచిత్యేన బహిరపి సంభావ్యమానసద్భావో న కేవలం భణితివశేనైవాభినిష్పన్నశరీరః॥
(ధ్వన్యా. 2.24 కా. వృత్తి. పుట 256)

ఇట "కురంగనయనాదృగ్విలాసము చిత్తమున పదము నిడుట యను నీ యర్థము లోకసిద్ధముగాక కవికల్పనావైచిత్రిచే సిద్ధించినది కాన నిది కవిప్రౌఢోక్తిచేనగు వస్తుధ్వని [13]

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిచేనగు వస్తుధ్వని·—

వెఱొకచో కవి చిత్రించిన పాత్రయొక్క ఉక్తివైచిత్ర్యముచే నర్థాంతరస్ఫూర్తికలుగును

ఉదా:-

శిఖరిణి క్వ ను నామ కియచ్చిరం
    కిమభిధానమసావకరోత్తపః।
తరుణి! యేన తవాధరపాటలం
    దశతి బింబఫలం శుకశావకః॥

(సా ద. చతర్థ. అర్థశక్తిమూలధ్వని)

"ఓ తరుణీ! నీయధరమును బోలినదొండపండును ఈ చిలుక ఆస్వాదించుచున్నదనఁగా నిది ఏపర్వతమున నెట్టితపము ఎంతకాలము చేసియున్నదో కదా." అను నీ వాచ్యార్థముచే "నీయధరము పుణ్యాతిశయలభ్య" మను నర్థాంతరము వ్యంగ్యము [14]

---

13 అత్ర కామినీదృగ్విలాసే చేతసి పదమర్పితవతి వివేకస్య నాస్తి కుశలమితి వస్తునా దృగ్విలాసకర్తృకపదార్పణస్య లోకసద్ధత్వాభావాత్ కవి-ప్రౌఢోక్తినిష్పన్నత్వేన—'సునిషణ్ణే తస్మిన్ కా కుశలచర్చా వివేకస్యేతి వస్తు వ్యజ్యతే॥

(రసగం. ద్వితీ. అర్థశక్తిమూలధ్వని పుట 171)

14 అత్రానేన కవినిబద్ధస్య కస్యచిత్ కామినః ప్రౌఢోక్తిసిద్ధేన వస్తునా తవాధరః పుణ్యాతిశయలభ్య ఇతి వస్తు ప్రతీయతే॥

(సా ద చతు అర్థశక్తిమూలధ్వని)

ఇట వాచ్యార్గము కవికల్పించినపాత్రయగు నాకకాముకుని ఉక్తి వైచిత్ర్యమే కాని లోకసిద్ధము కాదు కావున నిది కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిచేనగు వస్తుధ్వని [15] వీనిని వస్తుకృతవస్తుధ్వనులందురు. ఇఁక-

**అలంకారముచేనగు వస్తుధ్వని —**

ఒకచో నేదో యొక అలంకారముచే నర్థాంతరము ధ్వనించును

**ఉదా:-**

అపసరతి సఖీభిః సమం లజ్జా వధ్వాః శిథిలమానాయాః।
ఆత్మగ్రహణభయేనేవ సవిధగతే మనోహరే దయతే॥

(ప్ర రు కావ్యప్రకరణం శ్లో 52)

"ప్రియుఁడు సమీపించుటతోడనే ఈర్ష్యారోషపువట్టు వీడిన వధువుయొక్క లజ్జ తన్నుగూడ పట్టుకొనునేమో యను భయముచేతనా? యనునట్లు సకియలతోపాటు తాను గూడ తొలఁగిపోయినది' అనునది వాచ్యార్థము, సిగ్గు తొలఁగిపోవుట స్వాభావికమే కాని అట్టి భయముచేఁగాదు అయినను కవి యట్లుత్ప్రేక్షించుటచే నిది హేతూత్ప్రేక్ష- ఈ యలంకారముచే నాలింగన రూపమగు వస్తువు వ్యంగ్యము [16]

**మఱియొక ఉదాహరణము —**

గర్వాంధ గంధగజ కుంభకపాటకూట-
సంక్రాంతి నిఘ్నఘన శోణితశోణ శోచిః।
వీరై ర్వ్యలోకి యుధి కోపకషాయకాంతిః
కాలీకటాక్ష ఇవ యస్య కరే కృపాణః॥ (కావ్యప్రకాశః 4 62)

---

15. శిఖరిణీతి। అత్ర లోహితం బింబఫలం శుకో దశతీతి న వ్యంజకతా కాచిత్, యదా తు కవినిబద్ధస్య సాభిలాషస్య తరుణస్య వక్తురిత్థం ప్రౌఢోక్తిస్తదా వ్యంజకత్వమ్॥

—లోచన (ధ్వన్యా ద్వితీ అర్థశక్తి. ధ్వ. పుట 255)

16. అత్రోత్ప్రేక్షయాఽఽలింగనరూపం వస్తు వ్యజ్యతే॥

(ప్ర. రు. కావ్య శ్లో. 52)

శత్రువీరులు ఏ నృపాలునిచేతనున్న కరవాలమును, యుద్ధసమయమున మదపుటేనుఁగుల గండస్థలముల చీల్చుటచేఁగలిగిన నెత్తురు పూతతో నెఱ్ఱని కాంతులు విరజిమ్ముచుండఁ జూచి కోపారుణకాంతియగు కాలీకటాక్షము వలెనున్నట్లు భావించిరో (అట్టివాఁడారాజు) ఇట ఖడ్గమును కాలీకటాక్షముతోఁ బోల్చుటచే నుపమాలంకారము-దానిచే "సకలశత్రు సైన్యసంక్షయము క్షణమునఁ జేయనున్నాఁ"డను వస్తువు వ్యంగ్యము 17

ఇట్లెన్నియో యలంకారములు అర్థాంతరరూపమగు వస్తువును ధ్వనించుచుండును

ఇట్టి ఉపమాలంకారాదులు కొన్ని లోకసిద్ధములేయయినను ఉత్ప్రేక్షా ఉతిశయోక్త్యాదులు మఱికొన్ని కవిప్రౌఢోక్తిరూపములేయగును

కావున పూర్వోదాహరణమున స్వతఃసంభవియగు నలంకారముచేనగు వస్తుధ్వని.

ఇట్లే కవిప్రౌఢోక్తి కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిరూపములగు నలంకారములచేనగు వస్తుధ్వనులను గూడ నుదాహరింపవచ్చును

కావున వ్యంజకములగు నీ వస్త్వలంకారములు రెండును లోకసిద్ధములు కవిప్రౌఢోక్తి సిద్ధములు కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధములని ముత్త్వివిధములగునని కావ్యప్రకాశకారాదులు18 నిర్వచించఁగా, కవికల్పితపాత్రద్వారా చెప్పించిన ప్రౌఢోక్తి కవిప్రౌఢోక్తి కాక వేరొండు కాదనియు కావున నీరెంటినొకభేదము

---

17 అత్రోపమాలంకారేణ సకలరిపుక్షయః క్షణాత్ కరిష్యత ఇతివస్తు॥
(కావ్యప్రకాశః 4 62)

18 స్వతఃసంభవీ న కేవలం భణితిమాత్రనిష్పన్నో యావద్బహిరప్యౌచిత్యేన సంభావ్యమానః కవినా ప్రతిభామాత్రేణ బహిరసన్నపి నిర్మితః కవినిబద్ధేన వక్త్రేతి వా ద్వివిధోఽపర ఇతి త్రివిధః వస్తు వాఽలంకారో వాఽసావితి షోఢా వ్యంజకః॥
(కావ్య. 4-39, 40 వృత్తి)

గానే పరిగణించుట తగుననియు ధ్వన్యాలోక- రసగంగాధరకారాదు లభిప్రాయ పడిరి[19] లోకసిద్ధవిషయమే యయినను కవికల్పన దానిలోను కొంతయుండియే యుండును కావున నిట్టి వ్యంజకమగు నర్థము (వస్త్వలంకార రూపమగు వాచ్యార్థము) త్రివిధమని చెప్పుట యనుచితమనియు కేవలము ప్రౌఢోక్తిరూపమని యొకేవిధముగా పరిగణించుటయే తగుననియును ఆచార్య హేమచంద్రుదు లభిప్రాయపడిరి[20]

---

19 క) అర్థశక్త్యుద్భవానురణనరూపవ్యంగ్యే ధ్వనౌ యో వ్యంజకోఽర్థ ఉక్తః తస్యాపి ద్వౌ ప్రకారౌ-కవేః కవినిబద్ధస్య వా వక్తుః ప్రౌఢోక్తి మాత్రనిష్పన్నశరీర ఏకః, స్వతఃసంభవీ చ ద్వితీయః॥
(ధ్వన్యా 2.24 కా. వృత్తి)

ఖ) ప్రతిభానిర్వర్తితత్వావిశేషాచ్చ కవి—తదున్మిత (కవినిబద్ధ) వక్తృ ప్రౌఢోక్తినిష్పన్నయోరర్థయోర్న పృథగ్భావేన గణనోచితా॥
(రసగం ద్వితీ సం. క్ర ధ్వనినిరూపణ పుట 135)

గ) తత్ర స్వతఃసిద్ధో న కేవలం భణితిమాత్రనిష్పన్నో బహిరప్యౌచిత్యేన సంభావ్యమానః, కవిప్రౌఢినిర్మితస్తు కవినా ప్రతిభావైభవేన బహి రసన్నపి నిర్మితః, కవినిబద్ధవక్తృప్రౌఢోక్తినిర్మితస్తు కవిప్రౌఢి నిర్మితాన్నాతిరిచ్యత ఇతి పృథక్ నోక్తః॥
(అలంకారమహోదధిః. 3.58 కా వృత్తి)

ఘ) వస్తుతస్తు తద్వర్ణితస్యేతి భేదాంతరం న సంభవత్యేవ, కవినిబద్ధస్యాపి కవిత్వాత్। తేనార్థః స్వతఃసంభవీ ప్రౌఢోక్తిమాత్రనిష్పన్న ఇతి ద్వివిధః॥
—శ్రీవత్సలాంఛన. (కావ్యపరీక్షా. 2.31. వృత్తి)

20 ఇహ చార్థః—స్వతఃసంభవీ, కవిప్రౌఢోక్తిమాత్రనిష్పన్నశరీరః, కవి నిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్రనిష్పన్నశరీరో వేతి భేదకథనం న న్యాయ్యం, ప్రౌఢోక్తినిర్మితత్వమాత్రేణైవ సాధ్యసిద్ధేః, ప్రౌఢోక్తిమంతరేణ స్వతఃసంభవినోఽప్యకించిత్కరత్వాత్। కవిప్రౌఢోక్తిరేవ చ కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తిరితి కిం ప్రపంచేన॥
(కావ్యానుశాసనం. 1.24 సూత్రవృత్తి)

కవికల్పనావైచిత్రి (కవిప్రౌఢోక్తి) యన్నింట నుండుట సమానమే యయినను, స్వతఃసంభవియగు నర్థమనఁగా, లోకమర్యాద ననుసరించి యుండునది యనియు, కవిప్రౌఢోక్తిసిద్ధమనిన కేవలము కవిప్రతిభావైభవముచే నేర్పడినదే కాని లోకమర్యాద ననుసరించి చూచిన పొసఁగియుండునది కాదనియు, కావున నీ భేదపరికల్పనమవసరమనియు సకలాలంకారికులును గుర్తించియేయున్నారు ఇఁక కవిప్రౌఢోక్తికవినిబద్ధవక్తృప్రౌఢోక్తులలోను సూక్ష్మభేదముండియే యున్నది కావ్యమంతయు కవికల్పనావిలసితమేయయి నను, పాత్రలతీరునుబట్టి సంభాషణౌచిత్యము కూర్చుకవి గ్రామ్యపాత్రలద్వారా గ్రామ్యోక్తులు పలికించిన నది భూషణమేకాని కవికి దూషణము కానట్లు అనఁగా ఆ దోషము కవికి చెందనట్లు, కవి చిత్రించిన పాత్రలద్వారా పలికించిన ఉక్తివైచిత్ర్యములలోఁ జూపిన రాగాద్యతియము అయా పాత్రలకే చెందును కాని తనకు చెందదు కావున కేవలము తానుగాఁ గూర్చిన ప్రౌఢోక్తులలో ఔచిత్యభంగభయముచే నా భావావేశము చూపకుండుటయు చూచుచునే యున్నాము కావున నీ సూక్ష్మాంశము గమనించియే కావ్యప్రకాశకారాదులు తదనుయాయులగు సాహిత్యదర్పణకారాదులును వ్యంజకమగు నర్థము త్రివిధ మని చెప్పియున్నారు [21]

**లక్ష్యార్థముచేనగు వస్తుధ్వని —**

ఇట్లు వాచ్యార్థముచేతనే కాక యొకచో లక్ష్యార్థముచేతను అర్థాంతర స్ఫూర్తి కలుగును

**ఉదా -**

స్నిగ్ధశ్యామల కాంతిలిప్తవియతో వేల్లద్బలాకా ఘనా
వాతాః శీకరిణః పయోదసుహృదామానందకేకాః కలాః।
కామం సన్తు దృఢం కఠోరహృదయో రామోఽస్మి సర్వం సహే
వైదేహీ తు కథం భవిష్యతి హహా! హా! దేవి! ధీరా భవ॥

(ధ్వన్యా ద్వితీ. 1 కాం ఉదా. పుట 167)

---

21. స్వతఃసంభవీ ఔచిత్యాత్ బహిరపి సంభావ్యమానః । ప్రౌఢోక్త్యా సిద్ధో నత్వౌచిత్యేన । ... న ఖలుకవేః కవినిబద్ధస్యేవ రాగాద్యావిష్టతా; అతః కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిః కవిప్రౌఢోక్తే రధికం సహృదయ చమత్కారిణీతి పృథక్ ప్రతిపాదితా (సా ద. 4.9 కా. వృత్తి)

నునువైన తమ నల్లని కాంతులచే నాకాశమునకు పూఁత పెట్టినవియును గర్భాధానసౌఖ్యము నాశించి తమ కక్షముఖముగా శ్రేణీభూతములై నిలిచియున్న బెగ్గురుపక్షులు గలవియును అగు మేఘములు, వీటితుంపరలను వెదచల్లువాయువులును తమ చెలికాఁడగు మేఘునిఁజూచి అవ్యక్తమధురముగాఁ బాడుచున్న మయూరముల యానందకేకాధ్వనులును, ఉండిన నుండుగాక (విరహుల నేఁచు స్వభావముగల యివి యన్నియును కలిసి నన్నేఁచిన నేఁచుగాక యనుట) కఠోర హృదయుఁడనగు రాముఁడను గదా! వీనినన్నింటిని సహించు (ధైర్యముగల) వాఁడను కాని అయ్యో! ఆ వైదేహియే ఏమగునో! హా! దేవీ! ధైర్యముఁబూనుము.

ఇట తాను రాముఁడై యుండియు రాముఁడనని చెప్పుకొనుట పొసఁగదు అనగా వాచ్యార్థమునకనుపపత్తి కావున లక్షణచే "రామ" పదమునకు "రాజ్య భ్రంశ- వనవాస పితృమరణ సీతాహరణాదినైకవిధదుఃఖపాత్రుఁడనగు రాముఁడ"ననునది లక్ష్యార్థము [22] దీనిచే తాను మాటలలోఁ జెప్పనలవికాని దుఃఖములు సహించినవాఁడననియు అట్టి తనకు ఈ వియోగదుఃఖము సహించుటొక లెక్కలోనిది కాదనియు వ్యంగ్యము ఇట కఠోరహృదయపదమునకును ఎంతో ప్రాముఖ్యమున్నదని అభినవగుప్తపాదులు ఆచార్య హేమచంద్రులును వాఖ్యానించిరి. [23]

**అర్థాంతర సంక్రమితవాచ్య (మగువస్తు) ధ్వని·-**

ఇదియే అర్థాంతర సంక్రమిత వాచ్య (మగు వస్తు) ధ్వని, ఎట్లన? ఇట రాముఁడనునర్థము (వాచ్యార్థము) "మాటలతోఁ జెప్పనలవికాని రాజ్యభ్రం

---

22. తథా చ రామశబ్దేన ప్రతీతత్వాత్ బాధితముఖ్యార్థేన ఆధారాధేయ- రూపాత్ సంబంధాత్ రాజ్యభ్రంశ - ప్రవాస - పితృమరణాది దుఃఖ పాత్రత్వం లక్ష్యతే॥ (అలం మహో. 8 271)

23. కఠోరహృదయ ఇతి। రామశబ్దార్థ వ్యంగ్యవిశేషావకాశదానాయ కఠోర హృదయపదమ్ । యథా "తద్గేహం నతభిత్తి త్యుక్తే నతభిత్తీతి । అన్యథా రామపదం దశరథకులోద్భవ కౌసల్యాస్నేహపాత్రత్వ బాల్యచరిత జానకీలాభాది ధర్మాంతర పరిణతమర్థం కథం వా న ధ్వనేత్॥ (కావ్యాను 1.68 శ్లో వ్యాఖ్య.)

శాదినైకవిధ దుఃఖములకు పాత్రుఁడనగు రాముఁడ"నను నర్థాంతరమున సంక్రమించినది కావున నిది అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని యయినది [24]

**అత్యంత తిరస్కృత వాచ్యమగు వస్తుధ్వని:—**

ఇట్లొకచో వాచ్యార్థము అర్థాంతరమున సంక్రమించఁగా వేఱొకచో నత్యంత తిరస్కృతమగుచున్నది.

**ఉదా.-**

గగనం చ మత్తమేఘం ధారాలులితార్జునాని చ వనాని।
నిరహంకారమృగాంకా హరంతి నీలా అపి నిశాః॥

(ధ్వన్యా 2.1 కా ఉదా. పుట 173)

ఆకాశము మదించిన మేఘములచే నాచ్ఛాదితమై యున్నదే కాని నక్షత్రములచే విలసితమై యుండలేదు వనములు వర్షధారలచే చలించిన మద్ది చెట్లు గలవియే కాని పిల్లగాలులచే నల్లనల్లన నల్లలాడుచున్న మామిడిచెట్లుగలవి కావు. చంద్రునిగర్వముడిగిన నల్లనిరాత్రులే కాని వెన్నెలరాత్రులు కావు. అయినను ఇవి మనమునమేమో ఉత్కంఠను రేకెత్తించుచున్నవి [25]

---

24 అయం చ వాచ్యస్య రామరూపస్య రాజ్యభ్రంశాదిదుఃఖపాత్రరూపే ఽర్థాంతరే సంక్రాంతత్వాత్ అర్థాంతరసంక్రాంతవాచ్య ఏవ, నత్వత్యంతతిరస్కృతవాచ్యో, ముఖ్యార్థస్యాపి కథంచిదుపయుజ్యమానత్వాదితి॥

(అలం. మహో 3.721 వృత్తి)

25 గగనం మత్తమేఘమపి। న కేవలం తారకితం। ధారాలులితార్జునవృక్షాణ్యపి వనాని, న కేవలం మలయమారుతాందోలితసహకారాణి। నిరహంకారమృగాంకా నీలా అపి నిశా న కేవలం సితకరకరధవళితాః। హరంతి ఉత్సుకయంతీత్యర్థః।

—లోచన (ధ్వన్యా 2.23 కా. ఉదా.)

మద్యోపయోగజన్యమగు మదము, అహంకారము[26] అను నీరెండును చేతనధర్మములు, అచేతనములగు మేఘమందును చంద్రునియందును పొసఁగవు కావున వాచ్యార్థమత్యంతతిరస్కృతమయినది

దీనిచే మేఘములు త్రాగినవారివలె విచ్చలవిడిగా చెలరేఁగి దుర్నివార ములై ఆకాశమును కప్పివేయుచున్నవనియు, చంద్రుఁడు పరతంత్రునివలె గర్వమడంగి తన యుత్కర్షను గోల్పోయినాఁడనియు వ్యంగ్యము [27]

కావున నిది అత్యంతతిరస్కృత వాచ్యవస్తుధ్వని యయినది

---

26. ప్రతిషేధస్య ప్రసక్తిపూర్వకత్వాత్ నిరహంకారశబ్దో హ్యహంకార స్వరూపయోగ్యే చేతనవిశేష ఏవ స్వరసతః ప్రయుజ్యత ఇత్యతోఽత్ర ముఖ్యార్థస్యాన్వయానుపపత్తిరూపబాధా బోధ్యా॥
—బాలప్రియా [లోచనవ్యాఖ్య] (ధ్వన్యా 2.1 కా ఉదా.)

27 క) అత్ర మత్తనిరహంకారశబ్దౌ మేఘమృగాంకయోరసంభవేన బాధిత- స్వార్థౌ స్వేచ్ఛావ్యాపారవత్త్వే వ్యాపారరహితత్వే చ సాదృశ్యే సతి మేఘం మృగాంకం చ లక్షయంతౌ ప్రకర్షశాలిత్వం హతప్రకర్షత్వం చ వ్యంజయతః॥
(అలం. మహో. 3 240)

ఖ) మత్తశబ్దేన సర్వథైవేహాసంభవత్స్వార్థేన బాధితమద్యోపయోగక్షీబా త్మకముఖ్యార్థేన సాదృశ్యాత్ మేఘాంల్లక్షయతా ఽసమంజసకారిత్వ దుర్నివారత్వాదిధర్మసహస్రం ధ్వన్యతే। నిరహంకారశబ్దేనాపి చంద్రం లక్షయతా తత్పారతంత్ర్యవిచ్ఛాయత్వోజ్జిగమిషారూపజిగీషా త్యాగప్రభృతిః॥ —లోచన (ధ్వన్యా 2.1కా. ఉదా.)

గ) సాదృశ్యే వైపరీత్యే చ వాచ్యస్యాతితిరస్క్రియా ।
సంబంధేఽన్యార్థ సంక్రాంతిః క్రియాయోగే తు తద్ద్వయమ్॥
(అలం. మహో. 2.28)

**అవివక్షిత వాచ్యధ్వని –**

ఈ అర్థాంతరసంక్రమిత–అత్యంతతిరస్కృతవాచ్యధ్వనులను, రెండింటిని గూడ అవివక్షితవాచ్యధ్వనులని యందురు [28]

ఈ రెంటియందును వాచ్యార్థము కవికంత వివక్షితము కాదు [29] అనగా కవి సంరంభము వాచ్యార్థమునఁ గాక లక్షార్థములద్వారా వ్యంగ్యార్థముననే పర్యవసించును అలోకసామాన్యమగు కవిప్రతిభావైశిష్ట్యమునుగ్గడించునది యా వంగ్యార్థమే యగును కాని వాచ్యార్థముకాదు గదా. [30]

లక్ష్యార్థముచేతనగు నీధ్వనులు రెండును శబ్దశక్తిమూలకములే కాని అర్థశక్తిమూలకములు కావు. [31]

---

28 క) అర్థాంతరే సంక్రమితమత్యంతం వా తిరస్కృతమ్ ।
అవివక్షిత వాచ్యస్య ధ్వనేర్వాచ్యం ద్విధా మతమ్॥
(ధ్వన్యా. 2 1 కా )

ఖ) అవివక్షితవాచ్యో య స్తత్ర వాచ్యం భవేద్ధ్వనౌ ।
అర్థాంతరే సంక్రమిత మత్యంతం వా తిరస్కృతమ్॥
(కావ్యప్రకాశ. 4.24)

29 వాచ్యార్థస్యావివక్షైవ లక్షణాయాం భవేద్ధ్రువమ్ ।
స చార్థాంతర సంక్రాంతో యద్వాఽత్యంతం తిరస్కృతః।
(అలం. మహో. 2 27)

30 సరస్వతీ స్వాదు తదర్థవస్తు నిష్యందమానా మహతాం కవీనామ్।
అలోకసామాన్య మభివ్యనక్తి పరిస్ఫురంతం ప్రతిభావిశేషమ్॥
(ధ్వన్యా. 1.6)

31. తతః కారణాదస్య శబ్దశక్తిమూలస్య ధ్వనే రర్థాంతరసంక్రాంతవాచ్యాత్యంతతిరస్కృతవాచ్యభేదాభ్యాం సహ చత్వారో భేదాః॥
(అలం. మహో. 2.31 కా. వృత్తి.)

వ్యంగ్యార్థముచేనగు వస్తుధ్వని -

వాచ్యార్థలక్ష్యార్థములచేతనే కాక ఒకచో వ్యంగార్థముచేతను వేఱొక వ్యంగ్యార్థము స్ఫురించును.

ఉదా —

పశ్య నిశ్చలనిష్పందా బిసినీపత్రే రాజతే బలాకా।
నిర్మలమరకతభాజనప్రతిష్ఠితా శంఖశుక్తిరివ॥
(కావ్య. 2 ఉ) (సా ద ద్వి. అర్థశక్తిమూలవ్యంజన)

తామరాకున కదలక మెదలక యున్న ఈ బెగ్గురుపక్షి నిర్మలమయిన మరకతపాత్రమున శంఖరచితశుక్త్యాకారపాత్రమువలె రాజిల్లుచున్నదని ఉపనాయకునితో దూతికపలికిన పలుకులివి.

ఇట 'కొంగ కదలక మెదలక ఉన్న'దనిచెప్పుటచే నాప్రదేశమెప్పుడును జనశూన్యమయియే యుండుననియు అందుకే అసారసపక్షికంత విశ్వాసమనియు వ్యంగ్యము- ఈవ్యంగ్యార్థముచే 'సంకేతస్థానమిదియే'యను నింకొకవ్యంగ్యార్థము ధ్వనించుచున్నది [32]

ఉభయశక్తిమూలకమగు నలంకారధ్వని యుండునే కాని వస్తుధ్వని యుండదు [33]

---

32 క) అత్ర నిష్పందతే నాశ్వస్తత్వం, తేన జనరాహిత్యం, అతః సంకేత-స్థాన మేతదితి కయాచిత్ కంచిత్ ప్రత్యుచ్యతే॥
(కావ్యపరీక్షా. 1 ఉ)

ఖ) కావ్యప్రకాశ 2 ఉలో, సా ద ద్వితీ అర్థశక్తిమూలవ్యంజనలోను ఇది వివరింపబడినది.

33 క) "శబ్దార్థోభయభూరేకః" (కావ్య. 4 41)

ఖ) ఉభయోద్భూతః శబ్దార్థోభయశక్తిమూలః పునరేక ఏవ। అత్ర హి వస్తునాఽలంకార ఏవ వ్యజ్యతే, న వస్తుమాత్రమ్॥
(అలం మహో. ౩.60)

ఇ(క అలంకారధ్వని.-

కృష్ణపక్షాధికరుచిః సదాసంపూర్ణమండలః।
భూపోఽయం నిష్కలంకాత్మా మోదతే వసుధాతలే॥

(రసగం ద్వితీ శబ్దశక్తి అలం ధ్వని)

కృష్ణభగవానునియెడ నధికభక్తి గలవాఁడును, సత్పురుషులచేనిండుగా నున్న రాష్ట్రముగలవాఁడును ఏవిధమైనకళంకములు లేని పుణ్యాత్ముఁడును అగు ఈ రాజు భూమండలమున మోదమునను భవించుచున్నాఁడనునది తాత్పర్యము

ఇట వ్యతిరేకాలంకార ధ్వని-

[34] చంద్రుఁడు కృష్ణపక్షమున కాంతివిహీనుడై యుండగా నీ రాజు కృష్ణపక్షముననును అధికరుచి(కాంతి) గలగియున్నవాఁడనియు, చంద్రుఁడు పున్నమనాఁడుమాత్రము సంపూర్ణమగు మండలము కలిగియుండఁగా నీతఁడు సదాసంపూర్ణమండలుఁడనియు, చంద్రుఁడు కళంకితాత్ముఁడు కాఁగా నీ రాజు నిష్కలంకాత్ముఁడనియు, ఇట్లు రాజునకు చంద్రునికంటే నుత్కర్షాతిశయము ధ్వనించుచున్నది

---

34. క) అత్ర భగవత్పక్షాధిక్రపీత్యాదిలక్షణే ప్రకృతభూపోపయోగిత్వాత్ ప్రకృతేఽర్థే శక్త్యా ప్రతీతిప్రథమవతీర్ణే ద్వితీయోఽర్థోఽప్రకృతో వైధర్మ్యాత్మా తత్ప్రయుక్తో వ్యతిరేకశ్చ (ధ్వన్యతే)।

(రసగం ద్వితీ. శబ్దశక్తి అలం ధ్వని)

ఖ) భగవత్పక్షేఽధికా ప్రీతిర్యస్య। సద్భిరాసమంతాత్ పరిపూర్ణం మండలం యస్య। నిష్కలంకః పవిత్ర ఆత్మా యస్య, సోఽయం భూపో భువి మోదత ఇతి ప్రకృతోఽర్థః। కృష్ణపక్షేఽసితపక్షేఽధిక రుచిః। సదా సర్వకాలే సంపూర్ణమండలః, నిష్కలంకః కళంక-శూన్య ఆత్మా యస్య, సోఽయం భువి మోదత ఇతి చంద్ర వైధర్మ్యాత్మా ఽప్రకృతోఽర్థః। యద్వా కృష్ణపక్షే పాపకర్మణ్యధిక రుచిః। స-దాసం యథా తథా పూర్ణం మండలం యస్య, నిష్కలంకో ఽత్యంతకలంక ఆత్మా యస్య, సోఽయమిత్యప్రకృతోఽర్థః। తత్ప్రీతి। అప్రకృతార్థప్రయుక్తవ్యతిరేకాలంకార ఇత్యర్థః। వ్యజ్యత ఇతిశేషః।
—మర్మప్రకాశః (వ్యాఖ్యా) [రసగం. ద్వితీ. శబ్దశ అలం. ధ్వని]

[35] ఇది యుపమేయోత్కర్షపర్యవసాయియగు వ్యతిరేకాలంకార ధ్వని.

శబ్దశక్తి మూలాలంకార ధ్వని —

ఇట కృష్ణ—రుచి—కలంకాదిపదములస్థానమున తత్పర్యాయపదముల నుంచిన నీ యలంకారధ్వని యుండదు కావున ఇది శబ్దశక్తిమూలకమగు[36] నలంకారధ్వని

మఱియొక యుదాహరణము.—

ఉన్నతః ప్రోల్లసద్ధారః కాలాగురుమలీమసః।
పయోధరభరస్తస్యాః కం న చక్రేఽభిలాషిణమ్॥*

(ధ్వన్యా ద్వితీ శబ్దశ అలం. ధ్వని)

ఇట ఉపమాలంకార ధ్వని.

ఇట్లే బాణభట్టుని స్థాణ్వీశ్వరాఖ్యజనపదవర్ణనమునను—

---

35 విచ్ఛిత్తయే యదన్యస్మాదుపమేయస్య బధ్యతే ।
ఆధిక్యమథ హీనత్వం వ్యతిరేకః స కీర్తితః ॥

(అలం. మహో. 8.38)

36 క) తత్ర-శబ్దా యత్ర పరివృత్తిం న సహంతే స శబ్దశక్త్యుద్భవః ॥

(కావ్యపరీక్షా. 2.28 )

ఖ) పరివృత్త్యసహిష్ణూనాం శబ్దానాం ప్రాచుర్యే తత్ప్రియుక్తాత్
ప్రాధాన్యాచ్చ వ్యంగ్యస్య శబ్దశక్తి మూలకత్వేనైవ వ్యపదేశః॥

[రసగం (నిర్ణ ప్ర) ద్వితీ - పుట 174]

గ) ఆక్షిప్త ఏవాలంకారః శబ్దశక్త్యా ప్రకాశతే ।
యస్మిన్ననుక్తః శబ్దేన శబ్దశక్త్యుద్భవో హి సః॥

(ధ్వన్యా. 244)

దీని తాత్పర్యాది వివరణము అభిధా (శబ్దశక్తి)-మూలవ్యంజనా ప్రస్తావమున (పుట. 64) జేయఁబడినది.

[37]"మాతంగగామిన్యః శీలవత్యశ్చ (హర్షచరిత. తృతీ)
అనుచోట మాతంగులను (పంచములను, లేదా శబరులను)పొందుస్వభావము గలవారై యుండియు శీలవంతులెట్లగుదురు, కాన విరోధము. మాతంగ-గామినులన గజ గామినులనునది తాత్పర్యము - ఇఁక శీలవతులగుటలో విరోధము తొలఁగిపోయినది

[38]ఈ విరోధము సాక్షాచ్ఛబ్దనివేదితము కాకుండుటచేనిది విరోధాభాసాలంకారధ్వని

ఇట్లెన్నియేని అలంకారధ్వనుల నిట నుదాహరింపవచ్చును.

**అర్థశక్తి మూలాలంకారధ్వని –**

శబ్దశక్తిచేతనే కాక అర్థశక్తిచేతను అలంకారధ్వనులేర్పడును.

**ఉదా –**

న మనాగపి రాహురోధశంకా న కలంకానుగమో న పాండుభావః।
ఉపచీయత ఏవ కాపి శోభా పరితో భామిని! తే ముఖస్య నిత్యమ్॥
(రసగం ద్వి. అర్థశ. అలం ధ్వని)

---

37. మాతంగవత్ గచ్ఛంతి, తాన్ శబరాంశ్చ గచ్ఛంతీతి విరోధః॥
–లోచన (ధ్వన్యా. ద్వితీ పుట. 245)

38. క) అత్ర వాచ్యో విరోధః, తచ్ఛాయానుగ్రాహీ వా శ్లేషోఽయ మితి న శక్యం వక్తుమ్। సాక్షచ్ఛబ్దేన విరోధాలంకారస్యాప్రకాశితత్వాత్॥
(ధ్వన్యా ద్వితీ శబ్దశ అలం. ధ్వని. పుట. 245)

ఖ) 'అత్ర విరోధాలంకారో వ్యంగ్యః॥' (కావ్యానుశాసనం 164)

గ) అభాసత్వే విరోధస్య విరోధాభాస ఇష్యతే॥ (చంద్రా. శ్లో. 76)

ఘ) యత్ర ప్రథమమాభాసతయా ప్రతీతో విరోధః పర్యవసానే పరిహ్రియతే స విరోధాలంకారః॥ (ప్రతా. రు. అర్థాలంకార.)

"రాహువు రోధించుననను భయము కాని, కళంకము కాని, పాండుభావము కాని లేక, ఓ భామినీ! నీముఖము నిత్యశోభాసమన్వితమై వెలుగొందుచున్న ద"ను నీ వాచ్యార్థముచే-"రాహురోధకళంకాదులుగల ఆచంద్రునికంటెను నీ ముఖముత్కర్షశాలియై యున్న"దను వ్యతిరేకాలంకారము ధ్వనించుచున్నది ఇదియే –

**వస్తువుచేతనగు నలంకారధ్వని**[39] ..

ఇట్లు ఒకానొక వస్తురూపమగునర్థముచే నేదోయొక అలంకారము ధ్వనించుచుండును [40]

**అలంకారముచేనగు అలంకారధ్వని** -

ఒకచో వాచ్యమగు నేదోయొక అలంకారముచేతను నేదేని యలంకారము స్ఫురించుచుండును [41]

ఉదా –

మహిళాసహస్రభరితే తవ హృదయే సుభగః సా అమాన్తీ।
అనుదినమనన్యకర్మా అంగం తన్వపి తనయతి॥

(సా ద 49 కా. ఉదా)

---

39 అత్ర రాహురోధళంకాదిభి ర్నిరపేక్షైర్వస్తుభిర్వ్యతిరేకాలంకారో వ్యజ్యతే॥ (రసగం ద్వి అర్థ అలం. ధ్వని.)

40. వ్యజ్యంతే వస్తుమాత్రేణ యదాలంకృతయస్తదా ।
ధ్రువం ధ్వన్యంగతా తాసాం కావ్యవృత్తే స్తదాశ్రయాత్ ॥

(ధ్వన్యా 2.29)

41. అర్థశక్తే రలంకారో యత్రాప్యన్యః ప్రతీయతే ।
అనుస్వానోపమవ్యంగ్యః స ప్రకారోఽపరో ధ్వనేః ॥

( ధ్వన్యా. 2 25 )

తనచెలియలివిరహమునివేదించుదూతివాక్యమిది ఓసుందరా! నీహృదయ మెందరో తలోదరులకు నిలయమై యున్నది కాన తానచ్చట నిముడక పోవుటచే నాయమ తనకృశించినశరీరమును మరియు కృశింపఁజేసికొనుచున్నది

ఇట-ఆయమ తనశరీరమును కృశింపఁజేసికొనుటకు తానతనిహృదయమున నిముడకుండుట హేతువు అట్లిముడకుండుటకును అతనిహృదయము మహిళాసహస్రభరితమై యుండుట కారణము కావున నిది కావ్యలింగాలంకారము [42]

దీనిచే-"తానట్లు శరీరమునెంతో కృశింపఁజేసికొనినను నీహృదయమున చోటుచేసికొనకుండెన"ను విశేషోక్త్యలంకారము ధ్వనించుచున్నది [43]

ఇట్లాయావాచ్యాలంకారములచే కలిగిన అట్టియలంకారధ్వనుల నుదాహరింపవచ్చును

**ఉభయశక్తి మూలాలంకారధ్వని --**

హిమముక్తచంద్రరుచిరః సపద్మకో
మదయన్ ద్విజాన్ జనితమీనకేతనః।
అభవత్ ప్రసాదితసురో మహోత్సవః
ప్రమదాజనస్య స చిరాయ మాధవః॥ (శిశు 13.38)

"మంచుపొగ క్రమ్మనిచంద్రునివలె వెలుఁగువాఁడును, పద్మహస్తుఁడును ద్విజుల(బ్రాహ్మణుల)నానందపఱచువాఁడును మన్మధజనకుఁడును దేవతల సంతుష్టులఁజేసినవాడును అగు నామాధవుఁడు(కృష్ణుడు)స్త్రీజనమునకు పెద్ద-

---

42 హేతో ర్వాక్యపదార్థత్వే కావ్యలింగ ముదాహృతమ్ ॥ (అలం- సర్వ)

43 1) అత్ర 'అమాంతీతి' కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తి సిద్ధేన కావ్యలింగాలంకారేణ తనోః తనూకరణేఽపి తవ హృదయే న వర్తత ఇతి విశేషోక్త్యలంకారో వ్యజ్యతే ॥ (సా ద. 4.9. కా ఉదా. వృత్తి)

ii) "కార్యాజనిర్విశేషోక్తిః సతి పుష్కలకారణే"
(కువలయా. శ్లో. 83)

తడవు కన్నులపండువాయెను" అనునది ప్రకృతార్థము, కాఁగా మంచుపొగలేని చంద్రునిచే వెలుంగునదియు పద్మసమృద్ధిగలదియును, కోకిలాదిద్విజములను(పక్షులను) మదింపఁజేయునదియు, మన్మథోద్దీప్తిని కలుగఁజేయునదియు నిర్మలీకృతమగు మద్యము గలదియును అగు(మాధవశబ్దవాచ్యమగు)వసంతఋతువు స్త్రీజనమునకు చిరకాలమానందజనకమాయెననునది యప్రకృతార్థము ఈ యర్థద్వయమునకునుపమానోపమేయభావము కల్పించి మాధవుఁడు-(కృష్ణుఁడు)మాధవుని(వసంతుని)వంటివాఁడని చెప్పుటచే నిట ఉపమాలంకార ధ్వని [44]

విశేష్యము కూడ శ్లిష్టమై యుండుటచే నిది ప్రకృతాప్రకృతోభయశ్లేష కాదు [45]

ఇట రెండర్థములు గల ద్విజసురాది పదముల స్థానమున తత్పర్యాయ పదముల నుంచిన విశేషార్థస్ఫూర్తి కలుగక పోవుటచే శబ్దశక్తియు, చంద్ర మీనకేతనాది పదముల స్థానమున తత్పర్యాయి పదముల నుంచినను నర్థాంతర స్ఫూర్తిలో నేవిధమైన ఆటంకము లేకపోవుటచే నర్థశక్తియు, ఇట్లీ శబ్దార్థ శక్తులు రెండును సమప్రధానములై యుండుటచే నిది యుభయశక్తి మూలకమయినది.*

**పదద్యోత్యమగు (శబ్దశక్తిమూలల) ధ్వని :—**

ఒకచో నొకపదమే విశేషార్థస్ఫూర్తిని కలుగఁజేయుచుండును

---

44. అత్ర మాధవః కృష్ణో మాధవో వసంత ఇవేత్యుపమాలంకారో వ్యంగ్యః॥ (సా ద. చతు ఉభయశ. ధ్వని)

45. శ్లేషస్తు హరివసంతయోర్నాస్త్యేవ। ప్రకృతాపకృతశ్లేషే విశేష్యశ్లేషాయోగాత్॥ —మల్లినాథసూరి (శిశు. 13 . 38 వ్యాఖ్య)

* యత్ర తు కావ్యే పరివృత్తిం సహమానానామసహమానానాం చ శబ్దానాం నైకజాతీయప్రాచ్యురమ్, అపి తు సామ్యమేవ, తత్ర శబ్దార్థోభయశక్తిమూలకస్య వ్యంగ్యస్య స్థితిరితి ద్యుత్తో ధ్వనిః। న చాయం శబ్దశక్తిమూలకతయైవ అర్థశక్తిమూలకతయైవ వా వ్యపదేష్టుం శక్యః వినిగమకాభావాత్॥ (రసగం. ద్వితీ. పుట. 174)

ఉదా .—

రాజ్ఞో మత్ప్రతికూలాన్మే మహద్భయముపస్థితమ్ ।
బాలే ! వారయ పాంథస్య వాసదానవిధానతః ॥[46]

(రసగం ద్వి. శబ్దశ వస్తుధ్వని )

ఇట - "ఉపభోగము నిచ్చి నన్ను కాపాడు"మను నర్థాంతరము (వస్తువు) ధ్వనించుచున్నది 'రాజ' పదమునకు గల చంద్రుఁడను నర్థాంతరము స్ఫురింపకున్న నీ ధ్వనియే యుండదు కావున నిచ్చట 'రాజ' పదమే ప్రధాన వ్యంజకము. ఇట్లీ వస్తుధ్వని పదద్యోత్యమయినది. ఇదియు శబ్దశక్తి మూలకము

పదద్యోత్యమగు నర్థశక్తిమూలధ్వని .-

శబ్దశక్తిమూలధ్వనియే కాక అర్థశక్తిమూలధ్వనియు పదద్యోత్యమగును.

ఉదా.—

వాణిజక! హస్తిదన్తాః కుతోఽస్మాకం వ్యాఘ్రకృత్తయశ్చ।
యావల్లులితాలకముఖీ గృహే పరిష్వక్కతే స్నుషా॥

(ధ్వన్యా. 3 . 1 కా ఉదా )

ఓ బెహారీ! అల్లలాడుచున్న ముంగురులతో శోభిల్లు ముఖముగల కోడలు ఇంట నడయాడుచుండనిఁక మాకు గజదంతములు కాని వ్యాఘ్రాజినములు కాని ఎక్కడనుండును?

ఇట తనకుమారుఁడు భార్యాసౌందర్యసమాకృష్టుఁడై ఇంటనే ప్రొద్దు పుచ్చుచు వేట మానినాఁడను నర్థాంతరము "లులితాలకముఖీ" యనుపదముచే స్ఫురించుచున్నది [47]

---

46 దీని వివరణము శబ్దశక్తి మూలవస్తుధ్వని (పు. 89) సందర్భమున చేయఁబడినది.

47. అత్ర లులితాలకముఖీత్యేతత్ పదం వ్యాధవధ్వాః స్వతఃసంభావితార్థ శక్త్యా సురతక్రీడాసక్తిం సూచయత్ తదీయస్య భర్తుః సతతసంభోగ-క్షామతాం ప్రకాశయతి॥ (ధ్వన్యా. 3 . 1 కా. ఉదా వృత్తి)

"లలితాలకముఖీ" యని గాక తత్పర్యాయపదమునుంచినను అర్థాంతరస్ఫూర్తిలో నేయాటంకము లేదు కావున నిది యర్థశక్తిమూలధ్వనియే కాని శబ్దశక్తిమూలకము కాదు ఈ రెండును వస్తుధ్వనులు ఇఁక—

**పదద్యోత్యమగు నలంకారధ్వని —**

**ఉదా -**

నయేన రఘురామేణ పాల్యమానే మహీతలే ।
అనీతిః సస్యసంపత్త్యాం వితనోతి స్మ సంస్థితిమ్ ॥ (సా ర 9 15)

శ్రీరాముడు న్యాయమార్గము ననుసరించి అఖండ భూమండలమును పరిపాలించుచుండఁగా అనీతి అనగా - అన్యాయము (ఈతిబాధారాహిత్యమని అర్థాం) సస్యసంపదయందు స్థిరనివాస మేర్పఱచుకొనెను

48 ఇట—"అనీతి సస్యసంపదయందే కాని మఱెచ్చోటను లే"దను పరిసంఖ్యాలంకారము ధ్వనించుచున్నది సస్యసంపత్త్యాం" అను పదమే ఈ యలంకారమును ప్రధానముగా ధ్వనింపఁజేయుటచే నిది పదద్యోత్యమగు నలంకారధ్వని యయినది

'సస్యసంపత్త్యాం' అను పదముయొక్క సమభివ్యాహారమున నేర్పడిన 'అనీతి' పదమునకుగల రెండవయర్థము (ఈతిబాధారాహిత్యము) పైకికానవచ్చువిరోధమును పరిహరించుటకే కాని అలంకారధ్వనికుపకరించునది కాదు

'సస్యసంపత్త్యాం'అను పదస్థానమున తత్పర్యాయపదమునుంచినను అర్థాంతరస్ఫూర్తిలో నేవిధమగు నాటంకము లేకుండుటచే నిది అర్థశక్తిమూలకమయినది— ఇది సాహిత్యరత్నాకరకారులు ఉదాహరించిన పదద్యోత్యమగు అర్థశక్తిమూలక-అలంకారధ్వని.

---

48 i) అత్ర వస్తునా"సస్యసంపత్త్యామేవ నాన్యత్రే"తి పరిసంఖ్యాలంకారః 'సస్యసంపత్త్యా'మితి పదేన ద్యోత్యతే॥ (సా ర 9.15 వృత్తి)

ii) పరిసంఖ్యా నిషిధ్యైకమన్యస్మిన్ వస్తుయంత్రణమ్॥

(చంద్రా. శ్లో 113)

మఱియొక యుదాహరణము —

రుధిర విసర ప్రసాధిత కరవాళ కరాళ రుచిర భుజ పరిఘః।
ఝటితి భ్రుకుటివిటంకితలలాటపట్టో విభాసి నృప! భీమ!॥

(కావ్యప్రకాశః 4 . 77)

భీముఁడ (భయంకరుఁడ)వగు ఓరాజా! రక్తధారలచే నలంకరింపఁబడినఖడ్గముచే (శత్రువులకు) భయంకరములైనవియు, (మిత్రులకు) రుచిరములయినవియునగు భుజపరిఘలు గలవాఁడవయి, వెనువెంటనే కనుబొమలు ముడివడి తరంగితమయియున్నలలాటముగలవాఁడవయియును భాసించుచున్నావు

ఇట భీమపదమున భీముఁడను (పాండవమధ్యముఁడను) నర్థాంతరము స్ఫురించుటచే భీమసేననృపులకు ఉపమానోపమేయభావము అనగా ఉపమాలంకారము వ్యంగ్యము [49]

ఇదియును భీమపదపరివృత్తిచే నీయర్థాంతరము స్ఫురింపకుండుటచే శబ్దశక్తిమూలకము [50]

భీమపదమే లేకున్న భీమసేనుఁడను నర్థాంతరస్ఫూర్తియే యుండదు. ఇఁక ఉపమాలంకారధ్వని యెట్లుండును. కావుననిది (భీమ)పదద్యోత్యమగు నలంకారధ్వనియయినది

ధ్వని పదద్యోత్యమగుట యనఁగా వస్త్వలంకారరూపార్థాంతరమును స్ఫురింపఁజేయుటలో నాపదము ప్రధానవ్యంజకమగుటయే కాని వేరొండు

---

49. అత్రభీమేతి భీషణీయార్థేన నృపసంబోధన విశేషణేన భీమసేనోపమా వ్యజ్యతే॥ (కావ్యప్రదీపః 4 . 19 కా ఉదా. వృత్తి)

50. "అత్రోపమాధ్వనౌ భీమపదస్య పరివృత్త్యసహత్వాత్ శబ్దశక్తిమూలత్వం ద్రష్టవ్యమ్॥" —బాలబోధినీ. (కావ్య 4 . 77)

కాదు [51] దానిచే_ నాకావ్యవాక్యమునకంతటికిని వన్నెవచ్చుననుటలో సంది_
యము లేదు [52] కావుననే ధ్వన్యాచార్యులు

[53] విచ్ఛిత్తిశోభినై కేన భూషణేనేవ కామినీ।
పదద్యోత్యేన సుకవేర్ధ్వనినా ఒఒభాతి భారతీ॥

(ధ్వన్యా 3 1 కా వృత్తిలో)

శోభాహేతువగు భూషణము ఒక అవయవమును మాత్రమాశ్రయించి యున్నను కేవల మా యవయవమునే కాక ఆ నారీమణి సకలశరీరసౌందర్యము నినుమడింపఁజేయునట్లు, ధ్వని ఒకేయొక పదమును మాత్రము ప్రధానముగా నాశ్రయించి కవి వాక్కునకంతటికిని వన్నె తెచ్చు"నని నుడివియున్నారు

ఇట్లు శబ్దార్ధశక్తిమూలకములగు వస్త్వలంకారధ్వనులన్నియును పదద్యోత్యములగుట ఉదాహరింపవచ్చును

**వాక్యద్యోత్యములగు ధ్వనులు** —

పథిక నాఒత్ర స్రస్తరమ్" (శబ్దశక్తిమూల వస్తుధ్వని. పుట 54)
"శిఖిపిచ్ఛకర్ణపూరా" (అర్థశక్తిమూలవస్తుధ్వని. పుట 90)

ఈ మున్నగు శబ్దార్థశక్తి మూలకములగు ధ్వనులన్నియును వాక్య ద్యోత్యములే యుదాహృత పూర్వములు

---

51. "పదప్రకాశ్యత్వం న పదమాత్రస్య వ్యంజకతయా; కింతు తస్య ప్రాధాన్యేన॥" (కావ్యప్రదీపః 4 19 కారికావృత్తి)

52. "ఏకదేశస్థితేన చ తాదృశపదేన సమస్తమేవ వాక్యం చారుతాముప_ గచ్ఛతీతి కామినీవైకావయవస్థేన భూషణేన॥" (కావ్యప్రదీప. 4 . 19 కా వృత్తి)

53. "ఏకావయవసంస్థేన భూషణేనేవ కామినీ" అని కావ్యప్రకాశకారాదుల పాఠము

ఇట్లు ధ్వనులన్నియును పదవాక్యప్రకాశ్యములగును.

ప్రబంధద్యోత్యమగు ధ్వని —

విశేషమేమన ? ప్రబంధముచే ప్రకాశ్యమగు ధ్వని అర్థశక్తిచేతనే కలుగును. కాని శబ్దశక్తిచే కలుగదు [54]

ప్రబంధమన ? కొన్ని వాక్యముల కూర్పు. అదియు గ్రంథరూపమేని లేదా తదవాంతర ప్రకరణరూపమేని కావచ్చును.[55]

ఉదా: —

మహాభారతమున గృధ్రగోమాయు సంవాదము—

"అలం స్థిత్వా శ్మశానేఽస్మిన్ గృధ్రగోమాయుసంకులే ।
కంకాళబహులే ఘోరే సర్వప్రాణిభయంకరే॥
న చేహ జీవితః కశ్చిత్ కాలధర్మముపాగతః।
ప్రియో వా యది వా ద్వేష్యః ప్రాణినాం గతిరీదృశీ॥"

(మహాభా శాం 152/11, 12)

[దీనియనువాదము ఆంధ్రమహాభారతము శాంతి పర్వమునుండి—[56]

సీ॥ గాంగేయుఁడిట్లనుఁ గౌంతేయపూర్వజు
నకు విదిశాపట్టణమున నొక్క
బాలుండు మృతుఁడైన బంధులు ప్రేతభూ
మికిఁ గొనిపోయి యమేయశోక

---

54 i) పదే వాక్యే ప్రబంధే చ భవత్యర్థోద్భవః పునః॥
(అలం మహా 3 62)
ii) అర్థశక్తిమూలః పదవాక్యయోః ప్రబంధే చ॥
(కావ్యప్రదీపః 4 . 19)

55 ప్రబంధశ్చ సంఘటితనానావాక్యసముదాయః । స చ గ్రంథరూపస్తదవాంతరప్రకరణరూపశ్చేతి॥ (కావ్యప్రదీ 4 . 19 వృత్తి)

56. శాంతి 3 366 నుండి 378 వఱకుగల పద్యములు గృధ్రగోమాయు సంవాదము.

వివశాత్ములై విలపింపఁగా గ్రద్ద యొ
క్కటి వచ్చి మీరలిక్కడ భయంబు
దక్కి యేడ్చుచు నుండఁ దగ దిదె గ్రుంకెడు
బ్రొద్దు రాక్షసులును భూతములుఁ బి

తే॥ శాచములు వచ్చి తిన నిపుడేచి వచ్చు
జననమరణముల్ వింతలె చన్నశిశువు
తోన యందఱుఁ జనుటకుఁ బూనియుండు
వారలే పొందు పీనుంగు వైచి వేగ

క॥ తెగి పోయిన వారేడ్చిన
మగుడుదురే వెఱ్ఱులార మానుఁడు మీరుం
దెగుదురు తడసిన నావుడు
నగునట్టిద కర్జమనుచు నందఱు భీతిన్. —శాం. 3 336, 367]

అని గ్రద్ద పలికిన ఈపలుకులలో-"రాత్రియైన నాకవకాశము దక్కక పోవును కావున మీరు తొందరగా విడిచి వెళ్ళిన నక్కకందకుండ నేనే ఈ బాలునిశవము భక్షింతు"నను గ్రద్దయభిప్రాయరూపమగు వ్యంగ్యార్థము ధ్వనించుచున్నది.[57]

అట్లే నక్క వారితో-

అదిత్యో ఽయం స్థితో మూఢాః స్నేహం కురుత సాంప్రతం ।
బహువిఘ్నో ముహూర్తో ఽయం జీవేదపి కదాచన ॥
అముం కనకవర్ణాభం బాలమప్రాప్తయౌవనమ్ ।
గృధ్రవాక్యాత్ కథం బాలాస్త్యక్ష్యధ్వమవిశంకితాః ॥
(మహాభా శాం 152/19,20)

---

57. i) శ్మశానావతీర్ణం పుత్రదాహార్థముద్యోగినం జనం విప్రలబ్ధుం గృధ్రో దివాశవశరీరభక్షణార్థీ శీఘ్రమేవాపాసరత యూయమిత్యాహ—అల మితి॥ —లోచన (ధ్వన్యా 3.15 కా. ఉదా)

ii) ఇతి దివాప్రాగల్భ్యవతో గృధ్రస్య మృతావేక్షకపురుషవిసర్జనపరం వాక్యమేలకమ్॥ (కావ్యప్రదీపః 4.19 కా ఉదా. వృత్తి)

[సీ॥ గ్రద్దమాటలకేల కడుబీతిఁ బొందితి
రక్కటా బాలుని నబ్జవదను
నిటు వైచి పోవఁ గాళ్ళెట్లాడె, నేడ్వుడు
శోకంబు వోవ నిచ్చోట గొంత
ప్రొద్దంతలో విధి క్రూరుండు గాకున్నఁ
బ్రాణంబు గ్రమ్మఱ రాక గల్గు
నో, యెఱుంగుదురే యినుండును నస్తాద్రిఁ
జేరఁడు, వెఱవక మీరు నిలువుఁ"

తే. డనిన . . —శాంతి. 3/369]

పలికిన ఈ పలుకులలో "రాత్రియైనచో గ్రద్దకు దక్కకుండ ఈ శవమును నేనే భక్షింతు"నను నక్క మనోగతము వ్యక్తమగుచున్నది [58]

ఇట్టి ప్రబంధము (ప్రకరణము)నందలి గృధ్రగోమాయుసంభాషణ రూపమగు వాచ్యార్థముచే వాని భక్షణాభిప్రాయరూపవ్యంగ్యము ధ్వనించు చున్నది [59]

---

58 1) గోమాయుస్తు నిశోదయావధి అమీ తిష్ఠంతు, తతో గృధ్రాదప-హృత్యాహం భక్షయిష్యామత్యభిప్రాయేణావోచత్॥
—లోచన (ధ్వన్యా 3 15 కా ఉదా)

11) ఇతి నిశి విజృంభమాణస్య గోమయోర్జనవ్యావర్తననిష్ఠం చ వచన-మితి ప్రబంధ ఏవ ప్రథతే॥ (కావ్య. 4 96)

59. 1) ఇతి ప్రబంధప్రతిపాద్యేనార్థేన గృధ్రగోమాయ్వోర్భక్షణాభిప్రాయో వ్యజ్యతే॥ (కావ్యాను 1 80)

11) దివసే శక్తస్య గృధ్రస్య శ్మశానే మృతం బాలముపాదాయ తిష్ఠతాం తం పరిత్యజ్య గమనమిష్టం। నిశి సమర్థస్య గోమాయోః దివసే పరిత్యాగోఽనభిలషిత ఇతి వాక్యసమూహేన ద్యోత్యతే॥ (సా ద. 4 . 13 కా. వృత్తి)

కావున నిది ప్రబంధగతమగు నర్థశక్తిమూలవస్తుధ్వని ఇట్లే ఆయా ప్రబంధగతములగు వస్తుధ్వనుల నుదాహరింపవచ్చును

**ప్రబంధద్యోత్యమగు నలంకారధ్వని: —**

ఒకచో నవాంతరప్రకరణరూపమగు ప్రబంధముచే నలంకారము ను ధ్వనించును

ఉదా :—

కాళిదాసమహాకవి కుమారసంభవకావ్యమందలి హిమవత్పర్వత వర్ణన ప్రకరణము [60]

"అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః ।
పూర్వాపరౌ తోయనిధీ వగాహ్య స్థితః పృథివ్యా ఇవ మానదండః ॥
యం సర్వశైలాః పరికల్ప్య వత్సం మేరౌ స్థితే దోగ్ధరి దోహదక్షే ।
భాస్వంతి రత్నాని మహౌషధీశ్చ పృథూపదిష్టాం దుదుహుర్ధరిత్రీమ్ ॥
అనంతరత్నప్రభవస్య యస్య హిమం న సౌభాగ్యవిలోపి జాతమ్।
ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః ॥
యశ్చాప్సరోవిభ్రమమండనానాం సంపాదయిత్రీం శిఖరైర్బిభర్తి।
బలాహకచ్ఛేదవిభక్తరాగా మకాలసంధ్యామివ ధాతుమత్తామ్॥"

(కుమా. 1 1—4)

[దీనియాంధ్రానువాదము శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారి "గిరిజా కళ్యాణము" నుండి —

1 ఒకవైపునఁ దూరపుసంద్రమువఱకును వెఱొకప్రక్కఁ బడమటి
కడలిదనుకను వ్యాపించి నేలకుఁ గొలతకఱ్ఱయో యన వెలయు

---

60. కుమారసంభవ కావ్యము. ప్రథమ సర్గము 1 నుండి 17 శ్లోకములు

వాఁడును దేవతాత్మకుఁడును హిమాలయనామప్రసిద్ధుఁడునగు నగాధిరాజుత్తరదిశం గలఁడు

2 ఇతనినే వత్సముగాను మేరువును దోగ్ధగాను జేసి పృథుచక్రవర్తి యుపదేశమున భూదేవతనుండి భాస్వద్రత్నములను మహౌషధములను శైలములెల్లను బితికించి కొంపోయినవి.

3 మితిలేని రతనములకు నిదానమైన హిమవంతునకు మంచు సౌభాగ్య విఘాతకము కాలేదు ఇందుకిరణములలోఁ గళంకమువలె గుణసముదాయమున నొకదోషము మునిగిపోవును గదా!

4 అకాలసంధ్యనుంబోలెఁ దనశిఖరములందాల్చిన సిందూరగైరికాదులచే మబ్బుతెరలకు రాగముంగూర్చుచు హిమవంతుఁడచ్చరలను విభ్రమాలంకరణధారణమునకుం బ్రేరించుచుండును

—గిరిజా పుట 1.

మున్నగు శ్లోకములచే గుంఫితమగు హిమవత్పర్వతవర్ణనాత్మకమగు నవాంతరప్రకరణరూపప్రబంధముచే—

1) పూర్వాపరతోయనిధులవఱకును వ్యాపించియుండుట. (శ్లో. 1)
2) భాస్వద్రత్నములచేతను మహోషదులచేతను శోభిల్లుట (శ్లో 2)
3) హిమసౌభాగ్యము. (శ్లో 3)
4) అప్సరః కిన్నరాది దేవయోని విశేష విహార యోగ్యత (శ్లో. 4)

మొదలగు విశేషగుణములుండుటచే నీ పర్వతమితరపర్వతములకంటె ఎంతయో ఉత్కర్షతో శోభించుచున్నదను ఉపమేయోత్కర్షపర్యవసాయియగు వ్యతిరేకాలంకారము ధ్వనించుచున్నది

ప్రబంధగతమగు నలంకారముచేనగు నలంకారధ్వని .—

ఇఁక విశేషమేమన? ఈ హిమవత్పర్వతవర్ణనప్రకరణాత్మకమగు ప్రబంధమందలియర్థము అలంకారాత్మక మగుటచేనిది అలంకారముచేనగు నలంకారదంని- ఎటన?

పూర్వాపరసముద్రములవఱకు వ్యాపించియుండుటయను నన్యధర్మ-సంబంధముచే హిమవత్పర్వతమును మానదండముగా నుత్ప్రేక్షించుటచే ప్రథమశ్లోకముననుత్ప్రేక్షాలంకారము[61]

ఇఁక- ద్వితీయశ్లోకమున ప్రకృతములగు రత్నములకు మహౌషధము-లకును దోహన(ప్రితుకుట)క్రియారూపసమానధర్మసంబంధముచే సాదృశ్యము ధ్వనించుటవలన ప్రకృతవిషయమగు తుల్యయోగితాలంకారము[62]

తృతీయశ్లోకమున - హిమ మీపర్వతసౌందర్యాపకర్షకము కాదను విశేషార్థము సామాన్యముచే సమర్థింపఁబడుటచే నర్థాంతరన్యాసాలంకారము- ఈ సామాన్యార్థమును "ఇందోఃకిరణేష్వివాంకః" అను నుపమాలంకారము బల పఱుచుటచే నిది యుపమానుప్రాణితార్థాంతరన్యాసాలంకారమని మల్లినాథసూరి వ్యాఖ్యానించియున్నాడు[63] జయదేవుఁడు తన చంద్రాలోకమున దీనిని

---

61. అత్ర హిమాచలస్య ఉభయాబ్ధివ్యాప్తిసామ్యాన్మానదండత్వేనో త్ప్రేక్షణా దుత్ప్రేక్షాలంకారః। "ప్రకృతేఽప్రకృతగుణక్రియాదిసంబంధా-దప్రకృతేన ప్రకృతస్య సంభావనముత్ప్రేక్షా" ఇత్యలంకారసర్వస్వ కారః. —మల్లినాథకృతసంజీవినీ. (కుమా 11)

62 అత్ర హిమద్వర్ణనస్య ప్రకృతత్వాత్తద్గతౌషధిరత్నానాం ద్వయానామపి ప్రకృతత్వాత్తేషాం దోహనక్రియారూపసమానదర్మాసంబందా దౌపమ్యస్య గమ్యత్వాత్ కేవలప్రాకరణికవిషయస్తుల్యయోగితా నామాలంకారః। తదుక్తం — "ప్రస్తుతానాం తథాన్యేషాం కేవలం తుల్యధర్మతః। ఔపమ్యం గమ్యతే యత్ర సా మతా తుల్యయోగితా॥" —మల్లినాథసంజీవినీ — (కుమా. 1-2)

63 అత్రోపమానుప్రాణితోఽర్థాంతరన్యాసాలంకారః। తల్లక్షణం తు (కావ్యాదర్శ 2. 169) — "జ్ఞేయః సోఽర్థాంతరన్యాసో వస్తు ప్రస్తుత్య కించన తత్సాధన సమర్థస్య న్యాసో యోఽన్యస్య వస్తునః॥" ఇతిదండీ॥ —మల్లినాథసంజీవినీ (కుమా. 1. 3)

వికస్వరాలంకారమని ప్రత్యేకముగా గుర్తించియున్నాఁడు.[64] కావున వికస్వ-రాలంకారమనియే నారాయణపండితుఁడిట వ్యాఖ్యానించియున్నాఁడు [65]

ఇట్లే చతుర్థశ్లోకమునను-శిఖరములయందలి సిందూరగైరికాదిధాతు-వ్యాప్తిని ఆరుణ్యగుణయోగముచే ఆకాలసంధ్యగా నుత్ప్రేక్షించుటచే నుత్ప్రేక్షా-లంకారము.[66]

ఇట్లు ప్రతిశ్లోకమునను నేదోయొకయలంకారముండనే యున్నది దానిచే నొకవిశేషగుణమును వ్యక్తమగుచునే యున్నది.

కావున నీహిమవద్వర్ణన ప్రకరణరూపప్రబంధమున ఉత్ప్రేక్షాది-కవిప్రౌఢోక్తి సిద్ధాలంకారములయొక్కయు తుల్యయోగితాది-కవిప్రౌఢోక్తివిరహితాలంకార-ములయొక్కయు సంసృష్టిరూపాలంకారము. దీనిచే పూర్వోక్తవ్యతిరేకాలంకారము వ్యంగ్యము [67]

ఇట్లిది ప్రబంధద్యోత్యమగునలంకారకృతాలంకారధ్వని యయినది.

---

64. యస్మిన్ విశేషసామాన్యవిశేషాః స వికస్వరః ।
స న జిగ్యే మహాన్తో హి దుర్ధర్షాః క్ష్మాధరా ఇవ॥
( చంద్రా. 5 . 69 )

65. టిప్ప – నారాయణపండితస్తు – "వస్తుతస్త్వత్ర వికస్వరాలంకార ఏవ। యత్ర -కస్యచిద్విశేషస్య సమర్థనార్థం సామాన్యం విన్యస్య తత్ప్రసిద్ధా వప్యపరితుష్యతా కవినా తత్సమర్థనాయ పునః విశేషాంతరం న్యాస విధయా విన్యస్యతే తత్ర వికస్వరాలంకారః" ఇత్యాహ।
[కుమార (నిర్ణ. ప్ర 1955) 1 . 3]

66 "అత్ర సంధ్యాశబ్దస్య జాతివాచిత్వాజ్జాత్యుత్ప్రేక్షా।"
—సంజీవినీ. (కుమా. 1 . 4)

67 అపిచ—కుమారసంభవే హిమగిరివర్ణన ప్రౌఢోక్త్యప్రౌఢోక్తి సిద్ధాలంకార సంసృష్టేర్హిమగిరే రితరోత్కర్షః ప్రతీయతే॥
—లక్ష్మీవ్యాఖ్యా (సాద చతు. పుట 271)

ప్రబంధద్యోత్యమగు వస్తుకృత వస్తుధ్వని -

దీనికిని పూర్వోదాహృతగృధ్రగోమాయుసంవాదముదాహరణము.

అట వాక్యసమూహాత్మకప్రబంధమందలియర్థము నిరలంకారమగు వస్తురూపమే కదా!

ఇట్లితరములగు వస్త్వలంకారధ్వనులను గూడ నుదాహరింపవచ్చును ఇఁక-

రసాదిధ్వని :-

రసాదులన- రసములు[68] శృంగారాదులు తొమ్మిది, భావములు[69] నిర్వేదాదులు(సంచారిభావములు) ముప్పదిమూఁడు,మఱియు రసాభాస భావాభాస భావశాంతి-భావోదయ-భావసంధి-భావశబలతలు అనునాఱును- విశేషమేమన-

---

68 శృంగారహాస్యకరుణా రౌద్రవీరభయానకాః।
బీభత్సాద్భుతశాంతాశ్చ రసాః పూర్వైరుదాహృతాః॥
(ప్ర. రుద్రీ. రస. శ్లో. 1)

69. అథ వ్యభిచారిభావాః—
నిర్వేదగ్లానిశంకాఖ్యాస్తథాసూయామదశ్రమాః।
ఆలస్యం చైవ దైన్యం చ చింతా మోహః స్మృతిర్ధృతిః॥
వ్రీడా చపలతా హర్ష ఆవేగో జడతా తథా।
గర్వో విషాద ఔత్సుక్యం నిద్రాఽపస్మార ఏవ చ॥
సుప్తిర్విబోధోఽమర్షశ్చాప్యవహిత్థమథోగ్రతా।
మతిర్వ్యాధిస్తథోన్మాదస్తథా మరణమేవ చ॥
త్రాసశ్చైవ వితర్కశ్చ విజ్ఞేయా వ్యభిచారిణః।
త్రయస్త్రింశదమీ భావా రసస్య సహకారిణః॥ (ప్ర. రు. రస. 6-9)

వస్త్వలంకారములు వ్యంగ్యములే కాక వాచ్యములు కూడ కావచ్చును[70] కాని రసాదులు వ్యంగ్యములగునే కాని వాచ్యములు కావు-రసాదులు స్వశబ్ద వాచ్యములగట వమనాఖ్యదోషమందురు[71]

శృంగారరసధ్వని -

సంయోగ(సంభోగ)శృంగారమనియు విప్రలంభశృంగారమనియు శృంగారరసము ద్వివిధము సంయోగశృంగారమన దంపతులు కలిసియుండుట యే కాదు, కలిసియున్నామను భావనయు నుండవలెను. ఏకతల్పగతులైనను ఈర్ష్యామానాదులున్నచో విప్రలంభశృంగారమే యగును.[72]

---

70. i) సూ . రసాదిశ్చ ॥25॥
రస—భావ—తదాభాసభావశాంతిభావోదయభావస్థితి భావసంధిభావశబల-త్వాన్యర్థశక్తిమూలాని వ్యంగ్యాని । చకారః పదవాక్యప్రబంధానుకర్షణార్థః । పృథగ్యోగో— "రసాదయో వ్యంగ్యా ఏవ భవంతి, న తు కదాచిద్వాచ్యతా మపి సహంత" ఇతి రసాదీనాం ప్రాధన్యఖ్యాపనార్థః । వస్త్వలంకారౌ హి వాచ్యావపి భవత ఇతి॥
(కావ్యాను 1 25 సూ వృత్తి)

ii) "రసభావాదిరర్థో ధ్వన్యమాన ఏవ న వాచ్యః కదాచిదపి "
—లోచన. (ధ్వన్యా 2 22 కా వ్యాఖ్య)

iii) "రసాదిలక్షణస్త్వర్థః స్వప్నేఽపి న వాచ్యః"
(కావ్య 5 69 సూ. వృత్తి)

71 "రసస్థాయివ్యభిచారిణాం స్వశబ్దవాచ్యత్వం దోషః "
(కావ్యాను. 3 1 సూ వృత్తి)

72 తత్ర శృంగారో ద్వివిధః—సంయోగో విప్రలంభశ్చ। రతేః సంయోగ-కాలావచ్ఛిన్నత్వే ప్రథమః । వియోగకాలావచ్ఛిన్నత్వే ద్వితీయః । సంయోగశ్చ న దంపత్యోః సామానాధికరణ్యమ్, ఏకతల్పశయనేఽపీ-ర్ష్యాదిసద్భావే విప్రలంబస్యైవ వర్ణనాత్। ఏవం వియోగోఽపి న వైయధికరణ్యం, దోషస్యోక్తత్వాత్। తస్మాద్ద్వావిమౌ సంయోగవియో-గాఖ్యావంతఃకరణవృత్తివిశేషౌ। యత్సంయుక్తో వియుక్తశ్చాస్మీతి ధీః॥
(రసగం. ప్రథమ. పుట 41)

ఉదా -

శూన్యం వాసగృహం విలోక్య శయనాదుత్థాయ కించిచ్ఛనై
ర్నిద్రావ్యాజముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖమ్।
విస్రబ్ధం పరిచుంబ్య జాతపులకా మాలోక్య గండస్థలీం
లజ్జా నమ్రముఖీ ప్రియేణ హసతా బాలా చిరం చుంబితా॥

(అమరుకశతకం శ్లో. 82)

[దీని యాంధ్రానువాదము మల్లాది లక్ష్మీపతి శాస్త్రిగారి అమరుకావ్యము నుండి (అమరు 74 ప)–

"చెలులేగంగనె పాన్పునుండి చెలి కొంచెం బల్లనన్ లేచి ని
ద్రిలుచున్నట్టులనున్న కాంతుమొగ మెంతేసేపు వీక్షించి య
ర్మిలి ముద్దాడుచు గండపాళి పులకల్ దేరంగ నీక్షించి సి
గ్గలమన్ వంచె మొగమ్ము నవ్వుచుఁ జిరం బాచెల్వుఁడున్ ముద్దిడెన్॥"]

ఇట నాయకుఁడాలంబన విభావము వాసగృహము శూన్యమై యుండుటయు నాయకుఁడు నిద్రించియుండుటయును ఉద్దీపన విభావములు. ముఖ నిర్వర్ణన చుంబనము లనుభావములు లజ్జ వ్యభిచారిభావము వీనిచే నాయికకు నాయకుని యెడఁగల రతి యభివ్యక్తమై చర్వణావిషయమగుచు సంభోగ శృంగారరసధ్వని యగుచున్నది.[73]

అట్లే నాయిక ఆలంబన విభావము వాసగృహము శూన్యమయి యుండుట నాయిక ముద్దిడుటయును ఉద్దీపన విభావములు. పులకాంకురములు హాసమును చిరచుంబనమును అనుభావములు వీనిచే నాయకునకును నాయిక

---

73 క) అత్ర నాయక ఆలంబనం, శూన్యగృహనాయకనిద్రాది ఉద్దీపనం; ముఖనిర్వర్ణనచుంబనాదిః అనుభావః, లజ్జాహాసవ్యంగ్యహర్షాది-ర్వ్యభిచారిభావః, రతిః స్థాయిభావః; తజ్జే సామాజికే రస నిష్పత్తిః॥ –బాలబోధినీ (కావ్య 4 30)

ఖ) అత్ర హి సంభోగశృంగారాఖ్యో రసః।

(సా. ద ప్రథమ. కావ్యలక్షణ)

వస్త్వలంకారములు వ్యంగ్యములే కాక వాచ్యములు కూడ కావచ్చును[70] కాని రసాదులు వ్యంగ్యములగునే కాని వాచ్యములు కావు-రసాదులు స్వశబ్ద వాచ్యములగుట వమనాఖ్యదోషమందురు[71]

శృంగారరసధ్వని -

సంయోగ(సంభోగ)శృంగారమనియు విప్రలంభశృంగారమనియు శృంగారరసము ద్వివిధము సంయోగశృంగారమన దంపతులు కలిసియుండుట యే కాదు, కలిసియున్నామను భావనయు నుండవలెను. ఏకతల్పగతులైనను ఈర్ష్యామానాదులున్నచో విప్రలంభశృంగారమే యగును.[72]

---

70. i) సూ . రసాదిశ్చ ॥25॥
రస_భావ_తదాభాసభావశాంతిభావోదయభావస్థితి భావసంధిభావశబల- త్వాన్యర్థశక్తిమూలాని వ్యంగ్యాని । చకారః పదవాక్యప్రబంధానుకర్ష ణార్థః । పృథగ్యోగో— "రసాదయో వ్యంగ్యా ఏవ భవంతి, న తు కదా చిద్వాచ్యతా మపి సహంత" ఇతి రసాదీనాం ప్రాధన్యఖ్యాపనార్థః । వస్త్వలంకారౌ హి వాచ్యావపి భవత ఇతి॥
(కావ్యాను 1 25 సూ వృత్తి)

ii) "రసభావాదిరర్థో ధ్వన్యమాన ఏవ న వాచ్యః కదాచిదపి "
—లోచన. (ధ్వన్యా 2 22 కా వ్యాఖ్య)

iii) "రసాదిలక్షణస్త్వర్థః స్వప్నేఽపి న వాచ్యః"
(కావ్య 5 69 సూ. వృత్తి)

71 "రసస్థాయివ్యభిచారిణాం స్వశబ్దవాచ్యత్వం దోషః "
(కావ్యాను. 3 1 సూ వృత్తి)

72 తత్ర శృంగారో ద్వివిధః—సంయోగో విప్రలంభశ్చ। రతేః సంయోగ- కాలావచ్ఛిన్నత్వే ప్రథమః । వియోగకాలావచ్ఛిన్నత్వే ద్వితీయః । సంయోగశ్చ న దంపత్యోః సామానాధికరణ్యమ్, ఏకతల్పశయనేఽపీ- ర్ష్యాదిసద్భావే విప్రలంబస్యైవ వర్ణనాత్। ఏవం వియోగోఽపి న వైయధికరణ్యం, దోషస్యోక్తత్వాత్। తస్మాద్ద్వావిమౌ సంయోగవియో- గాఖ్యావంతఃకరణవృత్తివిశేషౌ। యత్సంయుక్తో వియుక్తశ్చాస్మీతి ధీః॥
(రసగం. ప్రథమ. పుట 41)

వ్యక్తమగుచు వియోగకాలికమగుటచేనిది విప్రలంభశృంగారరసధ్వని యగుచున్నది [75]

ప్రాణేశుఁడెదుటనే యున్నను తానిఁక వియోగముననుభవించుచున్నా నను భావము మనమున నుదయించుటచే నిది సంయోగశృంగారము కాక వియోగ శృంగార (విప్రలంభ శృంగార) మగుచున్నది [76]

కరుణరసధ్వని:–

అపహాయ సకలబాంధవ చింతాముద్వాస్య గురుకుల ప్రణయమ్ ।
హా ! తనయ ! వినయశాలిన్ ! కథమివ పరలోకపథికో ఽభూః॥
(రసగం ప్రథమ. పుట 43)

[తా॥ వినయశాలివగు ఓ తనయా ! వృద్ధులమగు తల్లిదండ్రులమైన మా యందలి ప్రేమను, "తన్ను విడిచి ఈ బందుగులందఱెట్లు మనఁజాలదురో" యను చింతను వీడి అయ్యో ! పరలోకమునకేమని ? యరిగితివి ]

ఇట మరణించిన తనయుఁడాలంబనవిభావము ఆ సమయమున నచ్చటికేతెంచిన బందుగులఁగాంచుట తద్రోదనాదులును నుద్దీపనవిభావములు విలపించుట యనుభావము దైన్యాదులు సంచారిభావములు వీనిసంయోగమునఁ దల్లిదండ్రులకు కుమారుని విషయమునఁగల శోకమభివ్యక్తమయి కరుణరస-ధ్వని యగుచున్నది [77]

---

75 అత్రాలంబనస్య నాయకస్య నిశ్శ్వాసాశ్రుపాతాదేరనుభావస్య విషాద-చింతావేగాదేశ్చ వ్యభిచారిణః సంయోగాద్ రతిరభివ్యజ్యమానా వియోగ కాలావచ్ఛిన్నత్వాద్ విప్రలంభరసవ్యపదేశహేతుః॥
(రసగం ప్రథమ. పుట. 42)

76. తస్మాద్ద్వావిమౌ సంయోగవియోగాఖ్యౌ అంతఃకరణవృత్తివిశేషౌ ।
యత్సంయుక్తో వియుక్తశ్చాస్మీతి ధీః॥ (రసగం ప్రథమ పుట 41)

77. అత్ర ప్రమీతతనయ ఆలంబనమ్। తత్కాలావచ్ఛినబాంధవదర్శనా-ద్యుద్దీపనమ్। రోదనమనుభావః। దైన్యాదయః సంచారిణః।
(రసగం. ప్రథమ. పుట 43)

ఇట్లు రసములనన్నింటి నుదాహరింపవచ్చును-

**భావధ్వని :-**

కావ్యజీవాతువైన రసమునకు చమత్కారాతిశయమునొనఁగూర్చుటలో నేదేని వ్యభిచారిభావముద్రిక్తావస్థనొంది ముఖ్యపాత్ర వహించుచు వ్యక్తమగుచో నది భావధ్వని [78]

**ఉదా:-**

కంఠకోణవినివిష్టమీశ! తే కాలకూటమపి మే మహామృతమ్।
అప్యుపాత్తమమృతం భవద్వపుర్భేదవృత్తి యది మే న రోచతే॥
(పరమేశ్వరస్తోత్రావళి)

[తా॥ ఓపరమేశా! నీకంఠైకదేశముననున్న కాలకూటవిషమైనను నాకు మహామృతమే కాని నీ మేనఁజోటుచేసికొనని యమృతమైనను నాకు రుచించదు-]

ఇట శివుఁడాలంబనవిభావము-"ఈశ!" యనిసంబోధించుటచే తెలియఁ-దగిన అచంచలైశ్వర్యముద్దీపనవిభావము - స్తుతియనుభావము - మాహాత్మ్యస్మరణాదులు వ్యభిచారిభావములు- వీనిచే కవికి పరమేశ్వరునియెడలగల రతి-భావమభివ్యక్తమై భావధ్వని యగుచున్నది.[79] ఇతి శాంతరసపరిపోషకము.

---

78 యద్యపి రసేనైవ జీవతి సర్వం కావ్యం, తథాపి తస్య రసస్యైకఘన-చమత్కారాత్మనోఽపి కుతశ్చిదంశాత్ ప్రయోజకభూతాదధికోఽసౌ చమత్కారో భవతి। తత్ర యదా కశ్చిదుద్రిక్తావస్థాం ప్రతిపన్నో వ్యభిచారీ చమత్కారాతిశయప్రయోజకో భవతి, తదా భావధ్వనిః॥
—లోచన (ధ్వన్యా. ద్వితీ 3 కారికావ్యాఖ్య)

79 అత్ర మహాదేవ ఆలంబనమ్। ఈశప్రతిపాద్యావ్యాహతైశ్వర్యముద్దీ-పనమ్। స్తవోఽనుభావః। ధృతిమాహాత్మ్యస్మరణాదయో వ్యభిచారిణః। అత్రైతైరనుమితస్తావకరతీనాం సామాజికానాం తైరేవ విభావాదిభి-ర్వ్యంజితా రతిర్భావ ఏవేతి బోధ్యమ్॥
—బాలబోధినీ (కావ్య. 4.45 శ్లో. వ్యాఖ్య)

**రతిభావమును నొకచో వ్యభిచారిభావమే.—**

80 కాంతావిషయమగు రతి శృంగారరసమునకు స్థాయిభావము కాఁగా దేవతలు మున్నగు పూజ్యులయెడను, పుత్రాదులయెడను కాననగు రతిభావము (ప్రేమ) వ్యభిచారిభావమే కాని స్థాయిభావము కాదు కావుననే భక్తివాత్సల్యములు రసములుగాఁ బరిగణింపఁబడలేదు పూజ్యులయెడఁగల రతిని (అనురాగమును) భక్తియనియు, పుత్రులు శిష్యులు మున్నగువారియెడ కాననగు రతిని వాత్సల్యమనియు నందురు కాంతావిషయకరతి స్థాయిభావమగుటకును తదితరవిషయకరతి వ్యభిచారిభావమగుటకును భరతముని యేర్పఱచినవ్యవస్థయే కారణము 81

**మఱియొక యుదాహరణము** (ధ్వన్యా ద్వితీ. 22 కా ఉదా).—

ఏవం వాదిని దేవర్షౌ పార్శ్వే పితురధోముఖీ।
లీలాకమలపత్రాణి గణయామాస పార్వతీ॥*

[ఇట్లు దేవర్షివర్యుఁ డేమేమొ నుడువు
చుండఁ దండ్రికి ప్రక్కననుండి మోము
వంచి పార్వతి ప్రేళులు వన్నెపెట్ట
లీలకమలంపుఁబత్రాల లెక్కవెట్టె
—ఆం ధ్వన్యా ద్వితీ. పుట. 255]

ఇట దేవర్షి (తన) తండ్రియెదుట తనవివాహవిషయము మాటాడుట విభావము, తలవ్రాల్చుట, లీలాకమలపత్రముల లెక్కించుటయును ననుభావ-

---

80. క) రతిర్దేవాదివిషయా వ్యభిచారీ తథాంజితః।
భావః ప్రోక్తః॥ (కావ్య 4 48)

ఖ) ఆదిశబ్దాత్ మునిగురుపుత్రాదివిషయా। కాంతావిషయా తు వ్యక్తా, శృంగారః॥ (కావ్య. 4 48. వృత్తి)

81. "భరతాదిమునివచనానామేవాత్ర రసభావాదివ్యవస్థాపకత్వేన స్వాతంత్ర్యయోగాత్॥" (రసగం ప్రథమ. పుట. 57)

* ఇది కాళిదాస కుమారసంభవమునందలి శ్లోకము (6.84)

ములు. వీనిచే పార్వతికిఁగల లజ్జాభావము వ్యక్తమగుచున్నది. ఇది శృంగార రసపరిపోషకము.

ఇటనొక విశేషము:—

కన్యలకు స్వాభావికముగానే తలవాల్చుటయు కమలపత్రగణనయును సంభవించును కాన నిట లజ్జ వెంటనే స్ఫురించుట లేదు కాని పార్వతి శివుని-యెడ బద్ధానురాగయై తపమొనరించుట మున్నగునంశముల పరిశీలించినపిమ్మట లజ్జ యభివ్యక్తమగుచున్నది కావున నిది అసంలక్ష్యవ్యంగ్యము కాక సంలక్ష్యక్రమవ్యంగ్యమగుచున్నది [82]

**రసాదిధ్వని సంలక్ష్యక్రమవ్యంగ్యమగునా ?**

ఇట్లు ధ్వన్యాచార్యులుదాహరించుటచే, నెచ్చట ప్రకరణాదులు పర్యా-లోచించిననే గాని రసాదులు స్ఫురింపవో, అట నొక క్రమమేర్పడుటచే రసాదులును సంలక్ష్యక్రమములు కావచ్చునని అభినవగుప్తపాదులు వ్యాఖ్యా-నించిరి [83]

అభినవగుప్తపాదుల యీయాశయమును వివరించుచు రసగంగాధర-కారులు - రసాదిధ్వని యన వెంటనే స్ఫురించి యలౌకికానందమును గూర్చు-నది కావున నది యలక్ష్యక్రమమే యగును కాని సంలక్ష్యక్రమము కాదనియు, ప్రకరణపర్యాలోచన చేసిన పిమ్మట స్ఫురించు రత్యాదులు వస్తుధ్వనులే యగును కాని రసాదిధ్వనులు కావనియును లేదేని సంలక్ష్యక్రమవ్యంగ్యము

---

82 ప్రకృతే తు పద్మపత్రసంఖ్యానం ముఖనమనం చాన్యథాపి బాలికానాం సంభవతీతి, వాచ్యార్థేన ఝటిత్యేవ లజ్జాత్మకో వ్యంగ్యార్థో న బోధ-యతుం శక్యః, కింతు వివాహవృత్తాంతప్రస్తావాత్మకప్రకరణపర్యాలోచ-నానంతరం క్రమేణేతి లక్ష్యక్రమతైవేత్యాశయః॥

—ఉద్యోత (ధ్వన్యా ద్వితీ పుట 177)

83 "ఏతదుక్తం భవతి—యద్యపి రసభావాదిరర్థో ధ్వన్యమానఏవ భవతి న వాచ్యః కదాచిదపి తథాపి న సర్వోఽలక్ష్యక్రమస్య విషయః॥"

—లోచన (ధ్వన్యా 2.22 కా )

ద్వాదశ విధమని ప్రాచీనులును తానును విభజించియుండుట పౌనఃగదనియు కావున అభినవగుప్తులవివరణమునందలి 'రసాది' పదమునకు 'రత్యాది' అను నర్థము చెప్పుట సమంజసమనియు నుపపాదించెను [84]

తేలినదేమన–రసాదిధ్వనియసంలక్ష్యక్రమమే యగును కాని సంలక్ష్య క్రమము కాదనియు ప్రకరణసాపేక్షములై సంలక్ష్యక్రమములగు రత్యాదిభావ-ధ్వనులను వస్తుమాత్రధ్వనులుగానే గుర్తించవలెనని రసగంగాధరకారుల యాశయము

రసాభాసధ్వని :–

శతేనోపాయానాం కథమపి గతః సౌధశిఖరం
సుధాఫేనస్వచ్ఛే రహసి శయితాం పుష్పశయనే।
విబోధ్య క్షామాంగీం చకితనయనాం స్మేరవదనాం
సనిశ్వాసం శ్లిష్యత్యహహ ! సుకృతీ రాజరమణీమ్॥
(రసగం ప్రథమ పుట 120)

[తా॥ ఎన్నియో యుపాయముల నూని అతికష్టముగా మేడపైభాగము చేరుకొని, ఆయేకాంతప్రదేశమున అమృతపు నురుగువలె స్వచ్ఛమయినపుష్ప శయనమున నిద్రించియున్నదానిని మేలుకొలుపుటచే మొదట "ఎవఁడా ! ఇప్పుడు నన్ను లేపునది" యని చకితయైనను పరిశీలించిచూచినవెంటనే -"ఆహా! నా ప్రియుఁడు ప్రాణములను గూడ లెక్కచేయక నాకై ఇట నెతెంచియున్నా-డని తనకు గలిగిన సంతోషమును ముఖమున మొలకెత్తిన చిరునగవుతో వ్యక్తము చేయుచున్నదానిని గాంచి "అమ్మయ్యా ! ఇప్పటికి నాయత్నము

---

84. ప్రకరణైర్విభావానుభావవ్యభిచారిభిరలక్ష్యక్రమతయైవ వ్యజ్యమానో రత్యా-దిః స్థాయిభావో రసీభవతి, న సంలక్ష్యక్రమతయా। రసీభావో హి నామ ఝగితి జాయమానాలౌకికచమత్కారవిషయస్థాయిత్వమ్। సం-లక్ష్యక్రమతయా వ్యజ్యమానస్య రత్యాదేస్తు వస్తుమాత్రతైవ న రసా-దిత్వమితి తేషామాశయస్య వర్ణనేన న తదుక్తనాం విరోధః। ఉపపత్తి-స్త్వస్మిన్నర్థే విచారణీయా। రసభావాదిరర్థ ఇత్యత్ర రసాదిశబ్దో రత్యాది పరః॥ (రసగం. ప్రథమ పుట 131)

ఫలించినద"ని నిట్టూర్చి, ఎంతో పుణ్యము చేసికొన్న ఒక అదృష్టశాలి తన ప్రియురాలగు నా రాజపత్నిని కౌఁగిలించుకొనుచున్నాఁడు.

ఇట రాజపత్ని ఆలంబనవిభావము "ఏకాంతవాసము, రాత్రి" ఈ- మున్నగునవి ఉద్దీపనవిభావములు సాహసించి రాజాంతఃపురము ప్రవేశించుట, ప్రాణములు లెక్కచేయకుండుటయు, ఆలింగనాదులును, అనుభావములు, శంకాదులు సంచారిభావములు వీనిచే ఆపురుషునకు రాజపత్నియెడఁగల రతి యభివ్యక్తమయి శృంగారరసాభాస మగుచున్నది.[85]

రసానుకూలమగు సకలవిధవిభావాదిసామగ్రి యున్నను శృంగార రసము కాక రసాభాసమగుటకు కారణము పూజ్యయగు రాజరమణియెడ అను రాగమునూనుట అనుచితమగుటయే.[86] రాజపత్ని మాతృసమానురాలు గదా![87]

**రసాభాస - భావాభాసములు :-**

అనుచితముగా ప్రవర్తిల్లిన రసము రసాభాసమనియు భావము భావాభాసమనియు నందురు [88]

**శృంగారరసాభాసము ..**

నాయికానాయకులలో నొకరు మాత్రమే అనురాగాతిశయము కలిగి యుండుటయు, పూజ్యులగు మునులు గురువులు మున్నగువారిభార్యలయెడ

---

85 అత్రాలంబనమనుచితప్రణయా రాజరమణీ, రహోరజన్యాద్యుద్దీపనం, సాహసేన రాజాంతఃపురే గమనం, ప్రాణేషూపేక్షా నిఃశ్వాసాశ్లేషాదయ- శ్చానుభావాః, శంకాదయః సంచారిణః॥

(రసగం ప్రథమ. 170 పుట)

86 నిషిద్ధాలంబనకత్వాచ్చాస్యా రతే, రాభాసత్వం రసస్య॥

(రసగం ప్రథమ. పుట 170)

87 శ్లో॥ రాజపత్నీ గురోః పత్నీ మిత్రపత్నీ తథైవ చ।
పత్నీమాతా స్వమాతా చ పంచైతా మాతరః స్మృతాః॥

88. "ఆభాసా రసభావానామనౌచిత్యప్రవర్తనాత్॥"

(అలం. మహో 3.53)

ననురాగము కలిగియుండుటయును స్త్రీలకుపపతులవిషయముననే కాని ఎందరోపురుషులయెడనే కాని యనురాగముండుటయును, అనాగరికజాతుల యెడవర్ణ్యమానమగు రతియు, పశుపక్ష్యాదులకు రతియున్నట్లు వర్ణించుటయును అనునీమున్నగునవి శృంగారరసవిషయమున అనుచితములని లాక్షణికులు పేర్కొనిరి. కావున నీవిధముగా వర్ణించిననది శృంగారరసాభాసమగును [89]

పశుపక్ష్యాదులకు రతి యున్నటుల వర్ణించుట శృంగారరసాభాసమగునని చెప్పుట తగదనియు, విభావాదిజ్ఞానము పశుపక్ష్యాదులకు లేకున్నను తత్సామగ్రి యుండుటయే ప్రకృతరసపరిపోషోపయోగి యగునని, కావుననది శృంగారరస మనియే వ్యవహరించుట సమంజసమనియు ఏకావళీకారాదులభిప్రాయపడిరి [90]

---

89 క) ఏకత్రైవానురాగశ్చేత్ తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపి వా।
యోషితో బహుసక్తిశ్చ రసాభాసస్త్రిధా మతః॥ (ప్ర రు రస)

ఖ) "ఉపనాయకసంస్థాయాం మునిగురుపత్నీగతాయాం చ। బహునాయక విషయాయాం రతౌ తథాఽనుభయనిష్ఠాయాం। ప్రతినాయకనిష్ఠత్వే తద్వదధమపాత్రతిర్యగాదిగతే। శృంగారేఽనౌచిత్యమ్।"
(సా ద 3_263 264)

90 క) అపరే తు రసాభాసం తిర్యక్షు ప్రచక్షతే, తన్న పరీక్షాక్షమమ్। తేష్వపి విభావాదిసంభవాత్। విభావాదిజ్ఞానశూన్యాః తిర్యంచో న భాజనం భవితుమర్హంతి రసస్యేతి చేన్న। మనుష్యేష్వపి కేష- చిత్తథాభూతేషు రసవిషయభావాభావప్రసంగాత్। విభావాదిసంభవో హి రసం ప్రతి ప్రయోజకః, న విభావాదిజ్ఞానం, తతశ్చ తిరశ్చా మప్యేవ రసః॥ (ఏకావళీ తృతీ రసాభాస)

ఖ) వస్తుతస్తు అనౌచిత్యమాత్రమేవామీషాం మానసాభాసత్వప్రయోజకం। తిర్యగాదౌ తు అనౌచిత్యాభావాద్రసఏవ। న తదాభాసః। అత ఏవ వృత్తికారో "గ్రీవాభంగాభిరామం" (కావ్య. 4. 41) ఇత్యాదౌ తిర్య- గ్విషయతయా భయానకం, "మిత్రే క్వాపి గతే" (కావ్య 8 344) ఇత్యాదౌ తిర్యగ్విషయతయా విప్రలంభం చోదాజహార॥
—బాలబోధినీ (కావ్య. 4 . 49 సూ వ్యాఖ్య)

పశుపక్ష్యాదిగతముగా వర్ణ్యమానమగు రతి కేవలముగా కాక ఆ పశు పక్ష్యాదులయందు నాయకత్వాద్యారోపముచేసి భావింపఁబడియే లోకోత్తరచమత్కారాధాయకమగుచుండుటయే "తాదృశరతి రసాభాస"మని ప్రాచీనులు పేర్కొనుటలో హేతువని తోచుచున్నది [91]

**రతి తిర్యగ్గతమై శృంగారరసాభాసమగుట కుదాహరణము :-**

దదౌ సరఃపంకజరేణుగంధి గజాయ గండూషజలం కరేణుః ।
అర్ధోపభుక్తేన బిసేన జాయాం సంభావయామాస రథాంగనామా॥*

తా॥ కరేణువు(ఆఁడేనుఁగు) తామరలపుప్పొడులవాసనల గుబాళించు పుక్కిలింపునీటిని ఏనుఁగునకు(తనప్రియునకు) అందిచ్చెను అట్లే చక్రవాక పక్షియు తనప్రియను, సగము తినిన తామరతూఁడు నిచ్చి గౌరవించెను

ఇట ఆడేనుఁగనకు తనప్రియునియందును చక్రవాకమునకు తన ప్రియురాలియందును రతి యభివ్యక్తమై శృంగారరసాభాస మైనది

ఇట గజము చక్రవాకియు ఆలంబనవిభావములు గండూషజలదానము అర్ధోపభుక్తబిసదానమును అనుభావములు వీనిచే తాదృశరతి యభివ్యక్తమగుట స్పష్టమే కదా.

విశేషమేమన నాయికానాయకవ్యవహారసమారోపమున నిట సమాసోక్త్యలంకారము శృంగారరసాభాసోపస్కారకమైనది

---

91 క) తిర్యగాదిష్వింద్రియవర్జితేష్వపి చ నాయకత్వారోపాత్ రసాభాస-భావాభాసాః॥ (అలం మహో 3 53)

ఖ) నిరింద్రియేషు తిర్యగాదిషు చారోపాత్ రసభావాభాసౌ॥

(కావ్యానుశాసనం 2 54)

గ) అథ స్వజాతియోగ్యధర్మైః కరిణాం కరిణీం ప్రతి విభావత్వమితి చేత్, న। తస్యాం కక్ష్యాయాం కరిణాం కరిణీరాగం ప్రతి కారణత్వం, న పునర్విభావత్వం। కించ జాతియోగ్యైర్ధర్మైర్వస్తునో న విభావత్వమ్, అపి తు భావకచిత్తోల్లాసహేతుభి రతివిశిష్టైరేవ॥

(రసార్ణవ- ద్వితీ రసాభాస పుట 124)

* ఇది కుమారసంభవ కావ్యమున 3 . 37వ శ్లోకము.

కావున రసాభాసభావాభాసములకు సమాసోక్త్యర్థాంతరన్యాసోత్ప్రేక్షా రూపకోపమాశ్లేషాద్యలంకారములు జీవితమని యాచార్య హేమచంద్రుఁడు వివరించెను [92]

ఇతర రసాభాసములు :-

ఇట్లే ఇతరరసాభాసముల విషయమునను, అనుచితముగా ప్రవర్తిల్లిన, గురువు మున్నగు పెద్దలయెడల ప్రదర్శించిన కోపము రౌద్రాభాసమగుననియు అధమపాత్రగతముగా వర్ణించిన శమము శాంతరసాభాసమనియు, గురువులు మున్నగు పెద్దలఁజూచి హాడమినట్లు వర్ణితమైన హాసము హాస్యాభాస మనియు, అనుచితకార్యములయందు కనఁబఱచిన యుత్సాహము మఱి హీనగుణుఁడు లోకోత్తరకార్యములయెడ సూనినయుత్సాహము వీరాభాస మనియు, ఉత్తమపాత్రలయెడ వర్ణింపఁబడిన భయము భయానకాభాసమనియు తనచే నిహతుఁడైన ప్రతివీరునియెడను, కలహశీలురగుకుపుత్రాదులయందును కలిగిన శోకము కరుణాభాసమనియు, బ్రహ్మజ్ఞాని కనఁబఱచినట్లు వర్ణితమైన జుగుప్స బీభత్సాభాసమనియు, అలోకోత్తరవస్తువిషయమున ప్రదర్శితమైన విస్మయము అద్భుతాభాసమనియు లాక్షణికులు వివరించిరి.[93]

---

92 రసాభాసస్య భావాభాసస్య చ సమాసోక్త్యర్థాంతరన్యాసోత్ప్రేక్షా-రూప కోపమాశ్లేషాదయో జీవితమ్॥ (కావ్యానుశాసనం 2 52 సూత్రవృత్తి)

93 క) 'శృంగారేణ వీరాదీనామప్యాభాసరూపతోపలక్షితైవ॥'

—లోచన (ధ్వన్యా 2 3 కా. వ్యాఖ్య)

ఖ) "రౌద్రే గుర్వాదిగతకోపే। శాంతే చ హీననిష్ఠే గుర్వాద్యాలంబనే హాస్యే। బ్రహ్మవధాద్యుత్సాహేఽధమపాత్ర గతే తథా వీరే। ఉత్తమ-పాత్రగతత్వే భయానకే జ్ఞేయమన్యత్ర॥"

(సా. ద 3 . 241, 242)

గ) ఏవమన్యత్రేతి। అత్రైవ హతపాత్రగతే కరుణే, బ్రహ్మజ్ఞానిగత జుగుప్సే బీభత్సే ఽవిశేషదర్శితపాత్రగతే అద్భుతేఽనౌచిత్యమవ-గంతవ్యమ్॥ — లక్ష్మీవ్యాఖ్యా. (సా ద 3 . 365)

ఘ) ఏవం కలహశీలకుపుత్రాద్యాలంబనతయా వీతరాగాదినిష్ఠతయా చ వర్ణ్యమానః శోకః బ్రహ్మవిద్యానధికారిచండాలాదిగతత్వేన చ

రౌద్రాభాసాదులను గూడ నిట్లే యుదాహరింపవచ్చును.

భావాభాసధ్వని .-

సర్వేఽపి విస్మృతిపథం విషయాః ప్రయాతాః
విద్యాఽపి ఖేదకలితా విముఖీబభూవ।
సా కేవలం హరిణశావకలోచనా మే
నైవాపయాతి హృదయాదధిదేవతేవ ॥ (రసగం ప్రథమ)

తా॥ ఇతరవిషయములన్నియు మఱుగునఁబడినవి అతిశ్రమకోర్చి సంపాదించిన విద్యయు పెడమొగము పెట్టినది - ఇఁక నాలేడికన్నులచిన్నది మాత్రము నాహృదయపీఠముననుండి తానొకయధిదేవతయన్నట్లు వీడిపోవుట లేదు

గురుకులమున విద్యాభ్యాసము చేయుసమయమున గురు-కన్యాలావణ్యాకృష్టుఁడై దేశాంతరగతుఁడైనను దానినే తలంచుచున్న యొకవిద్యార్థి పలుకులివి 94

ఇట ప్రతిషిద్ధగమనయు తనయందనురాగము లేనిదియునగు గురుకన్య యెడల ప్రవర్తిల్లినరతి అనుచితమే కావున దానిని పోషించుచు ప్రధానముగా నభివ్యక్తమయిన తదీయరూపలావణ్యాదిస్మృతి భావాభాసమే 95

కావున నిది భావాభాసధ్వని.

ఇట్లే భావాభాసములనెన్నియేని ఉదాహరింపవచ్చును

---

నిర్వేదః, కదర్యకాతరాదిగతత్వేన పిత్రాద్యాలంబనత్వేన వా క్రోధోత్సాహౌ, ఐంద్రజాలికాద్యాలంబనత్వేన చ విస్మయః, గుర్వాద్యాలంబనతయా చ హాసః, మహావీరగతత్వేన భయం యజ్ఞీయపశువసామాంసాద్యాలంబనతయా వర్ణ్యమానా జుగుప్సా చ రసాభాసాః॥
(రసగం. ద్వితీ. రసాభాస)

94 గురుకులే విద్యాభ్యాస సమయే తదీయ కన్యాలావణ్యగృహీతమానసస్యాన్యస్య వా కస్యచిత్ ప్రతిషిద్ధగమనాం స్మరతో దేశాంతరం గతస్యేయముక్తిః॥ (రసగం ప్రథమ. భావాభాస)

95 ఏషా చ- అనుచిత విషయకత్వాత్, అనుభయ నిష్ఠత్వాచ్చ భావాభాసః॥
(రసగం. ప్రథమ. పుట 124)

భావములకు పంచావస్థలు :-

ప్రతిభావమునకును స్థితి ఉదయము(పుట్టుక) శాంతి(నాశము) సంధి (కలయిక) శబలత(ఒకభావమునణఁగఁద్రొక్కి మఱియొకభావముద్బుద్ధమగుట) అను నీయయిదవస్థలుండును [96] అభావములయొక్క ఆయాయవస్థలే విశేషించి చమత్కారాతిశయము నొనఁగూర్చుటచే భావశాంతి, భావోదయము, భావసంధి, భావశబలత, అని ప్రత్యేకవ్యవహారము - వాస్తవమునకు నివి యన్నియును ఆయాయవస్థలతో కూడుకొనిన భావధ్వనులే [97] భావస్థితియన ఉదయా(ఉత్పత్త్యా)ద్యవస్థలలోఁగాక నిలుకడగానుండు భావమే [98] ఇట్టి భావధ్వని పూర్వమే (పు. 125) యుదాహరింపబడినది

ఇక భావశాంతి —

ఒకచో నొకవ్యభిచారభావము శాంతించుచు (నశించుచు) చమత్కార విశేషాధాయకమగుచుండును. దానినే భావశాంతియని వ్యవహరింతురు

ఉదా —

ముంచసి నాద్యాపి రుషం భామిని! ముదిరాశిరుదియాయ ।
ఇతి తన్వ్యాః పతివచనైరపాయి నయనాబ్జకోణశోణరుచిః ॥[99]
(రసగం ప్రథమ పుట 124)

---

96 స్థితిస్తథోదయః శాంతిః సంధిః శబలతా తథా ।
ఇత్యేతాః సర్వభావానామవస్థాః పంచ కీర్తితాః॥ (అలం మహో 3 54)

97 క) ఇదం పునర్భావధ్వనిభ్యో భావశాంత్యాదిధ్వనీనాం చమత్కారవైలక్షణ్యే నిదానం, యదేకత్ర చర్వణాయాం భావేషు స్థిత్యవచ్ఛిన్నామర్షాదిత్వం, అమర్షాదిత్వమేవ వా ప్రకారః, అన్యత్ర తు ప్రశమావస్థేత్యాదిరపీతి॥ (రసగం ప్రథమ. పుట 130)

ఖ) య ఏతే భావశాంత్యుదయసంధిశబలతాధ్వనయ ఉదాహృతాః తేఽపి భావధ్వనయ ఏవ॥ (రసగం. ప్రథమ పుట 127)

98 ప్రశమాద్యవస్థాచతుష్కరహితో భావ ఏవ భావస్థితిః॥
—బాలబోధినీ (కావ్య. 4 51 సూ. వ్యాఖ్య)

99. భామినీవిలాసమున 72వ శ్లోకమిది.

తా॥ "ఓ కోపనా ! మేఘపంక్తియాకాశమును క్రమ్మినను నీవిప్పటికిని అలుక మానకున్నావు" అనునీప్రియుని పలుకులచే వాక్యశాంగి కనుకొలంకులలోని యెఱుపుకాంతి త్రాగివేయఁబడినది (తొలగింపఁబడినది)

100 ఇట ప్రియుని యట్టిపలుకులాలకించుట విభావము ఎఱ్ఱని కాంతి యడుగుట యనుభావము వీనిచే కోపముపశమించుట వ్యంగ్యము కావుననిది భావశాంతిధ్వని యయినది

భావోదయము —

ఒకప్పుడొక భావముయొక్క ఉత్పద్యమానావస్థయే చమత్కారాతిశయమునొనఁగూర్చుచుండును అదియే భావోదయధ్వనియగును.

ఉదా —

101 ఏకస్మిన్ శయనే విపక్షరమణీనామగ్రహే ముగ్ధయా
సద్యః 102 కోపపరాఙ్ముఖగ్లపితయా చాటూని కుర్వన్నపి।
ఆవేగాదవధీరితః ప్రియతమస్తూష్ణీంస్థిత స్తత్క్షణం
మాభూత్ సుప్త ఇవేత్యమందవలితగ్రీవం పునర్వీక్షితః॥

(కావ్య. 4/51)

[రమణుం డేకశయంబునన్ సవతిపేరం దన్ను బిల్వంగ రో
షమునన్ మార్మొగమై తపించుముగుదన్ జాటూక్తులన్ దేర్పఁజా
లమిఁ దూష్ణీంస్థితి నుండఁగా నతఁడు నిద్రం గూరెనో యంచు ధై
ర్యము జాఱన్ మెడ ద్రిప్పి వేగ ప్రియునాస్యంబున్ విలోకించెడిన్॥
—అమరుకావ్యము 23 వ పద్యము]

ఇట ప్రియుఁడు తన్ననునయింపక తూష్ణీంభూతుఁడై యుండుట విభావము. తత్తరపాటున మెడ త్రిప్పి ప్రియునిమోము చూచుట యనుభావము. దీనిచే నౌత్సుక్యమను వ్యభిచారి భావముయొక్కయుదయము వ్యంగ్యంము 103

ఇది భావోదయ ధ్వని

---

100 అత్ర తాదృశ ప్రియవచన శ్రవణం విభావః, నయనకోణగతశోణరుచేర్నాశః। తదభివ్యక్తః ప్రసాదో వాఽనుభావః। ఉత్పత్తికాలావచ్ఛిన్నో రోషనాశో వ్యంగ్యః॥ (రసగం ప్రథమ. పుట 124)

101 అమరుకశతకమున 22వ శ్లోకము

102 "మానపరిగ్రహగ్లపితయా" అని కావ్యప్రకాశ (4 51) పాఠము

103. "అత్రౌత్సుక్యస్యోదయః" (కావ్యప్రదీపః 4 . 13 కా వృత్తి.)

గావసంధి —

104 భావసంధియన ఒకదానినొకటి అణఁగఁద్రొక్కఁజాలియు అట్లణఁగఁద్రొక్కక చెలంగు రెండుభావములసమ్మేళనము ఆసంధియే చమత్కారహేతువై ఆస్వాదవిషయమగును.

ఉదా .—

యౌవనోద్గమ నితాంతశంకితాః శీలశౌర్యబలకాంతి లోభితాః ।
సంకుచంతి వికచంతి రాఘవే జానకినయననీరజశ్రియః ॥

(రసగం ప్ర పు. 123)

తా॥ యౌవనావిర్భావముచే మిక్కిలి శంకించుచున్నవియు శీలశౌర్యాదిగుణములచే నాసక్తములయినవియునగుచు సీతాదేవికనుఁదమ్ములసోయగములు శ్రీరామచంద్రునిపై సంకోచవికాసముల నొందుచున్నవి.

ఇట శ్రీరాముని నిరుపమానసౌందర్యమును గాంచుటయును అతని లోకోత్తరగుణములవినుటయును విభావము లోచనములు సంకోచవికాసములనొందుట యనుభావములు వీనిచే సిగ్గు, ఔత్సుక్యము' అనువాని సంధి వ్యంగ్యము 105

ఒకచో లజ్జ ఔత్సుక్యమును ప్రతిబంధించును, వేఱొకచో నౌత్సుక్యము లజ్జను ప్రతిబంధించవచ్చును కాని ఇట ఈ లజ్జౌత్సుక్యములు రెండును ఏవిధమైన బాధ్యబాధకభావము లేకయుండుటచే వీనిసంధి క్రొంగ్రొత్తవన్నె తెచ్చుచున్నది

---

104. క) "భావసంధిరన్యోన్యానభిభూతయోరన్యోన్యాభిభవనయోగ్యయోః సామానాధికరణ్యమ్॥" (రసగం. ప్రథమ. పుట. 125)

ఖ) క్వచిత్తు వ్యభిచారిణః సంధిరేవ చర్వణాస్పదమ్॥

—లోచన. (ధ్వన్యా. 2 . 3 కా వ్యాఖ్య)

105 అత్ర భగవద్దాశరథిగతస్య లోకోత్తరయౌవనోద్గమస్య, తాదృశస్యైవ శీలశౌర్యాదేశ్చ దర్శనం విభావః। నయనగతసంకోచవికాసావనుభావః వ్రీడౌత్సుక్యయోః సంధిర్వ్యంగ్యః॥ (రసగం. ప్రథమ. పుట 125)

**భావశబలత :—**

పూర్వపూర్వభావముల నుపమర్దించుచు ప్రతీయమానములై చమత్కృతి నాస్వాదింపఁజేయు భావములయొక్క సమ్మిశ్రణమే భావశబలత యని యందురు 106

ప్రాచీనుల యుదాహరణములు పరిశీలించిన పూర్వపూర్వోపమర్దన మనియతమని తెలియుననియు, కావున ఉదాసీనములైయుండు భావముల మిశ్రీభావముకూడ భావశబలతయగునని పండితరాయలభిప్రాయపడిరి 107

**ఉదా —**

క్వాకార్యం శశలక్ష్మణః క్వ చ కులం భూయోఽపి దృశ్యేత సా
దోషాణాం ప్రశమాయ నః శ్రుతమహో! కోపేఽపి కాంతం ముఖమ్।
కిం వక్ష్యంత్యపకల్మషాః కృతధియః, స్వప్నేఽపి సా దుర్లభా
చేతః స్వాస్థ్యముపైహి, కః ఖలు యువా ధన్యోఽధరం ధాస్యతి ॥
(కావ్య 4 53)

---

106 క) "బహూనాం భావానాం పూర్వపూర్వోపమర్దేన ఉపనిబంధనం భావశాబల్యమ్॥" (ఏకావళీ తృతీయ పుట 124)

ఖ) శబలతా తు కాలభేదేన నిరంతరతయా పూర్వపూర్వోపమర్దనమ్॥ (కావ్యప్రదీపః 4 13 కా వృత్తి)

గ) "వస్తుతస్తు ఏషాం పూర్వపూర్వోపమర్దేన పరపరోదయః శబలతా॥" (కావ్యపరీక్షా 2 27_1 కా వృత్తి)

107 క) "భావశబలత్వం భావానాం బాధ్యబాధకభావమాపన్నానాముదాసీనానాం వా వ్యామిశ్రణం ॥" (రసగం ప్రథమ పుట 126)

ఖ) యత్తు కావ్యప్రకాశటీకాకారైః ఉత్తరోత్తరేణ భావేన పూర్వపూర్వభావోపమర్దః శబలతా" ఇత్యభ్యధీయత, తన్న । "పశ్యేత్ కశ్చిత్" (కావ్య 5 123) ఇత్యత్ర శంకాఽసూయా ధృతి స్మృతి శ్రమదైన్య మత్యౌత్సుక్యానాముపమర్దలేశశూన్యత్వేఽపి శబలతాయా రాజస్తుతిగుణత్వేన పంచమోల్లాసే మూలకృతైవ నిరూపణాత్॥ (రసగం ప్ర. పు 126)

ఊర్వశిని చూచినపురూరవుని పల్కులివి 108

"ఈయకార్యమెక్కడ : ఆ నిష్కళంకమగు మా చంద్రవంశమెక్కడ!"

చంద్రవంశీయుఁడనగు తన కా మునికన్యకాసక్తిరూపమగు నకార్యము తగదనుట ఇట 'వితర్కము"109 వ్యంగ్యము

"లోకోత్తర సౌందర్యరాశియగు ఆయుర్వశి మళ్ళీ నాకు కనఁబడునా!

తానామెను మాటిమాటికి చూడనువిళ్ళూరుచున్నాఁడనుట ఇది కాలాక్షమత్వ (ఇష్టావాప్తికై విలంబమును తట్టుకొనలేక త్వరపడుట) రూపమగు 'నౌత్సుక్యము"110 పూర్వవితర్కమునకిది గొడ్డలిపెట్టు మా వంశమునకిది తగదనుకొనినవాఁడు మరల చూడ నువిళ్ళూరుచున్నాఁడనిన శాంతరససంచారియగు "వితర్కము" శృంగారరససంచారియగు "నౌత్సుక్యము"చే నణఁచఁబడినదనియే కదా భావము.

"గురుకులవాసక్లేశమున నార్జించిన మాశాస్త్రజ్ఞానమంతయు ప్రమాదాది దోషముల నరికట్టుటకె కదా"

దీనిచే తత్త్వనిర్ధారణాత్మకమగు111 "మతి"యను శాంతరససంచారి భావము వ్యక్తమగుచు పూర్వపుటౌత్సుక్యమును మటుమాయము చేసినది. తానట్లనుచితకార్యము నాచరించుట ప్రమాదమనియు, అట్లయిన నిఁక తన శ్రుతము నిష్ప్రయోజన మనియు తాత్పర్యము

"కోపముననను ఆమోమెంతయందముగా నున్నది"

---

108 "క్వాకార్యమితి। విక్రమోర్వశీయే ఉర్వశీం దృష్ట్వా పురూరవస ఉక్తిరియమితి బహుటీకాసమ్మతః। శుక్రకన్యాం దేవయానీం దృష్టవతో యయాతే రుక్తిరితి శ్రీవత్సలాంఛనాదయః॥"

—నాగేశ్వరీ. (కావ్య. 4 53 వ్యాఖ్య)

109 వితర్కః సంశయాదిభ్యః శిరఃకంపాది కారణమ్॥

(అలం మహో 3 44)

110. కాలాక్షమత్వమౌత్సుక్యం మనస్తాపత్వరాదికృత్॥

(ప్ర రు. రసప్రకరణ)

111. శాస్త్రాదివిచారజన్యమర్థనిర్ధారణం మతిః।

(రసగం ప్రథమ. పుట. 104)

దీనిచే శృంగారరససంచారియగు 'స్మృతి"[112] యభివ్యక్తమగుచు 'మతి' యను పూర్వభావమును బాధించుచున్నది నా శాస్త్రజ్ఞానమంతయు నిష్ప్రయోజనమయినను సరియే ఆ యందమట్టిది యని భావము

"సచ్ఛీలురు నన్ను గుఱించి ఏమనుకొందురో కదా!'

[113]సంభావితున కపకీర్తి మరణముకన్నను మిన్న కావున తనకపకీర్తి వచ్చునేమో యను అనిష్టాభ్యాగమరూపమగు [114]"శంక" స్మృతిని పోనాడినది

"ఆసుందరి స్వప్నమునందును దుర్లభురాలు"

[115] కని విని యెఱుంగనివాని నెన్నింటినో కనఁబఱచఁజాలు స్వప్నమైనను ఆసుందరిని చూపింపఁజాలకున్నది యని దైన్యము [116] ఇది పూర్వపుశంకను దూరీకరించినది

"ఓ హృదయమా! స్వస్థత నొందుము".

అధర్మప్రవృత్త్యున్ముఖతను విడనాడు మనుట. ఇట పూర్వపుదైన్యమును త్రోసిపుచ్చు"ధృతి[117] యను సంచారిభావము

"ఈ లోకోత్తర సౌందర్యరాశియధరము నాస్వాదించు నదృష్టశాలి ఎవఁడో కదా!"

ఇట శృంగారసంచారియగు చింత పూర్వపుధృతిని రూపుమాపినది

ఇట్లీ శ్లోకమున "వితర్క-ఔత్సుక్య-మతి-స్మృతి-శంకా-దైన్య-ధృతి-చింత"లనెడు నీభావములు పూర్వపూర్వభావముల నుపమర్దించుచు వ్యక్త

---

112 సదృశజ్ఞాన చింతాద్యైర్భ్రూసమున్నయనాదికృత్।
స్మృతిః పూర్వానుభూతార్థవిషయజ్ఞానముచ్యతే॥ (సా ద 3 162)

113 "సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే॥" (భగవద్గీత 2. 34)

114 "కిమనిష్టం మమ భవిష్యతీత్యాకారశ్చిత్తవృత్తివిశేషః శంకా"
(రసగం ప్రథమ పుట 99)

115 "అదృష్టమప్యర్థమదృష్టవైభవాత్ కరోతి సుప్తిర్జనదర్శనాతిథిమ్॥'
(నైషధ ప్రథమ)

116. "దౌర్గత్యాదిభవం దైన్యమసంస్కారాదికారణమ్॥"
(అలం మహో 3 41)

117 "లోభశోకభయాదిజనితోపప్లవకారణీభూతశ్చిత్తవృత్తివిశేషో ధృతిః॥"
(రసగం ప్రథమ పుట. 99)

ములయి చమత్కారాతిశయము నొనగూర్చుచున్నవి కావున నిది భావశబలత [118]

ఇట చిట్టచివర శృంగారరసవ్యభిచారిభావమగు చింతయే ప్రధానముగా నాస్వాదయోగ్యతనొంది శాంతరసముపై శృంగారరసమునకు విజయము సాధించి పరమోత్కర్షనాపాదించినది [119]

ఇట్లీ భావధ్వనులలోను పార్యంతికముగా రసమే ఆస్వాద్యమానమగు చున్నది

కావున రసమే కావ్యమునకు జీవితమనియు, రసము లేని కావ్యము మనఁజాలదనియు, అయినను ఆరసమున కొకప్పుడు ఏదో యొకభావము చమత్కారాతిశయమును కలిగించుటలో ప్రాధాన్యమునొందుననియు, వివాహము చేయసమకట్టిన భృత్యునకు తోడుగా వచ్చిన రాజునకంటెను ఆసమయమున భృత్యునకే ప్రాముఖ్యముండుట తెలియనిది కాదనియు, అప్రాధాన్యము నూతఁగాఁగొనియే "భావధ్వని"యని వ్యవహరించుట జరుగుననియును అభినవగుప్తపాదమమ్మటాదులు వివరించియున్నారు [120]

---

118. "అత్రపూర్వపూర్వస్య వితర్కాదేరుపమర్దేన బాధనేన ఉత్తరోత్తరం ప్రతీయమానం చమత్కారమాదధాతీతి తత్స్వరూపా శబలతా॥"
—నాగేశ్వరీ (కావ్య 4 53 వ్యాఖ్య)

119. ఏవం చ కావ్యే పార్యంతికచింతయా శాంతేరుపమర్దేన శృంగారస్య విశ్రాంతిః, సా చ శత్రువిజయపూర్వకరాజ్యలాభ ఇవ ప్రకర్షనిదానమ్॥"
—బాలబోధినీ (కావ్య. 4 . 53 వ్యాఖ్య)

120 క) స చ రసాదిధ్వనిర్వ్యవస్థిత ఏవ। న హి తచ్ఛూన్యం కావ్యం కించిదస్తి। యద్యపి రసేనైవ సర్వం జీవతి కావ్యం। తథాపి తస్య రసస్యైకఘనచమత్కారాత్మనోఽపి కుతశ్చిదంశాత్ ప్రయోజకీభూతాత్ అధికోఽసౌ చమత్కారో భవతి। తత్ర యదా కశ్చిదుద్రిక్తావస్థాం ప్రతిపన్నో వ్యభిచారీ చమత్కారాతిశయప్రయోజకో భవతి, తదా భావధ్వనిః॥ — లోచన. (ధ్వన్యా. 2 3 కా వ్యాఖ్య)

ఖ) సూ॥ "ముఖ్యే రసేఽపి తేఽంగిత్వం ప్రాప్నువంతి కదాచన॥" తే భావశాంత్యాదయః। అంగిత్వం రాజానుగతవివాహప్రవృత్తభృత్యవత్॥ (కావ్య 4 . 51 వృ )

అట్లే ఆయాభావమునకుఁగల పంచావస్థలును ఆయా సందర్భములలో చమత్కారవిశేషాధానమున ప్రధానభావము నొంది "భావశాంత్యాదిధ్వనులు" అను పేర ప్రత్యేకముగా పిలువఁబడుచున్నవి [121] నిజమునకివి యన్నియు భావధ్వనులే యని పూర్వమే నివేదితమయినది.

ఇట్లు రస భావ-రసాభాస-భావాభాస-భావశాంతి-భావోదయ-భావసంధి-భావశబలతా-ధ్వనులు దిఙ్మాత్రముగా నుదాహరింపఁబడినవి

ఈ విధముననే రసాంతరాభాసాదిధ్వనులను గూడ నుదాహరింపవచ్చును

**సంలక్ష్యక్రమ–అసంలక్ష్యక్రమత్వ వ్యవహారము :–**

(సంలక్ష్యక్రమము, అసంలక్ష్యక్రమము అనగానేమి ?)

ఈ రసభావాదులు (పద్యము వినినతోడనే) చప్పున స్ఫురించునవి, కావున వీనిలో వస్త్వలంకార ధ్వనులయందున్నట్లు ఒక క్రమమేది లేనట్లు తోచును అయినను సూక్ష్మముగా పరిశీలించిన నివియును విభావాదిపర్యాలోచనచేసిన పిమ్మటనే స్ఫురించునవి కావున నొకక్రమమున్నది కాని అది శతపత్ర పత్రశత భేదనమునకువలె (నూరురేకుల తామరపూవు నూరురేకులనొకటిగాఁజేసి సూదితో గ్రుచ్చినప్పటియట్లు) గోచరించదు

కావున రసాదిధ్వనిని "అసంలక్ష్యక్రమ"మనియందురు. [122]

---

121 ఏషు (భావశాంత్యాదిషు) సత్యపి రసే కావ్యసర్వస్వతాం గతైరేతైరేవ వ్యవహారః, "ప్రాధాన్యేన వ్యపదేశా భవంతీ"తి న్యాయాత్॥
(కావ్యపరీక్షా 2 . 27-1 కా వృత్తి)

122 క) రస భావ-తదాభాస-భావశాంత్యాదిరక్రమః॥ (ధ్వన్యా. 2 . 23-1)

ఖ) న ఖలు విభావానుభావవ్యభిచారిణ ఏవ రసః, అపి తు- రసస్తైరిత్యస్తి క్రమః। స తు లాఘవాన్న లక్ష్యతే॥
(కావ్య. 4 25 కా. వృత్తి)

గ) ఉక్తస్వరూపో భావాది రసంలక్ష్యక్రమవ్యంగ్యః। అత్ర వ్యంగ్యప్రతీతేర్విభావాదిప్రతీతికారణకత్వాత్ క్రమోఽవశ్యమస్తి। కింతూత్పలపత్రశతవ్యతిభేదవల్లాఘవాన్న సంలక్ష్యతే॥
(సా. ద. 4 . 5 కా. వృత్తి)

ఇఁక వస్త్వలంకారధ్వనులలో నొక క్రమము ప్రస్ఫుటముగా గోచరించును వక్తృబోద్ధ్యాదులస్వరూపస్వభావపర్యాలోచన చేసినఁ గాని యవి స్ఫురింపవు గదా కావున వానిని "సంలక్ష్యక్రమము" లందురు

**రసాదిధ్వని షడ్విధము** —

సంలక్ష్యక్రమములగు వస్త్వలంకారధ్వనులు "పదవాక్యప్రబంధము"లనుమూడింటిచేతనే వ్యక్తములగుచుండగా నీయసంలక్ష్యక్రమమగు రసాదిధ్వని పదవాక్యప్రబంధములచేతనే గాక పదాంశవర్ణరచనలచేతను అభివ్యక్తమగుచుండును [123]

**పదద్యోత్యమగు నసంలక్ష్యక్రమవ్యంగ్య రసాదిధ్వని** —

ఒకచో నొకపదమే ప్రధానముగా రసపరిపోషకమగును

**ఉదా** —

లావణ్యం తదసౌ కాంతిః తద్రూపం స వచఃక్రమః ।
తదా సుధాస్పదమభూదధునా తు జ్వరో మహాన్ ॥ (కావ్య 4 75)

తా॥ ఆ లావణ్యము, ఆకాంతి, ఆరూపము, ఆమాటలతీరు, అవాఁడమృతము నొలికినవి. మఱి నేడో గొప్పజ్వరముగా మారినవి

ఇవి యొక విరహి తన ప్రియను గూర్చి పలికినపలుకులు

ఇట "తత్"(అ)అను సీమున్నగు సర్వనామపదములు ఆప్రియురాలి లావణ్యాదులు అనుభవముచేతనే కాని మాటలచేఁజెప్పనలవికానివని ధ్వనించుచు విప్రలంభమును పోషించుటలో ప్రాధాన్యము నొందుచున్నది [124]

---

123. క) అసంలక్ష్యక్రమో రసాదిధ్వనిః ప్రబంధ-వాక్య-పద-పదైకదేశ-రచనా-వర్ణ-గతత్వేన షడ్విధః ॥ (ప్ర రు. కావ్యప్రకరణ)

ఖ) యస్త్వలక్ష్యక్రమవ్యంగ్యో ధ్వనిర్వర్ణపదాదిషు ।
వాక్యే సంఘనాయాం చ స ప్రబందేఽపి దీప్యతే॥ (ధ్వన్యా 3 2)

124. అత్ర తదాది పదై రనుభవైకగోచరా అర్థాః ప్రకాశ్యంతే। (కావ్య 4 . 75 వృత్తి)

ఖ) "అత్ర విప్రలంభార్థే వాక్యేఽనుభవైకగోచరమర్థం ప్రకాశయతాం తత్పదాదీనాం ప్రాధాన్యం॥"
[కావ్యప్రదీప (నిర్ణ.సం 1912) పుట. 112]

కావున నిది పదద్యోత్యమగు రసధ్వని

**మఱియొక యుదాహరణము** —

ఇట్లు సర్వనామవాచకపదములేకాక ఇతర పదములును రసవ్యంజకము లగును ఎట్లన ?

ముగ్ధే! ముగ్ధతయైవ నేతు మఖిలః కాలః కిమారభ్యతే
మానం ధత్స్వ ధృతిం బధాన ఋజుతాం దూరే కురు ప్రేయసి ॥
సఖ్యైవం ప్రతిబోధితా ప్రతివచస్తామాహ “భీతాననా”
నీచైః శంస హృది స్థితో హి నను మే ప్రాణేశ్వరః శ్రోష్యతి ॥
(కావ్య 4 76)

[గోలతనమ్ముమైఁ గడువఁ గోరుదె నిచ్చలు ? నాథుపైఁ గనల్
దాలుపు, ధైర్యముఁ గనుమెదఁ, విడు తిన్నఁదనంబు బేల!” యం
చాళి విధింప భీతిమెయి నల్లనఁ బల్కు ము పీను సేర్చునే
బాలిక ! డాఁగె నాయెడఁదఁ బ్రాణవిభుండని చెప్పె మూర్ఖడిఁ
—అమరు 82 ప ]

[125] ఇంతటి యపరాధమొనర్చినను ప్రియునిపై నలుక బూనక బుజువర్తనవై యుండుట తగదని యుపదేశించుచున్న చెలితో— “సఖీ ! మెల్లన నుడువుము నాహృదయముననున్న ప్రియుఁడు వినునేమో యని మోమున భయముతోఁప నాముగద పలికెనని కవివాక్యమిది

ఇట నాయిక మోమున పొడచూపిన భయము నాయికకు తనప్రియుని యెడఁగల అకృత్రిమానురాగమును వ్యక్తీకరించుచు సంభోగశృంగారరస

---

గ) “అత్ర తదాదిభి ర్విశిష్యవచనానర్హతయా లావణ్యాదిగతలోకోత్తరత్వప్రతిపాదనద్వారా విప్రలంభాభివ్యక్తిః॥” ఇత్యుదాహరణ చంద్రికా సంక్షేపః॥”
(కావ్యప్రదీపః. చతుర్థ పుట. 112)

125 అమరుకశతకే-విదితరహస్యాం మానోపదేశం కుర్వాణాం సఖీ మగణయంత్యా భర్తరి ప్రణయవినయవత్యా నాయికాయా భంగ్యంతరేణ ప్రత్యుక్తిరియం॥ —బాలబోధినీ (కావ్య 4 . 76 వ్యాఖ్య)

మును పోషించుచున్నది[126] కావున నిది 'భీతాననా'యను పదముచే ద్యోత్య-మగు రసధ్వని

ఇట పదములనగా నామ-గుణ-క్రియా-వాచకములు, నిపాతములు, ఉపసర్గలు, కృదంతములు, తద్ధితాంతములు, సమాసపదములు ఈ మున్నగు-నవి యన్నియును, కావున ఆ పదవిశేషములన్నింటిచేతను అయారసధ్వనులు పదద్యోత్యములగుట నుదాహరింపవచ్చును[127]

భావధ్వనులును పదద్యోత్యములగును కాని వానిలోనంతవైచిత్ర్య-ముండదు కాన లాక్షణికులుదాహరింపకుండిరి[128]

**పదాంశద్యోత్యమగు రసధ్వని :–**

ఒకచో నొక పదాంశము అనగా ప్రకృత్యంశమో ప్రత్యయాంశమో రసపరిపోషణమున ప్రాధాన్యము నొందును.

ఉదా :–

"న్యక్కారో హ్యయమేవ మే యదరయః"[129]

---

126. భయప్రతిపాద్యాకృతిమానురాగేణ చ సంభోగః ప్రకృష్యతే ఇతి తస్య ప్రాధాన్యేన "భీతాననా"–పదప్రకాశ్యతా'
—బాలబోధినీ (కావ్య. 4. 76 వ్యాఖ్య)

127. సుప్తిఙ్వచనసంబంధైస్తథా కారకశక్తిభిః ।
కృత్తద్ధితసమాసైశ్చ ద్యోత్యోఽలక్ష్యక్రమః క్వచిత్॥
(ధ్వన్యా 3 16)

128. భావాదీనాం పదప్రకాశ్యత్వేఽధికం న వైచిత్ర్యమితి న తదుదా-హ్రియతే॥ (కావ్య 4. 59 వృత్తి/కావ్యాను 1. 25 సూ. వృత్తి)

129 ఈ శ్లోకము పూర్తిపాఠమిది (ధ్వన్యా. 3. 16 కా. ఉదా )
న్యక్కారో హ్యయమేవ మే యదరయస్తత్రాప్యసౌ తాపసః
సోఽప్యత్రైవ నిహంతి రాక్షసకులం జీవత్యహో! రావణః ।
ధిగ్ధిక్ఛక్రజితం ప్రబోధితవతా కిం కుంభకర్ణేన వా
స్వర్గగ్రామటికావిలుంఠనవృథోచ్ఛూనైః కిమేభిర్భుజైః॥
(హనుమన్నాటక)

ఇట 'ఆరయః' (అరులు) అను బహువచనము—"నాకసలు శత్రువుల యస్తిత్వమే యవమానమనఁగా ఒకఁడు గాక పదుగురుండుట మఱియునవమాన"మని క్రోధోద్దీపనవిభావమును వ్యక్తీకరించుచు వీరరసపోషణమున ప్రధాన భావమునొందుచున్నది [130]

ఇట్లే ఇతరపదాంశములను గూడ నుదాహరింపవచ్చును.

**వాక్యద్యోత్యమగు రసధ్వని :—**

**ఉదా .—**

"శూన్యం వాసగృహం విలోక్య"[131] (కావ్య 4/30)

ఇట ప్రత్యేకమగునొకపదము గాక వాక్యమంతయును శృంగారరసమును ధ్వనింపఁజేయుచున్నది-కావున నిది వాక్యద్యోత్యరసధ్వని కుదాహరణము [132]

---

దీనియాంధ్రానువాదము వేదాలవారి ధ్వన్యాలోకమునుండి —

న్యక్కృతి గాదె నా కరులన్ అటనుం దబసితఁడాతఁడున్
ఇక్కడే కూల్చు దైత్యకులమింకను నూరుచు రావణుండహో !
ధిక్కృతి శక్రజిత్తునకు తెల్పిననేమి ఘటశ్రవున్ హవి-
ర్భుక్కులపల్లెదోపువితబొంగిన యీభుజముల్ మఱేటికిన్॥

(ఆంధ్రధ్వన్యా. పుట 399)

130 మమ శత్రుసద్భావో నోచిత ఇతి సంబధానౌచిత్యం క్రోధవిభావం వ్యనక్తి"అరయ" ఇతి బహువచనమ్॥

—లోచన (ధ్వన్యా. 3 . 16 కా ఉదా )

131. ఈ శ్లోకార్థము రసధ్వనిసందర్భమున (పుట 122) వివరింపబడినది

132. "శూన్యం వాస గృహం" ఇత్యాదౌ తు న తాదృశం కిమపి పదమితి తత్ర వాక్యప్రకాశ్యతైవేతి భేదః॥

—బాలబోధినీ (కావ్య 4 76 వ్యాఖ్య)

**వర్ణములు రచనయును రసవ్యంజకములే .—**

వర్ణములు,[133] అసమాస-మధ్యమసమాస-దీర్ఘసమాస భూషితమగు రచనయను [134] రసధర్మములగు మాధుర్యాది గుణముల వ్యక్తీకరించుచు [135] రస పరిపోషకములగుటచే రసధ్వని వర్ణద్యోత్యమనియు రచనావిశేషద్యోత్యమనియును వ్యవహరింపఁబడినది.

**వర్ణద్యోత్యమగు రసధ్వని :—**

అపసారయ ఘనసారం కురు హారం దూర ఏవ కిం కమలైః ।
అలమలమాలి ! మృణాలైరితి వదతి దివానిశం బాలా ॥[136]

(కావ్య 8 341)

తా॥ ఓచెలీ ! కర్పూరము, ముత్తియములసరము, కమలములు తామర తూండ్లును, ఇఁక నాకెందుకని యాముద్దరాలు రాత్రియనక పగలనక ఆలాపించుచున్నది

---

133 క) "శషౌ సరేఫసంయోగౌ ఢకారశ్చాపి భూయసా ।
విరోధినః స్యుః శృంగారే తేన వర్ణా రసచ్యుతః॥
త ఏవ వినివేశ్యంతే బీభత్సాదౌ రసే యదా।
తదా తం దీపయంత్యేవ తేన వర్ణా రసచ్యుతః॥"

(ఇతి) శ్లోకద్వయేన అన్వయవ్యతిరేకాభ్యాం వర్ణానాం ద్యోతకత్వం దర్శితం భవతి॥ (ధ్వన్యా 3_3, 4)

ఖ) యతశ్చైవమతఏవ మాధుర్యాదయో రసధర్మాః సముచితైర్వర్ణాదిభి-ర్వ్యజ్యంత ఇత్యేవ సమ్యక్॥ (కావ్యప్రదీపః 8 1 వృత్తి)

134 అసమాసా సమాసేన మధ్యమేన చ భూషితా।
తథా దీర్ఘసమాసేతి త్రిధా సంఘటనోదితా॥ (ధ్వన్యా 3 5)

135 వర్ణరచనాయాస్తు సాక్షాన్మాధుర్యాదిగుణవ్యంజకత్వమేవ తద్ద్వారేణ తు రసే ఉపయోగః॥ (కావ్యాను 1 25 సూ. వృత్తి)

136 కుట్టనీమతమందలి 102వ శ్లోక మిటనుదాహృతము

ఇటరేఫలకారములు మాధుర్యగుణాభివ్యంజకము లగుచు విప్రలంభ శృంగారమును పోషించుచున్నవి [137]

రచనాద్యోత్యమగు రసధ్వని —

అనంగరంగప్రతిమం తదంగం భంగీభి రంగీకృత మానతాంగ్యాః ।
కుర్వంతి యూనాం సహసా యాథైతాః స్వాంతాని శాంతాపరచింతనాని॥
(కావ్య 8 347)

యువకులచిత్తములను విషయాంతరములనుండి మరల్చి తమవైపే త్రిప్పుకొనునట్టివిలాసచేష్టలు, మదనుని నృత్యరంగమునకు దీటగు ఆసుందరి శరీరమును తమదిగా చేసికొనినవి ప్రతిభంగిమలో విలాసములుట్టిపడుచు యువకులమనముల కలచుచున్నవని భావము

ఇట గకారతకారాదివర్ణవిశిష్టమై అల్పసమాసశోభితమగు రచన మాధుర్యగుణము నభివ్యక్తీకరించుచు విప్రలంభశృంగారపరిపోషకమైనది. [138]

ఇట్లు దీర్ఘసమాసాదిరచనలును రౌద్రరసాదివ్యంజకము లగుటయు ఉదాహరింపవచ్చును.

ప్రబంధద్యోత్యమగు రసధ్వని —

ఉదా —

"మహాభారత–రామయణాదులలో శాంతకరుణాదిరసములు". [139]
మహాభారతమున శాంతరసము, రామయణమున కరుణరసమును, శాకుంతలాది

---

137 అత్ర రేఫానుప్రాసః శబ్దములంకుర్వన్ విప్రలంభశృంగారముపకరోతి, రేఫస్య విప్రలంభశృంగారగతమాధుర్యవ్యంజకత్వాత్॥
—బాలబోధినీ (కావ్య 8 341)

138 అత్ర గకారాః తకారాశ్చ స్వస్వవర్గాంత్యమూర్ధానః హ్రస్వాంతరితో రేఫశ్చేతి వర్ణాః 'అనంగరంగప్రతిమ'మితి మధ్యవృత్తిః 'ప్రతిమం తదంగ'మితి 'అంగం భంగీభి'రితి చ మాధుర్యవతీ రచనా, తథా చాత్ర వర్ణసమాసరచనారూపం త్రయమపి విప్రలంభశృంగారే మాధుర్యస్య వ్యంజకమితి బోధ్యం॥ —బాలబోధినీ (కావ్య 4 347)

139 ప్రబంధే యథా — మహాభారతే శాంతః, రామాయణే కరుణః, మాలతీ మాధవరత్నావళ్యాదౌ శృంగారః, ఏవమన్యత్ర॥
(సా ద చతుర్థ ప్రబంధధ్వని)

నాటకములలో శృంగారరసమును, ప్రధానములగుటచే నవియే ప్రబంధద్యోత్య రసధ్వనులని ఉపక్రమోపసంహారముల పర్యాలోచించిన స్పష్టపడును

జగన్నాథపండితరాయల పీయూషలహరి మున్నగునవియు,[140] భక్తి ప్రధానములగు శతకములన్నియును, ఆయా ప్రబంధవ్యంగ్యభావధ్వనుల కుదాహరణములు

ఇట్లు రసాదిధ్వని దిఙ్మాత్రముగానుదాహరింపఁబడినది

**ప్రధానభేదములు** – ఇయత్త (ధ్వనులన్నియునెన్ని?) —

రసాదిధ్వని ప్రధానముగా నొకేవిధము- ఎట్లన—

"రసములు తొమ్మిది- వానియవాంతరభేదములు, విభావానుభావాదుల చేతనగువైచిత్ర్యము నాయికానాయకులయందుత్తమమధ్యమాధమప్రకృతికృత భేదము, దేశకాలావస్థాదికృతభేదములు" ఈ మున్నగునంశముల గణించిన రసధ్వనులకు లెక్కయే యుండదు కావున ఇవి యన్నియును అసంలక్ష్య క్రమవ్యంగ్యములే యగుటచెతను రసాదిధ్వని యొక భేదము గానే పరిగణింపఁబడినది [141]

ఇఁకవస్త్వలంకారధ్వనులు ప్రధానముగా పదునేడు విధములు— దీని వివరణమిది

వస్త్వలంకారధ్వనులు శబ్దశక్తిమూలములు, అర్థశక్తి మూలములు, ఉభయశక్తిమూలమని ముప్విధములు శబ్దశక్తి యన లక్షణయు అభిధయును

---

140 "మన్నిర్మితాః పంచ లహర్యో భావస్య" (రసగం ప్రథమ పుట 134)

141. క) రసాదీనామనంతత్వాద్భేద ఏకో హి గణ్యతే॥ (కావ్య 4 57 సూ)

ఖ) కథమనంతత్వం? ఇత్థం, నవరసాః, తత్ర శృంగారస్యైవ ద్వౌ భేదౌ సంభోగవిప్రలంభౌ। తత్ర సంభోగస్యాపి పరస్పరాలింగ-నాదయో బహవో భేదాః, విప్రలంభస్యాభిలాషాదయ ఉక్తాః। తయోరపి విభావానుభావవ్యభిచారివైచిత్ర్యం। తత్రాపి నాయకయోరుత్తమమధ్యమాధమప్రకృతిత్వం। తత్రాపి దేశకాలావస్థాభేద ఇత్యేకస్యైవ రసస్యానంత్యం, కా గణనా సర్వేషాం? కుతస్త్వేక-త్వేన గణనా? అసంలక్ష్యక్రమత్వరూపం సామాన్యమాశ్రిత్య॥
(కావ్యప్రదీపః చతుర్థ పుట. 110)

కావచ్చును కాన లక్షణమూలధ్వని— 1) అర్థాంతరసంక్రమితవాచ్యమనియు, 2) అత్యంతతిరస్కృతవాచ్యమనియును, రెండువిధములు ఈ రెండును వస్తు రూపములే శబ్దశక్తిమూలధ్వని యని ప్రధానముగా వ్యవహరింపఁబడు నభిధా-మూలధ్వని— 1) వస్తురూపమును, 2) అలంకారరూపమును అగుటచే ద్వివిధము [142]

ఇట్లు శబ్దశక్తిమూల-వస్తుధ్వనులు లక్షణతో రెండు, అభిధతోనొకటియు, కలిసి(2+1=3) మూడుకాఁగా, శబ్దశక్తిమూలకమగు నలంకారధ్వని అభిధతో నొకటియే యగుచున్నది ఇట్లు శబ్దశక్తి మూలధ్వనులు (4) నాలుగు ఇఁక అర్థశక్తిమూలములగు వస్త్వలంకారధ్వనులు—వ్యంజకమగునర్థము స్వతః సంభవియు కవిప్రౌఢోక్తిసిద్ధమును కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధమును అయి యుండుటచే త్రైవిధ్యమునొంది వస్త్వలంకారరూపమున (3×2=6) షడ్విధ మగుటచే, ఇట్టియర్థముచె వ్యక్తములగు వస్త్వలంకారధ్వనులు (6×2=12) పండ్రెండువిధములగుచున్నవి. [143] [వస్తుధ్వనులు (6) ఆఱు అలంకార ధ్వనులును (6) ఆఱనుట]

[144]ఉభయశక్తిమూలధ్వని యలంకారరూపమై యొకే(1) విధము

ఇట్లు వస్తుధ్వనులు - శబ్దశక్తిచే (3) మూడు, అర్థశక్తిచే (6) నాఱును కలసి (9)తొమ్మిదికాగా, నలంకారధ్వనులు శబ్దశక్తిచే (1) నొకటి అర్థశక్తిచే (6) నాఱు, ఉభయశక్తిచే (1) నొకటి, వెరసి (8) ఎనిమిదియగుచున్నవి.

---

142 వస్త్వలంకారరూపత్వాత్ శబ్దశక్త్యుద్భవో ద్విధా॥ (సా ద 4 8)

143 వస్తు వాఽలంకృతిర్వాపి ద్విధాఽర్థః సంభవీ స్వతః।
కవేః ప్రౌఢోక్తిసిద్ధో వా తన్నిబద్ధస్య వేతి షట్॥
షడ్భిస్తైర్వ్యజ్యమానస్తు వస్త్వలంకారరూపకః।
అర్థశక్త్యుద్భవవ్యంగ్యో యాతి ద్వాదశభేదతామ్॥
(సా ద 4-8, 9)

144 "శబ్దార్థోభయభూరేకః" ఏక ఇతి। వస్తునాఽలంకారరూప ఇత్యర్థః।
—బాలబోధినీ (కావ్య 4 55 సూ వ్యాఖ్య)

కావున ప్రధానభేదములు— రసాది=యొకటి, వస్తుధ్వనులు=తొమ్మిది, అలంకారధ్వనులు = ఎనిమిదియును $(1+9+8=18)$ వెరసి పదునెనిమిది యగుచున్నవి [145]

**అవాంతర భేదములు —**

శబ్దశక్తిమూలధ్వనులు నాలుగును పదవాక్యప్రకాశ్యములై $(4\times2=8)$ ఎనిమిదివిధములగుటచేతను. అర్థశక్తిమూల(వస్త్వలంకార) ధ్వనులు పండ్రెండును పదవాక్యప్రబంధద్యోత్యములై $(12\times3=36)$ముప్పదియారువిధములగుటచేతను, ఉభయశక్తిమూలధ్వని వాక్యగతమై (1) ఒకే విధమగుటచేతను సంలక్ష్యక్రమవ్యంగ్యములగు వస్త్వలంకారధ్వనులు $(8+36+1=45)$ నలుబదియయిదువిధములగుచున్నవి అసంలక్ష్యక్రమవ్యంగ్యమగు రసాదిధ్వని పదవాక్యప్రబంధప్రకాశ్యమే కాక పదాంశవర్ణరచనాప్రకాశ్యమును అగుటచే షడ్విధము

ఇట్లు వెరసి $(45+6=51)$ వస్త్వలంకారరసాదిధ్వనులు ఏబదియొక విధములుగా పరిగణింపబడినవి. [146]

**శుద్ధభేదములు :—**

ఈ ఏకపంచాశద్భేదములు శుద్ధములు.

**మిశ్రభేదములు :—**

మఱియును ఈధ్వనులన్నియును త్రివిధ [147] సంకరములచేతను సంసృష్టిచేతను సంకీర్ణములై అయిదువేలమూడువందలనాలుగ (5304) మిశ్ర

---

145 "భేదా అష్టాదశాస్య తత్॥" (కావ్య 4 56 సూ)

146 వాక్యే శబ్దార్థశక్త్యుత్థస్తదన్యే పదవాక్యయోః ।
ప్రబంధేఽపి మతో ధీరైరర్థశక్త్యుద్భవో ధ్వనిః॥
పదాంశవర్ణరచనాప్రబంధేష్వస్ఫుటక్రమః ।
తదేవమేకపంచాశద్భేదాస్తస్య ధ్వనేర్మతాః॥ (సా ద 4 10, 11)

147. సంకరమన నీరక్షీరములవలె విడదీయరాకుండునట్లు కలిసియుండుట అదియు-అంగాంగిభావసంకరము ఏకవ్యంజకానుప్రవేశసంకరము, సందేహసంకరమని ముత్త్రివిధము- సంసృష్టియన నూలుబియ్యములవలె పరస్పరనిరపేక్షములై కలిసియుండుట—

భేదములగుచున్నవి ఇవియును శుద్ధభేదములతో (51) కలిసి అయిదువేల మూడువందలయేబదియయిదు (5304+51=5355) భేదములగుచున్నవి [148]

కావ్యప్రకాశకారులు సంసృష్టిసంకరాయతభేదములు (10404) పదివేల నాలుగువందలనాలుగగునని నుడివెను [149]

**సంఖ్యాభేదమునకు కారణము .—**

వస్తుధ్వనిమిశ్రభేదగణనాప్రస్తావమున గణించిన వస్త్వలంకారసంసృష్టి భేదముచేతనే అలంకారధ్వనిమిశ్రభేదగణనాప్రస్తావమున గణించవలసిన అలంకారవస్తుధ్వని సంసృష్టిభేదము గతార్థమగుటచేత పృథగ్గణన యనవసరమని యెంచి అర్వాచీనులు మిశ్రభేదగణనాప్రస్తావమున ఏకైకభేదహ్రాసమును గుర్తించిరి [150]

ఇక కావ్యప్రకాశకారులు—"ప్రాధాన్యేన వ్యపదేశా భవంతి' అను న్యాయానుసారము ఒకదానిచే వేఱొకటి గతార్థము కాదనియు, దేని ప్రత్యేకతదానికుండుననియు రెండు భేదములు విడివిడిగా గణించి అట్లు చెప్పిరి [151]

---

148 సంకరేణ త్రిరూపేణ సంసృష్ట్యా చైకరూపయా।
వేదఖాగ్నిశరాః శుద్ధైరిషుబాణాగ్నిసాయకాః॥ (సా ద 4 42)

149 "వేదఖాబ్ధివియచ్చంద్రాః' (కావ్య 4 64 సూత్రం)

150 అనేనైవ క్రమేణ వస్తుధ్వనేరలంకారధ్వనిసంబంధభేదోఽపి అలంకారధ్వనేర్వస్తుధ్వనిసంబంధాన్న పృథగ్భూత ఇతి పూర్వపూర్వస్య ఉత్తరోత్తరసంబంధే ఏకైకభేదన్యూనతా జ్ఞేయా॥
(ప్ర రు కావ్యప్రకరణ)

151 ఇట కావ్యప్రదీపకారుల వివరణమిది—
'అనుభవసిద్ధా తావత్ పుండ్రకాదీక్షురసేష్వివ ధ్వనిష్వపి హృద్యత్వాతిశయానతిశయౌ। తథాచ-అర్థాంతరసంక్రమితవాచ్యస్య యత్రాతిశయస్తత్ర అత్యంతతిరస్కృతవాచ్యేన తద్యోజనం। యత్ర తు తద్వైపరీత్యం తత్ర అత్యంతతిరస్కృతవాచ్యస్య ఇతరేణ యోజనమితి వ్యపదేశః। ఏవమన్యత్రాప్యూహ్యం। ఏతదేవ ప్రాధాన్యమాదాయ గణనా సౌత్రీ"॥ (కావ్యప్రదీపః 4 21 కారికావృత్తి)

కావున ధ్వనిభేదసంఖ్యానమున నింత తారతమ్యమేర్పడుటకు కారణమైనది.

మచ్చునకొకయుదాహరణము—

ఏవం వాదిని దేవర్షౌ పార్శ్వే పితు రధోముఖీ।
లీలాకమలపత్త్రాణి గణయామాస పార్వతీ॥[152] (కుమా. 6 84)

[ఇట్లు దేవర్షివర్యుఁడేమేమొ నుడువు
చుండఁ దండ్రికి ప్రక్కనుండి మోము
వంచి పార్వతి వ్రేళులు వన్నెవెట్ట
లీలకమలంపుఁబత్త్రాల లెక్కవెట్టె॥
—ఆం ధ్వన్యా. ద్వితీ. పుట. 255]

ఇట సంలక్ష్యక్రమవ్యంగ్యమగు లజ్జారూపభావధ్వనియు అసంలక్ష్యక్రమవ్యంగ్యమగు శృంగారరసధ్వనియును నీరక్షీరములవలె పరస్పరసాపేక్షములై యుండుటచే అంగాంగిభావ సంకరము.[153]

ఇట్లు ధ్వనియు వానిభేదములును సంగ్రహముగా నిరూపింపఁబడినవి

---

152 ఈ శ్లోకము "భావధ్వని" సందర్భమున (పుట. 126) వివరింపఁబడినది

153 తత్ర స్వప్రభేదసంకీర్ణత్వం కదాచిదనుగ్రాహ్యానుగ్రాహకభావేన। యథా- 'ఏవం వాదిని దేవర్షౌ' ఇత్యాదౌ। అత్ర హ్యర్థశక్త్యుద్భవానురణనరూపవ్యంగ్యధ్వనిప్రభేదేన — అలక్ష్యక్రమవ్యంగ్యధ్వనిప్రభేదోఽనుగృహ్యమాణః ప్రతీయతే॥ (ధ్వన్యా 3 43 కా. వృత్తి. పుట. 502)



# ధ్వని - మనుచరిత్రము

## తృతీయ ప్రకరణము

''ధ్వని కావ్యాత్మ'' – నిరూపణము –

వస్త్వలంకారరసాదిరూపమగు నీ ధ్వనియే కావ్యమున కాత్మస్థానీయము[1] శబ్దార్థయుగళము కావ్యమునకు శరీరము కదా–శరీర మాత్మ లేనిది మనఁ జాలదు కావున కావ్యశరీరమునకును నొకయాత్మ యుండవలెను అదియేది ? స్థూలకృశత్వాదిధర్మవిశిష్టమగు శరీరమునందఱు గుర్తించునట్లు శబ్దము నందఱు తెలియుదురు కాన నది కావ్యశరీరముననే యంతర్భవించును. ఇఁక మిగిలినది యర్థము. ఇదియు రెండువిధములు ఒకటి వాచ్యార్థము రెండవది ప్రతీయమానార్థము రెండును సామాన్యముగా నందఱికిని తెలియునవి కావు. అయినను ప్రతీయమానార్థమనఁగా నందఱును శ్లాఘింతురు అట్టి విశేషము దానియందున్నది కావుననట్టి ప్రతీయమానార్థమే కావ్యమునకాత్మ[2] ఎన్నియలంకారము

---

1 "కావ్యస్యాత్మా ధ్వనిరితి బుధైర్యః సమామ్నాతపూర్వః"

(ధ్వన్యా 1 1)

2 శబ్దార్థశరీరం కావ్యమితి యదుక్తం తత్ర శరీరగ్రహణాదేవ కేనచిదాత్మనా తదనుప్రాణకేన భావ్యమేవ తత్ర శబ్దస్తావచ్ఛరీరభాగ ఏవ సన్నివిశతే, సర్వజనసంవేద్యధర్మత్వాత్, స్థూలకృశత్వాదివత్। న హ్యర్థమాత్రేణ కావ్యవ్యపదేశః, లౌకికవైదికవాక్యేషు తదభావాత్। తదాహ"సహృదయశ్లాఘ్య"ఇతి। స ఏక ఏవార్థో ద్విశాఖతయా వివేకిభిర్విభాగబుద్ధ్యా విభజ్యతే। తథాహి- తుల్యేఽర్థరూపత్వే కిమితి కస్మైచిదేవ సహృదయాః శ్లాఘంతే, తద్భవితవ్యం కేనచిద్విశేషేణ। యో విశేషః స ప్రతీయమానభాగో వివేకిభిర్విశేషహేతుత్వాదాత్మేతి వ్యవస్థాప్యతే।

–లోచన (ధ్వన్యా 1.2 కారికావ్యాఖ్య)

లున్నను ప్రతీయమానచ్ఛాయ లేనిదే కావ్యమునకువన్నె యుండదు [3] కన్ను ముక్కు మొగములతీరు యువతులందఱిలో నొకే విధముగ నున్నను ఏ కొందఱో కాని చూచినంతనే హృదయమునాపర్జింపలేరు అదియే వారిలో నుండు విశిష్టత దానినే లావణ్యమందురు [4] అట్లే ప్రతీయమానార్థము సహృదయుల నాహ్లాదపఱుచుచున్నది అది దాని ప్రత్యేకత. కావుననే కావ్యమునకాత్మకాగలిగినది ఇట్లానందవర్ధనాచార్యులు (ధ్వనికారులు) వస్త్వలంకార రసాదిరూపమగు త్రివిధధ్వనిని కావ్యాత్మగా పేర్కొనిరి

కాని అభినవగుప్తపాదులు కావ్యమున కాత్మ కాఁగలిగినది రసధ్వని యొక్కటియే యని చెప్పుచు దానినిట్లు వివరించిరి

[5] ప్రతీయమానార్థము— లౌకికము, అలౌకికము అని ఇరుతెఱంగు లగుచున్నది లౌకికమనఁగా నిప్పుడది ప్రతియమానమే యయినను నొకప్పుడు

---

3 ముఖ్యా మహాకవిగిరా మలంకృతిభృతామపి ।
ప్రతీయమానచ్ఛాయైవ భూషా లజ్జేవ యోషితామ్॥ (ధ్వన్యాలోక )

4 ప్రతీయమానం పునరన్యదేవ వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్।
యత్తత్ ప్రసిద్ధావయవాతిరిక్తం విభాతి లావణ్యమివాంగనానామ్॥
(ధ్వన్యా 1 4)

5 తత్ర ప్రతీయమానస్య తావత్ ద్వౌ భేదౌ - లౌకికః కావ్యవ్యాపారైక-గోచరశ్చేతి। లౌకికో యః స్వశబ్దవాచ్యతాం కదాచిదధిశేతే, స చవిధి-నిషేధాద్యనేకప్రకారో వస్తుశబ్దేనోచ్యతే, సోఽపి ద్వివిధః—యః పూర్వం క్వాపి వాక్యార్థేఽలంకారభావముపమాదిరూపతయాఽన్వభూత్, ఇదానీం త్వనలంకారరూప ఏవ, అన్యత్ర గుణీభావాభావాత్, స పూర్వప్రత్యభి-జ్ఞానబలాదలంకారధ్వనిరితి వ్యపదిశ్యతే, బ్రాహ్మణశ్రమణన్యాయేన। తద్రూపతాభావేన తూపలక్షితం వస్తుమాత్రముచ్యతే। మాత్రగ్రహణేన హి రూపాంతరం నిరాకృతమ్। యస్తు స్వప్నేఽపి న స్వశబ్దవాచ్యో న లౌకికవ్యవహారపతితః। కింతు శబ్దసమర్ప్యమాణహృదయసంవాద సుందరవిభావానుభావసముచితప్రాగ్వినివిష్టరత్యాదివాసనానురాగసుకు-మారస్వసంవిదానందచర్వణావ్యాపారరసనీయరూపో రసః, స చ కావ్యవ్యాపారైకగోచరో రసధ్వనిరితి। స చ ధ్వనిరేవేతి. స ఏవ ముఖ్యతయాఽఽత్మేతి॥ —లోచన (ధ్వన్యా 1 4 కారికావ్యాఖ్య)

వస్తువుగానో అలంకారముగానో స్వశబ్దవాచ్యమగుటకు నర్హత కలిగియున్నది ప్రతీయమానమగుచున్నప్పుడుమాత్రము ఇదియే– వస్తుధ్వనియనియును, అలంకారధ్వనియనియును వ్యవహరింపఁబడుచుండును ఇచ్చట నొకశంక పొడముచున్నది. అలంకారమనఁగా నొకదాని నలంకరింపఁజేయునది కావున అప్రధానము ఇఁక ధ్వని యన పర్యవసితార్థము కావున నదియే ప్రధానము, అలంకార్యము కూడ అగును అట్టియెడ అలంకారధ్వని యని వ్యవహరించుట ఎట్లు పొసఁగును? అలంకారము అలంకార్యమగునా? అని అయినను బ్రాహ్మణశ్రమణ[6] న్యాయముననుసరించి పూర్వప్రత్యభిజ్ఞాబలమున నట్లు వ్యవహరించుట విరుద్ధము కాదు కావున నీరెండువిధములగు ధ్వనులును లౌకికములు ఇఁక రసాది ధ్వనియో శబ్దార్థమయమగు కావ్యమునకు గల వ్యంజనావ్యాపారమాత్రముచేతనే గోచరమగునది కాని ఎప్పటికిని స్వశబ్దవాచ్యము కాదు కావున నీ రసాదిధ్వని యలౌకికమయినది [7] మఱియు వస్త్వలంకారములు వాచ్యములై యుండునపుడెట్లు విభావాదిరూపమున రసవ్యంజకములగునో అట్లే అవి వ్యంగ్యములగుచుండును పార్యంతికముగా రసమునే ధ్వనింపఁజేయుచు తత్పరిపోషకములే యగును కావున వస్త్వలంకారధ్వనులకంటెను రసాదిధ్వనియే ప్రాధాన్యము నొందుచున్నది ఇట్లు రసాదిధ్వనియే కావ్యమునకాత్మ కాఁగలిగినది ఇతరములగు వస్త్వలంకారధ్వనులు వాచ్యార్థమునకంటె నుత్కర్షాతిశయము గలిగి

---

6 యథా కశ్చన ప్రథమతో బ్రాహ్మణో భూత్వాఽనంతరం శ్రమణత్వం (బౌద్ధసన్యాసిత్వం) ప్రాప్తోఽపి (అవైదశిఖాసూత్రపరిత్యాగేన బ్రాహ్మణత్వాభావవానపి) భూతపూర్వసంజ్ఞానుసారేణ బ్రాహ్మణ ఇతి వ్యపదిశ్యతే, తథా ప్రకృతేఽపి పూర్వమయమలంకార ఆసీదిత్యేతావతా అలంకారవ్యపదేశ ఇతి భావః॥

—లోచనటిప్పణం [ధ్వన్యా (సం॥ పట్టాభిరామశాస్త్రి) పుట 51]

7. కావ్యం శబ్దార్థమయం తస్య శబ్దస్య అర్థస్య చ యో వ్యాపారః వ్యంజనారూపః తదేకగోచరః, నాన్యగోచరః। తతశ్చ అలౌకికఇతి భావః॥ – బాలబోధినీ (లోచనవ్యాఖ్య)–(ధ్వన్యా 1 4 కా. పై)

యుండుటచే ధ్వన్యాచార్యులు సామాన్యముగా ధ్వనియే కావ్యమునకాత్మ యని వచించిరి. [8]

కాని "రసధ్వనియే కావ్యమునకాత్మ"యను విషయము, ధ్వన్యాచార్యులు వివరించినతీరు పరిశీలించిన స్పష్టపడును ఎట్లన ?

"కావ్యస్యాత్మా స ఏవార్థః,తథాచాదికవేః పురా ।
క్రౌంచదద్వంద్వవియోగోత్థః శోకః శ్లోకత్వమాగతః ॥" (ధ్వన్యా 1 5)

తమసానదీతీరమున తాను గాంచిన హృదయవిదారకదృశ్యము చిత్తమును ద్రవీభూతమొనర్పఁగా బయలువెడలిన వాల్మీకిశోకమే శ్లోకమాయెను ఆ సహృదయశ్లాఘ్యమయిన రసరూపమగు ప్రతీయమానార్థమే కావ్యమునకాత్మ యని కదా కారికార్థము ఇట "స ఏవార్థః' అనఁగా ప్రక్రాంతమగు ప్రతీయమానార్థసామాన్యమే పైకి స్ఫురించును, అయినను ఉత్తరవాక్యార్థపర్యాలోచన చేసినవెంటనే అది రసరూపమనియే తేలునని అభినవగుప్తపాదులు వ్యాఖ్యానించిరి [9]

---

8 క) వాచ్యయోర్వస్త్వలంకారయోరివ ధ్వన్యమానయోరపి తయోర్విభావాది-రూపత్వేన కస్య చిద్రసస్య వ్యంజకతయా పర్యవసానాత్ రసధ్వని-విశ్రాంతత్వమేవేత్యర్థః। విశ్రాంతిధామత్వకృతం హి ముఖ్యమాత్మ-త్వమ్। తచ్చ రసధ్వనేరేవ। వస్త్వలంకారధ్వన్యోస్తు ధ్వన్యమానత్వ-కృతో వాచ్యాదుత్కర్ష ఇత్యముఖ్యమాత్మత్వం। తదపేక్షయా చ ధ్వనిః కావ్యాత్మేతి సామాన్యేనోక్తమితి భావః॥

—బాలబోధినీ (లోచన వ్యాఖ్యా) (ధ్వన్యా 1.4 కారికపై)

ఖ) తేన రస ఏవ వస్తుత ఆత్మా, వస్త్వలంకారధ్వనీ తు సర్వథా రసం ప్రతి పర్యవస్యేతే ఇతి వాచ్యాదుత్కృష్టౌ తావిత్యభిప్రాయేణ ధ్వనిః కావ్యాత్మేతి సామాన్యేనోక్తమ్॥

—లోచన (ధ్వన్యా 1 5 కారికావ్యాఖ్య)

9. "కావ్యస్యాత్మేతి। స ఏవేతి ప్రతీయమానమాత్రేఽపి ప్రక్రాంతే తృతీయ ఏవ రసధ్వనిరితి మంతవ్యమ్। ఇతిహాసబలాత్ ప్రక్రాంతవృత్తిగ్రంథార్థబలాచ్చ। తేన రస ఏవ వస్తుత ఆత్మా॥"

—లోచన (ధ్వన్యా 1.5 కారికావ్యాఖ్య)

ఇట్లభినవగుప్తపాదులు వ్యాఖ్యానించుటకు కారణము లేకపోలేదు. తొలుత భరతముని తననాట్యశాస్త్రమున -

"న హి రసాదృతే కశ్చిదర్థః ప్రవర్తత ఇతి" (నాట్య. 6 32 వృత్తి)

అనఁగా రసము లేనిది కావ్యమున నేయర్థము ప్రవర్తింపదనెను దీని నభినవగుప్తపాదులు తన "యభినవభారతి"లో వివరించవలసివచ్చినప్పుడు రసప్రాధాన్యమును గుర్తించెను [10] అభినవగుప్తునిగురువర్యుఁడగు [11] భట్టేందు రాజు కూడ నుద్భటుని కావ్యాలంకారసంగ్రహమును వ్యాఖ్యానించుచు -

"[12] శబ్దార్థయుగళరూపమగు కావ్యము శరీరము రసములాకావ్యమున కాత్మ ఏలయన ? ఆత్మాధిష్ఠితమైనపుడే శరీరము జీవించియున్నదని చెప్పఁ

---

10 హి యస్మాత్ రసం వినా విభావాదిరర్థో బుద్ధౌ వ్యాఖ్యేయతయా నప్రవర్తతే। యతశ్చ తం వినాఽర్థః ప్రయోజనం ప్రీతిపురస్సరం వ్యుత్పత్తిమయం న ప్రవర్తతే, యతశ్చ రసం ప్రత్యాదృతే రసనాత్మకప్రతీత్యేకఘనవిశ్రాంతే సామాజికలోకేఽన్యో భావాది రర్థః ప్రవిభాగేన బుద్ధౌ న వర్తతే। సర్వస్య జడస్య చిత్తవృత్త్యంతరోపకృతప్రధానస్థాయినామధేయచిత్తవృత్తిమగ్నత్వేన విభావానుభావాదివర్గస్యావభాసాత్। అతో వ్యాఖ్యాతృనటసామాజికాభిప్రాయేణ తస్యైవ ప్రాధాన్యమితి రస ఏవ తావత్ పూర్వ ముద్దిష్ట ఇతి।

—అభినవభారతి (నాట్యశాస్త్ర 6 31 కా వృత్తిపై)

11 "భట్టేందురాజచరణాబ్జకృతాధివాస-
హృద్యశ్రుతోఽభినవగుప్తపదాభిధోఽహమ్।
యత్కించిదప్యనురణన్ స్ఫుటయామి కావ్యా-
లోకం స్వలోచననియోజనయా జనస్య॥"

(ధ్వన్యాలోకలోచనప్రారంభే)

12 న ఖలు కావ్యస్య రసానాం వాఽలంకార్యాలంకారభావః, కింతు ఆత్మశరీరభావః। రసా హి కావ్యస్యాత్మత్వేనావస్థితాః। శబ్దార్థౌ చ శరీర రూపతయా। యథా హ్యాత్మాధిష్ఠితం శరీరం జీవతీతి వ్యపదిశ్యతే తథా రసాధిష్ఠితస్య కావ్యస్య జీవద్రూపతయా వ్యపదేశః క్రియతే, తస్మాద్ రసానాం కావ్యశరీరభూతశబ్దార్థవిషయతయాఽఽత్మత్వేనావస్థానం,

బడినట్లు, రసాధిష్ఠితమైనకావ్యమే జీవద్రూపమునసున్నట్లు వ్యవహరింపఁబడు చున్నది కావున రసము కావ్యమునకలంకారము కాక, ఆత్మయే (అలంకార్యమే) యగు"నని కావ్యలింగాలంకారప్రకరణమున సోపపత్తికముగా వివరించెను

ఈయభిప్రాయమునూతఁగాఁగొనియే యభినవగుప్తపాదులట్లు వివరించిరి వ్యక్తివివేకకారాదులును ఈయర్థమునే బలపఱిచిరి [13]

ఈ కారణముననే విశ్వనాథకవిరాజు తన సాహిత్యదర్పణమున - వస్త్వలంకారరసాదిరూపమగు త్రివిధధ్వనియు కావ్యమున కాత్మయనుట తగదనియు, అట్లేని ఏదో నీరసమగు వస్తువ్యంగ్యముగల ప్రహేళికలును కావ్య శ్రేణికిఁ జెందవలసివచ్చుననియు, కావున వస్త్వలంకారధ్వనులు కాక కేవలము రసధ్వనియే కావ్యమున కాత్మ కాఁదగినదనియు రసములన శృంగారాదులు మాత్రమే కావనియు 'రస్యత ఇతి రసః'అను వ్యుత్పత్తిననుసరించి ఆస్వాదింపఁ బడు రసభావతదాభాసాదులన్నియును రసములే యగుననియు వివరించుచు "రసమే కావ్యమున కాత్మ"యని స్థిరీకరించెను [14] అగ్నిపురాణమునను—

---

సత్వలంకారతయా। తదాహుః— "రసాద్యధిష్ఠితం కావ్యం జీవద్రూపతయా యతః। కథ్యతే తద్రసాదీనాం కావ్యాత్మత్వం వ్యవస్థితమ్॥ ఇతి॥ —భట్టేందురాజ (కావ్యా లఘువృత్తి పుట 77)

13 "కావ్యస్యాత్మని సంజ్ఞిని రసాదిరూపే న కస్యచిద్విమతిః॥
—మహిమభట్ట (వ్యక్తివివేక 1 26)

14 క) యత్తు ధ్వనికారేణోక్తం 'కావ్యస్యాత్మా ధ్వని'రితి, తత్కిం వస్త్వలంకారరసాదిలక్షణః త్రిరూపో ధ్వనిః కావ్యస్యాత్మా? ఉత రసాదిరూపమాత్రో వా? నాద్యః, ప్రహేళికాదావతివ్యాప్తేః, ద్వితీయశ్చేదోమితి బ్రూమః॥ (సా ద. 1 2 కా వృత్తి)

ఖ) రస ఏవాత్మా సారరూపతయా జీవనాధాయకో యస్య। తేన వినా తస్య కావ్యత్వానంగీకారాత్। "రస్యతే ఇతి రసః" ఇతి వ్యుత్పత్తి యోగాద్ భావతదాభాసాదయోఽపి గృహ్యంతే॥
(సా. ద. ప్రథమ కావ్యలక్షణం)

గ) రుద్రటుడును- "రసనాద్రసత్వమేషాం మధురాదీనామివోక్తమాచార్యైః। నిర్వేదాదిష్వపి తన్నికామమస్తీతి తేఽపి రసాః॥" (కావ్యా. 12.4)

"వాగ్వైదగ్ధ్యప్రధానేఽపి రస ఏవాత్ర జీవితమ్"

(వాగ్వైచిత్రి ఎంతయున్నను కావ్యమునకు రసమే జీవితము) అని యున్నది

ఇట్లు రసము కావ్యమునకాత్మ, లేదా జీవితమనియనఁగా కావ్యము రస ప్రధానమనుటయే ఇది సముచితమే యయినను వస్త్వలంకారప్రధానములుగా నెన్నియో మహాకవులకావ్యములుండఁగా రసము లేనిదే కావ్యము మనఁజాల దనుట తగదనియు, ఏదోయొకవిదమున వస్త్వలంకారధ్వనులును రసధ్వని కంగములగునెనుటయు యుక్తిసహము కాదనియు, అట్లేని 'గౌశ్చలతి'అను నప్పుడును ఏదోవిధమున రసస్పర్శయున్నట్లు చెప్పవచ్చుననియు ఏయర్థమయి నను విభావమో అనుభావమో వ్యభిచారిభావమో కాక తప్పదనియు, అంత మాత్రమున నట్లు చెప్పుట సరి కాదనియు, దేని ప్రత్యేకత దానికుండఁగా కేవలము రసాదిధ్వనియే కావ్యమునకాత్మ యనుటకు బదులు వస్త్వలంకార రసాదిధ్వనులు మూడును అనఁగా, "ధ్వనియే కావ్యమున కాత్మ"యని ధ్వని కారులుచెప్పినసరణియే తగుననియు మమ్మటజగన్నాథాదులు భావించినటులు వారి కావ్యలక్షణపరిశీలనమువలన తేటపడగలదు 15

**కావ్యాత్మ - వివిధ మతములు —**

విశిష్టములగు శబ్దార్థములు కావ్యమనఁగా శబ్దార్థములలో నేదో విశేష మున్ననే కాని కావ్యము కాఁజాలదని కదా యర్థము ఆవిశేషమెట్లు వచ్చినది ?

---

15 క) యత్తు "రసవదేవ కావ్య"మితి సాహిత్యదర్పణే నిర్ణీతం, తన్న। వస్త్వ-లంకారప్రధానానాం కావ్యానామకావ్యత్వాపత్తేః। నచేష్టాపత్తిః, మహాకవి సంప్రదాయస్యాకులీభావప్రసంగాత్। తథాచ- జలప్రవాహవేగనిపత-నోత్పతనభ్రమణాని కవిభిర్వర్ణితాని కపిబాలాదివిలసితానిచ। న చ తత్రాపి యథాకథంచిత్ పరంపరయా రసస్పర్శోఽస్త్యేవేతి వాచ్యం। ఈదృశరసస్పర్శస్య 'గౌశ్చలతి' 'మృగో ధావతి' ఇత్యాదావతిప్రసక్త త్వేనాప్రయోజకత్వాత్। అర్థమాత్రస్య విభావానుభావవ్యభిచార్యన్య-తమత్వాదితి దిక్॥ (రసగం ప్రథమ. పుట 9)

ఖ) "ఇదముత్తమమతిశయని వ్యంగ్యే వాచ్యాద్ ధ్వనిర్బుధైః కథితః॥"

(కావ్యప్రకాశః 1 4)

అలంకారములచేతనా ? గుణములచెతనా ? ఉక్తివైచిత్రిచెతనా ? లేదా భోగ కృత్త్వవ్యాపారముచేతనా(రసానుభవముచెతనా)? వ్యంగ్యముచెతనా ? ఏదో యొకదానిని పురస్కరించుకొని యట్టివిశేషమున్ననే కాని సహృదయులా కావ్యమునెడ విశేషాదరము చూపరు అట్లాదరింపఁబడినపుడే అది కావ్యము కాఁజాలును ఆ విశేషము దేనివలన కలుగునో అదియే కావ్యమునకు జీవితము-ఆత్మ-అనఁగా ప్రధానము అదియేది ?

దానికి సమాధానముగా భామహుఁడలంకారము ప్రధానమనియెను ఉద్భటాదులు ఈపక్షమునే సమర్థించిరి దండి గుణములే ప్రధానమనగా, గుణ విశిష్టమగు రీతియే కావ్యమునకాత్మ యని వామనుఁడు నుడివెను "వక్రోక్తియే (ఉక్తివైచిత్రియే) కావ్యజీవిత"మని కుంతకుఁడభిప్రాయపడెను. భట్టనాయకుఁడు భోగకృత్త్వవ్యాపారమే కావ్యమునకుత్కర్షాపాదకమనెను. "ధ్వనియే కావ్యాత్మ" యని ఆనందవర్ధనుఁడు వ్యవస్థాపించెను, [16]

ఈ మతముల సారాంశమిది —

**1) అలంకారమతము :—**

భామహుఁడు తన కావ్యాలంకారమున—ఎంత యందముట్టిపడుచుండినను వనితాముఖము భూషాహీనమై శోభిల్లదనెను దీనిచే కావ్యకాంతకు రూపకాద్యలంకారవర్గము లేనిచో శోభయుండదనియనినట్లయినది [17] అగ్నిపురాణ

---

**16.** ఇహ విశిష్టౌ శబ్దార్థౌ కావ్యం। తయోశ్చ వైశిష్ట్యం ధర్మముఖేన వ్యాపారముఖేన వ్యంగ్యముఖేన వేతి త్రయః పక్షాః। ఆద్యేఽప్యలంకారతో గుణతో వేతి ద్వైవిధ్యమ్। ద్వితీయేఽపి భణితివైచిత్ర్యేణ భోగకృత్త్వేన వేతి ద్వైవిధ్యమ్। ఇతి పంచసు పక్షేషు ఆద్యఉద్భటాదిభిరంగీకృతః, ద్వితీయో వామనేన, తృతీయో వక్రోక్తిజీవితకారేణ, చతుర్థో భట్టనాయకేన పంచమ ఆనందవర్ధనేన॥"

—సముద్రబంధవివృతిటీకా (అలం సర్వస్వ. పుట 4)

**17.** "రూపకాదిరలంకార స్తథాన్యైర్బహుధోదితః।
న కాంతమపి నిర్భూషం విభాతి వనితాననమ్॥"

(భామహకావ్యాలంకార. 13)

మునను "అర్థాలంకారరహితమగు కవివాణి విధవయగు స్త్రీవలె శోభిల్లద ని [18] చెప్పుటచే కావ్యమునకలంకారములు ప్రధానములని చెప్పినట్లయినది అగ్ని పురాణకాలవిషయము సందిగ్ధమగుటచె భామహుఁడే ఆద్యుడగు నలంకార ప్రాధాన్యవాదిగా లాక్షణికులు పేర్కొనియున్నారు

భామహుఁడు, తనకుపూర్వము భరతుఁడు [19] తననాట్యశాస్త్రమున ఉపమాదీపకరూపకయమకములు అను నాలుగలంకారములను మాత్రము పేర్కొనఁగా తాను (38) అలంకారములను వివరించెను [20] అలంకారమన

---

18. "అర్థాలంకారరహితా విధవేవ సరస్వతీ" (అగ్నిపురాణ.)

19. ఉపమా దీపకం చైవ రూపకం యమకం తథా ।
కావ్యస్యైతే హ్యలంకారాశ్చత్వారః పరికీర్తితాః॥ (నాట్యశాస్త్ర. 16 43)

20 క) "అనుప్రాసః సయమకో రూపకం దీపకోపమే।
ఇతి వాచామలంకారాః పంచైవాన్యైరుదాహృతాః॥"
"ఆక్షేపోఽర్థాంతరన్యాసో వ్యతిరేకో విభావనా।
సమాసాతిశయోక్తీ చ షడలంకృతయోఽ పరాః॥"
"యథాసంఖ్యమథోత్ప్రేక్షామలంకారద్వయం విదుః॥"
"స్వభావోక్తిరలంకార ఇతి కేచిత్ ప్రచక్షతే॥"
(భామహకావ్యాలంకారః 2–4, 66, 88, 93)

ఖ) "ప్రేయో రసవదూర్జస్వి పర్యాయోక్తం సమాహితమ్।
ద్విప్రకారముదాత్తం చ భేదైః శ్లిష్టమపి త్రిభిః॥
అపహ్నుతిం విశేషోక్తిం విరోధం తుల్యయోగితామ్।
అప్రస్తుతప్రశంసాం చ వ్యాజస్తుతి-నిదర్శనే॥
ఉపమారూపకం చాన్యదుపమేయోపమామపి।
సహోక్తి–పరివృత్తీ చ ససందేహ మనన్వయమ్॥
ఉత్ప్రేక్షావయవం చాన్యే సంసృష్టిమపి చాపరే।
భావికత్వం చ నిజగురలంకారం సుమేధసః॥"
"ఆశీరపి చ కేషాంచిదలంకారతయా మతా॥"
(భామహకావ్యాలంకారః. 3–1, 2, 3, 4, 55)

భణితివైచిత్ర్యమే[21] యనియు, అట్టి వైచిత్రిలేనిదేదియు నలంకారము కాఁజాలదనియు, కావుననే హేతుసూక్ష్మలేశములు అలంకారములు కావనియును[22] చెప్పియుండుటచే ఉక్తివైచిత్ర్య రూపములగు నలంకారములే కావ్యమున ప్రధానమని భామహుఁడు వివరించినట్లయినది

"శబ్దార్థౌ సహితౌ కావ్యమ్" (కావ్యాలంకారః 1/16) అని చెప్పియును కావ్యమునకు, శబ్దార్థములు శరీరము కాఁగా ఆ శరీరమునకాత్మయొకటి యుండవలెనని భామహుఁడు గుర్తింపడయ్యెను. ఈయంశమును మొదట గుర్తించినవాఁడు వామనుఁడు అతఁడు "రీతిరాత్మా కావ్యస్య" (కావ్యాలంకారసూత్ర-1.2 6) అని సూత్రించి కావ్యమునకు రీతియే యాత్మ యని చెప్పెను అనంతరలాక్షణికులును కావ్యమునకాత్మ యేదియని విచారింపఁదొడగిరి - పలువురు పలురకముల వాకొనిరి కావ్యమునకాత్మ యేది యను విషయమున వివాదమున్నను అలంకారములు కావ్యశోభాకరములనుటలో ఏయాలంకారికులకును విప్రతిపత్తి లేదు కావుననే దండి- కావ్యమునకు వన్నెతెచ్చునవి యలంకారములే యనియు ఇవి ఇన్నియే యున్నవని చెప్ప నెవరికిని తరము కాదనియు, ఇప్పటికిని లాక్షణికులు క్రొంగ్రొత్తయలంకారముల నూహించుచునే యున్నారనియు నుడివెను [23] వామనుఁడును అలంకారముండుటనుబట్టియే కావ్యము

---

21. క) "వక్రాభిధేయశబ్దోక్తిరిష్టా వాచామలంకృతిః॥"
— (భామహకావ్యా 1 23)

ఖ) సైషా సర్వత్ర వక్రోక్తిరనయాఽర్థో విభావ్యతే ।
యత్నోఽస్యాం కవినా కార్యః కోఽలంకారోఽనయా వినా॥
(భామహ కావ్యా 2 85)

22. "హేతుశ్చ సూక్ష్మో లేశోఽథ నాలంకారతయా మతః ।
సముదాయాభిధానస్య వక్రోక్త్యనభిధానతః ॥"
గతోఽస్తమర్కో భాతీందుర్యాంతి వాసాయ పక్షిణః ।
ఇత్యేవమాది కిం కావ్యం వార్తమేతాం ప్రచక్షతే॥"
(భామహ కావ్యా. 2 86, 87)

23. "కావ్యశోభాకరాన్ ధర్మానలంకారాన్ ప్రచక్షతే ।
తే చాద్యాపి వికల్ప్యంతే కస్తాన్ కార్త్స్న్యేన వక్ష్యతి॥
—దండి. (కావ్యాదర్శః 2.1)

సహృదయోపాదేయమగుచున్నదనియు, అలంకారమనఁగా కావ్యసౌందర్యమే యనియు, మాధుర్యాదిగుణములకంటెను అలంకారములు కావ్యమునకు మఱింత వన్నెతెచ్చునవి యనియు వివరించెను [24] ఆనందవర్ధనమమ్మటాదులును శరీరమునకు హారాదులు వన్నెదెచ్చునట్లు శబ్దార్థరూపమగు కావ్యశరీరమునలంకరించునవి యలంకారములనిరి [25] కావుననే జయదేవుఁడు "ఉష్ణతాగుణముండుటచేతనే అగ్ని అగ్నియయినట్లు అలంకారముండుటచెతనే కావ్యము కావ్యము కాఁజాలునని తన యభిప్రాయమును స్పష్టపఱిచెను [26]

ఇట్లలంకారప్రాధాన్యమును గుర్తించియుండుటచెతనే దినదినమలంకారములసంఖ్య వృద్ధి కాఁజొచ్చినది భరతునితో నాలుగే నాలుగుగానుండి భామహునితో (38) ముప్పదియెనిమిదివఱకు పెరిగిన యీ యలంకారములు అప్పయ్యదీక్షితుల వఱకు (123) నూటయిఱువదిమూడైనవి

కవులు రసపరతంత్రులై యలంకారవిషయమున నిగ్రహముచూపుట యవసరమని [27] ఎంత శాసించినను వారు వీ రనక లాక్షణికులందఱును

---

24 క) "కావ్యం గ్రాహ్యమలంకారాత్" "సౌందర్యమలంకారః"
(కావ్యాలంకార సూత్ర 1 1 1, 2)

ఖ) "కావ్యశోభాయాః కర్తారో ధర్మా గుణాః॥"
"తదతిశయహేతవస్త్వలంకారాః॥" (కావ్యాలంకారసూత్ర 3 1 1, 2)

25. క) "తమర్థమవలంబంతే యేఽంగినం తే గుణాః స్మృతాః।
అంగాశ్రితాస్త్వలంకారా మంతవ్యాః కటకాదివత్॥" (ధ్వన్యా. 2. 6)

ఖ) "ఉపకుర్వంతి తం సంతం యేఽంగద్వారేణ జాతుచిత్।
హారాదివదలంకారాస్తేఽనుప్రాసోపమాదయః॥"
(కావ్యప్రకాశః 8 67)

26 "అంగీకరోతి యః కావ్యం శబ్దార్థావనలంకృతీ।
అసౌ న మన్యతే కస్మాదనుష్ణమనలం కృతీ॥" (చంద్రాలోకః 1 8)

27 "ధ్వన్యాత్మభూతే శృంగారే యమకాదినిబంధనమ్।
శక్తావపి ప్రమాదిత్వం విప్రలంభే విశేషతః॥"
"రసాక్షిప్తతయా యస్య బంధః శక్యక్రియో భవేత్।
అపృథగ్యత్ననిర్వర్త్యః సోఽలంకారో ధ్వనౌ మతః॥"
(ధ్వన్యా 2. 16, 17)

అలంకారసంఖ్యావృద్ధికి ఏదోవిధమున కారకులగుచునే యుండిరి ఉక్తివైచిత్ర్యమన నట్టిది.

విశేషమేమన— భామహాదులు మాత్రము త్రివిధధ్వనిని అలంకారవర్గముననే యంతర్భవింపఁజేయుచు నలంకారములకెనలేని ప్రాధాన్యము కల్పించుటచే అలంకారప్రాధాన్యవాదులుగా పేర్కొనఁబడిరి [28]

వస్తుధ్వనిని వారలంకారకోటిలో నంతర్భవింపఁజేసిరి వారిపర్యాయోక్త లక్షణమిట్లున్నది.

"పర్యాయోక్తం యదన్యేన ప్రకారేణాభిధీయతే ॥"

— భామాహ- (కావ్యా. 3 8)

"పర్యాయోక్తం యదన్యేన ప్రకారేణాభిధీయతే ।
వాచ్యవాచకవృత్తిభ్యాం శూన్యేనావగమాత్మనా ॥"

— ఉద్భట (కావ్యాలంకారసంగ్రహ 4 7)

---

28 క) ఇహ తావద్ భామహోద్భటప్రభృతయశ్చిరంతనాలంకారకారాః ప్రతీయమానమర్థం వాచ్యోపస్కారకతయాఽలంకారపక్షనిక్షిప్తం మన్యంతే॥ (అలం సర్వస్వ ప్రారంభ)

ఖ) "యత్ర తు సమాసోక్త్యాదిషు స్ఫుటైవ ప్రతీతిః, ప్రతీయమానస్య తత్ర తదంతర్భావో న భంగుర ఇతి యత్పునరలంకారకోటి-నివిష్టత్వం వస్తుధ్వనే రుదభావయఞ్ భామహాదయః॥"

[ఏకావళీ— (సం॥ త్రివేది) పుట 29, 30]

గ) ప్రతీయమానో వాచ్యోపస్కారకః సఞ్ న వాచ్యాద్ వ్యతిరిచ్యత ఇతి అభావ ఏవ ధ్వనేరితి భామహప్రభృతయో మన్యంతే ॥

— మల్లినాథతరళవ్యాఖ్య (ఏకా. పుట. 24)

ఘ) నను యత్ర కావ్యే సహృదయ హృదయాహ్లాదినః ప్రధానభూతస్య స్వశబ్దవ్యాపారాస్పృష్టత్వేన ప్రతీయమానైకరూపస్యార్థస్య సద్భావః తత్ర తథావిధార్థాభివ్యక్తిహేతుః కావ్యజీవాతుభూతః కైశ్చిత్ సహృ-దయైర్ధ్వనిర్నామ వ్యంజకత్వభేదాత్మా కావ్యధర్మోఽభిహితః। స కస్మాదిహ నోపదిష్టః ? ఉచ్యతే । ఏష్వేవాలంకారేష్వంతర్భావాత్॥

—భట్టేందురాజ (కావ్యా. లఘువివృతి. వర్గ 6 పుట 79)

మఱొకవిధమున చెప్పుటయే పర్యాయోక్తాలంకారమని భామహుఁడు నిర్వచించఁగా, మఱొకవిధమనఁగా వాచ్యవాచకవృత్తిభిన్నమగునవగమనవ్యాపారమని ఉద్భటుఁడు వివరించినట్లయినది

"ప్రతీయమానార్థము వాచ్యార్థోపస్కారకమయిన పర్యాయోక్త"మనుటలో ధ్వనివాదులకును విప్రతిపత్తి లేదు కాని అది ప్రధానమయినచో వస్తుధ్వనియనిరి వస్తుధ్వనిని గూడ భామహాదులు పర్యాయోక్తకుక్షిలోనే నిక్షేపించిరి[29]

అగ్నిపురాణమున వస్తుధ్వని యాక్షేపాలంకారమున నంతర్భవింపఁబడినది ఆయాక్షేపాలంకారలక్షణమిది—

శ్రుతేరలభ్యమానార్థో యస్మాద్ భాతి సచేతసామ్।
స ఆక్షేపో ధ్వనిః స్యాచ్చ ధ్వనినా వ్యజ్యతే యతః ॥
శబ్దేనార్థేన యత్రార్థః కృత్వా స్వముపసర్జనమ్।
ప్రతిషేధ ఇవేష్టస్య యో విశేషాభిధిత్సయా ॥
తమాక్షేపం బ్రువంత్యత్ర .. ।
తేషామేకతమస్యైవ సమాఖ్యా ధ్వనిరిత్యతః ॥

— అగ్నిపురాణ (345.14, 16, 18.)

---

29 క) నను పర్యాయోక్తశబ్దేన ప్రకారాంతరేణ ఉచ్యమానత్వాత్ ప్రతీయమానం వస్తు అభిధీయతే। తచ్చేహ ప్రతీయమానం ప్రధానత్వాదలంకార్యతయా వక్తుం యుక్తం నత్వలంకృతికారణతయా। అతః కథం తస్యాలంకారవ్యపదేశః। ఉచ్యతే— ప్రధానమపి గుణానాం సౌందర్యహేతుత్వాత్ అలంకృతౌ సాధనత్వం భజతి, దృశ్యతే హి లోకే వ్యపదేశః— "స్వామ్యలంకరణకా భృత్యా" ఇతి। అతోఽత్రాపి ప్రతీయమానస్య సత్యపి ప్రధానత్వే స్వగుణభూతవాచ్యసౌందర్యసాధకతమత్వాదలంకారవ్యపదేశో న విరుధ్యతే।

—భట్టేందురాజ. (కావ్యా లఘువివృతి వర్గః 6 పుట. 80)

ఖ) అతోఽత్ర వస్తుమాత్రస్యైవంవిధస్య శబ్దవ్యాపారాస్పృష్టస్య ప్రతీయమానతా, తద్విషయస్య చ కావ్యధర్మస్య ధ్వననాభిధానస్య వాచ్య-వాచకశూన్యావగమనస్వభావత్వాత్ పర్యాయోక్తాలంకారసంస్పర్శిత్వమ్॥" —భట్టేందురాజ. (కావ్యా. లఘువివృతి. వర్గః6 పుట. 80)

వినికిడిచే (అభిధచే) లభించని యర్థము సహృదయుల మనమున నొకప్పుడు స్ఫురించుచుండును అట్టియర్థవిశేషమును స్ఫురింపఁజేయునది యాక్షేపవృత్తి, ధ్వనియన్నను నిదియే శబ్దార్థము లప్రధానములై యుండి యర్థాంతరమును స్ఫురింపఁజేసిన నదియే కదా ధ్వని కావున ఇష్టార్థమును నిషేధించుచున్నట్లున్న వ్యాక్యార్థముచే విశేషార్థస్ఫూర్తి కలుగఁజేయుటయే ఆక్షేపాలంకారమగును

కావున నీయాక్షేపాలంకారము ధ్వనియు నొక్కటియే యని తేలినది [30]

భామహునియాక్షేపలక్షణము కూడ నిట్లే యున్నది [31] ఇట్లాక్షేపాలంకారముచే వస్తుధ్వని గతార్థము చేయఁబడినది దండియు వస్తుధ్వనిని సమాసోక్త్యలంకారముచేత గతార్థమొనరించెను ఆ సమాసోక్తిలక్షణమిది (కావ్యా–2 203)–

"వస్తు కించిదభిప్రేత్య తత్తుల్యాన్యస్య వస్తునః ।
ఉక్తిః సంక్షిప్తరూపత్వాత్ సా సమాసోక్తిరిష్యతే ॥

ఒక విశేషార్థమును మనమున నిడి దానిని స్ఫురింపఁజేయుటకై తత్సదృశమగు నర్థమును చెప్పుటయే సమాసోక్తి అనఁగా వాచ్యార్థము అప్రధానమై అర్థాంతరమును స్ఫురింపఁజేయుటయే సమాసోక్తియనుట ఇదియు ధ్వనికారుల లక్షణమునే యనుకరించుచున్నది [32]

---

30 ధ్వనికారుల ధ్వనిలక్షణమిది–
"యత్రార్థః శబ్దో వా తమర్థముపసర్జనీకృతస్వార్థౌ।
వ్యంక్తః కావ్యవిశేషః స ధ్వనిరితి సూరిభిః కథితః॥" (ధ్వన్యా 1 13)

31. "ప్రతిషేధ ఇవేష్టస్య యో విశేషాభిధిత్సయా ।
ఆక్షేప ఇతి తం సంతః శంసంతి ద్వివిధం యథా॥"
–భామహ. (కావ్యా 2 . 68)

32 తస్మాదియం గుణీభూతా అర్థాంతరం స్ఫుటయతి, న తు స్వార్థతంత్రా।
ఇయమేవ చాన్యైర్ధ్వనిరతి వ్యవహ్రియతే। యదాహుః–
"యత్రార్థః శబ్దో వా తమర్థముపసర్జనీకృతస్వార్థౌ।
వ్యంక్తః కావ్యవిశేషః స ధ్వనిరితి సూరిభిః కథితః॥
–రత్నశ్రీ [కావ్యలక్షణ (కావ్యాదర్శ) వ్యాఖ్యా] (2 . 203)

ఇఁక రుద్రటుఁడు (విధినిషేధాత్మకమగు)వస్తుధ్వనిని భావాలంకారముతో, శబ్దశక్తిమూలధ్వనిని శ్లేషతో గతార్థమొనరించెను భావాలంకారోదాహరణము -

ఏకాకినీ యదబలా తరుణీ తథాఽహ
మస్మిన్ గృహే గృహపతిశ్చ గతో విదేశమ్ ।
కిం యాచసే తదిహ వాసమియం వరాకీ
శ్వశ్రూర్మమాంధబధిరా నను మూఢ ! పాంథ ! ॥

(రుద్రటకావ్యాలంకార 7.41)

"ఓ బాటసారీ ! నేను వయిసుననున్నదానను, ఇంట నొక్కదానను, మాయింటాయన దేశాంతరము వెళ్ళియున్నాఁడు. మాయత్త గ్రుడ్డిది, చెవిటిదియును ఇట్లుండ మాయింట తలదాచుకొన వసతినిమ్మని నీవేమని యాచింతువు నీవీమాత్రము తెలియనివాడవా ?"

సాభిలాషయగు నొక నెఱజాణ తలదాచుకొన వసతి నర్థించఁదలచిన వయసుకాఁడగు బాటసారితో పలికిన పలుకులివి "కిం యాచసే" (ఏమని యాచింతువు ?) అను కాకువుచే వాసదాననిషేధము చెప్పుచున్న ఈ వాక్యమే వక్త్రభిప్రాయరూపమగు వాసదానానుమతిరూపమగు నర్థాంతరమును స్ఫురింపఁ జేయుటచే నిది భావాలంకారమగుచున్నదని లక్షణసమన్వయము.[33] ఇది వక్తృవైశిష్ట్యముచేనగు నర్థశక్తిమూలవస్తుధ్వనియనుట స్పష్టమే కదా !

కావున రుద్రటుఁడు భావాలంకారముచే వస్తుధ్వనిని గతార్థమొనరించెను [34] రుద్రటునిశ్లేషాలంకారలక్షణమిది–

---

33. క) ఏకాకినీతి। తరుణపథికస్య వాసం యాచమానస్య కాచిత్ సాభిలాషా యోషిత్ ఇదం ప్రకటప్రతిషేధార్థం వాక్యమాహ। ఏతేన చోక్త-పదార్థేన విలక్షణో వాసానుమతివిధిలక్షణో భావోఽవగమ్యతే॥

– నమిసాధుటిప్పణం (రుద్రటకావ్యా 7 41)

ఖ) భావాలంకారలక్షణమిది–

అభిధేయమభిదధానం తదేవ తదసదృశసకలగుణదోషమ్।
అర్థాంతరమవగమయతి తద్వాక్యం సోఽపరో భావః॥

(రుద్రటకావ్యా 7 40)

34 రుద్రటేనాపి భావాలంకారో ద్విధోక్తః। .. తదిత్థం త్రివిధమపి ప్రతీయమానమలంకారతయా ఖ్యాపితమేవ॥

(అలం. సర్వస్వ ప్రారంభ)

అవిశేషః శ్లేషోఽసౌ విజ్ఞేయో యత్ర వాక్యమేకస్మాత్ ।
అర్థాదన్యం గమయేదవిశిష్టవిశేషణోపేతమ్ ॥
యత్రాధికమారబ్ధమసమానవిశేషణం తథా వాక్యమ్ ।
అర్థాంతరమవగమయేదధికశ్లేషః స విజ్ఞేయః ॥

(రుద్రటకావ్యాలంకార. 10 3, 7)

అవిశేషశ్లేష, అధికశ్లేష, అనునీరెండు శ్లేషభేదములు ఈరెంటిలోను ప్రకృతవాక్యార్థము శ్లేష (నానార్థకశబ్దశక్తి)మహిమచే నప్రకృతార్థము స్ఫురింపఁ జేయుట కలదు. ఆయర్థముత్కృష్టమైన నధికశ్లేషయనియు కానిచో అవిశేష శ్లేషయనియు సారాంశము. దీనియుదాహరణము (రుద్రటకావ్యా—10 8) —

ప్రేమ్ణా నిధాయ మూర్ధని వక్రమపి బిభర్తి యః కళావంతమ్ ।
భూతిం చ వృషారూఢః స ఏవ పరమేశ్వరో జయతి ॥

"సౌమ్యస్వభావుఁడు కాకపోయినను కళావంతుఁడను నభిమానముతో నతనిని తలనిడి ప్రేమతో పోషించువాఁడును ధర్మాను[35]గతుడై సంపదను ధరించువాఁడును అగు నాపరమేశ్వరుఁడు(రాజు) సర్వోత్కర్షతో వెలయు చున్నాడు" అను నీ ప్రకృతార్థముచే—"వంకరయైయున్న బాలమృగాంకుని యౌదలఁదాల్చినవాఁడును, వృషభాధిరూఢుఁడై విభూతితో వెలుఁగుచున్న వాఁడును అగునాపరమశివుఁడు సర్వోత్కర్షతో వెలయుచున్నాడు"అను నప్రకృతార్థము స్ఫురించుచున్నది ప్రకృతార్థముకంటెను నీయప్రకృతార్థము దేవ వర్ణనాత్మకమగుటచే నుత్కృష్టమయినది. కావున నిది యధికశ్లేషయని రుద్రటుఁడు నిర్వచించెను

ఈయప్రకృతార్థము ప్రకృతార్థోపయోగి కాదుగదా। దీనివలన ప్రయోజనమేమి ? లేదేని ఉన్మత్తవాక్యమువలె వ్యర్థమగునుగదా। యని శంకించి రుద్రటాలంకారవ్యాఖ్యాతయగు నమిసాధువు — మహాకవులట్లు కావ్యములు

---

35 తథా భూతిం సమృద్ధిం చ బిభర్తి। కీదృశః సన్? వృషే ధర్మే సమారూఢః॥ —నమిసాధుటిప్పణం (రుద్రటకావ్యా. 10 . 8)

ప్రాయుటయు, దాన సహృదయులహృదయములు స్పందించుటయు గమనించియే దీని నిట్లలంకారముగా పరిగణించుట జరిగినదని వివరించెను. 36

అనంతరలాక్షణికు లీసందర్భమున ప్రకృతాప్రకృతార్థముల కుపమానోపమేయభావము కల్పించి ఉపమాలంకారధ్వని యని నిర్దేశించుట తెలియనిది కాదు 37

ఇట్లు శబ్దశక్తిమూలకములగు వ్యతిరేకవిరోధాభాసాద్యలంకారధ్వనులన్నియు నీశ్లేషవిస్తరముచె గతార్థము చేయఁబడినవి 38

**అర్థాలంకారధ్వనుల గతార్థత :-**

ఉద్భటుఁడు ప్రతీయమానమగు నుత్ప్రేక్షనంగీకరించుటచే ఆయాయలంకారధ్వనులన్నియును ప్రతీయమానములగుచున్నంతమాత్రమున నలంకారములు కాకపోవనియు కావున నాయాయలంకారములలోనే యంతర్భవించు

---

36. నను ప్రకృతానుపయోగ్యర్థాంతరమున్మత్తవాక్యవదసంబద్ధమవగతమపి క్వోపయుజ్యతే? సత్యం। ఏతదేవాస్యాలంకారత్వమ్। ఏవం హి హృదయావర్జకత్వమస్య। అత్ర చ మహాకవయ ఏవ ప్రమాణమ్॥
—నమిసాధుటిప్పణం (రుద్రటకావ్యా. 10 3)

37. క) ఏషూదాహరణేషు శబ్దశక్త్యా ప్రకాశ్యమానే సత్యప్రాకరణికేఽర్థాంతరే వాక్యస్యాసంబద్ధార్థాభిధాయిత్వం మా ప్రసాంక్షీదిత్యప్రాకరణికప్రాకరణికార్థయోరుపమానోపమేయభావః కల్పయితవ్యః ।
(ధన్యా ద్వితీ పుట 244)

ఖ) అత్ర వాక్యస్యాసంబద్ధార్థత్వం మా ప్రసాంక్షీదిత్యప్రాకరణికప్రాకరణికయోరుపమానోపమేయభావః కల్పనీయ ఇత్యత్రోపమాలంకారో వ్యంగ్యః (కావ్యానుశాసనం. 1 62)

38. క) గమ్యేత ప్రక్రాంతాదసంభవత్తద్విశేషణోఽన్యోఽర్థః।
వాక్యేన సుప్రసిద్ధః స జ్ఞేయోఽసంభవశ్లేషః॥
(రుద్రటకావ్యా. 10 . 6)

ఖ) యత్ర విరుద్ధవిశేషణమవగమయేదన్యదర్థసామాన్యమ్।
ప్రక్రాంతమథాన్యాదృక్ వాక్యశ్లేషో విరోధోఽసౌ॥
(రుద్రటకావ్యా. 10 . 5)

ననియు లేదా ప్రకారాంతరాభిధానరూపమగు పర్యాయోక్తమునసంతర్భవించు ననియు ఉద్భటాలంకారవ్యాఖ్యాతయగు ప్రతీహారేందురాజు వివరించెను [39]

ఇట్లలంకారధ్వనులన్నియును ఆయాయలంకారములుగానో పర్యాయోక్తముగానో పేర్కొనఁబడినవి

**రసధ్వనికి రసవదాద్యలంకారాంతర్భావము ..**

భామహాదులు – శృంగారాదిరసావిర్భావముండుటయే, రసవదాద్య లంకారమని నిర్వచించుచు రసాదిధ్వనులనలంకారములుగానే పరిగణించిరి. [40]

---

**39.** క) ఉత్ప్రేక్షా తు స్వయమేవ ప్రతీయమానా కథితా॥

(అలం సర్వస్వ ప్రారంభ)

ఖ) నను ఇవాద్యుపనిబంధే సతి యద్యుత్ప్రేక్షా భవతీత్యుచ్యతే, ఏవం సతి– "చందనాసక్తభుజగనిశ్వాసానిలమూర్ఛితః। మూర్ఛయత్యేష పథికాన్ మధౌ మలయమారుతః॥" ఇత్యేవమాదా"వివా"దే రప్రయో గాదుత్ప్రేక్షాభావప్రసంగ ఇత్యాశంక్యాహ– "వాచ్యేవాదిభిరుచ్యతే', ద్విధా ఖలూత్ప్రేక్షా। కాచి"దివా"ది ప్రయోగే సతి భవతి, కాచిత్త్వ- ప్రయుజ్యమానేష్వపి ఇవాదిషు అర్థసామర్థ్యాదవగమ్యమానేషు॥

–ప్రతిహారేందురాజవివృతి (ఉద్భటకావ్యా. 3 5)

గ) అలంకారాణాం తు యద్యపి– "లావణ్యకాంతిపరిపూరితదిఙ్ముఖే ఽస్మిన్" ఇత్యాదౌ ప్రతీయమానైకరూపతా, తథాప్యనంతరోక్త లక్షణేష్వలంకారేషు అనుప్రవేశో భవిష్యతి, పర్యాయోక్తే వా।
. . . . న చ యస్యాలంకారస్య ప్రతీయమానరూపతా తస్యై హాలంకారత్వం కేనచిన్నివారితమితి ప్రతీయమానరూపతయా రూప కాఖ్యోఽలంకారో భవిష్యతి। అథవా పర్యాయోక్త్యా రూపకస్యాత్రావ సితత్వాత్ పర్యాయోక్తాలంకారః॥

–ప్రతీహారెందురాజలఘువివృతి (ఉ. కావ్యా. 6వ వర్గ పుట. 81)

**40.** క) రసవత్ప్రేయఃప్రభృతౌ తు రసభావాదిర్వాచ్యశోభా హేతుత్వేనోక్తః, తదిత్థం త్రివిధమపి ప్రతీయమానమలంకారతయా ఖ్యాపితమేవ॥

(అలం సర్వస్వ ప్రారంభ.)

ఖ) "రసవత్ దర్శితస్పష్టశృంగారాదిరసం యథా॥" –భామహ (కావ్యా.3 6)

రసము ప్రధానముగాక, ఇతరవాక్యార్థము ప్రధానమైయుండ దానికి రసాదులంగములగునేని రసవదాద్యలంకారములగునని ధ్వనికారాదులు నిర్వచించియుండుట తెలియనిది కాదు [41]

కావున భామహాదుల-రసవదాద్యలంకారములు రసాదిధ్వనులే యగును.

ఇట్లు త్రివిధధ్వనియు అలంకారాంతర్భూతమయినందున కావ్యమునందలంకారములే ప్రధానములై నిలుచుటచే 'కంఠతః' చెప్పకున్నను భామహాదులు అలంకారప్రాధాన్యవాదులుగా పేరొందిరి

---

గ) రసవద్దర్శితస్పష్టశృంగారాదిరసోదయమ్।
స్వశబ్దస్థాయిసంచారివిభావాభినయాస్పదమ్॥ —ఉద్భట (కావ్యా. 4 3)

ఘ) "యేన కావ్యేన స్ఫుటరూపతయా శృంగారాదిరసావిర్భావో దృశ్యతే, తత్ కావ్యం రసవత్॥ రసాః ఖలు తస్యాలంకారాః॥
—ప్రతీహారేందురాజలఘువివృతి (ఉద్భటకావ్యా 4 3)

జ) "రసవద్రసపేశలమ్ — (దండికావ్యా. 2 273) (యథా)—
మృతేతి ప్రేత్య సంగతుం యయా మే మరణం మతమ్।
సైవావంతీ మయా లబ్ధా కథమత్రైవ జన్మని॥
ప్రాక్ ప్రీతిర్దర్శితా సేయం రతిః శృంగారతాం గతా।
రూపబాహుల్యయోగేన తదిదం రసవద్వచః॥
యస్యాః కుసుమశయ్యాఽపి కోమలాంగ్యా రుజాకరీ।
సాఽధిశేతే కథం దేవీ హుతాశనవతీం చితామ్॥
ఇతి కారుణ్యముద్రిక్తమలంకారతయా స్మృతమ్।
తథాఽపరేఽపి బీభత్సహాస్యాద్భుతభయానకాః॥
—దండీ (కావ్యా 2 278, '79, '84, '85)

41 క) ప్రధానేఽన్యత్ర వాక్యార్థే యత్రాంగం తు రసాదయః।
కావ్యే తస్మిన్నలంకారో రసాదిరితి మే మతిః॥ (ధ్వన్యా 2 5)

ఖ) రసభావతదాభాస-భావశాంత్యాదిరక్రమః ।
భిన్నో రసాద్యలంకారాదలంకార్యతయా స్థితః॥ (కావ్య. 4.26)

దండి యలంకారప్రాధాన్యవాదియగునా ?

దండి తన కావ్యలక్షణాపరపర్యాయమగు[42] కావ్యాదర్శమున తనకు పూర్వుఁడగు భరతుఁడు[43] నాట్యశాస్త్రమున పేర్కొనిన శ్లేషాదిదశగుణములనే పేర్కొని వైదర్భమార్గమునకవి ప్రాణములని నిర్దేశించి వానిని సూక్ష్మముగా పరిశీలించి నిర్వచించెను. ఇతఁడు కావ్యమున రసభావాదులను రసవదాద్యలం-

---

42 క) పూర్వశాస్త్రాణి సంహృత్య ప్రయోగానుపలక్ష్య చ।
యథాసామర్థ్యమస్మాభిః క్రియతే కావ్యలక్షణమ్॥
(దండి కావ్యలక్షణ 1 2)

ఖ) దండికృతస్యాలంకారగ్రంథస్య కావ్యాదర్శ ఇతి నామధేయమర్వాచీనమాతృకాసు టీకాసు ముద్రితగ్రంథేషు చ సర్వత్ర దృశ్యతే పరంతు ప్రాచీనేనానేన టీకాకారేణ (రత్నశ్రీజ్ఞానేన) కావ్యలక్షణమితి నామ్నా వ్యవదిష్టః॥
—రత్నశ్రీ టీకాయుతకావ్యలక్షణభూమికా.
(మిథిలావిద్యాపీఠ ప్రకాశిత 1957 AD)

43 క) శ్లేషః ప్రసాదః సమతా సమాధిర్మాధుర్యమోజః పదసౌకుమార్యమ్।
అర్థస్య చ వ్యక్తిరుదారతా చ కాంతిశ్చ కావ్యార్థగుణా దశైతే॥
(నాట్య 16 97)

ఖ) శ్లేషః ప్రసాదః సమతా మాధుర్యం సుకుమారతా।
అర్థవ్యక్తిరుదారత్వమోజః కాంతి సమాధయః॥
ఇతి వైదర్భమార్గస్య ప్రాణా దశ గుణాః స్మృతాః॥
(కావ్యాదర్శః. 1 42)

గ) ఇత్యేవంరూపా దశ గుణాః శబ్దాలంకారస్వభావాః ప్రాణా జీవితం। స్మృతా, దృశ్యంతే ఇతి యావత్। కస్య ? వైదర్భమార్గస్య దాక్షిణాత్యకావ్యపద్ధతేః సంబధినః। త్రైర్హి వైదర్భమార్గః కావ్యశరీరం ప్రాణితి। తదభావే త్వసన్నేవ। తతశ్చ శబ్దాలంకారభూతః శ్లేషాది దశగుణాత్మకః కావ్యరచనావిశేషో దాక్షిణాత్యానాం స్వాభావికో వైదర్భమార్గ ఇత్యర్థః సంపద్యతే॥
—రత్నశ్రీటీకా. (దండికావ్యలక్షణం. 1 . 42)

కారములుగానే పరిగణించి రసప్రాధాన్యమునంగీకరించకుండుటచేతను గుణములు ప్రాణములని చెప్పియుండుటచెతను కాబోలు కొందఱు విమర్శకులు గుణప్రాధాన్యవాదిగా బేర్కొనిరి 44

మఱికొందరు గుణములచె నేర్పడు రీతియే ప్రధానమని దండియభిప్రాయమనియు, కావుననే వైదర్భమార్గమునకు ("వైదర్భి" రీతికి)ఈ గుణములు ప్రాణములని చెప్పియున్నాఁడనియు కాన దండి రీతిప్రాధాన్యవాది యని పేర్కొందురు 45

దండి గుణరీతిప్రాధాన్యవాది కాక యలంకారప్రాధాన్యవాదియని ఏ కొందఱో విమర్శనానిపుణులు తలంచిరి 46

విచారించిన—"దండి యలంకారప్రాధాన్యవాది" యనుటయే సమంజసమని తోచుచున్నది-ఎట్లన? కావ్యమునకు వన్నెతెచ్చునవి యలంకారములే యనియు, వాని సూక్ష్మభేదములను పరిణతబుద్ధులగు లాక్షణికులిప్పటికిని ఇతోఽధికముగా నూహించుచునే యున్నారనియు, కావున ఈయలంకారములిన్నియే

---

44 "The next important name after Bhamaha is that of Dandin He is exponent of the Guna School which holds that the beautiful collection of words and ideas is the chief feature of the poetry The ten Gunas are the life of the best poetic style called the Vaidarbhi, and the Alankaras which Bhamaha regarded as the soul of the poetry are treated by Dandin as mere embellishments of poetic language" -Dr Sankaran
— ("సన్నిధానం" వారి కావ్యాలంకారసంగ్రహ వివరణమునుండి పుట. 95)

45 Dandin's Kavyadarsa is to some extent an exponent of the Riti School of poetics and partly of the Alankara School -P V Kane
(కావ్యా సంగ. వివ - పుట 95)

46 If, on the basis of Dandin's formulation of Gunas, one says that he belongs to the Guna School, one can as well say that Dandin belongs to the Riti School Really Dandin belongs to the Alankara School, much more than Bhamaha, -Dr. V Raghavan
(కావ్యా. సంగ. వివ. పుట. 95)

యని చెప్పనెవరితరము కాదనియు, ఆయలంకారములలోని సూక్ష్మాంశముల వరికించి కొంగ్రొత్తయలంకారముల నేర్పఱచుటకు ప్రాచీనలాక్షణికులు ఊహకనువైన బీజముల నిక్షేపించియుండుటచే వానినూఁతగాఁగొని ఈయలంకారముల సంస్కరించుటకయియే నా యీప్రయత్నమనియు చెప్పియుండుటచేతను, మఱియు, తాను నా "వైదర్భీ" రీతికి ప్రాణములని చెప్పిన గుణములును, ముఖాదిసంధ్యంగములును కావ్యశోభాకరములగుట నన్నియు అలంకారములే యని నిర్దేశించుటచేతను దండి యలంకారపక్షపాతియనియే తెలియుచున్నది [47]

ఈయభిప్రాయమునే అలంకారసర్వస్వవ్యాఖ్యాతలగు జయరథసముద్రబంధులును వెలిపుచ్చిరి [48]

---

47 క) కావ్యశోభాకరాన్ ధర్మానలంకారాన్ ప్రచక్షతే।
తే చాద్యాపి వికల్ప్యంతే కస్తాన్ కార్త్స్న్యేన వక్ష్యతి॥
కింతు బీజం వికల్పానాం పూర్వాచార్యైః ప్రదర్శితమ్।
తదేవ ప్రతిసంస్కర్తుమయమస్మత్పరిశ్రమః॥ (కావ్యల 1 1, 2)

ఖ) కాశ్చిన్మార్గవిభాగార్థముక్తాః ప్రాగప్యలంక్రియాః ।
సాధారణమలంకారజాతమన్యన్నిరూప్యతే॥ (కావ్యల 2 3)

గ) యత్తు సంధ్యంగ వృత్త్యంగలక్షణాద్యాగమాంతరే।
వ్యావర్ణితమిదం చేష్టమలంకారతయైవ నః॥ (కావ్యల. 2 364)

48 క) "ఇహ తావత్ భామహభట్టోద్భటప్రభృతయః" అను అలంకార-సర్వస్వపంక్తిని వివరించుచు జయరథుఁడు—
'ప్రభృతినా దండ్యాదయః' అని దండిని పేర్కొనెను
—విమర్శినీ (అలం సర్వస్వ పారంభ)

ఖ) "ఇతి పంచసు పక్షేషు ఆద్య ఉద్భటాదిభిరంగీకృతః, ద్వితీయో వామనేన" (వివృతిటీకా అలం సర్వ పుట 4) అని వివరించుచు సముద్రబంధుడు ఉద్భటాదులంకారప్రాధాన్యవాదులనియు వామనుఁడు గుణప్రాధాన్యవాది యనియు పెర్కొనెనే కాని దండిని స్మరించలేదు. "విశిష్టపదరచనా రీతిః" విశేషో గుణాత్మా" (వా సూత్ర) అని చెప్పియుండుటచే వామనుని గుణప్రాధాన్యవాదిగా పేర్కొనుట విరుద్ధము కాదు —రచయిత

మఱియు దండి యలంకారములను సూక్ష్మముగా పరిశీలించి యెన్నియో క్రొంగ్రొత్తభేదములను కనుగొనెను భామహుఁడు (38) అలంకారములను మాత్రము పేర్కొని హేతుసూక్ష్మలేశాలంకారములను ఉక్తివైచిత్ర్యశూన్యము లని చెప్పి యలంకారములుగా పరిగణింపఁదగదనెను[49] కాని దండి-హేతు సూక్ష్మలేశములు త్తమవాగ్విభూషణములని సోపపత్తికముగా సోదాహరణముగా నిర్వచించి భామహుని యభిప్రాయమును నిరసించెను[50] భామహుని యన న్వయసపందేహములను ఉపమాలంకారభేదములుగానెంచుచు[51] ఉపమాలంకార మున- (32) ముప్పదిరెండవాంతరభేదముల నిర్వచించెను దీనిలోని ఉపమే యోపమా ప్రతివస్తూపమలు అను రెండుభేదములను అనంతరలాక్షణికులు ప్రత్యే కాలంకారములనుగా పేర్కొనుట గమనించఁదగును.[52] భామహుని ఉపమా-

---

49 హేతుశ్చ సూక్ష్మో లేశోఽథ నాలంకారతయా మతః।
సముదాయాభిధేయస్య వక్రోక్త్యనభిధానతః ॥
గతోఽస్తమర్కో భాతీందుర్యాంతి వాసాయ పక్షిణః।
ఇత్యేవమాది కిం కావ్యం వార్తామేతాం ప్రచక్షతే॥
—భామహ (కావ్యా 2 . 86, 87)

50 క) "హేతుశ్చ సూక్ష్మలేశౌ చ వాచాముత్తమభూషణమ్।"
—దండీ (కావ్యల 2 233)

ఖ) గతోఽస్తమర్కో భాతీందు ర్యాంతి వాసాయ పక్షిణః ।
ఇతీదమపి సాధ్వేవ కాలావస్థానివేదనే॥
—దండీ (కావ్యలక్షణం 2. 242)

51 అనన్వయ-ససందేహావుపమాస్వేవ దర్శితౌ॥ —దండీ (కావ్యల 2 356)

52 ఉపమా దీపకం చైవ ప్రతివస్తూపమా తథా।
ఇత్యేత ఏవాలంకారా వాచాం కైశ్చిదుదాహృతాః॥
ఉపమేయోపమాం చైవ సహోక్తిం సంకరం తథా ।
పరివృత్తిం చ జగదురలంకారాన్ పరే గిరామ్॥
—ఉద్భట (కావ్యా. 1 2, 5 2)

రూపకము ఉత్ప్రేక్షావయవము అను నీరెండలంకారములను దండి—రూపకోత్ప్రేక్షా లంకారములోని యవాంతరభేదములనుగా సంగ్రహించెను [53]

దండి పేర్కొనిన యలంకారసూక్ష్మాంశముల పరికించిన యాతని పరిశీలనాదృష్టి వ్యక్తమగును-ఇట్లలంకారములనెన్నిటినో నిర్వచించియు, ఇంకెన్నియో యలంకారవిశేషాంశములు మిగిలియే యున్నవనియు, సమగ్రముగా చెప్పనెవరితరము గాదనియు, అయినను బాగుగా నధ్యయనము చేసిన మఱెన్నియోయలంకారముల వివరించవచ్చుననియు చెప్పుచు అనంతరలాక్షణికుల దృష్టి నలంకారమువైపు ప్రసరించునట్లు చేసెను.[54]

దండి 'యమకము, చిత్రము' అను రెండు శబ్దాలంకారములను (35) ముప్పదిఅయిదర్థాలంకారములను మాత్రము పేర్కొనినట్లు పట్టికపై కనంబడును,[55] కాని వీనిలోని ఒక్కొక్కయలంకారమును సంస్కరించి యెన్నియో

---

53. ఉపమారూపకం చాపి రూపకేష్వేవ దర్శితమ్।
ఉత్ప్రేక్షాభేద ఏవాసావుత్ప్రేక్షావయవోఽపి యః॥
—దండీ (కావ్య. 2 356, 357)

54. పంథాః స ఏష వివృతః పరిణామవృత్త్యా
సంక్షిప్య విస్తరమనంతమలంక్రియాణామ్।
వాచామతీత్య విషయం పరివర్తమానా—
నభ్యాస ఏవ వివరీతుమలం విశేషాన్॥ —దండీ. (కావ్య. 2 . 365)

55. క) స్వభావాఖ్యానముపమా రూపకం దీపకావృతీ।
ఆక్షేపోఽర్థాంతరన్యాసో వ్యతిరేకో విభావనా॥
సమాసాతిశయోత్ప్రేక్షా హేతుః సూక్ష్మో లవః క్రమః।
ప్రేయో రసవదూర్జస్వి పర్యాయోక్తం సమాహితమ్॥
ఉదాత్తాపహ్నుతిశ్లిష్టవిశేషాస్తుల్యయోగితా।
విరోధాప్రస్తుతస్తోత్రే వ్యాజస్తుతినిదర్శనే॥
సహోక్తిః పరివృత్త్యాశీః సంకీర్ణమథ భావికమ్।
ఇతి వాచామలంకారాః స్మర్యంతే పూర్వసూరిభిః॥
—దండీ (కావ్య. 2. 4, 5, 6, 7)

ఖ) "తదేవ ప్రతిసంస్కర్తుమయమస్మత్పరిశ్రమః॥"
—దండీ. (కావ్య. 2 . 2)

యవాంతరభేదములను నిర్వచించుట, వానినే అనంతరలాక్షణికులు ప్రత్యేకాలంకారములుగా నిర్దేశించుట గమనించినచో దండి యలంకారసంఖ్యాభివృద్ధి కెట్లు తోడ్పడెనో తెలియును

కావున దండి యలంకారప్రాధాన్యవాది యనుటయే చెల్లును

**రీతిమతము —**

దండి "వైదర్భీ"రీతికి ప్రాణములు గుణములని నుడివియుండుటచే దాని నూతఁగాఁగొని యనంతరలాక్షణికుఁడగు వామనుడు ఆగుణములచే నేర్పడినరీతియే కావ్యమునకాత్మయనియు వైదర్భి గౌడి పాంచాలి యను మూఁడురీతులలోనే కావ్యము ప్రతిష్ఠితమై యున్నదనియు, అయినను 'వైదర్భీ రీతి'యే సమగ్రగుణయగుటచే కవులకుపాదేయమనియు వచించెను [56]

ఇంతే కాక దండి కావ్యశోభాకరములగు ధర్మములన్నియు అలంకారములే యగునని పేర్కొని గుణాలంకారములకుఁగలభేదము గుర్తింపడయ్యెను. కాని వామనుఁడు కావ్యశోభాసంపాదకములగునవి గుణములనియు ఆగుణములచే కలిగినశోభను అతిశయింపఁజేయునవి యలంకారములనియు సూక్ష్మముగా పరిశీలించి చెప్పెను.[57]

---

56 క) 'రీతిరాత్మా కావ్యస్య' 'విశిష్టపదరచనా రీతిః' 'విశేషోగుణాత్మా' సా త్రివిధా - వైదర్భీ గౌడీయా పాంచాలీ చ। విదర్భాదిషు దృష్టత్వాత్ తత్సమాఖ్యా। సమగ్రగుణా వైదర్భీ"

—వామన (కావ్యా సూ. 1 2 6-11)

ఖ) ఏతాసు తిసృషు రీతిషు రేఖాస్వివ చిత్రం కావ్యం ప్రతిష్ఠితమితి॥

—వామన (కావ్యా. సూ 1. 2 . 13 వృత్తి)

గ) తాసాం పూర్వా గ్రాహ్యా గుణసాకల్యాత్॥

—వామన (కావ్యా సూ 1 . 2 . 14)

57. క) కావ్యశోభాకరాన్ ధర్మానలంకారాన్ ప్రచక్షతే॥

- దండీ (కావ్యా. 2 . 1)

ఖ) కాశ్చిన్మార్గవిభాగార్థముక్తాః ప్రాగప్యలంక్రియాః।

—దండీ (కావ్యా 2 3)

గ) కావ్యశోభాయాః కర్తారో ధర్మా గుణాః, తదతిశయహేతవస్త్వలంకారాః॥ —వామన. (కావ్యా సూ. 3 . 1 . 1, 2)

భామహుఁడు [58] మాధుర్యౌజఃప్రసాదములు అను మూఁడుగుణములనే పేర్కొనఁగా దండి [59] భరతునిదశగుణములనే స్వీకరించి లక్షణనిర్వచనమున నెంతయో స్పష్టతఁ గనఁబఱిచెను భరతుఁడు కావ్యార్థగుణములని చెప్పినవానినే దండి స్వీకరించి శబ్దగుణములుగా పేర్కొని వివరించియుండుటఁగాంచి వామనుఁడు వానినే గ్రహించి శబ్దగుణములుగా అర్థగుణములుగా పేర్కొని విడివిడిగా లక్షణమొనరించి కావ్యమున గుణములను వింశతిసంఖ్యాకములుగా వెలయించెను [60]

"వైదర్భీ""గౌడీయా"రీతులపేరున ద్వైధావిభక్తమైన రచనామార్గము భామహునకు పూర్వమే ప్రసిద్ధమైయుండెను. కావుననే భామహుఁడు—"ఈరెండింటికిని ప్రత్యేకసూక్ష్మభేదమేదియు లేదనియు ఇట్లు భేదగణన గతానుగతిక-న్యాయముచే నేర్పడినదే కాని వాస్తవము గాదనియు కాన నీరెంటిని నొకటిగానే పరిగణించఁదగుననియు నభిప్రాయపడెను [61]

---

58 "మాధుర్యమభివాంఛన్తః ప్రసాదం చ సుమేధసః ।
సమాసవంతి భూయాంసి న పదాని ప్రయుంజతే ॥
కేచిదోజోఽభిధిత్సన్తః సమస్యంతి బహూన్యపి॥"
—భామహ. (కావ్యా. 2 1, 2)

59 క) "శ్లేషః ప్రసాదః సమతా సమాధిర్మాధుర్యమోజః పదసౌకుమార్యమ్।
అర్థస్య చా వ్యక్తిరుదారతా చ కాంతిశ్చ కావ్యార్థగుణా దశైతే॥"
—భరత (నాట్యశాస్త్ర 16 . 97)

ఖ) శ్లేషః ప్రసాదః సమతా మాధుర్యం సుకుమారతా।
అర్థవ్యక్తిరుదారత్వమోజఃకాంతిసమాధయః॥ —దండీ (కావ్యా 1.41)

60 క) "ఓజఃప్రసాదశ్లేషసమతాసమాధిమాధుర్యసౌకుమార్యోదారతాఽర్థవ్యక్తికాంతయో బంధగుణాః ॥" —వామన (కావ్యా సూ. 3 1 5)

ఖ) త "ఏవార్థగుణాః ॥" —వామన (కావ్యా. సూ 3 2 1)

61. వైదర్భమన్యదస్తీతి మన్యంతే సుధియోఽపరే ।
తదేవ చ కిల జ్యాయః సమర్థమపి నాపరమ్॥
గౌడీయమిదమేతత్తు వైదర్భమితి కిం పృథక్।
గతానుగతికన్యాయాన్నానాఖ్యేయమమేధసామ్॥
—భామహ. (కావ్యా. 1 32, 33)

కాని దండి— ఈరెంటికిని ప్రస్ఫుటభేదముండనే యున్నదనియు, అంతే కాక ఈరెంటియందును మఱికొన్నియవాంతరభేదములును ఆయామహాకవుల రచనలలో గోచరించుచునేయున్నవనియు, అట్టిభేదములిన్నియని చెప్పనలవి కాదనియు, కాన వైదర్భగౌడమార్గములు అను నీరెండు భేదములుమాత్రము ప్రధానముగా నిర్దేశింపఁబడినవనియు సోపపత్తికముగా నిరూపించెను [62]

విదర్భులనఁగా దాక్షిణాత్యులు, గౌడీయులన పౌరస్త్యులు, వారు ప్రచురముగా వాడునవి కావున నీ రచనామార్గమును (రీతిని) వైదర్భమనియు గౌడమనియు వ్యవహరించిరి అంతమాత్రమున ఇతరదేశీయులు ఈమార్గమున రచన చేయరని కాదు మలయపర్వతమున పుట్టుటచే చందనమునకు మలయజమను సమాఖ్య ప్రసిద్ధము, ఇతర దేశములందును చందనము కానవచ్చుచున్నది అంతమాత్రమున మలయజము కాకుండునా ? అట్లే ఈ రెంటిని ఆయాదేశనామములతో వ్యవహరించుట విరుద్ధము కాదు మఱియు చెఱకురసము పాలు బెల్లము మున్నగునవి యన్నియును తియ్యనివే కాని దేనితియ్యఁదనము దానిదే అట్లే ప్రతికవియందును భిన్నభిన్నములై కానవచ్చు రీతులభేదములను లెక్కింప సరస్వతికైన నలవికాదని దండి[63] యభిప్రాయ

---

62. అస్త్యనేకో గిరాం మార్గో సూక్ష్మభేదః పరస్పరమ్।
తత్ర వైదర్భగౌడీయౌ వర్ణ్యేతే ప్రస్ఫుటాంతరౌ॥
ఇతి మార్గద్వయం భిన్నం తత్స్వరూపనిరూపణాత్।
తద్భేదాస్తు న శక్యంతే వక్తుం ప్రతికవిస్థితాః॥
—దండీ (కావ్యా 1 40, 101)

63 క) విదర్భాః దాక్షిణాత్యాః, ఏకదేశేన సముదాయోపలక్షణత్వాత్। తేషా-మయం వైదర్భః। గౌడాః పౌరస్త్యాః తేషామయం గౌడీయః। తౌ మార్గౌ ప్రస్ఫుటౌ॥ —రత్నశ్రీవ్యాఖ్య (దండికావ్యలక్షణం 1 40)

ఖ) న హి చందనం దేశాంతరే దృశ్యత ఇతి తజ్జమేవ స్యాత్। దేశాం-తరదృష్టమపి హి మలయజమేవ స్యాత్। తథా వైదర్భః పౌరస్త్యేషు కథంచిద్దృశ్యమానోఽపి వైదర్భఏవ, యో దాక్షిణాత్యానాం సహజః। గౌడీయోఽపి దాక్షిణాత్యేషు కథంచిత్ దృశ్యతే తథాపి పౌరస్త్యానామేవాసౌ నిజత్వాత్॥
—రత్నశ్రీవ్యాఖ్య (దండికావ్యల 1 40)

పడుటయు, ఉద్భటుఁడును అనుప్రాసోపయోగార్థము పరుష, ఉపనాగరిక, గ్రామ్య, అను మూడు వృత్తులనుదాహరించియుండుటయును[64] పరిశీలించిన వామనుఁడు కోమలోపపదమగు "గ్రామ్య"వృత్తినే సంస్కరించి వైదర్భ్యాది రీత్యంతరనామానుగుణముగా "పాంచాలి"యను నామముతో తృతీయరీతిగా పేర్కొని మూడు రీతుల నుదాహరించెను[65] ఈ మూడు రీతులయందే రేఖల యందు చిత్తరువువలె కావ్యము ప్రతిష్ఠితమై యుండుననియు, కావున కావ్య

---

గ) ఇక్షుక్షీరగుడాదీనాం మాధుర్యస్యాంతరం మహత్।
తథాపి న తదాఖ్యాతుం సరస్వత్యాఽపి శక్యతే॥(దండికావ్యల 1.102)

ఘ) తదేవం మార్గద్వయస్య ప్రభేదాః యద్యపి ప్రతికవిస్థితా విద్యంతే, వస్తుతస్తథాపి వక్తుమానంత్యాదతిప్రసంగాచ్చ న శక్యంతే విశేషేణ ప్రత్యేకమ్। నైతావతా న సన్త్యేవ। సామాన్యేన తు మార్గద్వయస్య వైలక్షణ్యం దర్శితమేవ వ్యక్తమ్। ప్రతివ్యక్తి వక్తుం కో నామ శక్నుయాత్। సర్వత్రైవ లక్షణశాస్త్రే సర్వభేదవ్యాపి సామాన్యలక్షణ ముచ్యతే। న తు తద్భేదాః పరిసంఖ్యాయంతే। అత్రాపి సైవ వ్యవస్థా కావ్యలక్షణశాస్త్రత్వాదస్య ॥
—రత్నశ్రీ వ్యాఖ్య (దండికావ్యల. 1 102)

64 క) సరూపవ్యంజనన్యాసం తిసృష్వేతాసు వృత్తిషు ।
పృథక్పృథగనుప్రాసముశంతి కవయః సదా॥ (ఉద్భటకావ్యా-1/7)

ఖ) "శషాభ్యాం రేఫసంయోగైష్టవర్గేణ చ యోజితా ।
పరుషా నామ వృత్తిః స్యాత్ హ్లహ్వహ్యాద్యైశ్చ సంయుతా ॥"
"సరూపసంయోగయుతాం మూర్ధ్ని వర్గాంత్యయోగిభిః ।
స్పృశైర్యుతాం చ మన్యంతే ఉపనాగరికాం బుధాః ॥"
శషైర్వర్ణైర్యథాయోగం కథితాం కోమలాఖ్యయా ।
గ్రామ్యాం వృత్తిం ప్రశంసంతి కావ్యేష్వాదృతబుద్ధయః॥
(ఉద్భటకావ్యా 1 . 4, 5, 6)

65. "కేషాంచిదేతా వైదర్భీప్రముఖా రీతయో మతాః" ఎతాస్తిస్రో వృత్తయః వామనాదీనాం మతే వైదర్భీగౌడీపాంచాల్యాఖ్యా రీతయో మతాః॥"
(కావ్యప్రకాశ. 9 . 81)

మునకాత్మ రీతియనియు, రీతి యన విశిష్టమగు పదరచన కావున అరచన లోని విశేషము గుణములే యనియు వామనుఁడభిప్రాయపడెను [66]

ఇట్లు వామనుఁడు కావ్యమున గుణములు ప్రధానములని చెప్పకచెప్పి నట్లైనది కావుననే సముద్రబంధుఁడు తన—అలంకారసర్వస్వవ్యాఖ్యానమున- "ఆద్య ఉద్భటాదిభిరంగీకృతః, ద్వితీయో వామనేన" [67] అనగా శబ్దార్థమయ మగు కావ్యశరీరమునకు వన్నె తెచ్చునవి యలంకారములని భామహోద్భటు లును, గుణములని వామనుఁడును వచించెనని చెప్పియున్నాఁడు

ఇంతే గాక వామనుఁడు రసాదిధ్వనిని కాంతిగుణముచేతనే గతార్థము చేసెను. వామనుని కాంతిగుణలక్షణమిది—

"దీప్తరసత్వం కాంతిః" (కావ్యా. సూ 3 2 15) దీప్తములగు శృంగారాదిరసములు కలిగియునికియే కాంతియను గుణము ఉదాహరణము—

> ప్రేయాౝ సోఽయ మపాకృతః సశపథం పాదానతః కాంతయా
> ద్విత్రాణ్యేవ పదాని వాసభవనాద్యావన్న యాత్యున్మనాః ।
> తావత్ ప్రత్యుత పాణిసంపుటలసన్నీవీనిబంధం ధృతో
> ధావిత్వైవ కృతప్రణామక మహో, ప్రేమ్ణో విచిత్రా గతిః ॥" [68]
> (కావ్యా. సూ 3 2 15 ఉదా )

తన యపరాధమును మన్నింపుమని తనపాదములపైబడి యెంతవేడినను మొదట తిరస్కరించియు, ఇఁక నాతఁడు వాసభవనమునుండి రెండుమూడడు- గులు నడిచివెళ్ళెనో లేదో, అంతలోనే ఆ ప్రేయసి తానిఁక ప్రియునివిరహము

---

66 క) ఏతాసు తిసృషు రీతిషు, రేఖాస్వివ చిత్రం కావ్యం ప్రతిష్ఠితమితి।
(కావ్యా. సూ 1 2.13 వృత్తి)

ఖ) విశిష్టపదరచనారీతిః॥ విశేషోగుణాత్మా॥ (కావ్యా సూ. 1.2.7, 8)

67 సముద్రబంధునివివృతిటీక- అలంకారసర్వస్వప్రారంభము.

68 ఈ శ్లోకపాఠాంతరములు— "లసన్నీవీ" అనుటకు బదులు "గలన్నీవీ" అనియు, "ధావిత్వైవ" అనుచోట "ధావిత్వేవ' అనియు కావ్యప్రకాశ (4.98) పాఠము మరియు 'నీవీనిబంధం' అను చోట 'నీవీనితంబం' అని కావ్యాలంకారసూత్ర (పూనా) పాఠము —రచయిత

తాః లేక జారుచున్న నీవిబంధము చేతఁబట్టుకొని యరికిపోయి చేతులు జోడించి ప్రియుని నిరోధించెను అహా! ప్రేమగతి ఎంత విచిత్రమయినది

ఇట శృంగారరసము దీప్తమై యుండుటచేత నిది కాంతిగుణమని వామనునియభిప్రాయము [69]

కాని ఇది శృంగారరసధ్వనియనుటలో సందియము లేదు [70] ఇట్లు రసాంతరధ్వనులనన్నింటిని వామనుఁడు కాంతిగుణకుక్షినిక్షిప్తమొనర్చెను [71]

[72] మఱియు సాదృశ్యమూలకమగు లక్షణయే వక్రోక్త్యలంకారమని నిర్వచించుటచే లక్షణామూలకధ్వని యలంకారమని చెప్పినట్లయినది.

అయినను కావ్యముననలంకారములకంటె గుణములు నిత్యములు కావున ప్రధానములని చెప్పియును ఆగుణములచే నేర్పడు రీతియే కావ్యమున కాత్మ యని సూత్రీకరించుటచే [73] వామనుఁడు గుణప్రాధాన్యవాదిగాఁగాక రీతి ప్రాధాన్యవాదియని పేరువడయుటకు కారణమైనది

---

69. దీప్తాః రసాః శృంగారాదయో యస్య స దీప్తరసః, తస్య భావః దీప్తరసత్వం కాంతిః ॥ (కావ్యా సూ 3 2 . 15 వృత్తి)

70 ద్వారాదిపదమపహాయ 'పద' - పదగ్రహణాత్ ద్వారపర్యంతగమనా-సహిష్ణుతయా వ్యంగ్యోత్కంఠాతిశయో వ్యజ్యతే, తేన చ సంభోగో వ్యజ్యత ఇతి భావః ॥ (కావ్యప్రదీప 4 . 98)

71 ఏవం రసాంతరేష్వప్యుదాహరణీయమితి॥ (కావ్యా సూ 3 2 15 వృత్తి)

72. క) "సాదృశ్యాల్లక్షణా వక్రోక్తిః" (కావ్యా సూ. 4 . 3 . 8)

ఖ) వామనేన తు సాదృశ్యనిబంధనాయా లక్షణాయా వక్రోక్త్యలంకారం బ్రువతా కశ్చిద్ ధ్వనిభేదోఽలంకారతయైవోక్తః। కేవలం గుణవిశిష్ట పదరచనాత్మికా రీతిః కావ్యాత్మకత్వేనోక్తా॥

(అలం సర్వస్వ -సం॥ డా రేవాప్రసాద చౌ సం. 1971 పుట 19)

73. క) కావ్యశోభాయాః కర్తారో ధర్మా గుణాః ।
తదతిశయహేతవస్త్వలంకారాః। పూర్వే నిత్యాః॥
(కావ్యా సూ. 3 . 1 . 1, 2, 3)

వక్రోక్తిమతము —

వామనుఁడు గుణాలంకారసంస్కృతములగు శబ్దార్థములు కావ్య[74]మని చెప్పుటచె శబ్దార్థములు కావ్యశరీరస్థానీయములనియు గుణవిశిష్టమగురీతియనిన శబ్దార్థరూపమే యగుటచే రీతి కావ్యశరీరమగును కాన కావ్యాత్మయనుట తగదనియు, ధ్వనికారవ్యవస్థాపితమగు త్రివిధమగు ధ్వని చమత్కారవైలక్షణ్యము గలదియగుటచే నదియే కావ్యాత్మ కాఁదగినదనియు భావించిన కుంతకుఁడు వ్యంజనావ్యాపారవిషయమునమ్మాత్రము ధ్వనికారునితో నేకీభవించక ఆ త్రివిధధ్వని వక్రోక్తిచే (కవివ్యాపారవక్రతచే) నేర్పడినదని వివరించుచు వక్రోక్తియే కావ్యమునకు జీవితమని ఉపపాదించెను[75]

వక్రోక్తియనఁ నేమో కుంతకుఁడిట్లు వివరించెను.

[76] కావ్యమనఁగా శబ్దార్థములనుటలో విప్రతిపత్తి లేదు శబ్దమన వాచకమనియు అర్థమన వాచ్యమనియు నందఱికి తెలిసినదే, కాని కావ్యమున

---

ఖ) రీతిరాత్మా కావ్యస్య॥ విశిష్టపదరచనా రీతిః॥ విశేషో గుణాత్మా॥
(కావ్యా. సూ 1 2 6, 7, 8)

74 కావ్యశబ్దోఽయం గుణాలంకారసంస్కృతయోః శబ్దార్థయోర్వర్తతే॥
(కావ్యా. సూ. 1 . 1 1 వృత్తి)

75. క) వక్రోక్తిజీవితకారః పునర్వైదగ్ధ్యభంగిభణితిస్వభావాం బహువిధాం వక్రోక్తిమేవ ప్రాధాన్యాత్ కావ్యజీవితముక్తవాన్। వ్యాపారస్య ప్రాధాన్యం చ ప్రతిపేదే। అభిధానప్రకారవిశేషా ఏవ చాలంకారాః। సత్యపి త్రిభేదే ప్రతీయమానే వ్యాపారరూపా భణితిరేవ కవిసంరంభగోచరా। ఉపచారవక్రతాదిభిః సమస్తో ధ్వనిప్రపంచః స్వీకృతః। కేవలముక్తివైచిత్ర్యజీవితం కావ్యం, న వ్యంగార్థజీవితమితి తదీయం దర్శనం వ్యవస్థితమ్॥ —రుయ్యక. (అలం. సర్వస్వ-ప్రారంభ)

ఖ) వక్రోక్తిరేవ వైదగ్ధ్యభంగిభణితి రుచ్యతే॥ (వక్రోక్తి 1.10)

76 క) "శబ్దార్థౌ సహితౌ వక్రకవివ్యాపారశాలిని।
బంధే వ్యవస్థితౌ కావ్యం తద్విదాహ్లాదకారిణి॥
వాచ్యోఽర్థో వాచకః శబ్దః ప్రసిద్ధమితి యద్యపి।
తథాఽపి కావ్యమార్గేఽస్మిన్ పరమార్థోఽయమేతయోః॥

నుండుశబ్దార్థములు విలక్షణములు ఒకే యర్థముచెప్పుపర్యాయపదములెన్ని-యేని ఉండవచ్చును అయినను కవియభిప్రాయమును ప్రతిబింబించునర్థమును బోధించు శబ్దమే కావ్యోపయోగి యగును అట్లే సహృదయహృదయాహ్లాదకమగు నర్థమే కావ్యోపయోగియగు నర్థమగును కావున కవి రమణీయార్థమును మనమునసనిడి తదుపయోగిశబ్దములనుపయోగించి స్వప్రతిభాకల్పితమగు నుక్తి వైచిత్ర్యముచే ఆ శబ్దార్థముల కొక వన్నె తెచ్చుటయే వక్రోక్తియగును. దీనినే వైదగ్ధ్యభంగిభణితియనియు, విచిత్రాభిధానమనియునందురు కావున కుంతకుఁడు అభిధకొక వైచిత్ర్యమును కల్పించి దానిలోనే (అభిధలో) వ్యంజన నంత ర్భవించెను.[77] ఉదా. (కుమా పం స).—

> ద్వయం గతం సంప్రతి శోచనీయతాం
> సమాగమప్రార్థనాయా కపాలినః।

---

> శబ్దో వివక్షితార్థైకవాచకోఽన్యేషు సత్స్వపి।
> అర్థః సహృదయాహ్లాదకారిస్వస్పందసుందరః॥
>
> (వక్రోక్తి 1 7, 8, 9)

ఖ) శబ్దార్థములెట్లుండవలెనో ధ్వనికారులునిట్లే వివరించిరి—

> శబ్దార్థశాసనజ్ఞానమాత్రేణైవ న వేద్యతే।
> వేద్యతే స హి కావ్యార్థతత్త్వజ్ఞైరేవ కేవలమ్॥
>
> సోఽర్థస్తద్వ్యక్తిసామర్థ్యయోగీ శబ్దశ్చ కశ్చన।
> యత్నతః ప్రత్యభిజ్ఞేయౌ తౌ శబ్దార్థౌ మహాకవేః॥ (ధ్వన్యా. 1 7, 8)

గ) వక్రోక్తిః ప్రసిద్ధాభిధానవ్యతిరేకిణీ విచిత్రైవాభిధా। కీదృశీ ? వైదగ్ధ్యభంగిభణితిః। వైదగ్ధ్యం విదగ్ధభావః, కవికర్మకౌశలం, తస్య భంగి విచ్ఛిత్తిః, తయా భణితిః। విచిత్రైవాభిధా వక్రోక్తిరిత్యుచ్యతే॥

(వక్రోక్తి. 1 10 వృత్తి)

77. నను చ ద్యోతకవ్యంజకావపి శబ్దౌ సంభవతః, తదసంగ్రహాన్నా-వ్యాప్తిః। యస్మాదర్థప్రతీతికారిత్వసామాన్యాదుపచారాత్తావపి వాచ-కావేవ। ఏవం ద్యోత్యవ్యంగ్యయోరర్థయోః ప్రత్యేయత్వసామాన్యా-దుపచారాత్ వాచ్యత్వమేవ॥ —వక్రోక్తి. 1.7 వృత్తి)

కళా చ సా కాంతిమతీ కళావతః।
త్వమస్య లోకస్య చ నేత్రకౌముదీ ॥78

నిత్యకాంతిమహితయగు చంద్రరేఖ యొక్కటియే కపాలిసంగతయై యింతవఱకు శోచనీయయగుచుండెను ఇఁక నీవును కపాలిసంగతినభిలషించు చుండుటచే నిపుడు శోచనీయలిరువురైనారు. ఇవి తపముచేయుచున్న పార్వతితో బ్రహ్మచారివేషముననున్న శివుఁడు పలికిన పలుకులు. ఇట గమనించవలసిన యంశమేమన - శివవాచకపదములెన్నియో యున్నను 'కపాలి'యను పదమునే కవి ఈసందర్భమున గ్రహించుటలో నెంతో విశేషమున్నది ఏవగింపును కలిగించు కపాలము మున్నగు వస్తువులసాహచర్యమున కపాలిపదప్రతిపాద్యుఁ డగు శివుఁడు బీభత్సరసాలంబనుడై యుపస్థితుడగును. ఇట్టిశివుని బడసి చంద్ర రేఖయే యుపహసనీయ యగుచుండ నీ పీపనికి సమకట్టుట తగదను కవివివ క్షితార్థమును చక్కగా వివరించుచున్నదీ కపాలి' శబ్దము ఇట్లెన్నియో శబ్దములు ఈ శ్లోకమున కవివివక్షితార్థవిశేషమును చెప్పఁజాలియున్నవి కావున-కావ్యమున శబ్దార్థము లిట్లుండవలెను ఇదియే (పర్యాయవక్రతారూపమగు)వక్రోక్తి

ఇట్లు చమత్కారవిశేషాధాయకమగు (వైదగ్ధ్యభంగీభణితిరూపమగు) వక్రోక్తియే కావ్యజీవితమని చెప్పుచు శబ్దార్థాలంకారములు త్రివిధధ్వనులు, అది యిదియనక సకలవిధకావ్యసామగ్రిని వక్రోక్తిగర్భమున జీర్ణీకరించెను.

ప్రధానముగా వక్రోక్తి యాఱువిధములుగా విభజింపఁబడినది.*

---

78 అత్ర పరమేశ్వరవాచకశబ్దసహస్రసంభవేఽపి "కపాలిన" ఇతి బీభత్సరసాలంబనవిభావవాచకః శబ్దో జుగుప్సాస్పదత్వేన ప్రయుజ్యమానః కామపి వాచకవక్రతాం విదధాతి। 'సంప్రతి' 'ద్వయం' చేత్యతీవ రమణీయం, యత్కిల పూర్వమేకా సైవ దుర్వ్యసన-దూషితత్వేన శోచనీయా సంజాతా సంప్రతి పునస్త్వయా తస్యా-స్తథావిధదురధ్యవసాయసహాయకమివారబ్ధమిత్యుపహస్యతే॥
(వక్రోక్తి 1 27 ఉదా వృత్తి)

కవివ్యాపారవక్రత్వప్రకారాః సంభవంతిషట్।
ప్రత్యేకం బహవో భేదాస్తేషాం విచ్ఛిత్తిశోభినః ॥
వర్ణవిన్యాసవక్రత్వం పదపూర్వార్ధవక్రతా ।
వక్రతాయాః పరో ఽప్యస్తి ప్రకారః ప్రత్యయాశ్రయః॥

1) వర్ణవిన్యాసవక్రత 2) పదపూర్వార్ధవక్రత 3) ప్రత్యయాశ్రయవక్రత 4) వాక్యవక్రత 5) ప్రకరణవక్రత 4) ప్రబంధవక్రత, యనునవి

1) వర్ణవిన్యాసవక్రత –

దీనిలో అనుప్రాసయమకాదిశబ్దాలంకారములు, పరుషోపనాగరికాది వృత్త్యపరపర్యాయములగు వైదర్భ్యాదిరీతులును అంతర్భవింపఁబడినవి [79]

2) పదపూర్వార్ధవక్రత :–

దీనిలో ననేకసూక్ష్మభేదములున్నవి వానిలో నెన్నియో ధ్వనిభేదము లంతర్భవించినవి ఎట్లన ?

'రూఢివైచిత్ర్యవక్రతలో అర్థాంతరసంక్రమితవాచ్యాదివ్యంగ్యములు, పర్యాయవక్రతలో శబ్దశక్తిమూలానురణనరూపవ్యంగ్యమును, విశేషణవక్రతలో రసధ్వనియు, ఉపచారవక్రతలో లక్షణామూలకధ్వనులే కాక రూపకా–ప్రస్తుతప్రశంసాద్యలంకారములును, వృత్తివైచిత్ర్యవక్రతాదులలో కృద్వృత్త్యాదులచే ద్యోత్యములగు ధ్వనిలన్నియును నంతర్భవింపఁబడినవి. [80]

---

వాక్యస్య వక్రభావోఽన్యో భిద్యతే యః సహస్రధా।
యత్రాలంకారవర్గోఽసౌ సర్వోఽప్యంతర్భవిష్యతి॥
వక్రభావః ప్రకరణే ప్రబంధేఽప్యస్తి యాదృశః।
ఉచ్యతే సహజాహార్యసౌకుమార్యమనోహరః॥ (వక్రోక్తి. 1.18-21)

79 క) ఏతదేవ చ వర్ణవిన్యాసవక్రత్వం చిరంతనేష్వనుప్రాస ఇతి ప్రసిద్ధమ్॥
(వక్రోక్తి 1 41 ఉదాహరణవృత్తి)

ఖ) "వర్ణచ్ఛాయానుసారేణ గుణమార్గానువర్తినీ।
వృత్తివైచిత్ర్యయుక్తేతి సైవ ప్రోక్తా చిరంతనైః।
యమకం నామ కోఽప్యస్యాః ప్రకారః పరికీర్తితః॥" (వక్రోక్తి 1 5,7 )

80. క) ఏషా చ రూఢివైచిత్ర్యవక్రతా ప్రతీయమానధర్మబాహుల్యాత్ బహుప్రకారా భిద్యతే। తచ్చ స్వయముత్ప్రేక్షణీయమ్॥
(వక్రోక్తి 2 30 ఉదా. వృత్తి -

ఖ) ఏష ఏవ చ (పర్యాయవక్రతాప్రకారఏవ) శబ్దశక్తి మూలానురణన రూపవ్యంగ్యస్య పదధ్వనేర్విషయః। బహుమచైవంవిధేషు సత్సు వాక్యధ్వనేర్వా। (వక్రోక్తి 2 35 ఉదా. వృత్తి )

3) ప్రత్యయాశ్రయవక్రత–
దీనిలో సుప్తిఙ్వచనసంఖ్యాకృదాదిప్రత్యయములచె ద్యోత్యములగు ధ్వనులన్నియు నిమిడియున్నవి.

4) వాక్యవక్రత–
దీనిలో నలంకారవర్గమంతయు లీనమొనర్పఁబడినది [81]

5) ప్రకరణతవక్రత–
రసానుకూలకథావస్తుసంవిధానమున కగు నామాంతరమిది

---

గ) సోఽయముపచారవక్రతాప్రకారః సత్కవిప్రవాహే సహస్రశః సంభవతీతి సహృదయైః స్వయమేవోత్ప్రేక్షణీయః॥
(వక్రోక్తి 2 47 ఉదా వృత్తి.)

ఘ) తేన రూపకాదేరలంకరణకలాపస్య సకలస్యైవ ఉపచారవక్రతా జీవితమిర్థ్యః ॥ (వక్రోక్తి. 2 . 48 ఉదా వృత్తి)

ఙ) ఆదిగ్రహణాదప్రస్తుతప్రశంసాప్రకారస్య కస్యచిదన్యాపదేశలక్షణ–స్యోపచారవక్రతైవ జీవితత్వేన లక్ష్యతే ॥
(వక్రోక్తి 2 49 ఉదా. వృత్తి)

చ) ఏతదేవ విశేషణవక్రత్వం నామ ప్రస్తుతౌచిత్యానుసారి సకల-సత్కావ్యజీవితత్వేన లక్ష్యతే యస్మాదనేనైవ రసః పరాం పరిపోషపదవీమవతార్యతే ॥ (వక్రోక్తి 2 . 55 ఉదా వృత్తి)

ఛ) "స్వమహిమ్నా విధీయంతే యేన లోకోత్తరశ్రియః ।
రసస్వభావాలంకారాస్తద్విధేయం విశేషణమ్ ॥'
(వక్రోక్తి. 2 . 57 కారికా )

81 వాక్యస్య వక్రభావోఽన్యో భిద్యతే యః సహస్రధా।
యత్రాలంకారవర్గోఽసౌ సర్వోఽప్యంతర్భవిష్యతి॥
(వక్రోక్తి - 2 . 19 కా)

6) ప్రబంధవక్రత–

ఇతివృత్తికథాయాతప్రసిద్ధరసమును త్యజించి రమ్యమగు రసాంతరమును నిర్వహించుట [82]

ఇట్లు వక్రతాప్రకారములచేతనే ధ్వన్యలంకారాదుల నన్నింటిని గతార్థమొనరించెను

వక్రోక్తిప్రాచీనత:-

వక్రోక్తియను వ్యవహార మీనాటిది కాదు- భామహపూర్వవర్తులగు కవులరచనలలో నీపదము 'భఙ్గ్యంతరాభిధాన' మనునర్థమున ప్రయుక్తమయినది[83] కావుననే భామహుఁడు వక్రోక్తి సకలాలంకారవ్యాపియై యున్నదనియు వక్రోక్తి లేకున్న నేదియు శోభించదనియు, వాక్కునకు వన్నెతెచ్చునది వక్రోక్తియే కాక మఱేదియు లేదనియు అతిశయోక్తియే వక్రోక్తియనియు, దాని గొప్పతనమునుటంకించియుండెను [84] దండియు ఆనందవర్ధనాదులును ఇట్లే

---

82 ఇతివృత్తాన్యథావృత్తరససంపదుపేక్షయా।
రసాంతరేణ రమ్యేణ యత్ర నిర్వహణం భవేత్॥
తస్యా ఏవ కథామూర్తేరామూలోన్మీలితశ్రియః।
వినేయానందనిష్పత్త్యై సా ప్రబంధస్య వక్రతా॥
(వక్రోక్తి 4 . 16, 17 కారికా )

83 క) "వక్రోక్తినిపుణేన విలాసిజనేన"
"ఏషాఽపి బుధ్యతే ఏతావతీ వక్రోక్తిః" —బాణభట్ట (కాదంబరీ)

ఖ) సాపత్న్యః ప్రథమావరాధ సమయే సఖ్యోపదేశం వినా।
నో జానాతి సవిభ్రమాంగవలనావక్రోక్తిసంసూచనం॥
(అమరుకశతకం, శ్లో, 20)

గ) "వక్రోక్తిశూన్యం చ యత్" —మనోరథకవి.
(ధ్వన్యాలోకోద్ధృత శ్లోక. ప్రథమోద్యోత.)

84. క) సైషా సర్వత్ర వక్రోక్తి రనయాఽర్థో విభావ్యతే।
యత్నోఽస్యాం కవినా కార్యః కోఽలంకారోఽనయా వినా॥
—భామహ. (కావ్యా. 2.85)

అతిశయోక్త్యపరపర్యాయమగువక్రోక్తియొక్క చమత్కారాతిశయపరిపోష మును సకలాలంకారవ్యాపిత్వమును గుర్తించిరి [85]

ఈ వక్రోక్తి, శ్లేషచే మఱింత చమత్కారకారియగునని దండి [86] వచిం

---

ఖ) న నితాంతాదిమాత్రేణ జాయతే చారుతా గిరామ్।
వక్రాభిదేయశబ్దోక్తిరిష్టా వాచామలంకృతిః॥
—భామహ. (కావ్యా 1 36)

గ) వాచాం వక్రార్థశబ్దోక్తిరలంకారాయ కల్పతే॥
—భామహ (కావ్యా 5 66)

ఘ) "ఇత్యేవమాదిరుదితా గుణాతిశయయోగతః।
సర్వైవాతిశయోక్తిస్తు తర్కయేత్తాం యథాగమమ్॥
సైషా సర్వైవ వక్రోక్తిః॥" భామహ (కావ్యా 2 84, 85)

85 క) అలంకారాంతరాణామప్యేకమాహుః పరాయణమ్।
వాగీశమహితాముక్తిమిమామతిశయాహ్వయామ్॥
—దండి (కావ్యా 2 218)

ఖ) యతః ప్రథమం తావదతిశయోక్తిగర్భతా సర్వాలంకారేషు శక్య-క్రియా। కృతైవ చ సా మహాకవిభిః కామపి కావ్యచ్ఛవిం పుష్యతీతి కథం హ్యతిశయయోగితా స్వవిషయౌచిత్యేన క్రియమాణా సతీ కావ్యే నోత్కర్షమావహేత్? భామహేనాప్యతియోక్తిలక్షణే యదుక్తమ్— "సైషా సర్వత్ర వక్రోక్తిః కోఽలంకారోఽనయా వినా॥" ఇతి॥ (ధ్వన్యా. 3 37 వృత్తి)

గ) ఏవంవిధే చ సర్వత్ర విషయేఽతిశయోక్తిరేవ ప్రాణత్వే నావతిష్ఠతే' తాం వినా ప్రాయేణాలంకరణత్వాయోగాదితి॥
— హేమచంద్ర. (కావ్యాను. 6 11 సూ. వృత్తి)

ఘ) అలంకరణత్వాయోగాదితి। తథాచాహ - "సైషా సర్వత్ర వక్రోక్తిః ... .. కోఽలంకారోఽనయావినా॥" ఇతి॥
—(కావ్యాను. 6 11 సూత్రవృత్తివ్యాఖ్య)

86 శ్లేషః సర్వాసు పుష్ణాతి ప్రాయో వక్రోక్తిషు శ్రియమ్॥
—దండి (కావ్యా 2 . 360)

చఁగా రుద్రటుఁడు[87] వక్రోక్తినొక ప్రత్యేకాలంకారముగానెంచి శ్లేషకాకువులచె ద్వైవిధ్యము కల్పించెను ఇట్టి వక్రోక్తి సర్వాలంకారవ్యాపిత్వరూపార్థమును కోల్పోయి మమ్మటాదులలో [88] నొకయలంకారముగానే నిలిచినది

భామహాదులు సకలాలంకారవ్యాపిగా పేర్కొనిన వక్రోక్తియే కుంతకునిచేతిలో మూడుపూవులాఱుకాయలు కాచినదై విలసిల్లినది

కావుననే రాఘవపాండవీయ(సంస్కృతకావ్య)కర్తయగు కవిరాజు (1200AD) సుబంధుబాణభట్టులును తానును వక్రోక్తిమార్గనిపుణులమని పేర్కొనెను [89]

ఇంతగా వక్రోక్తిని తీర్చిదిద్దినకుంతకుఁడు ధ్వనిని వక్రోక్తికతీతముగా నున్నట్లు గుర్తించక తప్పలేదు రూఢివైచిత్ర్యవక్రతను నిర్వచించు[90] "ఈ

---

87, "వక్త్రా తదన్యథోక్తం వ్యాచష్టే చాన్యథా తదుత్తరదః
వచనం తత్పదభంగైర్జ్ఞేయా సా శ్లేషవక్రోక్తిః॥"
విస్పష్టం క్రియమాణాదక్లిష్టా స్వరవిశేషతో భవతి।
అర్థాంతరప్రతీతిర్యత్రాసౌ కాకువక్రోక్తిః॥
—రుద్రట (కావ్యా 2 14, 16)

88. క) యదుక్తమన్యథా వాక్యమన్యథాఽన్యేన యోజ్యతే।
శ్లేషేణ కాక్వా వా జ్ఞేయా సా వక్రోక్తి స్తథా ద్విధా॥
—మమ్మట (కావ్యప్రకాశ 9 . 78)

ఖ) అన్యస్యాన్యార్థకం వాక్యమన్యథా యోజయేద్యది ।
అన్యః శ్లేషేణ కాక్వా వా సా వక్రోక్తిస్తతో ద్విధా॥
—విశ్వనాథ (సా ద 10 9)

89. "సుబంధుర్బాణభట్టశ్చ కవిరాజ ఇతి త్రయః।
వక్రోక్తిమార్గనిపుణా శ్చతుర్థో నోపపద్యతే॥"
(కవిరాజరాఘవపాండవీయం 1 4)

90. యత్ర రూఢే రసంభావ్యధర్మాధ్యారోపగర్భతా।
సద్ధర్మాతిశయారోపగర్భత్వం వా ప్రతీయతే॥
లోకోత్తరతిరస్కారశ్లాఘ్యోత్కర్షాభిధిత్సయా।
వాచ్యస్య సోచ్యతే కాఽపి రూఢివైచిత్ర్యవక్రతా॥ (వక్రోక్తి 2.8, 9)

యర్థాంతరమును బోధింప శబ్దములకు వాచకతాశక్తి లేదు కాన "స్ఫురింపఁ జేయు"నంటిని. తదనుగుణముగా కారికలో 'ప్రతీయతే' అనుపదము నివేశింపఁ బడినది ఈ విషయమున వ్యంగ్యవ్యంజకభావముండునని ధ్వనికారులు నొక్కి చెప్పి యుండుటచే నేనిఁక వివరింపఁబనిలేదు [91] అని చెప్పుటచే రూఢివైచిత్ర్య వక్రతలో వ్యంగ్యవ్యంజకభావమొప్పుకొనినట్లయినది కదా!

ఉన్నదానిని కాదనుట నెవరితరమగును [92] భామహోద్భటప్రభృతులగు నాలంకారికులును లోకోత్తరచమత్కారాపాదకమగు నొకయర్థమున్నదని గుర్తించియే యున్నారు కాని దానిని ధ్వనియనుసమాఖ్యతోఁగాక పర్యాయో క్తాదినామముల వ్యవహరించిరి. ఇట్లేదోవిధమున ప్రతీయమానార్థమునందఱును గుర్తించియుండుటచేతనే అది సహృదయశ్లాఘాపాత్రమయినది

ఔచిత్యమతము.-

ఇఁక క్షేమేంద్రుఁడు ఈప్రతీయమానార్థము సహృదయశ్లాఘ్యత నొందుటకు కారణమౌచిత్యమని భావించి ఔచిత్యమే కావ్యమునకు జీవితమని

---

91 'ప్రతీయతే'ఇతి క్రియాపదవైచిత్ర్యస్యాయమభిప్రాయో యదేవంవిధే విషయే శబ్దానాం వాచకత్వేన న వ్యాపారః, అపితు వస్త్వంతరవత్ ప్రతీతికారిత్వమాత్రేణేతి యుక్తియుక్తమప్యేతదిహ నాతిప్రతన్యతే, యస్మాత్ ధ్వనికారేణ వ్యంగ్యవ్యంజకభావోఽత్ర సుతరాం సమర్థిత- స్తత్కిం పౌనరుక్త్యేన॥ (వక్రోక్తి 2 8, 9, వృత్తి)

92. ధ్వనికారాత్ ప్రాచీనైర్భామహోద్భటప్రభృతిభిః స్వగ్రంథేషు కుత్రాపి ధ్వనిగుణీభూతవ్యంగ్యాదిశబ్దా న ప్రయుక్తా ఇత్యేతావతైవ తైర్ధ్వన్యాదయో న స్వీక్రియంత ఇత్యాధునికానాం'వాచోయుక్తి'రయుక్తైవ, యతః సమాసోక్తివ్యాజస్తుత్యప్రస్తుతప్రశంసాద్యలంకారనిరూపణే కియంతోఽపి గుణీభూతవ్యంగ్యభేదాస్తైరపి నిరూపితాః। అవరశ్చ సర్వోఽపి వ్యంగ్య- ప్రపంచః పర్యాయోక్తకుక్షౌ నిక్షిప్తః। న హ్యనుభవసిద్ధోఽర్థో బాలేనా- ప్యపహ్నోతుం శక్యతే॥ (రసగం ద్వితీ. పర్యాయోక్తప్రకరణ.)

పేర్కొనెను [93] ఔచిత్యమే లేనిది రసగుణాలంకారాదులేవియును శోభిల్ల వనియు, [94] ఎయ్యది దేనికెట్లుతగియుండునో, అట్లది దానికి తగియుండుటయే ఔచిత్యమనియు [95] వివరించుచు ఔచిత్యమును కావ్యజీవితముగా స్థిరపఱిచెను

ఈ యౌచిత్యము పదవాక్యప్రబంధార్థములయందును, గుణాలంకార రసములయందును క్రియాకారకలింగవచనవిశేషణోపసర్గనిపాతములయందును అదియిదియననేల కావ్యాంశములన్నింటియందును వ్యాపించియుండునని చెప్పి ఔచిత్యప్రకారములనిరువదేడింటిని నిర్దేశించెను [96]

---

**93.** కావ్యస్యాలమలంకారైః కిం మిథ్యాగుణితైర్గుణైః।
యస్యజీవితమౌచిత్యం విచింత్యాపి న దృశ్యతే॥
అలంకారా స్త్వలంకారా గుణా ఏవ గుణాః సదా।
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్॥
(ఔచిత్యవిచారచర్చ. 4, 5 శ్లో)

**94** క) కంఠే మేఖలయా నితంబఫలకే తారేణ హారేణ వా
పాణౌ నూపురబంధనేన చరణే కేయూరపాశేన వా।
శౌర్యేణ ప్రణతే రిపౌ కరుణయా నాయాంతి కే హాస్యతాం
ఔచిత్యేన వినా రుచిం ప్రతనుతే నాలంకృతి ర్నో గుణాః॥
(ఔచిత్య - 6 శ్లోకవృత్తి)

ఖ) ఉచితస్థానవిన్యాసాదలంకృతిః రలంకృతిః
ఔచిత్యాదచ్యుతా నిత్యం భవంత్యేవ గుణా గుణాః॥ (ఔచిత్య-6 శ్లో)

**95.** ఉచితం ప్రాహురాచార్యాః సదృశం కిల యస్య యత్।
ఉచితస్య హి యో భావ స్తదౌచిత్యం ప్రచక్షతే॥ (ఔచిత్య 7 కా)

**96.** పదే వాక్యే ప్రబంధార్థే గుణేఽలంకరణే రసే।
క్రియాయాం కారకే లింగే వచనే చ విశేషణే॥
ఉపసర్గే నిపాతే చ కాలే దేశే కులే వ్రతే।
తత్త్వే సత్త్వేఽభిప్రాయే స్వభావే సారసంగ్రహే॥
ప్రతిభాయామవస్థాయాం విచారే నామ్న్యథాశిషి।
కావ్యస్యాంగేషు చ ప్రాహురౌచిత్యం వ్యాపి జీవితమ్॥
(ఔచిత్య. శ్లో. 8_10)

ఔచిత్యవిచార ప్రాచీనత —

భరతముని మొదలుకొని భామహదండిధ్వనికారాదులందఱును ఔచిత్య మహత్తను గుర్తించియే యున్నారు

భరతుఁడు[97] తననాట్యశాస్త్రమున నాట్యమన లోకులస్వభావము ననుకరించుటయే యనియు కావున నానాశీలురగు ప్రజలశీలమును పరిశీలించుట నాట్యమున ముఖ్యమనియు చెప్పుటచే ఏది దేనికి తగినదో అది దాని యౌచిత్యమనువిషయము పరోక్షముగా గుర్తించినట్లేయయినది [98] భామహుఁడు ఆశ్రయ సౌందర్యమువలన నేదియైనను కమలాక్షులకన్నుల నాశ్రయించియున్న నల్లని కాటుకవలె శోభించుననియు, ఆయాతావులలోని దురుక్తముకూడ కూర్పు యందలినేర్పుతో పుష్పమాలికలో నక్కడక్కడ చొప్పించిన నల్లని యాకుల రేకులవలె రాణించుననియును పలుకుట యథాస్థానవినివేశితములయియే యలంకారాదులు శోభిల్లునను భావము మనముననిడియే పలికినట్లగుటచే ఔచిత్యమును వివరించినట్లే యయినది కదా। దండియు[99] ఉపమాదోషముల విచారించుసందర్భమున ధీమంతులకుద్వేగజనకముకానివిధముగనున్న భిన్నలింగ వచనములు హీనాధికత్వములును దోషములు కావని చెప్పుటయు, ఔచిత్యమే ఉపమాదోషనిర్ణయమున హేతువని చెప్పక చెప్పినట్లేయయినది.

---

97. నానాశీలాః ప్రకృతయః శీలం నాట్యే ప్రతిష్ఠితమ్।
తస్మాల్లోకః ప్రమాణం హి జ్ఞేయం నాట్యం ప్రయోక్తృభిః॥
(నాట్యశాస్త్ర 26 . 129)

98. కించిదాశ్రయసౌందర్యాద్ధత్తే శోభామసాధ్వపి।
కాంతావిలోచనన్యస్తం మలీమసమివాంజనమ్॥
సన్నివేశవిశేషాత్తు దురుక్తమపి శోభతే।
నీలం పలాశమాబద్ధమంతరాళే స్రజామివ॥
(భామహకావ్యా. 1 , 55, 54)

99 న లింగవచనే భిన్నే న హీనాధికతే అపి।
ఉపమాదూషణాయాలం యత్రోద్వేగో న ధీమతామ్॥
విరోధః సకలోఽప్యేష కదాచిత్ కవికౌశలాత్।
ఉత్క్రమ్య దోషగణనాం గుణవీథీం విగాహతే॥
(దండికావ్యా. 2 51, 3 179)

మఱియును సకలవిరోధములును కవికౌశలమున నొకప్పుడు దోషములుకాక గుణములే యగునని వివరించుచు ఔచిత్యమునకుఁగల గొప్పతనమును గుర్తించియే యున్నాడు

ఇట్లే ఆనందవర్ధనాచార్యులును "అనౌచిత్యాదృతే నాన్యద్ రసభంగస్య కారణమ్। ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా॥" (ధ్వన్యా 3 14కా వృత్తి) అనఁగా రసభంగమునకు ప్రధానకారణము అనౌచిత్యమేయని చెప్పి రసమునను [100] అలంకారమునను [101] వక్తృవాచ్యములయందును [102] సంఘట [103]

---

100. విరోధిరససంబంధివిభావాదిపరిగ్రహః ।
విస్తరేణాన్వితస్యాపి వస్తునోఽన్యస్య వర్ణనం॥
అకాండ ఏవ విచ్ఛిత్తిరకాండే చ ప్రకాశనం।
పరిపోషం గతస్యాపి పౌనఃపున్యేన దీపనం॥
రసస్య స్యాద్విరోధాయ వృత్త్యనౌచిత్యమేవ చ॥ (ధ్వన్యా 3 18, 20)

101 "అలంకృతీనాం శక్తావప్యానురూప్యేణ యోజనమ్।
ప్రబంధస్య రసాదీనాం వ్యంజకత్వే నిబంధనమ్॥" (ధ్వన్యా 3 14)
"ధ్వన్యాత్మభూతే శృంగారే యమకాదినిబంధనమ్।
శక్తావపి ప్రమాదిత్వం విప్రలంభే విశేషతః॥
రసాక్షిప్తతయా యస్య బంధః శక్యక్రియో భవేత్।
అపృథగ్యత్ననిర్వర్త్యః సోఽలంకారో ధ్వనౌ మతః॥
ధ్వన్యాత్మభూతే శృంగారే సమీక్ష్య వినివేశితః।
రూపకాదిలంకారవర్గ ఏతి యథార్థతామ్॥" (ధ్వన్యా 2.15, 16, 17)

102. "తన్నియమే హేతురౌచిత్యం వక్తృవాచ్యయోః॥ (ధ్వన్యా 3 6 కారికా)

103. విషయాశ్రయమప్యన్యదౌచిత్యం తాం నియచ్ఛతి।
కావ్యప్రభేదాశ్రయతః స్థితా భేదవతీ హి సా॥
ఏతద్యథోక్తమౌచిత్యమేవ తస్యా నియామకమ్।
సర్వత్ర గద్యబంధేఽపి ఛందోనియమవర్జితే॥
రసబంధోక్తమౌచిత్యం భాతి సర్వత్ర సంశ్రితా।
రచనా విషయాపేక్షం తత్తు కించిద్విభేదవత్॥ (ధ్వన్యా 3 7, 8, 9)

నాదులయందును ఇతివృత్తమునందును [104] కథానిర్వహణమునందును [105] ఉత్తమమధ్యమాధములును దివ్యమానుషులును అగు నాయకులస్వభావవర్ణన యందును[106] ఔచిత్యము ముఖ్యముగా పాటించవలయునని వివరించి యున్నారు

కావుననే రసపరిపోషమునకు కావలసిన సామగ్రి యెంతయున్నను అనుచితముగా ప్రవర్తిల్లినచో రసము రసాభాసముగను, భావము భావాభాసము గను పేర్కొనబడినవి [107]

ఇట్లనౌచిత్యము ప్రధానముగా రసభంగ హేతువుగా పేర్కొనబడినదేకాని ఔచిత్యము కావ్యజీవితమని పేర్కొనబడియుండలేదు

కాని "ఔచిత్యమే కావ్యజీవిత"మని సోపపత్తికముగా వివరించినవాఁడు క్షేమేంద్రుడే అయినను ధ్వనిసంప్రదాయమునకును ఔచిత్యసంప్రదాయ

---

104 కవినా ప్రబంధముపనిబధ్నతా సర్వాత్మనా రసపరతంత్రేణ భవితవ్యం తత్రేతివృత్తే యది రసాననుగుణాం స్థితిం పశ్యేత్, తాం భంక్త్వాఽపి స్వతంత్రతయా రసానుగుణం కథాంతరముత్పాదయేత్। న హి కవే రితివృత్తమాత్రనిర్వహణేన కించిత్ ప్రయోజనమ్। ఇతిహాసాదేవ తత్సిద్ధేః॥ (ధ్వన్యా 3 14 కా వృత్తి)

105. ప్రబంధోఽపి రసాదీనాం వ్యంజక ఇత్యుక్తం, తస్య వ్యంజకత్వే నిబంధనం ప్రథమం తావత్ 'విభావభావానుభావసంచార్యౌచిత్యచారుణః కథాశరీరస్య విధిః' యథాయథం ప్రతిపిపాదయిషితరసభావాద్యపేక్షయా య ఉచితో విభావో భావోఽనుభావః సంచారీ వా తదౌచిత్యచారుణః కథాశరీరస్య విధిః వ్యంజకత్వే నిబంధనమేకమ్॥
(ధ్వన్యా 3.14 కా వృత్తి)

106 భావౌచిత్యం తు ప్రకృత్యౌచిత్యాత్। ప్రకృతిర్హ్యుత్తమమధ్యమాధమభావేన దివ్యమానుషాదిభావేన చ విభేదినీ॥ (ధ్వన్యా. 3 14 కా వృత్తి)

107 క) 'తదాభాసా అనౌచిత్యప్రవర్తితాః॥' (కావ్య 4 49 సూ)

ఖ) ఆభాసా రసభావానామనౌచిత్యప్రవర్తనాత్॥ (అలం మహో. 3 53)

మునకును వాస్తవముగా నామమాత్రమున వివాదమే కాని వేఱొండు లేదు రెండును నొక్కటియే

దానికది తగియుండుటయే యౌచిత్యముకదా ? "అది"యనఁగా కావ్యమున సహృదయహృదయాహ్లాదకరమగు నర్థముగాక మఱేమగును ? ఆ యర్థము రసాదిరూపవ్యంగ్యార్థమే యగును కావుననే ధ్వనికారులు ధ్వనిని గుఱించి చెప్పినట్లు క్షేమేంద్రుఁడును తన యౌచిత్యము సకలకావ్యాంగవ్యాపి యని నుడివెను. [108]

ఇట్లు ధ్వనియనక ఔచిత్యమనుపేరున క్షేమేంద్రుఁడు ధ్వనికారుని యభిప్రాయమునే వివరించినట్లైనది [109]

'ధ్వని కావ్యాత్మ' ఎట్లగునో సంక్షేపముగా నిరూపింపబడినది

---

108 క) సుప్తిఙ్వచనసంబంధైః తథా కారకశక్తిభిః।
కృత్తద్ధితసమాసైశ్చ ద్యోత్యోఽలక్ష్యక్రమః క్వచిత్ (ధ్వన్యా 3 16)

ఖ) పదే వాక్యే ... ఔచిత్యం వ్యాపి జీవితం॥
(ఔచిత్య 8, 9, 10 కారికలు)

109. "Kshemendra s work is nothing more than a running commentary on Anandavardhana's thesis, and only an elaborate exposition of the implications contained in the latters statement"

(Bishnupada Bhattacharya's Commentary on Dhvanyaloka Part I Page 37)

—సాగరిక (అష్టమవర్షతృతీయ సంచిక వి సం. 2026) నుండి ఉద్ధృతము.



# ధ్వని - మనుచరిత్రము

## చతుర్థ - ప్రకరణము

## ధ్వన్యభావవాదములు - తత్ఖండనము

కావ్యాత్మగా స్థిరపడిన ధ్వని యానందవర్ధనునకు పూర్వము అస్తినాస్తి- విచికిత్సాహేతువై యుండెను

ధ్వని యనునది లేనే లేదనియును, ఉన్నను వాచ్యార్థమున కంటె నది విలక్షణము కాదనియును ఒకవేళ వాచ్యార్థమునకంటె వేఱుగా నున్నను, లక్షణచేత నది యేర్పడియుండుననియును అట్లు కాదేని ఇఁక దానిస్వరూపము నిర్వచింపనలవికాదనియును వివిధప్రవాదములు ప్రబలియుండెను [1]

**త్రివిధాభావవాదములు - ప్రథమ వికల్పము :-**

'ధ్వని'యనునదొకటి లేనే లేదనువారిట్లు వికల్పింతురు-

---

1 క) "కావ్యస్యాత్మా ధ్వనిరితిబుధైర్యః సమామ్నాతపూర్వః।
తస్యాభావం జగదురపరే భాక్తమాహుస్తమన్యే॥
కేచిద్వాచాం స్థితమవిషయే తత్త్వమూచుస్తదీయం
తేన బ్రూమః సహృదయమనఃప్రీతయే తత్స్వరూపమ్॥"(ధ్వన్యా 1 1)

ఖ) తత్ర సమయాపేక్షణేన శబ్దోఽర్థప్రతిపాదక ఇతి కృత్వా వాచ్య- వ్యతిరిక్తం నాస్తి వ్యంగ్యమ్। సదపి వా తదభిధావృత్త్యాక్షిప్తం శబ్దావగతార్థబలాకృష్టత్వాద్ భాక్తమ్। తదనాక్షిప్తమపి వా న వక్తుం శక్యం కుమారీష్వివ భర్తృసుఖమతద్విత్సు ఇతి త్రయ ఏవైతే ప్రధానవిప్రతిపత్తిప్రకారాః॥

—లోచన (ధ్వన్యా 1 1 కారికపై పుట 14)

గ) "శబ్దార్థౌ వపురస్య తత్ర విబుధైరాత్మాఽభ్యధాయి ధ్వనిః
చార్వాకైరివ కైశ్చిదస్య న పునః సత్తాఽపి సంభావ్యతే।
కర్తుం లక్షణమక్షమైరయమనిర్వాచ్యః పరైరుచ్యతే
భాక్తోఽన్యైః సముదీర్యతేఽస్య హి తతో బ్రూమః స్వరూపం వయమ్॥"
(ఏకావళీ. 1.13

కావ్యమునకు శబ్దార్థములు శరీరస్థానీయములగును ఆశబ్దార్థములనాశ్రయించి కావ్యమునకు వన్నెతెచ్చునవి గుణాలంకారములు, సంఘటనాశ్రయములగు వృత్తిరీతులును ఉన్నవి, కాని ధ్వని యనునదొకటి యున్నట్లింతవఱకును వినియుండలేదు కావున నిజమునకు ధ్వనియనునది లేనే లేదని కొందఱు వాదించిరి [2]

ద్వితీయాభావవికల్పము .-

[3] మఱికొందఱు — "సహృదయుల నానందపఱచు నేదేని "ధ్వని"యను పేరుననున్నను అది గుణాలంకారవృత్త్యాదిరూపమునఁ బ్రసిద్ధమగు కావ్య—

---

2 క) తదభావవాదినాం చామీ వికల్పాః సంభవంతి తత్ర కేచిదాచక్షీరన్-శబ్దార్థశరీరం తావత్ కావ్యమ్। తత్ర చ శబ్దగతాశ్చారుత్వహేతవో ఽనుప్రాసాదయః ప్రసిద్ధా ఏవ। అర్థగతాశ్చోపమాదయః। వర్ణ-సంఘనాధర్మాశ్చ యే మాధుర్యాదయః తేఽపి ప్రతీయంతే। తదన-తిరిక్తవృత్తయో వృత్తయోఽపి యాః కైశ్చిదుపనాగరికాద్యాః ప్రకాశితాః, తా అపి గతాః శ్రవణగోచరమ్। రీతయశ్చ వైదర్భీ-ప్రభృతయః। తద్వ్యతిరిక్తః కోఽయం ధ్వని ర్నామేతి।
(ధ్వన్యా 11 కా. వృత్తి)

ఖ) తత్రాభావవికల్పస్య త్రయః ప్రకారాః - "శబ్దార్థగుణాలంకారాణామేవ శబ్దార్థశోభాకారిత్వాత్ లోకశాస్త్రాతిరిక్తసుందరశబ్దార్థమయస్య కావ్యస్య న శోభాహేతుః కశ్చిదన్యోఽస్తి యోఽస్మాభిర్న గణిత ఇత్యేకః ప్రకారః॥ —లోచన (ధ్వన్యా 11)

గ) యతః శబ్దార్థశరీరే కావ్యే కేఽప్యనుప్రాసాదయః శబ్దమలంకుర్వన్తః కేచిదుపమాదయః పునరర్థం, మాధుర్యాదయశ్చ గుంఫధర్మా రసానుసారిణః కేచన తదాత్మవృత్తయోఽప్యుపనాగరికాద్యాః కాశ్చిత్ ప్రతీయంతే। నాన్యత్ కిమపి। తత్ కోఽయం నూతనః కావ్యప్రభేదో ధ్వనిర్నామ॥ (అలం మహో - 364 వృత్తి)

3. క) అన్యే బ్రూయుః నాస్త్యేవ ధ్వనిః। ప్రసిద్ధప్రస్థానవ్యతిరేకిణః కావ్యప్రకారస్య కావ్యత్వహానేః।సహృదయహృదయాహ్లాదిశబ్దార్థమయత్వమేవ కావ్యలక్షణమ్। న చోక్తప్రస్థానాతిరేకిణో మార్గస్య తత్ సంభవతి।

ప్రస్థానమునకు భిన్నమగుటంజేసి ఇట గణింప వీలులేదు నృత్తగీతాదులును సహృదయుల నానందపఱచునవియే అయినను వానిని కావ్యప్రస్థానమున గణించుటలేదు కదా! ధ్వనిమార్గానుయాయులగు నేకొందఱినో సహృదయులనుగా నేర్పఱుచుకొని వారియందు ప్రసిద్ధిఁగాంచినదని చెప్పి ధ్వనిని కావ్యమార్గమున తేఁజూచుచున్నారు అంతమాత్రమున నది విద్వాంసులందఱికిని సమ్మతమెట్లగును? ఒకఁడు బట్టకుఁగలగుర్తులేమో చెప్పి "కత్తి"యన నిట్లుండునని చెప్పెనట అంత తెలిసినవారతనితో - "కత్తియననిట్లుండదు, దీనిని ఒట్టయందురు" అని ఎంతచెప్పినను వినిపించుకొనక మేము కత్తియన నిట్టిదానినే యందుము కాని వేఱొండుకాదని చెప్పుచు నవ్వులపాలాయెనఁట—అట్లున్నది మీ ధ్వనివాదము" అని పరిహసించిరి 4

**తృతీయాభావవికల్పము :—**

వేఱొకరు మఱోవిధమున నిట్లు వ్యాఖ్యానించిరి— క్రొత్తగా ధ్వనియనునదొకటి యుండుట పొసఁగనే పొసఁగదు కావ్యసౌందర్యహేతువగునేదేని

---

న చ తత్సమయాంతఃపాతినః సహృదయాన్ కాంశ్చిత్ పరికల్ప్య తత్ప్రసిద్ధ్యా ధ్వనౌ కావ్యవ్యపదేశః ప్రవర్తితోఽపి సకలవిద్వన్మనోగ్రాహితామాలంబతే॥ (ధ్వన్యా 1 1 వృత్తి)

ఖ) మార్గస్యేతి। నృత్తగీతాక్షినికోచనాదిప్రాయస్యేత్యర్థః।
—లోచన. (ధ్వన్యా 1 1 వృత్తిపై)

గ) ప్రసిద్ధేతి। ప్రసిద్ధం ప్రస్థానం శబ్దార్థౌ తద్గుణాలంకారాశ్చేతి। ప్రతిష్ఠంతే పరంపరయా వ్యవహరంతి యేన మార్గేణ తత్ప్రస్థానమ్॥
—లోచన (ధ్వన్యా 1 1 వృత్తిపై)

4 యథా హి ఖడ్గలక్షణం కరోమీత్యుక్త్వా ఆతానవితానాత్మా ప్రక్రియమాణః సకలదేహాచ్ఛాదకః సుకుమారః చిత్రతంతువిరచితః సంవర్తనవివర్తనసహిష్ణురచ్ఛేదకః సుచ్ఛేద్య ఉత్కృష్టః ఖడ్గ ఇతి బ్రువాణః, పరైః పటః ఖల్వేవంవిధో భవతి న ఖడ్గ ఇత్యయుక్తతయా పర్యనుయుజ్యమాన ఏవం బ్రూయాత్-ఈదృశ ఏవ ఖడ్గో మమాభిమత ఇతి। తాదృగేవైతత్॥ —లోచన. (ధ్వన్యా. 1 1 వృత్తిపై)

వాగ్వైచిత్ర్యప్రకారము ధ్వనియను పేర నున్నను, అది ఏదో ఒక గుణముననో అలంకారముననో మఱియితరకావ్యప్రస్థానముననో అంతర్భవించును కాని దానిని ప్రత్యేకముగా పేర్కొనుట యసంగతము పేరు క్రొత్తగా నిడినంత మాత్రమున దాన నొదిగిన దేముండును. వాగ్వైచిత్ర్యప్రకారములెన్నో యుండును. వానిలో నిదియు నొకటి కావచ్చును. అంతమాత్రమున దాని ప్రత్యేకత యేమి భరతముని ఉపమాదులను మూడింటిని మాత్ర మర్థాలంకార ములను పేర్కొనఁగా ననంతరలాక్షణికులు వానిలోని సూక్ష్మభేదములను మఱె న్నింటినో వెలికిఁదీసిరి. అంతమాత్రమున వారు తమ గొప్పతనము చాటు కొనిరా? కుంభకారాదిపదసాదృశ్యమున నగరకారాదిపదములు ఊహింపఁబడు చున్నవి దాన విశేషమేమి? ఇట్లే ధ్వనియును ఈమాత్రముననే 'ధ్వని' 'ధ్వని' యని కన్నులుమూసికొని చిందులుత్రొక్కుటలోని యౌచిత్యము కానరాకున్నది కావున 'ధ్వని' యనునది ప్రవాదమే కాని నిజమునకు-'అది లేనే లే'దని నుడివిరి [5]

---

5 క) పునరపరే తస్యాభావమన్యథా కథయేయుః న సంభవత్యేవ ధ్వని-ర్నామాపూర్వః కశ్చిత్। కామనీయకమనతివర్తమానస్య తస్యోక్తే-ష్వేవ చారుత్వహేతుష్వంతర్భావాత్। తేషామన్యతమస్యైవ వా అపూర్వసమాఖ్యాకరణే యత్ కించన కథనం స్యాత్। కించ వాగ్వికల్పానామానంత్యాత్ సంభవత్యపి వా కస్మింశ్చిత్ కావ్యలక్షణ విధాయిభిః ప్రసిద్ధైరప్రదర్శితే ప్రకారలేశే "ధ్వనిర్ధ్వని"రితి య-దేతదలీకసహృదయత్వభావనాముకుళితలోచనైర్నృత్యతే. తత్ర హేతుం న విద్మః। సహస్రశో హి మహాత్మభిరన్యైరలంకారప్రకా-రాః ప్రకాశితాః ప్రకాశ్యంతే చ న చ తేషా మేషా దశా శ్రూయతే। తస్మాత్ ప్రవాదమాత్రం ధ్వనిః॥

(ధ్వన్యా 1.1 వృత్తి, పుట. 25, 26)

ఖ) అథ శోభాకారీ భవతి తర్హ్యస్మదుక్త ఏవ గుణే వాఽలంకారే వాఽన్తర్భవతి। నామాంతరకరణే తు కియదిదం పాండిత్యమ్। అథాప్యుక్తేషు గుణేష్వలంకారేషు వా నాంతర్భావః, తథాపి కంచిద్ విశేషలేశమాశ్రిత్య నామాంతరకరణముపమావిచ్ఛిత్తిప్రకారాణా-మసంఖ్యత్వాత్। తథాపి గుణాలంకారవ్యతిరిక్తత్వాభావ ఏవ। తావ-

**అభావవాదఖండనము :—**

ఇట్లు ధ్వని లేనే లేదనుట యసమంజసము [6] ప్రసిద్ధములగు రామాయణమహాభారతములయందును కాళిదాసాది మహాకవుల కావ్యములయందును వాచ్యార్థముగాక వేఱొక రమణీయార్థవిశేషము కావ్యసారభూతమయి భాసించుచునే యున్నది కన్ను ముక్కు మొగముతీరునకంటె విలక్షణముగా నంగనలలో లావణ్యమనునది భాసించుచున్నట్లు [7] కావున దానిని తెలియుటకు కేవలశబ్దార్థ పరిజ్ఞానము మాత్రము సరిపోదు అది యందఱికిని భాసింపక కేవలము కావ్యార్థభావనాశీలురగు నేకొందఱు సహృదయులకు మాత్రమే వేద్యమగుచుండును [8] అంతమాత్రమున నది లేకపోలేదు. శబ్దార్థములు కావ్యమునకు

---

న్మాత్రేణ చ కిం కృతమ్। అన్యస్యాపి వైచిత్ర్యస్య శక్యోత్ప్రేక్ష-త్వాత్। చిరంతనైర్హి భరతమునిప్రభృతిభిర్యమకోపమే ఏవ శబ్దార్థాలంకారత్వేనేష్టే। తత్ప్రపంచదిక్ప్రదర్శనం త్వన్యైరలంకారకారైః కృతమ్। తద్యథా- "కర్మణ్యణ్" ఇత్యత్ర కుంభకారాద్యుదాహరణం శ్రుత్వా స్వయం నగరకారాదిశబ్దా ఉత్ప్రేక్ష్యంతే। తావతా క ఆత్మని బహుమానః। ఏవం ప్రకృతేఽపీతి తృతీయః ప్రకారః॥

—లోచన (ధ్వన్యా 1 1 వృత్తిపై పుట 15)

6. క) అథ చ రామాయణమహాభారతప్రభృతిని లక్ష్యే ప్రసిద్ధవ్యవహారం లక్షయతాం సహృదయానామానందో మనసి లభతాం ప్రతిష్ఠామితి ప్రకాశ్యతే॥ (ధ్వన్యా. 1.1 వృత్తి)

ఖ) తదవిచారితవచనమేవ। యస్మాత్ సకలకాళిదాసప్రభృతి మహాకవి-కావ్యేషు సహృదయహృదయసంవేద్యం పరిస్ఫురత్యేవ వాచ్యాదర్థాదధికం కిమప్యర్థాంతరమ్॥ (అలం. మహో. 3 64 వృత్తి)

7 "ప్రతీయమానం పునరన్యదేవ వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్।
యత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తం విభాతి లావణ్యమివాంగనాసు॥"
(ధ్వన్యా 1.4)

8. "శబ్దార్థశాసనజ్ఞానమాత్రేణైవ న వేద్యతే।
వేద్యతే స తు కావ్యార్థతత్త్వజ్ఞైరేవ కేవలమ్॥
తద్వత్ సచేతసాం సోఽర్థో వాచ్యార్థవిముఖాత్మనామ్।
బుద్ధౌ తత్త్వార్థదర్శిన్యాం ఝటత్యేవావభాసతే॥" (ధ్వన్యా 1 7, 12)

శరీర స్థానీయములు ఆ శరీరమునకు వన్నె తెచ్చునవి గుణాలంకారాదులు. అయినను శరీరమున కాత్మ యనునదొకటి యుండవలెను గదా కావున కావ్యమునకు ఆ సహృదయశ్లాఘాపాత్రమగు రమణీయార్థవిశేషమే ధ్వనిసంజ్ఞితమగుచు ఆత్మస్థానీయమై యొప్పుచున్నది [9]

వాచ్యవ్యంగ్యములకుగల వైలక్షణ్యము :-

ఆయర్థవిశేషము (ధ్వని) వాచ్యార్థమునకంటెనెంతో విలక్షణముగా భాసించుచుండును వాచ్యార్థము విధిరూపముననుండఁగా నొకచోనది నిషేధరూపమున గోచరించుచుండును ఉదా (ధ్వన్యా-ప్రథ.)—

శ్లో॥ భ్రమ ధార్మిక! విస్రబ్ధః స శునకోఽద్య మారితస్తేన ।
గోదానదీకచ్ఛకుంజవాసినా దృప్తసింహేన ॥[10]

తాను తనప్రియునితో సంకేతస్థానమున నేకాంతముగా విహరించుట కంతరాయము కలుగఁజేయుచున్న ధార్మికునిపీడ వదలించుకొనుటకయి యొక నెఱజాణపలికిన ఈవలుకులలో-'స్వేచ్ఛగాఁదిరుగవచ్చు'నను విధియే వాచ్యార్థమై

---

9 క) "యోఽర్థః సహృదయశ్లాఘ్యః కావ్యాత్మేతి వ్యవస్థితః॥"
(ధ్వన్యా 1. 2)

ఖ) "శబ్దార్థశరీరం కావ్య' మితి యదుక్తం, తత్ర శరీరగ్రహణాదేవ కేనచిదాత్మనా తదనుప్రాణకేన భావ్యమేవ! . ..స ప్రతీయమాన భాగో వివేకిభిర్విశేషహేతుత్వాదాత్మేతి వ్యవస్థాప్యతే॥
-లోచన (ధ్వన్యా 1.2)

10. దీనియనువాదము చర్ల గణపతిశాస్త్రిగారి సాహిత్యసౌందర్యదర్శనము నుండి (పుట 92)—

గీ॥ ఇంక నోయి ధార్మికుఁడ! యథేష్టముగను
దిరుగు మిపుడె గోదావరీతీరభూమిఁ
బొదలఁ బెనఁగొనువనినున్న పొగరుసింహ
మెనసి యాకుక్కఁ జంపివైచినది లెమ్ము॥

యుండఁగా "సింహమున్నది జాగ్రత అటఁదిరుగకు"మను నిషేధము అర్థాంతరమై(ధ్వనియై) యున్నది [11]

ఇట్లే వాచ్యార్థమొకప్పుడు నిషేధరూపమున నుండఁగా నర్థాంతరము విధిరూపమున నుండును. వాచ్యార్థము విధినిషేధాన్యతరరూపమయియుండ నీ యర్థవిశేషము అనుభయరూపమయి యుండును కావున నీయర్థద్వయమునకు స్వరూపమున నెంతోభేదమున్నది

స్వరూపమననే కాక బోద్ధల (అధికారి) విషయముననను సంఖ్యావిషయముననను, నిమిత్తవిషయముననను, ప్రతీతివిషయముననను, కాలవిషయముననను, ఆశ్రయవిషయముననను ప్రతిపాద్య(బోద్ధవ్య)విషయముననను ఈరెండింటికి నెంతో భేదమున్నది [12]

2) బోద్ధృ (అధికారి) భేదము :–

వాచ్యార్థము తెలియవలెనన్న పదపదార్థమాత్ర పరిజ్ఞాన సామర్థ్యమున్న చాలును ఇఁక అర్థవిశేషము (వ్యంగ్యము) తెలియవలెనన్న దానికి తోడు సహృదయత కూడ నుండవలెను ఇట్టియర్థములను తెలియువారు విభిన్నులై యుందురు. [13]

---

11 క) కస్యాశ్చిత్ సంకేతస్థానం జీవితసర్వస్వాయమానం ధార్మికసంచరణాంతరాయదోషాత్ తదవలుప్యమానపల్లవకుసుమాదివిచ్ఛాయీకరణాచ్చ పరిత్రాతుమియముక్తిః॥ —లోచన. (ధ్వన్యా ప్రథ)

ఖ) క్వచిద్ వాచ్యే విధిరూపే ప్రతిషేధరూపం వస్తు ప్రతీయతే। యథా—
'భ్రమ ధార్మిక విస్రబ్ధః' ఇత్యాదిగాథా। అత్ర విస్రబ్ధో భ్రమేతి విధి
వాక్యే తత్ర నికుంజే సింహస్తిష్ఠతి త్వం చ శునోఽపి బిభేషి,
తస్మాత్ త్వయా తస్మిన్ న గంతవ్యమితి నిషేధః ప్రతీయతే॥
(అలం. మహో తృతీయ 273 ఉదా వృత్తి)

12 బోద్ధృస్వరూపసంఖ్యానిమిత్తకార్యప్రతీతికాలానామ్।
ఆశ్రయవిషయాదీనాం భేదాద్భిన్నోఽభిదేయతో వ్యంగ్యః॥(సా ద. 5 2)

13 వాచ్యార్థవ్యంగ్యార్థయోర్హి పదతదర్థమాత్రజ్ఞాననిపుణైర్వైయాకరణైరపి,
సహృదయైరేవ చ సంవేద్యతయా బోద్ధృభేదః॥ (సా.ద. 5 2 వృత్తి)

3) సంఖ్యాభేదము :—

"ప్రొద్దు గ్రుంకిన"దను మాటలోని వాచ్యార్థమందఱికిని ఒకేవిధము (ఒకటి)గా నుండును ఇఁక నర్థవిశేషములు ఆయాసందర్భముల పురస్కరించుకొని పలువురికి పలువిధములై (తలకొక విధమున అనగా ననేకమై) తోచును ఇది సంఖ్యాభేదము [14]

4) నిమిత్తభేదము -

వాచ్యార్థము శబ్దమునుచ్చరించినమాత్రమున తేటపడును, కాని ఆయర్థ విశేషము అట్టి ప్రతిభానైర్మల్యమున్ననే కాని తెలియరాదు ఇది నిమిత్తకృత భేదము [15]

5) కార్యభేదము :-

వాచ్యార్థమునకు పదార్థప్రతీతిని కలిగించుటయే ఫలము కాఁగా నిఁకఁ నాయర్థవిశేషమునకు(ధ్వనికి) చమత్కారము నొనగూర్చుటయే ఫలము, కాన కార్యమునను ఈరెంటికి బేదమున్నది- [16]

6) ప్రతీతిభేదము :-

ఇదియే ఈరెంటి ప్రతీతిలోగల ముఖ్యభేదముగా గమనించఁదగును [17]

7) కాలభేదము :-

మొదట వాచ్యార్థము తెలియును అటుపిమ్మటనే ఆయర్థవిశేషము (వ్యంగ్యము) స్ఫురించును. ఇట్లు కాలమునను భేదము గలదు [18]

---

14. 'గతోఽస్తమర్కః' ఇత్యాదౌ చ వాచ్యోఽర్థ ఏక ఏవ ప్రతీయతే। వ్యంగ్యస్తు తద్బోద్ధ్రాదిభేదాత్, క్వచిత్ 'కాంతామభిసర' ఇతి, 'గావో నిరుధ్యన్తా'మితి 'నాయకస్యాయమాగమనావసర'ఇతి 'సంతాపోఽధునా నాస్తీ' త్యాదిరూపేణానేక ఇతి సంఖ్యాభేదః॥ (సా ద 5 2 వృత్తి)

15. వాచ్యార్థః శబ్దోచ్చారణమాత్రేణ వేద్యః। ఏష తు తథావిధప్రతిభా-నైర్మల్యాదినేతి నిమిత్తభేదః॥ (సా ద 5.2 వృత్తి)

16 ప్రతీతిమాత్రకరణాత్ చమత్కారకరణాచ్చ కార్యభేదః॥ (సా ద 5 2 వృత్తి)

17 కేవలరూపతయా చమత్కారితయా చ ప్రతీతిభేదః॥ (సా ద 5 2 వృత్తి)

18. పూర్వపశ్చాద్భావేన చ కాలభేదః॥ (సా. ద. 5 2 వృత్తి)

8) ఆశ్రయభేదము :-

వాచ్యార్థము శబ్దమునే ఆశ్రయించియుండఁగా నీయర్థవిశేషము శబ్దమును తదేకదేశములగు ప్రకృతి ప్రత్యయాదులను వాచ్యలక్ష్యాద్యర్థములను శబ్దఘటకములగు వర్ణములను ఆశ్రయించియుండును ఇది ఆశ్రయకృతభేదము [19]

9) బోద్ధవ్యభేదము (సా.ద. 5.2) -

శ్లో॥ కస్య వా న భవతి రోషో దృష్ట్వా ప్రియాయాః సవ్రణమధరమ్।
సభ్రమరపద్మాఘ్రాయిణి ! వారితవామే ! సహస్వేదానీమ్ ॥*

ఈశ్లోకమునందలివాచ్యారము సకియనుద్దేశించినది-ఇఁక నర్థాంతర విశేషములేమో 'అయమభర్త' మన్నగు వారినుద్దేశించినవి. దీనినే బోద్ధవ్యబేదమనియు విషయ(ఉద్దేశ్య)బేదమనియు నందురు [20]

ఇంతేగాక ఒకచో వాచ్యార్థము నిందారూపమున నుండగా నీయర్థవిశే-షము స్తుతిరూపమున నుండును.

శ్లో॥ సర్వదా సర్వదోఽసీతి మిథ్యా సంస్తూయసే బుధైః।
నారయో లేభిరే పృష్ఠం న వక్షః పరయోషితః॥ [21]

ఓరాజా! నీవడగినదంతయునిచ్చువాడవని పొగడ్తలు గనినావు కాని అదంతయు బూటకమే శత్రువులకు వెన్నును పరకాంతలకు వక్షమును ఒకప్పుడును ఇచ్చియుండలేదుకదా!

---

19 శబ్దాశ్రయత్వేన శబ్దతదేకదేశతదర్థవర్ణసంఘటనాశ్రయత్వేన ఆశ్రయ-భేదః॥ (సా ద 5 2 వృత్తి)

* ఈ శ్లోకార్థవివరణము పూర్వము (పుట 60) చేయబడినది

20 సఖీతత్కాంతవిషయత్వేన విషయబేదః॥ (సా ద 5 2 వృత్తి)

21 క్వచిన్నిందాయాం స్తుతిరూపం యథా—సర్వదేతి। అత్ర త్వం సంగ్రామేషు న కదాచిత్ పరాఙ్ముఖోఽభూః, న చ పరస్త్రీర్మనసాఽపి జాతుచిత్ కామయస ఇతి స్తుతిర్గమ్యా॥ (అలం. మహో 3 279 ఉదా వృత్తి)

ఇట రాజనింద వాచ్యము కాని యర్థవిశేషము మాత్రము—"నేవెన్నడును యుద్ధపరాఙ్ముఖుఁడవు కానివాడవవు పరస్త్రీవిముఖుఁడవును" అని స్తుతిరూపము

ఇట్లు వాచ్యార్థమునకంటె విలక్షణముగా నొకానొక యర్థవిశేషము భాసించుచునే యున్నదికదా ! అదియే ధ్వనియను పేరున పరగుచు సహృదయ శ్లాఘాపాత్రమై యున్నది ఇట్లుండ ధ్వనియనునది లేనేలేదనుట ఎట్లు ?

**గుణాలంకారాదులలో ధ్వని యంతర్భవించదు —**

గుణాలంకారాదులు వాచ్యములే యగును కావున వాచ్యమునకంటె విలక్షణమగు నీధ్వని వానిలో నంతర్భవించుననుట ఎట్లు పొసఁగును? శబ్దార్థ రూపమగు కావ్యశరీరమునకు గుణాలంకారాదులు అంగములు ధ్వని దానికాత్మ స్థానీయమగుటచే అంగియు అలంకార్యమును. కావున గుణాలంకారాదులలో ధ్వనియంతర్భవించదు [22]

**ధ్వని సమాసోక్త్యాదులలో నంతర్భవించదు -**

'సమాసోక్తి'మున్నగునలంకారములలో ప్రతీయమానార్థమున్నను దానికి ప్రాధాన్యముండదు. అది వాచ్యార్థమునకే ఉపస్కారకమగుచుండును ఎట్లన ? ఉదా.— (ధ్వన్యా. ప్ర 109 పు)

---

22 క) వాచ్యవాచకమాత్రాశ్రయిణి ప్రస్థానే వ్యంగ్యవ్యంజకసమాశ్రయేణ వ్యవస్థితస్య ధ్వనేః కథమంతర్భావః? వాచ్యవాచకచారుత్వహేతవో హి తస్యాంగభూతాః, స త్వంగిరూప ఏవేతి ప్రతిపాదయిష్యమాణత్వాత్। పరికరశ్లోకశ్చాత్ర - "వ్యంగ్యవ్యంజకసంబంధనిబంధనతయా ధ్వనేః। వాచ్యవాచకచారుత్వహేత్వంతఃపాతితా కుతః॥

(ధ్వన్యా ప్ర. 107 పు)

ఖ) శబ్దార్థసౌందర్యతనోః కావ్యస్యాత్మా ధ్వనిర్మతః।
తేనాలంకార్య ఏవాసౌ నాలంకారత్వమర్హతి॥

(అలం. మహో. 3 64)

గ) అలంకార్యవ్యతిరిక్తశ్చాలంకారోఽభ్యుపగంతవ్యః, లోకే తథా సిద్ధత్వాత్। యథా - గుణివ్యతిరిక్తో గుణః। గుణాలంకారవ్యవహారశ్చ గుణిన్యలంకార్యే చ సతి యుక్తః॥ —లోచన. (ధ్వన్యా 26)

శ్లో॥ ఉపోఢరాగేణ విలోలతారకం
తథా గృహీతం శశినా నిశాముఖమ్।
యథా సమస్తం తిమిరాంశుకం తయా
పురోఽపి రాగాద్ గళితం న లక్షితమ్॥ [23]

ఈ [24]సమాసోక్త్యుదాహరణమున చంద్రోదయవర్ణనము ప్రస్తుతము. నాయికానాయకులవ్యవహారము ధ్వని, అయినను రాత్రిచంద్రులే ఆ నాయికా నాయకులని భావించుటచేతనే ఇట వాచ్యార్థమునకొక వన్నెవచ్చినది కావున నిచ్చటవ్యంగ్యార్థము వాచ్యార్థమునకే వన్నెదెచ్చునదియగుటచే నప్రధానము

రాత్రిచంద్రులయందు నాయికానాయకవ్యవహారసమారోపమున నిది సమాసోక్తియనుట తెలియనిదికాదు [25]

ఇట్లే ఆక్షేప-అనుక్తనిమిత్తవిశేషోక్తి-పర్యాయోక్తాదులయందును ప్రతీయ మానార్థమున్నను వాచ్యార్థోపస్కారకమే యగుచున్నది కాన నప్రధానము. వాచ్యవ్యంగ్యార్థములలో నేయర్థసౌందర్యము ఉత్కర్షాతిశయశాలియో, అదియే

---

23 దీనియాంధ్రానువాదము చర్ల గణపతిశాస్త్రిగారి సాహిత్యసౌందర్య-దర్శనమునుండి (పుట 98).—

క॥ తనముందె రాగమున జా
ఱిన చీఁకటి ముసుగుజాడ లెఱుఁగని రీతిఁ
అనురక్తుఁడు శశి మిను
కనుతారలుగల నిశాముఖంబు గ్రహించెఁ

24 ఇత్యాదౌ వ్యంగ్యేనానుగతం వాచ్యమేవ ప్రాధాన్యేన ప్రతీయతే, సమా-రోపితనాయికానాయకవ్యవహారయోర్నిశాశశినోరేవ వాక్యార్థత్వాత్॥
—ధ్వన్యా 1 13 కా. వృత్తి)

25. క) యత్రోక్తౌ గమ్యతేఽన్యోఽర్థస్తత్సమానవిశేషణైః।
సా సమాసోక్తిరుదితా సంక్షిప్తార్థతయా బుధైః॥
—భామహ (కావ్యా 2 79) / —లోచన (ధ్వన్యా ప్రథమ 109 పుట)

ఖ) "సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్॥"
(చంద్రాలోకః)

ఇట రాజనింద వాచ్యము కాని యర్థవిశేషము మాత్రము—"నేవెన్నడును యుద్ధపరాఙ్ముఖుఁడవు కానివాడవవు పరస్త్రీవిముఖుఁడవును" అని స్తుతిరూపము

ఇట్లు వాచ్యార్థమునకంటె విలక్షణముగా నొకానొక యర్థవిశేషము భాసించుచునే యున్నదికదా ! అదియే ధ్వనియను పేరున పరగుచు సహృదయ శ్లాఘాపాత్రమై యున్నది ఇట్లుండ ధ్వనియనునది లేనేలేదనుట ఎట్లు ?

**గుణాలంకారాదులలో ధ్వని యంతర్భవించదు.—**

గుణాలంకారాదులు వాచ్యములే యగును కావున వాచ్యమునకంటె విలక్షణమగు నీధ్వని వానిలో నంతర్భవించుననుట ఎట్లు పొసఁగును? శబ్దార్థ రూపమగు కావ్యశరీరమునకు గుణాలంకారాదులు అంగములు ధ్వని దానికాత్మ స్థానీయమగుటచే అంగియు అలంకార్యమును. కావున గుణాలంకారాదులలో ధ్వనియంతర్భవించదు [22]

**ధ్వని సమాసోక్త్యాదులలో నంతర్భవించదు -**

'సమాసోక్తి'మున్నగునలంకారములలో ప్రతీయమానార్థమున్నను దానికి ప్రాధాన్యముండదు అది వాచ్యార్థమునకే ఉపస్కారకమగుచుండును. ఎట్లన ? ఉదా.— (ధ్వన్యా ప్ర 109 పు)

---

22 క) వాచ్యవాచకమాత్రాశ్రయిణి ప్రస్థానే వ్యంగ్యవ్యంజకసమాశ్రయేణ వ్యవస్థితస్య ధ్వనేః కథమంతర్భావః? వాచ్యవాచకచారుత్వహేతవో హి తస్యాంగభూతాః, స త్వంగిరూప ఏవేతి ప్రతిపాదయిష్య-మాణత్వాత్। పరికరశ్లోకశ్చాత్ర - "వ్యంగ్యవ్యంజకసంబంధనిబం-ధనతయా ధ్వనేః। వాచ్యవాచకచారుత్వహేత్వంతఃపాతితా కుతః॥
(ధ్వన్యా ప్ర. 107 పు)

ఖ) శబ్దార్థసౌందర్యతనోః కావ్యస్యాత్మా ధ్వనిర్మతః।
తేనాలంకార్య ఏవాసౌ నాలంకారత్వమర్హతి॥
(అలం మహో. 3 64)

గ) అలంకార్యవ్యతిరిక్తశ్చాలంకారోఽభ్యుపగంతవ్యః, లోకే తథా సిద్ధ-త్వాత్। యథా - గుణివ్యతిరిక్తో గుణః। గుణాలంకారవ్యవహారశ్చ గుణిన్యలంకార్యే చ సతి యుక్తః॥ —లోచన. (ధ్వన్యా. 2 6)

శ్లో॥ ఉపోఢరాగేణ విలోలతారకం
తథా గృహీతం శశినా నిశాముఖమ్ ।
యథా సమస్తం తిమిరాంశుకం తయా
పురోఽపి రాగాద్ గళితం న లక్షితమ్॥ [23]

ఈ [24]సమాసోక్త్యుదాహరణమున చంద్రోదయవర్ణనము ప్రస్తుతము. నాయికానాయకులవ్యవహారము ధ్వని, అయినను రాత్రిచంద్రులే ఆ నాయికా నాయకులని భావించుటచేతనే ఇట వాచ్యార్థమునకొక వన్నె వచ్చినది కావున నిచ్చటివ్యంగ్యార్థము వాచ్యార్థమునకే వన్నె దెచ్చునదియగుటచే నప్రధానము

రాత్రిచంద్రులయందు నాయికానాయకవ్యవహారసమారోపమున నిది సమాసోక్తియనుట తెలియనిదికాదు [25]

ఇట్లే ఆక్షేప-అనుక్తనిమిత్తవిశేషోక్తి-పర్యాయోక్తాదులయందును ప్రతీయమానార్థమున్నను వాచ్యార్థోపస్కారకమే యగుచున్నది కాన నప్రధానము వాచ్యవ్యంగ్యార్థములలో నేయర్థసౌందర్యము ఉత్కర్షాతిశయశాలియో, అదియే

---

23 దీనియాంధ్రానువాదము చర్ల గణపతిశాస్త్రిగారి సాహిత్యసౌందర్య-దర్శనమునుండి (పుట 98) –

క॥ తనముందె రాగమున జా
ఱిన చీఁకటి ముసుగుజాడ లెఱుఁగని రీతిన్
అనురక్తుఁడు శశి మిను
కనుతారలుగల నిశాముఖంబు గ్రహించెన్

24 ఇత్యాదౌ వ్యంగ్యేనానుగతం వాచ్యమేవ ప్రాధాన్యేన ప్రతీయతే, సమా-రోపితనాయికానాయకవ్యవహారయోర్నిశాశశినోరేవ వాక్యార్థత్వాత్॥
–ధ్వన్యా. 1.13 కా వృత్తి )

25 క) యత్రోక్తౌ గమ్యతేఽన్యోఽర్థస్తత్సమానవిశేషణైః।
సా సమాసోక్తిరుదితా సంక్షిప్తార్థతయా బుధైః॥
–భామహ (కావ్యా 2 79) / –లోచన. (ధ్వన్యా ప్రథమ 109 పుట)

ఖ) "సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్॥॥
(చంద్రాలోకః)

ప్రధానముకదా! [26] దీపకాపహ్నుత్యలంకారములలో నుపమాలంకారము వ్యంగ్యముగా భాసించినను, వాచ్యాలంకారమే చమత్కారియగుటచే ప్రాధాన్యము నొందుచున్నది కాని వ్యంగ్యము కాదు. కావున నట్టియెడ దీపకమనియో అపహ్నుతియనియో వ్యవహరింతుము కాని ఉపమాలంకారధ్వనియని కాదు [27]

తేలినదేమన- వ్యంగ్యార్థము[28] ప్రాధాన్యము నొందిననే ధ్వనియగును. సమాసోక్త్యాదులలో వ్యంగ్యము వాచ్యానుగతమగుచు ప్రధానభావము నొందకుండుటచే "ధ్వని"యని వ్యవహరింప వీలులేదు కావున ధ్వని సమాసోక్త్యాదులలో నంతర్భవింపదు

**పర్యాయోక్తమున ధ్వని యంతర్భవించదు:-**

పర్యాయోక్తాలంకారమున వ్యంగ్యము ప్రధానముగానుండునని చెప్పి "భ్రమ ధార్మిక" అనునీమున్నగువాని నుదాహరణములుగా పేర్కొందురు కొందఱు అప్పుడు పర్యాయోక్తాలంకారమే మహావిషయమగు ధ్వనిలో నంతర్భవించును కాన ధ్వనియే పర్యాయోక్తమున నంతర్భవించుట ఎట్లు?[29]

---

26. చాతుత్వోత్కర్షనిబంధనా హి వాచ్యవ్యంగ్యయోః ప్రాధాన్యవివక్షా॥
(ధ్వన్యా 1 3 కా వృత్తి. పు 115)

27. యథా—దీపకాపహ్నుత్యాదౌ వ్యంగ్యత్వేనోపమాయాః ప్రతీతావపి ప్రాధాన్యేనావివక్షితత్వాత్ న తయా వ్యపదేశః; తద్వదత్రాపి ద్రష్టవ్యమ్॥
(ధ్వన్యా 1 13 కా వృత్తి పు 116)

28. క) వ్యంగ్యప్రాధాన్యే హి ధ్వనిః, న చైతత్ సమాసోక్త్యాదిష్వస్తి॥
(ధ్వన్యా 1 13 కా వృత్తి పు 108)

ఖ) "వ్యంగ్యస్య యత్రాప్రాధాన్యం వాచ్యమాత్రానుయాయనః।
సమాసోక్త్యాదయస్తత్రవాచ్యాలంకృతయః స్ఫుటాః॥
వ్యంగ్యస్య ప్రతిభామాత్రే వాచ్యార్థానుగమేఽపి వా।
న ధ్వనిర్యత్ర వా తస్య ప్రాధాన్యం న ప్రతీయతే॥
(ధ్వన్యా 1.13 వృత్తి 130 పుట.)

29. క) పర్యాయోక్తేఽపి యది ప్రాధాన్యేన వ్యంగ్యత్వం, తద్ భవతు నామ తస్య ధ్వనావంతర్భావః। న తు ధ్వనేస్తత్రాంతర్భావః। తస్య మహావిషయత్వేన అంగిత్వేన చ ప్రతిపాదయిష్యమాణత్వాత్।
(ధ్వన్యా. 1.13 వృత్తి, పు 118)

భామహాదులుదాహరించిన పర్యాయోక్తమున వ్యంగ్యమునకు ప్రాధాన్యము లేకుండుట[30] స్పష్టమేకదా!

కావున పర్యాయోక్తమున ధ్వని యంతర్భవింపదు

**అప్రస్తుత ప్రశంసలో ధ్వనియంతర్భవింపదు :-**

సామాన్యవిశేషభావమునే కాని కార్యకారణభావమునే కాని పురస్కరించుకొని ప్రవృత్తములగు అప్రస్తుతప్రశంసాభేదములలో వాచ్యవ్యంగ్యములు సమప్రధానములై యుండును కావున వానిలో ధ్వని యంతర్భవించదు- ఇక సారూప్యనిబంధనయగు అప్రస్తుతప్రశంసాభేదమున వ్యంగ్యమునకు ప్రాధాన్య

---

ఖ) యది తు -"అభిధీయతే' (భామహ 3 9) ఇత్యస్య, బలాద్ వ్యాఖ్యానం—"అభిధీయతే=ప్రతీయతే ప్రధానతయేతి" ఉదాహరణం చ భ్రమ ధార్మిక" (ధ్వన్యా 1 4 కా ఉదా) ఇత్యాది। తదాఽలంకారత్వమేవ దూరే సంపన్నమ్, ఆత్మతాయాం పర్యవసానాత్। తథాచ-అలంకారమధ్యే గణనా న కార్యా। భేదాంతరాణి చాస్య వక్తవ్యాని॥

—లోచన (ధ్వన్యా ప్రథ పు 118)

30 క) న పునః పర్యాయోక్తే భామహోదాహృతసదృశే వ్యంగ్యస్యైవ ప్రాధాన్యమ్। వాచ్యస్య తత్రోపసర్జనభావేనావివక్షితత్వాత్॥

(ధ్వన్యా 1 13 కా వృత్తి)

ఖ) పర్యాయోక్తం యదన్యేన ప్రకారేణాభిధీయతే।
వాచ్యవాచకవృత్తిభ్యాం శూన్యేనావగమాత్మనా॥

(ఉద్భటకావ్యా 4 6 లోచనోద్ధృతము పుట 117)

గ) భామహేన హ్యుదాహృతమ్—"గృహేష్వధ్వసు వా నాన్నం భుఙ్మహేయదధీతినః। విప్రా న భుంజతే-" (భామహ. 3 9) ఏతద్ధి భగవద్వాసుదేవవచనం పర్యాయేణ రసదానం నిషేధతి. యత్, స ఏవాహ 'తచ్చ రసదాననివృత్తయే" (భామహ 3 9) ఇతి। న చాస్య రసదాననిషేధస్య వ్యంగ్యస్య కించిచ్చారుత్వమస్తి యేన ప్రాధాన్యం శంక్యేత॥

—లోచన (ధ్వన్యా. 1 . 13 కా. వృత్తి)

మున్నను ధ్వని దానిలోనంతర్భవించదు మహావిషయమగు ధ్వనిలోనే ఈ యలంకారమంతర్భవించుట యుక్తము [31]

**వ్యాజస్తుతి-భావాలంకారములలోను ధ్వనియంతర్భవింపదు :-**

ఇట్లే వ్యాజస్తుతి-భావాలంకారములయందును వ్యంగ్యార్థమునకుఁ గల ప్రాధాన్యాప్రాధాన్యములను పురస్కరించుకొని విషయవిభాగవ్యవస్థ నిర్ణయింపఁదగును [32]

---

31 క) వ్యంగ్యస్య ప్రతిభామాత్రే వాచ్యార్థానుగమేఽపి వా।
న ధ్వనిర్యత్ర వా తస్య ప్రాధాన్యం న ప్రతీయతే॥
(ధ్వన్యా. 1 13 వృత్తి)

ఖ) యదా తు సారూప్యమాత్రవశేన అప్రస్తుతప్రశంసాయా మప్రకృత ప్రకృతయోః సంబంధ స్తదాప్యప్రస్తుతస్య సరూపస్యాభిధీయ మానస్య ప్రాధాన్యేనావివక్షాయాం ధ్వనావేవాంతఃపాతః ఇతరథా త్వలంకారాంతరమేవ" (ధ్వన్యా 1.13 వృత్తి, పు 128)

గ) "అధికారాదపేతస్య వస్తునోఽన్యస్య యా స్తుతిః।
అప్రస్తుతప్రశంసా సా త్రివిధా పరికీర్తితా॥" (భామహ 3 29)
అప్రస్తుతస్య వర్ణనం ప్రస్తుతాక్షేపిణ ఇత్యర్థః। స చాక్షేపస్త్రివిధో భవతి సామాన్యవిశేషభావాత్- నిమిత్తనిమిత్తిభావాత్ సారూప్యాచ్చ॥
—లోచన (ధ్వన్యా. 1 . 13 వృత్తిపై పుట 124)

32. క) ఉద్దేశే యదాదిగ్రహణం కృతం "సమాసోక్తి"త్యత్ర ద్వంద్వే, తేన వ్యాజస్తుతిప్రభృతిరలంకారవర్గోఽపి సంభావ్యమానవ్యంగ్యాను-ప్రవేశః సంభావితః। తత్ర సర్వత్ర సాధారణముత్తరం దాతుముప-క్రమతే - తదయమత్రేతి। కియద్వా ప్రతిపదం లిఖ్యతామితి భావః। తత్ర వ్యాజస్తుతిర్యథా—

"కిం వృత్తాన్తైః పరగృహగతైః కింతు నాహం సమర్థ-
స్తూష్ణీం స్థాతుం ప్రకృతిముఖరో దాక్షిణాత్యస్వభావః।
గేహే గేహే విపణిషు తథా చత్వరే పానగోష్ఠ్యా
మున్మత్తేవ భ్రమతి భవతో వల్లభా హంత ! కీర్తిః॥" ఇతి,

తేలినదేమన - ఏయలంకారమునను మహావిషయమగు ధ్వనియంత ర్భవించదు.

మఱియు[33] ధ్వని యలంకార్యము, కావ్యమునకాత్మస్థానీయమగుటచే నంగియును, అలంకారాదులు దానికంగములు

ఇట్లు "ధ్వనియనునది ప్రత్యేకముగా నొకటియుండఁగా లేనే లేదనుటయు, ఉన్నను అది అలంకారాదులలో సంతర్భవించుననుటయును అవిచారిత రమణీయమే అగును

---

అత్ర వ్యంగ్యం స్తుత్యాత్మకం యత్తేన వాచ్యమేవోపస్క్రియతే॥

"యస్య వికారః ప్రభవన్నప్రతిబంధస్తు హేతునా యేన।

గమయతి తమభిప్రాయం తత్ప్రతిబంధం చ భావోఽసౌ॥"

అత్రాపి వాచ్యప్రాధాన్యే భావాలంకారతా। యస్య చిత్తవృత్తివిశేషస్య సంబంధీ వాగ్వ్యాపారాదిర్వికారోఽప్రతిబంధో నియతః ప్రభవన్ తం చిత్తవృత్తివిశేష-రూపమభిప్రాయం యేన హేతునా గమయతి స హేతు ర్యథేష్టోపభోగ్యత్వాది-లక్షణోఽర్థో భావాలంకారః— యథా—

ఏకాకినీ యదబలా తరుణీ తథాహ

మస్మద్గృహే గృహపతిశ్చ గతో విదేశమ్।

కం యాచసే తదిహ వాసమియం వరాకీ

శ్వశ్రూర్మమాంధబధిరా నను మూఢ పాంథ॥

అత్ర వ్యంగ్యమేకైకత్ర పదార్థే ఉపస్కరోతీతి వాచ్యంప్రధానమ్॥

—లోచనం (ధ్వన్యా 1 13 వృత్తిపై పు. 130)

ఖ) "తత్పరావేవ శబ్దార్థౌ యత్ర వ్యంగ్యం ప్రతి స్థితౌ।

ధ్వనేః స ఏవ విషయో మంతవ్యః సంకరోజ్ఝితః॥"

(ధ్వన్యా 1 13 వృత్తిలో పు. 131)

33. ఇతశ్చ నాంతార్భావః—యతః కావ్యవిశేషోఽంగీ ధ్వనిరితి కథితః। తస్య పునరంగాని అలంకారా గుణా వృత్తయశ్చేతి ప్రతిపాదయిష్యంతే। న చావయవ ఏవ పృథగ్భూతోఽవయవీతి ప్రసిద్ధః। అపృథగ్భావే తు తదంగత్వం తస్య। న తు తత్త్వమేవ। యత్రాపి వా తత్త్వం తత్రాపి ధ్వనేర్మహావిషయత్వాత్ న తన్నిష్ఠత్వమేవ॥

(ధ్వన్యా. 1 13 వృత్తి, పుట 132)

ధ్వనిని బోధింప నభిధ సమర్థముకాదు :-

"ధ్వని"యనునదొకటి యున్నను దానికై ప్రత్యేకముగా వ్యంజనయను వ్యాపారము నంగీకరింపనవసరము లేదనియు ఏ యర్థమును మనమునవిడి మనము శబ్దము ప్రయోగింతుమో ఆయర్థమంతయును ఆ శబ్దమున కభిధేయమే యగుననియు, బలవంతుఁడగు విలుకాఁడు ప్రయోగించిన బాణము 'వేగము' అను నొకే వ్యాపారముచేత శత్రువుయొక్క కవచమును వక్షమును తుదకు ప్రాణమును కూడా హరించునో, అట్లే ఆ శబ్దము'అభిధ'యను నొకేవ్యాపారము చేత పదార్థస్మృతిని వాక్యార్థానుభవమును వ్యంగ్యార్థప్రతీతిని గూడ కలుగఁ జేయుననియు, కావున ధ్వనికై ప్రత్యేకముగా 'వ్యంజన'యను నొక వ్యాపారము స్వీకరింపనవసరము లేదనియు భట్టలోల్లటాదులగు మీమాంసకు లభిప్రాయ పడిరి [34]

దీని నాలంకారికులిట్లు ఖండించిరి — [35]పలుకులాలకించిన తోడనే తోచు నర్థములన్నియు అభిధావ్యాపారముచేతనే కలిగిన వనినయెడల, ప్రియాప్రియ

---

34. క) యదప్యభిధీయతే— 'యత్పరః శబ్దః స శబ్దార్థః', తథాహి- యథా సమరసీమ్ని కార్ముకవినిర్ముక్తపత్రీ తనుత్రాణం భిత్త్వా సుభట-లక్షణం లక్ష్యం భినత్తి, తదర్థమేవ తస్య ముక్తత్వాత్, తథా శబ్దో-ఽపి ముఖ్యమర్థమభిధాయ తదర్థాంతరమభిధాస్యతి। తదర్థమేవ తస్య ప్రయుక్తత్వాదితి॥ (అలం మహో 3 280 ఉదా వృత్తి)

ఖ) బలవతా ప్రేరిత ఇషురేకేనైవ వేగాఖ్యేన వ్యాపారేణ వర్మచ్ఛేద-మురోభేదం ప్రాణహరణం చ రిపోర్విధత్తే, తథైక ఏవ శబ్ద ఏకే-నైవాభిధాఖ్యవ్యాపారేణ పదార్థస్మృతిం వాక్యార్థానుభవం వ్యంగ్య ప్రతీతిం చ విధత్తే॥ (కావ్యప్రదీప 5 3 కా వృత్తి పుట 149)

35 క) యది శబ్దశ్రుతేరనంతరం యావానర్థో లభ్యతే తావతి శబ్దస్యాభిధైవ వ్యాపారః, తతః కథం - "బ్రాహ్మణ ! పుత్రస్తే జాతః, కన్యా తే గర్భిణీ" ఇత్యాదౌ హర్షశోకాదీనామపి న వాచ్యత్వం, కస్మాచ్చ లక్షణా? లక్షణీయేఽప్యర్థే దీర్ఘదీర్ఘతరాభిధావ్యాపారేణైవ ప్రతీతి-సిద్ధేః। కిమితి చ శ్రుతిలింగవాక్యప్రకరణస్థానసమాఖ్యానాం పూర్వ పూర్వబలీయస్త్వమ్, ఇత్యన్వితాభిధానవాదేఽపి విధేరపి సిద్ధం వ్యంగ్యత్వమ్॥ (కావ్య. 5 47 వృత్తి పుట. 230)

వాక్య శ్రవణసమనంతరమున కలిగిన హర్షశోకములును అభిధావృత్తివేద్యము లగుచు వాచ్యములేల కాఁగూడదు అర్థములన్నియు నభిధచేతనే సిద్ధించుచుండ నిఁక లక్షణతోఁ బనియేమి? శ్రుతిలింగవాక్యప్రకరణస్థానసమాఖ్యలు అను ఈ ఆఱింటిలో ఒకదానికంటె మఱియొకటి విలంబముగా నర్థప్రతీతి కలుగఁ జేయునవి యగుటచేత పూర్వపూర్వములకంటె నుత్తరోత్తరములు దుర్బలములని నిర్ణయింపఁబడినదికదా ఈ నిర్ణయమెట్లు పొసగును? శబ్దము వినినతోడనే వచ్చిన యర్థముల కన్నింటికిని అభిధ యొకటియే వ్యాపారమని యంగీకరించిన పక్షమున విలంబార్థోపస్థితియే కుదురదు. ఇఁక దానిని పురస్కరించుకొని చేసిన బలాబలనిర్ణయవ్యవస్థకు భంగము వాటిల్లకుండ నెట్లుండును?

మఱియు [36]బాణమునకువలె శబ్దమునకును దీర్ఘదీర్ఘతరవ్యాపారముండుట సంభవింపదు బాణము తనంతటతానే 'వేగ' వ్యాపారమున ఛేదన భేద-

---

ఖ) భగవతా జైమినినా—"శ్రుతిలింగవాక్యప్రకరణస్థానసమాఖ్యానాం-సమవాయే పారదౌర్బల్యమర్థవిప్రకర్షాత్" (పూ మీ. 3 3. 14) ఇతిసూత్రేణ యథాక్రమముక్తానాం శ్రుత్యాదీనామేకత్రోపనిపాతే వర పరస్య విలంబేనార్థోపస్థాపకతయా దుర్బలత్వమభిదధతా పూర్వ పూర్వస్య శ్రుత్యాదేః ప్రాబల్యం నిరణాయి, యది శబ్దశ్రుతేరనంత రోపస్థితాన్ సర్వానేవ ప్రత్యయాన్ ప్రతి అభిధైవ వ్యాపారః స్యాత్, తదా శ్రుత్యుపస్థాపితార్థస్యేవ లింగాద్యనుగ్రహీతార్థానామపి అభిధేయతయా సర్వేషాం సమకాలమర్థోపస్థాపకత్వప్రసక్త్యా అర్థ-విప్రకర్షాభిధానం మునేరనుచితం స్యాదితి వివరణాదౌ స్పష్టమ్॥
—బాలబోధినీ (కావ్య 5 47 కా పుట. 230)

గ) నిమిత్తనైమిత్తికభావశ్చావశ్యమాశ్రయణీయః, అన్యథా గౌణలాక్ష-ణికయోర్ముఖ్యాద్ భేదః, శ్రుతిలింగాదిప్రమాణషట్కస్య పార-దౌర్బల్యమ్, ఇత్యాదిప్రక్రియావిఘాతః, నిమిత్తతావైచిత్ర్యేణై-వాస్యాః సమర్థితత్వాత్॥
—లోచన (ధ్వన్యా ప్రథమ 'భ్రమధార్మిక'వ్యాఖ్యలో)

36 క) కించాయం విషమః శరదృష్టాన్తోపన్యాసః। న హి యథా సాయకః స్వభావత ఏవ ఛేద్యభేద్యాద్యర్థవిషయమేకయైవ వృత్త్యా తత్త-

నముల నొనరించును; కాని శబ్దము సంకేతసాపేక్షము సంకేతము లేనిచోట దాని వ్యాపారము కుంటుపడును. మొదట శబ్దము సంకేతితార్థమును చెప్పి పిమ్మట వక్తృవాచ్యాదిసహకారిభేదము నాశ్రయించి యర్థవిశేషమున ప్రవర్తించిన ఆ వ్యాపారము సజాతీయము కాక విజాతీయమే యగును

[37]శబ్దమొకప్పుడు అసభ్యార్థములను కూడ స్ఫురింపఁజేయుచుండును. అట్టియర్థస్ఫూర్తి కావలెనని కవియభిప్రాయము కాదు కదా! ఇఁక దానిమాట యేమి? ఆవిషయమున అభిధావ్యాపార మెట్లు ప్రసరించును? అట్లు అభిధకంటె విలక్షణమగు వ్యంజనావ్యాపారము నంగీకరించుటచేతనే అసాధుత్వాదులు నిత్యదోషములనియు శ్రుతికటుత్వాదులనిత్యదోషములనియు విభాగవ్యవస్థ కుదురుచున్నది.

---

త్కార్యంకరోతి, తథా శబ్దః। స హి సంకేతసాపేక్షః స్వవ్యాపార-మారభతే న స్వభావత ఏవేతి యత్రైవాస్య సంకేతః, తత్రైవ వ్యాప్రియతే। తతశ్చాభిధేయార్థవిషయ ఏవాస్య వ్యాపారో యుక్తః, నార్థాంతరవిషయః, తత్ర సంకేతాభావాత్॥

—వ్యక్తివివేక. (చౌ. సం 1964 AD. 140 పుట)

ఖ) యోఽప్యన్వితాభిధానవాదీ— 'యత్పరః శబ్దః స శబ్దార్థః' ఇతి హృదయే గృహీత్వా శరవదభిధావ్యాపారమేవ దీర్ఘదీర్ఘమిచ్ఛతి, తస్య యది దీర్ఘో వ్యాపార స్తదేకోఽసావితి కుతః ? భిన్న-విషయత్వాత్। అథానేకోఽసౌ ? తద్విషయసహకారిభేదాదసజాతీయ ఏవ యుక్తః। సజాతీయే చ కార్యే'విరమ్య వ్యాపారః' శబ్దకర్మ-బుద్ధ్యాదీనాం పదార్థవిద్భిర్నిషిద్ధః। అసజాతీయే చాస్మన్నయ ఏవ॥

—లోచన (ధ్వన్యా ప్రథమ 'భ్రమ' శ్లోకవ్యాఖ్యలో)

37. క) కించ యది వస్తుగత్యా పదార్థాంతరేణ యోఽన్వితః సోఽభిధయా ఉపస్థాప్యత ఇత్యన్వితాభిధానం తదాఽవశ్యం వ్యంజనా స్వీకర్యా। అన్యథా 'రుచింకురు' ఇత్యాదిశబ్దస్య దుష్టత్వం న స్యాత్। దుష్టి-హేతోరసభ్యార్థోపస్థితే స్తత్రాభావప్రసంగాత్। తదర్థస్యానన్వితత్వాత్। కించ వాచ్యవాచకభావాతిరేకి వ్యంగ్యవ్యంజకభావ ఇత్యవశ్యం కావ్యజ్ఞదృష్ట్యాపి స్వీకర్తవ్యమ్। అన్యథా కష్టత్వాదయోఽనిత్యదోషాః

[38]మఱియు వాచ్యార్థవిషయమున భేదము లేకున్నను పర్యాయపదము లలో నేదో యొక పదమే కావ్యానుగుణమై వెలయుచుండుటలోని హేతువేమై యుండును?

*"ద్వయం గతం సంప్రతి శోచనీయతాం సమాగమప్రార్థనయా కపాలినః॥
కళా చ సా కాంతిమతీ కళావతః త్వమస్య లోకస్య చ నేత్రకౌముదీ॥"
(కుమా 5 71)

---

అసాధుత్వాదయో నిత్యదోషా ఇతి విభాగో న స్యాత్। వాచ్యస్య అవిశేషేణ కష్టత్వాదీనామపి సర్వత్ర దుష్టత్వస్య అదుష్టత్వస్య వా ప్రసంగాత్। వ్యంజనాభ్యుపగమే తు వ్యంజనీయస్య బహువిధత్వేన రౌద్రాదౌ వ్యంగ్యేఽనుకూలత్వం శృంగారాదౌ తు దుష్టత్వమితి యుజ్యతే విభాగవ్యవస్థా॥
(కావ్యప్రదీప. 5 3 కా వృత్తిలో)

ఖ) అపి చ యది ప్రతీయమానార్థో నాభవిష్యత్। తర్హి కావ్యాంతర్నివిష్టస్య అసభ్యస్మృతిహేతోః పదార్థాంతరాన్వయవిరహిణః పదస్య న హేయత్వం సమపత్స్యత॥ (ఏకావళీ–ప్రథమ పుట 42)

గ) "శ్రుతిదుష్టాదయో దోషా అనిత్యా యే చ దర్శితాః। ధ్వన్యాత్మన్యేవ శృంగారే తే హేయా ఇత్యుదాహృతాః॥" (ధ్వన్యా 2 11)

ఘ) "శషౌ సరేఫసంయోగౌ ఢకారశ్చాపి భూయసా। విరోధినః స్యుః శృంగారే తేన వర్ణా రసచ్యుతః॥ త ఏవ తు నివేశ్యంతే బీభత్సాదౌ రసే యదా। తదా తం దీపయంత్యేవ తేన వర్ణా రసచ్యుతః ॥"
(ధ్వన్యా 3 . 3, 4)

38 ఏవం పర్యాయేష్వపి మధ్యే కస్యచిదేవ కుత్రచిత్ కావ్యానుగుణత్వమిత్యపి వ్యవస్థా న స్యాత్। దృశ్యతే చాసౌ। యథా-"ద్వయం గతం సంప్రతి శోచనీయతాం। సమాగమ ప్రార్థనయా కపాలినః" (కుమా.5.71) ఇత్యాదౌ న పినాక్యాదిపదమనుకూలం। కింతు జుగుప్సావ్యంజకతయా "కపాలి"పదమేవ॥ —[కావ్యప్రదీప (నిర్ణయ సం 1912) 5 3 కా వృత్తిలో పు 158]

శ్లోకార్థము పూర్వము (పు 185) వివరింపబడినది.

పార్వతీదేవితో బ్రహ్మచారిపలికిన ఈపలుకులలో కపాలిపదమే కావ్యాను గుణమయినది కాని "పినాకి" పదము కాదు. ఏలన? చంద్రకళయు పార్వతి యును శోచనీయలగుటకు కారణము శివసమాగమమునర్థించుట కదా। 'పినాకి' 'కపాలి' పదములు రెండును శివపర్యాయములే యైనను 'పినాకి' పదము 'పినాక ధనుర్ధారి యనునర్థమును చెప్పుచు శివుని వీరరసాశ్రయునిగానొనర్చుటచే ప్రకృతమునకనుగుణము కాదు కాని 'కపాలి' పదము 'కపాలమును ధరించు వాఁ'డనునర్థము చెప్పుచు శివునియందేవగింపును కలుగఁజేయుటచే ప్రకృత కావ్యానుగుణతనొందుచున్నది ఇట్లు కపాలిపదము కావ్యానుగుణమగుటలో బీభత్సరసస్ఫూర్తిని కలుగఁజేయు వ్యంజనయే హేతువగును కాని అభిధ కాదు కావున వ్యంజనను దీర్ఘదీర్ఘతరమగునభిధావ్యాపారముచే గతార్థముచేయఁబూనుట యుక్తముకాదు

శబ్దశ్రవణానంతరము కలిగినయర్థములకన్నింటికిని శబ్దమే నిమిత్త మైనను, ఆశబ్దము, సంకేతితమగునర్థమునే బోధింపఁజాలునభిధావ్యాపారము చేత, నాయర్థవిశేషమును బోధింపనేరదు తదర్థమై 'వ్యంజన' యను వ్యాపారాంతరము నంగీకరించక తప్పదు.[39]

---

39 క) యదప్యుచ్యతే నైమిత్తికానుసారేణ నిమిత్తాని కల్ప్యంత ఇతి తత్ర నిమిత్తత్వం కారకత్వం జ్ఞాపకత్వం వా ? శబ్దస్య ప్రకాశకత్వాన్న కారకత్వమ్। జ్ఞాపకత్వం తు అజ్ఞాతస్య కథమ్? జ్ఞాతత్వం చ సంకేతనైవ। స చ అన్వితమాత్రే। ఏవం చ నిమిత్తస్య నియత-నిమిత్తత్వం యావన్న నిశ్చితం తావన్నైమిత్తకస్య ప్రతీతిరేవ కథమ్ ? ఇతి "నైమిత్తికానుసారేణ నిమిత్తాని కల్ప్యంత" ఇత్యవిచా-రితాభిధానమ్॥ (కావ్య. 5 47 కా వృత్తి)

ఖ) వ్యంగ్యోపస్థితౌ శబ్దస్య జ్ఞాపకత్వరూపం నిమిత్తత్వమస్మాకమపి సమ్మతమ్।తత్ర నాస్మాకం వివాదః। పరం తు వ్యంజనాయా అస్వీ-కారే తన్నసంభవతి। శబ్దస్య అర్థనిమిత్తత్వం హి వ్యాపారసాపేక్ష-మేవ నియతమ్। యథా వాచ్యార్థలక్ష్యార్థయోరభిధాలక్షణే వ్యాపారౌ। తథా ఇహాపి కోఽపి వ్యాపారోఽవశ్యమంగీకార్యః॥

—బాలబోధినీ (కావ్యప్రకాశ. 5 46 కా వృత్తిపై వ్యాఖ్య)

**తాత్పర్యశక్తిచే వ్యంజన గతార్థము కాదు :—**

అప్రాప్తమగు విధేయరూప విశేషార్థమును బోధించుటకై అభిహితాన్వయవాదులంగీకరించిన తాత్పర్యశక్తియు శబ్దోపాత్తమగు విధేయరూప విశేషార్థమును బోధించుటయందే సమర్థమగును, కాని శబ్దానభిహితమగు ప్రతీయమానరూప విశేషార్థమును బోధింపనేరదు 40

ధనికుఁడు తాత్పర్యశక్తిచే వ్యంజనను గతార్థము చేయఁబూని దాని నిట్లు వివరించెను—41

---

40 క) తతశ్చ యావదేవ విధేయం తావత్యేవ తాత్పర్యం, విధేయం చ శబ్దోపాత్తమేవేతి సుష్ఠూక్తం శబ్దోపాత్త ఏవ తాత్పర్యమ్।
—బాలబోధినీ (కావ్య 5 47 కా వృత్తిపై వ్యాఖ్య)

ఖ) అనువాద్యానామర్థానాం విధేయార్థపరత్వం "తాత్పర్య"మితి వ్యాపారాంతరం పరైరభ్యుపగతమ్। "ఉమాం స పశ్యన్ ఋజునైవ చక్షుషా ప్రచక్రమే వక్తుమనుజ్ఝితక్రమః।" (కుమా ) ఇత్యత్ర దర్శనస్య చక్షుఃకరణకత్వావ్యభిచారాత్ తదుపాదానం తద్విశేషణార్థం, తదేవ చాత్ర విధేయం తత్పరత్వమేవ తాత్పర్యమ్॥
—ఏకావళీ (ద్వితీ పుట 59)

గ) ఏవం చ వ్యంగ్యస్య శబ్దోపాత్తత్వాభావాత్ సర్వత్ర విధేయత్వాభావాచ్చ న తత్ర ప్రాగుక్తప్రామాణ్యనియామకం తాత్పర్యం, నాపి శక్తిరితి భావః॥ —బాలబోధినీ (కావ్య 5 47 కా. వృత్తివ్యాఖ్య)

41 క) పౌరుషేయమపౌరుషేయం వాక్యం సర్వం కార్యపరమ్। అతత్పరత్వేఽనుపాదేయత్వాత్, ఉన్మత్తాదివాక్యవత్। కావ్యశబ్దానాం చ అన్వయవ్యతిరేకాభ్యాం నిరతిశయసుఖాస్వాదవ్యతిరేకేణ ప్రతిపాద్యప్రతిపాదకయోః ప్రవృత్తివిషయయోః ప్రయోజనాంతరానుపలబ్ధేః స్వానందోద్భూతిరేవ కార్యత్వేన (ప్రయోజనత్వేన)అవధార్యతే, తదుద్భూతినిమిత్తత్వం చ విభావాదిసంసృష్టస్య స్థాయిన ఏవావగమ్యతే, అతో వాక్యస్యాభిధానశక్తిస్తేన తేన రసేనాకృష్యమాణా తత్తత్స్వార్థాపేక్షితావాంతరవిభావాదిప్రతిపాదనద్వారా స్వపర్యవసాయితామానీయతే। తత్ర విభావాదయః పదార్థస్థానీయాః, తత్సంసృష్టో రత్యాదిర్వాక్యార్థః॥ —ధనిక (దశరూపక. 4 37 కా వృత్తి)

"కవి తానొక యపూర్వకావ్యమును వ్రాయును సహృదయులాకావ్యము నందలి శృంగారాదిరసముల నాస్వాదించి తన్మయులగుదురు కావున కవి తన కావ్యమట్లు శృంగారాదిరసపరమై యుండవలెననియే మనమున నిడి రచించెననుట నిర్వివాదము ఇట్లు కవివివక్షితములగు రసాదులే కావ్యార్థము లగును అనఁగా కావ్యప్రయోజనములగును. అ ప్రయోజనము సిద్ధించువఱ కును తాత్పర్యశక్తి పనిచేయుచునే యుండును అట్లు గాక తాత్పర్యశక్తిచే నింతమాత్రమే యర్థము బోధితమగుననుటలో నౌచిత్యమేమున్నది? వివక్షితార్థ ప్రతిపత్తి కలుగనిది తాత్పర్యశక్తి యెట్లు ఉపరమించును [42]'అదిగో తలుపు'

---

ఖ) "ఏతావత్యేవ విశ్రాంతిస్తాత్పర్యస్యేతి కిం కృతమ్।
యావత్కార్యప్రసారిత్వాత్ తాత్పర్యం న తులాధృతమ్॥"
—ధనిక (దశరూపక 4 37 కా వృత్తిలో 4 శ్లో)

గ) యత్పునరుక్తం- పౌరుషేయమపౌరుషేయం చ వాక్యం సర్వమేవ కార్యపరమ్, అతత్పరత్వేఽనుపాదేయత్వాత్ ఉన్మత్తవాక్యవత్। తతశ్చ కావ్యశబ్దానాం నిరతిశయసుఖాస్వాదవ్యతిరేకేణ ప్రతిపాద్య ప్రతిపాదకయోః ప్రవృత్త్యౌపయికప్రయోజనానుపలబ్ధేః నిరతి-శయసుఖాస్వాద ఏవ కార్యత్వేనావధార్యతే। 'యత్పరః శబ్దః స శబ్దార్థః' ఇతిన్యాయాత్" ఇతి॥ (సాహిత్యదర్పణ 5 1 కా వృత్తి)

ఘ) "కవిశ్చ రసముద్దిశ్య సూక్తిముద్రాః కరోతి హి। సామాజకానాం
హృదయం రసయేయమహం కథమ్। ఇతిప్రవర్తతే కావ్యే కవి-
స్తత్పరమానసః। విశిష్టైః శబ్దసందర్భైర్జ్ఞాపయేయం రసం యతః।
ఇతి ప్రవృత్తౌ సుకవౌ తేషాముత్పద్యతే రసః॥"
(సాహిత్యమీమాంసా—ప్రకరణం 6)

42 క) వాచ్యా ప్రకరణాదిభ్యో బుద్ధిస్థా వా యథా క్రియా।
వాక్యార్థః కారకైర్యుక్తా స్థాయీభావస్తథేతరైః॥
—ధనిక (దశరూపక 4 . 37)

ఖ) యథా లౌకికవాక్యేషు శ్రూయమాణక్రియేషు 'గామభ్యాజ' ఇత్యాదిషు, అశ్రూయమాణక్రియేషు చ 'ద్వారం ద్వారం' ఇత్యాదిషు స్వశబ్దోపాదానాత్ ప్రకరణాదివశాత్ బుద్ధిసన్నివేశినీ క్రియైవ కార-

అనినంతనే తల్లి యభిప్రాయము నవగతము చేసుకొనిన బాలుఁడు తలుపు మూయుటలేదా? ఈ యర్థమును బాలుడెట్లు తెలిసికొనెను? తాత్పర్యశక్తిచెతనే కదా। అట్లే రసాదిరూపమగు నర్థమును బోధింప తాత్పర్యశక్తియే సమర్థ మగుచుండ దానికై ప్రత్యేకముగా వ్యంజనావ్యాపారము నంగికరించవలసిన యవసరమేముండును?"

ఇట్లు ధనికుఁడు తాత్పర్యశక్తిచె వ్యంజన గతార్థమగునవెను

ఇట గమనించవలసిన విషయమేమన – సంసర్గరూపవాక్యార్థమునేకాని విధేయరూపవిశేషార్థమునే కాని బోధింపఁజాలుతాత్పర్యశక్తిచేవ్యంజన గతార్థము కాదనుటలో నిసుమంతైన సందియము లేదు [43] కాని ధనికుఁడు నిరూపించిన తాత్పర్యశక్తి అట్టిది కాదు అది విలక్షణమయినది యావత్కార్యప్రసారియగుచు రసాదిరూపార్థమును గూడ బోధించును దీనికి "యత్పరఃశబ్దః స శబ్దార్థః"అను మిమాంసాన్యాయానుసారము గురుమతానుయాయియగు ధనికుడు "తాత్పర్య శక్తి"యని నామమిడెను. కావ్యముతో రసాదులకు భావ్యభావకసంబంధమనెను

---

కోపచితా, కావ్యేష్వపి క్వచిత్ స్వశబ్దోపాదానాత్ "ప్రీత్యై నవోఢా" ఇత్యేవమాదౌ, క్వచిచ్చ ప్రకరణాదివశాత్ నియతాభిహితవిభావా-ద్యవినాభావాద్వా సాక్షాద్భావకచెతసి విపరివర్తమానో రత్యాదిః స్థాయీ స్వస్వవిభావానుభావవ్యభిచారిభిః తత్తచ్ఛబ్దోపనీతైః సంస్కారపరంపరయా పరం ప్రౌఢిమానీయమానో రత్యాది-ర్వాక్యార్థః॥ –ధనిక (దశరూపక 4 37 వృతి)

43 క) అభిహితాన్వయవాదిభిరంగీకృతా తాత్పర్యాఖ్యా వృత్తిరపి సంసర్గ-మాత్రే పరిక్షీణా న వ్యంగ్యబోధినీ॥
(సా. ద 5.1 కా వృత్తి)

ఖ) యస్త్వత్రాపి తాత్పర్యశక్తిమేవ ధ్వననం మన్యతే, స న వస్తుతత్త్వ-వేదీ। విభావానుభావప్రతిపాదకే హి వాక్యే తాత్పర్యశక్తిర్భేదే సంసర్గే వా పర్యవస్యేత్, న తు రస్యమానతాసారే రసే॥
–లోచన (ధ్వన్యా 1 4 కా వృత్తివ్యాఖ్య)

ఇట్లు నామమాత్రమున ధనికునకు నాలంకారికులకును వివాదమేర్పడినది అంతే [44] కావుననే అనంతరలాక్షణికులు తాత్పర్యార్థము వ్యంగ్యార్థము నొక్కటియేయని నిరూపించియున్నారు [45]

**తాత్పర్యార్థ – వ్యంగ్యార్థములకు గల భేదము –**

కాని సూక్ష్మముగా పరిశీలించిన తాత్పర్యార్థము వ్యంగ్యార్థమును ఒకటి కావు ఎట్లన ?

వానీరకుంజోడ్డీనశకునికోలాహలం శృణ్వంత్యాః ।
గృహకర్మవ్యాపృతాయా వధ్వాః సీదంత్యంగాని ॥[46] (కావ్య 5.32)

---

44 క) కిమిదం తత్పరత్వం నామ? తదర్థత్వం వా? తాత్పర్యవృత్త్యా తద్బోధకత్వం వా? ఆద్యే న వివాదః, వ్యంగ్యత్వేఽపి తదర్థతానపాయాత్। ద్వితీయే తు కేయం తాత్పర్యాఖ్యా వృత్తిః? అభిహితాన్వయ వాదిభిరంగకృతా? తదన్యా వా?। ఆద్యే దత్తోత్తరమ్। ద్వితీయే తు నామమాత్రే వివాదః। తన్మతేఽపి తురీయవృత్తిసిద్ధేః॥
(సా ద 5 1 కా వృత్తి )

ఖ) అతో న రసాదీనాం కావ్యేన సహ వ్యంగ్యవ్యంజకభావః। కిం తర్హి? భావ్యభావకసంబంధః। కావ్యం హి భావకం, భావ్యా రసాదయః, తే హి స్వతో భవంత ఏవ భావకేషు విశిష్టవిభావాదిమతా కావ్యేన భావ్యంతే॥ (దశరూపక. 4 37 కా వృత్తి )

45 క) తాత్పర్యార్థోఽపి వ్యంగ్యార్థ ఏవ, న పునః పృథగ్భూతః॥
(ప్రతాపరుద్రీయ. 2. 5 కా వృత్తి )

ఖ) తస్మాద్ వ్యంజనాపరపర్యాయమేవ తాత్పర్యం కవిభిరంగీకృతమితి సిద్ధమ్। అత ఏవోక్తం భావప్రకాశే-"అతో ధ్వన్యాఖ్యతాత్పర్యగమ్యమానత్వతః స్వతః। కావ్యే రసాలంక్రియాదిర్వాక్యార్థో భవతి స్ఫుటమ్॥" –రత్నాపణ. (ప్ర రు 2.5 కా వృత్తివ్యాఖ్య)

46. దీని యాంధ్రానువాదము చర్లగణపతిశాస్త్రిగారిసాహిత్యసౌందర్య దర్శనమునుండి(పుట 175)·–

"గీ॥ ఇట్టటులు ప్రబ్బలి పొదలనెగురుచున్న
విహగముల కలకలములు వినుచునుండి
అనయమింటిపనులలోన మునిఁగితేలు
వదువునంగములు మిగులవగలఁబొగులు॥"

ఇట- [47] "సంకేతస్థానమగు లతాగృహమునకు ప్రియుఁడు వచ్చె"నను "వ్యంగ్యార్థము"నకంటె "వధువునంగములు మిగుల వగలఁ బొగులు" అను వాచ్యార్థమే చారుత్వవిశ్రాంతిధామమై ప్రాధాన్యమునొందుచున్నది కావున నిచ్చోట నిదియే తాత్పర్యార్థము. ఒకప్పుడు వ్యంగ్యము ప్రధానమై చారుత్వో-త్కర్షహేతువైన నదియే తాత్పర్యమగును ఇట్లు వాచ్యవ్యంగ్యములలో నే యర్థమున కావ్యసౌందర్యమునకు విశ్రాంతి యేర్పడునో నా యర్థమే తాత్పర్య మని తేలినది [48] ధ్వనికారులు ఈ యర్థముననే తాత్పర్యశబ్దమును వాడియున్నారు [49]

పూర్వశ్లోకము నందలియర్థాంతరము (వ్యంగ్యార్థము) కావ్యసౌందర్య హేతువు కాకుండుటచెనది తాత్పర్యమెట్లగును ? "యత్పరః శబ్దః స శబ్దార్థః" అని కదా న్యాయము. కావున నీ యర్థవిశేషప్రతిపత్తికయినను తాత్పర్యాతి-

---

47 'అత్ర దత్తసంకేతః కశ్చిల్లతాగ్రహం ప్రవిష్ట' ఇతివ్యంగ్యాత్ 'సీదం త్యంగానీ'తి వాచ్యం సచమత్కారమ్॥

(కావ్యప్రకాశ 5 132 ఉదా )

48 క) తాత్పర్యేణ = విశ్రాంతిధామతయా, ప్రయోజనత్వేనేతి యావత్॥

—లోచన (ధ్వన్యా 1 14 కా వృత్తిపై)

ఖ) వాచ్యవ్యతిరిక్తస్యార్థస్య వాచ్యవాచకాభ్యాం తాత్పర్యేణ ప్రకాశనం యత్ర వ్యంగ్యప్రాధాన్యే, స ధ్వనిః॥ (ధ్వన్యా 1 14 కా వృత్తి)

గ) తత్పరావేవ శబ్దార్థౌ యత్ర వ్యంగ్యం ప్రతి స్థితౌ ।
ధ్వనేః స ఏవ విషయో మంతవ్యః సంకరోజ్ఝితః ॥

(ధ్వన్యా 1 . 13 వృత్తిలో)

49. క) రసభావాదితాత్పర్యమాశ్రిత్య వినివేశనమ్ ।
అలంకృతీనాం సర్వాసామలంకారత్వసాధనమ్ ॥

(ధ్వన్యా 2 5 వృత్తిలో)

ఖ) ప్రకారోఽయం గుణీభూతవ్యంగ్యోఽపి ధ్వనిరూపతామ్ ।
ధత్తే రసాదితాత్పర్యపర్యాలోచనయా పునః॥ (ధ్వన్యా 3 . 40)

రిక్తమగు నాక తురీయవృత్తి నంగీకరించక తప్పదు[50] అదియే వ్యంజన కావున తాత్పర్యశక్తిచే వ్యంజన గతార్థము కాదు

**భాక్తతావాదము – దాని ఖండనము .–**

(లక్షణచే వ్యంజన గతార్థము కాదు)

[51] భక్తి యన గౌణియు శుద్ధయు నగు లక్షణ, దానివలనకలిగిన యర్థము భాక్తము(లాక్షణికార్థము) ఈః లాక్షణికార్థముకాక "వ్యంగ్యార్థ"మనున-

---

50 క) కించ-వ్యంగ్యస్య ప్రాధాన్యేనావివక్షాయాం వాచ్యత్వం తావద్ భవద్భిర్నాభ్యుపగంతవ్యమ్, అతత్పరత్వాత్ శబ్దస్య। తదస్తి తావద్ వ్యంగ్యః శబ్దానాం కశ్చిద్విషయ ఇతి। యత్రాపి తస్య ప్రాధాన్యం తత్రాపి కిమితి తస్య స్వరూపమవహ్నూయతే॥

(ధ్వన్యా 3 33 కా. వృత్తి)

ఖ) నను। "యత్పరః శబ్దః స శబ్దార్థ" ఇతి వ్యంగ్యస్య ప్రాధాన్యే వాచ్యత్వమేవ న్యాయ్యమ్। తర్హ్యప్రాధాన్యే కిం యుక్తం? వ్యంగ్యత్వమితి చేత్, సిద్ధో నః పక్షః॥

–లోచన (ధ్వన్యా. 3. 33 వృత్తిపై)

గ) తథా చ యత్ర - 'వానీరకుంజ' - (కావ్య 5. 132) ఇత్యాదౌ వ్యంగ్యప్రతీతావపి వాచ్య ఏవ చారుత్వవిశ్రామః, తత్ర తాత్పర్య-విషయో వ్యంగ్యార్థః కథం ప్రతీయేత? 'యత్పరః శబ్దః' ఇత్యుక్తమతే తు సుతరామ్। ఏతేన తాత్పర్యమేవ వ్యంగ్యప్రతీతౌ వ్యాపార ఇత్యపి నిరస్తమ్॥ తస్మాత్ తాత్పర్యమ్ అభిధా వా న ప్రతీయమానేఽర్థే వ్యాపారః॥ (కావ్యప్రదీప 5 3 వృత్తి)

51. క) భజ్యతే సేవ్యతే పదార్థేన ప్రసిద్ధతయోత్ప్రేక్ష్యత ఇతి భక్తిర్ధర్మో అభిధేయేన సామీప్యాదిః, తత ఆగతో భాక్తో లాక్షణికోఽర్థః। యదాహుః–"అభిధేయేన సామీప్యాత్ సారూప్యాత్ సమవాయతః। వైపరీత్యాత్ క్రియాయోగాత్ లక్షణా పంచధా మతా॥" ఇతి। గుణ-సముదాయవృత్తేః శబ్దస్యార్థభాగః తైక్ష్ణ్యాదిర్భక్తిః తత ఆగతో గౌణోఽర్థో భాక్తః॥ లోచన. (ధ్వన్యా 1.1 కా. వృత్తిపై)

దొకటి ప్రత్యేముగానున్నట్లు గుర్తించకుండుటచే అభిధేయాతిరిక్తమగునర్థమంతయు లక్షణాబోధితమే యనునభిప్రాయము తనకంటె పూర్వులైన లాక్షణికులకున్నట్లు ధ్వనికారులు చెప్పియున్నారు

అనంతర లాక్షణికుఁడు "అభిధావృత్తిమాతృకా"కారుఁడును అగు ముకులభట్టు ఈ యంశమునే మనమునని డి వ్యంజనను లక్షణచేతనే గతార్థము చేయబూఁనెను [52] అతడు వస్త్వలంకారరసధ్వనులు మూఁడును లక్షణచేతనే కలుగునని ఇట్లు వివరించెను—

వస్తుధ్వని లక్ష్యార్థమనుటకుదాహరణము (అభిధా—పు 12)—

దృష్టిం హే ప్రతివేశిని । క్షణమిహాప్యస్మద్గృహే దాస్యసి
ప్రాయో నైవ శిశోః పితాస్య విరసాః కౌపీరపః పాస్యతి ।
ఏకాకిన్యపి యామి తద్వన [53] మితః స్రోతస్తమాలాకులం
నీరంధ్రా వపురాలిఖంతు జరచ్ఛేదా నలగ్రంధయః ॥

---

ఖ) "భాక్తమాహుస్తమన్యే' అన్యే తం ధ్వనిసంజ్ఞితం కావ్యాత్మానం గుణవృత్తిరిత్యాహుః। యద్యపి చ ధ్వనిశబ్దసంకీర్తనేన కావ్యలక్షణ విధాయిభిర్గుణవృత్తిరన్యో వా న కశ్చిత్ ప్రకారః ప్రకాశితః,తథాపి అముఖ్యవృత్త్యా కావ్యేషు వ్యవహారం దర్శయతా ధ్వనిమార్గో మనాక్ స్పృష్టోఽపి న లక్షిత ఇతి పరికల్ప్యైవముక్తం-'భాక్తమాహుస్తమన్యే' ఇతి॥ (ధ్వన్యా. 1/1 కా వృత్తి)

గ) భామహేనోక్తం 'శబ్దాశ్ఛందోఽభిధానార్థాః' ఇతి । అభిధానస్య శబ్దాద్ భేదం వ్యాఖ్యాతుం భట్టోద్భటో బభాషే - "శబ్దానామభిధానమభిధావ్యాపారో ముఖ్యో గుణవృత్తిశ్చ" ఇతి। వామనోఽపి-"సాదృశ్యాల్లక్షణా వక్రోక్తిః" (కావ్యా సూ 4.3 8) ఇతి॥
—లోచన (ధ్వన్యా 1 1 కా వృత్తిపై)

52 లక్షణామార్గావగాహిత్వం తు ధ్వనేః సహృదయైర్నూతనతయోపవర్ణితస్య విద్యతే॥ (అభిధా 11 కా వృత్తి)

53 'సత్వరమితః' (సా ద. 4 8 కా. ఉదా) 'తద్దూతమితః '(శబ్దవ్యాపార పు. 5) అను పాఠములే యుక్తములని అభియుక్తులు
—రచయిత

"ఒక పుంశ్చలి తనగుట్టు రట్టడి కాకుండుటకై ఎదురింటావిడతో వలికిన పలుకులివి " ఈ చిన్నవాని తండ్రి నూతినీరు త్రాగడు, అట దూరముననున్న ఏటికివెళ్ళి నీరుతెత్తును నా కిప్పుడెవ్వరు తోడువత్తురు ? త్రోవేమో ఎండిన ఆకులు, ముండ్లతో నిండియున్నది శరీరము గీరుకొనునేమో ? అయినను వెళ్ళక తప్పదు కదా ! మా యింటిపై నొకకన్నువేసి యుంచుము నేనిప్పుడే వత్తును "

ఆ నెఱజాణ అట్లు వెళ్ళుటకు ప్రయోజనము, ఆ సంకేతస్థానమున తన ప్రియుని కలియుటయే, ఆ వాస్తవమును కప్పిపుచ్చుటకై నీళ్ళు తెచ్చుటకని బొంకినది అట కలుగఁబోవు నఖదంతక్షతాది సంభోగచిహ్నములను, తనకు ఎండిన ఆకుముళ్ళు గుచ్చుకొని శరీరమున గీరలేర్పడునని చెప్పుచు కప్పిపుచ్చఁ జూచినది ఇట్లు వాచ్యార్థము అసత్యము కావున అనుపపన్నము- అయ్యది స్వసిద్ధికై సత్యమగు పరపురుషసంభోగాదిరూపమగునర్థమును ఆక్షేపించు చున్నది కావున నది 'స్వసిద్ధయే పరాక్షేపః' అని నిర్వచించిన ఉపాదాన లక్షణ ఈ పలుకులు సాధ్వియే పలికిన అసత్యోక్తులు కాకుండుటచే ఆక్షిప్త మగు నర్థాంతరముండదు కావున ఇది వక్తృనిబంధనయగు ఉపాదానలక్షణ.[54]

---

54. అత్ర హి పరపురుషసంభోగానుభవేచ్ఛయా సంకేతస్థానం యువతి-ర్వ్రజంతీ స్వప్రవృత్తిప్రయోజనం విశిష్టసంకేతస్థానాధారం పరపురుష-సంభోగాత్మకం తథా సంభోగచిహ్నాని నఖదశనక్షతాని గాత్రసంలగ్న-తయా శంక్యమానావిర్భావాని యథాక్రమం భర్తృపిపాసానివృత్తి-క్షమనాదేయసరసపానీయానయనేన చిరచ్ఛిన్నసలగ్రంథిపరుషజర్జర-ప్రాంతజనయిష్యమాణేన చ గాత్రగతవికారవిశేషోద్గమేనాపహ్నుత్యాఽ-భిధత్తే, సా చాత్రాపహ్నుతిరసాధ్వ్యా వక్తృత్వం పర్యాలోచ్యావగమ్యతే। అపహ్నవస్య చాలీకవస్త్వభిధానాత్మకత్వాదలీకస్య చ సత్యార్థవిపర్యాస కారిత్వాదలీకేనార్థేన త్వసత్యోక్తస్వసిద్ధ్యర్థత్వేనాక్షిప్యతే। తేనాత్రవక్తృ-విశేషపర్యాలోచనయా సత్యార్థే నిష్ఠాయా ఉపాదానాత్మికాయా లక్ష-ణాయాః ప్రతిపత్తిః। న హ్యత్ర వాక్యవాచ్యయోః సామర్థ్యమ్। సాధ్వ్యా వక్తృత్వే సతి తయోరేవంవిధార్థాక్షేపాసమర్థత్వాత్॥

(అభిధా. 6. కా. వృత్తి)

ఇట్లు వస్తుధ్వనిని [55] లక్ష్యార్థమనియే ముకుళభట్టు ఉపపాదించెను

ఇఁక అలంకారధ్వని (అభిధా 6 కా ఉదా) —

ప్రాప్తశ్రీరేష కస్మాత్ పునరపి మయి తం మంథఖేదం విదధ్యాత్
నిద్రామప్యస్య పూర్వామనలసమనసో నైవ సంభావయామి।
సేతుం బధ్నాతి భూయః కిమితి చ సకలద్వీపనాథానుయాత
స్త్వయ్యాయాతే వితర్కానితి దధత ఇవాభాతి కంపః పయోధేః॥

ఓరాజా! నీవు తనను సమీపించుచుండ పలువిధములుగా వికల్పములు చేయుచున్నదా! అనునటులు సముద్రున కీ కంపము భాసించుచున్నది ఆ వికల్పములేవన? "తనను మథించుటకై వచ్చియుండునా? లక్ష్మిని పొందియుండ అదెట్లు? లేదా! తనయందు నిద్రించుటకయినా? అట్లు జృంభాదులు కాన నగుట లేదే? మళ్ళీ సేతుబంధ మొనరించుటకా? సకల ద్వీపనాథులు తనకు వశవర్తులైయుండ, అట్లు చేయుటకు కారణము?" "ఈ నృపతి విష్ణువే"యను భావమున్ననే కాని ఈవికల్పములకర్థములేదు. కావున ఇచ్చటను స్వసిద్ధికై పరాక్షేపరూపమగు ఉపాదానలక్షణ [56]

ఇట రూపకాలంకారధ్వని [57] యనుట ప్రసిద్ధమే కదా కాని ఇది ఆక్షేపలభ్యమగు లక్ష్యార్థమనియే సమన్వయింపఁబడినది

ఇఁక రసధ్వని (అభిధా 6 కా ఉదా) :—

దుర్వారా మదనేషవో దిశి దిశి వ్యాజృంభతే మాధవో
హృద్యున్మాదకరాః శశాంకరుచయశ్చేతోహరాః కోకిలాః।
ఉత్తుంగస్తనభారదుర్ధరమిదం ప్రత్యగ్రమన్యద్వయః
సోఢవ్యాః సఖి! సాంప్రతం కథమమీ పంచాగ్నయో దుఃసహాః॥

---

55 అత్ర స్వతఃసంభవినా వస్తునా తత్ప్రతిపాదికయా భావిపరపురుషోప-భోగజ-నఖక్షతాదిగోపనం వస్తుమాత్రం వ్యజ్యతే॥ (సా ద 48 ఉదా)

56. "ప్రాప్తశ్రీ"రిత్యాదిషు త్రిషు వితర్కేషు భగవద్వాసుదేవవిషయేషు యథాయోగం తత్కార్యనిరాకరణహేతుగర్భతయా ప్రవర్తమానేషు నృపతేర్భగవద్వాసుదేవతాఽఽక్షిప్తా। తేనాత్ర ఉపాదానాత్మికా లక్షణా॥ (అభిధా పుట 14)

57. ఇత్యేవంవిధే విషయేఽనురణనరూపరూపకాశ్రయేణ కావ్యచారుత్వ-వ్యవస్థానాత్ రూపకధ్వనిరితి వ్యపదేశో న్యాయ్యః॥ (ధ్వన్యా. 2 26 కా ఉదా. వృత్తి)

"దుర్వారములగు మదనసాయకములు, వసంతఋతువ్యాజృంభణము, ఉన్మాదకరమగు వెన్నెల, మనోహరములగు కోకిలాలాపములు, నిండు యౌవనము, అను నీ పంచాగ్నులనెట్లు సహించుదును" ఈ వాచ్యార్థము తాను విరహిణి కాకున్న పొసఁగదు కదా! కావున వాచ్యార్థము స్వసిద్ధికై విప్రలంభ శృంగారరసము నాక్షేపించుటచే నా రసరూపార్థము ఉపాదానలక్షణచే కలిగిన లక్ష్యార్థమే [58]

ఇట్లు ముకులభట్టు త్రివిధధ్వనియు ఆక్షేపలభ్యమని యుపపాదించుచు లక్షణచే వ్యంజనను గతార్ధమొనర్పఁ జూచెను

కాని ఇది సరికాదు [59] శ్రుతములగు పదములకు అన్వయము కుదురుచుండ ఆక్షేపముచే నర్థాంతరప్రతిపత్తి చేయవలసిన యవసరముండదు పూర్వోదాహరణములయం దెచ్చటను అన్వయానుపపత్తియే లేదు ఇఁక పరాక్షేపరూపోపాదానలక్షణ ఎట్లుండును? [60] మొదటి యుదాహరణమున నీటి

---

58 అత్ర హి స్మరశరప్రభృతీనాం పంచానామధ్యారోపితవహ్నిభావానామసహ్యత్వం వాక్యార్థీభూతమ్। అతస్తస్య వాచ్యతా। తత్పర్యాలోచనసామర్థ్యాచ్చ విప్రలంభశృంగారస్యాక్షేప ఇత్యుపాదానాత్మికా లక్షణా వాచ్యనిబంధనా॥ (అభిధా 6 కా ఉదా వృత్తి)

59. కించ- యత్ర 'గంగాయాం ఘోషః' ఇత్యాదౌ ఉపాత్తశబ్దార్థానాం బుభూషన్నేవాన్వయోఽనుపపత్త్యా బాధ్యతే, తత్రైవ హి లక్షణాయాః ప్రవేశః। తదుక్తం న్యాయకుసుమాంజలావుదయనాచార్యైః—"శ్రుతాన్వయాదనాకాంక్షం న వాక్యం హ్యన్యదిచ్ఛతి। పదార్థాన్వయవైధుర్యాత్ తదాక్షిప్తేన సంగతిః॥" న పునః "శూన్యం వాసగృహం" ఇత్యాదౌ ముఖ్యార్థబాధః॥ (సా ద. 5 3 కా వృత్తి)

60. క) 'దృష్టిం హే ప్రతివేశిని' ఇత్యత్ర, 'ప్రాప్తశ్రీః' ఇత్యత్ర "దుర్వారా" ఇత్యత్ర చ నాదేయపానీయానయనేన పరపురుషసంభోగస్య, నఖదశనక్షతానాం చ నిహ్నవాత్మకం వస్తు, "భవాన్ హరి"రితి రూపకాలంకారః, విప్రలంభశృంగారశ్చ రసో, లక్ష్యత ఇతి నోదాహర్తవ్యమ్। ముఖ్యార్థస్య బాధాభావాత్। అసత్యా అపి సత్యాభిధానస్యైవంసంభవాత్ ఆక్షిప్తస్యాలంకారస్య లక్ష్యత్వే చ వక్ష్యమాణనయనే

నీటిని తెచ్చుటయను మిషచే పరపురుషసంభోగమును, శరీరమున ముళ్ళు గీరుటయను మిషచే నఖదంతక్షతాదులను కప్పిపుచ్చుట జరిగినది కాని అది లక్షణచే కాదు ముఖ్యార్ధబాధ లేదు కదా! కులట యయినను భర్తృస్నేహమున లేదా భయముననో ఒకప్పుడిట్లు యథార్థమును చెప్పవచ్చునుకదా కావున ముఖ్యార్థానుపపత్తినిశ్చయమే లేదు. శ్రుతములగు పదములు పరస్పరము అన్వితములై యుండ వాక్యార్థము నిరాకాంక్షమై యుండును, కాన ఆక్షేపలభ్యార్థముతో నవసరములేదు శ్రుతములగు పదముల యన్వయము కుదురకున్ననే ఆక్షేపలభ్యార్థముతో వాక్యార్థము సరిపెట్టుకొనవలయునని కదా నియమము. కావున అన్వయానుపపత్తి లేకుండుటచే అర్థాంతరము ఆక్షేపలభ్యమనుట తగదు.

---

పాత్రానయనస్య లక్ష్యత్వప్రసంగాత్। అబాధితస్యైవ వాచ్యస్య రస ప్రతీతికృత్త్వాత్॥ —మమ్మట (శబ్దవ్యాపార పుట. 5)

ఖ) తథా'దృష్టిం హే ప్రతివేశిని 'ఇత్యాదౌ నలగ్రంథీనాం తనూల్లేఖనమ్ ఏకాకితయా చ స్రోతోగమనం, తస్యాః పరకాముకోపభోగస్య లింగినో లింగమిత్యుచ్యతే, తచ్చాత్రైవాభిహితేన స్వకాంతస్నేహే-నాపి సంభవతీత్యనైకాంతికో హేతుః॥

(సా ద 5 3 కా వృత్తిలో)

గ) విభావానుభవప్రతిపాదకే కావ్యే ముఖ్యేఽర్థే తావద్బాధకానుప్రవేశోఽప్యసంభావ్య ఇతి కో లక్షణావకాశః? నను కిం బాధయా? ఇయదేవ లక్షణాస్వరూపమ్— 'అభిధేయావినాభూతప్రతీతిర్లక్షణోచ్యతే' ఇతి। ఇహ చాభిధేయానాం విభావానుభావాదీనామవినాభూతా రసాదయ ఇతి లక్ష్యంతే, విభావానుభావయోః కారణకార్యరూపత్వాత్, వ్యభిచారిణాం చ తత్సహకారిత్వాదితి చేత్—మైవమ్। ధూమాదిశబ్దాద్ధూమే ప్రతిపన్నే హ్యగ్నిస్మృతిరపి లక్షణాకృతైవ స్యాత్। తతోఽగ్నేః శీతాపనోదనస్మృతిరిత్యాదిరపర్యవసితః శబ్దార్థః స్యాత్। ధూమశబ్దస్య స్వార్థవిశ్రాంతత్వాత్ న తావతి వ్యాపార ఇతి చేత్, ఆయాతం తర్హి ముఖ్యార్థబాధో లక్షణాయా జీవితమితి, సతి తస్మిన్ స్వార్థవిశ్రాంత్యభావాత్। న చ విభావాదిప్రతిపాదనే బాధకం కించిదస్తి॥

—లోచన. (ధ్వన్యా 1 . 18 కా. వృత్తిపై)

ఇట్టి యుదాహరణమున ఉపాదానలక్షణ లేదు రెండవ యుదాహరణ మునను రూపకాలంకారరూపమగు నర్థాంతరము అవినాభావసంబంధమున నాక్షిప్తమే యయినను లక్ష్యార్థమని చెప్పవీలులేదు అవినాభావసంబంధము మాత్రము సరిపోదు లక్షణయనిన వాచ్యార్థమునకనుపత్తియు నుండవలెను. లేదేని 'అగ్గి తెమ్ము' అనుమాటకు 'పాత్ర తెమ్ము' అనునది లక్ష్యార్థము కావలసి వచ్చును. కావుననే మూడవ యుదాహరణమునను విప్రలంభ శృంగార రసము కూడ లక్ష్యార్థమనుటకు వీలులేదు. వాచ్యార్థము పొసఁగకున్న రసప్రతీతియే యుండదు. రసము లక్ష్యార్థమగునెడల దానికొక ప్రయోజన మన్వేషింపవల యును. రసమే పరమప్రయోజనమైయుండ మఱి దానికి వేఱు ప్రయోజన ముండునా ?

లక్షణ[61]యన ప్రయోజనముండితీరవలెను. గంగాతీరమున పల్లె యనుటకు బదులు 'గంగలో పల్లె' యనుట ఆ పల్లె మిక్కిలి చల్లనిదనియు పవిత్ర మయినదనియు నర్థమగుటకే కదా ! పల్లె ప్రవాహములో నుండుట పొసఁగదు. అయినను తెలిసి అట్లు పలుకుచుండుటచే ఆ గంగాపదమునకు తీరమనునది లక్ష్యార్థమగుచున్నది ఇఁక ప్రవాహమున కతిసమీపముననున్న తీరమున పల్లె యుండుట కేమియు అనుపపత్తి లేదు

ఇట్లు [62]వాచ్యార్థము లక్ష్యార్థరూపమున పరిణమించి వాచ్యార్థానుపపత్తిని పోగొట్టునదై యుండును. వస్త్వలంకారరసధ్వనులలో వాచ్యార్థము స్వయ

---

61. క) కించ-'శ్వశ్రూరత్ర నిమజ్జతి' (కావ్య 5 136 ఉదా) ఇత్యాదౌ వివక్షితాన్యపరవాచ్యే కథం లక్షణా, ముఖ్యార్థబాధాభావాత్। నను తత్రాపి తాత్పర్యాధీనాన్వయానుపపత్తిః "ఛత్రిణో యాంతీ"త్యాదావివేతి చేత్, న। లక్షణాయాం ప్రయోజననియమాత్॥
(కావ్యప్రదీప 5 . 3 కా. వృత్తి)

ఖ) తథా 'గంగాతటే ఘోషః'-ఇత్యాదేః ప్రయోగాత్ యేషాం న తథా ప్రతిపత్తిః, తేషాం పావనత్వాదీనాం ధర్మాణాం తథాప్రతిపాదనాత్మనః ప్రయోజనాచ్చ ముఖ్యేనాముఖ్యార్థో లక్ష్యతే॥
(కావ్య 2 9 కా.వృత్తి)

62. అయం చావరో రూపభేదో యద్ గుణవృత్త్యా యదాఽర్థోఽర్థాంతరముపలక్షయతి, తదోపలక్షణీయాత్మనా పరిణత ఏవాసౌ సంపద్యతే।

ముగా ప్రకాశించుచునే ప్రతీయమానార్థమును ప్రకాశింపఁజేయును. మఱియు వ్యంగ్యత్రయప్రతీతికంటె నితరమగు ప్రయోజన మిట నాసింపఁబడి యుండ లేదు ఇదియే ముఖ్యముకదా ! కావున వస్త్వలంకారరసాదులు లక్ష్యార్థము లెట్లగును ?

[63]తీరము లక్ష్యార్థము కాఁగా శైత్యపావనత్వాదులు దానికి ప్రయోజనమై యున్నవి అవియును లక్షణచే బోధితములు కాఁజాలవు లక్షణయనిన ముఖ్యార్థబాధ యుండవలెను తీరము లక్ష్యార్థమే కాని ముఖ్యార్థము కాదుకదా! ఇఁక దానికి బాధయనున దెట్లుండును? గంగాశబ్దలక్ష్యార్థమగు తటమునకు శైత్యపావనత్వాదులకు నేవిధమైన సంబంధమును లేదు మఱియు శైత్యపావనత్వాదులట్లు లక్షణీయములగుట కొక ప్రయోజన ముండవలెను కదా ! అదియును లేదు ఇట్లు లక్షణా ప్రయోజకములగు సంబంధానుపపత్తిప్రయోజనములు మూడును లేకుండుటచే శైత్యపావనత్వాదులు లక్షణచె బోధితములు కాఁజాలవు

[64]తీరమునందలి శైత్యపావనత్వాదులు లక్షణీయములగుటకు ప్రయోజనము గొల్లపల్లెయందు చల్లఁదనమున్నది కదా ! యని యందురేమో? అయి

---

యథా "గంగాయాం ఘోష" ఇత్యాదౌ। వ్యంజకత్వమార్గే తు యదాఽర్థోఽర్థాంతరం ద్యోతయతి తదా స్వరూపం ప్రకాశయన్నేవ అసావన్యస్య ప్రకాశకః ప్రతీయతే ప్రదీపవత్॥ —లోచన (ధ్వన్యా 3 33 కా వృత్తి)

63. యథా గంగాశబ్దః స్రోతసి సబాధ ఇతి తటం లక్షయతి, తద్వత్ యది తటేఽపి సబాధః స్యాత్, తత్ ప్రయోజనం లక్షయేత్, న చ తటం ముఖ్యోఽర్థః। నాప్యత్ర బాధః, న చ గంగాశబ్దార్థస్య తటస్య పావనత్వాద్యైర్లక్షణీయైః సంబంధః, నాపి ప్రయోజనే లక్ష్యే కించిత్ ప్రయోజనమ్। నాపి గంగాశబ్దస్తటమివ ప్రయోజనం ప్రతిపాదయతు మసమర్థః॥ (కావ్య 2 16 వృత్తి)

64. క) నన్వస్తి ప్రయోజనే లక్ష్యే ప్రయోజనాంతరమ్। తచ్చ తీరనిష్ఠశైత్యపావనత్వే లక్ష్యే ఘోషనిష్ఠం పావనత్వాది వ్యంగ్యమితి వితండాతో బ్రూయాత్, తత్రాహ—ఏవమప్యనవస్థేతి॥
—బాలబోధినీ (కావ్యప్రకాశ. 2 . 17-1)

ఖ) "ఏవమప్యనవస్థా స్యాత్ యామూలక్షయకారిణీ" (కావ్య. 2.17 కా.)

నను ఆ ప్రయోజనమువిషయమున వ్యాపారాంతరము నంగీకరించి తీరవలసి యుండును అదియు లక్షణచేతనే యనిన మఱి దాని ప్రయోజనమోః ఇట్లనవస్థ యేర్పడును

[65] లక్షణచే నేకకాలమున ప్రయోజనసహితమగు తటాదికము బోధిత మగునని యనుటకును వీలులేదు లక్షణాజన్యమగు తటాదిజ్ఞానమునకు శైత్య పావనత్వాదిప్రయోజనజ్ఞానము ఫలమగుటంజేసి ఆరెండును ఏకకాలమున నెట్లు బోధితములగును

[66] కావున శీతత్వపావనత్వాదిరూపమగు ప్రయోజనమును బోధించుటకై లక్షణ సమర్థము కాదు. ఆ ప్రయోజనమును బోధించుటకై సమర్థ మగునది వ్యంజనయే యగును.

---

65. క) న చాపి ప్రయోజనవిశిష్ట ఏవ తీరే లక్షణా, విషయప్రయోజనయోః యుగపత్ప్రతీత్యనభ్యుపగమాత్॥ (సా ద 5 3 కా. వృత్తి)

ఖ) ప్రయోజనేన సహితం లక్షణీయం న యుజ్యతే।
జ్ఞానస్య విషయో హ్యన్యః ఫలమన్యదుదాహృతమ్॥
(కావ్య. 2. 17, 18)

గ) ఏవం చ- లక్షణాజన్యజ్ఞానవిషయత్వేన తత్ఫలస్య శైత్యపావనత్వాదే ర్లక్షణావిషయత్వం న యుక్తమితి ఫలితోఽర్థః॥
—బాలబోధినీ (కావ్యప్రకాశ. 2. 17 కా. వ్యాఖ్య)

66 క) ఏవం ప్రయోజనవిశిష్టే లక్షణాయా అసంభవాత్, ప్రయోజన-స్యాపి పృథక్ లక్ష్యత్వే త్వనవస్థాపాతాత్, ప్రయోజనజ్ఞానార్థం వ్యంజనావృత్తిరవశ్యం స్వీకర్తవ్యేతి తయైవ సర్వత్ర బోధసంభవే తదర్థమపూర్వలక్షణాసామర్థ్యకల్పనమత్యంతానుచితమితి భావః॥
—లక్ష్మీవ్యాఖ్య (సా ద 5.3 కా. వృత్తిపై)

ఖ) యస్య ప్రతీతిమాధాతుం లక్షణా సముపాస్యతే।
ఫలే శబ్దైకగమ్యేఽత్ర వ్యంజనాన్నాపరా క్రియా॥
(కావ్య. 2.14 కా.)

ప్రకృతమున వస్త్వలంకారరసాదులప్రతీతియే ముఖ్యమగుటచే దానికి వేఱొక ప్రయోజనము లేకుండుటచె ముఖ్యార్థబాధాదిహేతుసాపేక్షమగు లక్షణ గాక వ్యంజనయే ఇట ప్రవర్తిల్లును. కావున వస్త్వలంకారరసాదులు వ్యంగ్యములే యగును లక్షణీయార్థములు కావు

**లక్షణా వ్యంజనలకు గల పరస్పర వైలక్షణ్యము –**

లక్షణయు [67] వ్యంజనయును ఏకరూపములు (అభిన్నములు) కావు అట్లేని లక్షణయున్నచోటులన్నింటను ధ్వని యుండవలెను కదా! అట్లు కాన నగుట లేదు- ఉదా (ధ్వన్యా 1.14 కా ఉదా) –

పరిమ్లానం పీనస్తనజఘనసంగాదుభయతః,
తనోర్మధ్యస్యాంతఃపరిమిలనమప్రాప్య హరితమ్।
ఇదం వ్యస్తన్యాసం శ్లథభుజలతాక్షేపవలనైః
కృశాంగ్యాః సంతాపం వదతి బిసినీపత్రశయనమ్॥

పీనములగు స్తనజఘనములయొక్క తాకిడిచే రెండువైపులవాడినదియు సన్ననినడుము అనకుండుటచే మధ్యభాగమున పచ్చనైనదియును, శిథిలములగు భుజలతలను శయ్యాప్రాంతములయందు పడవేయుటచేతను దొర్లింపులచేతను కలగాపులగముగాఁజేయఁబడినదియును అగు తామరాకులసెజ్జ ఈచిక్కిన చిన్నదానియొక్క సంతాపాతిశయమును చెప్పుచున్నది.

[68] ఇట అచేతనమగు శయ్య ఎట్లు చెప్పును ? కాన ముఖ్యార్థబాధ, సాదృశ్యసంబంధముచే, చెప్పుటయన "తెల్పుట"యని లక్ష్యార్థము స్పష్టప్రతి

---

గ) ప్రయోజనేఽవగమయితవ్యే న లక్షణాఖ్యో వ్యాపారః, తత్సామగ్ర్యభావాత్। న చ నాస్తి వ్యాపారః। న చాసావభిధా। సమయస్య తత్రాభావాత్। యద్ వ్యాపారాంతరమభిధాలక్షణాతిరిక్తం స ధ్వననవ్యాపారః॥ —లోచన (ధ్వన్యా. 1 17 కా వృత్తిపై)

67. భక్త్యా బిభర్తి నైకత్వం రూపభేదాదయం ధ్వనిః।
అతివ్యాప్తేరథావ్యాప్తేర్న చాసౌ లక్ష్యతే తయా॥ (ధ్వన్యా.1 . 14)

68 అత్ర శయనస్య అచేతనస్య ముఖ్యార్థవచనకర్తృత్వాన్వయానుపపత్త్యా ముఖ్యార్థబాధేన జ్ఞాపనం సాదృశ్యాల్లక్ష్యతే, స్ఫుటీకరణప్రతిపత్తిశ్చ ప్రయోజనమ్॥ —బాలప్రియా (లోచనవ్యాఖ్య) (ధ్వన్యా. 1 14 కా.ఉదా )

పత్తి ప్రయోజనము కావున లక్షణ యున్నది. కాని ఏ విశేషము లేకుండుటచే ఇక్కడ ధ్వని లేదు [69] ప్రయోజనవిషయమున వ్యంజనావ్యాపారమున్నను దానివలన నే యుపయోగము లేకుండుటచే లేనిక్రిందనే లెక్క. ఏ ఫలము నాశించి అట్లు శబ్దప్రయోగము చేయఁబడునో, అదియే కదా ప్రయోజనము ఈ ప్రయోజనమట్టిది కాదు ఇట్లు చెప్పుటలో నొక క్రొత్తయందమున్న దనియా? ఆ ప్రయోజనముద్దేశింపబడుటకు అట్టి యందమేమియు లేదు కదా! కేవలము ప్రసిద్ధ్యనురోధమున కవులప్పుడప్పుడట్లు లాక్షణికశబ్దప్రయోగము చేయుట సహజము [70] ఇదియు నిరూఢలక్షణవంటిదే అట్లుచెప్పిననే కాక మఱేవిధమున చెప్పినను ఆయర్థమునకొక వన్నెచేకూరదో, అదియే ధ్వని యగును అట్టియర్థసౌందర్యము పూర్వోదాహరణమున లేదు కావున నది ధ్వనియని చెప్పనొప్పదు [71]

---

69 క) యత్ర లక్షణావ్యాపారాత్ తృతీయాదన్యః చతుర్థః ప్రయోజన-ద్యోతనాత్మా వ్యాపారో వస్తుస్థిత్యా సంభవన్నపి అనుపయుజ్యమాన-త్వేనానాద్రియమాణత్వాత్ అసత్కల్పః। 'యమర్థమధికృత్య' ఇతి హి ప్రయోజనలక్షణమ్। తత్రాపి లక్షణాస్తీతి కథం ధ్వననం లక్షణం చేత్యేకం తత్త్వం స్యాత్॥ —లోచన (ధ్వన్యా 1.14 కారికపై)

ఖ) వదతీత్యుపచారే హి స్ఫుటీకరణప్రతిపత్తిః ప్రయోజనమ్। యద్య-గూఢం స్వశబ్దేనోచ్యేత కిమచారుత్వం స్యాత్। గూఢతయా వర్ణనే వా కిం చారుత్వమధికం జాతమ్॥ -లోచన (ధ్వన్యా. 1 14 కా.వృత్తిపై)

70 యత్ర హి వ్యంగ్యకృతం మహత్ సౌష్ఠవం నాస్తి తత్రాప్యుపచరిత-శబ్దవృత్త్యా ప్రసిద్ధ్యనురోధప్రవర్తితవ్యవహారాః కవయో దృశ్యంతే।
(ధ్వన్యా. 1.14 కా. వృత్తి)

71. క) ఉక్త్యంతరేణాశక్యం యత్ తచ్చారుత్వం ప్రకాశయన్।
శబ్దో వ్యంజకతాం బిభ్రత్ ధ్వన్యుక్తేర్విషయీభవేత్॥
(ధ్వన్యా. 1.15)

ఖ) అత్ర చోదాహృతే విషయే నోక్త్యంతరాశక్యచారుత్వవ్యక్తిహేతుః శబ్దః॥ (ధ్వన్యా 1 15 కా. వృత్తి)

నిరూఢలక్షణ అభిధాసదృశమనియే ప్రసిద్ధిగాంచినది.[72] కావున దానిలో నేవిధమైన ప్రయోజనము ఆశింపఁబడకుండుటచే వ్యంజనాప్రసక్తియే లేదు [73]

ప్రయోజనవతియగు లక్షణయందైనను అవివక్షితవాచ్యధ్వనులలో అన్వయానుపపత్తిని తొలగించుటకై కావలసినశక్యసంబంధమగునర్థమువిషయమున లక్షణయు, ప్రయోజనాంశమున వ్యంజనయు నుండుటచె నీరెంటికిఁగల విషయభేదము స్పష్టమే కదా [74]

వివక్షితాన్యపరవాచ్యములగు అసంలక్ష్యక్రమధ్వనులలో వాచ్యార్థమున కనుపపత్తియే లేదు కావున లక్షణ ఎట్లుండును ? [75]

ఇట్లుండ వ్యంజనయు లక్షణయు నేకరూపములే (అభిన్నములే) యనుట అవిచారితరమణీయమే యగును

మఱియు వ్యంజన యొకప్పుడు (వివక్షితాన్యపరవాచ్యధ్వనిలో) అభిధనాశ్రయించియుండును. ఒకప్పుడు (అవివక్షితవాచ్యధ్వనిలో) లక్షణ నాశ్రయించి యుండును ఒకొకప్పుడు అవాచకములు అలాక్షణికములును అగు గీతిధ్వనులను గూడ నాశ్రయించి యుండును గీతిధ్వనులును రసస్ఫూర్తిని

---

72 'నిరూఢా లక్షణాః కాశ్చిత్ సామర్థ్యాదభిధానవత్" (తంత్రవార్తిక 3 1 8)

73 క) రూఢా యే విషయేఽన్యత్ర శబ్దాః స్వవిషయాదపి।
లావణ్యాద్యాః ప్రయుక్తాస్తే న భవంతి పదం ధ్వనేః॥ (ధ్వన్యా. 1.16)

ఖ) న చాత్ర ప్రయోజనం కించిదుద్దిశ్య లక్షణా ప్రవృత్తేతి న తద్విషయో ధ్వననవ్యాపారః॥ —లోచన (ధ్వన్యా. 1 16 కా. వ్యాఖ్య)

74. సప్రయోజనాయాం లక్షణాయాం తదతిరిక్తో వ్యాపారోఽవశ్యమంగీకార్యః। తథాచ-సతి ప్రయోజనే లక్షణా। తచ్చ న ముఖ్యార్థబాధనిమిత్తవత్ ప్రమాణాంతరాద్ బోద్ధవ్యమ్। తదర్థమేవ లక్షణాశబ్దప్రయోగాత్॥
—మమ్మట (శబ్దవ్యాపార పుట 5)

75. విభావానుభావప్రతిపాదకే కావ్యే ముఖ్యేఽర్థే తావద్ బాధకానుప్రవేశోఽవ్యసంభావ్య ఇతి కో లక్షణావకాశః ?
—లోచన. (ధ్వన్యా. 1 18 వృత్తిపై)

కలుగఁజేయునవియేకదా ! వ్యంజనకు శబ్దమే యక్కఱలేదు క్రీఁగంటి చూపులనాశ్రయించియు నుండును 76

ఇంత విలక్షణమగు వ్యంజన లక్షణచే నెట్లు గతార్థమగును ?

---

76 క) వ్యంజకత్వం హి క్వచిద్వాచకత్వాశ్రయేణ వ్యవతిష్ఠతే, యథా-వివక్షితాన్యపరవాచ్యే ధ్వనౌ। క్వచిత్తు గుణవృత్త్యాశ్రయేణ, యథా-అవివక్షితవాచ్యే ధ్వనౌ। తదుభయాశ్రయత్వప్రతిపాదనాయైవ చ ధ్వనేః ప్రథమతరం ద్వౌ ప్రభేదావుపన్యస్తౌ। తదుభయాశ్రయత్వాచ్చ తదేకరూపత్వం తస్య న శక్యతే వక్తుమ్। యస్మాన్న తద్వాచకత్వైకరూపమేవ, క్వచిల్లక్షణాశ్రయేణ వృత్తేః। న చ లక్షణైకరూపమేవ, అన్యత్ర వాచకత్వాశ్రయేణ వ్యవస్థానాత్। న చోభయధర్మత్వేనైవ తదేకైకరూపం న భవతి। యావద్వాచకత్వలక్షణాదిరూపరహితశబ్దధర్మత్వేనాపి। తథాహి గీతధ్వనీనామపి వ్యంజకత్వమస్తి రసాదివిషయమ్। న చ తేషాం వాచకత్వం లక్షణా వా కథంచిల్లక్ష్యతే। శబ్దాదన్యాత్రాపి విషయే వ్యంజకత్వస్య దర్శనాత్ వాచకత్వాది శబ్దధర్మప్రకారత్వమయుక్తం వక్తుమ్॥

—లోచన (ధ్వన్యా తృతీయ పుట 428)

ఖ) న చ లక్షణాత్మకమేవ ధ్వననం తదనుగమేన తస్య దర్శనాత్ । న చ తదనుగతమేవ, అభిధావలంబనేనాపి తస్య భావాత్। న చోభయానుసార్యేవ, అవాచకవర్ణానుసారేణాపి తస్యదృష్టేః। న చ శబ్దానుసార్యేవ, అశబ్దాత్మకనేత్రత్రిభాగావలోకనాదిగతత్వేనాపి తస్య ప్రసిద్ధేరితి॥ —కావ్యప్రకాశ. (5 . 136 ఉదా- వృత్తి)

గ) కించ న లక్షణావ్యంజనయోరభేదః। లక్షణాముపజీవ్య తద్వ్యాపారాత్। నాపి లక్షణానుగతమేవ ధ్వననమితి ధ్వనేస్తల్లక్షణమితి వాచ్యమ్। అభిధోపజీవనేనాపి భావాత్। న చ లక్షణాభిధోభయానుసార్యేవ। వర్ణమాత్రానుసారేణాపి హి దృశ్యతే రసాదివ్యంజనాః న చ వర్ణమాత్రేఽభిధా లక్షణా వా। నాపి శబ్దానుసార్యేవ। వికసన్నరక్తనేత్రత్రిభాగాలోకనాదావపి ప్రసిద్ధేః॥

—కావ్యప్రదీప (5 . 3 కా వృత్తి)

ఇంతేగాక వ్యంగ్యార్థము వక్తృబోద్ధవ్యాదివైశిష్ట్యము ననుసరించి పలు విధములై భాసించును లక్ష్యార్థమట్లు కాదు

"రామోఽస్మి సర్వం సహే' మున్నగు నుదాహరణములయందు "రామపదలక్ష్యార్థములును పలువిధములై యున్నవి కదా"యని యందురేమో? ఔను 'రామోఽస్మి సర్వం సహే' అనునప్పుడు తాను రాముడై యుండియు నేను రాముడనని చెప్పుకొనుట పొసఁగదు కావున రామపదమునకు "సకలదుఃఖ భాజనుఁడగు రాముడు" అను విశేషార్థము లక్ష్యార్థమగుచున్నది ఇట్లే "రామేణ ప్రియజీవితేన' అనునప్పుడు "స్వార్థపరుఁడును నిర్దయుఁడును అగు రాముఁ" డనియు, "రామోఽసౌ భువనేషు' అనునప్పుడు "ఖరదూషణాదినిహంతయగు రాముఁ"డనియు లక్ష్యార్థములు ఇట్లు ఒకే రామపదమునకు ప్రకరణాదివైశిష్ట్యమున లక్ష్యార్థములనేకములై యున్నవి అంతమాత్రమున వ్యంగ్యార్థము లక్ష్యార్థమును అభిన్నములు కావు శ్లిష్టపదమునకుఁగల నానార్థములవలె నాయర్థ విశేషము (లక్ష్యార్థము) లన్నియు నియతములయియే యుండును శక్యార్థముతో—నియతసంబంధములేని యర్థమును లక్షణ బోధింపఁజాలదు కదా! 77

---

77. క) నను 'రామోఽస్మిస్వరం సహే' ఇతి "రామేణ ప్రియజీవితేన తు కృతం ప్రేమ్ణః ప్రియే! నోచితమ్" ఇతి, రామోఽసౌ భువనేషు విక్రమగుణైః ప్రాప్తః ప్రసిద్ధిం పరామ్" ఇత్యాదౌ లక్షణీయోఽప్యర్థో నానాత్వం భజతే విశేషవ్యపదేహేతుశ్చ భవతి, తదవగమశ్చ శబ్దార్థాయత్తః ప్రకరణాదిసవ్యపేక్షశ్చేతి కోఽయం నూతనః ప్రతీయమానో నామ? ఉచ్యతే। లక్షణీయస్యార్థస్య నానాత్వేఽపి అనేకార్థశబ్దాభిధేయవన్నియతత్వమేవ, న ఖలు ముఖ్యేనార్థేనానియతసంబంధో లక్షయితుం శక్యతే। ప్రతీయమానస్తు ప్రకరణాదివిశేషవశేన నియతసంబంధః అనియతసంబంధః సంబద్ధసంబంధశ్చ ద్యోత్యతే॥

—కావ్యప్రకాశ. (5 135 ఉదా వృత్తి)

ఖ) నన్వస్తు లక్షణా। న హి వాచ్యవల్లక్ష్యోఽపి వ్యవస్థితో విశేషవ్యపదేశహేతుర్వా। యతః— 'రామోఽస్మి సర్వం సహే' ఇత్యత్ర రామపదేన సర్వదుఃఖభాజనత్వం, "రామేణ ప్రియజీవితేన తు కృతం ప్రేమ్ణః ప్రియే నోచితమ్" ఇత్యత్ర కాతరత్వం, "రామోఽసౌ భువనేషు విక్రమగుణైః" ఇత్యత్ర ఖరదూషణాదిహన్తృత్వం చ లక్ష్యతే। అతో రామ-

ఇఁక వ్యంజనయో॥ ప్రకరణవిశేషాదివశమున నియతసంబంధమును అనియత సంబంధమును సంబద్ధసంబంధమును (గలవి) అగు నర్థవిశేషముల నెన్నింటినో స్ఫురింపఁజేయును [78]

ఇట్లు లక్ష్యార్థవ్యంగ్యార్థముల కెంతయో భేదమున్నది.

[79] అభిధ కేవలసంకేతసాపేక్షమై యుండును ఇఁక లక్షణ సంకేతమునే కాక ముఖ్యార్థబాధతత్సంబంధములను రూఢిప్రయోజనాన్యతరమును

---

పదస్య లక్ష్య ఏవానేకో భవతి। అర్థాంతరసంక్రమితవాచ్యవిశేషవ్యపదేశహేతుశ్చ భవతి। ఏవమాన్యత్రాపి స్యాత్। తదుక్తం - 'భాక్తమాహుస్తమన్యే' ఇతి। లక్షణీయవిశేషావగమశ్చ ప్రకరణాదిసాపేక్షేణ శక్యార్థేన స్యాత్। అతో నాస్త్యతిరిక్తః ప్రతీయమానః। మైవమ్। లక్షణీయస్య నానాత్వేఽపి హి నానార్థ(క)సైంధవాదిపధాభిధేయస్యేవ నియతత్వమేవ। న ఖల్వనియతసంబందో ముఖ్యేనార్థేన లక్షయతుం శక్యతే। ప్రతీయమానస్తు ప్రకరణాదివశేన నియతసంబందోఽనియతసంబంధః సంబద్ధసంబంధశ్చేతి సోదాహరణమగ్రే దర్శయిష్యతే॥

—కావ్యప్రదీప (5 3 కా వృత్తి)

78. క) అత్ర-'శ్వశ్రూరత్ర' (కా ప్రకా 5 136) ఇత్యాదౌ నియతసంబంధః 'కస్య వా న భవతి రోషో' (కా ప్రకా 5 135) ఇత్యాదావనియతసంబంధః "విపరీతరతే లక్ష్మీః దృష్ట్వా బ్రహ్మాణం నాభికమలస్థమ్। హరేర్దక్షిణనయనం రసాకులా ఝటితి స్థగయతి॥" ఇత్యాదౌ సంబద్ధసంబంధః। అత్ర హి హరిపదేన దక్షిణనయనస్య సూర్యాత్మకతా వ్యజ్యతే। తన్నిమీలనేన సూర్యాస్తమయః, తేన పద్మస్య సంకోచః, తతో బ్రహ్మణః స్థగనం, తత్ర సతి గోప్యాంగాదర్శనేన అనిర్యంత్రణం నిధువనవిలసితమితి॥ —కావ్యప్రకాశ (5 135 ఉదా. వృత్తి)

ఖ) "శ్వశ్రూరత్ర" "కస్య వా న భవతి" ఈ రెండుదాహరణములు పూర్వము (పుట 71, 60) వివరింపఁబడినవి ఇఁక సంబద్ధసంబంధ వ్యంగ్య విషయమున "పశ్య నిశ్చలనిష్పందా" అనునుదాహరణము సరిపోవును. అదియు పూర్వము (పుట 74) వివరింపఁబడినది —రచయిత

79 క) యథా చ సమయసవ్యపేక్షా అభిధా తథా ముఖ్యార్థబాధాదిత్రయసమయవిశేషసవ్యపేక్షా లక్షణా, అత ఏవాభిధాపుచ్ఛభూతా సేత్యాహుః॥

(కావ్యప్రకాశ 5.136 ఉదా. వృత్తి)

కూడ నపేక్షించును. ముఖ్యార్థబాధాదుల నపేక్షించక కేవలము వక్తృబోద్ధవ్యాది వైశిష్ట్యముల పురస్కరించుకొని ప్రవర్తించునది వ్యంజన. ఇట్లు సహకారి భేద ముండుటచేతనే 'అభిధాలక్షణావ్యంజనలు' అను పేర నీ మూడు(శబ్ద) వృత్తులను విడివిడిగా గుర్తించవలసివచ్చినది

[80] సహకారిభేదమున్నను వ్యంజనను కాదని లక్షణయే వస్త్వలంకార రసాదుల విషయమునను సమర్థమగుననిన, అ లక్షణ వృత్త్యంతరముగా సిద్ధించుటలో నాసహకారిభేదమే కదా కారణము కావున ఇఁక లక్షణతో పని యేమి? సర్వమును అభిధతోనే గతార్థముచెయవచ్చును

---

ఖ) సమయాపేక్షా వాచ్యాగమనశక్తిరభిధాశక్తిః। తదన్యథానుపపత్తిసహాయార్థావబోధనశక్తిస్తాత్పర్యశక్తిః। ముఖ్యార్థబాధాదిసహకార్యపేక్షార్థప్రతిభాసనశక్తిర్లక్షణాశక్తిః। తచ్ఛక్తిత్రయోపజనితార్థావగమమూలజాత తత్ప్రతిభాసపవిత్రితప్రతిపత్తృప్రతిభాసహాయార్థద్యోతనశక్తిర్ధ్వననవ్యాపారః॥ సహకారిభేదాచ్ఛక్తిభేదః।

—లోచన (ధ్వన్యా. 1 4 కా వృత్తిపై)

గ) యథా హి సంకేతగ్రహసాపేక్షా అభిధా, తథా ముఖ్యార్థబాధతద్యోగరూఢిప్రయోజనాన్యతరస్య ముఖ్యార్థసంకేతగ్రహస్య చ సాపేక్షా లక్షణా తత్కథం రూఢేః ప్రయోజనస్య వా అభావే సా భవేదితి"

—బాలబోధినీ. (కావ్యప్రకాశ 5 136 ఉదాహరణవృత్తిపై)

80 ఏవం చ- ముఖ్యార్థబాధాదిసాపేక్షత్వరూపాద్ వైధర్మ్యాత్ యథా అభిధాతో లక్షణాయా భేదః, తథా ముఖ్యార్థబాధాద్యనపేక్షత్వరూపవైధర్మ్యాత్ లక్షణాతో వ్యంజనాయా భేద ఇతి బోద్ధ్యమ్। . ... . కిం చ వ్యంజకవాక్యస్య వాక్యాంతరతో వైలక్షణ్యం ప్రతీయతే। తత్ర చ అభిధాతోఽర్థోపస్థితౌ యావతీ సామగ్రీ తావతీ న వ్యంగ్యార్థోపస్థితావితి స్థితేః సహకారివిశేషే కల్పనీయేఽభిధాయా ఏవ తత్ కల్ప్యతే చేత్ తదా స్వభావభంగ ఇత్యగత్యా వృత్త్యంతరం కల్ప్యతే। అన్యథా ముఖ్యార్థబాధాదిసహకారేణ అభిధయైవ లక్ష్యార్థోపస్థితిసంభవే లక్షణాఽపి వృత్త్యంతరం న సిద్ధ్యేదితి సారబోధిన్యాదౌ స్పష్టమ్॥

—బాలబోధినీ (కావ్యప్రకాశ. 5 . 136 ఉదా.)

కావున [81]వక్తృవాచ్యాదివైవిష్ట్యరూపసహకారము నాశ్రయించియే లక్షణచే వ్యంజనను గతార్థముచేయఁబూనుట అవిచారితరమణీయమే యగును

**అనుమానాంతార్భావము — తత్ఖండనము -**

(అనుమానముచే వ్యంజన గతార్థము కాదు)

వ్యక్తివివేకకారుఁడగు మహిమభట్టు (1000_1050 AD) ఈ త్రివిధ వ్యంగ్యార్థము అనుమేయమే యగునని ఉపాదింపఁబూనెను [82] అతఁడిట్లుపపాదింపఁబూనుటకు కారణము లేకపోలేదు మొదట 'శ్రీశంకుకుఁడు(813AD)[83] అను తార్కికప్రవరుఁడు భరతమునిరససూత్రమును వ్యాఖ్యానించుచు "రసమనుమేయ"మని నుడివెను తరువాతివాఁడగు[84] జయంతభట్టును విధినిషేధరూప-

---

81 వక్తుర్వాక్యస్య వాచ్యస్య రూపభేదావధారణాత్।
లక్షణా షట్ప్రకారైషా వివేక్తవ్యా మనీషిభిః॥ (అభిధా. కా 6 పుట 10)

82. అనుమానేఽంతర్భావం సర్వస్యైవ ధ్వనేః ప్రకాశయితుమ్।
వ్యక్తివివేకం కురుతే ప్రణమ్య మహిమా పరాం వాచమ్॥
(వ్యక్తివివేక 1 1)

83. క) తస్మాద్ హేతుభిర్విభావాఖ్యైః కార్యైరనుభావాత్మభిః సహచారిరూపైశ్చ వ్యభిచారిభిః ప్రయత్నార్జితతయా కృత్రిమైరపి తథానభిమన్యమానైః అనుకర్తృస్థత్వేన లింగబలతః ప్రతీయమానః స్థాయిభావో ముఖ్య-రామాదిగతస్థాయ్యనుకరణరూపః। అనుకరణత్వాదేవ చ నామాంతరేణ వ్యపదిష్టో రసః॥ —అభినవభారతి (6 31 కా వృత్తి)

ఖ) ఇత్యాదికావ్యానుసంధానబలాత్ శిక్షాభ్యాసనిర్వర్తితస్వకార్యప్రకటనేన చ నటేనైవ ప్రకాశితైః కారణకార్యసహకారిభిః కృత్రిమైరపి తథానభి-మన్యమానైర్విభావాదిశబ్దవ్యపదేశ్యైః 'సంయోగాత్' గమ్యగమకభావ-రూపాత్ అనుమీయమానోఽపి వస్తుసౌందర్యబలాద్రసనీయత్వేన అన్యా-నుమీయమానవిలక్షణః స్థాయిత్వేన సంభావ్యమానో రత్యాదిర్భావః తత్రాసన్నపి సామాజికానాం వాసనయా చర్వ్యమాణో రస ఇతి శ్రీశంకుకః॥ —కావ్యప్రకాశ (4 26 ఉదా వృత్తి)

84 ఏతేన శబ్దసామర్థ్యమహిమ్నా సోఽపి వారితః।
యమన్యః పండితమ్మన్యః ప్రపేదే కంచన ధ్వనిమ్॥

వ్యంగ్యము అనుమేయమే యగుననెను ఆనందవర్ధనాచార్యులును పూర్వపక్ష-రూపమున తార్కికమతమునుపస్థాపించుచు వ్యంగ్యవ్యంజకభావమన లింగి-లింగభావమే కాని వేఱొండు కాదనియు కావున వక్త్రభిప్రాయరూపమగు వ్యంగ్య మనుమేయమగునని పరమతముననువదించియున్నారు [85]

దీనినూతఁగాఁగొనిన మహిమభట్టు అనుమానముచే ధ్వనివాదము సర్వము నున్మూలింపఁజూచెను. అతనియభిప్రాయసారాంశమిది –

ఒకానొకయర్థమర్థాంతరమును తోపింపఁజేయుచున్నదనిన ఆ రెండిం-టికేదో నియతసంబంధముండితీరవలెను లేదేని ఆయర్థము దానికి సంబం-ధించనియర్థమునైనను స్ఫురింపఁజేయవలసివచ్చును కావున వ్యంగ్యవ్యంజక భావమనునది నియతసంబంధముండిననే కుదురును. విచారించిన నట్టిసంబం-ధము వ్యాప్యవ్యాపకభావ(కార్యకారణభావ)రూపమే యగును ధూమమునుబట్టి పర్వతమున అగ్నియున్నదని నిర్ధారించినటులు వాచ్యార్థమునుబట్టి ఆ వ్యంగ్యా-ర్థము కూడ ఊహింపఁబడుటచే నిదియు అనుమేయమే యగును [86]

ఉదా. (వ్యక్తి 31) –

---

'భ్రమ ధార్మిక విస్రబ్ధో' 'మా స్మ పాంథ గృహం విశ'।
విధే ర్నిషేధావగతిర్విధిబుద్ధి ర్నిషేధతః॥
మానాంతరపరిచ్ఛేద్యవస్తురూపోపదేశినామ్।
శబ్దానామేవ సామర్థ్యం తత్ర తత్ర తథా తథా॥

–జయంతభట్ట. (న్యాయమంజరీ పుట. 45)

85 వ్యంజకత్వం శబ్దానాం గమకత్వం। తచ్చ లింగత్వమతశ్చ వ్యంగ్య-ప్రతీతిర్లింగిప్రతీతిరేవేతి లింగిలింగభావ ఏవ తేషాం వ్యంగ్యవ్యంజక భావో నాపరః కశ్చిత్॥ (ధ్వన్యా 3 33 కా. వృత్తి)

86 క) సర్వ ఏవ హి శాబ్దో వ్యవహారః సాధ్యసాధనభావగర్భతయా ప్రాయే-ణానుమానరూపోఽభ్యుపగంతవ్యః, తస్య పరప్రవృత్తినిబంధనత్వాత్ తయోశ్చ సంప్రత్యయాసంప్రత్యయాత్మనో రన్యథాకర్తుమశక్యత్వతః। న హి యుక్తిమనవగచ్ఛన్ కశ్చిద్విపశ్చిద్ వచనమాత్రాత్ సంప్రత్య-యభాగ్భవతి॥ (వ్యక్తి ప్రథమ పుట 27)

భ్రమ ధార్మిక ! విస్రబ్ధః స శునకోఽద్య మారితస్తేన।
గోదానదీకచ్ఛకుంజవాసినా దృప్తసింహేన॥

"ఓ ధార్మికుడా ! నీ యిచ్ఛ వచ్చినటులు తిరుగవచ్చును. ఇఁక నేయాటంకము లేదు ఆ మా పెంపుడుకుక్కను గోదావరీతీరమునందలిపొద-రింటనుండు సింహము మట్టుపెట్టినది ఇఁక భయమెందుకు ?" తమ స్వైరవిహారమునకంతరాయభూతుఁడగు ధార్మికునుద్దేశించి ఒక పుంశ్చలి పలికిన పలుకులివి—

ఇచ్చట- "నీయిచ్ఛచొప్పున తిరుగవచ్చు"నను విధిరూపవాక్యార్థమునకు సింహకృతశునకమారణము కారణముగా నుపాత్తమయినది ఇది వాక్యార్థము, కాని పర్యాలోచించిన - ఆపొదరింట సింహమున్నదని చెప్పుటచే శునకమునకు

---

ఖ) న చ వాచ్యాదర్థా దర్థాంతరప్రతీతిరవినాభావసంబంధస్మరణమంతరే-ణైవ సంభవతి, సరస్యైవ తత్ప్రతీతిప్రసంగాత్"
(వ్యక్తి ప్రథమ పుట 83)

గ) నను వాచ్యాదసంబద్ధం తావన్న ప్రతీయతే, యతః కుతశ్చిత్ యస్య కస్యచిదర్థస్య ప్రతీతేః ప్రసంగాత్। ఏవం చ సంబంధాత్ వ్యంగ్య-వ్యంజకభావోఽప్రతిబంధేఽవశ్యం న భవతీతి। వ్యాప్తత్వేన నియత ధర్మినిష్ఠత్వేన చ త్రిరూపాల్లింగాల్లింగిజ్ఞానమనుమానం యత్, తద్రూపః పర్యవస్యతి॥ (కావ్యప్రకాశ 5 137 ఉదా. అనంతరవృత్తి)

ఘ) మహిమభట్టాస్తు-న తావదసంబద్ధ ఏవ వాక్యాత్ ప్రతీయతే। సర్వస్మాత్ సర్వోపలబ్ధిప్రసంగాత్। సంబద్ధాచ్ఛ వ్యంగ్యవ్యంజకభావో భవన్ నాని-యతాద్భవతీతి ప్రతిబద్ధరూపాదేవ భవతీత్యుపేయమ్। ప్రతిబద్ధోఽప్యర్థో న స్వాధికరణత్వేనాజ్ఞాతే వ్యంగ్యం ప్రతిపాదయతి। సర్వత్ర తత్ప్ర-తీతి ప్రసంగాత్। ఏవం చ వ్యంగ్యవ్యంజకభావోఽనుమేయానుమాపక-భావ ఏవ పర్యవసన్నః। యతో వ్యాప్తత్వేన సకలపక్షనిష్ఠత్వేన చ సపక్షసత్త్వవిపక్షాసత్త్వపక్షసత్త్వలక్షణరూపత్రయవతో లింగాల్లింగి-జ్ఞానమేవ అనుమానమ్। తదేతదుక్తానుమానం యత్ తద్రూప ఇతితేనా-నుమానేనానుమిత్యా రూప్యతే న త్వతిరిక్తయా వ్యక్త్యా ఇతి హి తస్యార్థః। ఏవమనుమానాదేవ వ్యంగ్యప్రతీతిః॥ —కావ్యప్రదీప. (5 3 కా. వృత్తి)

భయపడు నాధార్మికుఁడు సింహమునకు భీతిఁజెందక తానెట్లు పొదరింట స్వేచ్ఛగాఁ దిరుగాడుటకు యత్నించుననియు, అట్లాతఁ డాపొదరింటికి పుష్పా-పచయార్థము తిరుగకుండుటయే ఆ పుంశ్చలీవాక్యతాత్పర్యమనియు తేలును శునకమారణకారణభూతసింహసద్భావము భ్రమణనిషేధమును నిర్ధారింపఁ జేయును అగ్నియునికిని బట్టి 'ఇట శీతస్పర్శ లేదు' అని, లోకమున అగ్ని-సద్భావముచె శీతస్పర్శాభావమును మనము నిర్ధారించుచునే యున్నాము కదా ! కావున భ్రమణనిషేధము అనుమేయమేయగును అనుమానాకారమిట్లుండును— ఈ గోదావరీతీరపుపొదరిల్లు శ్వభీరువగునాధార్మికునకు భ్రమణాయోగ్యము, ఏలన ? సింహమున్నదికదా అని 87

---

87 క) తత్ర-'భ్రమ ధార్మిక విస్రబ్ధః'ఇతి వాక్యార్థరూపో భ్రమణవిధిర్వాచ్యః। తస్య 'స శునకోఽద్యమారితస్తేన' ఇత్యాదినా క్రూరకుక్కురమారణం దృప్తసింహవిహితం వాక్యార్థరూపమేవార్థో హేతుః। తత్ప్రతిషేధస్త్వను-మేయ ఏవ న వాచ్యః, తస్యోక్తనయేనాక్షేపాత్। తత్ర 'గోదానదీకచ్ఛ-కుంజవాసినా' ఇతి గోదావరీకచ్ఛకుహరస్య ధర్మిత్వనిర్దేశః। 'దృప్త సింహేనే'తి శ్వమారణకారణాభిధానద్వారేణ ఉపాత్తస్య దృప్తసింహ-సద్భావస్య హేతుభావః। 'కుంజవాసినే'తి తద్విశేషణేన తస్య ధర్మిణి సద్భావోపపాదనమ్। తస్యాస్య హేతోః సాధ్యస్య చ నిర్భయభ్రమణ-విధిలక్షణస్య సహానవస్థానలక్షణో విరోధః ప్రసిద్ధ ఏవేత్యేకస్య సద్భావా-వేదనేనాపరస్య స్వభావవిరుద్ధోపలబ్ధ్యా ప్రతిషేధే విజ్ఞాయమానే సతి సమశీర్షికయోభయార్థప్రతీతిరేవాత్ర న సమస్తీతి తద్విభ్రాంతిపర్యను-యోగో నిరవకాశఏవ। తేన—అనుమేయ ఏవ భ్రమణస్య నిషేధో న వ్యంగ్య ఇత్యవసేయం యథా 'నాత్ర శీతస్పర్శోఽగ్నేః' ఇత్యతః శీతస్పర్శస్య॥ (వ్యక్తి 3 1 వృత్తి పుట 465)

ఖ) సంకేతనికేతనభూతం గోదావరీతీరనికుంజం పుష్పాపచయాదిహేతోః కదాచిత్ సంచరతో ధార్మికస్య తన్నివారణాయావినయవత్యా ఇయ-ముక్తిః। తత్ర నికుంజవాసిసింహకృతయా శ్వనివృత్త్యా గృహే భ్రమణ-విధిర్వాచ్యః। స ఏవ నికుంజభ్రమణాయోగ్యతానుమిత్యై ప్రభవతి। యద్యద్ భీరుభ్రమణం తత్తద్భయకారణనివృత్త్యుపలబ్ధిపూర్వకమ్।

ఈ విధమున వస్తువ్యంగ్యములన్నియును అనుమేయములేయగును

ఇట్లే 'ప్రాప్తశ్రీరేష కస్మాత్' (ధ్వన్యా 2.27 కా ఉదా) అను (పూర్వోదాహృత 225 పుట.) శ్లోకమున (వ్యంగ్యమగు) రూపకాలంకారమును అనుమేయమే యగును. ఎట్లన-ఈశ్లోకమున వాచ్యములగు సముద్రమథనము యోగనిద్ర సేతుబంధము అనునవి శ్రీమహావిష్ణువునకు మాత్రము చెందిన వ్యాపారములగుట ప్రసిద్ధమేకదా! కావున ఆరాజునందు విష్ణ్వభేదారోపరూపమగు రూపకాలంకారము అనుమేయమే 88

అదేవిధమున "దుర్వారా మదనేషవః" (పుట 225) అను శ్లోకమునను విప్రలంభ శృంగారరస మనుమేయ మగుచున్నది - ఎట్లన? రసాది ప్రతీతికి విభావానుభావ వ్యభిచారిప్రతీతి సాధనమగుచున్నది విభావానుభావ-

---

నికుంజే చ సింహోపలబ్ధిరితి వ్యాపకవిరుద్ధోపలబ్ధౌ పర్యవసానాత్ భ్రమణస్య వ్యాపికా భయకారణాభావోపలబ్ధిః ప్రతీతా తద్విరుద్ధం యద్భయకారణం తదుపలబ్ధేః। యథా నాత్ర తుషారస్పర్శో వహ్నేః। అనుమానంచ—ఇదం గోదావరీనికుంజం శ్వభీరుభ్రమణాయోగ్యం సింహవత్త్వాదితి॥ —కావ్యప్రదీప (5 3 కా. వృత్తి పుట 165)

గ) గోదావరీతీరే చ సింహోపలబ్ధ్యా వ్యాపకవిరుద్ధోపలబ్ధిః। వ్యాపకం చ భయకారణేత్యాది సాధ్యమ్। యదాహుః - సాధ్యం వ్యాపకమిత్యాహుర్వ్యాప్యో హేతురుదాహృతః।" ఇతి। తద్విరుద్ధా చ భయకారణసద్భావోపిలబ్ధిస్తయా ధార్మికాభ్రమణం సిద్ధమితి॥

(అలం మహో. 3 282 ఉదా వృత్తి)

88 అత్ర లక్ష్మీలాభలంపటతయా పయోనిధౌ మంథనవ్యథావితరణం విలాసాలసతయా యోగనిద్రాసుఖాస్వాదో ద్వీపాంతరాధీశదశకంధరనిధనధియా సేతుబంధశ్చేతి భగవతో వాసుదేవస్యామీ వ్యాపారాః ప్రసిద్ధాః సన్తో యదన్యత్ర రాజాదౌ ఆరోప్య తస్య సమీహితప్రాప్త్యా నిషిధ్యంతే, తేన తత్కార్యత్వాత్ కారణభూతభగవద్రూపతారోపమేవ తత్రానుమాపయంతీతి రూపకానుమితిరితి వ్యపదేశః ప్రవర్తతే॥

(వ్యక్తి 3.27 సం శ్లో. వృత్తి)

వ్యభిచారులు రత్యాదిస్థాయిభావములకు కార్య కారణ సహకారులు గదా! కావున విభావాదులనుబట్టి రత్యాదిస్థాయిభావములు ఊహింపఁబడును అవియే ఆస్వాద్యమానములగుచు రసములని చెప్పఁబడును ఇట్లె కార్యకారణ భావమున నొక క్రమమున్నను అది సూక్ష్మమగుటవలన గోచరింపకుండుటచే దీనిని అసంలక్ష్యక్రమమందురు.[89]

లోకమున 'లింగ' బలముచే రతిశోకభయాదులు అనుమీయమానములగుచున్నవి దాన సుఖాస్వాదమిసుమంతైన కాననగుట లేదుకదా అట్లే కావ్యమునను రత్యాదిప్రతీతి అనుమేయమే యగునెడల ఆనందానుభూతి ఎట్లుండునని యందురేమో?[90] కాని అట్లనుమీయమానములగుచు రత్యాదులు సహృదయులకు అమందానందమును కలుగఁజేయుచున్నవనిన అది వస్తుస్వభావమే యగును ఇఁక దానిని గుఱించిన ప్రశ్న కవకాశమెట్లుండును? మఱియు లోకమున రత్యాదులు అవస్థావిశేషములు, కాంతాదులు తత్కారణములు అశ్రుస్వేదాదులు తత్కార్యములు, లజ్జాదులు తత్పరిపోషకములు కాఁగా,

---

89. వ్యక్తివివేకకారేణ హి - యాపి విభావాదిభ్యో రసాదీనాం ప్రతీతిః, సాऽనుమాన ఏవాంతర్భవతి। విభావానుభావవ్యభిచారిప్రతీతిర్హి రసాదిప్రతీతేః సాధనమిష్యతే। తే హి రత్యాదీనాం భావానాం కారణకార్యసహకారిభూతాస్తానునుమాపయంత ఏవ రసాదీన్ నిష్పాదయంతి। త ఏవ ప్రతీయమానా ఆస్వాదపదవీం గతాః రసా ఉచ్యంతే, ఇత్యవశ్యంభావే తత్ప్రతీతిక్రమః కేవలమాశుభావితయాऽసౌ న లక్ష్యతే, యతో ऽయమద్యాప్యభివ్యక్తిక్రమః।' ఇతి॥ (సా ద 54 కా వృత్తి)

90 న హి లోకే లింగతః శోకాదిష్వనుమీయమానేషు అనుమాతుః సుఖాస్వాదలవోऽపి లక్ష్యతే। ప్రత్యుత సాధూనాముదాసీనానామపి వా భయశోకదౌర్మనస్యాది దుఃఖసముపజాయమానమవధార్యతే। న చ లోకతః కావ్యాదౌ కశ్చిదతిశయః, యేనాసౌ తత్రైవోపగమ్యేత, న లోకే। త ఏవ హి లౌకికా విభావాదయో హేతుకార్యసహకారిరూపా గమకాః। త ఏవ చ రత్యాదయోऽవస్థావిశేషరూపా భావా గమ్యాః। తత్ కోऽతిశయః కావ్యాదౌ, యత్ తత్రైవ రసాస్వాదో న లోక ఇతి॥

(వ్యక్తి ప్రథ. పుట. 70)

అవియే కావ్యమున విభావానుభావ వ్యభిచారిశబ్దములచే వ్యపదేశింపఁబడుటలోని పరమార్థమిదియే అట్లనుమీయమానము లగుచుండియు రత్యాదులు భావనా బలమున అలౌకికానందము నొనగూర్చును.[91]

చిత్రతురగన్యాయమున రాముఁడని యెంచఁబడిన నటునియందు సీతా విషయకరతి అనుమీయమానమై పునఃపునరనుసంధానబలమున సహృదయులకు రసాస్వాదమును కలుగఁజేయును నటునియందున్నట్టులు ఊహింపఁబడు రత్యాదులు పారమార్థికములు కాకపోవచ్చును అయినను వానివలన కలిగెడు రసానుభూతి యథార్థమే యగును మిథ్యాజ్ఞానమువలనను యథార్థఫలప్రాప్తి యగుట లోకమున చూచుచునేయున్నాము మణిప్రభను జూచి మణియను కొనుట భ్రమయే, అయినను అట్టి అయథార్థజ్ఞానమువలననే మణికై పరుగిడు వాఁడు మణిని పొందుచునే యున్నాడు కదా। ఇట్లు రసానుభవము లోకసిద్ధము యథార్థమును అగుటలో విప్రతిపత్తి యుండదు.[92]

---

91 క) సోఽపి చ తేషాం న తథా స్వదతే, యథా తైరేవానుమేయతాం నీత ఇతి స్వభావ ఏవాయం న పర్యనుయోగమర్హతి। తదుక్తమ్ "నానుమితో హేత్వాద్యైః స్వదతేఽనుమితో యథా విభావాద్యైః। న చ సుఖయతి వాచ్యోఽర్థః ప్రతీయమానః స ఏవ యథా"॥ —(వ్యక్తి ప్రథ.పుట 75)

ఖ) యత్ర విభావాదిముఖేన భావానామవగమస్తత్రైవ సహృదయైకసంవేద్యో రసాస్వాదోదయ ఇతి వస్తుస్వభావ ఏవాయం న పర్యనుయోగపదవీ-మవతరతి ప్రామాణికానామ్। యదాహ భరతః—విభావానుభావవ్యభిచారి-సంయోగాద్ రసనిష్పత్తిః॥ (వ్యక్తి ప్రథ పుట 70)

గ) తదేవం విభావాదీనాం హేత్వాదీనాం చ కృత్రిమాకృత్రిమతయా కావ్య-లోకవిషయతయా చ స్వరూపభేదే విషయభేదే చావస్థితే సత్యేకత్వా-సిద్ధేర్యదా విభావాదిభిర్భావేషు రత్యాదిష్వసత్యేష్వేవ ప్రతీతిరుపజన్యతే, తదా తేషాం తన్మాత్రసారత్వాత్ ప్రతీయమానా ఇతి గమ్యా ఇతి చ వ్యపదేశా ముఖ్యవృత్త్యైవపద్యన్త ఏవ। తత్ప్రతీతిపరామర్శ ఏవ చ రసాస్వాదః స్వాభావిక ఇత్యుక్తమ్॥ (వ్యక్తి ప్రథ పుట. 74)

92 క) కింతు సమ్యఙ్మిథ్యాసంశయసాదృశ్యప్రతీతిభ్యో విలక్షణా చిత్రతురగ-న్యాయేన, యః సుఖీ రామః అసావయమితి ప్రతీతిరస్తీతి। తదాహ-

ఇట్లు మహిమభట్టు త్రివిధవ్యంగ్యమును అనుమేయమనియే యుప-పాదించెను

కాని విచారించిన వ్యంగ్యమనునది అనుమేయమగుటకు నవకాశము లేదు పొగయునికిని బట్టి పర్వతమున అగ్నియున్నటులు ఊహించి నిర్ధారించు చున్నాము అనగా అగ్గి అనుమేయము దీనియునికివిషయమున ఎట్టిసంశయ మునకు తావు లేదు కాని శబ్దమువిషయమున అట్లు కాదు. వివక్షితమగు నర్థ మిదియే తథ్యమనియు వేఱొండు మిథ్యయనియు పలుతావుల వివాదములు చెల రేగుచునే యున్నవి ఇట్టి సాంశయికత లింగిలింగభావమున నుండనోపదు [93] కావున వ్యంగ్యవ్యంజకభావమనునది లింగిలింగభావమునకంటె మిక్కిలి విలక్షణ మయినది వక్తయొక్క వివక్షననుసరించి ఒకే వ్యంజకము అయాతావులలో ఎన్నియేని వ్యంగ్యార్థములను తోపింపఁజేయును 'ప్రొద్దు గ్రుంకినది' అను

---

"ప్రతిభాతి న సందేహో న తత్త్వం న విపర్యయః। ధీరసావయమిత్యస్తి నాసావేవాయమిత్యపి॥ విరుద్ధబుద్ధిసంభేదాదవివేచితసంప్లవః। యుక్త్యా పర్యనుయుజ్యేత స్ఫురన్ననుభవః కయా॥"

— అభినవభారతి (6 . 31 కా వృత్తి)

ఖ) ప్రతీతిమాత్రపరమార్థం చ కావ్యాది తావత్తైవ వినేయేషు విధినిషేధ-వ్యుత్పత్తిసిద్ధేః। తదుక్తమ్—"భ్రాంతిరపి సంబంధతః ప్రమా॥" మణి-ప్రదీపప్రభయోర్మణిబుద్ధ్యాభిధావతోః। మిథ్యాజ్ఞానావిశేషేఽపి విశేషోఽ ర్థక్రియాం ప్రతి॥" —(వ్యక్తి ప్రథ పుట. 76)

గ) అర్థక్రియాపి మిథ్యాజ్ఞానదృష్టా—"మణిప్రదీపప్రభయోః॥ ఇతి"

—అభినవభారతి -(6 31 కా వృత్తి)

ఘ) అత్ర ప్రతీతిసారత్వాత్ కావ్యస్యానుమేయగతం వాస్తవావాస్తవత్వ-మప్రయోజకమ్। ఉభయథా చమత్కారప్రతీతిలక్షణార్థక్రియాసిద్ధేః॥

— రుయ్యకవాఖ్య (వ్యక్తి ప్రథ పుట. 76)

93 యది హి లింగితయా తత్ర శబ్దానాం వ్యాపారః స్యాత్, తచ్ఛబ్దార్థే సమ్యఙ్మిథ్యాత్వాదివివాదా ఏవ న ప్రవర్తేరన్, ధూమాదిలింగానుమితా-నుమేయాంతరవత్॥ (ధ్వన్యా. 3 33 కా. వృత్తి )

మాట ఎన్నియేని వ్యంగ్యార్థముల స్ఫురింపఁజేయుట చూచుచనే యున్నాము ఇట్లనేకవ్యంగ్యముల స్ఫురించుట అనుమానపరిపాటికే విరుద్ధము.[94]

'భ్రమ ధార్మిక' అను పూర్వోదాహరణమును పరిశీలించితిమేని భ్రమణాభావప్రతీతిని సాధించు నియతలింగమే కానరాదు గోదావరీతీరమున సింహమున్నట్లు నిశ్చయమేది? కులటపలికినపలుకులు విశ్వసనీయములగునా? కావున హేతువే అసిద్ధమయినది ఒకవేళ మాటవరుసకును సింహమున్నదని యొప్పుకొనినను అతఁడస్పృశ్యత్వదోషము శంకించి సారమేయమునకు భయపడిన భయపడియుండవచ్చును కాని సింహమునకు భయపడియుండవలెనా? ధీరున కట్టిభయముండునా? ఒకవేళ అట్టిపిఱికియైనను, గురువో లేదా ప్రభువో ఆదేశించిన, ఆయానతి యనుల్లంఘనీయమగుటచె నతడు తప్పక అక్కడికి వెళ్ళువాఁడే యగునుకదా! కావున సింహముండుటయను హేతువు అనైకాంతికము ఈ హేతువువలన భ్రమణాభావరూప(భ్రమణనిషేధరూప) సాధ్యసిద్ధియెట్లగును.[95]

కావున భ్రమణనిషేధము వ్యంగ్యమే యగును కాని అనుమేయము కాదు.

---

94 క) కించ-ఏకస్మాదేవ వ్యంజకాత్ తత్తద్వ్యంగ్యార్థప్రతీతిర్వ్యక్తృవివక్షానుసారేణ భవతి। అనేకవ్యంగ్యార్థప్రతిపత్తిరనుమానపరిపాటీవిరుద్ధా॥
(ప్రతాప కావ్య శ్లో 13 వృత్తి)

ఖ) యథా- 'అస్తమేతి గభస్తిమాన్' ఇత్యుక్తే సంధ్యావందనవిక్రేయవస్తూపసంహరణాభిసరణాద్యనేకార్థప్రతీతిర్యథాక్రమం విప్రవణిక్కాముకాదీనాముత్పద్యతే, తథా "వహ్నిమానయంప్రదేశో ధూమవత్త్వా" దిత్యుక్తే న కస్యాప్యర్థాంతరప్రతీతిరితి వ్యంగ్యానుమేయయో ర్వైలక్షణ్యాదనుమానత్వం వ్యంజనస్య విరుద్ధమితి భావః ॥

రత్నాపణ (ప్ర. రు. కావ్య 13)

95 క) ధీరురపి గురోః ప్రభోర్వా నిదేశేన ప్రియానురాగేణ అన్యేన చైవంభూతేన హేతునా సత్యపి భయకారణే భ్రమతీత్యనైకాంతికో హేతుః। శునో బిభ్యదపి వీరత్వేన సింహాన్న బిభేతీతి విరుద్ధోఽపి। గోదావరీతీరే సింహసద్భావః ప్రత్యక్షాదనుమానాద్వా న నిశ్చితః, అపి తు వచనాత్, న చ వచనస్య ప్రామణ్యమస్తి, అర్థేనాప్రతిబంధాదసిద్ధశ్చ। తత్కథమేవంవిధాద్ధేతోః సాధ్యసిద్ధిః ॥ (కావ్య 5 138 ఉదా. వృత్తి)

ఇది వస్తుధ్వని - ఇట్లే అలంకారధ్వనియును అనుమేయము కాదు. ఎట్లనః (సా ద. 5 4 కా ఉదా) —

జలకేళితరళకరతల ముక్తపునఃపిహిత రాధికావదనః ।
జగదవతు కోకయూనోః విఘటన సంఘటన కౌతుకీ కృష్ణః ॥

రాధతో జలక్రీడ సలుపుసమయమున ఆయమ మోమును తన దోసిలి నీటి ధారలతో ముంచెత్తి కప్పివేయక విడుచుటవలన చక్రవాకపక్షులజంటను విడదీయుచును, మఱి యాయమ మొగమునట్లు కప్పివేయుటవలన వానికి కలయిక నేర్పఱచుచును వినోదించు శ్రీకృష్ణుడు జగము ప్రోచుగాత — యని శ్లోక సారాంశము.

ఇట [96]'రాధ మోము చందమామ' యను రూపకాలంకారము వ్యంగ్యమగునే కాని యనుమేయమెట్లగును? చక్రవాక విఘటన సంఘటన కారకుఁడు

---

ఖ) స్పర్శాదిశంకయా అపౌరుషేయతయా వా శ్వతో బిభ్యతోఽపి మృగయాదికుతూహలేన సింహవద్దేశే వీరస్య భ్రమణాత్। కించ పక్షే సింహసద్భావో న మానాంతరేణావధారితః । కింతు పుంశ్చలీవాక్యాదవధారితః। న చ తద్వచనం నిశ్చాయకమ్ । అర్థేన సమం సంబంధానియమాత్ ఇత్యనిశ్చయరూపాసిద్ధిః ॥

— కావ్యప్రదీప (5 3 కా వృత్తి)

96 క) 'జలకేళి' — ఇత్యత్ర య ఆత్మదర్శనాదర్శనాభ్యాం చక్రవాకవిఘటన సంఘనకారీ స చంద్ర ఏవ' ఇత్యనుమితి రేవేయమితి న వాచ్యమ్। ఉక్తాసకాదావనైకాంతికత్వాత్ ॥ (సా ద 5 4 కా వృత్తి)

ఖ) తథాచ—కశ్చిత్ కరతాలదానాదినా భయం దత్వాపి చక్రవాకదంపతీ అన్యోన్యం విఘటయితుం శక్నోతి, సూర్యోఽపి స్వప్రకాశేన దివసం బోధయత్వా తౌ సంఘటయతుం శక్నోతి, తేన చంద్రాత్వారోపసాధ్యవతి రాధికావదనరూపపక్షే యథా చక్రవాకదంపతి విఘటన సంఘటనకారిత్వరూపహేతోః వృత్తిత్వం తథైవ తదభావవతి తథావిధే భయదాతరి ప్రకాశవిధాయకే చ విపక్షే హ్యుక్తహేతోర్వృత్తిత్వాదత్రాపి ప్రాగ్వదేవ సాధారణరూపానైకాంతికనామా హేత్వాభాస ఇతి॥

—లక్ష్మీవ్యాఖ్య (సా ద 5 . 4 కా. వృత్తి)

చంద్రుఁడేయగునను నియమమెక్కడిది ? ఎవఁడైనను చప్పట్లు చఱచి భయ పెట్టి ఆ పక్షులజంటను విడదీయవచ్చును, సూర్యుఁడుదయించుచు వానిని కలుపవచ్చునుకూడ కావున అనైకాంతమగు నీ హేతువువలన సాధ్యసిద్ధి యెట్లుండును ?

అట్లే రసాదిధ్వనియు అనుమేయము కాదు ఉదా. (కుమా 6 84) —

ఎవం వాదిని దేవర్షౌ పార్శ్వే పితురధోముఖీ ।
లీలాకమల పత్రాణి గణయామాస పార్వతీ ॥[97]

ఇట లజ్జారూపభావధ్వని అనుమేయమని యొప్పింపవలెనన్న నియత మగు కార్యకారణ భావముండవలయును కదా ! కమలపత్రముల లెక్కించు టయు తలవాల్చుటయును బాలికలకు స్వాభావికములే యగుచు నుపపన్నము లగును కావున నవి హేతువు నపేక్షింపవు. ఇట్లవి నియతముగా లజ్జాకార్య ములే కానప్పుడు దానినెట్లు సాధింపఁజాలును ఇట్టి హేతువు కూడ అనైకాంతికమే.[98]

ఇఁక వ్యంజన యన్ననో దానికి వ్యాప్తి యంగము కాకుండుటచే సంభావనామాత్రమునను వ్యంగ్య ప్రతీతి కలుగుటలో నాటంకమేమియు లేదు.[99]

---

97. దీనియాంధ్రానువాదము 'వేదాల'వారి ఆంధ్రధ్వన్యాలోకమునుండి—
"ఇట్లుదేవర్షివర్యుఁడేమేమొ నుడువు
చుండఁ దండ్రికి ప్రక్కన నుండి మోము
వంచి పార్వతివ్రేళులు వన్నెవెట్ట
లీల కమలంపు పత్రాలు లెక్కపెట్టె॥ —(పుట. 255)

98. ఇహ తు పద్మదళగణనమధోముఖత్వం చాన్యథాపి కుమారీణాం సంభావ్యత ఇతి ఝటితి న లజ్జాయాం విశ్రామ్యతి హృదయమ్॥
—లోచన (ధ్వన్యా, 2 22 కా ఉదా )

99. క) వ్యంజనాయాం న వ్యాప్తేర్నాపి పక్షధర్మతాయా నిర్ధారణమంగమ్। కింతు సంభావితాదప్యేవంవిధాదేవంవిధోఽర్థః ప్రతీయత ఇతి॥
(కావ్యప్రదీప. 5 . 3 కా. వృత్తి)

ఖ) తత్ర వ్యాప్తేరనంగత్వేన సంభావనామాత్రాదేవ వ్యంగ్యప్రతీతిరితి న కిమపి వ్యంజనావాదినాం దూషణమితి భావః॥
— బాలబోధినీ. (కావ్యప్రకాశ. 5 138 ఉదా. వృత్తి)

నిజమునకు రసాదులనుమేయము లెట్లును అగుటకు వీలులేదు 'నేను రసము ననుభవించుచున్నాను' అని యనుభవమే అనగా ప్రత్యక్షమే లోకప్రసిద్ధమైనది. తటస్థుఁడగు నటునియందు అనుమానప్రమాణమున రత్యాదులను నిర్ధారించుకొని తానాయనుమితిచే అలౌకికానందముననుభవించుట ఎట్లు? ఒకఁడు సుఖపడుట గాంచి వేఱొకఁడాయనుమతిచే తాను సుఖానుభూతిని పొందునా? కావున ప్రత్యక్ష జ్ఞానమే చమత్కారకారి గాని అనుమితి కాదందురు 100 ఇట్లు రసాదులును వ్యంగ్యములే యగును కాని అనుమేయములుకావు

ఇట్లు వస్త్వలంకారరసాదులు మూడును అనుమేయములు కావని ఆలంకారికులందఱును ముక్తకంఠమున ఖండించినవారే కాని మహిమభట్టుమత మును బలపఱచినయాలంకారికుఁడొకఁడైనను సాహితీక్షేత్రమున కాన రాడు. ఉన్నదానిని కాదనుట యెవరితరము?

**అలక్షణీయతావాదము — తత్ఖండనము :—**

ధ్వని యలక్షణీయము అనగా ధ్వని ఇట్లుండునని దానికి లక్షణము చెప్పుట సాధ్యము కాదని యనుటయు తగదు సామాన్యవిశేషరూపమున ఇట్లు

---

100 క) అథ తైః కృత్రిమత్వేనాతల్లింగైరపి కృత్రిమత్వేనాజ్ఞానాత్ స్థాయీ రత్యాదిరనుమీయతే। సైవ చానుమితిః। సచమత్కారప్రతీతిరూపా చర్వణా। అతస్తయా విషయీక్రియమాణః స్థాయీ రస ఇత్యుచ్యతే। చర్వణా చ సామాజికానామితి తేష్వేవ రస ఇతి వ్యవహారః। నను సాక్షాత్కార ఏవ సచమత్కారః, న త్వనుమిత్యాదిరపి। అన్యథా సుఖాదావనుమీయమానేఽపి స స్యాత్। న స్యాత్, వస్తుసౌందర్య బలాత్ రసనీయత్వేన స్థాయినామన్యానుమేయవైలక్షణ్యాత్। తథాపి స్థాయినాం నటేఽసత్త్వాద్ బాధావతారేఽనుమితిరేవ కథం స్యాదితి చేత్, న। అభావనిశ్చయభావాత్ స్థాయితయా సంభావ్యమానత్వాత్, "ఏతద-వ్యహృదయగ్రాహి। యతః ప్రత్యక్షమేవ జ్ఞానం సచమత్కారమ్ నాను-మిత్యాదిరితి లోకప్రసిద్ధమవధూయాన్యథాకల్పనే మానాభావః॥"

— (కావ్యప్రదీప. 35 కా వృత్తి)

ఖ) న తాటస్థ్యేన రసః ప్రతీయతే, స్వవ్యతిరిక్తాశ్రయప్రతీతౌ రసనీయత్వా-భావాత్॥ (అలం. మహో 3 12 కా వృత్తి)

ధ్వని వివరింపఁబడియుండ నది యలక్షణీయమెట్లగును? ఇఁక వామనుఁడు మున్నగు ప్రాచీనాలంకారికులలో, ధ్వనియనునది వారిమనస్సులలో మెదలినను దానిలక్షణము స్పష్టముగా వివరింపలేకుండిరి [101]

అయినను వారి రీత్యాదిలక్షణములను పరిశీలించిన ధ్వనితత్త్వము అస్పష్టముగా వారికి గోచరించినట్లు మనకు తెలియకపోదు - [102] కావుననే వృత్తిరీతులకు గల భేదము స్పష్టముగా తెలియుటలో ఈ ధ్వనిలక్షణము ఎంతయో ఉపకారకమగును. ఇంత [103]స్పష్టముగా ధ్వనియు దాని విశేషములును వివరింపఁబడియుండ నాధ్వని యనాఖ్యేయమెట్లగును? [104] అయినను

---

101 క) "అస్ఫుటస్ఫురితం కావ్యతత్త్వమేతద్ యథోదితమ్। అశక్నువద్భిర్వ్యాకర్తుం రీతయః సంప్రవర్తితాః"॥ (ధ్వన్యా 3 46)

ఖ) రీతిర్హి గుణేష్వేవ పర్యవసితా, యథా—విశేషో గుణాత్మా। గుణాశ్చ రసపర్యవసాయిన ఏవేతి హ్యుక్తం ప్రాగ్గుణనిరూపణే-'శృంగార ఏవ మధురః' (ధ్వన్యా 2 7) ఇత్యత్రేతి॥

—లోచన (ధ్వన్యా 3 46 వృత్తిపై)

102 క) శబ్దతత్త్వాశ్రయాః కాశ్చిదర్థతత్త్వయుజోఽపరాః।
వృత్తయోఽపి ప్రకాశంతే జ్ఞాతేఽస్మిన్ కావ్యలక్షణే॥ (ధ్వన్యా 3 47)

ఖ) తథా— వృత్తయః కావ్యమాతృకాః' ఇతి యదుక్తం మునినా తత్ర రసోచిత ఏవ చేష్టావిశేషో వృత్తిః। యదాహ-"కైశికీ శ్లక్ష్ణనేపథ్యా శృంగారరససంభవా॥" ఇత్యాది। —లోచన (ధ్వన్యా 3 . 47 వృత్తిపై)

103 యేఽపి సహృదయహృదయ సంవేద్యమనాఖ్యేయమేవ ధ్వనేః ఆత్మానమామ్నాసిషుస్తేఽపి న పరీక్ష్యవాదినః। యత ఉక్తయా నీత్యా వక్ష్యమాణయా చ ధ్వనేః సామాన్యవిశేషలక్షణే ప్రతిపాదితేఽపి యద్యనాఖ్యేయత్వం, తత్సర్వేషామేవ వస్తూనాం తత్ ప్రసక్తమ్॥

(ధ్వన్యా 1 19 కా వృత్తి)

104 ఉభయేషా మపి తేషాం ప్రతిపత్తృవిశేషసంవేద్యత్వమస్త్యేవ "వైకటికా ఏవ హి రత్నతత్త్వవిదః, సహృదయా ఏవ హి కావ్యానాం రసజ్ఞా" ఇతి కస్యాత్ర విప్రతిపత్తిః ॥ (ధ్వన్యా. 3 47 వృత్తిలో)

మాటలకందనివేవో మఱికొన్ని ధ్వనివిశేషము లున్నవని యనుటయు తగదు రత్నములందలి విశేషములవలె, నా కావ్య (ధ్వని) విశేషములును ఏ కొందఱికో తప్ప అందఱికిని తెలియవు అంతమాత్రమున నవి మాటలకందని వగునా ? [105] నిజమునకు లోకమున మాటలకందని దేదియును లేదు అట్టి దేదైన యున్నను దానిని సయితము "ఇది మాటలకందనిది" అను మాటచేతనే చెప్పుచున్నాముకదా !

ధ్వని[106]యనాఖ్యేయమనుట ప్రశంసార్థమనిన అది సమంజసమే యగును

ఇట్లు అభిధాలక్షణాతాత్పర్యానుమానములకంటె విలక్షణమైయుండు వ్యంజనచే బోధితమగు ధ్వనియనునదొకటి గుణాలంకారాదివ్యతిరిక్తమై యుండనే యున్నదనియు, అది సామాన్యవిశేషలక్షణములతో వివరింపఁబడి యున్నందున నిఁక అనాఖ్యేయమనుట తగదనియు తేలినది

ఈ విధమున - 'ధ్వన్యభావ వాదములు - తత్ఖండనము సంగ్రహముగా నిరూపితమయినది

---

105. యస్మాదనాఖ్యేయత్వం సర్వశబ్దాగోచరత్వేన న కస్యచిత్ సంభవతి।
అంతతోఽనాఖ్యేయ." శబ్దేన తస్యాభిధానసంభవాత్॥
(ధ్వన్యా 3 47 వృత్తి)

106 యది పునర్ధ్వనేరతిశయోక్త్యాఽనయా కావ్యాంతరాతిశాయి తైః
స్వరూపమాఖ్యాయతే తత్తేఽపి యుక్తాభిధాయిన ఏవ ॥
–(ధ్వన్యా 1 19 కా వృత్తి)

***

# ధ్వని - మనుచరిత్రము

## పంచమ - ప్రకరణము

### ధ్వనికి శ్లేషకు గల భేదము

**శ్లేషాలంకారము.** –

నానార్థకశబ్దసంయోజనముచేత శ్లేషాలంకారమేర్పడును. అనగా నాపద సమూహాత్మకవాక్యమును వినినంతమాత్రమున ప్రతిభావంతునిమనమున ననే కార్థములు మొలకెత్తును శబ్దశక్తిమూలధ్వనియందును అట్లు నానార్థములు భాసించును. కాని అవి వ్యంజనచేత కలుగును. శ్లేషాలంకారమున ఆయర్థములు రెండును అభిధచేతనే ఏర్పడును [1]

ఆరెండర్థములును ప్రకృతములయిన ప్రకృతశ్లేషయనియు, అప్రకృత ములయిన అప్రకృతశ్లేషయనియు, వానిలో నొకయర్థము ప్రకృతమైయుండ రెండవయర్థమప్రకృతమాయెనేని ప్రకృతాప్రకృతశ్లేషయనియు, ఇట్లు శ్లేషాలం కారము ముట్విధము,[2] ప్రకృతవిషయశ్లేషకు రాఘవపాండవీయము మున్నగు

---

1 క) "నానార్థసంశ్రయః శ్లేషః" (చంద్రాలోక. శ్లో 64)

ఖ) నానార్థస్య శబ్దస్య సంశ్రయో యోజనం శ్లేష ఇతి లక్షణమ్

–అలంకారచంద్రిక (కవలయానందవ్యాఖ్య) శ్లో 64.

గ) శ్రుత్యైకయా అనేకార్థప్రతిపాదనం శ్లేషః ॥ (రసగం ద్వి)

ఘ) శ్లిష్టైః పదైరనేకార్థాభిధానే శ్లేష ఇష్యతే ॥ (సా ద 10 11)

ఙ) శ్లేషే హ్యనేకార్థస్య వాచ్యత్వ మిత్యుక్తం.

(అలం సర్వస్య అప్రస్తుత ప్రశంసా)

2. క) అనేకార్థశబ్దవిన్యాసః శ్లేషః । స చ త్రివిధః ప్రకృతానేకవిషయః, అప్రకృతానేకవిషయః, ప్రకృతాప్రకృతానేకవిషయశ్చ ।

(కువలయా 64 శ్లో)

శ్లిష్టకావ్యములన్నియు నుదాహరణములేయగును
మచ్చునకొకపద్యము రాఘవపాండవీయము నుండి —

చ తెలివినతిప్రగల్భుఁడసదృగ్బలుఁడాతఁడు భీష్మచాపకౌ
శలమె సహాయమై యమర-శత్రుల నేడపడఁ వలంతియై
నిలకడ నేలె విశ్వధరణిం దనమిత్రకులంబు వైభవో-
జ్జ్వలతఁ దలిర్పఁ బౌరవసుసంతతిరాజులకెల్ల హెచ్చుగఁ॥ (1.3)

రామాయణపరమగునర్థమున—

ఆతఁడు (ఆదశరథుఁడు) తెలివిని అతిప్రగల్భుఁడనియు అసదృగ్బలుఁ [అసదృశబలసంపన్నుఁ]డనియు, తన భీష్మ(భయంకర)చాపకౌశలమె సహాయమై [యుండ] అమరశత్రులను(దేవతలను) ఏడపడంవలంతి(మట్టుపెట్టుటయందుసమర్థుఁడు)అనియు, తన మిత్రకులంబు(సూర్యవంశము)వైభవోజ్జ్వలత దలిర్పఁ పౌరుల వసుసంతతి(ధనసమృద్ధి)రాజులకెల్ల హెచ్చుగఁ విశ్వధరణిఁ నిలకడఁగానేలెననియు, తాత్పర్యము.

ఇఁక భారతవిషయమున—

ఆతఁడు(ఆధృతరాష్ట్రుఁడు) తెలివిఁ అతిప్రగల్భుఁడనియు, అసదృగ్బలుఁడు—దృగ్బలసహితుఁడుకానివాఁడనియు, (అంధుఁడనుట) భీష్మునిచాపకౌశలమే సహాయమై అమరఁగా, శత్రులనేడపడఁ వలంతియనియు, తన మిత్రులయొక్క కులంబు వైభవోజ్జ్వలతఁ తలిర్పఁగా, పౌరవులసుసంతతి రాజులకెల్లఁ (యయాతిభరతాదిరాజులకనుట) హెచ్చుగఁనిలకడగా విశ్వధరణినేలెననియు, తా

రాఘవపాండవీయప్రణేతయగు పింగళిసూరన— రెండర్థముల పద్యమొక్కటియును నిర్మింపంగ శక్యముగాదనియు, కాన తద్గతి కావ్యమెల్లనగునేని 'ఓహో' యనం జేయదే యనియు మనముననిడి రామభారతకథలు పర్యాయదృష్టిఁజూచు సుమతులకేర్పడునట్లు నొక కావ్యమాచరింతునని ప్రతినఁబూని రచియించియుండుటచే నీకావ్యమునగలరెండర్థములును ప్రకృతములే కావున నిది ప్రకృతవిషయశ్లేష

ఇట రెండవయర్థమును వాచ్యమే యయియుండుటచే ధ్వని యని శంకించుటకయినను నవకాశములేదు.

అప్రకృతశ్లేష –

ఒకచో రెండర్థములును అప్రకృతములే యగును. ఉదా .—

హరికరసంగాదధికం రమణీయా ఽప్యతులరాగసంవలితా ।
సుందరి! తవాననాగ్రే కమలాభా విగళితప్రతిభా ॥

[కం. హరికరసంగతినధికము
గరమ్యమయ్యు నిట రాగకలితంబయి సుం
దరి! నీ(దగు) వదనము ముం
దరఁగమలాభ కడువిగళితప్రభమయ్యెఁ॥ (సా సౌ ద. పుట 656)]

ఓసుందరీ! నీమోముముందఱ 'కమలాభ'(కమలముకాంతియును, కమలయగులక్ష్మీదేవికాంతియును)కళావిహీనమాయెను ఆకమలాభ ఎట్టిదనిన?హరికరసంగమున(సూర్యకిరణసంసర్గమున) అతులమగు రాగముచే (ఎఱుపుచే) సంవలితమై అధి-కము = నీటియందు రమణీయమై యుండునదియని కమలముపక్షమున నన్వయించునర్థము అట్లే కమలాభ=లక్ష్మీదేవికాంతి ఎట్టిదనిన? హరికరసంగమున(విష్ణుపాణిగ్రహణమున) అతులమగునమరాగముతో సంవలితమైఅధికముగా రమణీయమైయుండునది[3] యని తాత్పర్యము

నీమోగమునెదుట నీరెంటిశోభలును కళావిహీనములయినవని చెప్పుట ముఖసౌందర్యాతిశయద్యోతనార్థమే యగుటచే వర్ణనీయమగు సుందరీవదన మిచట ప్రకృతము ఆ సుందరిమోమునకు నుపమానములుగానుపాత్తములగు 'కమలము' 'కమల'యును నప్రకృతములు వానిశోభను వర్ణించుపట్టుల 'కమలాభ' యను విశేష్యాంశమందును, దానివిశేషణాంశములగు హరికరాదిపదములయందును శ్లేషయున్నది [4] కావుననిది అప్రకృతవిషయవిశ్లేష.

---

3. హరీతి। హరిర్విష్ణుః సూర్యశ్చ। కరో హస్తః కిరణశ్చ। అధికమ్ అతిశయేన, 'కే' ఇత్యధికమ్। అవ్యయీభావః। జలే ఇత్యర్థశ్చ। సంగాదితి పంచమ్యంతమతులరాగేత్యత్రాన్వేతి। కమలాభా కమలకాంతిః లక్ష్మీకాంతిశ్చ, విగలితప్రతిభా నిఃసారా॥ —మర్మప్రకాశ (రసగం ద్వితీ శ్లేష)

4. అయమప్రకృతమాత్రవిషయః। ప్రకృతస్యాననస్య శ్లేషావిషయత్వాత్। కమలాభేతి విశేష్యాంశే, అధికమితి విశేషణాంశే చ సభంగః। అన్యత్ర అభంగః॥ (రసగం. ద్వితీ. శ్లేష.)

అప్రకృతశ్లేషలో నొకప్పుడు విశేష్యము శ్లిష్టము గాకయునుండ వచ్చును పూర్వోదాహరణమునందలియుత్తరార్ధమును—

"కమలాయాః కమలస్య చ శోభా గళితా తవాననస్యాగ్రే॥"

అని పఠించిన దీనియుదాహరణమగును ఇట 'కమలాయాః' 'కమలస్య' అని ఉపమానవాచకములగు పదములు విడివిడిగా నుండుటచే విశేష్యపదము పూర్వోదాహృతశ్లోకమునవలె శ్లిష్టము కాదు [5]

ప్రకృతశ్లేషయందును విశేష్యము శ్లిష్టము కావలయునను నియమము లేదు [6] విశేష్యము శ్లిష్టముగాకయుండుటకుదాహరణము —

కరకలితచక్రఘటనో నిత్యం పీతాంబరస్తమోఽరాతిః।

నిజసేవిజాడ్యహరణో విష్ణుః సూర్యశ్చ వః పాతు॥

కరమున(సుదర్శన)చక్ర(సం)ఘటనము చేసినవాఁడును, పీతాంబరుఁడును తమోఽరాతియును (రాహువునకుశత్రువును) తనను సేవించువారల జాడ్యమును (మూర్ఖత్వమును)దూరీకరించువాఁడును అగు విష్ణువు మిమ్ము కాపాడుగాక, ఇట్లే కరములచే(కిరణములచే) చక్ర(—వాక)ఘటనముచేయువాఁడును, పీతాంబరుఁడును(ఆకాశము నాపోశనముచేసినవాఁడును- అనగా లంఘించినవాఁడనుట) తమస్సునకరాతియును, తనను సేవించువారల జాడ్యమును(అజ్ఞానమును) రూపుమాపువాఁడును అగు సూర్యుడు మిమ్ము రక్షించుగాత మనిసారాంశము [7] ఆశీర్వచన ప్రకరణమున విష్ణుసూర్యులిరువురును ప్రకృతులే తద్వాచకపద

---

5 అప్రకృతయోర్విశేష్యయోరశ్లిష్టత్వే యథాత్రైవ- "కమలాయాః కమలస్య చ శోభా గళితా తవాననస్యాగ్రే" ఇత్యుత్తరార్ధనిర్మాణే॥
(రసగం ద్వితీ శ్లేష)

6 అత్రాద్యే భేదే ద్వితీయే చ విశేష్యస్య శ్లిష్టతాయాం కామచారః॥
(రసగం ద్వితీ శ్లేష)

7 కరకలితేత్యాది। కరో హస్తః కిరణశ్చ। చక్రం సుదర్శనం కాలచక్రం చ-(చక్రవాకశ్చ)। అంబరమాకాశో వస్త్రం చ। తమో రాహురంధకారశ్చ। జాడ్యమజ్ఞానం మూర్ఖత్వం చ। —మర్మప్రకాశ. (రసగం ద్వితీ శ్లేష)

ములు రెండును ఉపాత్తములయియేయున్నవి కాన నిది విశేష్యాంశమున శ్లిష్టముగాని ప్రకృతవిషయశ్లేష

ఇఁక—ఈయుదాహరణముననే విశేష్యాంశమున విష్ణుసూర్యోభయార్థక[8]మగు 'హరి'యను శ్లిష్టపదముంచి "నిజసేవిజాడ్యనాశన చతురో హరిరస్తు భూతయే భవతామ్" (రసగం ద్వితీ శ్లేష) అని పఠించితిమేని, శ్లిష్టవిశేష్య-యగు ప్రకృతశ్లేషయగును ప్రకృతశ్లేషలో రెండర్థములును ప్రాకరణికములే యగుటచే శబ్దశక్తిమూలధ్వని యనుటకు వీలులేదని ముందే నివేదించితిని

ఇఁక - అప్రకృతశ్లేషలో ఉపమానాంశగతములగు రెండర్థములును ముఖవర్ణనప్రకరణమునకు సంబంధించియే యుండుటచే అభిధ కుంఠితమగు ప్రసక్తియే లేదు. ఇట్లు అప్రకృతములగు రెండర్థములును ప్రాకరణికములై సంకేతితములే యగుటచే వాచ్యములే యగును కావున నిదియు శబ్దశక్తిమూల-ధ్వని యగుటకు నవకాశములేదు [9]

ప్రకృతాప్రకృతశ్లేష —

ఒకచో నొకయర్థము ప్రకృతము కాఁగా, వేఱొక యర్థము అప్రకృత-మగును-

విజితారిపురో మూర్త్యా విలసత్సర్వమంగళః ।
రాజమౌళిః ప్రతాపాంకరుద్రో రుద్ర ఇవాస్థితః॥

(ప్ర రు అర్థా శ్లేష శ్లో. 177)

విజితారిపురుఁడును (శత్రునగరములను జయించినవాఁడును) మూర్తి విలత్సర్వమంగళుఁడును (తన శరీరమున పొడసూపుచున్న సర్వశుభ చిహ్నములు గలవాఁడును) రాజమౌళియు (రాజశ్రేష్ఠుఁడును) అగు ప్రతాపరుద్రుఁడు,

---

8 హరిః = సూర్యో విష్ణుశ్చ॥ —మర్మ (రసగం ద్వితీ. శ్లేష.)

9. క) "సంయోగాదిభి రభిధా శృంఖలితా యత్ర కుంఠతామేతి। అర్థాంతరావగమనే వ్యంజనమేవ క్షమం తత్ర"॥

— వృత్తివార్తిక (ని. సం 1940) పుట 12)

ఖ) అత్రార్థద్వయప్రతిపాదనే అప్రస్తుతత్వేన ప్రస్తుతత్వేన వా వైషమ్యా-భావాదభిధైవ సమర్థా॥ (ప్ర రు అర్థా శ్లేష.)

విజితారిపురుఁడును (త్రిపురాసురుని జయించినవాఁడును), మూర్తివిలసత్సర్వ-మంగళుఁడును [తన శరీరమున (వామార్ధమున) భాసించు 'సర్వమంగళ' — పార్వతిగలవాఁడును) రాజమౌళియు (చంద్రచూడుఁడును) అగు రుద్రునివలె నున్నాఁడు [10]

ఇట 'విజితారిపురుఁడు' మున్నగు విశేషణములు, ప్రకృతుఁడు (వర్ణనీయుఁడు) అగు ప్రతాపరుద్రునకును, ఉపమానముగానుపాత్తుఁడగుటచే అప్రకృతుఁడు(అవర్ణనీయుఁడు) అగు శివునకును సంబంధించిన రెండర్థములను చెప్పుటచే నిది ప్రకృతాప్రకృతశ్లేష

ప్రకృతాప్రకృతశ్లేష - ఉపమాలంకారము.-

ప్రకృతాప్రకృతములకుగలసాదృశ్యము తద్విశేషణాంశమందున్న శ్లేషాధీనమై యుండుట నిజమే, అయినను అట్లు శ్లేషమూలకాభేదాధ్యవసాయమునవేర్పడిన సాధర్మ్యము ఉపమాలంకారార్థమే కదా: కాన దీనినుపమాలంకారమనియే చెప్పనొప్పును కాని ప్రకృతాప్రకృతశ్లేషయని వ్యవహరించుట ఎట్లు ?[11]

---

10 ఉభయశ్లేషముదాహరతి—విజితేతి। విజితారిపురో నిర్జితశత్రునగరస్త్రిపురాంతకశ్చ। మూర్తౌ విలసంతి సర్వాణి మంగళాని, విలసంతీ సర్వమంగళా పార్వతీ చ యస్య సః। రాజమౌళీ రాజశ్రేష్ఠః చంద్రశేఖరశ్చ। అత్ర రుద్రప్రతాపరుద్రయోః విశేష్యయోః పృథగుపాదానమత ఉభయశ్లేషః॥

—రత్నాపణ (ప్ర రు అర్థా 177 శ్లో వ్యాఖ్య)

11 అన్యేతు - "అలంకారా హి ప్రాధాన్యేన చమత్కారాధాయకాః స్వాం స్వామాఖ్యాం లభంతే। త ఏవ పరోపకారతయా వర్తమానాస్తాం త్యజంతి, యథా—"రరాజ భూమౌ వదనం మృగాక్ష్యా నభోవిభాగే హరిణాంకబింబమ్" ఇత్యత్ర ప్రకృతాప్రకృతాత్మనామేకధర్మసంబంధో దీపకాఖ్యాం భజతే, త్యజతి చ "రాజతే వదనం తన్వ్యా నభసీవ నిశాకరః" ఇత్యత్ర। అత ఏవోచ్యతే — "ప్రాధాన్యేన వ్యపదేశా భవంతి" ఇతి। ఏవం చ— అలంకారాంతరోపస్కారకతయా స్థితః శ్లేషః కథంకారం స్వగృహస్థ ఇవ శ్లేషాలంకార వ్యపదేశం వోఢుమీష్టామితి బాధ్యప్రాయ ఏవ॥" ఇత్యాహుః॥

(రసగం ద్వితీ. శ్లేష)

ఈ విషయమును ప్రప్రథమమున చర్చించిన ప్రాచీనాలంకారికుఁడగు భట్టోద్భటుఁడు తన యభిప్రాయమునిట్లు వెలిపుచ్చెను-

"శ్లేషాలంకారమెన్నియో అలంకారముల నాశ్రయించియుండును కాని దీనికి వివిక్తమగు విషయమే(స్థానమే) లేదు. ఇఁక ఉపమాలంకారము, శ్లేష-నాశ్రయించి యేర్పడు శబ్దమాత్రసాధర్మ్యముననే గాక గుణక్రియాదిరూపమగు సాధర్మ్యముననను ఏర్పడును వాస్తవమునకు శబ్దమాత్రసాధర్మ్యము అస-త్కల్పమే యగును కావున దీనిని ఉపమాలంకారమని వ్యవహరించుటకు బదులు ప్రకృతాప్రకృతశ్లేష యనుటయే సమంజనము"- అని [12]

ధ్వన్యాలోకకారులును ఈయంశమునే మనముననిడి శబ్దశక్తిచే (శ్లేషచే) వేఱొకయలంకారము వాచ్యమయి భాసించుచున్నను శ్లేషాలంకారమే యగునని

---

12 క) ఏకప్రయత్నోచ్చార్యాణాం తచ్ఛాయాం చైవ బిభ్రతామ్।
స్వరితాదిగుణైర్భిన్నైః బంధః శ్లిష్టమిహోచ్యతే॥
అలంకారాంతరగతాం ప్రతిభాం జనయత్ పదైః।
ద్వివిధైరర్థశబ్దోక్తివిశిష్టం తత్ప్రతీయతామ్॥
—ఉద్భట (కావ్యా 4 . 23, 24)

ఖ) అత్రాహురుద్భటాచార్యాః - "యేన నాప్రాప్తే య ఆరభ్యతే, స తస్య బాధకః" ఇతి న్యాయేన అలంకారాంతరవిషయ ఏవాయమారభ్యమాణో ఽలంకారాంతరం బాధతే। న చాస్య వివక్తః కశ్చిదస్తి విషయో యత్ర సావకాశో నాన్యం బాధేత॥" .. అత్ర హి—ఉపమాదీనాం ప్రతి-భానమాత్రం, న వాస్తవీ స్థితిః। న హి శ్వైత్యేన శుక్తౌ రజతత్వం ప్రతీయమానమపి వస్తుతోఽస్తి। తస్మాదుపమాదిప్రతిభోత్పత్తిహేతుః శ్లేష ఏవ స్వవిషయే సర్వత్ర అలంకారః॥ (రసగం ద్వితీ శ్లేష)

గ) ఏష చ నాప్రాప్తేష్వలంకారాంతరేషు ఆరభ్యమాణః తద్బాధకత్వేన తత్ప్రతిభోత్పత్తిహేతురితి కేచిత్॥ . ఏవం చ _సకలకలం పురమేతజ్జాతం సంప్రతి సుధాంశుబింబమివ' ఇత్యాదౌ న గుణ-క్రియాసామ్యవత్ శబ్దసామ్యముపమాప్రయోజకమ్, అపితు—ఉపమా-ప్రతిభోత్పత్తిహేతుః శ్లేష ఏవావసేయః॥ (అలం. సర్వ శ్లేష)

వివరించుచు, శబ్దశక్తిచే(శ్లేషచే) కలుగు విరోధాభాసవ్యతిరేకాద్యలంకారముల నుదాహరించి వీనిని శ్లేషాలంకారములనుటయే యుక్తమని వచించిరి [13]

కాని- ఉద్భటకావ్యాలంకారసారసంగ్రహవివృతికర్తయగు రాజానక-తిలకుఁడు- శ్లేషాలంకారమునకు ఉపమాలంకారవిరహితములగు విషయము లెన్నియో యుండఁగా శ్లేష నిరవకాశమని చెప్పి ఉపమాలంకారమునకు బాధకమనుట తగదనియు గుణక్రియాదిరూపమగు నర్థమునాశ్రయించి సాధర్మ్యము సంభవించుపట్ల అర్థశ్లేషతో సాంకర్యమున్నను ఉపమయనియే వ్యవహరించు-చున్నట్లు, శబ్దమాత్రసాధర్మ్యమున్నపట్టుల శ్లేషతో సాంకర్యమున్నను ఉపమాలంకారమనుటయే న్యాయమనియు, లేదేని శబ్దసాధర్మ్యమున నేర్పడు పూర్ణోపమాలంకారస్థానమునే శ్లేష ఆక్రమించుకొనినట్లగుననియు, శబ్దసాధర్మ్యమునాశ్రయించియు ఉపమాలంకారమేర్పడునని రుద్రటుఁడు వచించుట తెలియనిది కాదనియు, కావున ఇట్టి అలంకారాంతరవిషయమునను శ్లేష బాధక-మనుట తగదనియు, ఏ యలంకారము చమత్కారవిశ్రాంతిధామమగునో నాయలంకారముపేర వ్యవహరించుట న్యాయమనియు విశదీకరించుచు ఉద్భ-టుని శ్లేషాలంకారవిషయవ్యవస్థను శిథిలీకరించెను [14]

---

13 నన్వలంకారాంతరప్రతిభాయామపి శ్లేషవ్యపదేశో భవతీతి దర్శితం భట్టో-ద్భటేన—తత్ పునరపి శబ్దశక్తిమూలో ధ్వనిర్నిరవకాశ ఇత్యాశంక్యేద-ముక్తమ్— 'ఆక్షిప్త' ఇతి। తదయమర్థః— 'యత్ర శబ్దశక్త్యా సాక్షాదలంకా-రాంతరం వాచ్యం సత్ ప్రతిభాసతే స సర్వః శ్లేషవిషయః। యత్ర తు శబ్దశక్త్యా సామర్థ్యాక్షిప్తం వాచ్యవ్యతిరిక్తం వ్యంగ్యమేవాలంకారాంతరం ప్రకాశతే, స ధ్వనేర్విషయః। శబ్దశక్త్యా సాక్షాదలంకారాంతరప్రతిభా యథా- "తస్యా వినాఽపి హారేణ నిసర్గాదేవ హారిణౌ। జనయామాసతుః కస్య విస్మయం న పయోధరౌ॥" అత్ర శృంగారవ్యభిచారీ విస్మయాఖ్యో భావః సాక్షాద్విరోధాలంకారశ్చ ప్రతిభాసత ఇతి విరోధచ్ఛాయానుగ్రాహిణః శ్లేష-స్యాయం విషయః, నత్వనుస్వానోపమవ్యంగ్యస్య ధ్వనేః॥

(ధ్వన్యా. 2.21 కా వృత్తి)

14 ఏతచ్చ పరీక్ష్యమాణమయుక్తమివ ప్రతిభాతి। తథాహి—

"తే గచ్ఛంతి మహాపదం భువి పరాభూతిః సముత్పద్యతే
తేషాం తైః సమలంకృతం నిజకులం తైరేవ లబ్ధా క్షితిః।

రాజానకతిలకునకు[15] సమసామయికుఁడగు మమ్మటుఁడును, మమ్మ-టానుయాయులగు కావ్యానుశాసన—అలంకారమహోదధి—సాహిత్యదర్పణకారా-దులును, ఈయభిప్రాయమునే బలపఱుచుచు ఉపమాలంకారమునకై ఏర్పడిన—

---

తేషాం ద్వారి నదంతి-వాజినివహాస్తై భూషితా నిత్యశో
యే దృష్టాః పరమేశ్వరేణ భవతా రుష్టేన తుష్టేన వా॥"

ఇత్యాదౌ శ్లేషే ప్రాప్తప్రతిష్ఠే "పల్లవాతామ్రే"త్యాదౌ సంకరత్వమేవ యుక్తమ్। అథవా న్యాయపరీక్షాయాముపమారూపత్వమేవ। తథాహి-యథా గుణక్రియా-సామ్య ఉపమా, తథా శబ్దమాత్రసామ్యేఽపి దృశ్యతే। న చ తత్ర శ్లేషత్వమితి వక్తుం యుక్తమ్। పూర్ణోపమాయా నిర్విషయత్వప్రసంగాత్। గుణక్రియా-సామ్యే సా భవిష్యతీతి చేత్, న। అర్థశ్లేషస్య నిర్విషయతాపత్తిప్రసం-గాత్। అస్మదుపదర్శితశబ్దశ్లేషవదుపమావిరహితోఽర్థశ్లేషస్య విషయః కల్ప్యతే। తద్ద్వయోరన్యత్ర లబ్ధసత్తాకయోరేకత్ర సన్నిపాతే సంకరతైవ ప్రాప్నోతి। అపిచ గుణక్రియాసామ్యముపమా శబ్దసామ్యం తు శ్లేష ఇతి విశేషస్యానభిధానాత్ శబ్దసామ్యముపమాయా విషయః, శ్లేషస్య తూపమావిర హిత ఇతి పల్లవేత్యాదౌ ఉపమైవ న్యాయ్యా। ....ఏవం చ 'అబిందు—సుందరీ' (ఉద్భట కా.వ్యా 4 27) ఇత్యాదౌ శబ్దాలంకారో విరోధః। అత్ర హి శ్లేషస్య ప్రతిభామాత్రం న తు ప్రరోహః। న చ విరోధాభాస ఇవ విరోధః శ్లేషాభాసః శ్లేషః। ఏవమన్యేఽపి శబ్దాలంకారా జ్ఞేయాః। తథా హి రుద్రటేనోక్తం-"స్ఫుటమర్థాలంకారావేతావుపమాసముచ్చయౌ కిం తు। ఆ శ్రిత్య శబ్దమాత్రం సామాన్యమిహాపి సంభవతః॥ (4. 32 కా ) ఇతి॥ . . . ఉక్తమత్ర వైచిత్ర్యమలంకార ఇతి। యద్వైచిత్ర్యం తస్యాలం-కార ఇతి యథోక్తమేవ సాధు॥

—రాజానకతిలక (ఉద్భట-కావ్యా-వివృతి 4. 27 కారికపై)

15. ఉద్భటాలంకారవివృతిసంపాదకులగు శ్రీ K S రామస్వామి శాస్త్రి శిరో-మణిగారు తన సంపాదకీయమున మమ్మట-తిలకులు సమకాలికులనియు వారిలో తిలకుఁడే మొదట ఈవివృతిని రచించెననియు, పిమ్మటనే కావ్య-ప్రకాశమును మమ్మటుఁడు రచించెననియు సోపపత్తికముగా తెలిపెను వారి పలుకులివి—

సాధర్మ్యమును తీర్చిదిద్దిన శ్లేష ఉపమాలంకారమునకే అంగమగుటచే అంగియు, ప్రధానమును అగు ఉపమాలంకారమును కాదని శ్లేషయనుట తగదనియు, ఇట్లే శ్లేషమూలకములగు రూపక విరోధాభాస (సమాసోక్తి) వ్యతిరేకాద్యలంకారములను శ్లేషయనక ఆయానామముల వ్యవహరించుటయే తగుననియు విశదీకరించిరి [16]

---

"వయం తు పశ్యామో-యదుద్భటవివేకే మహతా ప్రబంధేన బహువ్యాఖ్యాతృపక్షానుద్భావ్య విచార్య చ సిద్ధాంతితా ఏవార్థాః సంగృహ్య మమ్మటేనోపయుక్తా ఇతి। కించ పర్యాయోక్త-అప్రస్తుతప్రశంసయోర్వ్యావృత్తవిషయతా-వ్యవస్థాపనే యద్యప్యుభయోః సమానోఽభినివేశః, తథాపి తిలకేన 'అన్యేత్వాహుః' 'అపరే వ్యాచక్షతే' 'ఉదాహరంతి చ' ఇత్యాదినా అనూద్యమానాని వ్యాఖ్యాత్రంతరకల్పనాని కావ్యప్రకాశేఽనుపలభ్యమానాని తిలకస్యైవ స్వాతంత్ర్యేణ ఇతరమతనిరసనేన నూతనపక్షాంతరోపక్షేపకతాం తథా తిలకస్యైవ సిద్ధాంతః మమ్మటగ్రంథే సంక్షేపాద్ దృశ్యమానః మమ్మటస్యైవ ఉద్భటవివేకోక్తార్థానువాదితాం చ ద్యోతయతే॥
—భూమికా [ఉద్భట కావ్యా వివృతి. (బరోడా సం. 1931) పుట-44 . 45]

16. క) యథా-'కమలమివ ముఖం మనోజ్ఞమేతత్ (కచతితరామ్‌)' ఇత్యాదౌ గుణసామ్యే క్రియాసామ్యే ఉభయసామ్యే వా ఉపమా। తథా-'సకలకలం పురమేతజ్జాతం సంప్రతి సుధాంశుబింబమివ' ఇత్యాదౌ శబ్దమాత్రసామ్యేఽపి సా యుక్తైవ। తథా హ్యుక్తం రుద్రటేన-"స్ఫుటమర్థాలంకారావేతా వుపమాసముచ్చయౌ కింతు। ఆశ్రిత్య శబ్దమాత్రం సామాన్యమిహాపి సంభవతః" ఇతి। న చ-"కమలమివ ముఖం" ఇత్యాదిః సాధారణధర్మప్రయోగశూన్య ఉపమావిషయ ఇతి వక్తుం యుక్తం, పూర్ణోపమాయా నిర్విషయత్వాపత్తేః॥ "దేవ! త్వమేవ పాతాలమాశానాం త్వం నిబంధనమ్। త్వం చామరమరుద్భూమిరేకో లోకత్రయాత్మకః॥'
ఇత్యాదిః శ్లేషస్య చోపమాద్యలంకారవివిక్తోఽస్తి విషయ ఇతి, ద్వయోర్యోగే సంకర ఏవ। ఉపపత్తిపర్యాలోచనే తు ఉపమాయా ఏవాయం యుక్తో విషయః। అన్యథా విషయాపహార ఏవ పూర్ణోపమాయాః స్యాత్। న చ—'అబిందుసుందరీ నిత్యం గలల్లావణ్యబిందుకా' (ఉద్భట కావ్యా. 4 . 27) ఇత్యాదౌ విరోధప్రతిభోత్పత్తిహేతుః శ్లేషః, అపి తు శ్లేషప్రతిభోత్పత్తిహేతుః విరోధః। న హ్యత్ర-అర్థద్వయప్రతిపాదకః శబ్దశ్లేషః,

ఇట్టి విషయమున వివాదములు చెలరేఁగుట గాంచి కాఁబోలు అప్పయ్య-దీక్షితులు తన కువలయానందమునందు వృత్తివార్తికమునందును ప్రకృతా-ప్రకృతవిషయశ్లేషాలంకారము నిట్లు ఉదాహరించి వివరించెను—

అసావుదయమారూఢః కాంతిమాన్ రక్తమండలః।
రాజా హరతి లోకస్య హృదయం మృదులైః కరైః॥
(కువలయా శ్లేష /వృత్తివార్తిక. పుట 11)

---

ద్వితీయార్థస్య ప్రతిభాతమాత్రస్య ప్రరోహాభావాత్। న చ విరోధాభాస ఇవ విరోధః శ్లేషాభాసః శ్లేషః। తదేవమాదిషు వాక్యేషు శ్లేషప్రతిభోత్పత్తి-హేతురలంకారాంతరమేవ। తథా చ— "సద్వంశముక్తామణిః" "నాల్పః కవిరివ స్వల్పశ్లోకో దేవ మహాన్ భవాన్"॥ "అనురాగవతీ సంధ్యా దివసస్తత్పురస్సరః। అహో దైవగతిశ్చిత్రా తథాపి న సమాగమః॥" "ఆదాయ చాపమచలం కృత్వాహీనం గుణం విషమదృష్టిః। యశ్చిత్రమచ్యుతశరో లక్ష్యమభాంక్షీన్నమస్తస్మై॥" ఇత్యాదావేకదేశవివర్తి రూపకశ్లేషవ్యతిరేకసమాసోక్తివిరోధత్వముచితం న తు శ్లేషత్వమ్॥
—మమ్మట (కావ్యప్రకాశ 9 85 కా వృత్తి)

ఖ) "యథా గుణక్రియాసామ్య ఉపమా, తథా శబ్దమాత్రసామ్యేఽపి దృశ్యతే। 'సకలకలం పురమేతజ్జాతం సంప్రతి సుధాంశుబింబమివ' ఇత్యాదౌ। న చ తత్ర శ్లేషత్వం వక్తుం యుక్తం। పూర్ణోపమాయా నిర్విషయత్వాపత్తేః। గుణక్రియాసామ్యే సా భవిష్యతీతి చేత్, అర్థశ్లేషస్య నిర్విషయత్వప్రసంగాత్"॥ ఇత్యాది- —హేమచంద్ర (కావ్యాను. 5 5 సూత్రవృత్తి)
(హేమచంద్రుని వాక్యములు ఉద్భటవివృతి-కావ్యప్రకాశకారుల పంక్తులే కాన పూర్తిగా ఉదాహరించలేదు. —రచయిత )

గ) నను గుణక్రియాసామ్యస్యైవోపమాప్రయోజకతా యుక్తా, తత్ర సాధర్మ్యస్య అవాస్తవత్వాత్। తతశ్చ పూర్ణోపమాయా అన్యథానుపపత్త్యా గుణక్రియా-సామ్యస్యైవ అర్థశ్లేషవిషయతయా పరిత్యాగే పూర్ణోపమావిషయతా యుక్తా; న తు 'సకల'— ఇత్యాదౌ శబ్దసామ్యస్యైవేతి చేత్, న। 'సాధర్మ్యముపమా' ఇత్యేవావిశిష్టస్య ఉపమాలక్షణస్య శబ్దసామ్యాద్ వ్యావృత్తేరభావాత్। యది చ శబ్దసామ్యే సాధర్మ్యమవాస్తవత్వాత్ నోపమాప్రయోజకమ్। తదా కథం

ఇది చంద్రోదయవర్ణనము - ఉదయాద్రిసమారూఢుఁడును కాంతిమంతుఁడును ఎఱ్ఱనిబింబముగలవాఁడును అగు ఈ రాజు (చంద్రుఁడు) తన మృదు-లములగు కిరణములచే లోకులహృదయములను చూఱగొనుచున్నాఁడనునది ప్రాకరణికార్థము నవాభిషిక్తుఁడై ప్రవర్ధమానుఁడును కాంతిమంతుఁడును రాష్ట్రానురాగమును (రాష్ట్రప్రజలయనురాగముననుట) చూఱగొనినవాఁడును అగు ఈ రాజు (నృపుడు) మెత్తనిపన్నులచె ప్రజలహృదయములను హరించు-(రంజించు)చున్నాఁడనునది అప్రాకరణికార్థము

ఉదయ-మండల రాజ కరాదిపదములు శ్లిష్టములై యుండుటచే నిట రెండర్థములును సంకేతితములే యగును కావున నిది ప్రకృతాప్రకృతశ్లేషా-లంకారము 17

ఇట ప్రకరణమభిధను నియమింపఁగా రెండవయర్థము అభిధేయ-మెట్లగునందురేమో, అని శంకించి దానికి సమాధానముగా నిట్లు వివరించెను-

---

'విద్వన్మానస'— ఇత్యాదావాధారభూతే చిత్తాదౌ సరోవరాద్యారోపో రాజా-దేర్హంసాద్యారోపప్రయోజకః। కించ— యది వాస్తవసామ్య ఏవోపమాఽంగీ-కార్యా, తదా కథం త్వయాఽపి సకలకలమ్'— ఇత్యాదౌ బాధ్యభూతోప-మాఽంగీక్రియతే। కించ— అత్ర శ్లేషస్యైవ సామ్యనిర్వాహకతా, న తు సామ్యస్య శ్లేషనిర్వాహకతా, శ్లేషబంధతః ప్రథమం సామ్యస్యాసంభవాత్, ఇత్యుపమాయా ఏవాంగిత్వేన వ్యపదేశో జ్యాయాన్, ప్రాధాన్యేన హి వ్యప-దేశా భవంతి" ఇతి న్యాయాత్॥ —కవిరాజవిశ్వనాథ (సా ద దశమ శ్లేష)

ఘ) యత్రాప్యలంకారాంతరసహచరస్తత్రాపి న ఖలు స ఏవ తత్ప్రతిభోత్పత్తి-హేతుః, కింతు తాన్యేవాస్య ప్రతిభోత్పత్తిహేతవ ఇతి తద్వ్యపదేశనైవ వ్యవహారః సౌందర్యస్య తేష్వేవ విశ్రాంతత్వాత్। సౌందర్యమలంకారః। తథాహి— "సకలకలం పురమేతజ్జాతం సంప్రతి సుధాంశుబింబమివ" అత్ర శ్లేషప్రతిభోత్పత్తిహేతురుపమైవ॥

—నరేంద్రప్రభసూరి (అలం మహో. 7 597)

17. తృతీయే— 'రాజా హరతి లోకస్య'— ఇతి చంద్రవర్ణనప్రస్తావే ప్రకృతస్య ప్రత్యగ్రోదితచంద్రస్య అప్రకృతస్య నవాభిషిక్తస్య నృపతేః శ్లేషః॥

—అప్పయ్యదీక్షిత (కువలయా. శ్లేష)

"అభిధను నియమించుట యనఁగా ఆ శబ్దమునకుగల సంకేతార్థములనేకములుపస్థితములై యుండ నేయర్థమిట కవితాత్పర్యవిషయమగును ? అను సందేహమును నివారించి అర్థవిశేషమును (కవితాత్పర్యవిషయభూతమగునర్థమును) స్మృతిపథమున నవతరింపఁజేసి నిశ్చయించుటయే కదా ! ఆయర్థ విశేషస్మృతిని కలుగజేయునది ఒక ప్రకరణమే కాదు మఱికొన్నియు నున్నవి ఇట ప్రాకరణికార్థమును నిర్ణయించునది ప్రకరణము కాఁగా నప్రప్రాకరణికార్థమును నిర్ణయించునది శబ్దాంతరసన్నిధి రాజమండలకరాదిపదములకు పరస్పరాన్వయమును చేకూర్చునొంక యర్థాంతరమున్నదికదా ! ఆ యర్థాంతరమును చెప్పు పదములిట్లొకచోటఁగూర్పఁబడియుండుటయే— "ఇట శబ్దాంతరసన్నిధి అర్థవిశేషస్మృతిహేతు"వనుటకు కారణము [18]

ఇట్లు ప్రాకరణికాప్రాకరణికార్థములు రెండును వాచ్యములేయగుటచే నిదియే ప్రకృతాప్రకృతశ్లేషయగునని చెప్పి, దీనిని ప్రాచీనాలంకారికులు శబ్దశక్తిమూలకమగునుపమాలంకారధ్వని యని పేర్కొనుటయు సమంజసమే యని ఇట్లు సమర్థించెను—

ఈ ప్రాకరణికాప్రాకరణికార్థములకు రెండింటికిని ఏదో సంబంధముండి తీరవలెను కదా ! ఆ సంబంధమే ఉపమానోపమేయభావము అదియు అర్థ సామర్థ్యాక్షిప్తమే కాని శక్తిబోధ్యముకాకుండుటచే నుపమాలంకారము వ్యంగ్యమే యగుచున్నది కావున నిది శబ్దశక్తిమూలధ్వని యగునని ప్రాచీనులు వ్యవహరించిరి [19] అని

---

18 వయంతు బ్రూమః— 'అసావుదయమారూఢః' ఇత్యాదౌ ప్రాకరణికేఽర్థే ప్రకరణవదప్రాకరణికేఽపి రాజకరమండలాదిశబ్దానాం పరస్పరాన్వయయోగ్యనృపతితద్గ్రాహ్యధనదేశాదివాచకానాం సమభివ్యాహారరూపమభిధానియామకమస్తీత్యర్థద్వయస్యాపి ప్రాకరణికత్వ ఇవ ప్రాకరణికాప్రాకరణికరూపత్వేఽప్యుభయత్ర అభిధైవ వ్యాపారః, యథోక్తసమభివ్యాహారస్యాపి శబ్దాంతరసన్నిధిరూపత్వేన ప్రకరణవదభిధానియామకత్వాత్। . ..
. .... । ప్రకరణాదీనామభిధానియామకత్వం హి నానార్థశబ్దజన్యశక్యస్మృతౌ తేషామన్యతమకారణత్వమ్। యథోక్తమ్ — శబ్దార్థస్యానవచ్ఛేదే విశేషస్మృతిహేతవః" ఇతి॥ —అప్పయ్యదీక్షిత. (వృత్తివార్తిక పుట 12)

19 క) యదత్ర ప్రకృతాప్రకృతశ్లేషోదాహరణే శబ్దశక్తిమూలధ్వనిమిచ్ఛన్తి ప్రాంచః, తత్ ప్రకృతాప్రకృతాభిధానమూలకస్యోపమాదేరలంకారస్య

శబ్దశక్తిమూలధ్వని—శ్లేష :-

ఇట్లప్పయ్యదీక్షితులు సమర్థించుటకు మూలము లేకపోలేదు తొలుత ఆనందవర్ధనాచార్యులు శబ్దశక్తిమూలధ్వనిని నిర్వచించు—

"ఆక్షిప్త ఏవాలంకారః శబ్దశక్త్యా ప్రకాశతే।
యస్మిన్ననుక్తః శబ్దేన శబ్దశక్త్యుద్భవో హి సః॥ (ధ్వన్యా 2 21)

శబ్దముచె చెప్పబడక యుండి, కేవలము శబ్దశక్తిచే నాక్షిప్తమగునలంకారమే శబ్దశక్తిమూలధ్వని యగుననియును, ఉపమాద్యలంకారాంతరములు వాచ్యములై యుండునప్పుడే వానికి శ్లేషాలంకారము బాధకమగుననియే భట్టోద్భటునియభిప్రాయము కావున వ్యంగ్యములగు నుపమాద్యలంకారములు శబ్దశక్తిమూలధ్వనివిషయములే యగుననియును, వివరించుచు శబ్దశక్తిమూలాలంకారధ్వనియే యుండును కాని శబ్దశక్తిమూలవస్తుధ్వని యుండదనెను [20]

---

వ్యంగ్యత్వాభిప్రాయం, న త్వప్రకృతార్థస్యైవ వ్యంగ్యత్వాభిప్రాయమ్। అప్రకృతార్థస్యాపి శబ్దశక్త్యా ప్రతిపాద్యస్యాభిధేయత్వావశ్యంభావేన వ్యక్త్యనపేక్షణాత్॥ [కువలయా (నిర్ణ సం 1947) శ్లేష పుట 80)

ఖ) యత్తు ప్రాచామప్రస్తుతే శక్తిమూలవ్యంజనవృత్త్యభిధానం, తదప్రస్తుతార్థప్రతీతిమూలకే, యథా— "ఉదయమారూఢః" ఇత్యాది విశేషణవిశిష్టః ప్రథిపీపతిః స్వల్పైః గ్రాహ్యధనైః లోకస్య హృదయం రంజయతి, ఏవం తథాభూతశ్చంద్రమా మృదులైః కిరణైః, ఇత్యాదిరూపేణ ప్రతీయమానే ఉపమాద్యర్థాలంకారే తదవశ్యంభావదృఢీకరణాభిప్రాయేణ। న తు తత్రాపి వస్తుతో వ్యంజనాస్తిత్వాభిప్రాయేణ॥

[వృత్తివార్తిక (నిర్ణ సం 1940) పుట. 15]

20 క) నన్వలంకారాంతరప్రతిభాయామపి శ్లేషవ్యపదేశో భవతీతి దర్శితం భట్టోద్భటేన తత్పునరపి శబ్దశక్తిమూలో ధ్వనిర్నిరవకాశ ఇత్యాశంక్యోక్తమ్— 'ఆక్షిప్త' ఇతి। తదయమర్థః— యత్ర శబ్దశక్త్యా సాక్షాదలంకారాంతరం వాచ్యం సత్ ప్రతిభాసతే స సర్వః శ్లేషవిషయః। యత్ర తు శబ్దశక్త్యా సామర్థ్యాక్షిప్తం వాచ్యవ్యతిరిక్తం వ్యంగ్యమేవాలంకారాంతరం ప్రకాశతే స ధ్వనేర్విషయః॥ (ధ్వన్యా. 2 21 కా. వృత్తి)

ఖ) యస్మాదలంకారో, న వస్తుమాత్రం, యస్మిన్ కావ్యే శబ్దశక్త్యా ప్రకాశతే, స శబ్దశక్త్యుద్భవధ్వనిరిత్యస్మాకం వివక్షితమ్॥ (ధ్వన్యా 2.21 కా. వృత్తి)

ఇట్లు ధ్వనికారులు శబ్దశక్తిమూలవస్తుధ్వని లేదనుటయే తన వాదమునకుపోద్బలకముగా భావించిన అప్పయ్యదీక్షితులు- "వస్తుధ్వనియుండదనుటకు గలకారణము రెండర్థములును వాచ్యములేయగుట" ధ్వనికారునియాశయము కాఁబోలునని యెంచి, ఒకప్పుడు నిరలంకారమగు వస్తురూపమైన యర్థమును అలంకారమువలె అర్థసామర్థ్యాక్షిప్తమైయుండుననియును కావున రెండర్థములును వాచ్యములైనను వస్తుధ్వనిసంభవించుటలో ఏయనుపపత్తియు లేదనియును మమ్మటాదులునట్లే యుదాహరించిరనియును[21] వివరించుచు, పూర్వోదాహరణమున రెండర్థములును వాచ్యములేయగుటచే ప్రకృతాప్రకృతవిషయశ్లేషాలంకారము కాక తప్పదనియు, ప్రాచీను లనినట్లు ఈ రెండర్థములకు గల ఉపమానోపమేయభావరూపసంబంధము అర్థసామర్థ్యాక్షిప్తమగుటచే నిది శబ్దశక్తిమూలకమగునుపమాలంకారధ్వనియగుట సమంజసమే యనియు నుపపాదించెను

అప్పయ్యదీక్షితులిట్లు వాచ్యార్థవిషయమున శ్లేషాలంకారమనియును ఉపమాలంకారవిషయమున శబ్దశక్తిమూలధ్వనియనియును ఒకేయుదాహరణమును రెండువిధములుగా వ్యాఖ్యానించుటకుగల మఱియొక కారణమునిట్లు ఊహింపవచ్చును "అసావుదయమారూఢః" అను నీశ్లోకము దండి తనకావ్యాదర్శమున

---

21. నన్వేవం— శబ్దశక్తిమూలస్యాలంకారధ్వనేః — "అచ్ఛాదితాయతదిగంబరమ్" (శిశుపాలవధ 4 19) ఇత్యాద్యుదాహరణసత్త్వేఽపి తన్మూలో వస్తుధ్వనిర్లుప్యేత, నిరలంకారేఽప్రస్తుతార్థ ఏవ వస్తుధ్వనేరుదాహరణీయత్వాత్। తత్ర చ త్వయాఽభిధాంగీకారాత్—ఇతి చేత్, న। యత్రాప్రస్తుతార్థే అభిధయైవ ప్రతిపాద్యమానే తన్మూలమనభిధేయం వస్తు ప్రతీయతే తత్ర తదంగీకారాదితి। యథా— "శనిరశనిశ్చ తముచ్చైర్నిహంతి కుప్యసి నరేంద్ర ! యస్మై త్వమ్॥" (కావ్య 4 59) ఇతి। అత్ర హి అశనిశబ్దేన ప్రస్తుతాద్ వజ్రాదన్యస్మిన్ సమభివ్యాహృత 'శనివిరుద్ధరూపే' అప్యర్థే ఽభిధయైవ ప్రతిపాద్యమానే— 'విరుద్ధావపి త్వదనువర్తనార్థమేకం కార్యం కురుతః।' ఇత్యుపశ్లోక్యస్య ప్రభావాతిశయః ప్రతీయతే। ఇత్థమేవ ప్రాచీనైః శబ్దశక్తిమూలో ధ్వనిరుదాహృతః॥ (వృత్తివార్తిక. పుట 17)

శ్లేషకుదాహరణముగా నొసంగినది[22] 'కావ్యానుశాసన'కర్తయును ఈ శ్లోకమునే యుదాహరించి "ఇట ప్రకరణాదినియంత్రణ లేకుండుటచే రెండర్థములును వాచ్యములేయగుటవలన 'శ్లేష'యని నిర్వచించెను[23] మమ్మటుఁడును విశేష్యము శ్లిష్టమైయుండి ఉపమానోపమేయభావముకల్పింపఁబిలువఁబడునదియగు [24]'యోఽసకృత్పరగోత్రాణాం' — (కావ్య 9 376) అను శ్లోకమునుదాహరించి— "అత్ర ప్రకరణాదినియమాభావాత్ ద్వావప్యర్థౌ వాచ్యౌ" అని శ్లేషాలంకారప్రస్తావమున నుడివెను కాని విశేషమేమియు తెలుపలేదు. కావ్యప్రదీపకారులు ఈ మమ్మటాభిప్రాయమును వివరించుచు—ఇట ఏకార్థమాత్రనియామకములగు ప్రకరణాదులు లేకుండుటవలన రెండర్థములును వాచ్యములే యగుటచే 'భద్రాత్మనో దురధిరోహతనోః'— (కావ్య 2 12) మున్నగుశ్లోకముల-

---

22. దండికావ్యాదర్శము (2 331 శ్లో) పై "రఢ్డీ—రంగాచార్యసూరి" విరచిత "ప్రభా' వ్యాఖ్య— "తత్రాభిన్నపదశ్లేషముదాహరతి—అసావితి। అత్ర ప్రకరణాదినియామకాభావాత్ ద్వావపి నృపచంద్రౌ వాచ్యౌ ॥
(కావ్యాదర్శ రఢ్డీవ్యాఖ్య పుట 283)

23 "అసావుదయమారూఢః — ఇత్యభంగః శబ్దశ్లేషః। అత్ర ప్రకరణాదినియమాభావాత్ ద్వావప్యర్థౌ వాచ్యౌ॥"
(కావ్యాను. 5 5 సూ ఉదా 468 శ్లో వృత్తి)

24. "యోఽసకృత్ పరగోత్రాణాం పక్షచ్ఛేదక్షణక్షమః। శతకోటిదతాం బిభ్రద్ విబుధేంద్రః స రాజతే॥" అనునది శ్లోకము యొక్క పూర్తి పాఠము — (కావ్య. 9 376) దీని తాత్పర్యమిది— "మాటిమాటికిని శత్రువంశపక్షీయులును క్షణమున ఛేదమొనర్పఁజాలినవాఁడును శతకోటుల(నర్థులకు) దానము చేయువాఁడును, పండితేంద్రుఁడును అగు రాజు ప్రకాశించుచున్నాఁడనునది ఒక యర్థము ఇట్లే- మాటిమాటికిని పర్వతశ్రేష్ఠముల పక్షములను క్షణకాలమున ఛేదమొనర్పఁజాలినవాఁడును వజ్రాయుధముచే (శత్రువుల) ఖండించినవాఁడును అగు దేవేంద్రుఁడు భాసించుచున్నాఁ"డనునది రెండవ యర్థము ఈ రెండర్థములకును అసంబద్ధత తొలగించుటకై ఉపమానోపమేయభావము కల్పించి "ఆ రాజు దేవేంద్రునివలె నున్నాఁ"డనియు చెప్పవచ్చును కదా॥
—రచయిత

యందువలె రెండవయర్థమువిషయమున శబ్దశక్తిమూలధ్వని కాదనియు, ఉపమాలంకారవిషయమున మాత్రము శబ్దశక్తిమూలధ్వనియగుట సమ్మతమే యనియు వచించెను[25] మూలచంద్రాలోకకర్తయగు జయదేవుఁడును-"ఖండ-శ్లేషః పదానాం చేదేకైకం పృథగర్థతా॥" అని ఖండశ్లేషను లక్షించి "ఉచ్చర-ద్భూరికీలాలః శుశుభే వాహినీపతిః" అని, విశేష్యము శ్లిష్టమైయుండి ఉపమా-నోపమేయభావము కల్పింపవీలగు[26] శ్లోకార్ధము నుదాహరించెను ఈ చంద్రా-లోకమునే సంస్కరించి[27] దీనికివ్యాఖ్య "కువలయానంద"మనుపేర వ్రాసిన అప్పయ్యదీక్షితులు— నానార్థసంశ్రయః శ్లేషః వర్ణ్యావర్ణ్యోభయాశ్రితః (కువ-లయా శ్లో 64) అని లక్షించి ప్రకృతాప్రకృతశ్లేషకుదాహరణముగా పూర్వ శ్లోకార్ధమునే వివరించునవసరమున, దండియుదాహరించిన— "అసావుదయ-మారూఢః" (కావ్యాదర్శ 2.331)అను శ్లోకమును కూడ స్వమతోద్బలకముగా వ్యాఖ్యానించి ఈయంశమునే తనవృత్తివార్తికమున[28] విపులముగా చర్చించెను

---

25. అత్రైకార్థమాత్రనియతప్రకరణాద్యభావాత్ రాజేంద్రరూపౌ ద్వావప్యర్థౌ వాచ్యావేవేతి "భద్రాత్మనో దురధిరోహతనోః" (2 12) ఇత్యాదివత్ ద్వితీ-యార్థమాదాయ న ధ్వనిత్వమిత్యర్థః, ఉపమామాదాయ ధ్వనిత్వం తత్రా పీష్టమితి ద్వితీయోల్లాసశేషే ప్రదీపే స్పష్టమ్॥

—బాలబోధినీ (కావ్య 9 376 ఉదా వ్యాఖ్య)

26 "ఉచ్చరద్భూరి"— అను శ్లోకార్ధసారాంశమిది- "పైకి వెలువడుచున్న యధిక రక్తముగల సేనాపతి శోభించెనని యొకయర్థము పైకి పొంగు-చున్న యధికజలములుగల నదీనాథుఁడగు సముద్రుడు విలసిల్లెనని మఱి-యొకయర్థము ఈ రెండర్థములకును ఉపమానోపమేయభావమున్ననే కాని అందముండదు దీనినే కువలయానందకర్త ప్రకృతాప్రకృతశ్లేష కుదాహరించెను.

—రచయిత

27 యేషాం చంద్రాలోకే దృశ్యంతే లక్ష్యలక్షణశ్లోకాః।
ప్రాయస్త ఏవ తేషామితరేషాం త్వభినవా విరచ్యంతే॥

—అప్పయదీక్షిత (కువలయా. శ్లో 5)

28 "వయం తు బ్రూమః .....స్మృతిహేతవః" ఇతి॥ (వృత్తి పుట 12)
(ఈ యద్ధరణము (పుట. 264) ఉదాహృతపూర్వము)

ఇట్లు ప్రకృతాప్రకృతశ్లేషకు రెండువిధములగు నుదాహరణములు కాన నగుచున్నవి ఒకటి- ఉపమాలంకారము వాచ్యమై యుండునది రెండు- ఉప- మాలంకారము వ్యంగ్యమైయుండునది. మొదటియుదాహరణమున రెండర్థములు వాచ్యములగుటలో నేయనుపపత్తియు లేదు కావున "శ్లేష"యనినను చెల్లును కాని రెండవయుదాహరణమున అర్థాంతరము వాచ్యమే యయినయెడల 'శ్లేష' యనుటలో నెట్టియాటంకము లేదు కాని వ్యంగ్యమేయయిన శ్లేషకు స్థానము లేదు నిస్సంశయముగా శబ్దశక్తిమూలధ్వనియే యగును కావున రెండవయర్థము వాచ్యమగునా ? వ్యంగ్యమా ? ఈయంశమిఁక విశదీకరించవలసియున్నది

**అర్థాంతరము వాచ్యమా ? వ్యంగ్యమా ? :—**

ధ్వనికారులశబ్దశక్తిమూలధ్వన్యుదాహరణ మిట్లున్నది—

"అత్రాంతరే కుసుమసమయయుగముపసంహరన్నజృంభత
గ్రీష్మాభిధానః ఫుల్లమల్లికాధవళాట్టహాసో మహాకాలః॥"

(ధ్వన్యా 2 . 21 కా ఉదా)

**దీనిసారాంశమిది**— ఇంతలో వసంతఋతురూపమాసద్వయమునంతము చేయుచు వికసించినమల్లెలధావల్యము వ్యాపింప, గ్రీష్మమను పేరఁబరగు 'మహాకాలము' అనగా దీర్ఘదీర్ఘమగు కాలము విజృంభించెననునర్థము ప్రాకర- ణికము కాఁగా, నీ పదములచెతనే — "కృతాదియుగసమయమునుపసంహ- రించుచు మల్లికాధవళాట్టహాసము చేయు భయంకరుఁడగు మహాకాలుఁడు అనఁగా రుద్రుడు విజృంభించె"నను నర్థాంతరము అప్రాకరణికమయి స్ఫురించుచున్నది [29]

---

29 క) కుసుమసమయాత్మకం యద్యుగం మాసద్వయం తదుపసంహరన్। ధవళాని హృద్యాన్యట్టాని ఆపణా యేన తాదృక్, ఫుల్లమల్లికానాం హాసో వికాసః సితిమా యత్ర। ఫుల్లమల్లికా ఏవ ధవళాట్టహాసోఽస్యేతి తు వ్యాఖ్యానే "జలదభుజగజం" ఇత్యేతత్తుల్యమేతత్ స్యాత్। మహాంశ్చాసౌ దినదైర్ఘ్యాదురతివాహతాయోగాత్, కాలః సమయః॥

—లోచన (ధ్వన్యా 2 21 కా ఉదా. వ్యాఖ్య)

ఖ) కృతాదియుగసమయముపసంహారన్ మల్లికాదవళముట్టహాసం కుర్వన్ భయంకరో మహాకాలః మహాన్ జగత్సంహర్తృదేవతావిశేషః ఇత్యా- ద్యర్థబోధ ఇత్యర్థః॥ —బాలప్రియా (లోచనవ్యాఖ్య) (ధ్వన్యా. 241 పు)

దీనిని ధ్వనికారులిట్లు వివరించిరి— "ఈరెండర్థము లసంబద్ధములయి యుండుట తగదని ఉపమానోపమేయభావరూపసంబంధమును కల్పించుటచే ఉపమాలంకారము వ్యంగ్యమగును శ్లేషయు అర్థసామర్థ్యాక్షిప్తమయినదే కాని శబ్దోపారూఢము(వాచ్యము)కాకుండుటచే నిది శ్లేషాలంకారము కాక శబ్దశక్తి-మూలకమగునుపమాలంకారధ్వనియే యగుచున్నది"[30] అని.

కావున అప్పయదీక్షితులనుకొనినట్లు ధ్వనికారునిమతమున రెండర్థములు వాచ్యములు కావనుటకు "శ్లేష అర్థసామర్థ్యాక్షిప్తమే కాని శబ్దోపారూఢము కాదు" అనునతనిపలుకులే నిదర్శనము—

ఈ యంశమున నభినవగుప్తపాదులు— "పూర్వోదాహరణమున మహాకాలాదిపదములు రుద్రరూపాద్యర్థాంతరమున రూఢములై యున్నను ఋతువర్ణనరూపప్రకరణము "రూఢిర్యోగాపహారిణీ" అను నియమమునైనను లెక్కచేయక ప్రకరణసంబద్ధము కాకుండుటచే రూఢ్యర్థమును నియమించగా, ఆ పదములు ప్రాకరణికమగునవయవార్థమునే బోధించి చరితార్థములయినవి— అయినను అప్రాకరణికమగునర్థాంతరము స్ఫురించుచునే యున్నది కదా! ఆయర్థాంతరమును బోధింప ప్రకరణనియంత్రితమగునభిధ సమర్థము కాదు. కాన శబ్దశక్తిమూలకమగు వ్యంజనావ్యాపారముచేతనే ఆయర్థాంతరము కలిగినదని చెప్పవలయును" అని వివరించిరి[31]

---

30 ఏషూదాహరణేషు శబ్దశక్త్యా ప్రకాశమానే సత్యప్రాకరణికేఽర్థాంతరే వాక్యస్యాసంబద్ధార్థాభిధాయిత్వం మా ప్రసాంక్షీదిత్యప్రాకరణికప్రాకరణి-కార్థయోరుపమానోపమేయభావః కల్పయితవ్యః సామర్థ్యాదిత్యర్థాక్షిప్తో-ఽయం శ్లేషో న శబ్దోపారూఢ ఇతి విభిన్న ఏవ శ్లేషాదనుస్వానోపమ వ్యంగ్యస్య ధ్వనేర్విషయః॥ (ధ్వన్యా 2 21 కా వృత్తి పుట 244)

31 అత్ర ఋతువర్ణనప్రస్తావనియంత్రితాభిధాశక్తయః, అత ఏవ— "అవయవప్రసిద్ధేః సముదాయప్రసిద్ధిర్బలీయసీ" ఇతి న్యాయమపాకుర్వంతః మహా-కాలప్రభృతయః శబ్దాః ఏతమేవార్థమభిధాయ, కృతకృత్యా ఏవ। తదనంతరమర్థావగతిర్ధ్వననవ్యాపారాదేవ శబ్దశక్తిమూలాత్"॥
—లోచన. (ధ్వన్యా ద్వితీ. 'అత్రాంతరే' వ్యాఖ్య)

శబ్దశక్తిమూలధ్వనియందగుప్రాకరణికార్థము శక్తిబోధ్యమా ? వ్యక్తివేద్యమా ? అను విషయమున వివాదములు అంతకు పూర్వమే చెలరేఁగుచున్నట్లు అభినవగుప్తాచార్యులు తనలోచనమున నాలుగుమతముల నుట్టంకించెను ఆ మతములసారాంశమిది–

**1. ప్రథమమత సారాంశము –**

ఈ శబ్దములీయర్థాంతరమునే వేఱొకచోట అభిధచే బోధించుచుండుట చూచుచునే యున్నాము కాని ఇట ప్రకరణనియంత్రితమగు నభిద యీయర్థాంతరమును బోధింపఁజాలకుండుటచే నిది వ్యంజనావేద్యమే యగును. కావుననే ఈయర్థాంతరము శబ్దశక్తిమూలకమయ్యును వ్యంగ్యమే యగుచున్నది [32]

సమీక్ష –

ఈ మతమే అభినవగుప్తాభిమతమయి అనంతరలాక్షణికులకు శిరోధార్యమై యున్నది

**2. ద్వితీయమత సారాంశము :–**

మొదటియర్థమువలె రెండవయర్థమును సంకేతితమయియే యుండుట వలన రెండర్థములను అభిధచేతనే బోధితములయినవి "శబ్దబుద్ధికర్మణాం విరమ్య వ్యాపారాభావః" అను న్యాయమున శబ్దమునకు గల ప్రాకరణికార్థము బోధించుటతో నభిధ విరతమగుట నిజమే, అయినను అర్థాంతరము కూడ సంకేతితమేయగుటవలన అర్థసామర్థ్యసహకారమున రెండవయభిధ ఆయర్థాంతరమును బోధింప ప్రవర్తించును ఈ రెండవయభిధయే "సహకారిభేదాత్ శక్తిభేదః" అను న్యాయముననుసరించి "వ్యంజన"యనుపేరఁ బఱఁగినది [33]

---

32 అత్ర కేచిన్మన్యంతే– "యత ఏతేషాం శబ్దానాం పూర్వమర్థాంతరేఽభిధాంతరం దృష్టం, తత స్తథావిధేఽర్థాంతరే దృష్టతదభిధాశక్తేరేవ ప్రతిపత్తుర్నియంత్రితాభిధాశక్తికేభ్య ఏతేభ్యః ప్రతిపత్తిః ధ్వననవ్యాపారాదేవేతి శబ్దశక్తిమూలత్వం వ్యంగ్యత్వం చేత్యవిరుద్ధమ్" ఇతి

—లోచన (ధ్వన్యా ద్వితీ 'అత్రాంతరే' వ్యాఖ్య)

33 అన్యే తు– "సాఽభిధైవ ద్వితీయా అర్థసామర్థ్యం గ్రీష్మస్య భీషణదేవతావిశేషసాదృశ్యాత్మకం సహకారిత్వేన యతోఽవలంబతే, తతో ధ్వననవ్యాపారరూపోచ్యతే" ఇతి॥ —లోచన (ధ్వన్యా ద్వితీ. 'అత్రాంతరే' వ్యాఖ్య)

సమీక్ష :-

ఈ మతము సమంజసముగా తోచుటలేదు అర్థసామర్థ్యమనగా నుపమానోపమేయభావరూపార్థసామర్థ్యమే కదా ! అర్థాంతరప్రతీతికి పూర్వము ఉపమానోపమేయభావమనునది లేనే లేదు. ఇఁక దానిసహకారమున రెండవ యభిధ అర్థాంతరమున ప్రవర్తించుననుట ఎట్లు కుదురును ?

తృతీయమత సారాంశము :-

సభంగశ్లేషయందు శబ్దభేదముండుటచేతనే అర్థాంతరము కాననగుచున్నది అట్లే అభంగశ్లేషయందును "శక్తిభేదాత్ శబ్దభేదః" (శక్తిభేదమున్న శబ్దభేదమును ఉండును) అను న్యాయమున అర్థాంతరప్రతిపత్తికై శబ్దభేద-ముండనేయున్నది ఆ రెండర్థములును ప్రాకరణికములేయయినచో రెండవయర్థమునకై రెండవశబ్దము (శబ్దావృత్తియనుట) అభిధచేఁగొనిరాఁబడును, కాన శ్లేషయు, రెండవయర్థమ ప్రాకరణికమయినచో నాశబ్దాంతరము వ్యంజనచే నేర్పడును కావున అప్రాకరణికార్థము వ్యంగ్యమే యనుటయుక్తము.[34]

సమీక్ష :—

ఈ మతమున శబ్దభేదాశ్రయమే తప్ప ప్రథమమతమునకంటె నేవిశేషమును లేదు ప్రకరణాదినియంత్రణము నోటఁజెప్పకున్నను ఆ రెండవయర్థమువిషయమున నభిధను కాదని వ్యంజన నాశ్రయించుటలో హేతువేమై యుండును? ప్రకరణనియంత్రణమే కదా!

---

34. ఏకే తు— "శబ్దశ్లేషే తావద్భేదే సతి శబ్దస్య, అర్థశ్లేషేఽపి శక్తిభేదా-చ్ఛబ్దభేద ఇతి దర్శనే ద్వితీయః శబ్దస్తత్రానీయతే స చ కదాచిదభిధావ్యాపా-రాత్। యథా-ఉభయోరుత్తరదానాయ "శ్వేతోధావతి" ఇతి ప్రశ్నోత్తరాదౌ వా తత్ర వాచ్యాలంకారతా। యత్ర తు ధ్వననవ్యాపారాదేవ శబ్ద ఆనీతః, తత్ర శబ్దాంతరబలాదపి తదర్థాంతరం ప్రతిపన్నం ప్రతీయమానమూల-త్వాత్ ప్రతీయమానమేవ యుక్తమ్" ఇతి॥

—లోచన (ధ్వన్యా ద్వితీ. 'అత్రాంతరే' వ్యాఖ్య)

**చతుర్థమత సారాంశము:-**

35 మొదటియర్థము సంకేతితమగునట్లు రెండవయర్థము సంకేతితమే కావున అర్థసామర్థ్యసహకారమున రెండవయభిధచేతనే కలుగును కాన మొదటి యర్థమువలె రెండవయర్థముకూడ అభిధేయమే యగును కాని ఆ రెండర్థములకు కల్పింపఁబడిన అభేదారోపమో లేదా ఉపమానోపమేయభావరూపసంబంధమో, అది మాత్రము శబ్దాభిధేయము కాక అర్థసామర్థ్యాక్షిప్తమే యగుటచే నేతాదృశస్థలమున శబ్దశక్తిమూలకమగు నలంకారధ్వనియనుట యుక్తము.

**సమీక్ష -**

ఈమతమున రెండర్థములు వాచ్యములే యగుటచే శబ్దశక్తిమూలకమగు వస్తుధ్వని యుండదు

**ఈమతమే ధ్వనికారునకు సమ్మతమా?**

ధ్వనికారుఁడును శబ్దశక్తిమూలకమగు వస్తుధ్వని యుండదని చెప్పినను అతనిమతమున రెండవయర్థము వాచ్యము కాదు ఎట్లన? "అర్థాక్షిప్తోఽయం శ్లేషో న శబ్దోపారూఢ ఇతి విభిన్న ఏవ శ్లేషాదనుస్వానోపమవ్యంగ్యస్య ధ్వనేర్విషయం." (ధ్వన్యా 2 21 కా వృత్తి) అని శ్లేషకును శబ్దశక్తిమూలధ్వనికిని భేదము వివరించుచునతఁడు ఈశ్లేష (ద్వితీయార్థము) అర్థాక్షిప్తమేకాని శబ్దోపారూఢము(వాచ్యము) కాదని చెప్పినవిషయము గమనించితిమేని రెండవయర్థము వ్యంగ్యమే యగునని ధ్వనికారునియాశయమైనట్లు స్ఫురింపకపోదు 'శబ్దశక్తి మూలకమగునలంకారధ్వనియే కాని "వస్తుధ్వని"యుండ'దనునతనిపలుకులకు- "ప్రాకరణికాప్రాకరణికములగు నారెండర్థములకు నేదోయొక సంబంధము

---

35 ఇతరే తు- ద్వితీయపక్షవ్యాఖ్యానే యదర్థసామర్థ్యం తేన ద్వితీయా అభిధైవ ప్రతిప్రసూయతే, తతశ్చ ద్వితీయోఽర్థోఽభిధీయత ఏవ, న ధ్వన్యతే, తదనంతరం తు తస్య ద్వితీయార్థస్య ప్రతిపన్నస్య ప్రథమార్థేన ప్రాకరణికేన సాకం యా రూపణా సా తావద్వాచ్యైవ, న చాన్యతః శబ్దాదితి సా ధ్వననవ్యాపారాత్। తత్రాభిధాశక్తేః కస్యాశ్చిదప్యనాశంకనీయత్వాత్। తస్యాం చ ద్వితీయా శబ్దశక్తిర్మూలమ్। తయా వినా రూపణాయా అనుత్థానాత్ అత ఏవాలంకారధ్వనిరయమితి యుక్తమ్॥

—లోచన (ధన్యా ద్వితీ. 'అత్రాంతరే' వ్యాఖ్య)

లేనియెడల అసంబద్ధార్థాభిధాయిత్వరూపదోషముండుననిచెప్పి ఔపమ్యమో, అభేదారోపమో సంబంధముగా కల్పింపవలసి యుండును కావున ఏతాదృశో-దాహరణముల యందంతటను ఉపమాద్యలంకారములే వ్యంగ్యములగును కాని నిరలంకారమగు వస్తువు వ్యంగ్యమై యుండునవకాశము మృగ్య"మనుటయే, తాత్పర్యమయి యుండునని గమనించవలసియున్నది.

కావుననే మొదటిమూడుమతములవారు "అర్థాంతరము వ్యంగ్య"మను నభిప్రాయమునే వెలిపుచ్చిరి కడపటివారుమాత్రము రెండవయర్థము వాచ్యమే యగుననుటకు కారణము— శబ్దశక్తిమూలధ్వనిని [36] నిర్వచించునవసరమున "అలంకారో న వస్తుమాత్రం" అనియును "వస్తుద్వయే శబ్దశక్త్యా ప్రకాశమానే శ్లేషః" అనియును, "ఏషూదాహరణేషు శబ్దశక్త్యా ప్రకాశమానే సత్యాప్రాకరణికేఽర్థాంతరే" అనియును చేసిన ధ్వనికారునివివరణము రెండర్థములును వాచ్యములే యగునను భ్రమకు దారితీసియుండుట కావచ్చును

ఈ విషయమున ఉపక్రమోపసంహారవాక్యార్థములను సాకల్యముగా పరిశీలించి అభినవగుప్తపాదులు—ప్రకరణనియంత్రితమగునభిధ అప్రాకరణికార్థమును బోధింప సమర్థముకాకుండుటచే ఆ యర్థాంతరము వ్యంజనచే నేర్పడినదే [37] యగును కావున వ్యంగ్యమే యగునని తేల్చివేసిరి.

మమ్మటాదు లీబాటనే యనుసరించి—"సంయోగాదులు అనేకార్థములగు పదములయొక్క వాచకతను నియమించఁగా నర్థాంతరప్రతీతిని కలుగఁజేయువ్యాపారమే వ్యంజన"యని (వ్యంజనాలక్షణము) నిర్వచించిరి.[38]

---

36 "అక్షిప్త ఏవాలంకారః" (ధ్వన్యా. 2 21) అను కారికావృత్తిలోనివియే ఈ యుద్ధరణములన్నియును

37. అత్ర ఋతువర్ణనప్రస్తావనియంత్రితాభిధాశక్తయః .... మహాకాల-ప్రభృతయః శబ్దా ఏతమేవార్థమభిధాయ కృతకృత్యా ఏవ। తదనంతర-మర్థావగతిర్ధ్వననవ్యాపారాదేవ శబ్దశక్తిమూలాత్॥

—లోచన (ధ్వన్యా. ద్వితీ 'అత్రాంతరే' వ్యాఖ్య)

38 క) అనేకార్థస్య శబ్దస్య వాచకత్వే నియంత్రితే।
సంయోగాద్యైరవాచ్యార్థధీకృద్ వ్యాపృతిరంజనమ్॥"

—మమ్మటః. (కావ్య. 2 19)

**ప్రాచీనుల 'యర్థాంతరవాచకతా నియంత్రణము'- దాని విమర్శ.-**

పండితరాయలు నానార్థస్థలమున నర్థప్రతీతి ఎట్లగునో సోపపత్తికముగా చర్చించుచు ప్రాచీననవీనమతముల నిట్లు సంగ్రహించెను—

**1. ప్రథమమతము** (అర్థాంతరవాచకతా నియంత్రణ వివరణము) —

[39] నానార్థకపదఘటితవాక్యమును వినినంతనే ప్రతిభావంతుఁడు తనకు ఆ పదముల నానార్థములు భాసించినను వక్తృతాత్పర్యవిషయభూతమగు నర్థమునే నిర్ణయించుకొనుట అనుభవసిద్ధము మిగిలినయర్థము విడిచి తాను ఆ యర్థమునే గ్రహించుటలో హేతువేమై యుండును ? అని విచారించిన ప్రకరణాదులా యర్థాంతరమును ప్రతిబంధించునని తెలును కావుననే ప్రాచీనులు "అభిధను ప్రకరణాదులు ప్రతిబంధించు"ననిరి ప్రకరణాదినియంత్రిత మగునభిధ అర్థాంతరమును బోధింప సమర్థము కాదని తేలినది అయినను అర్థాంతరప్రతీతి కలుగుచునే యున్నదికదా ? ఆ యర్థాంతరస్ఫూర్తికై యేదో ఒక వ్యాపారముండితీరవలెను. అదియే "వ్యంజన"యని ప్రాచీనుల యభిప్రాయమైనట్లు కొందఱు వివరించిరి

---

ఖ) అనేకార్థస్య శబ్దస్య సంయోగాద్యైర్నియంత్రితే।
ఏకత్రార్థేఽన్యధీహేతుర్వ్యంజనా సాఽభిధాశ్రయా॥
—విశ్వనాథకవిరాజ (సా ద 2 14)

39 తత్ర కేచిదాహుః—నానార్థస్య శబ్దస్య సర్వేష్వర్థేషు సంకేతగ్రహస్య తుల్యత్వాత్ శ్రుతమాత్ర ఏవ సకలానామర్థానాముపస్థితౌ, శబ్దస్యాస్య కస్మిన్నర్థే తాత్పర్యమితి సందేహే చ సతి, ప్రకరణాదికం తాత్పర్యనిర్ణాయకం పర్యాలోచయతః పురుషస్య సతి తన్నిర్ణయే "తదాత్మకపదజ్ఞానజాయా ఏకార్థమాత్రవిషయాయాః పునఃపదార్థోపస్థితేరనంతరమన్వయబోధ" ఇతి నయే ద్వితీయాయాః పదార్థోపస్థితేః ప్రాథమిక్యా ఇవ న కుతో నానార్థగోచరతేతి ప్రకరణాదిజ్ఞానస్య తదధీనతాత్పర్యనిర్ణయస్య వా పదార్థోపస్థితౌ ప్రతిబంధకత్వం వాచ్యం। అన్యథా శాబ్దబుద్ధేరపి నానార్థవిషయత్వాపత్తిః। . .... ఏతదేవ సర్వమభిసంధాయోక్తమ్- "అనేకార్థస్య శబ్దస్య వాచకత్వే నియంత్రితే। సంయోగాద్యైరవాచ్యార్థధీకృద్ వ్యాపృతిరంజనమ్॥" యంత్రణమపరార్థోపస్థానప్రతిబంధ ఇతి॥ (రసగం ద్వితీయాననప్రారంభ )

**ద్వితీయమతము** (అర్థాంతరవాచకతా నియంత్రణ విమర్శ) —

40 అర్థాంతరవాచకత ప్రకరణాదులచే నియంత్రితమగుననుటను కొందఱిట్లు విమర్శించిరి—"ఆ పదములకుగల నానార్థములన్నియు భాసించినను వక్తృతాత్పర్యము ననుసరించియే అర్థనిర్ణయము జరుగుచుండ నిఁక అభిధ యొక్క అర్థాంతరవాచకతాశక్తి ప్రకరణాదులచే ప్రతిబద్ధమగునని కల్పించవలసిన యవసర మేముండును? ఇట్లు వక్తృతాత్పర్యముననుసరించి నిర్ణయింపఁబడిన యర్థమే శక్తిబోధ్యమగుచుండ నీ తాత్పర్యవిషయమగు నర్థాంతరము వ్యక్తి (వ్యంజనా)వేద్యమే యగునుకదా!"

**తృతీయమతము** (పూర్వోక్తమతద్వయ సమీక్ష):—

41 మఱికొందఱీ మతద్వయమును సమీక్షించుచు స్వాభిప్రాయము

---

40 అపరే త్వాహుః— నానార్థశబ్దజశాబ్దబుద్ధౌ తాత్పర్యనిర్ణయహేతుతాయా అవశ్యకల్ప్యత్వాత్ ప్రథమం నానార్థశబ్దాదనేకార్థోపస్థానేఽపి ప్రకరణాదిభిస్తాత్పర్యనిర్ణయహేతుభిరుత్పాదితే తస్మిన్ యత్ర తాత్పర్యనిర్ణయస్తస్యైవార్థస్య అన్వయబుద్ధిర్జాయతే, నాన్యస్యేతి సరణావాశ్రీయమాణాయాం నైకమాత్రగోచరస్మృత్యపేక్షా, నాప్యపరార్థోపస్థానప్రతిబంధకత్వకల్పనమ్। ఏవం చ ప్రాగుపదర్శితనానార్థస్థలే ప్రకరణాదిజ్ఞానాధీనాత్ తాత్పర్యనిర్ణయాత్ ప్రాకరణికార్థశాబ్దబుద్ధౌ జాతాయామతాత్పర్యవిషయాపి శాబ్దబుద్ధిః తస్మాదేవ శబ్దాజ్జాయమానా కస్య వ్యాపారస్య సాధ్యతామాలంబతామ్, ఋతే వ్యంజనాత్। న చ శక్తిసాధ్యా సేతి వాచ్యమ్। తదధీనబోధం ప్రతి తాత్పర్యనిర్ణయస్య హేతుత్వాత్। వ్యక్త్యధీనబోధస్తు నావశ్యం తాత్పర్యజ్ఞానమపేక్షతే॥ (రసగం. ద్వితీ)

41. అన్యేత్వత్ర ప్రత్యవతిష్ఠంతే— యత్తావదుక్తమేకార్థమాత్రావిషయా పదార్థోపస్థితిస్తదన్వయబోధేఽపేక్ష్యత ఇతి, తదసారమ్। నానార్థాదర్థద్వయోపస్థితావపి ప్రకరణాదిజ్ఞానాధీనతాత్పర్యజ్ఞానమహిమ్నైవ వివక్షితార్థశాబ్దబోధోపపత్తేః, ఏకార్థమాత్రోపస్థిత్యపేక్షాయాం మానాభావాత్। అపరార్థోపస్థాపకసామగ్ర్యాః పదజ్ఞానస్య సత్త్వేన తదుపస్థితేరపర్యాచిత్యాచ్చ। న చ ప్రకరణాదిజ్ఞానం తదధీనతాత్పర్యజ్ఞానం వా పరార్థోపస్థానే ప్రతిబంధకమితి శక్యం వక్తుమ్। సంస్కారతదుద్బోధకయోః సత్త్వే స్మృతేః ప్రతిబంధస్య క్వాప్యదృష్టత్వాత్। . .. .... . "సోఽవ్యాదిష్టభుజంగహారవలయస్త్వాం సర్వదో-మాధవః" ఇత్యాదౌ శ్లేషకావ్య ఇవ

నిట్లుగ్గడించిరి–"వక్త తానట్లు నానార్థకపదములు చొప్పించి మాటాడుచున్నాఁడనిన ఆయర్థములనన్నింటిని శ్రోతలు గ్రహింపవలయుననియేకదా ! కావున ప్రకరణజ్ఞానాధీనమగు తాత్పర్యజ్ఞానమహిమచేతనే శ్రోతలావివక్షితార్థములనన్నింటిని గ్రహింతురు ఇట్లుండ నర్థాంతరప్రతీతిని ప్రకరణాదిజ్ఞానమో, తాత్పర్యజ్ఞానమో ప్రతిబంధించునని చెప్పి వ్యంజననాశ్రయించవలసిన పనిలేదు. కోశాదిజ్ఞానమువలన కలిగిన నానార్థవిషయకదృఢసంస్కారము, వక్త తానట్లు నానార్థకశబ్దముల ప్రయోగించుటయు, అనునిరెండును ఆయర్థవిశేషస్మృతిని కలుగఁజేయుచునే యుండును. రెండర్థములును ప్రాకరణికములై యుండునప్పుడు శక్తిబోధ్యములగుటలేదా ? అట్లే ప్రాకరణికాప్రాకరణికార్థములు రెండును అభిధాబోధ్యములే యగుననుటలో నేవిప్రతిపత్తియును లేదు

మఱియు అసత్యమగుటచే బాధితమై వక్తృతాత్పర్యవిషయముకాని యర్థాంతరమువిషయమునను వ్యంజననాశ్రయింపవలసినపని లేదు 'ముఖం చంద్రః'(ముఖము చంద్రుడు) అనునప్పుడు ముఖమునకు చంద్రునితోనభేదము వాస్తవమునకు కుదురదుకావున బాధితము. అయినను–వాచ్యార్థాన్వయబోధకై అభేదారోపము ఆహార్య(బాధకాలీనేచ్ఛాజన్య)మగునేని బాధబుద్ధిచే ప్రతిబధ్యము కాదంటిమి అట్లే ఇచ్చటను 'బాధజ్ఞానము శాబ్దబోధను ప్రతిబంధించద'ను నియమము నేర్పఱచుకొనిన నసభ్యార్థము ను శక్తివేద్యమగుటలో నేయాటంకము లేదు 42 కావున–"ప్రకరణాదిజ్ఞానమో తదధీనమగు తాత్పర్యజ్ఞానమో అప్రా

---

ప్రకృతేఽపి ప్రకృతాప్రకృతయోరర్థయోర్బోధస్య స్వీకారే బాధకాభావాత్। ఇత్థం చ నానార్థస్థలేఽపి తాత్పర్యధియః కారణతాయాం శిథిలీభవన్త్యామతాత్పర్యార్థవిషయశాబ్దబుద్ధిసంపాదనాయ వ్యక్తిస్వీకారోఽనుచిత ఏవ। శక్త్యైవ బోధద్వయోపపత్తేః॥ (రసగం. ద్వితీ)

42 క) అథాస్త్వప్రాకరణికోఽప్యర్థః శక్తివేద్య ఏవాన్వయధీగోచరః, పరం తు యత్ర న బాధితః స్యాత్। యత్ర తు బాధితః, తత్ర–"జైమినీయమలం ధత్తే రసనాయామయం ద్విజః" ఇత్యాదౌ జుగుప్సితోఽప్యర్థః, "వహ్నినా సించతీ" త్యాదౌ వహ్నికరణక సేక ఇవాబోధోపహత ఏవ స్యాత్। బాధనిశ్చయస్య తద్వత్తాజ్ఞానం ప్రతి ప్రతిబంధకతాయాః సర్వజనసిద్ధత్వాత్। వ్యక్తేస్తు బాధితార్థబోధకత్వం ధర్మిగ్రాహకమాన-

కరణికార్థమును బోధించుటలో నభిధను ప్రతిబంధించుటచే నప్రాకరణికార్థము వ్యక్తి(వ్యంజనా)వేద్యమగు"నను ప్రాచీనులయభిప్రాయము విచారణీయాంశము గానే మిగిలినది

**అర్థాంతరవాచకతానియంత్రణము-పండితరాయలసమర్థనము :-**

ఈ విమర్శ మమ్మటాది ప్రాచీనుల వ్యంజనాలక్షణమునకే గొడ్డలి పెట్టైనది పండితరాయలును విరి విమర్శను కాదనలేకపోయెను 43 కాని

సిద్ధమితి వ్యక్తివాదినామదోష ఇతి। మైవమ్। "గామవతీర్ణా సత్యం సరస్వతీయం పతంజలివ్యాజాత్" "సౌధానాం నగరస్యాస్య మిలంత్యర్క్యేణ మాళయః" ఇత్యాదౌ వాచ్యార్థాన్వయబోధోపపాదనాయానుసరణీయేన "యత్నేన" నానార్థస్థలేఽపి బాధితార్థబోధస్యోపపత్తిః స్యాత్। అన్యథా ప్రాయశః సర్వేష్వలంకారేషు వాచ్యార్థబోధోపపత్తయే వ్యంజనాఽంగీకరణీయా స్యాత్, తస్మాన్నానార్థస్య అప్రాకరణికేఽర్థే వ్యంజనేతి ప్రాచాం సిద్ధాంతః శిథిల ఏవ॥ (రసగం. ద్వితీ)

ఇచ్చట 'యత్నేన' అనుదానిని వ్యాఖ్యానించుచు నాగేశభట్టు—

యత్నేనేతి। బాధజ్ఞానం శబ్దజ్ఞానే న ప్రతిబంధకమ్। అయోగ్యతానిశ్చయశ్చ। ఏవం యోగ్యతాజ్ఞానమపి న కారణమ్, అహార్యో వా బోధ ఇత్యాదియత్నోఽగ్రే మూల ఏవ స్ఫుటః। —మర్మప్రకాశ (రసగం ద్వితీ)

ఖ) తాదృశాభేదబోధస్య చాహార్యత్వాన్న బాధబుద్ధిప్రతిబధ్యత్వమ్। యద్వా అహార్యాన్వయస్యేవ శాబ్దాన్వయస్యాపి బాధనిశ్చయప్రతిబధ్యతాకోటౌ నివేశః। సతి చ బాధనిశ్చయే తద్వత్తాశాబ్దబుద్ధేరనుత్పాదః। యోగ్యతాజ్ఞానవిరహాత్। సతి చ క్వచిదహార్యే యోగ్యతాజ్ఞానే తద్బుద్ధేరిష్టత్వాత్॥ (రసగం ద్వితీ రూపక)

43 క) ప్రాకరణికాప్రాకరణికార్థయోరుపమాయాం తు సా(వ్యంజనా)కదాచిత్ స్యాదపీత్యత్రాస్మాకం ప్రతిభాతి॥

—పండితరాజజగన్నాథ (రసగం. ద్వితీ.)

ఖ) వయం తు బ్రూమః— "అనేకార్థస్థలే హ్యప్రకృతాభిధానే శక్తేరుక్తిసంభవోఽప్యస్తి॥ యోగరూఢిస్థలే సాఽపి దూరాపాస్తా ॥

(రసగం. ద్వితీ శ్లేష.)

వ్యంజను మఱోవిధమున వ్యవస్థాపించుచు ప్రాచీనులసంప్రదాయమునిట్లు బల పఱిచెను—

అబలానాం శ్రియం హృత్వా వారివాహైః సహానిశమ్।
తిష్ఠన్తి చపలా యత్ర స కాలః సముపాగతః॥ (రసగం ద్వితీ.)

ఇది వర్షాకాలవర్ణనము చపలలు(విద్యుత్తులు) అబలల(స్త్రీల)శోభను హరించి వారివాహములతో(మేఘములతో) కలిసితిరుగుకాలమాసన్నమాయెననునర్థము ప్రకృతము అబలావారివాహచపలాశబ్దములకు, యోగశక్తిచే కలిగినయర్థాంతర మును పురస్కరించుకొని "అశక్తులధనమునపహరించి జఘనచపలలగు కాంతలు కావడి నీరు మోయువాండ్రతో తిరుగుచున్నార"నునప్రకృతార్థము ధ్వనించు చున్నది ఈ రెండవయర్థము యౌగికార్థము కావున రూఢ్యర్థముచే ప్రతిబద్ధ మగును "యోగాత్‌రూఢిర్బలీయసీ" అని కదా న్యాయము కావున రూఢ్యర్థ మును చెప్పియే నివృత్తవ్యాపారములగు పదముల యవయవార్థము శక్తి-వేద్యముకాదు ఈయంశమున "వ్యంజన"యే శరణ్యమగును [44] అర్థాంతరప్రతీతి యనుభవసిద్ధమయియుండ దానిని సహృదయులెవ్వరును కాదనలేరు. [45] ఈ విషయమిట్లు సంగ్రహింపఁబడనది— (రసగం ద్వితీ.)—

---

44 క) అత్ర-అశక్తానాం ద్రవ్యమపహృత్య జలవాహకైః పురుషైః సహ పుంశ్చల్యో రమన్త ఇత్యర్థాంతరం న తావదబలావారివాహచపలా-శబ్దైర్యోగరూఢ్యా శక్యతే బోధయితుమ్। మేఘత్వవిద్యుత్త్వాద్యఘటిత-స్యైవ తస్యార్థస్య ప్రతీతేః। అన్యథా చమత్కారో న స్యాత్। అత ఏవ న యోగశక్త్యాపి కేవలయా। రూఢ్యర్థాసంవలితార్థబోధకత్వస్య తస్యా రూఢిసమానాధికరణాయా అసంగతేః। పుంశ్చలీత్వాదేః సర్వథైవ తద-విషయత్వాత్॥ (రసగం. ద్వితీ వ్యంజనావ్యవస్థాపన)

ఖ) ఏవమపి యోగరూఢిస్థలే రూఢిజ్ఞానేన యోగాపహరణస్య సకలతంత్ర-సిద్ధతయా రూఢ్యనధికరణస్య యోగార్థాలింగితస్య అర్థాంతరస్య వ్యక్తిం వినా ప్రతీతిర్దురుపపాదా॥ (రసగం ద్వితీ.)

45 తాదృశార్థప్రతిపత్తిరేవ నాస్తీతి తు గాఢతరశబ్దార్థవ్యుత్పత్తిమసృణీ-కృతాంతఃకరణైర్న శక్యతే వక్తుమ్॥ (రసగం ద్వితీ )

"యోగరూఢస్య శబ్దస్య యోగే రూఢ్యా నియంత్రితే।
ధియం యోగస్పృశోఽన్యస్య యా సూతే వ్యంజనైవ సా॥"

ఇఁక ప్రాకరణికాప్రాకరణికార్థముల యసంబద్ధతను తొలగించుటకై కల్పింపఁబడిన యుపమాలంకారము ఏ శబ్దముచేతను చెప్పఁబడకయుండుటచే వాచ్యము కాదు కావున దానికై అచ్చట వ్యంజననాశ్రయించక తప్పదు కదా! ఆవ్యంజనచేతనే అప్రాకరణికార్థముకూడ కలిగినదని చెప్పినచో కల్పనాక్లేశము తప్పుననునభిప్రాయముచే ప్రాచీనులట్లు నానార్థవ్యంజకతాసరణిని నిరూపించిరి [46]

కావున సంయోగాదులు నానార్థకశబ్దశక్తిని నియమించునను ప్రాచీనుల (ఉక్తి)యుక్తి విరుద్ధము కాదు.

**పదాంతరసన్నిధి—ప్రాచీనుల నిర్వచనము :—**

'అసావుదయమారూఢః' అను పూర్వోదాహరణమున ప్రాచీనులమతమున "పదాంతరసన్నిధి"యను నభిధానియామకము లేకుండుటచే రెండవయర్థమభిధేయము కాదు ప్రాచీనులు[47] నిర్వచించినట్లు పదాంతరసన్నిధియన ననేకా

46 ఏవం స్థితే నానార్థస్థలేఽప్యుపమాయాః ప్రాకరణికాప్రాకరణికార్థగతాయాః ప్రతిపత్తయేఽవశ్యం వాచ్యయా వ్యంజనయైవ అప్రాకరణికస్యాప్యర్థస్య ప్రతిపత్తౌ, అలం క్లిష్టకల్పనయేత్యాశయేన ప్రాచీనైరుక్తం నానార్థవ్యంజకత్వమపి న దుష్యతి॥ (రసగం ద్వితీ)

47. క) 'శబ్దస్యాన్యస్య సన్నిధిః' నియతార్థకశబ్దాంతరసామానాధికరణ్యమ్। అతో'భవచ్ఛిదే' ఇత్యాదావప్రసంగః। న చ 'సశంఖచక్రో హరిః' ఇత్యత్రాతివ్యాప్తిః। శంఖచక్రసామానాధికరణ్యాభావాత్। యద్వా హరౌ శంఖచక్రే ఇతి సంయోగోదాహరణ తాత్పర్యమ్। తేన యథా - "దేవస్య త్రిపురారాతే" రిత్యత్ర త్రిపురారాతిశబ్దసామానాధికరణ్యాత్ దేవశబ్దస్య శంభురూపేఽమరే। అన్యస్య దేవశబ్దార్థస్య రాజ్ఞః త్రిపురారిత్వాభావాత్। (కావ్యప్రదీప 214 వృత్తి)

ఖ) "కిం సాక్షాదుపదేశయష్టిరథవా దేవస్య శృంగారిణః" ఇతి శబ్దాంతరసన్నిధానాత్ కామే"॥ (కావ్యాను. 123 సూ. వృత్తి)

గ) 'దేవస్య రమాపతేః' ఇతి శబ్దాంతరసాన్నిధ్యాత్ తత్రైవ"॥ (సాహిత్యరత్నాకర. 4.2 కా. వృత్తి)

ర్థములుగల పదసముదాయమున నొకపదమైనను నియతమగునర్థముగలదై యుండవలెను అట్లాపదముయొక్క నియతమగు నర్థముననుసరించియే నానార్థకములగు నితరపదములయర్థములు నిర్ణయింపఁబడును "దేవస్య త్రిపురారాతేః"(త్రిపురారాతియగు దేవునకు)అనునప్పుడు త్రిపురారాతియనుపదమునకు 'త్రిపురాసురునకు శత్రువ'నునర్థము నియతమై యున్నది కావున ఈపదసమభివ్యాహారము రాజాద్యర్థాంతరములుగల దేవపదమును'శివుఁ'డను నర్థమున నియమించుచున్నది అట్లు పూర్వోదాహరణమున కానరాదు రాజకరమండలాదిపదములన్నియును నానార్థకములేయగుటచే నియతార్థకమగు పదమే లేదు ఇఁకనిట "పదాంతరసన్నిధి" యర్థవిశేషనిర్ణాయకమనుట ఎట్లు ?

కావుననే ప్రాచీనులు ఏతాదృశశబ్దశక్తిమూలధ్వన్యుదాహరణములయందు పదాంతరసన్నిధి లేకుండుటచే ప్రాకరణికార్థము వ్యంగ్యమే యగును కాని వాచ్యమగుటకు పీలులేదనిరి

**పదాంతరసన్నిధి—అప్పయదీక్షితుల వివరణము -**

అప్పయదీక్షితులు —"పదాంతరసన్నిధి అర్థనిర్ణాయకమగుటలో నొకపదమయినను నియతార్థకమయి యుండవలె"నను ప్రాచీనుల యభిప్రాయముతో నేకీభవించక, పదములన్నియును నానార్థకములయియుండుటయే దీనిలోని ప్రత్యేకత యనియును, అప్పుడే "కరేణ రాజతే నాగః" (గజము తొండముతో ప్రకాశించుచున్నది)మున్నగు నుదాహరణములు సమర్థింపవీలగుననియును, నానార్థకములగునాపదములకు ఈయర్థముగాక మఱేయర్థము గ్రహించనను పరస్పరాన్వయము కుదురదని పరస్పరాన్వయయోగ్యమగు నీయర్థమే పరస్పరపదసమభివ్యాహారముచే నేకకాలమున నిర్ణయింపఁబడుటవలన నన్యోన్యాశ్రయము లేదనియును వివరించిరి [48]

---

48 క) శబ్దస్యాన్యస్య సన్నిధిః=నానార్థపదైకవాచ్యసంసర్గ్యర్థాంతరవాచిపద-సమభివ్యాహారః॥ (వృత్తివార్తిక. పుట 7)

ఖ) 'వ్యాళో దానేన రాజతే' ఇత్యత్ర వ్యాళదానపదయో రుభయోరప్యనియ-తార్థత్వేఽపి వైయధికరణ్యేఽపి పరస్పరసమభివ్యాహారేణ దుష్టగజ-మదజలయోరభిధానియమనస్య సర్వానుభవసిద్ధత్వేన అవశ్యసంగ్రాహ్య-త్వాత్ తదసంగ్రహేణ లక్షణకథనస్య అయుక్తత్వాచ్చ॥ (వృత్తివార్తిక. పుట. 9)

"యోగరూఢస్య శబ్దస్య యోగే రూఢ్యా నియంత్రితే।
ధియం యోగస్పృశోఽన్యస్య యా సూతే వ్యంజనైవ సా॥"

ఇఁక ప్రాకరణికాప్రాకరణికార్థముల యసంబద్ధతను తొలగించుటకై కల్పింపఁబడిన యుపమాలంకారము ఏ శబ్దముచేతను చెప్పఁబడకయుండుటచే వాచ్యము కాదు. కావున దానికై అచ్చట వ్యంజననాశ్రయించక తప్పదు కదా! అవ్యంజనచేతనే అప్రాకరణికార్థముకూడ కలిగినదని చెప్పినచో కల్పనాక్లేశము తప్పుననునభిప్రాయముచే ప్రాచీనులట్లు నానార్థవ్యంజకతాసరణిని నిరూపించిరి 46

కావున సంయోగాదులు నానార్థకశబ్దశక్తిని నియమించునను ప్రాచీనుల (ఉక్తి)యుక్తి విరుద్ధము కాదు

**పదాంతరసన్నిధి—ప్రాచీనుల నిర్వచనము :—**

'అసావుదయమారూఢః' అను పూర్వోదాహరణమున ప్రాచీనులమతమున "పదాంతరసన్నిధి"యను నభిధానియామకము లేకుండుటచే రెండవయర్థమభిధేయము కాదు ప్రాచీనులు47నిర్వచించినట్లు పదాంతరసన్నిధియన ననేకా

---

46 ఏవం స్థితే నానార్థస్థలేఽప్యుపమాయాః ప్రాకరణికాప్రాకరణికార్థగతాయాః ప్రతిపత్తయేఽవశ్యం వాచ్యయా వ్యంజనయైవ అప్రాకరణికస్యాప్యర్థస్య ప్రతిపత్తౌ, అలం క్లిష్టకల్పనయేత్యాశయేన ప్రాచీనైరుక్తం నానార్థవ్యంజకత్వమపి న దుష్యతి॥ (రసగం ద్వితీ)

47. క) 'శబ్దస్యాన్యస్య సన్నిధిః' నియతార్థకశబ్దాంతరసామానాధికరణ్యమ్। అతో'భవచ్ఛిదే' ఇత్యాదావప్రసంగః। న చ 'సశంఖచక్రో హరిః' ఇత్యత్రాతివ్యాప్తిః। శంఖచక్రసామానాధికరణ్యాభావాత్। యద్వా హరౌ శంఖచక్రే ఇతి సంయోగోదాహరణ తాత్పర్యమ్। తేన యథా - "దేవస్య త్రిపురారాతే" రిత్యత్ర త్రిపురారాతిశబ్దసామానాధికరణ్యాత్ దేవశబ్దస్య శంభురూపేఽమరే। అన్యస్య దేవశబ్దార్థస్య రాజ్ఞః త్రిపురారిత్వాభావాత్। (కావ్యప్రదీప 214 వృత్తి)

ఖ) "కిం సాక్షాదుపదేశయష్టిరథవా దేవస్య శృంగారిణః" ఇతి శబ్దాంతరసన్నిధానాత్ కామే"॥ (కావ్యాను. 123 సూ. వృత్తి)

గ) 'దేవస్య రమాపతేః' ఇతి శబ్దాంతరసాన్నిధ్యాత్ తత్రైవ"॥ (సాహిత్యరత్నాకర. 4.2 కా. వృత్తి)

ర్ధములుగల పదసముదాయమున నొకపదమైనను నియతమగునర్ధముగలదై యుండవలెను అట్లాపదముయొక్క నియతమగు నర్థముననుసరించియే నానార్థకములగు నితరపదములయర్ధములు నిర్ణయింపఁబడును. "దేవస్య త్రిపురారాతేః"(త్రిపురారాతియగు దేవునకు)అనునప్పుడు త్రిపురారాతియనుపదమునకు 'త్రిపురాసురునకు శత్రువ'నునర్ధము నియతమై యున్నది కావున ఈపదసమభివ్యాహారము రాజాద్యర్థాంతరములుగల దేవపదమును'శివుఁ'డనునర్థమున నియమించుచున్నది అట్లు పూర్వోదాహరణమున కానరాదు రాజకరమండలాదిపదములన్నియును నానార్థకములేయగుటచే నియతార్థకమగు పదమే లేదు ఇఁకనిట "పదాంతరసన్నిధి" యర్ధవిశేషనిర్ణాయకమనుట ఎట్లు ?

కావుననే ప్రాచీనులు ఏతాదృశశబ్దశక్తిమూలధ్వన్యుదాహరణములయందు పదాంతరసన్నిధి లేకుండుటచే ప్రాకరణికార్థము వ్యంగ్యమే యగును కాని వాచ్యమగుటకు పీలులేదనిరి

**పదాంతరసన్నిధి—అప్పయదీక్షితుల వివరణము –**

అప్పయదీక్షితులు —"పదాంతరసన్నిధి అర్థనిర్ణాయకమగుటలో నొకపదమయినను నియతార్థకమయి యుండవలె"నను ప్రాచీనుల యభిప్రాయముతో నేకీభవించక, పదములన్నియును నానార్థకములయియుండుటయే దీనిలోని ప్రత్యేకత యనియును, అప్పుడే "కరేణ రాజతే నాగః" (గజము తొండముతో ప్రకాశించుచున్నది)మున్నగు నుదాహరణములు సమర్థింపపీలగుననియును, నానార్థకములగునాపదములకు ఈయర్థముగాక మఱేయర్ధము గ్రహించనను పరస్పరాన్వయము కుదురదని పరస్పరాన్వయయోగ్యమగు నీయర్థమే పరస్పరపదసమభివ్యాహారముచే నేకకాలమున నిర్ణయింపఁబడుటవలన నన్యోన్యాశ్రయము లేదనియును వివరించిరి [48]

---

48. క) శబ్దస్యాన్యస్య సన్నిధిః=నానార్థపదైకవాచ్యసంసర్గ్యర్థాంతరవాచిపద-సమభివ్యాహారః॥ (వృత్తివార్తిక. పుట 7)

ఖ) 'వ్యాళో దానేన రాజతే' ఇత్యత్ర వ్యాళదానపదయో రుభయోరప్యనియతార్థత్వేఽపి వైయధికరణ్యేఽపి పరస్పరసమభివ్యాహారేణ దుష్టగజ-మదజలయోరభిధానియమనస్య సర్వానుభవసిద్ధత్వేన అవశ్యసంగ్రాహ్యత్వాత్ తదసంగ్రహేణ లక్షణకథనస్య అయుక్తత్వాచ్చ॥ (వృత్తివార్తిక పుట. 9)

కావుననే—"అసావుదయమారూఢః" మున్నగు నుదాహరణములలో పదాంతరసన్నిధిచే న(ప్రాకరణికార్థము నిర్ణయింపఁబడుటచే నాయర్థము కూడ వాచ్యమే యగు"నని అప్పయదీక్షితుల యభిప్రాయమై యున్నది

పండితరాయలును—పదాంతరసన్నిధినిట్లే [49]నిర్వచించినవాఁడయ్యును ప్రాచీనులమతమునే బలపఱచుచు[50] అప్రకృతార్థము "వ్యంగ్యమే" యగునని నిర్ధారించి ప్రకృతాప్రకృతశ్లేషకు ఉపమాఘటితశ్లోకమునే యుదాహరించె[51]

---

గ) 'నిషధం పశ్య భూభృతమ్' ఇత్యత్ర జనపదవిశేషసాధారణస్య నిషధ-పదస్య పర్వతవాచిభూభృత్పదసన్నిధానాత్ పర్వతవిశేషే నియమ్యతే। భూభృత్పదస్య రాజసాధారణస్య పర్వతవిశేషవాచినిషధపదసన్నిధినా పర్వతే। న చాన్యోన్యాశ్రయః॥ (వృత్తివార్తిక పుట. 8)

49 శబ్దస్యాన్యస్య సన్నిధిః=నానార్థపదైకార్థమాత్రసంసర్గ్యర్థాంతరవాచకపద-సమభివ్యాహారః॥ యథా'కరేణ రాజతే నాగః' ఇత్యత్ర కరపదస్య నాగ-మాదాయ నాగపదస్య చ కరపదమాదాయ శుండాయాం గజే చ। న చాత్ర ఏకశబ్దనియమనమపరశబ్దశక్తినియమోఽపేక్షతే, యేనాన్యోన్యాశ్రయః స్యాత్। కిం తు కరనాగశబ్దయోరర్థాంతరగ్రహణేఽన్వయానుపపత్త్యా యుగపదేవ శక్తిర్నియమ్యతే॥ (రసగం ద్వితీ.)

50 యత్తావదుచ్యతే— "ఉపమాదేరలంకారస్యైవ వ్యంగ్యత్వం ప్రాచీనానామభి-ప్రేతం, న త్వప్రకృతార్థస్యే"తి। ఏవం సతి—'అనేకార్థస్య శబ్దస్య' ఇత్యాదిః తేషాం గ్రంథః కథమాయుష్మతా (అప్పయదీక్షితేన) సమర్థితః। ఉపమాదే-ర్వ్యంగ్యత్వస్య వాచకతానియంత్రణానపేక్షత్వాత్। న హ్యనేకార్థస్యాపి శబ్దస్య ఉపమాదివాచకత్వం ప్రసక్తం, యేన తన్నియంత్రణాయ సంయో-గాద్యనుసరణమర్థవత్స్యాత్। ద్వితీయార్థవాచకతాయామనియంత్రితాయా-మపి ఉపమాదేర్వ్యంగ్యత్వస్య నిష్ప్రత్యూహత్వాత్। తస్మాత్తద్గ్రంథా-నాకలన నిబంధనం తదభిప్రాయవర్ణనమితి స్ఫుటమేవ॥

—(రసగం ద్వితీ శ్లేష)

51 ప్రకృతాప్రకృతోభయవిషయోయథా (రసగం. ద్వితీ. శ్లేష) :—
అలం హి మానీ పరిదీర్ణగాత్రః సమాపితః ఫాల్గుణసంగమేన।
అత్యంతమాకాంక్షితకృష్ణవర్త్మా భీష్మో మహాత్మాఽజని మాఘతుల్యః॥

తదనుకూలముగా, ప్రాకరణికాప్రాకరణికార్థములకు నుపమానోపమేయభావము కల్పింపవీలులేనిశ్లోకమును శబ్దశక్తిమూలవస్తుధ్వనికి నుదాహరించెను [52]

ప్రకృతాప్రకృతశ్లేష-విషయవ్యవస్థ -

మమ్మటుఁడు ఉపమాలంకారఘటితమగు ప్రకృతాప్రకృతశ్లేషోదాహరణమును నిరసించెనే కాని దానికుదాహరణమెట్లుండునో వివరించకుండెను. తనకు ప్రాచీనులగు నాలంకారికులెవ్వరును శ్లేషాలంకారమునకేతాదృశవిభాగము కనఁబఱచకుండుటయే మమ్మటుని ఈయుపేక్షకు కారణమైనది భామహుఁడు[53]-ఉపమానముతోనుపమేయమునకు గుణక్రియలచేతనో శబ్దముచేతనో

---

52 శబ్దశక్తిమూలవస్తుధ్వనిర్యథా –
రాజ్ఞో మత్ప్రతికూలాన్మే మహద్భయముపస్థితమ్।
బాలే! వారయ పాంథస్య వాసదానవిధానతః॥ (రసగం ద్వితీ)
(ఈ యుదాహరణము పూర్వము (పుట 89) వివరింపఁబడినది.)

53 "ఉపమానేన యత్తత్త్వముపమేయస్య సాధ్యతే।
గుణక్రియాభ్యాం నామ్నా చ శ్లిష్టం తదభిధీయతే॥"
"లక్షణం రూపకేఽపీదం లక్ష్యతే కామమత్ర తు।
ఇష్టః ప్రయోగో యుగపదుపమానోపమేయయోః॥"
"శీకరాంభోమదసృజస్తుంగా జలదదంతినః।
ఇత్యత్ర మేఘకరిణాం నిర్దేశః క్రియతే సమమ్॥"
"శ్లేషాదేవార్థవచసోరస్య చ క్రియతే భిదా।
తత్సహోక్త్యుపమాహేతునిర్దేశాత్ త్రివిధం యథా॥"
"ఛాయావంతో గతవ్యాలాః స్వారోహాః ఫలదాయినః।
మార్గద్రుమా మహాంతశ్చ పరేషామేవ భూతయే॥"
"ఉన్నతా లోకదయితా మహాంతః ప్రాజ్యవర్షిణః।
శమయంతి క్షితేస్తాపం సురాజానో ఘనా ఇవ॥"
"రత్నవత్త్వాదగాధత్వాత్ స్వమర్యాదావిలంఘనాత్।
బహుసత్త్వాశ్రయత్వాచ్చ సదృశస్త్వముదన్వతా॥"
—భామహ (కావ్యాలంకార. 3 . 14–20)

(శబ్దసాధర్మ్యముచేతనో) తాద్రూప్యముచెప్పుటయే శ్లిష్టమని(శ్లేషయని) నిర్వ చించి రూపకమునకును శ్లేషకునుగల భేదమును వివరించుచు రూపకమున నుపమానోపమేయములకుగల సమానధర్మము విడివిడిగానుండుపదములచేఁ జెప్పఁబడుననియు శ్లేషయందట్లు గాక ఒకేపదముచేత, గుణక్రియాదిరూపమగు నర్థమునందుననో శబ్దమునందుననో శ్లేషనాశ్రయించి చెప్పఁబడుననియు, అట్టి యెడ సహోక్తియో (ఉపమానోపమేయములకు నేకధర్మాన్వయమున సహ భావముచెప్పుటయో) ఉపమయో హేతునిర్దేశమో యుండుటచేనిది (శ్లేష) ముప్విధములగునని విభజించి సోదాహరణముగా విశదీకరించెను [54]వామనుఁడు లక్షణనిర్వచనమున భామహునిననుసరించినవాఁడయ్యును వానిభేదములను గణించక మొదటిభేదమును మాత్రము శ్లేషోదాహరణముగానుట్టంకించి యూర కుండెను. దండియు-'ఒకేరూపముననున్న పలుకు అనేకార్థములుగలదైన శ్లిష్ట మని శ్లేషను నిర్వచించి దానిని ప్రధానముగా నభిన్నపద(అభంగ)మనియు భిన్నపద(సభంగ)మనియు రెండువిధముల విభజించి, ఈ శ్లేష ఉపమాద్యలం కారములనే కాక మఱెన్నియోయలంకారములనాశ్రయించియుండునని సోదా-

---

54 క) "ఉపమానేనోపమేయస్య గుణసామ్యాత్తత్త్వారోపో రూపకమ్॥' (6)

"స ధర్మేషు తంత్రప్రయోగే శ్లేషః॥' (7)

ఉపమానేనోపమేయస్య ధర్మేషు గుణక్రియాశబ్దరూపేషు స తత్త్వా-ద్యారోపః తంత్రప్రయోగే తంత్రోచ్చారణే సతి శ్లేషః। యథా—

ఆకృష్టామలమండలాగ్రరుచయః సన్నద్ధవక్షస్థ్సలాః
సోష్మాణో వ్రణినో విపక్షహృదయప్రోన్మాథినః కర్కశాః।
ఉద్వృత్తా గురవశ్చ యస్య వశినః శ్యామాయమానాననాః
యోధా మార(వార)వధూస్తనాశ్చ న దధుః క్షోభం స వోఽవ్యాజ్జినః॥"

—వామన (కావ్యా. సూ 4 . 3 . 6, 7 వృత్తి)

ఖ) అనేకోపకారకారిసకృదుచ్చారణం తంత్రమ్। ఉపమానోపమేయయో-ర్గుణసామ్యే తద్ధర్మేషు గుణాదిషు తంత్రేణ ప్రయోగే సతి యత్తాద్రూ-ప్యారోపణం స శ్లేష ఇతి లక్షణార్థః॥

—కామధేనువ్యాఖ్య (కావ్యా. సూ. 4 8.7)

హరణముగా వివరించెను [55] ఈ వివరణమే వామనుఁడట్లు శ్లేషభేదపరిగణనమున చూపిన యుపేక్షకు కారణమైయుండును

[56]ఉద్భటుఁడు శ్లేషకుగల సభంగాభంగభేదముల మననముననిడి తదనుగుణముగా శ్లేషలక్షణమొనర్చి ప్రత్యేకాస్తిత్వము గానక శ్లేష సర్వాలంకారాప-

---

55 క) "శ్లిష్టమిష్టమనేకార్థమేకరూపాన్వితం వచః।
తదభిన్నపదం భిన్నపదప్రాయమితి ద్విధా॥"
"ఉపమారూపకాక్షేపవ్యతిరేకాదిగోచరాః ।
ప్రాగేవ దర్శితాః శ్లేషాః దర్శ్యంతే కేచనాపరే॥"
—దండి. (కావ్యాదర్శ 2. 310, 313)

ఖ) కావ్యాదర్శమందలి శ్లేషచక్రము (2 310 - 322), శ్లేషోపమాసమానోపములు (2 28, 29) శ్లిష్టరూపకము (2 87) శ్లిష్టాక్షేపము (2 159) సశ్లేషవ్యతిరేకము (2 183) శ్లేషావిద్ధార్థాంతరన్యాసము (2.174) శ్లిష్టవిశేషణసమాసోక్తి (2 204) శ్లిష్టార్థదీపకము (2 113) శ్లిష్టమూలవిరోధము (2 338) శ్లిష్టవ్యాజస్తుతి (2 347) ఈ మున్నగునవి ఇట అనుసంధేయములు. —రచయిత

56 "ఏకప్రయత్నోచ్చార్యాణాం తచ్ఛాయాం చైవ బిభ్రతామ్।
స్వరితాదిగుణైర్భిన్నైః బంధః శ్లిష్టమిహోచ్యతే॥
అలంకారాంతరగతాం ప్రతిభాం జనయత్ పదైః।
ద్వివిధైరర్థశబ్దోక్తివిశిష్టం తత్ ప్రతీయతామ్॥
స్వయం చ పల్లవాతామ్రభాస్వత్కరవిరాజినీ।
ప్రభాతసంధ్యేవాస్వాపఫలలుబ్ధే హితప్రదా॥
ఇందుకాంతముఖీ స్నిగ్ధమహానీలశిరోరుహా ।
ముక్తాశ్రీస్త్రిజగద్రత్నం పద్మరాగాంఘ్రిపల్లవా॥
అపారిజాతవార్తాపి నందనశ్రీర్భువి స్థితా ।
అబిందుసుందరీ నిత్యం గలల్లావణ్యబిందుకా॥"
—ఉద్భట. (కావ్యా. 4 23 —27)

వాదమగుననియెను. రుద్రటుఁడును[57] తన కావ్యాలంకారచతుర్థాధ్యాయమున శబ్దశ్లేష వర్ణపదలింగభాషాప్రకృతిప్రత్యయవిభక్తివచనములనాశ్రయించి అష్టవిధమగునని సోదాహరణముగా వివరించి దశమాధ్యాయమున అర్థశ్లేషను అవిశేషాదిభేదమున దశవిధముగా నిర్వచించి యుదాహరించెను మమ్మటుఁడు శ్లేషలక్షణనిర్వచనమున ఉద్భటు[58]ననుసరించినవాఁడైనను భేదపరిగణనవిషయమున శబ్దశ్లేషను (సభంగశ్లేషను) రుద్రటునివలె నష్టవిధములుగా[59] విభజించి రుద్రటునియర్థశ్లేషను(అభంగశ్లేషను) నవమభేదముగా సంగ్రహించెను [60] రుద్రటునియర్థశ్లేషభేదములను సంగ్రహించకపోవుటకు కారణము మమ్మటుఁడు వానిని విరోధాభాసాద్యలంకారాంతరములుగా [61]పరిగణించియుండు

---

57 క) వక్తుం సమర్థమర్థం సుశ్లిష్టాక్లిష్టవివిధపదసంధి ।
యుగపదనేకం వాక్యం యత్ర విధీయేత స శ్లేషః॥
వర్ణపదలింగభాషాప్రకృతిప్రత్యయవిభక్తివచనానాం।
అత్రాయం మతిమద్భిః, విధీయమానోఽష్టధా భవతి॥
—రుద్రట. (కావ్యా 4 1, 2)

ఖ) "యత్రైకమనేకార్థైర్వాక్యం రచితం పదైరనేకస్మిన్।
అర్థే కురుతే నిశ్చయమర్థశ్లేషః స విజ్ఞేయః॥
అవిశేషవిరోధాధికవక్రవ్యాజోక్త్యసంభవావయవాః।
తత్త్వవిరోధాభాసావితి భేదాస్తస్య శుద్ధస్య॥"
—రుద్రట (కావ్యా 10 1, 2)

58. "వాచ్యభేదేన భిన్నా యత్ యుగపద్భాషణస్పృశః।
శ్లిష్యంతి శబ్దాః శ్లేషోఽసావక్షరాదిభిరష్టధా॥ —మమ్మట. (కావ్య. 9 84)

59 "స చ వర్ణపదలింగభాషాప్రకృతిప్రత్యయవిభక్తివచనానాం భేదాదష్టధా॥"
(కావ్య 9 . 84 కా. వృత్తి)

60 "భేదాభావాత్ ప్రకృత్యాదేర్భేదోఽపి నవమో భవేత్॥" (కావ్య. 9.85-1)

61. న చ 'అభిందుసుందరీ నిత్యం గలల్లావణ్యబిందుకా' ఇత్యాదౌ విరోధప్రతిభోత్పత్తిహేతుః శ్లేషః, అపి తు శ్లేషప్రతిభోత్పత్తిహేతుర్విరోధః। న హ్యత్రార్థద్వయప్రతిపాదకః శబ్దశ్లేషః ద్వితీయార్థస్య ప్రతిభాతమాత్రస్య

టయే "శబ్దపరివృత్తిని సహించిన శబ్దశ్లేష" యనియు "శబ్దపరివృత్తిని సహించకున్న నర్థశ్లేష"యనియు విషయవ్యవస్థనేర్పఱచినవాఁడు కావున మమ్మటునిమతమున రుద్రటునియర్థశ్లేష(అభంగశ్లేష) శబ్దశ్లేషయే యగును[62] కావున అర్థశ్లేషయన నెట్లుండునో అర్థాలంకారములలో ప్రత్యేకముగా నిర్వచించి యుదాహరించెను[63] మఱియు శ్లేషకు స్వతంత్రమగువిషయము కనఁ

---

ప్రరోహాభావాత్। న చ విరోధాభాస ఇవ విరోధః శ్లేషాభాసః శ్లేషః। తదేవ-మాదిషు వాక్యేషు శ్లేషప్రతిభోత్పత్తిహేతురలంకారాంతరమేవ। తథా చ—"సర్వంశముక్తామణిః" "నాల్పః కవిరివ స్వల్పశ్లోకో దేవ మహాన్భవాన్" "అనురాగవతీ సంధ్యా దివసస్తత్పురస్సరః। అహో ! దైవగతిశ్చిత్రా తథాపి న సమాగమః॥" "ఆదాయ చాపమచలం కృత్వాహీనం గుణం విషమదృష్టిః। యశ్చిత్రమచ్యుతశరో లక్ష్యమభాంక్షీత్ నమస్తస్మై॥" ఇత్యాదౌ ఏకదేశ-వివర్తిరూపకశ్లేష వ్యతిరేక-సమాసోక్తి-విరోధత్వముచితం న తు శ్లేషత్వమ్॥

—మమ్మట. (కావ్య 9 . 85-1 కా వృత్తి)

62 క) అర్థశ్లేషస్య తు స విషయః యత్ర శబ్దపరివర్తనేఽపి న శ్లేషత్వ-ఖండనా। యథా— "స్తోకేనోన్నతిమాయాతి స్తోకేనాయాత్యధోగతిమ్।
అహో ! సుసదృశీ బుద్ధిస్తులాకోటేః ఖలస్య చ॥"

—మమ్మట (కావ్య 9 85-1 వృత్తి)

ఖ) ద్వావపి (సభంగాభంగౌ) శబ్దైకసమాశ్రయావితి ద్వయోరపి శబ్దశ్లేష-త్వముపపన్నమ్। న త్వాద్యస్య (అభంగస్య) అర్థశ్లేషత్వమ్॥"

—మమ్మట (కావ్య 9 85-1 వృత్తి)

63 సూ 147. "శ్లేషః స వాక్య ఏకస్మిన్ యత్రానేకార్థతా భవేత్॥"
ఏకార్థప్రతిపాదకానామేవ శబ్దానాం యత్రానేకోఽర్థః స శ్లేషః। ఉదా—

"ఉదయమయతే దిఙ్మాలిన్యం నిరాకురుతేతరామ్
నయతి నిధనం నిద్రాముద్రాం ప్రవర్తయతి క్రియాః।
రచయితితరాం స్వైరాచారప్రవర్తనకర్తనం
బత! బత! లసత్తేజఃపుంజో విభాతి దివాకరః॥"

— మమ్మట. (కావ్య 10 96 కా. వృత్తి)

బలచి "శ్లేష సకలాలంకారాపవాదమగు"నను నుద్భటునియభిప్రాయమును శిథిలీకరించెను *

ఇట్లు సభంగాభంగభేదములనుండు శ్లేష, శబ్దాలంకారమా ? అర్థాలం-కారమా ? శ్లేషకు అలంకారాంతరవివిక్తమగు విషయమున్నదా ? లేదా ? అను విషయములవైపుననే ప్రాచీనులదృష్టి కేంద్రీకృతమైనదికాని శ్లేష ప్రకృత విషయమా! అప్రకృతవిషయమా? ప్రకృతాప్రకృతవిషయమైన నెట్లుండును? అను నీ విషయమువైపు మరలకుండెను

అలంకారసర్వస్వకారుడే మొదట శ్లేషనిట్లు ప్రకృతవిషయశ్లేష, అప్రకృతవిషయశ్లేష, ప్రకృతాప్రకృతవిషయశ్లేష యని ముప్విధములుగా విభజించి [64] ప్రకృతాప్రకృతశ్లేషకుదాహరణముగా ఉపమాఘటితశ్లోకమునే[65] యుట్టంకించెను. "శ్లేష సకలాలంకారబాధక"మనుట ఎంతవఱకు సమం జసమో పర్యాలోచించుచు "ఉపమాలంకారమునకే కాని మిగిలిన యలంకార ములకు శ్లేష బాధకము కాద"ని తేల్చెను [66] అలంకారరత్నాకరకారుఁడగు

* "దేవ త్వమేవ పాతాళమాశానాం త్వం నిబంధనమ్। త్వం చామరమరుద్భూమి రేకో లోకత్రయాత్మకః॥" ఇత్యాదిః శ్లేషస్య చ ఉపమాద్యలంకారాంతర-వివిక్తోఽస్తి విషయః॥ (కావ్య. 9 85-1 వృత్తి)

64. తత్ర ద్వయోః ప్రాకరణికయోరప్రాకరణికయోః ప్రాకరణికాప్రాకరణి-కయోర్వా శ్లిష్టపదోపనిబంధే శ్లేషః॥ —రుయ్యక. (అలం. సర్వ. శ్లేష)

65. "స్వేచ్ఛోపజాతవిషయోఽపి న యాతి వక్తుం
దేహీతి మార్గణశతైశ్చ దదాతి దుఃఖమ్।
మోహాత్ సమాక్షిపతి జీవితమప్యకాండే
కష్టం మనోభవ ఇవేశ్వరదుర్విదగ్ధః॥" (అలం. సర్వ శ్లేష)

66. ఏవంచ-"సకలకలం పురమేతజ్జాతం సంప్రతి సుధాంశుబింబమివ"ఇత్యాదౌ న గుణక్రియాసామ్యవత్ శబ్దసామ్యముపమాప్రయోజకమ్, అపితూపమా-ప్రతిభోత్పత్తిహేతుః శ్లేష ఏవావసేయః।శ్లేషగర్భే తు రూపకే రూపకహేతు-కస్య శ్లేషస్య తృతీయకక్షాయాం రూపక ఏవ విశ్రాంతిరితి రూపకేణ శ్లేషో బాధ్యతే। శ్లిష్టవిశేషణనిబంధనాయాం చ సమాసోక్తౌ విశేష్యస్యాపి గమ్య-త్వాత్ శ్లేషస్య బాధికా సమాసోక్తిః॥ (అలం. సర్వ. శ్లేష)

శోభాకరమిత్రుఁడీయంశమునిట్లు విశదీకరించెను విశేష్యములుకూడ శ్లిష్టములై యుండుప్రకృతశ్లేషయందును అప్రకృతశ్లేషయందును ధర్మివాచకపదములు విడివిడిగా లేకుండుటవలన నాధర్ములకు భేదప్రతీతియే కానరాకుండుటచే, "రెండుధర్ములకన్వయించు సాధారణధర్మము సకృదుపాత్తమైయుండుటవలన చమత్కారజనక"మగు తుల్యయోగితాలంకారమెట్లుండును మఱియు తుల్య-యోగితాలంకారమున ఆరెంటికి సాదృశ్యము గమ్యమగును కాని శ్లేషలో రెండర్థములును ప్రధానములగుటచే సాదృశ్యము వివక్షితము కాదు. కావున విశేష్యములు శ్లిష్టములైయుండు ప్రకృతశ్లేషయు అప్రకృతశ్లేషయు అలంకారాంతరవిరహితములగు శుద్ధశ్లేషలే యగును ఇట్లుండుటవలన శ్లేష నిరవకాశమనిచెప్పి సర్వాలంకారబాధకమనుట చెల్లదు 67 ఇఁక-"సకలకలం పురమేతజ్జాతం సంప్రతి సుధాంశుబింబమివ"మున్నగు స్థలములలో శబ్దమాత్ర-సాధర్మ్యముచేనేర్పడినను పమాలంకారమునకు అనుగతమగుసమానధర్మమే లేకుండుటవలన ఉపమ యున్నట్లు తోచునేకాని వాస్తవముననచ్చోట ఉపమాలంకారమున్నదా ? కావుననది ఉపమాప్రతిభోత్పత్తిహేతువగు శ్లేషయే యగును ఒకవేళ—అనుగామియగు సాధారణధర్మముచే నుపమాలంకారము పూర్వమే ప్రతిష్ఠితమైయున్నచో నచ్చోట శబ్దసాధర్మ్యాంశమున నేర్పడినశ్లేష

---

67. క) "యేన ధ్వస్తమనోభవేన" ఇత్యాదౌ, యత్ర ప్రకృతయోరప్రకృత-యోర్వా విశేష్యయోః సకృదుపాదానం తత్ర తుల్యయోగితాయా అభా-వాత్। తథాహి-ధర్మస్య సాధారణ్యేన సకృదుపాదానే తుల్యయోగితా। తచ్చ పృథగుపాత్తతయా భేదేన ప్రతీతయోరుపమానోపమేయయో-ర్ధర్మిణోరేకస్మిన్ వాక్యే భవతి న సకృదుపాత్తయోః। సకృదుపాదానే హి భేదప్రతీత్యభావాత్ కః కస్య సాధారణః స్యాత్ .... తస్మాదేవమాదౌ అలంకారాంతరవివిక్తవిషయత్వాత్ న నిరవకాశః శ్లేషః॥

(అలంకారరత్నాకర సూ 44 వృత్తి. శ్లేష)

ఖ) సా(తుల్యయోగితా)హి ద్వయోరపి ప్రకృతయోరప్రకృతయోర్వా విశే-ష్యయోః పృథగుపాదానే ఔపమ్యస్య చ గమ్యత్వే భవతి। ఇహ(శ్లేషే) తు తదభావః। విశేష్యయోః పృథగనుపాదానాత్ ఔపమ్యస్య చ గమ్యాత్వా-భావాత్॥ —విమర్శినీ. (అలం సర్వస్వ. శ్లేష)

ఆయుపమ కంగమగును విరోధాభాసాలంకారమునందును పర్యవసానమున రెండవయర్థమునకస్తిత్వమే లేకుండుటచె శ్లేషదానికేయంగమగును శ్లిష్టవిశేషణ-యగు సమాసోక్తి శ్లేషాధీనమేయగుటచే సమాసోక్తికి శ్లేష అనుప్రాణకమగును 68

ఇట్లు శ్లేషకు నయిదుభూమికలుండునని చెప్పి ఆవిషయమునిట్లు సంగ్రహించెను—

"ప్రధానభూతాలంకారవియోగాత్ సావకాశతా।
కుత్రచిత్ ప్రతిభోత్పత్తిహేతుత్వం క్వచిదంగతా॥
క్వచిత్ ప్రరోహవిరహాత్ ప్రాతిభత్వం పరత్ర చ।
అనుప్రాణకతాఽన్యేతి శ్లేషోఽయం పంచభూమికః॥' (అలం-రత్నా-శ్లేష)

కావున 'విజితారిపురః' మున్నగునుపమాలంకారఘటితశ్లోకములే ప్రకృతాప్రకృతశ్లేషోదాహరణము లగును

'అసావుదయమారూఢః' మున్నగు నుదాహరణములు, విశేష్యము కూడ శ్లిష్టమైయుండుటవలన రెండవయర్థము వ్యంగ్యమేయగుటచే శబ్దశక్తిమూల ధ్వనివిషయములే యగునుకాని ప్రకృతాప్రకృతశ్లేషవిషయములు కావు 69

---

68 క్వచిత్తు-"సకలకలం పురమేతజ్జాతం సంప్రతి సుధాంశుబింబమివ" ఇత్యాదౌ శబ్దమాత్రసామ్యేన నమానధర్మాభావాత్ ఉపమాదేః ప్రతిభామాత్రేణావస్థానే తత్ప్రతిభోత్పత్తిహేతుః। క్వాపి 'అమృతేందుకళాసహోదరే'త్యాదౌ ఇందు-కళాసహోదరత్వాఖ్యసాధారణధర్మబలేన స్వలక్షణానుసారేణ ప్రతిష్ఠితస్య ఉపమాదేః పర్యవసానే 'వనమాలాభరణే'త్యాదిశ్లేషోఽంగమ్। కుత్రచిత్తు "సన్నిహితబాలాంధకారా భాస్వన్మూర్తిశ్చ' ఇత్యాదౌ విరోధేఽంగమేవ న తు తత్ప్రతిభోత్పత్తిహేతుః। ప్రాతిభత్వాదేవ సర్వత్ర విరోధస్య ప్రస్తు-తార్థద్వయస్య పార్యవసానికత్వాభావాదేవమాదౌ శ్లేషస్యైవ ప్రాతిభత్వమ్। "పరిపింజరితా సితాంబరే"త్యాదౌ సమాసోక్త్యాదేరనుప్రాణకత్వం, నాంగతా। శ్లేషవ్యతిరేకేణైవమాదౌ సమాసోక్త్యభేదస్య ఆత్మలాభాభావాత్॥
(అలంకారరత్నాకర. సూ 44 వృత్తి)

69 "అలంకారమహోదధి"కారులును ఈవిషయమునిట్లే నిర్ణయించిరి—
"ప్రాకరణికాప్రకరణికే తు విశేష్యవిశేషణసామ్యే యత్ర ప్రకరణాదినియ-మనం తత్ర ధ్వనేర్విషయః - యథా - "అసావుదయమారూఢః" ఇత్యాది।

తెలిసదేమన — [70] రెండర్థములును ప్రకృతములో అప్రకృతములో అయి యుండ విశేష్యవాచకపదము శ్లిష్టమయియున్నను కాకున్నను శ్లేషాలంకారమే యగును కాని ఆరెండర్థములలో నొకటి ప్రకృతము మఱొకటి అప్రకృత మయియుండ విశేష్యవాచకపదము శ్లిష్టము గాక విడివిడిగానున్నచో ప్రకృతా ప్రకృతశ్లేషయనియు, విశేష్యము గూడ శ్లిష్టమాయెనేని శబ్దశక్తిమూలధ్వని యనియు నిష్కృష్టార్థము

శబ్దశక్తి మూలధ్వని — శ్లిష్టవిశేషణసమాసోక్తి —

ఒకప్పుడు విశేషణములు మాత్రము శ్లిష్టములయియుండ రెండర్థములలో నొకటి ప్రకృతము కాఁగా వేఱొకటి అప్రకృతమగును ప్రకృతార్థ విషయమున విశేష్యవాచకపదముండుచే కాని అప్రకృతార్థవిషయమున విశేష్య వాచకపదమునకస్తిత్వమే యుండదు ఎట్లన?—

"రాగావృతం వల్గుకరాభిమృష్టం
శ్యామాముఖం చుంబతి చారు చంద్రః॥" (రసగం-ద్వితీ శ్లేష)

ఇది చంద్రోదయవర్ణనము చంద్రుడు రాగావృతుఁడై (ఎఱుపువన్నె తనయందు వ్యాపించినవాఁడై) వల్గుకరాభిమృష్ట(సుందరకిరణావృత)మగుచు నందముగానున్న శ్యామాముఖమును(రాత్రిప్రారంభమును) చుంబించుచున్నాడను నర్థము ప్రాకరణికముకాఁగా, విశేషణాంశముననున్న "రాగకరశ్యామా"ది పదములశ్లేషచే–ఒకానొక కాముకుఁడు అనురాగావృతుఁడై తనకరములచే లేవ

---

అత్ర ప్రకరణాదినియమితా రాజాదిశబ్దా ధ్వనినైవ చంద్రాద్యర్థాంతరం ప్రతిపాదయంతి। కేవలం విశేషణసామ్యే పునరస్యైవ విషయః। యథా— "స్వేచ్ఛోపజాతవిషయోఽపి .. కష్టం మనోభవ ఇవేశ్వరదుర్విదగ్ధః॥" (అలం మహో 722 కా వృత్తి)

70 ఏవం త్రివిధోఽప్యయం ప్రకృతమాత్ర-అప్రకృతమాత్రప్రకృతాప్రకృతో-భయాశ్రితత్వేన పునస్త్రివిధః। అత్ర ఆద్యే భేదే ద్వితీయే చ విశేష్యస్య శ్లిష్టతాయాం కామచారః। తృతీయభేదే తు విశేషణవాచకస్యైవ శ్లిష్టత్వం న విశేష్యవాచకస్య। తథాత్వే తు శబ్దశక్తిమూలధ్వనేరుచ్ఛేద ఏవ స్యాత్॥
—(రసగం ద్వితీ శ్లేష)

నెత్తి శ్యామ(యౌవనమధ్యస్థయగుతన ప్రేయసి)యొక్క ముఖమును ముద్దాడుచున్నాఁడను నర్థాంతరము అప్రాకరణికము ప్రాకరణికార్థమునమాత్రము 'చంద్రః' అను విశేష్యవాచకపదమున్నది కాని అప్రాకరణికార్థమున విశేష్య (కాముక)వాచకపదము లేదు ఇట ప్రకరణనియంత్రితమగు నభిధ ఈయర్థాన్తరమును బోధింపఁజాలదు కాన నీనాయికానాయకవ్యవహారరూపమగునర్థాన్తరము వ్యంగ్యమే యగును కాని ప్రకృతవాక్యార్థమగు నిశాచంద్రులయందీవ్యవహారము ఆరోపింపఁబడి వాచ్యార్థమునకే యుపస్కారకమగుటచే నిది గుణీభూతవ్యంగ్యమగు సమాసోక్తియేకాని శబ్దశక్తిమూలధ్వని కాదు. [71]

కావున విశేష్యము శ్లిష్టము కాకుండిన సమాసోక్తియనియు, విశేష్యము కూడ శ్లిష్టమయిన శబ్దశక్తిమూలధ్వని యనియు ప్రాచీనుల యభిప్రాయమై యున్నది [72]

---

71 క) ఏవం చ నిశాశశినోః నాయకత్వసిద్ధిః శ్లిష్టవిశేషణైః, వ్యంజనవ్యాపారేణైవ అప్రకృతార్థబోధనమ్, శక్తేః ప్రకరణాదినా నియంత్రణాత్। తదిత్థం వ్యంజనమాహాత్మ్యాదేవ అప్రకృతవాక్యార్థతాదాత్మ్యేన ప్రకృతవాక్యార్థోఽవతిష్ఠతే॥ గుణీభూతవ్యంగ్యభేదశ్చాయమితి తు రమణీయః పంథాః॥ (రసగం ద్వితీ. సమాసోక్తి)

ఖ) తతశ్చ సమాసోక్తావప్రస్తుతవ్యవహారసమారోపశ్చారుతాహేతుః। —(కువలయా సమాసోక్తి)

గ) సమాసోక్తౌ తావత్— "ఉపోఢరాగేణ" ఇత్యాదౌ వ్యంగ్యేనానుగతం వాచ్యమేవ ప్రాధాన్యేన ప్రతీయతే సమారోపితనాయికానాయకవ్యవహారయోః నిశాశశినోరేవ వాక్యార్థత్వాత్॥ (ధ్వన్యా 1 13 కా వృత్తి)

ఘ) శ్లిష్టవిశేషణాయాం సమాసోక్తావపి వ్యక్త్యైవాప్రకృతార్థప్రతీతిస్వీకారాత్। అత ఏవ ధ్వనికృతా—"గుణీభూతవ్యంగ్యభేదః సమాసోక్తిః" ఇత్యుక్తమ్॥ —(రసగం. ద్వితీ శ్లేషః)

72. క) యత్ర విశేషణమాత్రే శ్లేషః తత్ర సమాసోక్తిః, విశేష్యస్యాపి శ్లేషే తు ఉపమాధ్వనిరేవేతి ఫలితార్థః॥ —(అలంకారకౌస్తుభ సమాసోక్తి)

ఖ) శబ్దశక్తిమూలధ్వనివారణాయ మాత్రేతి। తత్ర విశేష్యస్యాపి శ్లిష్టతయా ప్రకృతేతరధర్మ్యుపస్థాపనద్వారా తాదృశధర్మికవ్యవహారోపస్థాపకత్వాత్॥ (రసగం. ద్వితీ సమాసోక్తి)

రసగంగాధరకారు లీ యంశమునిట్లు విమర్శించిరి–"పూర్వోదాహరణమున 'చంద్రః' అను పదమును తీసి దానిస్థానమున 'చంద్రుఁడు' 'రాజు' అనునుభయార్థవాచకమగు 'రాజా' అను శ్లిష్టమగు విశేష్యవాచకపదము చేర్చి పఠించినంతమాత్రముననిది యుపమాలంకారధ్వనియని (ధ్వనిప్రాధాన్యమును) ప్రాచీనులు పేర్కొనుటయు, 'చారు చంద్రః' అని విశేష్యము శ్లిష్టము కాకుండినంతమాత్రమున సమాసోక్తియని చెప్పి దానినే గుణీభూతవ్యంగ్యమనుటయు సమంజసముగాలేదు విచారించిన నీ రెండును శ్లిష్టాశ్లిష్టవిశేష్యములగు సమాసోక్తిభేదములే యనుట లెస్స" [73]

వ్యక్తివివేకకారుఁడు–[74]ధ్వనికారులశబ్దశక్తిమూలోపమాధ్వన్యుదాహరణ-

---

73 ఇదం పునరిహావధేయమ్–"రాగావృతో వల్గుకరాభిమృష్టం శ్యామాముఖం చుంబతి చారు చంద్రః" ఇత్యాదౌ తావత్ సమాసోక్తిరితి నిర్వివాదమ్। 'చంద్ర' పదస్థానే 'రాజే'తికృతే తు శబ్దశక్తిమూలో ధ్వనిరితి చ। తదత్ర ఉభయత్రాపి శ్లిష్టవిశేషణమాహాత్మ్యాదప్రకృతవ్యవహారస్య ప్రతీయమానస్య తుల్యత్వాత్ కథమేకత్ర గుణీభావోఽన్యత్ర ప్రాధాన్యం చ స్యాత్। ప్రకృతస్య ప్రాధాన్యాదప్రకృతస్య తు తదుపస్కారకత్వేన ఉభయత్రాపి గుణభావౌచిత్యాత్। న హి విశేష్యస్య శ్లిష్టతామాత్రేణ వ్యంగ్యస్య ప్రాధాన్యమ్, అశ్లిష్టత్వే చ అప్రాధాన్యం శక్యం సంపాదయితుమ్। నాయకత్వప్రతీతిరపి క్వచిదర్థశక్తిమూలేన వ్యంజనేన, క్వచిత్ శబ్దశక్తిమూలేన తుల్యైవ। యైరపి సమాసోక్తౌ ప్రకృతధర్మిణి నాయకత్వాదేః ప్రత్యయో నాభ్యుపేయతే, అపి తు నాయకాదివ్యవహారస్యైవ ధ్వనౌ చాభ్యుపేయతే, తేషామపి వ్యంగ్యస్యైకత్ర గుణత్వ మన్యత్ర ప్రాధాన్యం చ కస్య హేతోః స్యాత్? ప్రకృతాప్రకృతయోరౌపమ్యం గమ్యముచ్యతామభేదో వా, సర్వత్రైవ తస్య ప్రకృతోపస్కారకత్వాత్ గుణీభావ ఏవోచితో న ప్రాధాన్యమ్। అన్యథా సమాసోక్తావపి వ్యంగ్యస్య ప్రాధాన్యాపత్తేః। తస్మాత్ శ్లిష్టాశ్లిష్టవిశేష్యా సమాసోక్తిరేవేయమ్। పరాంగభూతగుణీభూతవ్యంగ్యభేద ఇత్యపి శక్యతే వక్తుం, యది ప్రాంచో న కుప్యంతి॥ (రసగం. ద్వితీ. శ్లేష)

74 'అత్రాంతరే' ఇత్యత్ర అప్రాకరణికమహాకాలాఖ్యదేవతావిశేషవిషయా ప్రతీతిః సాధ్యా। తస్యాశ్చ అట్టహాససంబంధో యుగసంహారవ్యాపారశ్చేత్యుభయం సాధనం, తస్య తత్కార్యత్వాత్। కార్యకారణభావావసాయ-

మగు 'అత్రాంతరే' (ధ్వన్యా- 2 21 కా ఉదా ) అనుదానినిమాత్రము అనుమానముచె గతార్థము చెయుచు సమాసోక్తియని ఉపపాదించుటయే రసగంగా-ధరకారులిట్లభిప్రాయపడుటకు దోహదము కావచ్చును.

వ్యక్తివివేకకారునకు శబ్దశక్తిమూలధ్వన్యుదాహరణములనన్నింటిని అనుమానముచే గతార్థముచేయుట కొరుకరానికొయ్యగా మిగిలినది కావుననే అతఁడీయంశమును ప్రస్తావించుచు శబ్దము తనకు తానై ఏయర్థమును తోపింపఁజేయఁజాలదనియును ఆయర్థస్ఫూర్తికనుగుణమగుసామగ్రియుండవలయుననియును, అట్లు వాచ్యమగునేదో యొక నిబంధనమున్ననే ఆశబ్దమర్థాంతర ప్రతీతిని కలుగఁజేయ సమర్థమగుననియు, "ఉన్నతః ప్రోల్లసద్ధారః' (ధ్వన్యా 2 21 కా ఉదా ) మున్నగు శబ్దశక్తిమూలధ్వన్యుదాహరణములలో అట్టినిబంధనమేదియు లేకుండుటచే నర్థాంతరప్రతీతియే లేదనియును, కవులట్లు ఏనిబంధనములేక శ్లిష్టముగావ్రాయుట వాచ్యావచనరూపమగు దోషమును కొనితెచ్చుకొనుటయే యగుననియు, కావున అర్థాంతరప్రతీతి యున్నదనుట ఒవ్వదని వాదించెను 75

---

శ్చానయోరాగమప్రమాణమూల ఇతి తత ఏవ సమాసోక్తిక్రమేణ అప్రాకరణి-కార్థాంతరప్రతీతిసిద్ధిః। న తూభయార్థవృత్తేః మహాకాలశబ్దస్య సా శక్తిరిత్యేతదుక్తం, వక్ష్యతే చ॥ [వ్యక్తివివేక(చౌ సం. 1964) తృతీ.పుట. 479]

75. క) కిం చ న స్వభావత ఏవ శబ్దానామర్థప్రతీతిక్రమ ఇతి నియమసంభవః। కిం తర్హి? సామగ్రీవశాత్। సా హి యదర్థానుగుణా ఉపలభ్యతే తమేవ తస్యార్థం కల్పయతీతి సర్వః శబ్దః సర్వార్థవిషయః, సర్వశ్చార్థః సర్వశబ్దవిషయో భవితుమర్హతి। తతశ్చ— అతదర్థోఽప్యన్యః శబ్దః సామగ్రీవశాత్ సమాసోక్తిన్యాయేన తమవగమయితుం క్షమేతైవ, న పునస్తదర్థోఽపి సామగ్రీవికలో గవాదిశబ్దః॥

(వ్యక్తివివేక. తృతీ. పుట 480)

ఖ "ఉన్నతః ప్రోల్లసద్ధారః" (ధ్వన్యా 2 21 కా ఉదా) ఇత్యత్ర అనం-తరోక్తః ప్రకారో న సంభవతీతి కుతోఽర్థాంతరప్రతీతిః॥"

(వ్యక్తివివేక తృతీ పుట. 478)

"ఉన్నతః ప్రోల్లసద్ధారః" మున్నగు నుదాహరణములలో ప్రతిభావంతు లగు సహృదయులకు అర్థాంతరము కొట్టవచ్చినట్లు స్ఫురించుచుండ లేదనుట ఎట్లు ?*

కావుననే వ్యక్తివివేకకారుని ఈ వైఖరిని అనుమోదించినవారు సాహితీ-ప్రపంచముననే లేరు

రెండవయర్థము అభిధేయమే కావలెననిన వ్యక్తివివేకకారు 76

---

గ) 'దత్తానందాః ప్రజానామ్' (ధ్వన్యా 2 21 కా. ఉదా ) ఇత్యత్ర తు "గో"శబ్దస్యానేకార్థత్వేఽప్రాకరణికార్థాంతరప్రతిభోత్పత్తౌ న కించిన్నిబంధనమవధారయామః। విశేష్యవాచినోఽనేకార్థస్య తు తన్నిన్నిబంధనభావోపగమే అన్యోన్యాశ్రయదోషః। . ఏవం చాస్య వాచ్యవ్యతిరేకిణోఽర్థాంతరస్య ప్రతీతిరేవ న సమస్తీతి యత్రాప్రస్తుతాభిధానప్రసంగభయాత్ తయోరుపమానోపమేయభావకల్పనం తదపి నిర్మూలమేవేత్యవగంతవ్యమ్॥ (వ్యక్తి తృతీ పుట 478-79)

ఘ) 'తస్మాదర్థాంతరవ్యక్తిహేతౌ కస్మింశ్చ నాసతి।
యః శ్లేషబంధనిర్బంధః క్లేశాయైవ కవేరసౌ॥'
(వ్యక్తి 2 . 89 సంగ్రహశ్లోక)

ఙ) నిబంధనాభావే తు తస్య దుష్టతైవ। యథా—
"ఆచ్ఛాదితాయతదిగంబరముచ్చకైర్గా-
మాక్రమ్య చ స్థితముదగ్రవిశాలశృంగమ్।
మూర్ధ్ని స్ఖలత్తుహినదీధితికోటిమేన-
ముద్వీక్ష్య కో భువి న విస్మయతే గిరీశమ్॥" (మాఘకావ్య ) ఇతి।

అత్ర హి ఆవృత్తినిబంధనం న కించిదుక్తమితి తస్య వాచ్యస్యావచనం దోషః॥ (వ్యక్తి ద్వితీ పుట 403)

తాదృశార్థప్రతపత్తిరేవ నాస్తీతి తు గాఢతరశబ్దార్థవ్యుత్పత్తిమస్వణీకృతాంతఃకరణైర్న శక్యతే వక్తుమ్॥" (రసగం ద్వితీ )

76 ఉభయత్రాప్యభివ్యక్త్యై వాచ్యం కించిన్నిబంధనమ్।
అన్యథా వ్యర్థ ఏవ స్యాత్ శ్లేషబంధోద్యమః కవేః॥ (వ్యక్తి 2. 84 శ్లేష )

లభిప్రాయపడినట్లు వాచ్యమగునేదో యొకనిబంధన ముండితీరవలెను ప్రకృతా ప్రకృతశ్లేషలో రెండర్ధములును వాచ్యములే అయియుండవలెను కావున వాచ్యమగునుపమాలంకారమే అచ్చట నిబంధనము విశేష్యము శ్లిష్టమయినచో నా నిబంధనము తొలగిపోయి శబ్దశక్తిమూలమగునుపమాలంకారధ్వని యగును కాని సమాసోక్తి కాదు. ఏలన? విశేష్యమును కూడ శ్లిష్టము చేసి కవి తా నారెండర్థములయందును సమానప్రతిపత్తిని కనఁబఱచుచున్నాడు కావుననే ప్రాచీనులు రెండర్ధములకును [77] సమప్రాధాన్యముండునట్లు ఉపమాలంకార ధ్వని యనిరి. సమాసోక్తిలో[78] ప్రకృతవిశేష్యవాచకపదమేకాని అప్రకృత విశేష్యవాచకపదము నిబంధించక ప్రకృతార్థమునకే ఎనలేనిప్రాధాన్యము చేకూర్చినాఁడు కవి.

కావుననే ప్రాచీనులు దానిని గుణీభూతవ్యంగ్యమనిరి. ఈ కవిసంరంభ విశ్రాంతిగోచరతయే ప్రాచీనులట్లు శ్లేష-శబ్దశక్తిమూలధ్వని—సమాసోక్తులను వ్యాఖ్యానించుటలోని యాంతర్యము కావచ్చునని తోచుచున్నది.

తేలినదేమన—"విశేషణములు మాత్రము శ్లిష్టములై యుండి, ఉపమా-లంకారము వాచ్యమగునేని ప్రకృతాప్రకృత శ్లేషయగును విశేష్యముకూడ శ్లిష్ట మగునేని శబ్దశక్తిమూలకమగునుపమాలంకారధ్వని యగును ఇఁక ప్రకృతార్థ-విషయమున మాత్రము విశేష్యవాచకపదముండిన (గుణీభూతవ్యంగ్యమగు) సమాసోక్తియగును ఇదియే వీనికిగల సూక్ష్మభేధము."

---

77 సాధర్మ్యే త్రయః ప్రకారాః। భేదప్రాధాన్యం వ్యతిరేకాదివత్। అభేద-ప్రాధాన్యం రూపకాదివత్। ద్వయోస్తుల్యత్వం యథాఽస్యామ్। యదాహుః-
"యత్ర కించిత్సామాన్యం కశ్చిచ్చ విశేషః స విషయః సదృశతాయాః॥"
ఇతి॥ —రుయ్యక (అలం. సర్వస్వ. ఉపమా)

78 చారుత్వోత్కర్షనిబంధనా హి వాచ్యవ్యంగ్యయోః ప్రాధాన్యవివక్షా—యథా।
"అనురాగవతీ సంధ్యా దివసస్తత్పురఃసరః।
అహో! దైవగతిః కీదృక్ తథాఽపి న సమాగమః॥"
అత్ర(సమాసోక్తౌ)సత్యామపి వ్యంగ్యప్రతీతౌ వాచ్యస్యైవ చారుత్వముత్కర్షవ-దితి తస్యైవ ప్రాధాన్యవివక్షా॥ (ధ్వన్యా. 1.13 కా. వృత్తిలో)

శబ్దశక్తిమూలకధ్వని—శ్లేషమూలకములగు నితరాలంకారములు:-

శ్లేషయు[79] ఉపమవలె తానొకస్వతంత్రాలంకారమేకాక మరెన్నియో అలంకారములనాశ్రయించి వానినొకవన్నె తెచ్చుచుండును ముఖ్యముగా నిది సాదృశ్యమూలకాలంకారములయందును విరోధమూలకాలంకారములయందును విరివిగా కాననగును ఇట శ్లేషయన రెండవయర్థము కూడ వాచ్యమైయుండుట యేయని గమనించవలసియున్నది అట్లు రెండవయర్థము వాచ్యమైయుండుటకు నట నెదోయొకనిబంధనముండును

శబ్దశక్తిమూలధ్వని—విరోధాభాసాదులు -

విరోధాభాసాదివిరోధమూలకాలంకారములలో నావిరోధము 'అపి'శబ్దాదులచే('అయ్యును' మున్నగువానిచే)వాచ్యమైయుండుటయే నిబంధనము ఉదా -

తస్యా వినాపి హారేణ నిసర్గాదేవ హారిణౌ।
జనయామాసతుః కస్య విస్మయం న పయోధరౌ॥

(ధ్వన్యా 2 21 కా ఉదా)

'ఆతరుణిపయోధరములు హారములేకున్నను హారులే(హారముగలవియే) యగుచు నెవనికి విస్మయముకలిగించకుండును' అని పైకి స్ఫురించువిరోధము. 'హారిణౌ' అనుపదమునకుగల 'మనోహరములు'అనునర్థాంతరము ననుసంధించుటచే నావిరోధపరిహారము. ఆతరుణిపయోధరములు హారములేకున్నను మనోహరములై విస్మయావహములనుట తాత్పర్యము కావున నిది విరోధాభాసాలంకారము ఈయలంకారము ప్రాయికముగా శ్లేషచేతనే చమత్కారావహమై యుండును ఇట 'హారి'పదమునకు రెండవయర్థమున్నట్లు గమనించుటకు

---

79 క) "అయం చోపమేవ స్వతంత్రోఽపి తత్ర తత్ర సకలాలంకారానుగ్రాహకతయా స్థితః సరస్వత్యా నవం నవం సౌభాగ్యమావహన్ నానావిధేషు లక్ష్యేషు సహృదయైర్విభావనీయః॥" (రసగం ద్వితీ శ్లేష)

ఖ) ఉపమారూపకాక్షేపవ్యతిరేకాదిగోచరాః।
ప్రాగేవ దర్శితాః శ్లేషా దర్శ్యంతే కేచనాపరే॥
అస్త్యభిన్నక్రియః కశ్చిదవిరుద్ధక్రియోఽపరః।
విరుద్ధకర్మా చాస్త్యన్యః శ్లేషో నియమవానపి"॥

(కావ్యాదర్శ. 2_ 313, 314)

విరోధము 'అపి'శబ్దవాచ్యమైయుండుటయే నిబంధనము కావున రెండవ యర్థము ను వాచ్యమేయగుటచే నిది విరోధచ్ఛాయానుగ్రాహియగు శ్లేషయేకాని శబ్దశక్తిమూలధ్వని కాదు. 80

'అపి' శబ్దనిబంధనము లేకున్నచో శబ్దశక్తిమూలధ్వనియగును—

"రవికులప్రీతిమావహన్తి న-రవికులప్రీతిమావహతి।

అవారితప్రవాహా సువారితప్రవాహా॥"

ఇది యమునానదీవర్ణనపరమగు గద్యము సూర్యవంశమునకు ప్రీతిని కలుగఁజేయుచు మనుష్యపక్ష్యుభయప్రీతిని కలుగఁజేయునది. మఱియు-అప్రతిబద్ధప్రవాహయు శోభనమగు జలప్రవాహముగలదియును అయియున్నది

'రవికుల'—'నరవికుల' అనియును 'సువారిత'-'అవారిత'—అనియును పైకి విరోధాంశము స్ఫురించుచునే యున్నది కాని విరోధవాచకములగు 'అపి' మున్నగు పదములు లేకుండుటచే నిట నారెండవయర్థము వాచ్యముకాక వ్యంగ్యమే యగును కావుననిది శబ్దశక్తిమూలవిరోధాభాసాలంకారధ్వనియే యగును 81

ఇట్లు శ్లిష్టపదములుగల విరోధమూలకాలంకారములయందన్నింటను విరోధము వాచ్యమగునేని శ్లేషయనియును లేదేని శబ్దశక్తిమూలధ్వనియనియును గుర్తించవలసియుండును

---

80. క) అత్ర శృంగారవ్యభిచారీ విస్మయాఖ్యో భావః సాక్షాద్విరోధాలంకారశ్చ ప్రతిభాసత ఇతి విరోధచ్ఛాయానుగ్రాహిణః శ్లేషస్యాయం విషయః, న త్వనుస్వానోపమవ్యంగ్యస్య ధ్వనేః॥ (ధ్వన్యా 2 21 కా వృత్తి)

ఖ) 'అపి'శబ్దోఽయం విరోధమాచక్షాణోఽర్థద్వయేఽప్యభిధాశక్తిం నియచ్ఛతి। హరతో హృదయమవశ్యమితి హారిణౌ, హారో విద్యతే యయోస్తౌ హారిణావితి। అత ఏవ విస్మయశబ్దోఽస్యైవార్థస్యోపోద్బలకః। "అపి"-శబ్దాభావే తు న తత ఏవార్థద్వయస్యాభిధా స్యాత్, స్వసౌందర్యాదేవ స్తనయోర్విస్మయహేతుత్వోపపత్తేః॥

—లోచన (ధ్వన్యా 2 21 కా ఉదా వృత్తిపై)

81 యథా యమునావర్ణనే— "రవికులప్రీతి"—ఇహ నరాణాం వీనాం చ కులస్య ప్రీతిమావహతీతి ప్రకృతేఽర్థే సిద్ధే రవికులప్రీతిం నావహతీతి ద్వితీయోఽప్రకృతోఽర్థో విరోధశ్చ। ఏవమన్యత్రాపి। యది తు రవికులప్రీతిమావ-

శబ్దశక్తిమూలధ్వని- విశేషోక్త్యలంకారము -

మఱియొక విరోధమూలకాలంకారోదాహరణము —

"హృది స్నేహక్షయో నాభూత్ స్మరదీపే జ్వలత్యపి"॥

ఇది విశేషోక్త్యలంకారము - కారణమున్నను కార్యానుత్పత్తి దీని స్వరూపము 82 హృదయమున మన్మథుఁడనుదీపము జ్వలించుచున్నను స్నేహము క్షీణించకుండెను దీపము జ్వలించుచుండ స్నేహము(చమురు)క్షీణించుట సహజము అట్లు జరగకుండుట విరోధము ఆ విరోధమిట 'అపి'శబ్దముచేఁ జెప్పఁబడుటచె'స్నేహ'పదమునకుగల 'చమురు' 'ప్రేమ'యను రెండర్థములు వాచ్యములే యగును. కావుననిది విరోధమూలకవిశేషోక్త్యలంకారచ్ఛాయాను గ్రాహియగుశ్లేషయే కాని శబ్దశక్తిమూలధ్వని కాదు

శబ్దశక్తిమూలధ్వని—సాదృశ్యమూలకాలంకారములు —

సాదృశ్యమూలకాలంకారములయందును ఉపమానోపమేయములు రెండును విడివిడిగా నుండుటయే తఱచుగా నిబంధనమయి యుండును ఎట్లన -

రక్తస్త్వం నవపల్లవైరహమపి శ్లాఘ్యైః ప్రియయా గుణైః
త్వామాయాంతి శిలీముఖాః స్మరధనుర్ముక్తాస్తథా మామపి।
కాంతాపాదతలాహతిస్తవ ముదే తద్వన్మమాప్యావయోః
సర్వం తుల్యమశోక ! కేవలమహం ధాత్రా సశోకః కృతః॥

[రాగివి నీవు లేఁ జివురులన్, ప్రియయోగ్యగుణాళి నేను, కే
శీగతి నిన్నెదుర్కొను శిలీముఖముల్ స్మరచాపముక్తముల్
నాగతి, కాంతపాదహతి నాకును నీకుఁ బ్రియమ్ము, తుల్యమై
సాగనిటుల్—విధాత ననె సల్పె సశోకునిఁగా నశోకమా॥
—'వేదాల'వారి ఆంధ్రధ్వన్యా—ద్వితీ—పుట. 227]

---

హస్త్యపి న రవికులప్రీతిమావహతి। అవారితప్రవాహోఽపి సువారితప్రవాహ ఇత్యపిరంతర్భావ్యతే, తదా విరోధాంశస్యాపినోక్తత్వాత్ ద్వితీయార్థస్య చ తదాక్షిప్తత్వాన్న ధ్వనిత్వమ్॥ -(రసగం. ద్వితీ శబ్దశక్తిమూలధ్వని)

82 "కార్యాజనిర్విశేషోక్తిః సతి పుష్కలకారణే" (కువలయా. 83 శ్లో)

ఒకానొక విరహి, ఈ పలుకులలో—తనకును అశోకమునకును ఎన్నో గుణములలో సామ్యమున్నను తన నా విధాత సశోకునిగాఁజేసెనని తన న్యూనతను గనఁబఱచెను దీనిని వ్యతిరేకాలంకారమందురు.[83] ఇది సాదృశ్య-మూలకము ఇట ఉపమానోపమేయములు రెండును యుష్మదస్మత్పదవాచ్యములై విడివిడిగా నుండుటయే నిబంధనము కావున 'రక్తః' మున్నగు శ్లిష్ట పదములయందలి రెండర్థములును వాచ్యములే, ఇట్టిది[84] వ్యతిరేకచ్ఛాయాను-గ్రాహియగు శ్లేషయే కాని శబ్దశక్తి మూలధ్వనికాదు.

ఏ విధమగు నిబంధనము లేకున్ననది శబ్దశక్తిమూలధ్వనియే యగును. ఎట్లన? —

కృష్ణపక్షాధికరుచిః సదా సంపూర్ణమండలః।
భూపోఽయం నిష్కళంకాత్మా మోదతే వసుధాతలే॥*

రాజవర్ణనపరమగు నీ శ్లోకమునకు— "కృష్ణభగవానునియెడ నధికభక్తి గలవాఁడును, సత్పురుషులచే నిండియున్న రాష్ట్రము గలవాఁడును, ఏ విధములైనకళంకములు లేనివాఁడును, అగు నీరాజు భూవలయమున మోదము నొందుచున్నాఁడ"ని తాత్పర్యము

ఇట 'కృష్ణపక్షా'ది శబ్దములకు రెండవయర్థమున్నదని తెలియుటకై ఏ విధమైన నిబంధనము లేదు- అయినను భావుకుల భావనాబలమున శబ్దశక్తి చేతనే చంద్రునకును రాజునకునుగల వ్యతిరేకము ధ్వనించుచున్నది

చంద్రుఁడు కృష్ణపక్షమున రుచి(కాంతి)విహీనుడై యుండఁగా నీరాజు కృష్ణపక్షమునను అధికరుచిగలిగియున్నాఁడనియును, చంద్రుడు పున్నమనాఁడు మాత్రము సంపూర్ణమండలుఁడు కాఁగా నీరాజు సదాసంపూర్ణమండలుఁడై

---

83 "వ్యతిరేకో విశేషశ్చేదుపమానోపమేయోః॥" (కువలయా శ్లో. 57)

84. అత్ర హి ప్రబంధప్రవృత్తోఽపి శ్లేషో వ్యతిరేకవివక్షయా త్యజ్యమానో రస-విశేషం పుష్ణాతి॥ (ధ్వన్యా. 2. 19 కా. వృత్తిలో)

* ఈ శ్లోకము పూర్వము (పుట 103) ఉదాహరింపఁబడినది.

యున్నాడనియు, చంద్రుఁడు కళంకితాత్ముఁడుకాఁగా, నీతఁడు నిష్కళంకాత్ముఁడనియును ఉత్కర్షాతిశయము ధ్వనించుచుండుటచేనిది శబ్దశక్తిమూలవ్యతిరేకాలంకారధ్వనియేయగుచున్నది [85]

శబ్దశక్తిమూలధ్వని— పరిసంఖ్యాలంకారము :—

నిబంధనమేదేని యున్ననే రెండవయర్థము వాచ్యమగుచుండుటయును లేదేని వ్యంగ్యమగుచుండుటయును మనమునవిడియే అలంకారికులు పరిసంఖ్యను 'శాబ్ది' యనియును "ఆర్థి"యనియును రెండువిధముల విభజించిరి [86] శ్లేషచేతనే పరిసంఖ్య ఎంతో అందమును సంతరించుకొనును ఉదా —

"స్నేహక్షయః ప్రదీపేషు న స్వాంతేషు నతభ్రువామ్॥"
దీపములయందే స్నేహము (చమురు) క్షీణించెనే కాని ముదితలమనముల స్నేహము (ప్రేమ) క్షీణించకుండెను

ఇట 'న స్వాంతేషు' అను నిషేధమే స్నేహశబ్దమునకుగలరెండర్థములును వాచ్యములగుటలో నిబంధనము

---

85 అత్ర భగవత్పక్షాధికప్రీత్యాదిలక్షణే ప్రకృతభూపోపయోగిత్వాత్ ప్రకృతేఽర్థే శక్త్యా ప్రతీతిపథమవతీర్ణే ద్వితీయోఽర్థోఽప్రకృతః వైధర్మ్యాత్మా తత్ప్రయుక్తో వ్యతిరేకశ్చ(వ్యజ్యతే)। (రసగం ద్వితీ శబ్దశక్తి)

86 క) సామాన్యతః ప్రాప్తస్యార్థస్య కస్మాచ్చిద్విశేషాద్వ్యావృత్తిః పరిసంఖ్యా।
. . ఇయం చ తావద్ద్విధా—శుద్ధా ప్రశ్నపూర్వికా చ। ద్వివిధాఽప్యార్థీ శాబ్దీ చేతి చతుర్విధా॥ (రసగం ద్వితీ పరిసంఖ్యా)

ఖ) అత్ర చ నిషిధ్యమానస్య శాబ్దత్వమార్థత్వం వేతి ద్వౌ భేదౌ॥ (అలం. రత్నా 84 సూత్రవృత్తి)

గ) "ప్రశ్నాదప్రశ్నతో వాపి కథితాద్ వస్తునో భవేత్। తాదృగన్యవ్యపోహశ్చేత్ శాబ్ద ఆర్థోఽథవా తదా॥ పరిసంఖ్యా— ... ." (సా ద 10 . 81)

ఘ) తథా ఉభయత్ర వ్యపోహ్యమానస్య ప్రతీయమానతా వాచ్యత్వం చేతి చత్వారో భేదాః॥ (కావ్య. 10 . 119 కా. వృత్తి)

11) ఒకచో నితరయోగవ్యవచ్ఛేదార్థకమగు 'నేవ'కారముకూడ నిబంధమయి యుండును ఎట్లన? —

నిస్త్రింశత్వమసావేవ ధనుష్యేవాస్య వక్రతా ।
శరేష్వేవ నరేంద్రస్య మార్గణత్వం చ వర్తతే॥

ఈనరేంద్రునిఖడ్గమునందే నిస్త్రింశత్వము (త్రింశదంగుళ్యధికపరిమాణత్వము)కలదు మనమున నిస్త్రింశత్వము(నిర్దయత్వము)లేదనుట. ధనువునందే వక్రత(శరసంధానసమయమునఋజుభావమునువీడుట)యున్నది ప్రజలయందు వక్రత (ప్రాతికూల్యము) లేదనుట శరములయందే మార్గణత్వము (లక్ష్యాన్వేషణశీలత్వము) కలదు ప్రజలయందు మార్గణత్వము(యాచకత్వము) లేదనుట [87]

ఇట ఏవకారాక్షిప్తమగు నితరయోగవ్యవచ్ఛేదమే నిస్త్రినింశత్వాది-పదములకుఁగల రెండవయర్థమభిధేయమగుటలో నిబంధనము.

కావున నీ యుదాహరణద్వయమునను పరిసంఖ్యాచ్ఛాయానుగ్రాహియగు 'శ్లేష'యే కాని శబ్దశక్తిమూలధ్వని లేదు. ఈ రెండును శాబ్దములగు పరిసంఖ్యాలంకారములు

దండి పరిసంఖ్యను పృథగలంకారముగా గుర్తించకుండుటచే "నిస్త్రింశత్వమసౌ" అను శ్లోకమును సనియమశ్లేషోదాహరణముగా నుట్టంకించెను [88]

---

87. సనియమశ్లేషమాహ—నిస్త్రింశత్వమితి। అస్య నరేంద్రస్య అసౌ=ఖడ్గే ఏవ న తు మనసి। నిస్త్రింశత్వం'నిర్గతః త్రింశతః అంగుళిభ్య' ఇతి నిస్త్రింశః త్రింశదంగుళ్యధికపరిమాణత్వం నిర్దయత్వం చ। ధనుష్యేవ వక్రతా ఆకర్షణేన అసరళతా ప్రతికూలతా చ। మార్గణత్వం శరత్వం యాచకత్వం చ। శరేష్వేవ న తు ప్రజాసు। వర్తత ఇతి సర్వత్రాన్వేతవ్యమ్। అత్ర ప్రతి-వాక్యం ఏవకారేణ వ్యవచ్ఛిన్నత్వాత్ అయం నియమవాణ్ అర్థశ్లేషః। అత్ర—అనేన చ పరిసంఖ్యాయాః పరిపోషః॥—
—ప్రభావ్యాఖ్యా (కావ్యాదర్శ 2 319 శ్లో)

88 క) గ్రంథకృతా అస్వీకృతాఽపి పరిసంఖ్యా స్ఫుటమైచిత్ర్యాద్దండీకార్యేతి టీకాకారాః॥ —ప్రభావ్యాఖ్యా. (కావ్యాదర్శ 2 319 శ్లో)

ఖ) అస్త్యభిన్నక్రియః కశ్చిత్ అవిరుద్ధక్రియోఽపరః।
విరుద్ధకర్మా చాస్త్యన్యః శ్లేషో నియమవానపి॥ (కావ్యాదర్శ. 2 314)

ఎట్లును నిషేధము వాచ్యము కాకుండిననా నిబంధనము తొలఁగిపోవుటచే నర్థాంతరము వ్యంగ్యమై అది శబ్దశక్తిమూలధ్వనియే యగును ఎట్లన? —

విలంఘయంతి శ్రుతివర్త్మ యస్యాం లీలావతీనాం నయనోత్పలాని
బిభర్తి యస్యామపి వక్రిమాణమేకో మహాకాలనటార్ధచంద్రః॥89

ఉజ్జయనీనగరమునందు లీలావతులనేత్రోత్పలములు శ్రుతిమార్గమును(కర్ణమార్గమును) దాటుచున్నవి అకన్నులుతప్ప ప్రజలెవ్వరును శ్రుతిమార్గమును(వేదమార్గమును)దాటియుండరనుభావము వ్యంగ్యము మహాకాలునిజటాజూటమునందలిఅర్ధచంద్రుడొకఁడు వక్రత్వము కలిగియున్నాఁడు ప్రజలు వక్రత్వము లేకఋజువర్తనులై యుండిరనుభావము వ్యంగ్యము

ఇట 'శ్రుతి' 'వక్రిమ' శబ్దములకుఁగలరెండవయర్థమును వాచ్యమగుటకు ఏనిబంధనము లేకుండుటచే నిదిశబ్దశక్తిమూలపరిసంఖ్యాలంకారధ్వనియే యగుచున్నది

ఇదియే ఆర్థియగు పరిసంఖ్య— పరిసంఖ్యా శబ్దోపారూఢము కాక అర్థ— సామర్థ్యాక్షిప్తమై ప్రతీయమానమగునేని ఆర్థి యగును. కావున పరిసంఖ్యాలంకారధ్వనియనుటకు నామాంతరమిది కాని వేరు కాదు ప్రాచీనులు "ఆర్థమగు విరోధాభాస"యని వ్యవహరించిన దానినే పండితరాయులు 'విరోధాభాసా— లంకారధ్వని'యని పేర్కొనుట ఇందుకు నిదర్శనము 90

---

89. నవసాహసాంకచరిత (1 46) స్థమగు ఈ శ్లోకము కువలయానందమునను (113 కారికోదాహరణము) అలంకారరత్నాకరమునను (శ్లో 452) అలంకారమహోదధియందును (- 8/908 శ్లో) ఉదాహరింపఁబడినది. —రచయిత

90 క) యత్ర-'అపి'శబ్దాదిర్విరోధస్య ద్యోతకః తత్ర విరోధః శాబ్దః, అన్యత్రత్వార్థ ఇతి తావత్ ప్రాచాం సిద్ధాంతః —(రసగం ద్వితీ విరోధాభాస)

ఖ) 'అవారితప్రవాహోపి సువారితప్రవాహో' ఇత్యపిరంతర్భావ్యతే,తదా విరోధాంశస్య అపినోక్తత్వాత్ ద్వితీయార్ధస్య చ తదాక్షిప్తత్వాన్న ధ్వనిత్వమ్। విరోధాంశస్య శబ్దవాచ్యతావిరహేణ వ్యంగ్యతాయా ఏవాభ్యుపగంతవ్యత్వాత్॥ (రసగం. ద్వితీ. శబ్దశక్తి)

శబ్దశక్తిమూలధ్వని—వివృతోక్త్యలంకారము :-

ఒకచో నావదములకు రెండవయర్థమున్నట్లు కవి తనమాటచేతనే సూచించుచుండును, అప్పుడాసూచనయే నిబంధనమైనందున నదిశ్లేషయే యగును —[91]

*దృష్ట్యా కేశవః గోపరాగహృతయా కించిన్నదృష్టం మయా
తేనైవ స్ఖలితాఽస్మి నాథః పతితాం కిం నామ నాలంబసే।
ఏకస్త్వం విషమేషు-ఖిన్నమనసాం సర్వాబలానాం గతిః,
గోప్యైవం గదితః సలేశమవతాద్ గోష్ఠే హరిర్వశ్చిరమ్॥

'ఓ కేశవా! గోధూళిచే నాకన్నులుకానరాక ఎత్తుపల్లములుతెలియకుండుటచే జారిపడినాను నన్ను లేవనెత్తకూడదా! నీవు ఆపదలో చిక్కుకొన్నదుర్బలుల నాదుకొందువని యందురుకదా!" అనునది పైకిస్ఫురించునర్థము కాని "గోపాలునితో నాగోపిక సాభిప్రాయముగా పలికెనను కవివాక్యముచే గోపికయభిప్రాయరూపమగు మఱియొక యర్థమిట నున్నదనితెలియుచున్నది అదియే మన— "ఓగోపాలా! నీయందలియనురాగము నాకన్నుగప్పుటచే యుక్తాయుక్తములు తెలియక ఖండితచరితనైతిని కావున నాకు భర్తవై నన్నుద్ధరింపుము నీవొక్కఁడవే మదనవివశలగుస్త్రీలకు గతివి " అనునది.

ఇట 'గోపరాగ'—'పతితా'—'విషమేషుఖిన్న'—మున్నగు శ్లిష్టపదముల మహిమచే కలిగిన నీయర్థాంతరము, "సలేశం"అని కవిసూచనరూపనిబంధన-

---

91. క) శబ్దార్థశక్త్యాక్షిప్తోఽపి వ్యంగ్యోఽర్థః కవినా పునః।
యత్రావిష్క్రియతే స్వోక్త్యా సాఽన్యైవాలంకృతిర్ధ్వనేః॥
(ధ్వన్యా 2. 23)

ఖ) స చ అక్షిప్తోఽలంకారో యత్ర పునః శబ్దాంతరేణ అభిహితస్వరూపః తత్ర న "శబ్దశక్త్యుద్భవానురణనరూపవ్యంగ్య"వ్యవహారః॥
(ధ్వన్యా ద్వితీయ శబ్ద )

* ఈశ్లోకము వివృతోక్త్యలంకారోదాహరణముగా కువలయానందమున నుదాహృతము. —రచయిత.

ముండుటచే వాచ్యమే యగను కాని వ్యంగ్యము కాదు, కావుననిది వివృతో క్త్యలంకారచ్ఛాయానుగ్రాహియగుశ్లేషయే కాని శబ్దశక్తిమూలధ్వని కాదు [92]

శ్లేష మఱెన్నియో అలంకారములలో నిండి యున్నది ఆయలంకార ములయందన్నింటను శ్లిష్టపదములకుఁగల రెండవయర్థము "ఉన్న"దని తెలియు టకై ఏదేని నిబంధనముండునేని శ్లేషయగును లేదేని శబ్దశక్తిమూలధ్వని యగును

ఇట్లు శబ్దశక్తిమూలధ్వనికిని శ్లేషకునుగలభేదము సంగ్రహముగా నిరూ పింపఁబడినది

---

92 క) "వివృతోక్తిః శ్లిష్టగుప్తం కవినాఽఽవిష్కృతం యది"॥
—(కువలయా శ్లో. 155)

ఖ) "ఏవంజాతీయకః సర్వ ఏవ భవతు కామం, వాచ్యశ్లేషస్య విషయః॥"
(ధ్వన్యా ద్వితీ "దృష్ట్యా" శ్లోకవృత్తి)



# ధ్వని – వంనుచరిత్రము

## షష్ఠ ప్రకరణము

### ధ్వని – గుణీభూతవ్యంగ్యము

**ధ్వని :-**

వ్యంగ్యము ప్రధానమైయున్న నది ధ్వనియనఁబరఁగును ధ్వనిలో శబ్దము అర్థము ను నప్రధానములై వ్యంగ్యమునకె గుణభావమునొంది యుండును [1]

**గుణీభూతవ్యంగ్యము :-**

వ్యంగ్యము గుణీభూతమగుటయనఁగా నది వాచ్యమునకంటె చమత్కా-రాతిశయకారి కాకయుండుట [2]

1) వ్యంగ్యము, తా, నగూఢమైనను, 2) మఱియొకవ్యంగ్యమునకు అంగమైనను, 3) వాచ్యసిద్ధిని కలుగఁజేయుచు దానికంగమయినను, 4) అస్ప-ష్టముగానున్నను, 5) కాకుస్వరమున నాక్షిప్తమైయున్నను, 6) వాచ్యార్థమే తనకంటె నధికచమత్కారకారకముకాఁగా తానసుందమయినను, 7) తానును వాచ్యమును సమప్రధానములయినను, 8) తాను వాచ్యమునకంటెమిన్నయగుట

---

1 క) తత్పరావేవ శబ్దార్థౌ యత్ర వ్యంగ్యం ప్రతి స్థితౌ।
ధ్వనేః స ఏవ విషయో మన్తవ్యః సంకరోజ్ఝితః॥
(ధ్వన్యా. 1 13 కా. వృత్తిలో)

ఖ) యత్రార్థః శబ్దో వా తమర్థముపసర్జనీకృతస్వార్థౌ।
వ్యంక్తః,కావ్యవిశేషః స ధ్వనిరితి సూరిభిః కథితః॥
(ధ్వన్యా 1 . 13 కా.)

2. వాచ్యాపేక్షయా అచమత్కారకారిత్వేన వ్యంగ్యస్య గుణీభావః। తచ్చ స్వత ఏవాసుందరత్వేన,అగూఢత్వాదివిశేషణప్రకేన వేత్యర్థః॥
(కావ్యప్రదీప. 5 1 కా. వృత్తి)

సందేహాస్పదమయినను అప్పుడది తనప్రాధాన్యమును కోల్పోయి వాచ్యమునకే గుణీభావమునొందును [3] కావుననే గుణీభూతవ్యంగ్య మష్టవిధమయినది

1) అగూఢము 2) అపరాంగము 3) వాచ్యసిద్ధ్యంగము 4) అస్ఫుటము 5) సందిగ్ధప్రాధాన్యము 6) తుల్యప్రాధాన్యము 7) కాక్వాక్షిప్తము 8) అసుందరము అనునవి గుణీభూతవ్యంగ్యమునకుఁగల నాయెనిమిదిభేదములు [4]

## 1) అగూఢము :-

అగూఢమనఁగా నత్యంతవిస్పష్టముగా నవగతమగుట వ్యంగ్యమగూఢమయినచో వాచ్యాయమానమే యగుచు తనప్రత్యేకతను కోల్పోవును కావుననది తరుణీకుచమండలమువలె నతిగూఢముగాకయు అతిప్రకాశముగాగోచరించకయు ఉన్ననే చమత్కారవిశేషాధాయకమగును [5] కావుననే పెద్దనకవీంద్రులిట్లు వాక్రుచ్చిరి

---

3. అగూఢత్వాస్ఫుటత్వాభ్యామసుందరతయా తథా।
సిద్ధ్యంగత్వేన వాచ్యస్య కాక్వాక్షిప్తతయాఽపి చ॥
సందిగ్ధతుల్యప్రాధాన్యతయాఽన్యాంగతయాఽపి చ।
గుణీభూతమపి వ్యంగ్యం యత్ కించిచ్చారిమాస్పదమ్॥
(అలం మహో. 4. 1,2.)

4 అగూఢమపరస్యాంగం వాచ్యసిద్ధ్యంగమస్ఫుటమ్।
సందిగ్ధతుల్యప్రాధాన్యే కాక్వాక్షిప్తమసుందరమ్।
వ్యంగ్యమేవం గుణీభూతవ్యంగ్యస్యాష్టౌ భిదాః స్మృతాః ॥ (కావ్య 5. 45)

5 క) అత్ర అగూఢత్వం నామ స్ఫుటతరప్రతీతివిషయత్వమ్। తదుక్తమ్-
"తరుణీకుచమండలమివ గూఢం యస్మాచ్చమత్కురుతే। వాచ్యాయమానమస్మాద్ వ్యంగ్యమగూఢం గుణీభూతమ్॥"
(సా. రత్నా. 9. 40 కా. వృత్తి)

ఖ) వ్యంగ్యం చ గూఢం చమత్కరోతి నాగూఢమ్। యదుక్తమ్—
"అనుద్ఘుష్టః శబ్దైరథ చ ఘటనాతః స్ఫుటతరః
పదానామర్థాత్మా రమయతి న తూత్తానితరసః।

చ॥ [6] ఘనతరఘూర్జరీకుచయుగ క్రియ గూఢము గాక ద్రావిడీ
స్తనగతిఁదేటగాక యఱచాటగు నాంధ్రవధూటిసిబ్బెపుం
జనుగవవోలె గూఢ(-తయు)మును జాటుదనంబును లేక యుండఁజె
ప్పిన నదె పో! కవిత్వమనిపించు నగిం చటుగాకయుండినన్॥
(కావ్యాలంకారసంగ్రహము పుట 224)

అగూఢమగు గుణీభూతవ్యంగ్యమిట్లుండును—

త్రుట్యచ్చండీశకోదండం రామదోర్దండచండతామ్।
వ్యాచష్ట విష్టపస్పష్టఘోషణైః శత్రుభీషణైః॥ (సా రత్నా. 9 41)

శివునిధనవు(తాను) భగ్నమగుచు శత్రుభయంకరముగా జగమున ప్రతి ధ్వనించియున్న ఘోషణలచే రామునిబాహుదండము లతీవ్రతను వ్యాఖ్యానించెను

---

యథా దృశ్యః కించిత్ పవనచలచీనాంశుకతయా
కుచాభోగః స్త్రీణాం హరతి న తథోన్ముద్రితముఖః॥"
(అలం మహో 4 285)

గ) కామినీకుచకలశవత్ గూఢం చమత్కరోతి,అగూఢం చ స్ఫుటతయా వాచ్యాయమానమితి గుణీభూతమేవ॥ (కావ్య 5 45 కా. వృత్తి)

6. ఈపద్యమునకు సరియగు సంస్కృతశ్లోక మిట్లున్నది—
చోలీపయోధర ఇవ ప్రకటో న కామం
నో గూర్జరీస్తన ఇవాతితరాం నిగూఢః।
అర్థో గిరామపిహితః పిహితశ్చ కించి-
దాంధ్రీపయోధర ఇవాతితరాం సమిందే॥
—మందరవ్యాఖ్యా (సా. రత్నా. 9 40)

ఈశ్లోకమునకు పాఠభేదమును కానవచ్చుచున్నది—
నాంధ్రీపయోధర ఇవాతితరాంప్రకాశో
నో ఘూర్జరీస్తన ఇవాతితరాం నిగూఢః।
అర్థో గిరామపిహితః పిహితశ్చ కించిత్
సౌభాగ్యమేతి మరహట్టవధూకుచాభః॥

1. నౌకా (సా. రత్నా 9 . 40) 2 లక్ష్మి (సా. ద 4 . 14)
3 బాలబోధినీ (కావ్యప్రకాశ. 5 , 45 కా.)

7 అచేతనమగు శివకోదండమునకు చేతనధర్మము వ్యాఖ్యానించుట పొసఁగునా? కావున వ్యాఖ్యానించుటయన స్పష్టముగానూచించుటయే యగును. ఇది అత్యంతతిరస్కృతవాచ్యమగువ్యంగ్యము. ఈ వ్యంగ్యము సహృదయులు కానివారలకు సయితము తెలియఁదగియుండుటయే అగూఢమనుటకు కారణము. ఇట్లు అతిస్ఫుటముగా నుండుటలో అందమేమి లేదు ఇట్లు వ్యంగ్యమర్యాద చెఁగాక ఉన్నదున్నట్లుచెప్పినను అందమునకేమి లోటు? కావుననిది గుణీభూత వ్యంగ్యమే యగునుకాని ధ్వనియనరాదు

ఇది అత్యంతతిరస్కృతవాచ్యవ్యంగ్యము అగూఢమై గుణీభూతమగుట కుదాహరణము

11) ఒకప్పుడు అర్థశక్తిమూలవస్తువ్యంగ్యమును అగూఢమై గుణీభూతమగును ఎట్లన -

అత్రాసీత్ ఫణిపాశబంధనవిధిః శక్త్యా భవద్దేవరే
గాఢం వక్షసి తాడితే, హనుమతా ద్రోణాద్రిరత్రాహృతః।
దివ్యైరింద్రజిదత్ర లక్ష్మణశరైర్లోకాంతరం ప్రాపితః
కేనాప్యత్ర మృగాక్షి! రాక్షసపతేః కృత్తా చ కంఠాటవీ॥

(కావ్య 5 . 115)

రావణసంహారానంతరమున పుష్పకవిమానముపై అయోధ్యకు చనుదెంచుచున్న రాముఁడు ఆయాప్రదేశములఁజూపుచు సీతతో పలికిన పలుకులివి—

ఓ లేడికన్నులసోయగపుకన్నులదానా! ఇటు చూడుము ఇచ్చోటనే విధి వశమున మేము నాగపాశబద్ధులమైతిమి ఇది నీమఱఁది లక్ష్మణుడు శక్తి-నిహతవక్షుడై యుండ హనూమంతుఁడతనికై ద్రోణాద్రిని తెచ్చినచోటు. లక్ష్మ

---

7 క) అత్ర అచేతనే కోదండే చేతనధర్మస్య వ్యాఖ్యానస్య అనుపపన్నత్వాత్ తత్కార్యం సూచనమాత్రం లక్షయత్ 'వ్యాచష్టే'తిపదం స్ఫుటత్వే పర్యవస్యతి తేన పరమోత్కర్షో వ్యజ్యతే,ఏతత్సర్వం కవిభిరుచ్యమానతయా వాచ్యాయమానత్వేనాగూఢమ్॥ (సా. రత్నా. 9 41 వృత్తి)

ఖ) యద్యగూఢం స్వశబ్దేనోచ్యేత కిమచారుత్వం స్యాత్। గూఢతయా వర్ణనే వా కిం చారుత్వమధికం జాతమ్॥

—లోచన (ధ్వన్యా 1 14 కా వృత్తి)

ణుఁడు తనదివ్యాస్త్రములచె ఇంద్రజిత్తును తుదముట్టించినచోటిదియేయని ఆయా ప్రదేశములను సీతకుఁ జూపుచు, తాను రావణసంహారముచేసినప్రదేశమును నిర్దేశించి సీతా! చూచితివా! "ఎవఁడో" ఆరావణుని కంఠాటవిని త్రెంచినచోటిదియేయని చెప్పుచు తననిరహంకారతను వ్యక్తీకరించెను

[8]ఇట అర్థసామర్థ్యమున 'ఎవఁడో'యన నుతెవఁడో కాదు తానే(రాముఁడే) యను వంగ్యము అతిస్పష్టముగా గోచరించుచున్నది కావున నిదియును అగూఢమగు గూణీభూతవ్యంగ్యమేకాని ధ్వని కాదు

ఇట్లు వ్యంగ్యాంతరములుకూడ అగూఢములై గుణీభూతములగుట నుదాహరింపవచ్చును

**2. అపరాంగము :-**

రసాదివ్యంగ్యము ప్రధానమగుమఱియొకరసాదివ్యంగ్యమునకును, వస్త్వలంకారరూపమగుసంలక్ష్యక్రమవ్యంగ్యము ప్రధానమగువాచ్యమునకును ఒకప్పుడు అంగమగుట సంభవించును అదియే అపరాంగమగు గుణీభూత-వ్యంగ్యము [9]

**1) రసము రసాంతరమునకంగమగుట :-**

ఒకచో నొకరసము రసాంతరమునకు చమత్కారాతిశయము నొనగూర్చుచు దానికంగమగును ఉదా:-

---

8 అత్ర అనునాయకోపనాయకప్రతినాయకేమ నిర్దిష్టేషు చతుర్థవాక్యేఽను-క్తోఽపి నాయకో రామ ఏవ అర్థశక్త్యా ప్రతీయతే॥

(కావ్యప్రదీప. 5 1 కా వృత్తి)

9. క) "అపరస్య రసాదేర్వాచ్యస్య వా ప్రధానస్య అంగమలక్ష్యక్రమః అను-స్వానాభలక్ష్యక్రమో వా"ఇతి ద్వివిధః॥

(కావ్యప్రదీప. 5 1 కా వృత్తి)

ఖ) "వాచ్యస్య రసాదేర్వా వాక్యార్థస్యాపరస్య యత్రాంగమ్।
వ్యంగ్యం భవతి తదేతత్ తజ్ఞైరపరాంగమాఖ్యాతమ్॥"

(ఏకావళీ చతుర్థ పుట. 158)

అయం స రశనోత్కర్షీ పీనస్తనవిమర్దనః।
నాభ్యూరుజఘనస్పర్శీ నీవీవిస్రంసనః కరః॥ –(మహాభారత స్త్రీపర్వ)

రణరంగమున తెగిపడియున్న భూరిశ్రవునిహస్తమునుజూచి, అతని ప్రియురాండ్రు విలపించుచు పలికినపలుకులివి.

సంభోగావసరమున మొలనూలునులాగివేయునదియును, పీనవక్షోజములను మర్దించునదియును, నాభిని ఊరువులను, జఘనభాగమును తడుమునదియును, కోకముడిని విడుచునదియును అగు ఈ హస్తమునకు, అయ్యోః ఎట్టిదశ ప్రాప్తించినది

అట[10] అంగియగు శోకస్థాయిభావకమగు కరుణరసమునకు శృంగారరసము అంగము అయాశృంగారచేష్టలయనుభూతి తలఁపునకువచ్చినకొలఁది దుఃఖాతిరేకము హెచ్చుటచె నిట శృంగారరసము కరుణరసపరిపోషకమే కాని ప్రధానము కాదు కదా' కావుననిది గుణీభూతవ్యంగ్యమేకాని ధ్వని కాదు

ఇట్లు రసము రసాంతరమునకేకాక భావమునకును అంగమగుట నుదాహరింపవచ్చును

11) భావము భావాంతరమునకంగమగుట :-

ఒకచో నొకానొకభావము భావాంతరమునకు వన్నెతెచ్చుచు దానికంగమగును ఉదా -

అత్యుచ్చాః పరితః స్ఫురంతి గిరయః స్ఫారాస్తథాంభోధయః
తానేతానపి బిభ్రతీ కిమపి న క్లాన్తాఽసి తుభ్యం నమః।
ఆశ్చర్యేణ ముహుర్ముహుః స్తుతిమితి ప్రస్తౌమి యావద్భువః
తావద్బిభ్రదిమాం స్మృతస్తవ భుజో వాచస్తతో ముద్రితాః॥

ఇవి భోజరాజును ప్రశంసించుచు 'పంచాక్షరి'యను కవి పలికిన పలుకులు [11]

---

10 అత్ర భూరిశ్రవసః ఛిన్నం హస్తమాసాద్య తద్వధూనాం ప్రలాపే శృంగారః కరుణస్యాంగమ్॥ (కావ్యప్రదీప పంచమ. పుట. 125)

11 పంచాక్షరీనామా కవిరనేన వాక్యేన(శ్లోకేన) భోజరాజం స్తుతవానితి జయంతభట్టకృతదీపికాయాం స్పష్టమ్॥ –బాలబోధినీ (కావ్య 5 . 118)

"ఎంతో ఎత్తైన కొండలు, అతివిశాలములగు సముద్రములు వీటినన్నింటిని ధరించుచున్నను కొంచెమైనను అలసట చెందనిదానవు కావున నీకు చేయెత్తి మ్రొక్కెదను" అని భూదేవిని నుతించుచున్ననాయొక్క భావవీథిని, ఓరాజా! ఈభూమినిధరించు నీభుజము మెదలమొదలిడగానే దానిని పొగడుటకై మాటలుచాలక నానోరు మూతపడినది-

ఇట[12] కవికి రాజునెడగలరతిభావము ప్రధానమైనది దానికి, శ్లోక పూర్వార్ధమున భూదేవిని నుతించుటలో కాననగు కవినిష్ఠమగు భూదేవీవిషయక రతిభావము అంగము కావున నిదియు గుణీభూతవ్యంగ్యమేకాని ధ్వని కాదు.

ఇట్లొకానొకభావమునకు 'రసాభాస భావాభాస-భావశాంతి-భావోదయ-భావసంధి-భావశబలతలు' అనునవి అంగములగుటయు ఉదాహరింపవచ్చును

వీనినే కొందఱాలంకారికులు రసవదాద్యలంకారములని వ్యవహరించిరి [13]

---

12. అత్ర భూవిషయో రత్యాఖ్యో భావో రాజవిషయస్య రతిభావస్య॥ (కావ్య. 5 . 118)

13. క) "ప్రధానేఽన్యత్ర వాక్యార్థే యత్రాంగం తు రసాదయః।
కావ్యే తస్మిన్నలంకారో రసాదిరితి మే మతిః॥" (ధ్వన్యా 2-5)

ఖ) ఏతే చ రసవదాద్యలంకారాః। యద్యపి భావోదయ--భావసంధి-భావశబలత్వాని నాలంకారతయా ఉక్తాని। తథాపి కశ్చిత్ బ్రూయా-దిత్యేవముక్తమ్॥ (కావ్యప్రకాశ 5 123 వృత్తి)

గ) రసభావతదాభాసభావప్రశమానాం నిబంధే రసవత్-ప్రేయ-ఊర్జస్వి-సమాహితాని। భావోదయభావసంధిభావశబలతాశ్చ పృథగలంకారాః॥ (అలం సర్వస్వ.)

ఘ) "రసభావతదాభాసభావశాంతినిబంధనాః।
చత్వారో రసవత్ప్రేయ ఊర్జస్వి చ సమాహితమ్।
భావస్యచోదయః సంధిః శబలత్వమితి త్రయః॥"
(కువలయా శ్లో 170 - 171)

పూర్వోదాహరణములలో[14] కరుణరసము రాజవిషయకరతిభావ మును అంగిలే అయినను ప్రధానములుకాకుండుటచే వీనిననుసరించి 'ధ్వని' యనువ్యవహారము తగదు ఎయ్యది అతిశయతచమత్కారాధాయకమో అదియే ప్రధానము దానిననుసరించియే వ్యపదేశించుట తగును కావుననే కరుణరస రాజవిషయకరతిభావములకు చమత్కారాతిశయమును చేకూర్చిన శృంగారరస-భూవిషయకరతిభావములననుసరించియే గుణీభూతవ్యంగ్యము లని వ్యవహరించుట జరిగినది

111) **వస్తురూప సంలక్ష్యక్రమవ్యంగ్యము వాచ్యాంగమగుట :-**

ఒకచో నర్థశక్తిమూలకమగు వస్తువ్యంగ్యము వాచ్యార్థోపస్కారక మగుచు దానికంగమగను—

ఆగత్య సంప్రతి వియోగవిసంష్ఠులాంగీ-
మంభోజినీం క్వచిదపి క్షపితత్రియామః ।
ఏతాం ప్రసాదయతి పశ్య శనైః ప్రభాతే
తన్వంగి' పాదపతనేన సహస్రరశ్మిః ॥ (కావ్య. 5. 125)

[గీ॥ ఎచ్చటనొ రాత్రి గడిపి యీ యహిమకరుఁడు
ఇపుడె వచ్చి విరహంబుచే నెంతొ కుములు
పద్మినిని ప్రొద్దుటనె పాదపతితుఁడగుచు
అల్లన ప్రతిమాలునిదె తన్వంగి' చూడు —సా. సౌ ద 173 పు ]

---

14 క) యద్యపి స నాస్తి కశ్చిద్విషయః యత్ర ధ్వనిగుణీభూతవ్యంగ్యయోః స్వప్రభేదాదిభిః సహ సంకరః సంసృష్టిర్వా నాస్తి, తథాపి ప్రాధాన్యేన వ్యపదేశా భవంతీతి క్వచిత్ కేనచిత్ వ్యవహారః॥
(కావ్యప్రకాశ 5 . 123 ఉదా వృత్తి)

ఖ) తథా చ— 'అయం స రశనా'—ఇత్యాదౌ కరుణజన్యచమత్కారాతిశయే స్మర్యమాణశృంగారస్య ప్రాధాన్యేన ప్రయోజకత్వాత్ గుణీభూత-వ్యంగ్యమితి వ్యవహార ఇతి భావః॥
—ప్రభా (కావ్యప్రదీ పంచమ పు 135)

గ) యత్ర యన్ముఖేన చమత్కారః తత్ర తేనైవ వ్యవహార ఇత్యర్థః॥ ప్రాధాన్యం చ చమత్కారప్రయోజకత్వమ్।
—బాలబోధినీ. (కావ్యప్రకాశ. 5 . 123 ఉదా. వృత్తి)

ఇట ఒకానొకధూర్తకాముకుఁడు తాను రాత్రియంతయు నెటనో గడిపి తెలతెల్లవాఱుచుండ నేతెంచి తనకై వేచి వేచి యలసిసొలసియున్న తన ప్రేయసిని కాళ్ళపైఁబడి తనతప్పు మన్నింపుమని వేడుకొనుచు ప్రసన్నురాలినిగాఁజేసి కొనుచున్నాఁడను వ్యంగ్యము, వాచ్యార్థమగు రవికమలినీవృత్తాంతమునకు వన్నెతెచ్చుచు దానికంగమైయుండుటచె నిది గుణీభూతవ్యంగ్యమే యగును [15] కాని ధ్వని కాదు

సమాసోక్త్యలంకారమన నిదియే కావుననే సమాసోక్తి గుణీభూత వ్యంగ్యమని ధ్వనికారులు నుడివిరి

రవికమలినీవృత్తాంతరూపవాచ్యార్థమునకు వ్యంగ్యార్థమువలన వన్నె చెహూరినదే కాని అది లేకున్న వాచ్యార్థమున కే యనుపపత్తియు లేకుండుటచే నిది వాచ్యసిద్ధ్యంగము గాక అపరాంగమగుచున్నది *

**అపరాంగవాచ్యసిద్ధ్యంగములకు గల భేదము –**

వాచ్యసిద్ధ్యంగమున వ్యంగ్యార్థము లేకున్నచో వాచ్యార్థము కుదురదు అపరాంగమున వాచ్యార్థము స్వసిద్ధికై వ్యంగ్యార్థమునపేక్షింపదు, కాని వ్యంగ్యార్థమువలన వాచ్యార్థమునకొకవన్నె చేకూరును [16] ఇదియే వీనికిఁగల సూక్ష్మభేదము

---

15. అత్రార్థశక్తిమూలో నాయకనాయికావృత్తాంతో వాచ్యరవికమలినీవృత్తాంతాధ్యారోపేణ తదంగతయైవ స్థితః। సమాసోక్తౌ – 'ఉపోఢరాగేణ' – ఇత్యాదౌ సర్వత్ర ప్రతీయమానోపస్కృతవాచ్యస్యైవ ప్రాధాన్యాత్॥
(కావ్యప్రదీప పంచమ పు 140)

న చ వాచ్యసిద్ధ్యంగత్వమ్। రవికమలినీవృత్తాంతస్యైతన్నైరపేక్ష్యేణైవ సిద్ధేరితి॥ (కావ్యప్రదీప పంచమ పు 141)

16 ఏవం చ యత్ర స్వత ఏవ సిద్ధరూపస్య వాచ్యస్య వ్యంగ్యేనోత్కర్షాధానమాత్రం, తత్రాయం ప్రభేదః। యత్ర పున ర్వ్యంగ్యం వినా వాచ్యమేవాత్మానం న లభతే, తత్ర వాచ్యసిద్ధ్యంగత్వమితి వ్యంగ్యసాపేక్షనిరపేక్షసిద్ధిభ్యామనయోర్భేద ఇతి ద్రష్టవ్యమ్॥
–బాలబోధినీ (కావ్య 5 . 165)

**3. వాచ్యసిద్ధ్యంగము :—**

ఎచ్చట వ్యంగ్యము వాచ్యార్థసిద్ధికై ఉపయోగపడునో యది వాచ్యసిద్ధ్యంగము [17] ఉదా (రసగం ప్రథమ కావ్యలక్షణ) -

రాఘవవిరహజ్వాలాసంతాపితసహ్యశైలశిఖరేషు ।
శిశిరే సుఖం శయానాః కపయః కుప్యంతి పవనతనయాయ॥

"రామునికిఁగలిగినసీతావియోగాగ్నిజ్వాలలచే వేడెక్కినసహ్యపర్వతశిఖరములయందు చలికాలమున వెచ్చనిసుఖమనుభవించుచున్న కపివరులు హనుమంతునిపై కోపించిరి" అనునది వాచ్యార్థము కోపించుటకు గల కారణమేదో తెలియనిచోనివాచ్యార్థము నిరాకాంక్షము కాదు సీతాకుశలవృత్తాంతమును తెలియఁజెప్పుటచే రామునివిరహాగ్ని చల్లారినదనునది, ఇట వ్యంగ్యము ఈ వ్యంగ్యము మనమున భావించినచో అట్లు కపివరులు కోపించుటలోని కారణము తేటతెల్లమగును కావున వ్యంగ్యమిట వాచ్యసిద్ధికి తోడ్పడుచు దానికంగమయినది [18]

ఇట్టిది వాచ్యసిద్ధ్యంగమగు గుణీభూతవ్యంగ్యమే కాని ధ్వని కాదు

**4. అస్ఫుటము -**

ఒకచో వ్యంగ్యార్థమున్నను అది స్పష్టముగా ప్రతీయమానము కాదు.[19]

ఉదా —

అదృష్టే దర్శనోత్కంఠా దృష్టే విచ్ఛేదభీరుతా ।
నాదృష్టేన న దృష్టేన భవతా లభ్యతే సుఖమ్ ॥ (కావ్య 5 128)

---

17 వాచ్యస్య సిద్ధిహేతుం కృతినః కథయంతి వాచ్యసిద్ధ్యంగమ్॥
(ఏకావళీ చతుర్థ పుట 165)

18 అత్ర జానకీకుశలావేదనేన రాఘవః శిశిరీకృత ఇతి వ్యంగ్యమాకస్మికకపికర్తృకహనూమద్విషయకకోపోపపాదకతయా గుణీభూతమపి దురైవవశతో దాస్యమనుభవద్ రాజకళత్రమివ కామపి కమనీయతామావహతి॥
(రసగం ప్రథమ కావ్యలక్షణ )

19. యత్ర న సదపి వ్యంగ్యం స్ఫుటతాం భజతే తదస్ఫుటాభిఖ్యమ్॥
(ఏకావళీ చతు పుట 171)

[“కం కనఁబడకుండిన నిన్నుం
గనఁగానువ్విళ్ళుగొందుఁగనిపించినచోఁ
జనుదువని వెఱతు, నిన్నుం
గనకున్నను గన్ననాకుఁ గలుగవు సుఖముల్ ”
—సన్నిధానం వారి కావ్యా సంగ్ర పుట 228]

ఒకానొక ప్రియురాలు తన ప్రియునితోఁ బలికిన ఈపలుకులలో— “నీవెప్పుడు నాకన్నులయెదుటనే యుండి నాకు వియోగభయము లేకుండునట్లు చేయు”మను వ్యంగ్యము స్పష్టముగాఁ గాక క్లిష్టముగా తోచుచున్నది [20] కావున నిది అస్ఫుటాఖ్యమగు గుణీభూతవ్యంగ్యమే కాని ధ్వనికాదు

**5) సందిగ్ధ ప్రాధాన్యము :-**

ఒకచో వాచ్యవ్యంగ్యములలో దేనికి ప్రాధాన్యమో తేలక సంశయగ్రస్తమగును [21] ఉదా - (కుమా — 3/67) :—

హరస్తు కించిత్ పరిలుప్తధైర్య శ్చంద్రోదయారంభ ఇవాంబురాశిః ।
ఉమాముఖే బింబఫలాధరోష్ఠే వ్యాపారయామాస విలోచనాని॥

[హరుఁడంతటఁజంద్రోదయారంభమున నంబురాశివలెఁ గలఁతనొంది యాషత్పరిలుప్తధైర్యుఁడె బింబఫలతుల్యాధరోష్ఠమగు నుమాదేవివదనమండలమున దృగ్వ్యాపారముం బ్రసరింపఁజేసెను ”
—“మోచర్ల”వారి —గిరిజాకళ్యాణము పుట. 321 ]

ఇట ముద్దాడునిచ్ఛ వ్యంగ్యము-ఉమాముఖమున కన్నులు ప్రసరింపఁ జేయుట వాచ్యము ఈవాచ్యవ్యంగ్యములలో నేది ప్రధానమో? ఏది కాదో? సాధకబాధకప్రమాణమేదియు లేకుండుటచే నిది సంధిగ్ధప్రాధాన్యమను గుణీ

---

20 అత్ర—అదృష్టో యథా న భవసి వియోగదుఃఖం చ యథా నోత్పద్యతే తథా కుర్యా ఇతి వ్యంగ్యం సహృదయస్యాపి న స్ఫుటమవభాసతే॥
(కావ్యప్రదీప పంచమ పుట 143)

21. “యది వాచ్యం వ్యంగ్యం వా ముఖ్యతయా నిశ్చితం న భవేత్॥”
(ఏకావళీ చతుర్థ పుట. 171)

భూతవ్యంగ్యము వాచ్యము కూడి ఉత్కంఠాతిశయపర్యవసాయియగుచు వ్యంగ్యమువలె లోకోత్తరచమత్కారము నొనగూర్చుచునే యున్నదికదా.[22]

**6. తుల్యప్రాధాన్యము –**

ఒకచో వాచ్యమునకు వ్యంగ్యమునకును ప్రాధాన్యము సమముగా నుండును ఉదా –

బ్రాహ్మణాతిక్రమత్యాగో భవతామేవ భూతయే ।
జామదగ్న్యస్తథా మిత్రమన్యథా దుర్మనాయతే॥

రావణునకు[23] పరశురాముడు పంపినసందేశమిది బ్రాహ్మణులనవమానించుట మానిననది మీకే శ్రేయము అట్లేని పరశురాముఁడు మీకు మిత్రుఁడు లేదేని అతనిమనస్సు కలఁతచెందును

ఇట సామపూర్వవచనము[24] వాచ్యము కాఁగా, "మాటవిననినాడు క్షత్రియజాతినంత మొందించినట్లు రాక్షసులనందఱిని నశింపఁజేయఁగల డీ

---

22 అత్ర "చుంబితుమైచ్ఛ"దితి వ్యంగ్యమ్। యుగపల్లోచనత్రయవ్యాపారణం వాచ్యమ్। తయోశ్చ ప్రాధాన్యే సాధకబాధకమానాభావేన సందేహః। వాచ్యస్యాప్యలౌకికత్వేన చమత్కారకారిత్వాదుత్కంఠాతిశయవ్యంజకత్వాత్॥
(కావ్యప్రదీప పంచమ గుణీ)

23 వస్తుతస్తు మహావీరచరితనాటకే ద్వితీయేఽంకే రావణముద్దిశ్య రావణామాత్యం మాల్యవంతం ప్రతి పరశురామేణ ప్రేషితే పత్రే పద్యమిదమ్॥
—బాలబోధినీ. (కావ్య 5 130)

24. క) అత్ర జామదగ్న్యః క్షత్రాణామివ రక్షసామపి క్షయం కరిష్యతీతి వ్యంగ్యమివ వాచ్యమపి ప్రధానమేవ। 'దుర్మనాయతే' ఇతి గంభీరోక్త్యా చమత్కారిత్వాత్, విగ్రహవత్ సందేర్వివక్షితత్వాచ్చ"
(కావ్యప్రదీప పంచమ గుణీ)

ఖ) అత్ర జామదగ్న్యః క్షత్రియాణామివ రక్షసామపి క్షయం కరిష్యతీతి దండరూపం వ్యంగ్యమివ భూత్యుపదేశో మిత్రత్వాభిధానరూపం చ సామోపాయాత్మకం వాచ్యమపి ప్రధానమేవ। 'దుర్మనాయతే' ఇతి

పరశురాముఁ"డను నర్థము దండ(న)రూపము వ్యంగ్యము ఈ సామదండ ములు రెండును ప్రకృతానుకూలములై యుండుటచే వివక్షితములు కావున వాచ్యవ్యంగ్యములకు ప్రాధాన్యము సమమై యున్నది. కాననిది సమప్రాధాన్య మగు గుణీభూతవ్యంగ్యమేకాని ధ్వని కాదు వాచ్యమునకంటె నతిశయితచమ త్కారకారియై ప్రధానముగా నుండు వ్యంగ్యమే ధ్వని యగును కదా !

7 కాక్వాక్షిప్తము :-

ఒకచో కాకుస్వరమున వ్యంగ్యమాక్షిప్తమగుచుండును [25]

ఉదా (కావ్య 5 131) —

మథ్నామి కౌరవశతం సమరే న కోపాత్
దుఃశాసనస్య రుధిరం న పిబామ్యురస్తః ।
సంచూర్ణయామి గదయా న సుయోధనోరూ
సంధిం కరోతు భవతాం నృపతిః పణేన ॥

[ఉ తల్లడమందఁగౌరవశతంబునుబట్టి యనిన్ వధింపనే?
వ్రల్లదు దుస్ససేనురుధిరంబు నురంబును వ్రచ్చి త్రావనే?
పెళ్ళుమనన్ సుయోధనుని పెంపొడలన్ గదనుగ్గుసేయనే?
యూళ్ళయిదింటితో నృపతి యొప్పుగఁజెసెడుఁగాక సంధులన్
—వేణీసంహారము —వద్దాదిసుబ్బారాయుఁడు]

వేణీసంహారమున భీమసేనుఁడు సహదేవుని గూర్చి పలికిన పలుకులివి— ఇట 'కౌరవశతమును వధింతును'మున్నగు వ్యంగ్యములు "న మథ్నామి" (వధింపనే?) మున్నగుపదములకాకుస్వరముచేనాక్షిప్తములై వాచ్యాయమానము లగుటచేనిది గుణీభూతవ్యంగ్యమగును [26]

---

గంభీరోక్త్యా వాచ్యస్యాపి చమత్కారిత్వాత్। విగ్రహవత్ సందేరపి అనర్థనివారకత్వేన వివక్షితత్వాచ్చేతి తుల్యప్రాధాన్యవ్యంగ్యమ్॥
—బాలబోధినీ (కావ్య 5 130)

25 'ఆక్షిప్తం యత్ కాక్వా, కాక్వాక్షిప్తం తదాఖ్యాతమ్॥'
(ఏకావళీ చతు. గుణీ - పుట 173)

26. అత్ర మథ్నామ్యేవేత్యాది వ్యంగ్యం వాచ్యనిషేధసహభావేన స్థితమ్॥
(కావ్య. 5 . 131)

కాకుస్వరము వాచ్యప్రతీతిసమకాలముననే వ్యంగ్యప్రతీతిని కలుగఁ జేయుటయందే విశ్రాంతమగుటచేనిది కాక్వాక్షిప్తమగు గుణీభూతవ్యంగ్యమేకాని కాకుస్వరధ్వని కాదు

**కాకుస్వరవైశిష్ట్యముచేనగు ధ్వని :—**

కాకుస్వరవైశిష్ట్యముననేర్పడుధ్వని యిట్లుండును. ఉదా -

తథాభూతాం దృష్ట్వా నృపసదసి పాంచాలతనయాం
వనే వ్యాధైః సార్ధం సువిరముషితం వల్కలధరైః ।
విరాటస్యావాసే స్థితమనుచితారంభనిభృతం
గురుః ఖేదం ఖిన్నే మయి భజతి నాద్యాపి కురుషు॥"[27] (కావ్య 315)

పాంచాలతనయను(ద్రౌపదిని) కౌరవసభలోనట్టిపరిస్థితిలో చూచియును, వల్కలముల ధరించినవారమై వ్యాధులతోపాటు వనమున దీర్ఘకాలము నివసించుట దర్శించియును, విరాటునికొలువున అనుచితములగు సేవాధర్మములను నిర్వర్తించుచు నజ్ఞాతముగా నుండుట గాంచియును, ఆ ధర్మనందనుఁడు, (ఈ దురవస్థ కన్నులారఁగాంచి) ఖిన్నుఁడనగునాపై మాత్సర్యము పొందుచున్నాఁడే కాని ఇప్పటికిని కౌరవులవిషయమున పొందఁడు(పొందదేమి ?)

ఇట - 'కౌరవులపై మాత్సర్యముండుట తగునుకాని నాపై అది తగదు' అను వ్యంగ్యము కాకుస్వరవైశిష్ట్యమున వ్యక్తమగుచున్నది.[28]

**'కాకుధ్వని'—'కాక్వాక్షిప్తము'లకుగల భేదము .-**

అయినను ఇది కాక్వాక్షిప్తమగుగుణీభూతవ్యంగ్యము కాదు ఎచ్చట కాకుస్వరము లేకున్న వాక్యార్థమే పొసఁగదో, అది కాక్వాక్షిప్తమగు గుణీభూత వ్యంగ్యము 'మథ్నామి'- అను పూర్వోదాహరణమున 'న మథ్నామి'(వధింపనేః) అనునప్పుడు కాకుస్వరముచే నేర్పడిన 'వధింతును' మున్నగు వ్యంగ్యార్థములు

---

27. ఈ శ్లోకము— వేణీసంహారమునందలిది కావ్యప్రకాశాద్యలంకారగ్రంథము-లలో నుదాహృతము —రచయిత

28 అత్ర మయి న యోగ్యః ఖేదః కురుషు తు యోగ్య ఇతి కాక్వా ప్రకాశ్యతే॥ (కావ్య. 3 15)

లేకున్న వాచ్యార్థమే కుదురదు- కావుననది గుణీభూతవ్యంగ్యము ఇట నట్లు కాదు-'న భజతి' అనునప్పుడు కాకాంక్షిప్తమగునర్థము (పొందఁదేమి?)లేకున్నను వాచ్యార్థానుపపత్తి ఇసుమంతైన లేదు కాకుస్వరమున్నను అది ప్రశ్నమాత్రము ననే పర్యవసించుటచేతనే వాచ్యార్థోపపత్తి యగును. పిమ్మట అర్థసామర్థ్యముచేత కాకుస్వరసాహాయ్యమున వ్యంగ్యప్రతీతి యగును కావున కాకుస్వరము ప్రశ్న మాత్రముననే విశ్రాంతమయినచో నది "కాకుస్వరవైశిష్ట్యముచేతనగు ధ్వని" యగును ఇదియే వీనికిగల భేదము [29]

ఇట్లు భేదముండుటచే 'మథ్నామి'అను పూర్వోదాహరణమున కాక్వాక్షిప్తమగు గుణీభూతవ్యంగ్యమేకాని ధ్వనికాదు

**8. అసుందరము :-**

ఒకచో వ్యంగ్యమునకంటె వాచ్యమే చారుత్వవిశ్రాంతిధామమై ప్రాధాన్యము నొందుచుండును ఉదా —

---

29. క) తథాపి కాక్వాక్షిప్తవ్యంగ్యరూపగుణీభూతవ్యంగ్యప్రభేదతా కథమపనేయేతి చేత్ న। అత్ర నేతి ప్రశ్నకాక్వాపి వాక్యార్థప్రతీతిపర్యవసానాత్। యాం కాకుం వినా వాక్యార్థబోధ ఏవ నోపపద్యతే తయైవాక్షిప్తస్య గుణీభావాత్। యథా— "మథ్నామి కౌరవశతం సమరే న కోపాత్" ఇత్యాదౌ భీమసేనాదౌ తాదృశే వక్తరి॥

(కావ్యప్రదీప తృతీ కాకుధ్వని పు 51)

ఖ) అత ఏవ కాకువ్యంగ్యస్య పదార్థస్థానీయత్వేన సూత్రే అక్షిప్తపదం ఝటితిప్రత్యాయితమిత్యేతత్పరమ్। యత్ర కాకుతోఽపి విలంబేన ప్రతీతిః, తత్ర ధ్వనిత్వమేవ। యథోదాహ్నతే "గురుః ఖేదం ఖిన్నే॥" ఇత్యత్రేతి ద్రష్టవ్యమితి విస్తారికా-సారబోధిన్యోః స్పష్టం। కౌరవకులనిధనవిహితప్రతిజ్ఞస్య భీమస్య 'న మథ్నామీ'త్యాద్యుక్తిరేవ బాధితా। అతో న మథ్నామీతి కాకుః। "న మథ్నామీతి నే"త్యేవం మథననిషేధనిషేధేన మథనావధారణాత్మకం వ్యంగ్యం హఠాదేవ ఉపస్థాపయత్ మథననిషేధస్య వాక్యార్థభూతస్య ప్రతీతిసమకాలమేవ ప్రత్యాయయతి। కాకుం వినా వాక్యార్థస్య బాధితత్వేన అప్రతీతేః॥

—బాలబోధినీ. (కావ్య. 5 . 132)

వానీరకుంజరోడ్డీనశకునికోలాహలం శృణ్వన్త్యాః ।
గృహకర్మవ్యాపృతాయా వధ్వాః సీదంత్యంగాని ॥

[గీ ఇట్టటులు ప్రబ్బలిపొదల నెగురుచున్న
విహగముల కలకలములు వినుచునుండి
అనయమింటిపనులలోను మునిగితేలు
వధువునంగములు మిగుల వగలఁబొగులు "

— సా. సౌ. ద. 175 పు ]

ఇంటి ప్రక్కనేయున్న ప్రబ్బలిపొదరిల్లు సంకేతస్థానముగా నొనర్చు కొనియు, పక్షులకోలాహలధ్వనులచె ప్రియునిరాక పసిగట్టియును, గురుజన పారతంత్ర్యమున నింటిపనులలోనే మునిగితేలుచు అచ్చోటికి వెళ్ళఁజాలని ఒకానొకవధువునవస్థను వర్ణించునదీశ్లోకము [30]

ఇట[31]— "సంకేతస్థానమగు పొదరింటికి ప్రియుఁడు వచ్చె"నను వ్యంగ్యార్థమునకంటె "వధువునంగములు మిగులవగలఁబొగులు" అను వాచ్యార్థమే చమత్కారవిశ్రాంతిధామమైయున్నది

కావున నీవ్యంగ్యము వాచ్యార్థమునకంటె నసుందరమగుటచే నిది గుణీభూతవ్యంగ్యమే కాని ధ్వని కాదు

ఇట్లు ధ్వని— గుణీభూతవ్యంగ్యములకుఁ గల భేదము సంగ్రహింపఁ బడినది

---

30 గృహపార్శ్వవర్తివేతసనికుంజే దత్తసంకేతాయాః నికుంజోడ్డీనపక్షికోలాహలతర్కితోపనాయకప్రవేశాయాః గురుజనపారతంత్ర్యేణ గృహకర్మవ్యాపృతతయా చ తత్ర గంతుమశక్నువన్త్యా అవస్థావర్ణనమిదమ్॥
—బాలబోధినీ (కావ్య 5.132)

31 అత్ర దత్తసంకేతః కశ్చిల్లతాగహనం ప్రవిష్ట ఇతి వ్యంగ్యాత్ సీదంత్యంగానీతి వాచ్యం సచమత్కారమ్॥ (కావ్య. 5.32 ఉదా వృత్తి)



# ధ్వని – మనుచరిత్రము

## సప్తమ ప్రకరణము

### కావ్యము – ప్రబంధము

ధ్వనియను పదము కావ్యమునకును అనువర్తించును [1] వ్యంగ్యము ప్రధానముగానుండు కావ్యమే ధ్వనికావ్యమగును అదియే ఉత్తమకావ్యము. [2]

**కావ్యస్వరూపము :—**

కావ్యమునకు[3] శబ్దార్థములు రెండును శరీరస్థానీయములు శరీరమునకు హారాద్యలంకారము లందము నినుమడింపఁజేయునట్లు కావ్యశరీరమగు శబ్దార్థములకు అనుప్రాసాదిశబ్దాలంకారములును ఉపమాద్య లంకారములును వన్నె తెచ్చుచుండును. [4] శౌర్యాది గుణములాత్మ కుత్కర్షనాపాదించునట్లు, మాధు

---

1 క) యత్రార్థః శబ్దో వా తమర్థముపసర్జనీకృతస్వార్థౌ।
వ్యఙ్క్తః కావ్యవిశేషః స ధ్వనిరితి సూరిభిః కథితః॥ (ధ్వన్యా 1.13 కా)

ఖ) కారికాయాం (ధ్వన్యా 1 13) తు ప్రాధాన్యేన సముదాయ ఏవ కావ్యరూపో ముఖ్యతయా ధ్వనిరితి ప్రతిపాదితమ్॥
—లోచన. (ధ్వన్యా 1 13 కా వృత్తి)

2 క) ఇదముత్తమమతిశయిని వ్యంగ్యే వాచ్యాద్ ధ్వనిర్బుధైః కథితః॥
(కావ్య 1 4 కా)

ఖ) వ్యంగ్యస్య ప్రాధాన్యే కావ్యముత్తమమ్॥ (కావ్యాను. 2 56)

3 క) "శబ్దార్థౌ మూర్తిరాఖ్యాతౌ" (ప్రతాపరుద్రీయ. 2. 2)

ఖ) "శబ్దార్థౌ వపురస్య" —విద్యాధర. (ఏకావళీ 1 1)

గ) ఉక్తం హి—'కావ్యస్య శబ్దారౌ శరీరమ్ '(సా.ద ప్రథమ. కావ్యలక్షణ)

4 ఉపకుర్వంతి తం సంతం యేఽంగద్వారేణ జాతుచిత్।
హారాదివదలంకారా స్తేఽనుప్రాసోపమాదయః॥ (కావ్య 8 . 67)

ర్యాదిగుణములును రసమునకుత్కర్షను చేకూర్చుచు కావ్యశోభను కలిగించు చుండును ఇట్లు కావ్యమున గుణాలంకారములయావశ్యకత ఎంతయేని కలదు ఇంతేగాక 'కుష్ఠాదిరోగములు శరీరముయొక్క అందమును చెడగొట్టునట్లు దోషములు కావ్యసౌందర్యమును చెడగొట్టుచుండును కావున శబ్దార్థగతములగు దోషములేవియును కావ్యముననుండకూడదు [5] కావ్యమునకు వ్యంగ్యమాత్మ స్థానీయము కావున వ్యంగ్యము ప్రధానముగానుండునదియే ఉత్తమకావ్యమగును. ఇది కావ్యముయొక్క బాహ్యాభ్యంతరస్వరూపము.

కావ్యనిర్వచనము -

లక్షణకర్తలీయంశమును మనమునకొనియే కావ్యమును నిర్వచించుచు గుణాలంకారములతోఁగూడియును దోషములులేకయును ఉండుశబ్దార్థములు

---

5 క) కావ్యశోభాయాః కర్తారో ధర్మా గుణాః"

—వామన. (కావ్యా. సూ 3 1 1)

ఖ) "యువతేరివ రూపమంగః కావ్యం స్వదతే శుద్ధగుణం తదప్యతీవ।
విహితప్రణయం నిరంతరాభిః సదలంకారవికల్పకల్పనాభిః ॥
యది భవతి వచశ్చ్యుతం గుణేభ్యో వపురివ యౌవనవంధ్యమంగనాయాః।
అపి జనదయితాని దుర్భగత్వం నియతమలంకరణాని సంశ్రయంతే॥"

—వామన (కావ్యా 3 1 . 2 సూత్రవృత్తిలో)

గ) యే రసస్యాంగినో ధర్మాః శౌర్యాదయ ఇవాత్మనః।
ఉత్కర్షహేతవ స్తే స్యురచలస్థితయో గుణాః॥

—మమ్మట (కావ్య 8 . 65)

ఘ) సర్వథా పదమప్యేకం న నిగాద్యమవద్యవత్ ।
విలక్ష్మణా హి కావ్యేన దుఃసుతేనేవ నింద్యతే॥

—భామహ. (కావ్య 1 11)

ఙ) తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన ।
స్యాద్వపుః సుందరమపి శ్విత్రేణై కేన దుర్భగమ్॥

—దండి (కావ్యా 1 . 7)

కావ్యము" అని నుడివిరి [6] ఈనిర్వచనమును పరిశీలించిన, కావ్యమున గుణాలంకారసాహిత్యమును దోషరాహిత్యమును నియతములై యుండవలెనని తెలియుచున్నది ఇది అంతసమంజసముగా తోచుటలేదు. ఏలన? నిర్దోషత్వమును గుణములును, అలంకారములును, ధ్వనియును అనునవి సమిష్టిరూపముననో వ్యష్టి-రూపముననో శబ్దార్థములకు లోకోత్తరచమత్కారమును సమకూర్చి కావ్యమును సహృదయానందసంధాయకముగా తీర్చిదిద్దుచుండును [7] కావున వీనిలో నేదోయొకదానివలన లోకోత్తరచమత్కారము కలిగినను కావ్యత్వమునకు నేయాటంకము లేదు. ఈ యమరుకకవిశ్లోకమును చూడుడు—

కథమపి కృతప్రత్యాసత్తౌ ప్రియే! స్ఖలితోత్తరే
విరహకృశయా కృత్వా వ్యాజప్రకల్పితమశ్రుతమ్।
అసహనసఖీశ్రోత్రప్రాప్తిప్రమోదససంభ్రమం
వివలితదృశా శూన్యే గేహే సముచ్ఛ్వసితం తతః॥ [8]

---

6 క) "శబ్దార్థౌ సహితౌ కావ్యమ్" —భామహ. (కావ్యా 1.16)

ఖ) కావ్యశబ్దోఽయం గుణాలంకారసంస్కృతయోః శబ్దార్థయోః వర్తతే॥ —వామన. (కావ్యా సూ. 1 1.1 వృత్తి)

గ) "శబ్దార్థౌ కావ్యం॥" —రుద్రట. (కావ్యా 2.1)

ఘ) 'అదోషౌ సగుణౌ సాలంకారౌ చ శబ్దార్థౌ కావ్యమ్॥' —హేమచంద్ర. (కావ్యాను. 1 12)

ఙ) "తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునః క్వాపి" —మమ్మట (కావ్య. 1.4)

7 క) కావ్యం శబ్దార్థవైచిత్ర్యయోగః సహృదయప్రియః।
యస్మిన్నదోషత్వగుణాలంకృతిధ్వనయః స్థితాః॥
(అలం మహో. 1 12)

ఖ) యతో రసాదిరలంకారశ్చ ద్వయం చమత్కారహేతుః। తథా చ యత్ర రసాదీనామవస్థానం న తత్ర స్ఫుటాలంకారాపేక్షా॥
(కావ్యప్రదీప. 1.4 కా వృత్తి)

8. అమరుకశతకశ్లోకమిది— ఉద్ధృతము – భట్టేందురాజలఘువివృతిలో (ఉద్భటకావ్యా. 6.7)

[ క్రమ్మఱి యెట్లొ దగ్గరినకాంతుఁడు దా స్ఖలితోత్తరుండుగా
నిమ్మగ పీనుచెర్పసటులే చెలియుండెఁగ్రహించియున్న వ్యా
జమ్మున నెచ్చెలుల్ విన నిజమ్మగ నోర్వరటంచు జంకి శీ
ఘ్రమ్మగఁద్రిప్పి చూపుల నగారము రిత్తగనుంట నూఱడెన్॥[9]
—శ్రీ 'మల్లాది' వారి అమరుకావ్యము 76 వద్య.]

[10]శృంగారరసస్యందియగు నీశ్లోకమున నర్థాలంకారమేదియును లేదు. అయినను మాధుర్యౌజోగుణములతో విలసిల్లు ప్రసాదగుణము మాత్రము కావ్య శోభాహేతువగుచు ఉండనేయున్నది కావున కావ్యమున అలంకారములు నియతములు కావు ఈకారణముననే కావ్యప్రకాశకారులు 'అనలంకృతీ పునః క్వాపి' అని కావ్యలక్షణమును నవరించి, అలంకారములు చమత్కారాధాయకము లగుటచే కావ్యముననుండవలెనుకాని 'ఒకప్పుడు రసాదిధ్వనిచేతనే అట్టిచమత్కారముకలుగుచుండ' నలంకారములులేకున్నను ఎట్టిహానియు నుండదని వివరించెను. [11]

"అపదోషతైవ విగుణస్య గుణః" (శిశు 9-12) అను న్యాయానుసారము నిర్దోషత కావ్యమునకు గుణమే యగును. అయినను రసాస్వాదమునకు భంగమువాటిల్లనివిధమున అల్పదోషములున్నను అది కావ్యమెట్లుకాకుండును?

---

9. అనువాదకాదృతములగు మూలశ్లోకపాఠములు -
"1) వ్యాజం ప్రకల్పిత॥ ప్రాప్తిం విశంక్య" అనునవి.

10 లక్ష్యే చ అలంకారరహితమపి కేవలగుణసత్క్రియమాణశబ్దార్థశరీరం కావ్యం దృశ్యతే। యథా అమరుకస్య కవేః అనిబద్ధశృంగారరసస్యందీ శ్లోకః— "కథమపి కృతప్రత్యాసత్తౌ — తతః" నఖల్వత్ర అర్థాలంకారః కశ్చిత్పరిదృశ్యతే। అథ మాధుర్యౌజోభ్యాం పరిబృంహితస్య ప్రసాదస్య విద్యమానత్వాత్ కావ్యరూపతా॥
—భట్టేందురాజలఘువివృతి (ఉద్భటకావ్యా 6 . 7 వృత్తి)

11 క్వాపీత్యనేనైతదాహ—యత్ సర్వత్ర సాలంకారౌ, క్వచిత్తు స్ఫుటాలంకారవిరహేఽపి న కావ్యత్వహానిః॥ (కావ్యప్రకాశ 1 1 సూత్రవృత్తి)

రత్నము[12] తాను కీటానువిద్ధమయినంతమాత్రమున రత్నము కాకుండునా? కావుననే అవిమృష్టవిధేయాంశరూపదోషమున్నను, ఈశ్లోకము ఉత్తమకావ్య శ్రేణికిఁజెందినదిగా కీర్తింపఁబడినది. చూడుడు—

న్యక్కారో హ్యయమేవ మే యదరయస్తత్రాప్యసౌ తాపసః
సోఽప్యత్రైవ నిహంతి రాక్షసకులం జీవత్యహో! రావణః।
ధిగ్ధిక్ఛక్రజితం ప్రబోధితవతా కిం కుంభకర్ణేన వా
స్వర్గగ్రామటికావిలుంఠనవృథోచ్ఛూనైః కిమేభిర్భుజైః॥ [13]

(హనుమన్నాటక చతుర్థాంక)

[ న్యక్కృతిదేగ నాకరులన్ అటనుం దవిసీతఁడాతఁడున్
ఇక్కడె కూల్చుదైత్యకులమింకను నూరుచు రావణుండహో!
ధిక్కృతి శక్రజిత్తునకు, తెల్పిననేమి ఘటశ్రవున్ హవి
ర్భుక్కులపల్లెదోపువితబొంగినయీభుజముల్ మఱేటికిన్

—ఆంధ్రధ్వన్యా పుట. 399]

రావణుఁడు తన మానసికక్షోభను వెళ్ళగక్కుచు పలికినఈపలుకులలో 'ఏషా న్యక్కృతిరేవ మే'(ఇయ్యది నా కవమానము)అనియుండుటకుబదులు 'నక్కారోహ్యయమేవ' (అవమానమిది నాకు)అనియుండుటచే—"విలుంఠనకృతా వ్యర్థా భుజోచ్ఛూనతా" (భుజములబలుపు వ్యర్థము)అనియుండుటకు బదులు—'విలుంఠనవృథోచ్ఛూనైః' (వ్యర్థముగా బలిసిన భుజములు)అనియుండుట చేతను "అనువాద్యాంశము మొదటనిడి పిమ్మట విధేయాంశమునుంచవలె" ననునియమము పాటింపఁబడలేదుకావున ఈరెండును అవిమృష్టవిధేయాంశ దోషములైనవి అయినను ఈశ్లోకమందలిప్రతిపదమును విశిష్టమగువ్యంగ్యార్థ మును స్ఫురింపఁజేయుటచేనిది ఉత్తమకావ్యశ్రేణికిఁ జెంది కవికి అనన్య—

---

12 కీటానువిద్ధరత్నాదిసాధారణ్యేన కావ్యతా ।
దోషేష్వపి మతా యత్ర రసాద్యనుగమః స్ఫుటః॥ (సా ద 12 కా.వృత్తి)

13. క) ఈ శ్లోకము పూర్వము (పు 144) ఉదాహరింపఁబడినది—
ఖ) —ఉద్ధృతము (ధ్వన్యాలోక 3 . 16 కారికా. వృత్తిలో)

సామాన్యయశమును చేకూర్చినది.[14] కాన కావ్యమున దోషరాహిత్యము నియతముకాదు

అట్లే రసస్యందియగు ఒకానొకపద్యమున రసోత్కర్షాపాదకమగు నే గుణము లేకపోవచ్చును అంతమాత్రముననది కావ్యము కాకుండునా?

శృంగారరసస్యందియగు ఈయమరుకకవిశ్లోకమున ఏగుణము కాని ఏయలంకారముకాని లేదు—

శూన్యం వాసగృహం విలోక్య శయనాదుత్థాయ కించిచ్ఛనై-
ర్నిద్రావ్యాజముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖమ్ ।
విస్రబ్ధం పరిచుంబ్య జాతపులకామాలోక్య గండస్థలీం
లజ్జా నమ్రముఖీ ప్రియేణ హసతా బాలా చిరం చుంబితా॥ [15]

(అమరుక. శ్లో. 84)

[ చెలు లేగంగనె పాన్పునుండి చెలి కొంచెం బల్లనన్ లేచి ని
ద్రిలుచున్నటులనున్నకాంతుమొగ మెంతేసేపు వీక్షించి య
ర్మిలి ముద్దాడుమ గండపాళి బులకల్ దేరంగ నీక్షించి సి
గ్గలమన్ వంచె మొగమ్ము నవ్వుచుఁ జిరంబాచెల్వుఁడున్ ముద్దిడెన్॥
—అమరుకావ్యము పద్య. 74]

14. క) అత్ర—"అయమేవ న్యక్కార" ఇతి వాచ్యమ్। ఉచ్ఛూనత్వమాత్రం చాను-వాద్యమ్। న వృథాత్వవిశేషితమ్। అత్ర చ శబ్దరచనా విపరీతా కృతేతి వాక్యస్యైవ దోషో న వాక్యార్థస్య॥ (కావ్య 7 . 183 ఉదా వృత్తి)

ఖ) తథాచ — 'అయం'పద—'న్యక్కార'పదయోః ఉద్దేశ్యవిధేయార్థకత్వేన వివక్షితయోః పౌర్వాపర్యవిపర్యయో దోషః "అనువాద్యమనుక్త్వైవ న విధేయ ముదీరయేత్। న హ్యలబ్ధాస్పదం కించిత్ కుత్రచిత్ ప్రతితిష్ఠతి॥" ఇతి వృద్ధవచనేన తయోః పౌర్వాపర్యస్య నియమితత్వాత్॥
—బాలబోధినీ (కావ్య. 7 183 ఉదా )

గ) అత్ర హి శ్లోకే భూయసా సర్వేషామప్యేషాం స్ఫుటమేవ వ్యంజకత్వం దృశ్యతే। . ఏవంవిధస్య వ్యంజకభూయస్త్వే చ ఘట-మానే కావ్యస్య సర్వాతిశాయినీ బంధచ్ఛాయా సమున్మీలతి। ... . ... దృశ్యంతే చ మహాత్మనాం ప్రతిభావిశేషభాజాం బాహుల్యేనైవంవిధా బంధప్రకారాః॥ (ధ్వన్యా 3 16 కా "న్యక్కారో" శ్లోకవృత్తి)

15. —ఉద్ధృతము (కావ్యప్రకాశ. 4 30)/(సా ద ప్రథమ కావ్యలక్షణమున)

ఇట నాయకుఁడాలంబనవిభావము. వాసగృహము జనరహితమై యుండుటయు, నాయకుఁడు నిద్రించియుండుటయును ఉద్దీపనవిభావములు ముఖనిర్వర్ణనచుంబనములు అనుభావములు లజ్జ వ్యభిచారిభావము వీనిచే నాయికకు నాయకునియెడఁగల రతి యభివ్యక్తమగుచు చర్వణావిషయమై శృంగారరసధ్వని యగుచున్నవి [16] కావున నిది ఉత్తమకావ్యము. ఇట నేయలంకారము లేదు మఱియు రసోత్కర్షాపాదకమగు నేగుణమును లేదు సరికదా శృంగారరసమునకు ప్రతికూలమగు వర్ణరచన యున్నది [17] కావుననే ఈశ్లోకము రసగంగాధరకారులవిమర్శకు గుఱియయినది.[18] కాని శృంగార రసనిష్యందియగు నీశ్లోకమును మమ్మటాదులు ఉత్తమకావ్యముగా పరిగణించి యున్నారు [19]

---

16 'అత్ర సంభోగశృంగారాఖ్యో రసః॥ (సా ద ప్రథమ కావ్యలక్షణ)

17. శషౌ సరేఫసంయోగౌ ఢకారశ్చాపి భూయసా ।
విరోధినః స్యుః శృంగారే తేన వర్ణా రసచ్యుతః॥ (ధ్వన్యా. 3 . 3)

18 అత్ర— "ఉత్థాయ కించిచ్ఛనై"రిత్యత్ర సవర్ణయుయ్ద్వయసంయోగః తత్రాపి నైకత్యేనేతి సుతరామశ్రవ్యః। ఏవం యుయ్ఘటితసంయోగపర-హ్రస్వస్యాపి। తథా—'శనైర్నిద్రే'త్యత్ర, 'నిర్వర్ణ్య పత్యుర్ముఖ'మిత్యత్ర చ రేఫఘటితసంయోగస్య, యుయ్ఘటితసంయోగపరహ్రస్వస్య చ ప్రాచు-ర్యమ్। 'విస్రబ్ధ'మిత్యత్ర మహాప్రాణఘటితస్య, 'లజ్జే'త్యత్ర స్వాత్మసవర్ణ-యుయ్ద్వయఘటితస్య, 'ముఖీ ప్రియేణే'త్యత్ర భిన్నపదగతదీర్ఘానంతరస్య సంయోగస్య తథా క్త్వాప్రత్యయస్య పంచకృత్వః, లోకతేశ్చ ధాతోః ద్విఃప్రయోగః, కవేర్నిర్మాణసామగ్రీదారిద్ర్యం ప్రకాశయతి॥
—పండితరాజజగన్నాథ (రసగం. ప్రథమ.)

19 సంభోగశృంగారమున కీశ్లోకముదాహరింపబడినది— (1) కావ్యప్రకాశ. 4 . 30 (2) హేమచంద్రకావ్యానుశాసన. 1 . 11 సూత్రవృత్తిలో. (3) నరేంద్రప్రభసూరి అలంకారమహోదధి 3 15 కా. వృత్తిలో. (4) ఈ శ్లోకము ఉదాహృతపూర్వము (పు. 122.)

విశ్వనాథకవిరాజు కావ్యనిర్వచనము —

ఇట్లు కావ్యమునకు, గుణాలంకారసాహిత్యము దోషరాహిత్యము అనునవి నియతములు కాకుండుటయును, రసమే జీవాతువగుటయును, మనమున భావించిన విశ్వనాధకవిరాజు కావ్యమనఁగా రసాత్మకవాక్య మని నిర్వచించి, దానికి పూర్వశ్లోకమునే యుదాహరించి కావ్యమున రసప్రాధాన్యము నుగ్గడించెను ఇట రసములన కేవలముగా శృంగారాదులే కాదు- 'రస్యంతే ఇతి రసాః' అను వ్యుత్పత్తిచే మధురాదిరసములవలె నాస్వాదింపఁబడునవియన్నియును రసములే యగును కాన 'రస'పదముచే భావతదాభాసాదులు కూడ సంగ్రహింపఁబడెను 20

పండితరాయల కావ్యనిర్వచనము -

ఇది సరియేకాని వస్త్వలంకారప్రధానములగు కావ్యములకు ఈ కావ్య లక్షణ మెట్లనుగుతమగును? మహాకవులట్లు రచించుచుండ వానిని కావ్యములే కాదనుట ఎట్లు? పరంపరాసంబంధమున వానికిని రసస్పర్శ కల్పింతుమేని 'ఆవు పరుగెత్తుచున్నది' అనువాక్యమునకును ఏదోవిధమున రసస్పర్శయుండనే యున్నది అట్టివాక్యమును కావ్యమే యగునా? కాదుగదా! రసాదిరూపవ్యంగ్యార్థము కావ్యమునకుత్కర్షను కలిగించునట్లు వస్త్వలంకారరూపవ్యంగ్యార్థములే కాక వాచ్యార్థములును కావ్యోత్కర్షాధాయకములై యుండుటచే, కావ్యమునకు వన్నెతెచ్చునర్థము సహృదయహృదయాహ్లాదకమయి యుండవలయునే కాని అది రసమా? వస్త్వలంకారాదులా? వ్యంగ్యమా? వాచ్యమా? అను భేదము పరిశీలింప పనిలేదని[21] యెంచి రసగంగాధరకారులు "రమణీయమగునర్థమును

---

20 క) "వాక్యం రసాత్మకం కావ్యమ్' (సా ద. ప్రథమ కావ్యలక్షణ.)

ఖ) రస ఏవాత్మా సారరూపతయా జీవనాధాయకో యస్య। తేన వినా తస్య కావ్యత్వానంగీకారాత్। 'రస్యతే ఇతి రసః' ఇతి వ్యుత్పత్తియోగాత్ భావతదాభాసాదయోఽపి గృహ్యంతే॥ (సా ద ప్రథమ కావ్యలక్షణ.)

గ) రసనాద్రసత్వమేషాం మధురాదీనామివోక్తమాచార్యైః ।
నిర్వేదాదిష్వపి తన్నికామమస్తీతి తేఽపి రసాః ॥
(రుద్రటకావ్యా. 12 4)

21. యత్తు "రసవదేవ కావ్య"మితి సాహిత్యదర్పణే నిర్ణీతం, తన్న। వస్త్వలంకారప్రధానానాం కావ్యానామకావ్యత్వాపత్తేః। న చేష్టాపత్తిః। మహాకవి-

ప్రతిపాదించుశబ్దమే కావ్య"మని నిర్వచించి ఈవిషయమున దండినే యనుకరించెను[22].

శబ్దార్థములు కావ్యమనుటలో నియామాంతర్యము :—

అర్థము రమణీయమై యుండవలెనని నుడువుచు పండితరాయలు అర్థ విషయమున దృష్టిని కేంద్రీకరించెనేకాని శబ్దరామణీయకమును గూర్చి విచారింపఁడయ్యెను. కావ్యమున అర్థమునకెంత ప్రాధాన్యమో శబ్దమునకును అంత ప్రాధాన్యమున్నది కావుననే సత్కవులు శబ్దార్థములరెండింటివిషయమునను కడుశ్రద్ధ వహింతురని మాఘకవి నుడివెను[23] గుణములు అలంకారములును శబ్దార్థగతములై యుండి యారెంటికిని వన్నె పెకూర్చుచునే యున్నవి అట్లే దోషములును శబ్దార్థగతములగుచు ఆరెంటికిని వన్నె తఱుఁగఁజేయుచున్నవి ఇట్లుండ అర్థరామణీయకమును నిర్దేశించి శబ్దరామణీయకమును పేక్షింపఁదగునా ? కావుననే ప్రాచీనులు శబ్దార్థోభయరామణీయకావశ్యకత నుగ్గడింపఁదలఁచి తదుభయసౌందర్యహేతువులగు గుణాలంకారసాహిత్యమును దోషరాహిత్యమును లక్షణమున సంగ్రహింపఁదలఁచియు శబ్దార్థములనురెండింటిని కావ్యస్వరూపముగా పేర్కొనిరి కావున సత్కవి అర్థవిషయమునవలె శబ్ద విషయమునను అవహితుఁడై యుండవలెనని ప్రాచీనులయభిప్రాయమై యున్నది

---

సంప్రదాయస్యాకులీభావప్రసంగాత్। తథా చ - జలప్రవాహవేగనిపతనోత్పతనభ్రమణాని కవిభిర్వర్ణితాని కపిబాలాదివిలసితాని చ। న చ తత్రాపి యథాకథంచిత్ పరంపరయా రసస్పర్శోఽస్త్యేవేతి వాచ్యమ్। ఈదృశరస-స్పర్శస్య'గౌశ్చలతి' 'మృగో ధావతి' ఇత్యాదావతిప్రసక్తత్వేనాప్రయోజ-కత్వాత్। అర్థమాత్రస్య విభావానుభావవ్యభిచార్యన్యతమత్వాదితి దిక్॥

—జగన్నాథపండిత (రసగం ప్రథమ. కావ్యలక్షణ)

22. క) 'రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యమ్'

—పండితరాజజగన్నాథ (రసగం. ప్రథమ)

ఖ) 'శరీరం తావదిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ' —దండి. (కావ్యా 1 . 10)

23. "నాలంబతే దైష్టికతాం న నిషీదతి పౌరుషే ।
శబ్దార్థౌ సత్కవిరివ ద్వయం విద్వానపేక్షతే॥" (శిశు. 2 . 86)

''శబ్దార్థోభయము కావ్యశరీర''మను ప్రాచీనులయభిప్రాయ సమర్థనము —

విచారించి చూచిన రసగంగాధరకారులభిప్రాయపడినట్లు శబ్దముమాత్రమే కావ్యస్వరూపముకాదు శబ్దమే కావ్యస్వరూపమని బలపఱచు "కావ్యము వింటిని కాని అర్థము తెలియలేదు" మున్నగు వ్యవహారములవలె 'శబ్దార్థోభయము కావ్యశరీర'మని వ్యక్తీకరించు 'కావ్యము తెలియనైనది' మున్నగు వ్యవహారములును లోకప్రసిద్ధములయియే యున్నవి[24]

మహాభాష్యకారులును[25] 'తదధీతే తద్వేద' (ప్రా సూ.4 2 59) అనుసూత్ర భాష్యమున వేదమనగా కేవలశబ్దము కాదనియును, శబ్దార్థోభయము వేదపద వాచ్యమగుననియును నిర్ధారించెను కాళిదాసమహాకవియును, "వాగర్థావివ సంపృక్తౌ" (రఘు 1.1) అని శబ్దార్థములకు పార్వతీపరమేశ్వరులకువలె

24 ఆస్వాదవ్యంజకత్వస్య ఉభయత్రాప్యవిశేషాత్ చమత్కారిబోధజనకజ్ఞాన-విషయతావచ్ఛేదకధర్మవత్త్వరూపస్యానుపహసనీయకావ్యలక్షణస్య ప్రకా-శాద్యుక్తలక్ష్యతావచ్ఛేదకస్యోభయవృత్తిత్వాచ్చ 'కావ్యం పఠితం' 'శ్రుతం కావ్యం' 'బుద్ధం కావ్యం' ఇత్యుభయవిధవ్యవహారదర్శనాచ్చ కావ్యపద-ప్రవృత్తినిమిత్తం వ్యాసజ్యవృత్తి। అత ఏవ వేదత్వాదేరుభయవృత్తిత్వ-ప్రతిపాదకః 'తదధీతే'ఇత్యాదిసూత్రస్థో భగవాన్ పతంజలిః సంగచ్ఛతే। లక్షణయా అన్యతరస్మిన్నపి తత్త్వాదేకో న ద్వావితివన్న తదాపత్తిః। తేన అనుపహసనీయకావ్యలక్షణం ప్రకాశోక్తం నిర్బాధమ్॥
—మర్మప్రకాశ. (రసగం. ప్రథమ కావ్యలక్షణ)

25 'తదధీతే తద్వేద' కిమర్థమిమావుభావప్యర్థౌ నిర్దిశ్యేతే। న యోఽధీతే వేత్త్యప్యసౌ। యన్న వేద అధీతేఽప్యసౌ। నైతయోరావశ్యకః సమావేశః। భవతి హి కశ్చిత్ సంపాఠం పఠతి న వేత్తి। తథా కశ్చిద్ వేత్తి న సంపాఠం పఠతి।" ఇతి భాష్యమ్। అత్ర కైయటః-న య ఇతి। యో హి యం గ్రంథ-మధీతే స తం స్వరూపతోఽవశ్యం వేత్తి। యశ్చ స్వరూపతో వేత్తి సోఽవ-శ్యమధీతే ఇతి భావః। నైతయోరితి। అర్థావబోధో వేదనమభిప్రేతం న తు స్వరూపమాత్రవేదనమ్। తత్ర పరస్పరవ్యభిచారదర్శనాత్ ఉభయోపాదాన మిత్యర్థః। సంపాఠమితి। అర్థనిరపేక్షం స్వాధ్యాయం పఠతీత్యర్థః। ఇతి ॥
—ఉద్ధృతము-బాలబోధినీ-టిప్పణము. (కావ్యప్రకాశ 1 1 సూ)

నవినాభావసంబంధము సూచించెను శబ్దముతో నవినాభావసంబంధముగల వాచ్యార్థము కావ్యశరీరఘటకము కాఁగా వ్యంగ్యార్థము కావ్యాత్మగా స్థిరపడుటలో నేయాటంకము లేకపోవుటచే "శబ్దార్థములు రెండును కావ్యశరీర"మను ప్రాచీనుల యభిప్రాయము సమంజసమయియే యున్నది.

కావ్యవిభాగము :—

కావ్యము ఉత్తమమధ్యమాధమభేదమున త్రివిధమై విలసిల్లుచున్నది [26]

1) ఉత్తమకావ్యము :—

వ్యంగ్యార్థము వాచ్యార్థమునకంటె నతిశయచమత్కారియై ప్రధానముగా నుండు కావ్యముత్తమము దీనినే ధ్వనికావ్యమందురు ధ్వనికావ్యమున శబ్దార్థములు రెండును గుణీభావము నొందియుండును. గుణాలంకారాదికృతమగు శబ్దార్థచమత్కృతి ఇట నియతముగా నపేక్షింపఁబడదు. వ్యంగ్యార్థమే లోకోత్తరచమత్కారియై యుండును [27]

---

26 వ్యంగ్యస్య ప్రాధాన్యాప్రాధానాభ్యామస్ఫుటత్వేన చ త్రివిధం కావ్యమ్॥
(ప్ర రు కావ్యప్రకరణ)

27. క) 'ఇదముత్తమమతిశయిని వ్యంగ్యే వాచ్యాద్ధ్వనిర్బుధైః కథితః॥
(కావ్య 1 . 74)

ఖ) వ్యంగ్యస్య ప్రాధాన్యే కావ్యముత్తమమ్॥ (కావ్యాను 2 . 56)

గ) తత్పరావేవ శబ్దార్థౌ యత్ర వ్యంగ్యం ప్రతి స్థితౌ।
ధ్వనేః స ఏవ విషయో మంతవ్యః సంకరోజ్ఝితః॥
(ధ్వన్యా 1 . 13 వృత్తిలో)

ఘ) వ్యంగ్యస్య ప్రాధాన్యే ఉత్తమం కావ్యం ధ్వనిరితి వ్యపదిశ్యతే॥
(ప్ర రు కావ్యప్రకరణ.)

ఙ) యస్మిన్ శబ్దార్థయోరన్యత్ నిర్దోషత్వసగుణత్వసాలంకారత్వరూపం వైచిత్ర్యం తిరస్కుర్వాణో వ్యంజకీభావః ప్రదీప్యతే తత్ కావ్యముత్తమం ధ్వనిరిత్యుచ్యతే॥ (అలం. మహో. 1 15 వృత్తి)

ఉదా —

శయితా సవిధేఽప్యనీశ్వరా సఫలీకర్తుమహో! మనోరథాన్।
దయితా దయితాననాంబుజం దరమీలన్నయనా నిరీక్షతే॥
(రసగం ప్రథ కావ్యలక్షణ)

[కం. దరి శయనించియు మదిలోఁ
జరించు కోరికలఁ దీర్పఁజాలనిదై తా-
నర మోడుపుకన్నులతో
నరయఁదొడగెఁబ్రియ ప్రియతమునాస్యాంబుజమున్.
—సా సౌ ద 135 పుట]

ఇట[28] నాయకుఁడాలంబనవిభావము- నాయిక నాయకునిదరిఁజేరి పవ్వళించియుండుటచే నాక్షిప్తమగు ఏకాంతస్థానముద్దీపనవిభావము అట్లు నాయకుని కనుగొనుట యనుభావము- సిగ్గు ఔత్సుక్యమును వ్యభిచారిభావములు వీనిచే నాయికకు నాయకునియెడగల రతి యభివ్యక్తమగుచు నిది శృంగారరసధ్వని యగుచున్నది ఇట శృంగారరసము చర్వణావిషయమగుచు లోకోత్తరచమత్కారమునొనఁగూర్చుచున్నది ఇది రసధ్వని

ఇట్లు వస్త్వలంకారధ్వనులను కూడ నుదాహరింపవచ్చును 'ధ్వని-వాని బేదములు' అనుప్రకరణమున (పుట 84-152) వివరింపఁబడిన వస్త్వలంకార రసాదిధ్వనులన్నియును ఉత్తమకావ్యశ్రేణికే చెందును

11) మధ్యమకావ్యము :-

వ్యంగ్యము[29] వాచ్యార్థమునకంటెనతిశయితచమత్కారాధాయకము

---

28 అత్రాలంబనస్య నాయకస్య సవిధశయనాక్షిప్తస్య రహఃస్థానాదేరుద్దీపనస్య చ విభావస్య, తాదృశనిరీక్షణాదేరనుభావస్య, త్రపౌత్సుక్యాదేశ్చ వ్యభిచారిణః సంయోగాద్రతిరభివ్యజ్యతే॥
[రసగం (నిర్ణ సం 1947) ప్రథమ పుట. 12)

29. క) "అతాదృశి గుణీభూతవ్యంగ్యం వ్యంగ్యే తు మధ్యమం" (కావ్య 15 కా)
ఖ) "తయోర్యత్రాన్యవైచిత్ర్యాత్ వ్యంజకత్వస్య గౌణతా।
తన్మధ్యమం గుణీభూతవ్యంగ్యం కావ్యం నిగద్యతే॥"
(అలం. మహో. 1 . 16)

కాకుండెనేని మధ్యమకావ్యమగును దీనినే గుణీభూతవ్యంగ్యమందురు పూర్వోదాహృతములగు (పుట. 306 - 321) అష్టవిధగుణీభూతవ్యంగ్యములును ఈ మధ్యమకావ్యశ్రేణికే చెందును మచ్చునకొకయుదాహరణము—

గ్రామతరుణం తరుణ్యా నవవంజులమంజరీసనాథకరమ్ ।
పశ్యంత్యా భవతి ముహుర్నితరాం మలినా ముఖచ్ఛాయా॥

[30]సంకేతమునేర్పఱచుకొనియు ఇంటిపనులలో మునిగి తానచ్చోటికి వెళ్ళలేకయున్న ఒకానొక పల్లెపడుచునవస్థను వర్ణించున దీ శ్లోకము ఇట- కొంగ్రొత్త యశోకమంజరిని చేతఁబూనివచ్చినపల్లెటూరిపడుచువాని చూచుచున్న ఆ పల్లెపడుచుదాని మొగముకవళికలు మాసిపోయెనను వాచ్యార్థమునకంటె, "అశోకలతామంటపమునకు సంకేతము నేర్పఱచియు రాకుంటివి" అను వ్యంగ్యము - అంత చమత్కారి కాకున్నది కావున- నిది "అసుందరరూప గుణీభూతవ్యంగ్యము' అను మధ్యమకావ్యము [31]

**అధమకావ్యము :-**

వ్యంగ్యకృతచమత్కారములేకయుండి శబ్దార్థములచే నేర్పడునొకానొక అలంకారచమత్కారముమాత్రమున్న నది అధమకావ్యము దీనినే చిత్రకావ్యమని యందురు [32] ఇది శబ్దచిత్రమనియును అర్థచిత్రమనియును ద్వివిధము-

---

30 స్వయమేవ సంకేతం కృత్వా గృహకార్యవ్యాసంగవశేన సంకేతస్థానమనాగతాయాః సంకేతస్థానగమనం జ్ఞాపయితుం తత్రత్యవంజులమంజరీమాదాయ ఉపాగతముపనాయకం దృష్ట్వా విషణ్ణాయాః కస్యాశ్చిదుపనాయికాయా విప్రలంభాభాసవర్ణనమిదమ్॥ —బాలబోధినీ (కావ్య 1 3)

31. అత్ర "వంజులలతాగృహే దత్తసంకేతా నాగతే"తి వ్యంగ్యం గుణీభూతం, తదపేక్షయా వాచ్యస్యైవ చమత్కారిత్వాత్। (కావ్య 1 13 కా. వృత్తి)

32 క) రసభావాదివిషయవివక్షావిరహే సతి ।
అలంకారనిబంధో యః స చిత్రవిషయో మతః॥ (ధ్వన్యా. 3 42వృత్తిశ్లో.)

ఖ) "యత్ర వ్యంజనవైచిత్ర్యచారిమా కోఽపి నేక్ష్యతే ।
కావ్యాధ్వని సదాఽధ్వన్యైస్తత్కావ్యమవరం స్మృతమ్ ॥"
(అలం. మహో. 1 . 17)

శబ్దార్థచమత్కృతులు సమప్రధానములైయున్న "ఉభయచిత్ర"మని తృతీయ ప్రకారమును విద్యానాథుఁడు తెల్పెను [33]

శబ్దచిత్రమిట్లుండును. ఉదా .—

మిత్రాత్రిపుత్రనేత్రాయ త్రయీశాత్రవశత్రవే ।
గోత్రారిగోత్రజత్రాయ గోత్రాత్రే తే నమో నమః॥ (రసగం ప్రథమ)

"సూర్యచంద్రులు నేత్రములుగా గలవాడవును, వేదశత్రువులగు దైత్యులకు శత్రువయినవాఁడవును ఇంద్రపక్షీయులగు దేవతలను రక్షించువాఁడవును, భూమిని రక్షించువాఁడవును అగు ((అనఁగా) హరి స్వరూపుఁడవగు) నీకు నమస్కారము" అని తా ఇట అర్థచమత్కృతి శబ్దచమత్కృతిలో లీనమైయుండుటచే శబ్దచమత్కృతికే ప్రాధాన్యమున్నది [34] కావున నిది శబ్దచిత్రము.

అర్థచిత్రము :—

వాచ్యాలంకారచమత్కృతి ప్రధానమైయుండునది అర్థచిత్రము ఉదా.—

వినిర్గతం మానదమాత్మమందిరాత్-
భవత్యుపశ్రుత్య యాదృచ్ఛయాపి యమ్।
ససంభ్రమేంద్రద్రుతపాతితార్గళా
నిమీలితాక్షీవ భియాఽమరావతీ॥[35]

మానదుఁడగు (శత్రువుల యభిమానమునడఁచువాఁడును మిత్రులకు సమ్మానము చేయువాఁడును అగు) ఆ హయగ్రీవుఁడు తన నివాసభవనమునుండి

---

గ) చిత్రం శబ్దార్థభేదేన ద్వివిధం చ వ్యవస్థితమ్।
తత్ర కించిచ్ఛబ్దచిత్రం వాచ్యచిత్రమతః పరమ్॥ (ధ్వన్యా. 3 42)

ఘ) శబ్దచిత్రం వాచ్యచిత్రమవ్యంగ్యమవరం స్మృతమ్॥ (కావ్య 1 . 5)

33 చిత్రం త్రివిధం - శబ్దచిత్రమర్థచిత్రముభయచిత్రం చేతి॥
(ప్రతాపరుద్రీయ కావ్యప్రకరణ.)

34 అత్ర అర్థచమత్కృతిః శబ్దచమత్కృతౌ లీనా॥ (రసగం ప్రథమ.)

35 హయగ్రీవనామా దైత్యో విష్ణునా హతః ఇతి పురాణకథాశ్రితే కాశ్మీరిక-మేంఠ(భర్తృమేంఠ)కవిప్రణీతే హయగ్రీవవధాఖ్యే నాటకే హయగ్రీవ-వర్ణనప్రస్తావే పద్యమిదమితి చంద్రికాదౌ స్పష్టమ్॥
—బాలబోధినీ (కావ్య 1 . 5 ఉదా.)

తన యిచ్చుచొప్పున వెడలెనను వార్త విని ఇంద్రుఁడు త్వరపడి కవాటములు మూసివేయఁగా అమరావతి భయమున కన్నులుమూసికొనినదా ? అను నట్లుండెను

ఇట[36] ఉత్ప్రేక్షాలంకారము వాచ్యార్థమునకొకవన్నెకూర్చినది కాన నిది అర్థచిత్రమైనది

విద్యానాథుఁడుభయచిత్రమునిట్లుదాహరించెను .-

విద్యాసముద్రే భువనైకభద్రే ప్రతాపరుద్రే జతవైరిభద్రే ।
రక్షావినిద్రే ధృతశౌర్యముద్రే కాంతేవ పృథ్వీ రమతే గుణార్ద్రే॥

విద్యాసముద్రుఁడును గుణార్ద్రుఁడును శౌర్యవంతుఁడును కావుననే శత్రు రాజుల జయించి ప్రజారక్షణతత్పరుఁడై లోకకళ్యాణము చేయువాఁడును అగు ప్రతాపరుద్రునియందు ఈపృధివి కాంతవలె రమించుచున్నది. ఇట శబ్దాలంకారమగు అనుప్రాసయు, అర్థాలంకారమగు ఉపమాలంకారమును సమప్రధానములై చమత్కారమునొనఁగూర్చుచున్నవి[37] కావుననిది యుభయచిత్రము

ఉభయచిత్రము ప్రాచీనులకు సమ్మతమే .-

ప్రాచీను లీ యుభయచిత్రమును తృతీయభేదముగా నోటఁజెప్పకున్నను ఏతాదృశస్థలములలో శబ్దార్థాలంకారసంసృష్టినంగీకరించియుండుటచే నిది వారికి సమ్మతమైయే యున్నది[38]

---

36. అత్ర నిమీలితాక్షీవేత్యుత్ప్రేక్షాఽర్థాలంకారః। ఉత్ప్రేక్షాయాం కవేస్తాత్పర్యాత్ సంతోఽపి వీరరసాదయో వ్యంగ్యాస్తిరోధీయంతే ఇత్యవ్యంగ్యమిదం కావ్యమ్॥ —బాలబోధినీ (కావ్య. 1 5 ఉదా)

37 అత్ర-అనుప్రాసోపమాభ్యాం చిత్రతా॥ (ప్ర రు కావ్యప్రక శ్లో 42వృత్తి)

38 యద్యప్యేతత్ ప్రాచీనాలంకారకారైర్నోదాహృతం, తథాప్యనంతర ప్రాధాన్యేనేతరభేదద్వయవదుభయప్రాధాన్యేనాస్యాపి సువచత్వాదవిరోధః। కించ- "పాదాంబుజం భవతు వో విజయాయ మంజు మంజీరశింజితమనోహరమంబికాయాః" ఇత్యత్రోపమానుప్రాసయోరన్యోన్యనిరపేక్షత్వేన సమప్రధాన భావయోః సంసృష్టిమంగీకుర్వాణైః పూర్వైరేవోభయచిత్రమప్యంగీకృతమితి విజ్ఞేయమ్॥ —రత్నాపణ (ప్ర రు. కావ్యప్రకరణ)

కావ్యవిభాగము - పండితరాయలదృక్పథము .—

పండితరాయలు కావ్యనిర్వచనవిషయమున అర్థమునకే ఎనలేనిప్రాధాన్యమును చూపినవాఁడగుటచే అర్థచిత్రము నధమకావ్యముగా పేర్కొనుట సహింపఁడయ్యెను అర్థాలంకారకృతచమత్కృతిచేనొప్పుకావ్యమును మధ్యమకావ్యముగాను గుణీభూతవ్యంగ్యమును ఉత్తమకావ్యముగాను ధ్వనికావ్యము నుత్తమోత్తమముగాను పేర్కొనుట తగుననియును, కెవలశబ్దచిత్రములగు ఏకాక్షరపద్యార్ధావృత్తియమకపద్మబంధాదులు అర్థచమత్కృతిలేశమేనిలేనివగుటచే వానిని కావ్యభేదములుగా గుర్తించవలసినపనిలేదనియును, అనుప్రాసాదిశబ్దాలంకారచమత్కృతి ప్రధానమైయుండి అర్థచమత్కృతికొంతయేని యున్నచో దానినధమకావ్యముగా పేర్కొనుట తగుననియును, ధ్వనిగుణీభూతవ్యంగ్యములకు ఆస్వాదమునగలభేదమును గుర్తించి వానిని విభిన్నకావ్యభేదములనుగా పేర్కొనియుండియు శబ్దచమత్కారమునకంటె అర్థచమత్కారముననెంతోవైశిష్ట్యమున్నను ఆరెంటిని (అర్థచిత్రశబ్దచిత్రములను) ఒకేభేదముగా ప్రాచీనులు గణించుట అసమంజసమనియును అతఁడభిప్రాయపడెను [39]

---

39 యద్యపి — యత్రార్థచమత్కృతిసామాన్యశూన్యా శబ్దచమత్కృతి స్తత్పంచమమధమాధమమపి కావ్యవిధాసు గణయితుముచితమ్। యథా ఏకాక్షరపద్యార్ధావృత్తియమకపద్మబంధాది। తథాపి రమణీయార్థప్రతిపాదకశబ్దతారూపకావ్యసామాన్యలక్షణానాక్రాంతతయా వస్తుతః కావ్యత్వాభావేన మహాకవిభిః ప్రాచీనపరంపరామనురుంధానైః తత్ర తత్ర కావ్యేషు నిబద్ధమపి నాస్మాభిర్గణితమ్। వస్తుస్థితేరేవానురోధ్యత్వాత్। కేచిదిమానపి చతురో భేదానగణయంత ఉత్తమమధ్యమాధమభావేన త్రివిధమేవ కావ్యమాచక్షతే। తత్రార్థచిత్రశబ్దచిత్రయోరవిశేషేణాధమత్వమయుక్తం వక్తుమ్। తారతమ్యస్య స్ఫుటముపలబ్ధేః। కో హ్యేవం సహృదయః స్వ "వినిర్గతం మానదమాత్మమందిరాత్" 'సచ్ఛిన్నమూలః క్షతజేన రేణుః' ఇత్యాదిభిః కావ్యైః 'స్వచ్ఛందోచ్ఛలత్' ఇత్యాదీనాం పామరశ్లాఘ్యానామవిశేషం బ్రూయాత్। సత్యపి తారతమ్యే యద్యేకభేదత్వం కస్తర్హి ధ్వనిగుణీభూతవ్యంగ్యయోరీషదంతరయోర్విభిన్నభేదత్వే దురాగ్రహః॥

(రసగం ప్రథమ. కావ్యలక్షణ)

ఏకాక్షర పద్మబంధాదులు కావ్యములు కావా ?

పండితరాయల ఈ యభిప్రాయము కొంతవరకు తగియున్నది కాని ఏకాక్షరపద్యావృత్తియమకపద్మబంధాదులు కావ్యములనుటకు ననర్హములే యనుట అంత సమంజసముగా తోచుటలేదు మమ్మటాది ప్రాచీనాలంకారికులు ఖడ్గ - మురజ - పద్మబంధాదులను చిత్రకావ్యములనుగా గుర్తించియే యున్నారు.[40] చమత్కారము కావ్యజీవాతువై యుండ శబ్దగతమగు చమత్కారాతిశయమును త్రోసిరాజనుట ఉచితము కాదని భావించియే భారవిమాఘాది మహాకవులు తమ తమ కావ్యములలో ఏకాక్షరపద్మబంధాదిశబ్దాలంకారముల కొకసర్గమునే ప్రత్యేకించియున్నారు మహాకావ్యగతములగు నా భాగములను కావ్యము కాదని యనగలమా ? విశ్వనాథకవిరాజు నధిక్షేపించు సందర్భమున మహాకవిసంప్రదాయమునంతగా గౌరవించిన పండితరాయలు తానుగా మహాకవిసంప్రదాయమును శిథిలీకరించుట చెల్లునా ? చిత్రమనునది కావ్యభేదముగా నంగీకరించుటకుఁ గల కారణము నుపపాదించుచు[41] ధ్వనికారులు "వస్త్వలంకారరూపములగు సర్థములకన్నింటికిని ఏదోవిధమున రసస్పర్శ యుండనే యుండును అంతమాత్రము సరిపోదు కవివివక్షయు నుండవలెను కవియభినివేశము శబ్దాలంకారముననో అర్థాలంకారముననో యున్న నా యంశమునే కావ్యమందుము కవులొకప్పుడు రసాదితాత్పర్యము

---

40 తచ్చిత్రం యత్ర వర్ణానాం ఖడ్గాద్యాకృతిహేతుతా॥ (కావ్య 9 85 కా.)

41 కింతు యదా రసభావాదివివక్షాశూన్యః కవిః శబ్దాలంకారమర్థాలంకారం వోపనిబధ్నాతి, తదా తద్వివక్షాపేక్షయా రసాదిశూన్యతాఽర్థస్య పరికల్ప్యతే। వివక్షోపారూఢ ఏవ హి కావ్యే శబ్దానామర్థః। వాచ్యసామర్థ్యవశేన చ కవివివక్షావిరహేఽపి తథావిధే విషయే రసాదిప్రతీతిర్భవంతీ పరిదుర్బలా భవతీత్యనేనాపి ప్రకారేణ నీరసత్వం పరికల్ప్య చిత్రవిషయో వ్యవస్థాప్యతే। తదిదముక్తమ్" రసభావాదివిషయవివక్షావిరహే సతి అలంకారనిబంధో యః స చిత్రవిషయో మతః॥ రసాదిషు వివక్షా తు స్యాత్ తాత్పర్యవతీ యదా। తదా నాస్త్యేవ తత్కావ్యం ధ్వనేర్యత్ర న గోచరః॥" ఏతచ్చ చిత్రం కవీనాం విశృంఖలగిరాం రసాదితాత్పర్యమనపేక్ష్యైవ కావ్యప్రవృత్తిదర్శనాదస్మాభిః పరికల్పితమ్॥ (ధ్వన్యా. 3 42 కా. వృత్తి)

నపేక్షింపకయే విశృంఖలులై కావ్యముల రచియింతురు అప్పు డా శబ్దాలంకారాదులకే ప్రాధాన్యముండును కావున నచ్చోట దానికే కావ్యవ్యవహారము దీనిని మనమున నిడియే "చిత్ర"మను కావ్యభేదము కల్పింపవలసి వచ్చినది" అని వివరించిరి.

కావున చిత్రములగు ఏకాక్షరపద్మబంధాదులును కవిప్రతిభా వైశిష్ట్యమునకు మచ్చుతునకలై సహృదయుల నచ్చెరువులో ముంచెత్తునవి యగుటచే కావ్యములే యగును

## కావ్యనిర్వచనము - పాశ్చాత్య విద్వాంసులు

కావ్యనిర్వచనవిషయమున పాశ్చాత్యవిమర్శకులయభిప్రాయమిట్లున్నది-

"ఆవేశమప్రయత్నముగా మూర్తీభవించియుండు పదములును భావములును గాక కవిత్వమన నింకేమి?"[42] అని 'జాన్‌స్టుఆర్ట్‌మిల్' అనువిమర్శకుడు తనయభిప్రాయమును వెలిపుచ్చెను

"శక్తిమంతములగు భావములు సహజముగానుప్పొంగుటయే సత్కవిత్వ"మని 'వర్డ్సువర్త్' వచించెను [43]

"ఉప్పొంగిపోవుభావప్రవాహమునకు పరీవాహమే కవిత్వ"మని 'జాన్ కేబెల్' నుడివెను [44]

"భావనావ్యక్తీకరణమే కవిత్వమని స్థూలముగా నిర్వచింపవచ్చును" అని 'షెల్లీ' ఉగ్గడించెను [45]

---

42 'What is poetry but the thoughts and words in which emotion spontaneously embod es itself' —John Stuart Mill
—ఉద్ధృతము (సాహిత్యశిల్పసమీక్ష పుట 40నుండి)

43 'All good poetry is the spontaneous overflow of powerful feelings' —Wordsworth
—ఉద్ధృతము (సాహిత్యదర్శనము. పుట 52 నుండి)

44. 'Poetry is a vent for over-charged feelings'
—ఉద్ధృతము. (సాహిత్యసోపానములు. పుట 20నుండి)

45 'Poetry, in a general sense may be defined as the expression of imagination' —'Shelly'
—ఉద్ధృతము. (సా. శి. స పుట 41 నుండి)

"భావనకొకవిధమైన భ్రాంతిని కలిగించునట్లు పదములనుపయోగించు కళయే కవిత్వ"మని 'మెకాలే'యు 46 "సౌందర్యమును గణబద్ధముగా(లయాన్వితముగా) సృజించుటయే కవిత్వ'మని 'ఎడ్గార్‌అవెలాసో' అను పండితుడును 47 "భావనావేశములను వ్యక్తముచేయుభాష కవిత్వ"మని 'హైలిట్' అను విద్వాంసుఁడును, 48 "ఛందోమయభాషలో భావనయొక్కయును వేదనయొక్కయును; ఆలోచనయొక్కయును సముచితవ్యక్తీకరణమువలన ఆనందమును పుట్టించుకళయే కవిత్వము"ని ప్రొఫెసర్ 'కోర్థాప్' అను 49 విద్యావేత్తయును, "కవిత్వమన ఛందోబద్ధమైన రచనావిశేషము, అది హేతువాదసాహాయ్యమున సత్యమును ఆనందముతో సమ్మేళనముచేయు కళయే"యని 'జాన్సన్' అను పండితుఁడును, 50 "శ్రవణసుఖగమగు నర్థమును కవిత్వమందు"మని 'కార్లైల్' అనుమహాశయుఁడును, 51 అభిప్రాయపడిరి

46 The art of employing the words in such a manner as to produce an illusion on the imagination
—ఉద్ధృతము (కావ్యసోపానములు పుట 20నుండి)

47 'The rhythmic creation of beauty'
—ఉద్ధృతము ("సన్నిధానం" వారి కావ్యా సం పుట 112నుండి)

48 క) 'Poetry is the language of imagination and the passion'
—Haylitt
—ఉద్ధృతము (సాహిత్యదర్శనము పుట 56నుండి)

ఖ) ఈ కవిపేరు 'Hazlitt'అని 'సాహిత్యశిల్పసమీక్ష' (పుట 42)లో కలదు'

49. 'Poetry is the art of producing pleasure by the just expression of imagination, thought and feeling in metrical language'
—Prof Courthope
—ఉద్ధృతము (సా. శి స పుట 44 నుండి)

50 Poetry, Says Johnson, is metrical composition, it is the art of uniting pleasure with truth, by calling forth imagination, to the help of reason
—ఉద్ధృతము (ఆచార్య K V నరసింహంగారి సా దర్శ. పుట 51నుండి)

51. 'Poetry we will call Musical thought' —Carlyle
—ఉద్ధృతము. (సా శి.స పుట 41నుండి)

పరిణతబుద్ధులను పాశ్చాత్యవిమర్శకులు కావ్యసౌందర్యాధాయకము లగు రసభావాలంకారాదులను గూర్చి ప్రాచ్యలాక్షణికులవలె నంతగా నిశిత పరిశీలన చేయకున్నను వారి కావ్యనిర్వచనములు మనలాక్షణికులనిర్వచన ములతో కొంతవఱకైనను సంవాదమొందుచున్న వనుటలో సందియము లేదు. వారిలో 'జాన్‌స్టుఆర్టుమిల్" "వర్డ్సువర్తు" "కెబెల్" మున్నగువారు విశ్వ నాథుని "వాక్యం రసాత్మకం కావ్యమ్" అను లక్షణమును తలపించుచున్నారు "షెల్లీ' మెకాలే" మున్నగువారు భావనాసామాన్యముననే ఒక యందముండ వలెనని అభిప్రాయపడినట్లు వ్యక్తమగుటచే మమ్మటుని కావ్యలక్షణము ననుక-రించినట్లయినది "కార్లైల్' అను పండితుని "Musical thought" అను కావ్యనిర్వచనము "రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యమ్" అను పండిత రాయల కావ్యలక్షణముతో సరిపడునట్లు పైకి తోచినను అతని "Music" పద నిర్వచనమును[52] పరిశీలించిన నతఁడును శబ్దార్థోభయరామణీయకము నభిలషిం చినవాఁడని పొడకట్టుటచె "శబ్దార్థౌ కావ్యమ్" అను ప్రాచీనుల లక్షణమునే తలపింపఁజేయునని తెలును

పాశ్చాత్యవిమర్శకులును కావ్యమునకు పరమప్రయోజనము ఆనందమే యని యభిప్రాయపడినట్లు వారి కావ్యనిర్వచనములు వ్యక్తీకరించుచున్నవి "పద్యము" అను నర్థమున రూఢమయిన "కవిత్వ" మను పదమునకును గద్య పద్యోభయార్థకమై ప్రసిద్ధివడసిన 'కావ్య' మను పదమునకును ఆంగ్లమున "Poetry" అను ఒకే ఒక పదమే సమానార్థకమై యుండి విటి వైలక్షణ్యా మును ప్రతిపాదించుపదాంతరము లేకుండుటచే కాబోలు 'ప్రొ॥ కోర్థోప్' కావ్య మునకు ఛందస్సుయొక్క ఆవశ్యకత నుగ్గడింపఁగా 'సర్ పిలిప్ సిడ్నీ' 'కాల్ రిడ్జి' మున్నగువారు ఉత్తమ కావ్యమగుటకు ఛందముతో నిమిత్తము లేదని వివరించవలసి వచ్చినది [53]

---

52 Music is that which penetrates the harmony of the idea and express it in sound. —Carlyle
(ఉద్ధృతము సా దర్శ. పుట 56నుండి)

53 క) The greatest part of poets have apparelled their poetical inventions in that numbrous kind of writing called verse. Indeed verse, is an apparel only being but an ornament and no cause to poetry, since there have been most

'ఎడ్గార్ అవెన్ పో' 'జాన్సన్' మున్నగు పాశ్చాత్యవిమర్శకులు ఛందో-ఒభిమానులు కావున వారి కావ్యనిర్వచనమున ఛందము చోటుచేసికొనినది.

నిజమునకు, భావావేశమును వ్యక్తీకరించుశక్తి పద్యమునకున్నంత గద్యమునకు లేకున్నను కావ్యము పద్యరూపమైయే యుండవలయుననుట సమంజసము కాదు

**కావ్యత్రైవిధ్యము:—**

కావుననే మనలాక్షణికులు కావ్యము గద్యపద్యోభయాత్మకమై మువ్విధమగునని [54] విశ్లేషించిరి.

కేవలగద్యాత్మకములగు కావ్యములు సంస్కృతమున బాణభట్టుని "కాదంబరి" మున్నగునవి కాఁగా తెనుఁగున వేంకటేశ్వరవచనములు మున్నగునవియగుచున్నవి.

కేవలపద్యాత్మకములు సంస్కృతమున రఘువంశాదులు, ఆంధ్రమున నిర్వచనోత్తరరామాయణాదులు

---

excellent poets that have never versified and now swarm many versifiers that need never answer to the name of poets' (కవులలో బహుసంఖ్యాకులు తమ కావ్యకల్పనలకు పద్యమని చెప్పఁబడు గణాత్మకమైన ఆచ్ఛాదనము తొడిగిరి అది ఆచ్ఛాదనము మాత్రమే అది కవిత్వమునకొక బహిరలంకరణము మాత్రమే గాని మూలకారణము కాదు పద్యరచనయే చేయనివెందరో మహాకవులు కలరు ఇటీవల కవనార్హతలేని పద్యరచయితలెందరో మూగుచున్నారు )
–Sir Philip Sydney.
—ఉద్ధృతము (సాహిత్యశిల్పసమీక్ష. పుట 44 నుండి)

ఖ) "Poetry of the highest kind may exist without metre" (ఉత్తమకవిత్వము ఛందస్సులేకయు ఉండవచ్చును.) కాల్‌రిడ్జ్
(ఉద్ధృతము సా శి. స పుట 45నుండి)

54. "గద్యం పద్యం చ మిశ్రం చ తత్ త్రిధైవ వ్యవస్థితమ్"
(కావ్యాదర్శ 1.13)

గద్యపద్యోభయాత్మకములగు కృతులను 55 "చంపువు"లందురు సంస్కృతమున రామాయణభారతచంపువులాదిగా నెన్నోచంపూకావ్యము లున్నవి తెలుఁగున కవిత్రయమహాభారతాదులు మనుచరిత్రాదిప్రబంధములును చంపూకావ్యశ్రేణికే చెందును

చంపూకావ్యప్రశస్తి -

కేవలగద్యపద్యాత్మకములగు కావ్యములకంటె చంపూకావ్యములకొక విశిష్టత కలదు కావున రామాయణచంపూకారు లిట్లు వానిని ప్రశంసించిరి—

గద్యానుబంధరసమిశ్రిత పద్యసూక్తిః
హృద్యా హి వాద్యకలయా కలితేవ గీతిః।
తస్మాద్దధాతు కవిమార్గవిదాం సుఖాయ
చంపూప్రబంధరచనాం రసనా మదీయా॥

(రామాయణచంపూ 1 126)

గీతము వాద్యముచేతనే హృద్యమయినట్లు గద్యసమ్మిశ్రితమయియుండు పద్యము కడుంగడు రమణీయమై యొప్పును

ప్రబంధమనఁగా నేమి ?

స్వరూపమునుబట్టి చంపూకావ్యమనఁదగినప్రబంధమనునది తెనుఁగులో నొకవిశిష్టకావ్యప్రక్రియయై వెలసినది

'ప్రబధ్యతే ఇతి' ప్రబంధః* (రచింపఁబడినది కావున ప్రబంధమగును) అను వ్యుత్పత్తిననుసరించి ప్రబంధపదమునకు కృతి యనియర్థము ఈయర్థము ననుసరించియే ప్రబంధపదవ్యవహారము సర్వత్రవ్యాప్తమై యున్నది కావుననే సంస్కృతవాఙ్మయమందు మహాకావ్యమైనను లఘుకావ్యమైనను నాటకమైనను కథాకావ్యమయినను ఆఖ్యాయికయయినను తుదకొకపద్యమయినను ప్రబంధ పదమున వ్యవహరింపఁబడియున్నది.

55. గద్యపద్యమయీ కాచిచ్చంపూరిత్యభిధీయతే॥ (కావ్యాదర్శ. 1 . 31)

* 'బంధన'మన రచనయనుటకు "కావ్యస్య బంధనం రచనా కావ్యబంధః" అను కామధేనువ్యాఖ్య (కావ్యా సూ 1 3 13) ప్రమాణము.

కాళిదాసమహాకవి[56] భాసాదులనాటకములను, ఆనందవర్ధనుఁడు[57] కాళిదాసునిరఘువంశాదిమహాకావ్యములను, సుబంధుఁడు[58] తన 'వాసవదత్త' యనుగద్యకావ్యమును, బాణకవితనయుఁడు[59] తనతండ్రిరచించిన 'కాదంబరి' యనుకథాకావ్యమును, వాంచేశ్వరకవి[60] తనమహిషశతకమును, జయదేవ[61] కవి తన'గీతగోవింద'మను గీతకావ్యమును ప్రబంధములనియే పేర్కొనిరి ఇట్లు కవులే కాక లాక్షణికులును ప్రబంధపదమును కృతిసామాన్యపర్యాయము గానే వ్యవహరించిరి భామహుఁడును, దండియును భావికత్వమును[62]

---

56. "ప్రథితయశసాం భాససౌమిల్లకకవిపుత్రాదీనాం ప్రబంధానతిక్రమ్య ॥"
—కాళిదాస (మాలవికాగ్నిమిత్ర)

57 ఇదమపరం ప్రబంధస్య రసవ్యంజకత్వే నిబంధనమ్। . . ... యథా కాళిదాసప్రబంధేషు" —ఆనందవర్ధనాచార్య (ధ్వన్యా 3 14 కా వృత్తి)

58 సరస్వతీదత్తవరప్రసాదః చక్రే సుబంధుః సుజనైకబంధుః।
ప్రత్యక్షరశ్లేషమయప్రబంధవిన్యాసవైదగ్ధ్యవిధిర్నిబంధమ్॥
—సుబంధు. (వాసవదత్తా)

59 "యాతే దివం పితరి తద్వచసైవ సార్ధం।
విచ్ఛేదమాప భువి యస్తు కథాప్రబంధః ॥"
—బాణభట్టతనయ (కాదంబరీ ఉత్తరభాగ)

60. శ్రుత్వైతన్మహిషప్రబంధమిహ యే భూపా గుణగ్రాహిణః॥
— వాంచేశ్వరకవి. (మహిషశతక)

61. "వాగ్దేవతాచరణ .... .. .. కరోతి జయదేవకవిః ప్రబంధమ్"
—జయదేవ (గీతగోవింద)

62 క) భావికత్వమితి ప్రాహుః ప్రబంధవిషయం గుణమ్।
ప్రత్యక్షా ఇవ దృశ్యంతే యత్రార్థా భూతభావినః॥
—భామహ. (కావ్యా. 3 . 53)

ఖ) భావికత్వమితి ప్రాహుః ప్రబంధవిషయం గుణమ్।
భావః కవేరభిప్రాయః కావ్యేష్వాసిద్ధి యః స్థితః॥
—దండి. (కావ్యా. 1 . 12)

ప్రబంధవిషయమగు గుణమునుగా పేర్కొనియుండుటచే ప్రబంధ మన కృతి విశేషము గాక కృతిసామాన్యమే యయియుండుట స్పష్టము కావుననే [63]రుద్రటుఁడు తనకావ్యాలంకారమున మహాకావ్యలఘుకావ్యములను కథాఖ్యాయికాదులను ప్రబంధపదముచే సంగ్రహించెను కావుననే ధ్వనికారులు[64] అమరుక కవిశ్లోక 'ముక్తము'ను ప్రబంధపదవాచ్యమొనరించెను విద్యానాథ-విశ్వనాథాదులును[65] తమతమయలంకారగ్రంథములను ప్రబంధములనిరి.

సంస్కృతవాఙ్మయమున కృతిసామాన్యపరముగానున్న ఈ ప్రబంధపదమును తెలుఁగుకవులును ఆయర్థముననే వ్యవహరించిరి [66]నన్నెచోడకవి తనకుమారసంభవకావ్యమును, ఉభయకవిమిత్రుఁడగు[67]తిక్కనా-

63 సంతి ద్విధా ప్రబంధాః కావ్యకథాఖ్యాకాయిదయః కావ్యే ।
ఉత్పాద్యానుత్పాద్యా మహల్లఘుత్వేన భూయోఽపి॥
—రుద్రట (కావ్యా 16 2)

64 యథా హ్యమరుకస్య కవేః ముక్తకాః శృంగారరసస్యందినః ప్రబంధాయమానాః ప్రసిద్ధా ఏవ॥ —ఆనందవర్ధన (ధ్వన్యా. 3. 7 కా.వృత్తి)

65 క) ప్రతాపరుద్రదేవస్య గుణానాశ్రిత్య నిర్మితః ।
అలంకారప్రబంధోఽయం సంతః కర్ణోత్సవోఽస్తు వః॥
—విద్యానాథ (ప్ర రు. ఉపోద్ఘాత శ్లో. 9)

ఖ) శ్రీవిశ్వనాథకవిరాజకృతప్రబంధం
సాహిత్యదర్పణమముం సుధియో విలోక్య॥
—విశ్వనాథ. (సా ద. 10 . 99)

66 . ........విస్తరించెదఁ బ్రబంధము సద్రసబంధురంబుగాఁ॥"
(నన్నెచోడుని కుమా 1 . 48 వ)

67 క) "చ అన విని గారవంబు . ... . ఎవ్వరివారల రీప్రబంధ మే మునికృతమన్న . . . . (నిర్వచనోత్తరరామా 10 123)

ఖ) క అనిరచనాకౌతుకమున మనమలరఁగ నీప్రబంధమందలి కధినాథునిగా నేపురుషునిఁబేర్కొనువాడనో యనుతలంపు గూరిన మదితోఁ॥
(విరాటపర్వము 1 . 8)

మాత్యుఁడు తన నిర్వచనోత్తరరామాయణమునేకాక భారతమునందలిప్రత్యేక పర్వమును, కేతన[68] తనదశకుమారచరిత్రమును [69]ప్రబంధపరమేశ్వరుఁ డగు ఎఱ్ఱాప్రగడ[70] తననృసింహపురాణమును, మంచన[71] తనకేయూరబాహు

---

68 తత్ప్రబంధముఖమండనంబుగా నమ్మహాత్మునివంశావతారంబు వర్ణించెద (దశకుమారచరిత్ర)

69. అరణ్యపర్వశేషోన్నయనమున "ప్రబంధపరమేశ్వరుఁ"డని ఎఱ్ఱాప్రగడ కీర్తింపఁబడెను కాని ఆ బిరుదములోని ప్రబంధపదమునకు నిబంధించుట యనునర్థమేకాని పారిభాషికమగు ప్రబంధపదమునకుగలయర్థము కాదు ఆతడు రచించిననృసింహపురాణమున మాత్రము మనుచరిత్రాదిప్రబంధము లలో కానవచ్చు రసపోషణము వస్త్వైక్యము వర్ణనాబాహుల్యము అను కొన్ని (ఈనాఁడు పేర్కొనఁబడు ప్రబంధ-) లక్షణములున్నవి కాని దీనిని రచించుటకు పూర్వమే అతనికాబిరుదమున్నదనుట స్పష్టము. కాన ఈ ప్రబంధపదమునకు అతని బిరుదమునకును ఎట్టి సంబంధము లేదు అరణ్యపర్వశేషోన్నయనముననే తన కా బిరుదము కలిగినట్లు నృసింహ-పురాణకృత్యాదినిట్లు చెప్పియున్నాడు-

"ఉన్నతసంస్కృతాది చతురోక్తిపదంబుల కావ్యకర్తవై
యెన్నికయై ప్రబంధ పరమేశుఁడనంగ నరణ్యపర్వశే
షోన్నయమాచరించి సుజనోత్సవమొప్పఁగ నిర్వహించితొ
నన్నయభట్టతిక్కకవినాథులకెక్కిన భక్తిపెంపునన్"

కావున బిరుదగతప్రబంధపదమునకు కృతిసామాన్యార్థమేకాని విశేషార్థము లేదు —రచయిత

(చూ. మహాభారతోపన్యాసములు - పుట 31 - 42, మరియు -'పింగళి'వారి ఆంధ్రసాహిత్యచరిత్ర- పుట 302)

70. వ. ఈనిశ్చయంబట్టిది కావున బ్రహ్మాండాదిపురాణోక్తంబయిన "శ్రీ నృసింహావతారం"బను పురాణంబు తెనుంగుబాసఁబ్రకటింపవలయు నమ్మహాప్రబంధమునకు— (నృసింహపురాణము)

71. ఉ. .. ....... . . కర్ణసౌఖ్యావహమై ప్రబంధరచనాశ్రయమయ్యెడు మార్గమూఁతగన్॥ (కేయూరబాహుచరిత-కృత్యాది)

చరితమును, శ్రీనాథకవిసార్వభౌముఁడు[72] తన శృంగారనైషధముతోపాటు పురాణకథారూపములగు కాశీఖండభీమఖండములను, ప్రబంధములనియే పేర్కొనిరి

శ్రీనాథుని "పల్నాటివీరచరిత్ర" మను [73] ద్విపదకావ్యముకూడ ప్రబంధమని ప్రసిద్ధిపొందినది [74] జక్కన తనకథాకావ్యమగు విక్రమార్కచరిత్రమును ప్రబంధముగానే భావించెను

[75] మడికిసింగన తన సకలనీతిసమ్మతమును, దూబగుంటనారాయణ కవి[76] తనపంచతంత్రమును ను ప్రబంధములనియే నుడివిరి.

---

72 క) "నవరసభావబంధురంబుగా నొక్కప్రబంధంబు నిర్మింపఁదలఁచి కుతూహలాధీనమానసుండనై " (శృంగారనైషధము 1 18)

ఖ) గీ. నైషధాదిమహాప్రబంధములు పెక్కు
చెప్పినాఁడవు మాకునాశ్రితుఁడవనఘ
యిపుడు చెప్పఁదొడంగిన యీ ప్రబంధ-
మంకితము సేయు వీరభద్రయ్య పేర. (కాశీఖండము-కృత్యాది)

గ) "నాయొనర్పంబూనిన యిమ్మహాప్రబంధమునకు "
(భీమఖండము-షష్ఠ్యంతముల తరువాత.)

73. "యతిగూడం ద్విపదప్రబంధమున వీరానీకముంబాడెనొక్కత ప్రత్యక్షరముం గుమారకులు ఫీట్కారంబునం దూలఁగన్॥" .. ....పడతిపల్నాటి-వీరులఁబాడునపుడు. (క్రీడాభిరామము. ప 116-117)

[పల్నాటివీరులకథను కీర్తించుసందర్భముననున్న నీపద్యమందలి 'ద్విపద ప్రబంధ' పదమునకు పల్నాటివీరచరితమనియే యర్థము ]

74 "అపూర్వకథాబంధురప్రబంధరచనాకౌతుకుఁడనై యుండునంత"
(విక్రమార్కచరిత్ర 1 . 18)

75 సకలనీతిసమ్మతంబను పేర నొకప్రబంధంబు రచియింవుదునని —
(సకలనీతిసమ్మతము)

76. . జగత్ప్రసిద్ధమై పరగుచునుండ మాకొకప్రబంధమొనర్పు ప్రియం బెలర్పఁగన్" (పంచతంత్రము)

అదియిదియననేల సంస్కృతకవులవలె నాంధ్రకవులును ప్రబంధ పదమును కృతిసామాన్యార్థననే వ్యవహరించిరి

ఇంతేగాక కావ్యాలంకారచూడామణికర్తయగు విన్నకోట పెద్దనయను నాంధ్రలాక్షణికుఁడును(1350AD)—

"అట్లు కవికృతమైన కావ్యత్రయంబు
గద్యపద్యవిమిశ్రసంపాద్యమండ్రు
నగరముఖాద్యష్టదశవర్ణనములచేతఁ
బరఁగునదియును భవ్యప్రబంధమనఁగ' (కావ్యా చూ 3 91)

అని ప్రబంధమును నిర్వచించినట్లు స్ఫురించునే కాని ఈప్రబంధపదము తెలుగునందలికావ్యవిశిష్టప్రక్రియాపరము కాదు. కావ్యసామాన్యపరమే ఇందుల కాతఁడు—

క. ఇటువలెనె ముక్తాకాది
స్ఫుటతరచాటుప్రబంధములలక్షణముల్. (కావ్యా. చూ 4 . 8)

అని ముక్తాకాదిక్షుద్రకావ్యములను ప్రబంధములనుటయే నిదర్శనము కావున నీతఁడును ప్రబంధపదమును కృతిసామాన్యార్థముననే వ్యవహరించెను

ఇట్లు కృతిమాత్రపర్యాయముగా వ్యవహరింపఁబడు నీప్రబంధపదము తెనుఁగున విశిష్టకావ్యప్రక్రియాపరమై రూపొందుటకు ప్రాయికముగా రుద్రటుని ప్రబంధనిర్వచనమే మూలమని చెప్పవచ్చును

రుద్రటుని(825—875AD)ప్రబంధనిర్వచనములలో నీతనికిపూర్వులగు భామహదండులు పేర్కొననికొంగ్రొత్తయంశములివి—

క) కావ్యము కథ ఆఖ్యాయిక మున్నగువానినన్నింటిని ప్రబంధనామమున పేర్కొనియే నిర్వచించుట-77

---

77. సంతి ద్విధా ప్రబంధాః కావ్యకథాఖ్యాయికాదయః కావ్యే।
ఉత్పాద్యానుత్పాద్యా మహల్లఘుత్వేన భూయోఽపి॥ (రుద్రటకావ్యా. 16 2)

ఖ) గద్యకావ్యభేదములగు 'కథ, అఖ్యాయిక' అనువాని లక్షణనిర్వచనమున గ్రంథావతారికావిధానమును ప్రవేశపెట్టుట [78]

గ) 'కథ' 'ఆఖ్యాయిక' అనువానినిర్వచనమున నగరాద్యష్టాదశవర్ణనలను శృంగారరసప్రాధాన్యమును స్పష్టముగానుట్టంకించుట-[79]

---

78 క) శ్లోకైర్మహాకథాయామిష్టాన్ దేవాన్ గురూన్నమస్కృత్య ।
సంక్షేపేణ నిజం కులమభిదధ్యాత్ స్వం చ కర్తృతయా॥
(రుద్రటకావ్యా. 16 . 20)

ఖ) "స్వం చేతి చకారోఽనుక్తసముచ్చయే। తేన సుజనఖలస్తుతినిందాదికం చాభిదధ్యాదితి సూచ్యతే" అని పూర్వశ్లోకమునకు నమిసాధుటిప్పణము
(టిప్పణ- రుద్రటకావ్యా 16 20)

గ) "పూర్వవదేవ నమస్కృతదేవగురుర్నోత్సహేత్ స్థితే క్షేమ।
కావ్యం కర్తుమితి కవీన్ శంసేదాఖ్యాయికాయాం తు॥
తదను నృపే వా భక్తిం పరగుణసంకీర్తనేఽథవా వ్యసనమ్ ।
అన్యద్ వా తత్కరణే కారణమక్లిష్టమభిదధ్యాత్॥
"అథ తేన కథైవ యథా రచనీయాఽఽఖ్యాయికాఽపి గద్యేన ।
నిజవంశం స్వంచా స్యామభిదధ్యాన్న త్వగద్యేన॥"
(రుద్రటకావ్యా 16.24 - 26)

79 క) సానుప్రాసేన తతో భూయో లఘ్వక్షరేణ గద్యేన।
రచయేత్ కథాశరీరం పురేవ పురవర్ణనప్రభృతీన్॥
కన్యాలాభఫలాం వా సమ్యగ్విన్యస్తసకలశృంగారాం ।
ఇతి సంస్కృతేన కుర్యాత్ కథామగద్యేన చాన్యేన॥
("సమగ్విన్యస్తసకలశృంగారామిత్యనేన శృంగారస్తత్ర ప్రాధాన్యేన నిబంధనీయ ఇత్యుక్తం భవతి॥ అని నమిసాధుటిప్పణము )
"అథ తేన కథైవ యథా రచనీయాఽఖ్యాయికాపి గద్యేన॥"
(రుద్రట కావ్యా 16 21, 23, 26)

ఖ) దండిభామహుల లక్షణములిట్లున్నవి–

i) శబ్దార్థౌ సహితౌ కావ్యం గద్యం పద్యం చ తద్ద్విధా॥
(భామహకావ్యా 1 16)

వీనిని మనమునవిడిన తెనుఁగుకవులు కథాఖ్యాయికలను రెంటిని ప్రత్యేకముగా కాక కథయనుపేరనే వ్యవహరించుటతగునను[80] దండియభిప్రాయము ననుసరించినవారలై తమ కావ్యములను కథాకావ్యదృష్టితోనే వెలయించిరి

---

ii) పద్యం గద్యం చ మిశ్రం చ తత్ త్రిధైవ వ్యవస్థితమ్॥
(దండికావ్యా 1 11)

iii) ప్రకృతానాకులశ్రవ్యశబ్దార్థపదవృత్తినా ।
గద్యేన యుక్తోదాత్తార్థా సోచ్ఛ్వాసాఽఽఖ్యాయికా మతా॥
వృత్తమాఖ్యాయతే తస్యాం నాయకేన స్వచేష్టితమ్ ।
వక్త్రం చాపరవక్త్రం చ కాలే భావ్యర్థశంసి చ॥
కవేరభిప్రాయకృతైః కథనైః కైశ్చిదంకితా।
కన్యాహరణసంగ్రామవిప్రలంభోదయాన్వితా ॥
న వక్త్రాపరవక్త్రాభ్యాం యుక్తా నోచ్ఛ్వాసవత్యపి ।
సంస్కృతే సంస్కృతా చేష్టా కథాఽపభ్రంశభాక్ తథా॥
(భామహకావ్యా 1 25 - 28)

గ) దండి భామహోక్తకథాఖ్యాయికాభేదమును నిరసించి ఈ రెంటిని కథయనుటయే లెస్సయనెను—

" . . . తయోరాఖ్యాయికా కిల"
నాయకేనైవ వాచ్యాఽన్యా నాయకేనేతరేణ వా ।
స్వగుణావిష్క్రియాదోషో నాత్ర భూతార్థశంసినః॥
అపి త్వనియమో దృష్టస్తత్రాప్యన్యైరుదీరణాత్ ।
అన్యో వక్తా స్వయం వేతి కీదృగ్వా భేదకారణమ్॥
వక్త్రం చాపరవక్త్రం చ సోచ్ఛ్వాసత్వం చ భేదకమ్ ।
చిహ్నమాఖ్యాయికాయాశ్చేత్ ప్రసంగేన కథాస్వపి॥
ఆర్యాదివత్ ప్రవేశః కిం న వక్త్రాపరవక్త్రయోః ।
భేదశ్చ దృష్టో లంభాదిరుచ్ఛ్వాసో వాఽస్తు కిం తతః ।
తత్ కథాఽఽఖ్యాయికేత్యేకా జాతిః సంజ్ఞాద్వయాంకితా॥
(దండికావ్యా 1 . 23 - 28)

80 తత్కథాఖ్యాయికేత్యేకా జాతిః సంజ్ఞాద్వయాంకితా॥ (దండికావ్యా 1.28)

దీనికి నన్నెచోడుఁడు[81] తన కుమారసంభవమును కథయని పేర్కొనుటయు, ఎఱ్ఱాప్రగడ[82] తనన్నృసింహపురాణమును పురాణకథయని నుడువుటయును నిదర్శనములు ఇంతేగాక వారు తమకావ్యములను ప్రబంధములని[83] నిర్దేశించుటయు ఇట గమనింపవలసియున్నది

సర్గబంధ(పద్య)రూపమహాకావ్యవర్ణనీయాంశములుగా ప్రసిద్ధములయి గద్యరూపకావ్యములగు 'కథ – అఖ్యాయిక' అనువానికిని అనువర్తింపఁబడిన ఉదాత్తనాయకచరితాదులు, రసప్రాధాన్యము నగరాద్యష్టాదశవర్ణనలును, దృశ్యకావ్యాంగములుగా ప్రసిద్ధివడసి శ్రవ్యకావ్యములకును అతిదేశింపఁబడిన ముఖాదిసంధ్యంగములును, కథాఖ్యాయికాలక్షణనిర్వచనమున రుద్రటునిచే పేర్కొనఁబడిన గ్రంథావతారికావిధానము, శృంగారరసప్రాధాన్యమును, చంపూపద్ధతిని గద్యపద్యోభయమయత్వమును. ఆశ్వాసవత్త్వమును అనునీయంశములను సంతరించుకొనియున్న ఈతెలుఁగునందలి కావ్యప్రక్రియావిశేషమునకు దృశ్యశ్రవ్యమహాకావ్యకథాఖ్యాయికాదిసర్వసాధారణవాచకమగు 'ప్రబంధ' పదము గాక మఱేపదము వ్యవహారయోగ్యమగును?

కావుననే ఆమహాకవులిరువురు తమకృతులు కేవలకథలు కాక కావ్యప్రక్రియావిశేషములని తెలుపుటకే ప్రబంధపదమును వ్యవహరించిరి నన్నెచోడుఁడు అష్టాదశవర్ణనలను కృత్యాదిలోనుట్టంకించుటలోనియాంతర్యమిదియేయని తోచుచున్నది. కుమారసంభవనృసింహపురాణములు రెండును ప్రబంధ

---

81 "నన్నెచోడదేవప్రణీతంబైన కుమారసంభవంబను కథయందు"
(నన్నెచోడ– కుమా అశ్వాసాంతగద్యము)

82. ఎఱ్ఱయనామధేయప్రణీతంబయిన లక్ష్మీనృసింహావతారంబను పురాణకథయందు-
(నృసింహపురాణము అశ్వాసాంతగద్యము)

83 క) "విస్తరించెదఁబ్రబంధము సద్రసబంధురంబుగాఁ"
(నన్నెచోడ– కుమా 1 . 48)

ఖ) "అమ్మహాప్రబంధమునకు నస్మత్పితామహహృదయగుహావిహారమహాసింహంబగు శ్రీమదహోబలనరసింహదేవుండధీశ్వరుఁడగుటంజేసి"
–ఎఱ్ఱన (నృసింహపురాణము- కృత్యాది)

లక్షణాన్వితములయియే[84] యున్నవి. రుద్రటుఁడు కథాప్రబంధమున ప్రధాన రసము శృంగారమై యుండవలెనని నిర్దేశించియుండెను. దానినూఁతగాఁ గొనియే కాబోలు మంచన(1350 AD)తాను కేయూరబాహుచరితమును రచించు పద్ధతి 'ప్రబంధరచనాశ్రయమయ్యెడుమార్గ'మని తెలిపియు "స్థాయిరసము శృంగారంబై యలవడ'నని శృంగారరస ప్రాధాన్యమును ప్రత్యేకముగా పొందుపఱచెను. అనంతరికవులగు జక్కన (1400_1422) నందిమల్లయ-ఘంటసింగనలును (క్రీ శ 15వ శతాబ్దిఉత్తరార్ధము) ప్రబంధశయ్యను ప్రస్తావించిరి [85] ఇట్లు క్రమమున రాయలకాలమునాటికి పరిణతినొందినప్రబంధ-మార్గమునకు మనుచరిత్రాదులు పరిపూర్ణోదాహరణములై ఆకాలమునకు ప్రబంధయుగమను ఖ్యాతి గడింపఁజేసినవి-

ప్రబంధయుగమునందలి కావ్యములన్నియును ఛత్రిన్యాయమున ప్రబంధములని రూఢివడసినవి ప్రబంధయుగమునకు పూర్వమునందును "నన్నెచోడునికుమారసంభవము'_మున్నగు కొన్నికావ్యములు ప్రబంధలక్షణ విలసితములై యున్నవి కాని వానికాపేరు(ప్రబంధనామము)రూఢము కాకున్నది నన్నెచోడకవి శివకవియగుటవలన నాతనికుమారసంభవము చాల

---

84 క) నన్నెచోడకుమారసంభవ - ఉపోద్ఘాతము - కోరాడ మహాదేవశాస్త్రిగారి సంపాదకీయము

ఖ) పింగళివారి ఆంధ్రసాహిత్యచరిత్ర – పుట. 92 మరియు 302

గ) డా॥ దివాకర్ల వేంకటావధానిగారి ఆంధ్రవాఙ్మయచరిత్రము— పుటలు 16, 24

85. క) . ........ విక్రమార్కభూతలపతి యెక్కుడై నెగడెఁదచ్చరితంబుఁ బ్రబంధశయ్యగాఁదెలుఁగునఁజెప్పి యాకృతిపతిత్వము మాకొదఁగూర్చ-నేర్చునఁ- —జక్కన (విక్రమార్కచరిత్రము 1 29)

ఖ) అనవుఁడు ననంతవిభుగం
గనవారలఁజూచి యిట్టిఘననాటకముం
దెనుఁగునఁబ్రబంధశయ్యకు
నొనఁగూర్పఁగ నేర్చుసుకవు లుర్విం గలరే॥
—నందిమల్లయ-ఘంటసింగనలు. (ప్రబోధచంద్రోదయము కృత్యాది)

కాలమువఱకును వెలికిరాకుండుటచేతను ఎఱ్ఱనన్నసింహపురాణము ఆశ్వాసాంత గద్యమున 'కథ' యని నిర్దేశింపఁబడియుండుటచేతను శ్రీనాధకవిసార్వభౌముని శృంగారనైషధము, పిల్లలమఱ్ఱిపినవీరభద్రుని శృంగారశాకుంతలమును స్వతంత్రరచనలుకాక సంస్కృతానువాదములగుటచేతను అవి ప్రబంధనామమున వ్యవహారప్రసిద్ధములు కాలేదు కావున నాంధ్రమున ప్రబంధములని ప్రథితములై వ్యవహృతములగుచుండినవి మనుచరిత్రాదులే మనుచరిత్ర-పారిజాతాపహరణములలోఁగావింపఁబడిన రాయలదిగ్విజయములను బట్టి మనుచరిత్రమునకంటె పారిజాతాపహరణమే ముందురచింపఁబడియుండునని విమర్శకులూహించుచున్నను తొలియాంధ్రప్రబంధమను లోకరూఢి మనుచరిత్రమునకే [86]దక్కినది

కావ్యవస్తువు :-

కావ్యరచనకయి గ్రహింపఁబడు[87]కథావస్తువు ప్రఖ్యాతము ఉత్పాద్యము మిశ్రము అని ముప్విధమైయుండును ప్రఖ్యాతమన పురాణేతిహాసప్రసిద్ధమైయుండునది ఉత్పాద్యమన కవి స్వయముగా కల్పించినది. మిశ్రమన కొంత ప్రసిద్ధమును, కొంతకవికల్పితమును అయియుండునది రామరాజభూషణుఁడు[88]తనవసుచరిత్రమున కేవలకల్పనాకథలు కృత్రిమరత్నములనియు,

---

86 క) డా॥ పల్లాదుర్గయ్యగారి "ప్రబంధవాఙ్మయవికాసము" పుట 286 - 290

ఖ) ఆచార్య కాకర్లవెంకటనరసింహంగారి 'ఆంధ్రప్రబంధము - అవతరణ వికాసములు పుటలు 171 - 178.

గ) డా॥ దివాకర్ల వేంకటావధానిగారి "ఆంధ్రవాఙ్మయచరిత్రము"-పుట 48

87 వస్తు త్రివిధం ప్రఖ్యాతముత్పాద్యం మిశ్రం చేతి। తథోక్తం దశరూపకే_ "ప్రఖ్యాతోత్పాద్యమిశ్రత్వభేదాత్ తత్ త్రివిధం మతమ్" ఇతి॥ ఇతిహాసనిబంధనం ప్రఖ్యాతం, కవికల్పితముత్పాద్యం, సంకరాయత్తం మిశ్రం చేతి॥ (ప్రతాపరుద్రీయ నాటకప్రకరణ.)

88. ఉ కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరిపుట్టురత్నము లవారితసత్కవికల్పనావిభూ-
షావహపూర్వవృత్తములు సానలఁదీరినజాతిరత్నముల్
గావున నిట్టిమిశ్రకథగా నొనరింపుము నేర్పుపెంపునన్॥ (వసు 1.19)

ఆద్యసత్కథలు పుట్టురత్నములనియు, కవికల్పనలతోఁగూడిన పూర్వవృత్తములు సానలఁదీరినజాతిరత్నములనియుఁదెల్పుచు మిశ్రవస్తురామణీయకమును ప్రశంసించియున్నాఁడు కావ్యవస్తువు రసప్రధానమైయుండవలెను, కాని అది ప్రఖ్యాతమా? ఉత్పాద్యమా? మిశ్రమా? అనునది అంతముఖ్యము కాదు. కావుననే [89] ధ్వనికారులు—కథావస్తువు ప్రఖ్యాతమైనను ఉత్పాద్యమైనను కావచ్చును, కాని అది రసోచితమైయుండుట ముఖ్యమనియు, కావుననే పురాణాదిప్రసిద్ధమగునితివృత్తమున రసాననుగుణమగునంశమేదేనియున్నచో దానిని త్యజించి రసోచితకథాకల్పనచే పూరించి అద్దానిని గ్రహించవలసియుండుననియు కేవలమితివృత్తమును నిర్వహించుటయే కావ్యపరమార్థము కాదనియు వ్రాకుచ్చెను కావున రామరాజభూషణునియభిప్రాయమెంతో సమంజసమైయున్నది

**కావ్యవర్ణనీయాంశములు —**

ఇట్లు తీర్చిదిద్దుకొనిన కథావస్తువునకనుగుణముగానెడనెడ సందర్భోచితముగా నగరాదివర్ణనలు చేయవలయును భామహుఁడు [90] "మంత్రము,

---

89 క) విభావభావానుభావసంచార్యౌచిత్యచారుణః ।
విధిః కథాశరీరస్య వృత్తస్యోత్ప్రేక్షితస్య చ॥
ఇతివృత్తకథాయాతాం త్యక్త్వాఽననుగుణాం స్థితిమ్ ।
ఉత్ప్రేక్ష్యాప్యంతరాభీష్టరసోచితకథోన్నయః॥ (ధ్వన్యా 3 10, 11)

ఖ) కథాశరీరముత్పాద్యవస్తు కార్యం తథా తథా ।
యథా రసమయం సర్వమేవ తత్ ప్రతిభాసతే॥
(ధ్వన్యా 3 . 14 కా. వృత్తి. పరి శ్లో.)

గ) న హి కవేరితివృత్తమాత్రనిర్వహణేన కించిత్ ప్రయోజనమ్।
ఇతిహాసాదేవ తత్సిద్ధేః॥ (ధ్వన్యా 3 14 కా. వృత్తిలో)

90 క) సర్గబంధో మహాకావ్యం మహతాం చ మహచ్చ యత్ ।
అగ్రామ్యశబ్దమర్థ్యంచ సాలంకారం సదాశ్రయమ్॥
మంత్రదూత్యప్రయాణాజినాయకాభ్యుదయైశ్చ యత్ ।
పంచభిః సంధిభిర్యుక్తం నాతివ్యాఖ్యేయమృద్ధిమత్॥
(భామహకావ్యా 1 . 19, 20)

దూత్యము ప్రయాణము యుద్ధము నాయకాభ్యుదయము" అనునయిదింటిని మహాకావ్యవర్ణ్యాంశములుగాను, కన్యాహరణము, యుద్ధము విప్రలంభము నాయకాభ్యుదయము, అనునవి గద్యకావ్యభేదమగు కథాకావ్యవర్ణనీయాంశములుగాను పేర్కొనెను కాని దండి [91] ఇవియన్నియును అది యిది యను భేదము లేక కావ్యములన్నింటను వర్ణింపఁదగు నంశములే యగునను నభిప్రాయముచే వీనితోగూడ మఱికొన్నింటిని చేర్చి కావ్యవర్ణనీయాంశములను పదునెనిమిదింటిని పేర్కొనెను దండి పేర్కొనిన యష్టాదశవర్ణనీయాంశములు— 1) "నగరము 2) సముద్రము 3) పర్వతము 4) ఋతువులు 5) చంద్ర— 6) సూర్యోదయములు 7) ఉద్యానము 8) జలక్రీడ 9) మద్య-పానము 10) రతోత్సవము 11) విప్రలంభశృంగారము 12) వివాహము 13) సుతోత్పత్తి 14) మంత్రము(రహస్యాలోచన) 15) దూత్యము 16 ప్రయాణము 17) యుద్ధము 18) నాయకాభ్యుదయము"అనునవి

అగ్నిపురాణమున [92] విప్రలంభవివాహకుమారోదయములు, మంత్రదూత్యప్రయాణాజినాయకాభ్యుదయములు పేర్కొనఁబడియుండలేదు. కాని

---

ఖ) కన్యాహరణసంగ్రామవిప్రలంభోదయాన్వితా ॥
కథాఽపభ్రంశభాక్ తథా॥ (భామహ 1 27-28)

91 క) కన్యాహరణసంగ్రామవిప్రలంభోదయాదయః ।
సర్గబంధసమా ఏవ నైతే వైశేషికా గుణాః॥ (దండికావ్యాదర్శ. 1 29)

ఖ) నగరార్ణవశైలర్తుచంద్రార్కోదయవర్ణనైః ।
ఉద్యానసలిలక్రీడామధుపానరతోత్సవైః ॥
విప్రలంభైర్వివాహైశ్చ కుమారోదయవర్ణనైః ।
మంత్రదూత్యప్రయాణాజినాయకాభ్యుదయైరపి॥
అలంకృతమ్ ... ॥
కావ్యం కల్పాంతరస్థాయి జాయతే సదలంకృతి॥
(దండికావ్యా 1. 16-19)

92 నగరార్ణవశైలర్తుచంద్రార్కాశ్రమపాదపైః ।
ఉద్యానసలిలక్రీడామధుపానరతోత్సవైః ॥
దూతీవచనవిన్యాసైరసతీచరితాద్భుతైః ।
తమసా మరుతాఽప్యన్యైర్విభావై రతినిర్భరైః॥

మొదటవదివర్ణనీయాంశములతోపాటు ఆశ్రమపాదపదములు, దూతీవచనము, శృంగారరసమునకుద్దీపనవిభావములగు మలయానిలయాదులు సంగ్రహింపఁబడి కావ్యవస్తువు శృంగారరసస్యందియగువిధము సూచింపఁబడినది కథావస్తువు వీరరసాశ్రయమగునేని ఈవర్ణనలనన్నింటిని ఆకథావస్తువునవెట్లు సమకూర్చవలెనో రుద్రటుఁడు (825-875 A D) తన కావ్యాలంకారమునవిట్లు వివరించెను.

నాయకుని[93] విజయయాత్రాసందర్భమున జనపదపర్వతనదీకాననసరసీసముద్రాదులును, సేనాసన్నివేశసందర్భమున సూర్యాస్తమయ- సంధ్యాకాల-తమోవ్యాప్తి-చంద్రోదయ-నిశలును యువతీయువకులపానగోష్ఠిశృంగారాదులును, అంతమున నాయకవిజయమును నిబంధించవలయును. కథాసంవిధానమున నీవర్ణనీయాంశసంగ్రంథనపద్ధతిని గమనించినచో, రుద్రటుఁడు మాఘకావ్యమును దృష్టియందుంచుకొని వివరించినట్లు పొడకట్టును.

పురోపవనరాష్ట్రాద్రిసముద్రాశ్రమవర్ణనలు దేశసంపదను సూచించుననియును, ఋతుచంద్రార్కోదయాస్తమయములు ఉద్దీపనవిభావములగుటచేతను, రాజకన్యాకుమారాదులు ఆలంబనవిభావములగుటచేతను, ఉద్యానసలిలక్రీడాదులు అనుభావములగుటచేతను, వానివర్ణనలు కావ్యమున రసపుష్టిని కలుగఁ

---

సర్వవృత్తిప్రవృత్తం చ సర్వభావప్రభావితమ్॥
సర్వరీతిరసైః పుష్టం పుష్టం గుణవిభూషణైః।
అత ఏవ మహాకావ్యం తత్కర్తా చ మహాకవిః॥
(అగ్నిపురాణం 337 . 29 – 32)

93 అథ నాయకప్రయాణే నాగరికాక్షోభజనపదాద్రినదీః।
అటవీకాననసరసీమరుజలధిద్వీపభువనాని॥
స్కంధావారనివేశం క్రీడాం యూనాం యథాయథం తేషు।
రవ్యస్తమయం సంధ్యాం సంతమసమథోదయం శశినః॥
రజనీం చ తత్ర యూనాం సమాజసంగీతపానశృంగారాన్।
ఇతి వర్ణయేత్ ప్రసంగాత్ కథాం చ భూయో నిబధ్నీయాత్॥
.... ... . . . అభ్యుదయం నాయకస్యాంతే॥
(రుద్రటకావ్యా 16 13–15, 18)

జేయుననియును, మంత్రదూత్యప్రయాణాజినాయకాభ్యుదయముల వర్ణనలచే పురుషాకారపుష్టి కలిగి కావ్యము రసావహమగుననియును, అయినను ఈవర్ణన లన్నియును కావ్యముననుండవలయునను నియమము లేదనియును, కాన నత్యావశ్యకములగు కొన్ని వర్ణనలున్నచాలుననియును [94] భోజుఁడు (1000–1050 A D) అభిప్రాయపడెను

కావుననే [95] హేమచంద్రుడు (1088–1172) దండిపేర్కొనిన అష్టాదశవర్ణనలతోపాటు సైన్యావాసము, ఆశ్రమాదులు, నాయకనాయికాకుమారవాహనాదులు, మానినీమానాపగమము అనువాని వర్ణనల నధికముగానుట్టంకించెను

---

94 క) పురోపవనరాష్ట్రాద్రిసముద్రాశ్రమవర్ణనైః ।
దేశసంపత్ ప్రబంధస్య రసోత్కర్షాయ కల్పతే॥
ఋతురాత్రిందివార్కేందూదయాస్తమయకీర్తనైః ।
కాలః కావ్యేషు సంపన్నో రసపుష్టిం నియచ్ఛతి ॥
రాజకన్యాకుమారస్త్రీసేవాసేనాంగభంగిభిః ।
పాత్రాణాం వర్ణనం కావ్యే రసపోత్రోఽధితిష్ఠతి॥
ఉద్యానసలలక్రీడామధుపానరతోత్సవాః ।
విప్రలంభా వివాహాశ్చ చేష్టాః కావ్యే రసావహాః ॥
మంత్రదూత్యప్రయాణాజినాయకాభ్యుదయాదిభిః ।
పుష్టిః పురుషకారస్య రసం కావ్యేషు వర్షతి॥
(సరస్వతీకంఠాభరణ. 5 130 – 134)

ఖ) నావర్ణనం నగర్యాదేః దోషాయ విదుషాం మతమ్ ।
యది శైలర్తురాత్ర్యాదేః వర్ణనేనైవ తుష్యతి ॥ (సరస్వతీ 5 135)

95. నగరాశ్రమశైలసైన్యావాసార్ణవాదివర్ణనం, ఋతురాత్రిందివార్కాస్తమయ-చంద్రోదయాదివర్ణనం, నాయకనాయికాకుమారవాహనాదివర్ణనం, మంత్రదూత్యప్రయాణసంగ్రామాభ్యుదయాదివర్ణనం, వనవిహారజలక్రీడామధుపాన-మానాపగమరతోత్సవాదివర్ణనమితి॥ (కావ్యానుశాసన 8.6 సూత్రవృత్తి)

ప్రతాపరుద్రీయకర్త[96] 'దూత్య'స్థానమున ద్యూతమును నిలిపి దండి పేర్కొనిన యష్టాదశ వర్ణనలనే యథాతథముగ గ్రహించెను సాహిత్యదర్పణ కారుడు[97] మఱికొన్ని క్రొత్తయంశములు చేర్చి-"సంధ్య సూర్యుఁడు చంద్రుఁడు రాత్రి, ప్రదోషము, చీకటి, దివసము, ప్రాతఃకాలము, మధ్యాహ్నము వేఁట పర్వతములు ఋతువులు, వనము, సముద్రము, సంభోగవిప్రలంభశృంగార ములు, ముని, స్వర్గము, పురము, అధ్వరము, రణము, ప్రయాణము వివాహము మంత్రము పుత్రోదయము" మున్నగువానిని కావ్యవర్ణనీయాంశములుగా పేర్కొనెను

విన్నకోటపెద్దనయను[98] తొలి తెలుఁగులాక్షణికుఁడును తన 'కావ్యా

---

96 నగరార్ణవశైలర్తుచంద్రార్కోదయవర్ణనమ్ ।
ఉద్యానసలిలక్రీడామధుపానరతోత్సవాః ॥
విప్రలంభో వివాహశ్చ కుమారోదయవర్ణనమ్ ।
మంత్రద్యూతప్రయాణాజినాయకాభ్యుదయా అపి ।
ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే॥
(ప్ర. రు కావ్య. 69 – 71 శ్లో )

97 సంధ్యాసూర్యేందురజనీప్రదోషధ్వాంతవాసరాః ।
ప్రాతర్మధ్యాహ్నమృగయాశైలర్తువనసాగరాః ॥
సంభోగవిప్రలంభౌ చ మునిస్వర్గపురాధ్వరాః ।
రణప్రయాణోపయమమంత్రపుత్రోదయాదయః ॥
వర్ణనీయా యథాయోగం సాంగోపాంగా అమీ ఇహ॥
(సా. ద 6 . 322 - 324)

98. మ పురవారాశిమహీధరర్తుశశభృత్పూషోదయోద్యాన పు
ష్కరకేళీమధుపానమోహనవియోగ క్షేమయాన స్వయం-
వరపుత్రోత్సవమంత్రదూత్యరణదోర్వైక్రాంతిసంకీర్తనా
కరమష్టాదశవర్ణనాన్వితము తత్కావ్యంబు భవ్యంబిలన్॥
(కావ్యాలంకారచూడామణి. 3 . 92)

లంకారచూడామణి'లో దండి పెర్కొనినయష్టాదశవర్ణనలనే పేర్కొనెను [99]అప్పకవి ప్రతాపరుద్రీయమునందలి పదునెనిమిదింటికి, వేఁట, మౌనీంద్ర పుణ్యాశ్రమము కన్యాంగసౌందర్యము దౌహృదము అను నాల్గింటిని చేర్చి వర్ణ్యాంశములిరువదిరెండని చెప్పెను [100] అలంకారశేఖరకారుల పట్టికలో ముప్పదిరెండువఱకు వర్ణ్యాంశములు గలవు

తేలినదేమన వర్ణ్యాంశములు పదునెనిమిదేయను నియమము లేదు ఎన్నియైననుండవచ్చును రసోచితకథానురూపముగా నున్నవానినిమాత్రమే గ్రహింపవలయును కాని స్వశక్తిఖ్యాపనకై అధికముగా వర్ణనల చొప్పింపరాదు,[101] కావుననే మనతెనుఁగుప్రబంధములలో, విప్రలంభశృంగారాను

---

99 సీ. పురమును ఋతుషట్కమును ప్రయాణంబును
శైలంబు వేఁటయు సాగరంబు
మౌనీంద్రపుణ్యాశ్రమంబును మంత్రంబు
ద్యూతంబు పిదప నద్భుతరణంబు
విజయంబు మద్యపానజవికారంబును
వనవిహారంబును వారికేళి
కన్యాంగసౌందర్యకథనంబు హిమకరా
భ్యుదయంబు విప్రలంభోదితంబు

తే॥ పద్మమిత్రోదయంబును పరిణయంబు
సురతమును దౌహృదంబును సుతజననము
ననఁగ నిరువదిరెండు వర్ణనలు గూర్చి
చెప్పవలయు ప్రబంధంబు శ్రీనివాస॥ (అప్పకవీయము 1 28)

100. వర్ణ్యశ్చ రాజా దేవీ చ దేశో గ్రామః పురీ సరిత్ ।
సరోఽబ్ధ్యరణ్యోద్యానాద్రి ప్రయాణరణవాజినః ॥
హస్త్యర్కచంద్రావృతవో వివాహోఽథ స్వయంవరః ।
సురా పుష్పాంబు సంభోగః విశ్లేషమృగయాశ్రమాః
కాలాఋతువయస్సంధీ ధాతువృక్షాభిసారికాః॥ (అలంకారశేఖర 16.)

101 మజ్జనపుష్పావచయనసంధ్యాచంద్రోదయాదివాక్యమిహ ।
సరసమపి నాతిబహుళం ప్రకృతరసానన్వితం రచయేత్॥
(కావ్యమీమాంసా 9 అధ్యాయ. పుట 141)

గుణములగుటచే మలయమారుతచంద్రమన్మథదూషణాదులును వర్ణింపఁబడియున్నవి

**కావ్యమున రసము :—**

శృంగారహాస్యకరుణరౌద్రవీరభయానకబీభత్సాద్భుతశాంతములు అను తొమ్మిదిరసములును కావ్యమున వర్ణనీయములు అయినను ఈతొమ్మిదింటిలో [102] నేదో యొకటి ప్రధానమై యుండ తక్కినవి దానికంగములుగా నుండును. రసములన్నింటికిని కావ్యమున ప్రధానభావమునొందునర్హత లేదు [103] విశ్వశ్రేయమునొనఁగూర్చునదియే కావ్యమగును కదా! అట్టికావ్యమున శృంగార వీరములుమాత్రము ప్రధానభావమునొందఁదగియున్నవని దశరూపకకర్త [104] యభిప్రాయపడెను. రసములన్నింటిలో పరమమధురమగు శృంగారరసము ధీరోదాత్తనాయకాశ్రయమగుచు లోకోత్తరాహ్లాదము నొనగూర్చునదియగుటయే గాక ధర్మ్యమై జగదవిచ్ఛిన్నతకును కారణమగుచున్నది [105] వీరరసము లోకోత్తరగుణోత్తరనాయకాశ్రయమగుచు పరమరమణీయమై లోకమునకు దాన ధర్మాదిసద్గుణములయందుత్సాహమును రేకెత్తించును [106] కావున ప్రతాప—

---

102. ప్రసిద్ధేఽపి ప్రబంధానాం నానారసనిబంధనే ।
ఏకో రసోఽంగీకర్తవ్యస్తేషాముత్కర్షమిచ్ఛతా॥ (ధ్వన్యా. 3 21)

103 "విశ్వశ్రేయః కావ్యమ్" —నన్నయభట్టారక. (అ.శ.చిం. 1 . 1)

104 ఏకో రసోఽంగీకర్తవ్యో వీరః శృంగార ఏవ వా ।
(దశరూపక 3 . 3)

105 క) శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః ।
తన్మయం కావ్యమాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి ॥ (ధ్వన్యా. 2. 7)

ఖ) ఉత్తమప్రకృతిప్రాయో రసః శృంగార ఇష్యతే" (సా ద. 3 183)

గ) ధర్మావిరుద్ధో భూతానాం కామోఽస్మి భరతర్షభ॥ (భగవద్గీత)

106. "ఉత్తమప్రకృతిర్వీర ఉత్సాహస్థాయిభావకః ॥" . ... .. .. .
స చ దానధర్మయుద్ధైర్దయయా చ సమన్వితశ్చతుర్ధా స్యాత్॥
(సా. ద. 3 232, 234)

రుద్రీయకారుఁడును[107] "శృంగారవీరరసయోరన్యతరస్య ప్రాధాన్యమ్" అని నుడివెను భారతమున ప్రధానరసము శాంతమని ధ్వనికారులుపపాదించుట వలన సాహిత్యదర్పణకారుఁడు[108] "శృంగారవీరశాంతానామేకోఽంగీ రస ఇష్యతే"అని శృంగారవీరశాంతములు మూఁడును కావ్యమున ప్రధానరసములగునని వ్రాకుచ్చెను ఆదికావ్యమగు రామాయణము కరుణరసప్రధానమైనది. ఆరామాయణకథనాశ్రయించి రచింపఁబడిన ఉత్తరరామచరిత్రాదులును కరుణరసప్రధానములే కదా! రామాయణాదిమహాప్రబంధములలోని ప్రసిద్ధమగు ప్రధానరసమును కాదని తత్కథాశ్రయములగుకావ్యములలో స్వేచ్ఛగా రసాంతరప్రాధాన్యమునుకూర్చరాదను ధ్వనికారులయాశయము తెలియనిదికాదు[109] కావున ఈయంశమును మననుననిడిన తరువాతి యలంకారశాస్త్రవేత్తలు శృంగారవీరములతోపాటు శాంతమేకాక కరుణముకూడ ప్రధానభావమునొందనర్హమైనదని నిర్ణయించిరి[110]

కావున కావ్యమున శృంగారవీరములతోపాటు శాంతమును కరుణరసమును ప్రధానరసములు కాఁదగియున్నవి కాని తక్కిన హాస్యరౌద్రాద్భుతబీభత్స

---

107 ప్రతాపరుద్రీయమ్(వావిళ్ల ప్ర. 1965) నాటకప్రకరణం పుట 87.

108 సాహిత్యదర్పణమ్ (6 317)

109 సంతి సిద్ధరసప్రఖ్యా యే చ రామాయణాదయః ।
కథాశ్రయా న తైర్యోజ్యా స్వేచ్ఛా రసవిరోధినీ॥
(ధ్వన్యా 3 . 14 కా. వృత్తిలో సం కా)

110 క) శృంగారో వీర ఏవ వేతి కథనం సముచితరససూచకమ్। తేన ఉత్తరరామచరితే కరుణస్య ప్రబోధచంద్రోదయే శాంతస్య చ అంగిత్వమక్షతమ్॥" —దుర్గాప్రసాదపండితః
(ఉద్ధృతము సన్నిధానంవారి కావ్యాలం సం పుట 412)

ఖ) ఇదమవధేయం। ఏక ఏవేత్యభిధానముత్కర్షాధానాయ। శృంగారో వీర ఏవ వేతి పునః హాస్యబీభత్సభయానకరౌద్రమాత్రవ్యవచ్ఛేదాయ। తేన ప్రబోధచంద్రోదయే శాంతస్య ఉత్తరచరితే కరుణస్య చ ప్రాధాన్యం సంగచ్ఛతే॥ —రుచిరవ్యాఖ్యా (సా ద 3 183)

భయానకములు, ధీరోదాత్తనాయకాశ్రయములు కాకుండుటచే మహాకావ్యమున ప్రధానభావమునొందనర్హములు కావు

**కావ్యమున నవాంతర ప్రకరణములు –**

కావ్యము[111] పద్యరూపమగునేని సర్గములను పేరునను గద్యరూపమగు నేని[112] ఉచ్ఛ్వాసాశ్వాసలంభకములను నామమునను కథావిచ్ఛేదరూపములగు నవాంతరప్రకరణములుండును మహాకావ్యమున ఎనిమిది మొదలు ముప్పది వఱకు సర్గములుండవచ్చును[113] సర్గమంతయు నొకేఛందము కలిగి యుండియు చివరమాత్రము భిన్నవృత్తములుగల ఒకటి రెండు శ్లోకములుండ వలెను. లేదా సర్గమంతయు విభిన్నవృత్తములు గలిగియు నుండవచ్చును సర్గాంతమున అనంతరసర్గకథాసూచనయుండవలెను[114] సర్గనామము దానిలో వర్ణించిన కథాంశమునకు చెందినదై యుండవలెను *

---

గ) తత్ర నైషధే శృంగారః, శిశుపాలవధే వీరః, మహాభారతే శాంతః, శృంగారవీరశాంతానామిత్యత్ర బహువచనముపలక్షణమ్। తేన కరుణ-స్యాపి సంగ్రహః। తతశ్చ కరుణప్రధానస్య రామాయణస్య మహాకావ్య-త్వమక్షతమ్॥ —లక్ష్మీటీకా (సా ద 6 317)

111 'సర్గబంధో మహాకావ్యమ్॥' (కావ్యాదర్శ 1 14)

112 క) భేదశ్చదృష్టో లంభాదిరుచ్ఛ్వాసో వాస్తు కిం తతః।
తత్ కథాఖ్యాయికేత్యేకా జాతిః సంజ్ఞాద్వయాంకితా॥
(కావ్యాదర్శ 1 27, 28)

ఖ) కథాంశానాం వ్యవచ్ఛేద ఆశ్వాస ఇతి బధ్యతే॥ (సా ద. 6 . 135)

113 అష్టసర్గాన్న తు న్యూనం త్రింశత్సర్గాచ్చ నాధికమ్।
మహాకావ్యం ప్రయోక్తవ్యం మహాపురుషకీర్తియుక్॥
–ప్రభావ్యాఖ్యా. (కావ్యాదర్శ 1 . 18)

114. ఏకవృత్తమయైః పద్యైరవసానేఽన్యవృత్తకైః।
నాతిస్వల్పా నాతిదీర్ఘాః సర్గా అష్టాధికా ఇహ॥
నానావృత్తమయః క్వాపి సర్గః కశ్చన దృశ్యతే।
సర్గాంతే భావిసర్గస్య కథాయాః సూచనం భవేత్॥ (సా ద. 6 320, 321)

* "సర్గోపాదేయకథయా సర్గనామ తు॥" (సా. ద 6 . 325)

## కావ్యమున నాటకీయసంధి సంధ్యంగములు :-

ఉదాత్తనాయకాశ్రయమగు నేదేని ఇతివృత్తమును గ్రహించి దానిని రసోచితముగా తీర్చిదిద్ది నాటకీయములగు ముఖాదిసంధిసంధ్యంగములను యథోచితముగా నిబంధించవలెను కాని శాస్త్రమున్నదికదా యని వానిని కావ్యకథావస్తువున చొప్పింప యత్నించరాదు 115

## కావ్యారంభము -

ఆశీస్సు దేవతానుతి వస్తునిర్దేశము అనునీమూడింటిలో దేనితోనైనను కావ్యమారంభింపవలయును అనంతరము సుకవికుకవిస్తుతినిందాదులను కూడ చేయుటకలదు 116 ఇది గద్యకావ్యములయందేకాని పద్యకావ్యములలో నియతము కాదు. మఱియొకవిశేషము గద్యకావ్యములగు 'కథ' 'ఆఖ్యాయిక' అనువానిలో కవివంశాఖ్యాపనమును, కావ్యకరణమున దేవనృపాదిభక్తిని కారణముగా పేర్కొనుటయును నియతములై యుండును 117 ఇదియే మనతెనుఁగు ప్రబంధములలో కృత్యవతారికావిధానముగా రూపొందినది

---

115 సంధిసంధ్యంగఘటనం రసాభివ్యక్త్యపేక్షయా ।
న తు కేవలయా శాస్త్రస్థితిసంపాదనేచ్ఛయా ॥ (ధ్వన్యా. 3 12)

116 క) ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖమ్ ॥
(కావ్యాదర్శ. 1 . 14)

ఖ) ఆదౌ నమస్క్రియాశీర్వా వస్తునిర్దేశ ఏవ వా ।
క్వచిన్నిందా ఖలాదీనాం సతాం చ గుణకీర్తనమ్ ॥ (సా. ద. 6.319)

117. శ్లోకైర్మహాకథాయామిష్టాన్ దేవాన్ గురూన్నమస్కృత్య ।
సంక్షేపేణ నిజం కులమభిదధ్యాత్ స్వం చ కర్తృతయా ॥
పూర్వవదేవ నమస్కృతదేవగురుర్నోత్సహేత్ స్థితేష్వేవ ।
కావ్యం కర్తుమితి కవీన్ శంసేదాఖ్యాయికాయాం తు ॥
తదను నృపే వా భక్తిం పరగుణసంకీర్తనేఽథవా వ్యసనమ్ ।
అన్యద్వా తత్కరణే కారణమక్లిష్టమభిదధ్యాత్ ॥
(రుద్రటకావ్యా. 16 20, 24, 25)

**కావ్యనామము -**

కావ్యనామము,[118] 'కవి ఇతివృత్తము, నాయకుఁడు (నాయికయు) మఱేదేని ఇతరమగు ముఖ్యాంశము'అను నీనాల్గింటిలో దేనికైనను సంబంధించి యుండును. భట్టికావ్యాదులు కవినామమునను కుమారసంభవాదులు ఇతివృత్త నామమునను, రామాయణాదులు నాయకనామమునను సంబంధువిరచితవాసవ దత్తాదులు నాయికానామమునను శిశుపాలవధాదులు ఇతర (ముఖ్యప్రయోజన) నామమునను పేర్కొనఁబడియుండుట దీనికి నిదర్శనము

**మహాకావ్యము :-**

తెలినదేమన_యథోక్తములగు కథావస్తువర్ణ్యాంశరసాదులుకలిగియుండి ఉదాత్తనాయకాశ్రయమగుచు ధర్మార్థకామమోక్షరూపచతుర్వర్గమున నేదో యొకటి ప్రధానఫలమై యుండునదియే మహాకావ్యమగును ఇట్టిమహాకావ్యమే సర్వవిధముల లోకుల ననురంజింపఁజేయుచు చిరకాలము మనఁగలుగును [119]

**సర్గబన్ధము :-**

మహాకావ్యము పద్యరూపముననున్నచో సర్గబన్ధమనియందురు [120]

**నిబద్ధము :—**

మహాకావ్యము గద్యపద్యములలో నేరూపముననున్నను నిబద్ధమనియే పిలువఁబడును [121]

---

118 కవేర్వృత్తస్య నామ్నా వా నాయకస్యేతరస్య వా ॥ (సా.ద. 6 324)

119. చతుర్వర్గఫలాయత్తం చతురోదాత్తనాయకమ్।
నగరార్ణవశైలర్తు .. - . . . . ।
అలంకృతమసంక్షిప్తం రసభావనిరంతరమ్ ।
సర్వత్ర భిన్నవృత్తాంతైరుపేతం లోకరంజనమ్ ।
కావ్యం కల్పాంతరస్థాయి జాయతే సదలంకృతి ॥
(కావ్యాదర్శ 1 . 15_19)

120, 'సర్గబంధో మహాకావ్యమ్' (కావ్యాదర్శ 1 14), (భామహ 1.19)

121 క) తదిదం గద్యపద్యరూపం కావ్యమనిబద్ధం నిబద్ధం చ ।
(కావ్యాలంకారసూత్రవృత్తి. 1 . 3 . 27)

అనిబద్ధము -

అనిబద్ధములన ముక్తకాదులు[122] విస్తరభీతి చేతను, ఇవి గ్రంథాంతరములందు వివరింపఁబడియుండుటచేతను వీనినిచ్చట విశదీకరించియుండలేదు. ఇట్లు కావ్యప్రబంధముల స్వరూపము సంగ్రహముగా వివరింపఁబడినది

---

ఖ) 'నిబద్ధాని సర్గబంధాదీని' - కామధేనువ్యాఖ్యా
(కావ్యాలంకారసూత్ర. 1 . 3 . 27)

122 క) అనిబద్ధం ముక్తకాది॥ (కావ్యానుశాసన 8 10)

ఖ) యతః కావ్యస్య ప్రభేదాః ముక్తకం ... ఇత్యేవమాదయః ॥
(ధ్వన్యా 3 7 వృత్తి)



# ధ్వని – మనుచరిత్రము

## అష్టమ ప్రకరణము

## మనుచరిత్రము – ధ్వని విశేషములు

**'మనుచరిత్రము మహాప్రబంధము' :–**

మనుచరిత్రము మహాప్రబంధము.[1] ఇయ్యది ఆంధ్రప్రబంధములకు మకుటాయమానము. దీనిని ఆంధ్రకవితాపితామహుఁడగు అల్లసానిపెద్దన కవీంద్రుడు శిరీషకుసుమపేశలసుధామయోక్తుల రచించెను [2] ఈమహాప్రబంధము

---

1\. వ కావున మార్కండేయ పురాణోక్తప్రకారంబునం జెప్పుమని కర్పూర తాంబూలంబు పెట్టినం బట్టి మహాప్రసాదంబని మోదంబుననమ్మహాప్రబంధ నిబంధనంబునకుఁ బ్రారంభించితి (మను. 1 17)

2\. తే సప్త సంతానములలోఁ బ్రశస్తిఁగాంచి
ఖిలముగాకుండునది ధాత్రి గృతియ కాన
కృతి రచింపుము మాకు శిరీషకుసుమ-
పేశలసుధామయోక్తులఁ బెద్దనార్య ॥

క. హితుఁడవు చతురవచోనిధి
వతుల పురాణాగమేతిహాసకథార్థ -
స్మృతియుతుఁడవాంధ్రకవితా
పితామహుఁడవెవ్వ రీడు పేర్కొన నీకుఁ ॥

క మనువులలో స్వారోచిష
మనుసంభవ మరయ రససమంచితకథలఁ
విననింపు కలిధ్వంసక
మనఘ ! భవచ్చతుర రచన కనుకూలంబుఁ ॥ (మను. 1 14–16)

మనుచరిత్రనామమున లోకరూఢమయ్యును కవిసముద్దిష్టనామమున స్వారోచిషమనుసంభవమేయయినది [3]

## 1) కథాసంవిధానము :-

కథాఫలనామమున [4]శిశుపాలవధాది కావ్యములు ప్రసిద్ధములై యుండుట గమనించితిమేని ఈస్వారోచిషమనుసంభవాఖ్యమహాప్రబంధమునకు కథాఫలము స్వారోచిషమనుసంభవమే యగునని పొడకట్టకపోదు ఆ ఫలమును సిద్ధింపఁజేయుకథయే ఆప్రబంధమునందలి ప్రధానకథయగును స్వారోచిషమనువెట్లు పుట్టెనో నిరూపించుటకు రెండుతరములకథ ఇట ప్రస్తుతమైనది ఎందుకన ? ఆస్వారోచిషుఁడు శాంతి దాంతి దయా సత్య శౌచనిరతుఁడును అకాముఁడును కావుననే మనువుకాఁదగిన యర్హతగలవాడాయెను [5]

ఇట్టి పుత్రుని గన్నతండ్రి స్వరోచి భోగలాలసుఁడు బహుస్త్రీరతుఁడును కావున అతనియందు శాంతిదాంత్యాదిగుణములు మృగ్యములు ఇఁక స్వరోచి తలిదండ్రులగు వరూథినీగంధర్వకుమారులును భోగపరాయణులే కాని జితేంద్రియులుకారు కావున ఇట్టి వంశపారంపర్యముగల స్వారోచిషుఁడట్లు జితేంద్రియుఁడై సద్గుణసంపన్నుఁడగుటకు కారణమేమయి యుండనోపునను కుతూహలము పొడకట్టక మానదు తాదృశశంకానివృత్త్యర్థమే ప్రవరునికథతో నీ ప్రబంధమారంభింపఁబడినది. అతని జితేంద్రియత్వాదిగుణగరిష్ఠత్వము

---

3 "పెద్దనార్యప్రణీతంబైన స్వారోచిషమనుసంభవంబను మహా-ప్రబంధంబునందు" (మను - ఆశ్వాసాంతగద్యము)

4. నేతాఽస్మిన్ యదునందనః స భగవాన్ వీరప్రధానో రసః
శృంగారాదిభిరంగవాన్ విజయతే పూర్ణా పునర్వర్ణనా ।
ఇంద్రప్రస్థగమాద్యుపాయవిషయశ్చైద్యావసాదః ఫలం
ధన్యో మాఘకవిర్వయం తు కృతినస్తత్సూక్తిసంసేవనాత్॥
—మల్లినాథవ్యాఖ్యా (శిశు 1 . 1 శ్లో)

5 తే అట్లు జనియించి స్వారోచిషాఖ్యనతఁడు
శాంతిదాంతిదయాసత్యశౌచనిరతుఁ
డై యకామతఁ జిరతపం బాచరించె
నచ్యుతునిఁ గూర్చియంతఁ గృపార్ద్రుఁడగుచు॥ (మను 6 . 100)

వేనోళ్ళ చాటఁబడినది వరూథిని వలపు వమ్ముచేసి పావకప్రసాదమున నిజ నగరికరిగిన ప్రవరునితో నుత్తరకథకు సంబంధమేదియు లేనట్లే పొడకట్టును కాని వరూథిని ప్రవరుని వదలలేదు తదీయానూనరమ్యాకృతిని తన భావముననే నిలుపుకొన్నది పరితపించినది గంధర్వకుమారవంచితయైనది. ప్రవరదేహసమిద్ధశిఖిదీప్తితోపాటు తదీయరూపలావణ్యములనుకూడ శాంబరీ మహిమచే సంగ్రహించిన గంధర్వకుమారుని ప్రవరునిఁగానే భావించి సుఖించినది. ఆతని వంచన తానెన్నడును ఎఱుఁగకుండుటయే వరప్రసాదమై, భావనా పటిష్ఠతను చేకూర్చినది ఆ భావనాబలముననే ప్రవరుని శమదమాదిగుణములు ఆయమపౌత్రుఁడగు స్వారోచిషునియందు సంక్రమించినవి భావనాబలమేకదా కీటమును భ్రమరముగా మార్చునది. ఇదియే భ్రమరకీటన్యాయము ఈన్యాయము వరూథినియందెట్లు చరితార్థమాయెనో కవిప్రవరుఁడు మొదటనే సూచించెను. ఆపద్యమిది—

 మ. అనిమేషత్వము మాన్చె బిత్తరపుఁజూ, పస్వేదతావృత్తి మా
న్చె నవస్వేదసమృద్ధి, భోధకళ మాన్చెన్ మోహవిభ్రాంతి, తో
డనె గీర్వాణవధూటికిన్ భ్రమరకీటన్యాయమొప్పన్ మను
ష్యుని భావించుట మానుషత్వమె మెయిం జూపట్టెనా నత్తఱిన్.

(మను 2 . 33)

ఇట్లు స్వారోచిషుఁడు శాంతిదాంత్యాదిగుణగరిష్ఠుఁడగుటకు భావనాగృహీతుఁడగు ప్రవరుఁడే కారణము కావున ప్రవరుఁడే పితామహస్థానీయుఁడైనాడు

పితామహియగు వరూథినివృత్తాంతము మొదటిమూడాశ్వాసములలో వర్ణితముకాఁగా తక్కిన యాశ్వాసములలో తండ్రియగు స్వరోచియొక్క చరితము వర్ణితమైనది ఇట్టి రెండుతరములకథయే ఈప్రబంధమున ప్రధానకథ స్వరోచి చరితమున కనుబంధములగుటచే మనోరమాదివృత్తాంతములు ప్రస్తుతములైనవి కానిఅప్రస్తుతప్రస్తావమెచ్చటను లేదు వనదేవతాగర్భమున స్వారోచిషుఁడు జనించి మనుత్వము నొందుటతో నీప్రబంధము ముగియుచున్నది

మాతాపితరులగు వనదేవతాస్వరోచులవలన దైవత్వమే కాక ప్రజాపాలన సామర్థ్యాదిక్షాత్త్రధర్మములును పితామహప్రాయుఁడగు ప్రవరునివలన ధర్మ వ్యవస్థాపనకు కావలసిన శమదమాదిసద్గుణములును సంక్రమించినవాడగుటచే స్వారోచిషుఁడు మనువుకాగలిగెను కావుననే అతని పాలనలో ప్రజలు సుఖులై

మనఁగల్గిరి ఇట్టి కథాసంవిధానము సముజ్జ్వలమై ఏకవాక్యత కొఱవడక భాసించినది ఈయితివృత్తము మార్కండేయపురాణోక్తమేకాన ప్రఖ్యాతమే యయినను రసోచితకథోన్నయనముచే క్రొంగ్రొత్తతళుకులీనుచు ఆంధ్రకవితా పితామహుని లోకోత్తరసంవిధాన నైపుణిని వ్యక్తముచేయుచున్నది

## 2) నాయకుఁడు - రసము -

ఈప్రబంధమున ప్రధానకథ రెండుతరములకథల సంపుటియని ముందే నివేదింపఁబడినది అందు మొదటికథాంశమున నాయకుఁడు ప్రవరుఁడుకాఁగా రెండవకథాంశమున నాయకుఁడు స్వరోచియగుచున్నాఁడు కావ్యకథ నైక నాయకాశ్రయమైయుండుట రఘువంశాదమహాకావ్యములలో చూచుచున్నాము కావున ఈప్రబంధము నైకనాయకాశ్రయమగుట విరుద్ధముకాదు

ప్రవరుఁడు శమదమాదిసద్గుణసంపన్నుఁడు, వేలిమి, సురార్చన విప్ర సపర్య మున్నగు సమస్తధర్మములు తూలునను ప్రత్యవాయభయమున నొకనాడైనను ఇలువీడని ఆహితాగ్ని[6] అతిథు లేతెంచినారని విన్న ఎంతదవ్వైననేగి యింటికిదెచ్చి వారినిష్టాన్నసంతృప్తులఁగాఁ జేయు సచ్ఛీలముగల అభ్యాగత సేవాపరతంత్రుడు. బ్రాహ్మణుఁడింద్రియవశగతిఁజరించిన బ్రహ్మానందాది రాజ్యపదవికి దూరమగునను సదాశయసిద్ధికనుకూలముగా వేదవిహితవివిధాధ్వరనిర్మలధర్మకర్మల ననుష్ఠించువాడే కాన తుచ్ఛమగుస్వర్గాదిసుఖములు మీసాలపై తేనియలనిఈసడించిన యకాముఁడు ఎంత జితేంద్రియుఁడో అంత స్పృహణీయమూర్తి యక్షతనయేందుజయంత వసంత కంతులఁ జక్కఁదనం బునన్ గెలువఁజాలెడు వాడు వీతరాగుఁడయ్యును స్వదారమాత్రానురక్తుఁడు ఇట్లాంధ్రకవితాపితామహుడు ప్రవరుని ధీరశాంతునిఁగా తీర్చిదిద్దెను ధీర శాంతుఁడు దానధర్మవీరశాంతప్రధానుఁడై యుండును.[7]

---

6 సంకటా హ్యాహితాగ్నినాం ప్రత్యవాయైర్గృహస్థతా ॥ (ఉత్తరరామచరితము)

7 ధీరోద్ధతాదిషు త్రిష్వపి యథాక్రమం రౌద్రశృంగారశాంతలక్షణనియత-రసప్రాధాన్యేఽపి అవశ్యంభావిత్వాదుత్సాహస్య వీరరసప్రాధాన్యమపి ప్రతి-పత్తవ్యమ్ తతో వీరరౌద్రప్రధానో ధీరోద్ధతః । వీరశృంగారప్రధానో ధీర-లలితః । దానధర్మవీరశాంతప్రధానో ధీరప్రశాంత ఇతి ॥

—కావ్యానుశాసన (3 3 సూత్రవ్యాఖ్య)

శాంతశృంగారములు పరస్పరవిరుద్ధరసములు, అయ్యును ఆరెండును ఒకేనాయకునాశ్రయించి యుండుటలో అనౌచిత్యమేదియులేదు శాంతరసాశ్రయుఁడొకప్పుడు శృంగారరసాశ్రయుఁడును కావచ్చును కాని ఈరెండురసములకును కొంతవ్యవధానమవసరము ఇట్లుండుటయే నైరంతర్యవిరోధమందురు. రసాంతరమును విరుద్ధరసమధ్యమున సమావేశపఱిచిన ఈనైరంతర్యవిరోధము తొలఁగును శాంతశృంగారములు నైరంతర్యవిరోధులు శాంతరసాశ్రయుఁడగు జీమూతవాహనుఁడు మలయవత్యనురాగసమాకృష్టుడై శృంగారరసాశ్రయుఁడగుటకు అద్భుతరసమును నడుమప్రవేశపెట్టి కవి శాంతశృంగారములకుఁగల నైరంతర్యవిరోధమును పరిహరించెను 8 కాని ప్రకృతమున శాంతరసాశ్రయుఁడగు ప్రవరుఁడు శృంగారరసాశ్రయుడగుటకు నైరంతర్యవిరోధపరిహారముమాత్రముసరిపోవునట్లులేదు- ప్రవరుఁడేకపత్నీవ్రతనిష్ఠుడగుట నతనియందు వనితాంతరాలంబనకమగు శృంగారరససమావేశము పొసగదు ప్రవరుని ఏకపత్నీవ్రతనిష్ఠను కవి ఈవిధముగా వ్యక్తపఱిచెను.

ఆ వాని చక్కఁదనము వైరాగ్యమునఁ జేసి
కాంక్షసేయు జార(వార)కామినులకు
భోగబాహ్యమయ్యెఁ బూచిన సంపెగ
పొలుపు మధుకరాంగనలకుఁ బోలె (మను – 2. 52)

వాని చక్కదనము పరవనితలకు భోగబాహ్యమాయెననుటచే స్వ-కాంతకే దక్కినదని వ్యంగ్యము దీనిచే ప్రవరుఁని ఏకపత్నీవ్రతనిష్ఠ వ్యక్తమగుచున్నది ఈఏకపత్నీవ్రతనిష్ఠుఁడు వనితాంతరాసక్తుఁడగుట పొసఁగకుండుటచే నీశాంతశృంగారములు ఏకాశ్రయ విరోధికోటిలో చేరియుండుట సంభవించినది ఈవిరోధము ఉపాధిభేదమునాశ్రయించి కాని పరిహృతముకాదు కేవల రసాంతరసమావేశము సరిపోదు ఎట్లన-

సురాంగనాభిరాశ్లిష్టాః వ్యోమ్ని వీరా విమానగాః।
విలోకంతే నిజాన్ దేహాన్ ఫేరునారీభిరావృతాన్॥
(రసగం. ప్రథమా పు 59)

---

8 "ఏకాశ్రయత్వే నిర్దోషో నైరంతర్యే విరోధవాన్ । రసాంతరవ్యవధినా రసో వ్యంగ్యః సుమేధసా॥" - ... .... యథా—శాంతశృంగారౌ నాగానందే నివేశితౌ॥ (ధ్వన్యా 3 . 26)

ఈ శ్లోకమున సురాంగనా-మృతశరీరాలంబనకములగు శృంగార బీభత్స రసములనడుమ స్వర్గలాభాక్షిప్తమగు వీరరసము[9] సమావేశితమయినది వీరులు స్వర్గమునలంకరించి సురాంగనాసమాశ్లిష్టులై తమ మృతశరీరముల చూచుచున్నట్లు వర్ణితమగుటచే ఉపాధిభేదమును స్పష్టమేకదా!

ఇఁక ప్రకృతమున నాయికయగు వరూధిని పూఁతపసిండివంటి పలపుం బచరించు గంధర్వకులంబునఁ బుట్టియు జాతిస్వభావమునతిక్రమించి ప్రవరునే తప్ప నింకెవ్వనినొల్లనిది ప్రవరుని యనురాగము పడయకున్నచో తన చక్కఁదనమును జవ్వనమును ప్రాణములును నిష్ప్రయోజనములే యని పగచిన ఏకాయత్త అనన్యకాంతయగు నీ వరూథిని యనురాగము సఫలమగుటకై నాయకునకుపాధిభేదము కలుగుటయే పరిష్కారమార్గము కేవల రసాంతరసమావేశమున విరోధపరిహారము చేయఁబూనిన నది ప్రవరుని శీలమునకే కళంకమాపాదించును కాన అనౌచిత్యమే యగును

ఈ యనౌచిత్యమును రసవిరోధమును నిట్లు పరిహృతమొనర్పఁబడినవి

సీ. అర్ధచంద్రుని తేట నవఘళించులలాట
 పట్టిఁదీర్చిన గంగమట్టితోడఁ,
జెక్కుటద్దములందు జిగివెల్లువలుచిందు
 రమణీయమణికుండలములతోడఁ,
బసిఁడిచ్రాతచెఱంగు మిసిమి దోఁపఁజెలంగు
 నరుణాంశుకోత్తరీయంబు తోడ
సరిలేనిరాకట్టు జాళువామొలకట్టు
 బెడఁగారు నీర్కావిపింజతోడ

గీ. ధవళధవళములగు జన్నిదములతోడఁ
గాశికాముద్రయిడిన యుంగరముతోడ
శాంతరసమొల్కు బ్రహ్మతేజంబుతోడఁ
బ్రవరుఁడయ్యె వియచ్చరప్రవరుఁడపుడు (మను 3 71)

---

9 అత్ర సురాంగనామృతశరీరాలంబనయోః శృంగారబీభత్సయోరంతః స్వర్గలాభాక్షిప్తో వీరరసో నివేశితః ॥ (రసగం ప్రథమ పుట 60)

వియచ్చరప్రవరుఁడగు గంధర్వకుమారుఁడాకస్మికముగా నచ్చుప్రవరుఁడగుట అద్భుతరసావహము ఇట్లు శాంతశృంగారములనడుమ నద్భుతరసము సమావేశితమగుటచే రసవిరోధమును ఉపాధిభేదమున ననౌచిత్యమును పరిహరింపఁబడినవి మొదట ప్రవరుఁడు వరూథినీప్రణయమును తిరస్కరించుట యతని గుణసంపత్తినినుమడింపజేసినది ప్రవరుఁడు తనకుతెలియకయే గంధర్వునిలో నావేశించెను గంధర్వునిశాంబరీమహిమ ప్రవరునిరూపురేఖావిలాసములతో పాటు దేహసమిద్ధశిఖిదీప్తిని గూడ నాతనియందు సంక్రమింపఁ జేసినది. వరూథిని ప్రవరునిగూడి సుఖించితిననియే భావించినది ఆయమ పౌత్రునకు ప్రవరుని శమదమాదిగుణములే యబ్బినవి ఇట్లుండ నాగంధర్వునకీకథలో ప్రత్యేకాస్తిత్వమెట్లుండును? లేదుకావుననే కవి గంధర్వునినామనిర్దేశము చేయలేదు ఇట గంధర్వుఁడు ప్రవరుని పాత్రపోషించునటస్థానీయుఁడని తలంచితిమేని రససిద్ధిలో నేయాటంకమునుండఁబోదు.

ఇట్లు ప్రథమకథాంశమున (వరూథినీవృత్తాంతమున) ప్రవరుఁడే నాయకుఁడగును. ప్రధానరసము శృంగారమేయగును.

ఇచ్చట రస మాభాసమా ?

అనురాగమేకత్రనిష్ఠమగుచో శృంగారమాభాసమగును గంధర్వుడు శాంబరీమహిమచే ప్రవరరూపాదులను సంగ్రహించియే వరూథినియందనురక్తుఁడగుటచేతను, వరూథిని మొదట తాను ప్రవరనిరాకృతయైనను పిమ్మట ప్రవరుఁడే అట్లు మనసుమార్చుకొని తనయందు బద్ధానురాగుఁడాయెనని భావించుటయేకాక తానెన్నడును గంధర్వకుమారవంచితనని ఎఱుఁగకుండుటచేతను ఇచ్చటి యనురాగ ముభయనిష్ఠమగునట్లు సహృదయచర్వణాగోచరమగుటయే యీ శృంగారమాభాసముకాకపోవుటకు హేతువు పాత్రలతాదాత్మ్యముననే సామాజికులును పరితలును రసానందముననుభవింతురుకదా ! *

ప్రవరునిఁ జూచినదేతడవుగా తన వలపు గుభాళించినది వరూథిని ప్రవరుఁడావలపును తిరస్కరించెను. ఇక్కడ రతి ఏకమాత్రనిష్ఠమే

*) "యేషాం కావ్యానుశీలనాభ్యాసవశాద్ విశదీభూతే మనోముకురే వర్ణనీయతన్మయీభవనయోగ్యతా । తే స్వహృదయసంవాదభాజః సహృదయాః ॥"
—లోచన (ధ్వన్యా. 1. 1 కారికావృత్తి )

యయ్యును రసాభాసము కాదు మొదట[10] స్త్రీ తన యనురాగమును ప్రకటించును పిమ్మట పురుషుడాయమ యింగితములననుసరించి తానట్లు ప్రవర్తించును [11]ఈ పూర్వానురాగము ఏకమాత్రనిష్ఠమైనను దోషము లేదు పిమ్మట పురుషునకును అనురాగోదయమై వారి రతి చరితార్థమగుటయే దీనికి కారణము [12]పూర్వానురాగమేకమాత్రనిష్ఠమైయున్నంతవఱకది విప్రలంభ శృంగారమేయగును రతి యుభయనిష్ఠమై కృతార్థమైనచో సంభోగ శృంగారమగును

కావున వరూథిని మొదట ప్రవరునియెడ ప్రదర్శించిన యనురాగము ఏకమాత్రనిష్ఠమైనను రసాభాసముకాక పూర్వానురాగరూప విప్రలంభశృంగారమగుచున్నది వరూథినిరతియు ప్రవరవిషయమున నొకవిధముగా చరితార్థమైనదనియే చెప్పవచ్చును వరూథిని ప్రవరుని ప్రేమ పడసినట్లే భావించినది భావిసంతతి కా ప్రవరునిలక్షణములే యబ్బినవి. కథాపరిణామమిట్లుండ

---

10 ఆదౌ వాచ్యః స్త్రియో రాగః పుంసః పశ్చాత్తదింగితైః ॥ (సా ద 3 195)

11 ప్రథమమజాతానురాగే వత్సరాజే జాతానురాగాయాః రత్నావళ్యాః పూర్వానురాగస్యాభాసత్వప్రసంగ ఇతి చేత్, ఉచ్యతే। అభావో హి త్రివిధః ప్రాగభావోఽత్యన్తాభావః ప్రధ్వంసాభావశ్చేతి। తత్ర ప్రాగభావే దర్శనాది కారణేషు రాగోత్పత్తిసంభావనయా నాభాసత్వమ్। ఇతరయోస్తు కారణ-సద్భావేఽపి రాగానుత్పత్తేరాభాసత్వమేవ ॥ (రసార్ణవ. ద్వితీ పుట. 122)

12 క) యతః పూర్వానురాగోఽయం సంకల్పాత్మా ప్రవర్తతే।
సోఽయం పూర్వానురాగాఖ్యో విప్రలంభ ఇతీరితః ॥
(రసార్ణవ 2 174)

ఖ) అపరస్తు అభిలాషవిరహేర్ష్యాప్రవాసశాపహేతుక ఇతి పంచవిధః ॥
(కావ్యప్రకాశః 4 1 వృత్తి.)

గ) పూర్వానురాగమానాఖ్యప్రవాసకరుణాత్మనా।
విప్రలంభాభిధానోఽయం శృంగారః స్యాచ్చతుర్విధః।
—బాలబోధినీ. (కావ్య 4 . 29 కా )

నది యాభాసమెట్లగును విభావానుభావాదులు సమములై యుండు[13] రసములలో నది ఏరసమో నిర్ణయించుటకు కథాపరిణామమే హేతువగును వ్యభిచారిభావమగు ఇష్టవస్తుగుణగణాదిస్మృతి కరుణరసము నుద్దీపింపఁజేయునట్లే విప్రలంభశృంగారరసమునుగూడ దీపింపఁజేయును కథాపరిణామమున సమాగమమున్న నది విప్రలంభశృంగారమనియు లేదేని అది కరుణరసమనియు లాక్షణికులు నిర్ణయించియున్నారు[14] ఇట కథాపరిణామమున వరూథిని ప్రవరసమాగమమునొందినట్లే తానుభావించినతీరు నిబద్ధమైయుండుట చేత తృతీయాశ్వాసమున వరూధిని గావించిన యాత్మోపాలంభము ప్రవరవదనాద్యవయవలావణ్యస్మృతియును విప్రలంభశృంగారరసపోషకములే యగును కావుననే విప్రలంభోద్దీపకములగు చంద్రమలయమారుతాదుల దూషణములను కవి నిబంధించుట యుపపన్నమగుచున్నది

వరూథినికి ప్రవరసమాగమప్రత్యాశయే లేకున్నచో నిదియంతయు కరుణరసమునే పోషించునని చెప్పవలసియుండును[15] వరూథినికి గల ప్రవరసమాగమప్రత్యాశను ధరణీసురవరుఁడరిగిన చొప్పరయుటలోను చెలుల పలుకులలోను తొణకిసలాడఁజేసెను కవివరేణ్యుడు[16] గంధర్వకుమారునికే వరూ

---

13 వ్యాఘ్రాదయో హి విభావా భయానకస్యేవ వీరాద్భుతరౌద్రాణామ్। అశ్రుపాతాదయోఽనుభావాః కరుణస్యేవ శృంగారభయానకయోః చింతాదయో వ్యభిచారిణః కరుణస్యేవ శృంగారవీరభయానకానామ్ ॥

(కావ్యాను. 2 1 సూ వృత్తి)

14 క) యత్ర పునరనుజ్జీవనేన సంభోగాభావః, తత్ర సత్యం శోక ఏవ, యత్ర సోఽస్తి తత్ర విప్రలంభ ఏవ ॥ (రసార్ణవ 2 219 కా వృత్తి)

ఖ) యదా తు సత్యపి మృతత్వజ్ఞానే దేవతాప్రసాదాదినా పునరుజ్జీవనజ్ఞానం కథంచిత్ స్యాత్, తదాఽఽలంబనస్య అత్యంతికనిరాసాభావాత్ చిరప్రవాసఇవ విప్రలంభఏవ, న స కరుణః ॥ (రసగం ప్రథమ పుట ౩౪)

15 తథా హి విప్రలంభేఽనవచ్ఛిన్న ఏవ సంభోగమనోరథః, నిరాశత్వే తు కరుణ ఏవ స్యాత్ ॥ (కావ్యాను. 2 3 సూ. వృత్తి)

16 క) తిరుగుచు ధరణీసురవరుఁ
ధరిగిన చొప్పరసియరసి యటగానక- (మను 3 4)

ధినియెడ రతి యుండుటయు, ప్రవరుఁడు వరూధినిమనోగతమును (రతిని) తిరస్కరించుటయును వాస్తవములేయయినను గంధర్వుఁడు ప్రవరరూపముననే వరూథినీప్రేమపాత్రుడాయెనే కాని తనంతతానుగా కాదుకదా ' నటుఁడు పాత్రను పోషించునపుడు కనఁబఱచిన యనుభావాదులు తనకుఁ గాక ఆపాత్రకే చెందునట్లు గంధర్వుని యనుభావాదులన్నియు ప్రవరునకుఁజెందినవై భావుకులు భావింతురు ఇట్లు వరూథినిదృష్టిలో నతఁడు ప్రవరుఁడే యగుటచేతను భావుకుల దృష్టిలోను ప్రవరపాత్రధారియేయగుటచేతను, వరూథిని ప్రవరరతిస్థాయిక మగు శృంగారరసమే చర్వణాగోచరమగునే కాని తదాభాసము కాదు

ఈ శృంగారరసము, వరూధిని ప్రవరునియెడ స్వాభిలాష ప్రకటన సమయమున [17]అభిలాషహేతుకవిప్రలంభరూపనను, ప్రవరునిచె తిరస్కృతి నొంది తదీయవిరహదోదూయమానమానసయై తన్ను తాను నిందించుకొను సందర్భమునను ఉద్దీపకములగు చంద్రమలయపవనాదుల నుపాలంభించు సమయమునను [18]ఏకతరాననురాగజన్యవిరహహేతుకవిప్రలంభరూపమునను, శాంబరీమహిమచే ప్రవరునిరూపురేఖలవిలాసముతోపాటు తదీయదేహసమిద్ధ శిఖిదీప్తిని సంగ్రహించి ప్రవరరూపుడై యున్న గంధర్వకుమారుని కలయిక సందర్భమున సంభోగరూపమునను పోషింపఁబడినది

---

ఖ) ఉ "నేఁటికి నందుఁబోద మా
నందనభూమి భూమిసురనందనుఁడుండకపోఁడు" (మను 3 63)

గ) ఉ . విప్రవరుండు గోలయుఁ
బాలుఁడుగాన నప్పటికిఁబైఁబడఁ గొంకెడుగాని వానికిఁ
గాలొకచోటనిల్చునే వగఁ మగుడఁ నినుఁజూచునంతకుఁ.
(మను 3 . 64)

17. అపరస్తు అభిలాషవిరహేర్ష్యాప్రవాసశాపహేతుక ఇతి పంచవిధః ॥
(కావ్యప్రకాశ 4 . 29 కా వృత్తి)

18 విరహస్తు ఏకదేశస్థితయోరపి ఏకతరస్యాననురాగాత్, అనురాగే సత్యపి వా దైవప్రతిబంధాత్ గురులజ్జాదివశాచ్చ అసంయోగః ॥ '
—బాలబోధినీ (కావ్యప్రకాశ 4 29 కారికావృత్తి )

యథాసంభవముగా నాయా రసములును పోషింపఁబడినవి. ఉపక్రమమున ప్రవరునియందు సద్ధర్మాచారణోత్సాహస్థాయికమగు ధర్మవీరమును హిమవన్నగమును సందర్శించి దాని లోకోత్తరమహత్త్వమును "తలమే బ్రహ్మకునైన" (మను 2 12) అని యుగ్గడించునపుడు అద్భుతరసమును, వరూధినితో- "బ్రాహ్మణుఁడింద్రియవశగతి చరించిన బ్రహ్మానందాధిరాజ్యపదవికి దూరమగు"నని[19] పలుకుసందర్భమున శాంతరసమును తన నగరిచేర కాలు రాక వగచినసమయమున కరుణరసమును పోషింపఁబడినవి. మఱియు ఔషధసిద్ధుని పలుకులలోను,[20] గంధర్వకుమారుఁడు ప్రవరుఁడైన[21] సందర్భమునను అద్భుతరసము పోషింపఁబడినది

ఇట్లు నానారససమంచితమై శృంగారరసప్రాధాన్యముతో నొప్పునీ వరూథినీవృత్తాంతము స్వరోచియుదయించుటతో ముగియుచున్నది

ఇఁక అనంతరకథ వరూథినీతనయుఁడగు స్వరోచిది. స్వరోచి ఆర్తత్రాణము భూతదయమున్నగు ఉదాత్తగుణములు గల వీరుఁడు. అయినను వేటతమక మీతనికి మెండు. దుష్టమృగములబారినుండి తమ్ము రక్షించుటకై ప్రజలచే నభ్యర్థింపఁబడినది కాదీ వేట వేట సప్తవ్యసనములలో[22] నొకటియే గాక చతుఃషష్టికళలలోఁ బేర్కొనఁబడిన[23] నొకకళకూడ. కావున ఈ మృగయాకౌతుకముచే నీతఁడు కళాప్రియుఁడును నిశ్చింతుఁడును అగుచున్నాడు మఱియు వరూథినీభోగలాలసత మూర్తీభవించినదా యనునంత భోగపరాయణుడు కావుననే తన బహుభార్యావల్లభత్వము హంసీహారిణముల విమర్శలకు గుఱియైనను సరకుగొనక చిరకాలము కామోపభోగములలో తేలియాడెను. అయినను స్వదారత్రయమాత్రరతుఁడైన ఈతనికామము ధర్మవిరుద్ధము కాదు. ఇట్లు మృగయావినోది నిశ్చింతుఁడు భోగపరాయణుఁడును అగు స్వరోచి వీర

---

19. మను 2 . 60 20. మను 1 74, 75 21. మను 3 71

22 స్త్రియోఽక్షా మృగయా ద్యూతం వాక్పారుష్యం చ పంచమమ్ ।
మహచ్చ దండపారుష్య మర్థదూషణమేవ చ ॥ (నీతిశాస్త్రం)

23 వేట చతుష్షష్టికళలలో నొకటిగా నాంధ్రవాచస్పత్యము పేర్కొనినది (సంకేతపదకోశము పుట. 258)

శృంగారప్రధానుఁడగు[24] ధీరలలితుఁడే యగుచున్నాఁడు ఇతఁడు తన ప్రేయసులగు మనోరమాదుల మువ్వురను సమానానురాగప్రతిపత్తితో నాదరించినవాఁడు కావున దక్షిణనాయకుఁడును

ఈతని దక్షిణనాయకత్వమింతటితో చరితార్థము కాలేదు మృగయాకౌతుకోల్లాసమునఁ జరించు నితని హరిణాగంనారూపమున వనదేవత సమీపించి యాలింగనసౌఖ్యమర్థించి పడసినతోడనే అంగనయై—"రాజా' నే నివనదేవతను, సకల భూభువనరక్షాదక్షుఁడగు మనువును నీయందుఁ బడయునెన్నిక సమస్త దివిజులు నన్నుఁ బ్రార్థించిన వచ్చితిని, అనురాగవతినైన నన్ను వరించి పడయుము నాయందపత్యము, దీన నీకు పుణ్యలోకసంప్రాప్తి యగునని అభ్యర్థింపఁబడి, అట్ల కాకయని అయ్యంబుజాతాక్షినేకచిత్తంబుతో నంగీకరించి స్వరోచి ఆయమయందు స్వారోచిషుని బడయుటతోనే చరితార్థమగుచున్నది. స్వారోచిషుఁడుదయించి శమదమాన్వితుఁడై తపమాచరించి భగవదనుగ్రహమున మనువాయెనని చెప్పి, అతని పాలనలో ప్రజలు సుఖులై మనిరను ఫలశ్రుతితో ముగింపునకు అతఁడు మనుత్వమునొందెనని చెప్పుటలోనే కవితాత్పర్యము గోచరించుచున్నది కావున స్వారోచిషమనుసంభవము ఈకథాంశమునకే కాక యావత్ ప్రబంధకథకును ఫలమగుచున్నది ఇట్లు ఫలానుగుణమగు శృంగారరసమే ఈ ప్రబంధమున ప్రధానరస మగుచున్నది భోగలాలసుడైనను స్వరోచియనురాగమున కధర్మస్పర్శ లేకుండుటచే నీ శృంగారము ధర్మ్యమగుచున్నది

దక్షిణనాయకానురాగము సర్వసంప్రతిపన్నము[25] కావున నిది రసాభాసము

---

24 తత్ర వీరరౌద్రప్రధానో ధీరోద్ధతః, వీరశృంగారప్రధానో ధీరలలితః ॥
(కావ్యాను 3 3 సూ వృత్తివ్యాఖ్య)

25 క) నన్వేవం దక్షిణాదీనామపి రాగస్యాభాసత్వమితి చేత్, న । దక్షిణస్య నాయకస్య నాయికాస్వనేకాసు వృత్తిమాత్రేణైవ సాధారణ్యం న రాగేణ తదేకస్యామేవ రాగస్య ప్రౌఢత్వమితరాసు తు మధ్యమత్వం మందత్వం చేతి తదనురాగస్య నాభాసతా ॥ (రసార్ణవ 2 263 కా. వృత్తి)

ఖ) పుంసోఽప్యనేకనాయికానురాగే రసాభాసత్వమితి కేచిత్ । తర్హి తన్మతే దక్షిణనాయకానురాగస్య సర్వసంప్రతిపన్నరసభావస్య ఆభాసత్వ-

కాదు. రసమాభాసమగుటకు కారణము అనౌచిత్యమే[26] కదా ! లోకవ్యవహారమును శాస్త్రమర్యాదను అతిక్రమించుటవలన అనౌచిత్యమేర్పడును[27] స్త్రీకి బహుపురుషాసక్తి రసాభాసమేయయినను ద్రౌపదికిగల బహుపతివిషయకరతి ధర్మ్యమగుటచేతనే రసాభాసము కాలేదు[28] అట్లే స్వరోచికిని పరిణీతలగు నైకనాయికలయెడఁగలరతి ధర్మ్యమేయగుటవలన అనౌచిత్యస్పర్శ లేకుండుటచే నీ శృంగారమును రసాభాసము కాదు ఇట్టి కథకు ప్రధానరసము శృంగారము యథాసంభవముగా నాయాయారసములును పోషింపఁబడినవి స్వరోచి వేటవర్ణనయందు రాక్షసరూపముననున్న ఇందీవరాక్షునితో యుద్ధవర్ణనయందును వీరరసము, రాక్షసత్రస్తయై మనోరమ- "హా వనిత నహాథ నబల నార్త విపన్నం గావరే" (మను 4 66) యని విలపించుసందర్భమున భయానక-కరుణరసములును, రజనీచరుఁడు గంధర్వుడైన సందర్భమునను, హరిణి వనదేవతగా మారినసందర్భమునను అద్భుతరసము, ఇందీవరాక్షుని యుద్ధవర్ణనలో రౌద్రరసమును, రాక్షసుని రూపవర్ణనమున భయానకరసమును, స్వారోచిషునియందు శాంతరసమును పోషింపఁబడినవి

ఈ స్వారోచిర్వృత్తాంతమున నుపకథలు మూడున్నవి- మనోరమాదుల శాపవృత్తాంతము ఇందీవరాక్షుని శాపవృత్తాంతము- కళావతీజన్మవృత్తాంతము

---

ప్రసంగ ఇతి చేన్నైవమ్ । తస్యాఽప్యేకస్యామేవ గాఢానురాగత్వాత్। అన్యత్ర తు క్వచిన్మధ్యత్వం క్వచిన్మందత్వమితి నిశ్చితమ్ । "తుల్యోఽనేకత్ర దక్షిణః" ఇతి లక్షణం పునరనేకాసు నాయికాసు అనువృత్తిమాత్రపరత్వేన తుల్యత్వపరమితి ద్రష్టవ్యమ్ ॥
—రత్నాపణ (ప్ర రు రస 9 కా వృత్తి)

26 "తదాభాసా అనౌచిత్యప్రవర్తితాః ॥ (కావ్య 4 49 సూ)

27 అనౌచిత్యం హి శాస్త్రలోకాతిక్రమాత్ ప్రతిషిద్ధవిషయకత్వాదిరూపం సామాజికవేద్యమ్॥ —బాలబోధినీ (కావ్య. 4 . 49 సూ)

28 క) అత ఏవాన్యత్ర అనేకకాముకవిషయరతేరాభాసత్వేఽపి పాండవేషు ద్రౌపద్యా న తథా ॥ —బాలబోధినీ (కావ్య 4 . 49 సూ.)

ఖ) ప్రాంచ స్త్వపరిణేతృబహునాయకవిషయత్వే రతేరాభాసతేత్యాహుః ॥
(రసగం. ప్రథమ రసాభాస)

మనోరమను శపించి నాగబెత్తముతో కొట్టుజీర్ణమునియందును వంచనతో విద్యగైకొని 'గంట్రా డాఁచిన పెండ్లి యెమిటికిఁజిక్కుం గష్టముష్టింపచా' (5 17) అని పరిహసించునిందీవరాక్షుని శపించుబ్రహ్మమిత్రునియందును రౌద్రరసము, దేవాపియను గంధర్వుని యాకారవర్ణనయందును ఆతఁడు పారర్షిని సంహరించుసందర్భముననుబీభత్సరసము, పుంజికస్థలయనునచ్చర పారర్షితపోభంగమొనర్చుతఱి శృంగారరసమును పోషితములైనవి కాని ఈ శృంగారము తల్లిదండ్రులయెడ కళావతిచె వర్ణితమగుటచె ఔచిత్యమును కోల్పోయి వైరస్యమునాపాదించుచు రసాభాసమగుచున్నది జగత్పితరులగు ఆ పార్వతీపరమేశ్వరులశృంగారమును వర్ణించుట ఆకాళిదాసునకొకనికేచెల్లినది 29 ఇవి యుపకథలయందలి రసములు

ఇట్లు "మనుచరిత్ర'మని ప్రసిద్ధినిబడసిన స్వారోచిషమనుసంభవమను నీమహాప్రబంధమున అనుస్యూతములగు వరూధినీస్వరోచులవృత్తాంతముల సంపుటియే ప్రధానమగు నితివృత్తము స్వారోచిషమనుజన్మయే కథాఫలము శృంగారమే ప్రధానరసము

ఇది మనుచరిత్రమునందలి వస్తుసంవిధానరసపోషణముల విధానము.

## వర్ణనల వైవిధ్యము —

ప్రబంధము వర్ణనాబహుళము కాన ఈ మనుచరిత్రమున రసోచితములగు వర్ణనలెన్నియో చేయఁబడినవి ప్రవరుని జన్మస్థలమగు నరుణాస్పదవర్ణనతో (1 50, 51) నీప్రబంధము ప్రారంభింపఁబడినది ప్రవరుఁడు పాదలేపనప్రభావమున చూడనరిగినహిమవన్నగవర్ణనము (2 3 - 12) కడు హృద్యముగా నున్నది వరూథిని ప్రవరతిరస్కృతయై పరితపించు సందర్భమున విప్రలంభశృంగారోద్దీపకములగు సూర్యాస్త (3 10-16) సంధ్యారా (3 17)(అ)ంధకార (3 18, 19) చంద్రోదయ (3 20 - 26) చంద్రికావ్యాప్తుల (3 . 27, 28) వర్ణనలు, చంద్ర (3 . 35 - 45) మన్మథ 3.46-48)

---

29 కింతు రతిః సంభోగశృంగారరూపా ఉత్తమదేవతావిషయా న వర్ణనీయా। తద్వర్ణనం హి పిత్రోః సంభోగవర్ణనమివాత్యంతమనుచితమ్ । యత్తు కుమారసంభవే హరగౌరీసంభోగవర్ణనం తత్కవిశక్తితిరస్కృతత్వాత్ భూమ్నా న దోషత్వేన ప్రతిభాసతే ॥ (కావ్యాను 3 . 3 వృత్తి)

మలయానిలాదుల (3 49 - 51) దూషణలును చేయఁబడినవి విరహసంతప్తయైన వరూథిని జాగరము తెలియుటకా? యనునట్లు క్రమక్రమముగా తెల్లవాఱి ప్రొద్దుపొడుచు దృశ్యము కన్నులకు కట్టినట్లు చంద్రాస్తమయము (3 53) వేగుచుక్కపొడుపు (3. 54) కోడికూత (3 55) దీపపుకళికలు వెల్వెలబాఱుట (3 56) ప్రాభాతికవాయువు (3 57) కీరశారికల కలకలారావములు (3. 58) సూర్యోదయము (3. 59) భృంగములకు కమలోదరబంధవిముక్తి (3 60, 61) చక్రవాకసమాగమము (3 62) అను వర్ణనాంశములతో తీర్చిదిద్దఁబడినది ఈ ప్రాభాతికదృశ్యమును వరూథినిని సంబోధించి చెలియ వర్ణించుటలో ఊరడింపు ధ్వనించుచున్నది అనంతరము వరూథిని యుల్లము నుల్లాసపఱచుటకై చెలులపరిహాసోక్తులతో నిండిన యుద్యానవర్ణనమును, (3 75 - 83), పుష్పాపచయజలక్రీడాదివర్ణనమును (3 84 - 86) చేయఁబడినవి

ఇఁక స్వారోచి(ర్) వృత్తాంతమున [30]మృగయా వివాహములు[31] సాంగముగా వర్ణింపఁబడినవి పెండ్లికొడుకైన స్వారోచిని వివాహవేదికకుఁగొనితెచ్చుటకై లేఖస్వామిచౌదంతి(ఐరావతము)పై నూరేగించు సమయమున నతని యందమునబ్బురపాటుతోఁ జూచు పౌరాంగనల విభ్రమములు, మాఘకావ్యమున వర్ణితములైన శ్రీకృష్ణసౌందర్యదర్శనలాలసలగు ఇంద్రప్రస్థపౌరాంగనల విలాసచేష్టలను తలపించుచున్నవి మాఘకావ్యమున నిట్లున్నది—

> "వ్యతనోదపాస్య చరణం ప్రసాధికాకరపల్లవాద్రసవశేన కాచన ।
> ద్రుతయావకైకపదచిత్రితావనిం పదవీం గతేవ గిరిజా హరార్ధతామ్॥"

> "అధిరూఢయా నిజనికేతముచ్చకైః పవనావధూతవసనాంతయైకయా ।
> విహితోపశోభముపయాతి మాధవే నగరం వ్యరోచత పతాకయేవ తత్॥"
> (శిశు. 13/33, 36)

ఇఁక మనుచరిత్రమునందలి పద్యములివి—

మ ఒకనేత్రాంబుజ మొక్కగల్ల మొకచన్నొయ్యారపుంలీల వీ
థికిఁదోపఁ దలపోరఁగా నొకపురంధ్రీరత్న మీక్షించె రా

30. మను 4 26 - 59.    31 మను 5 53 - 103.

జకిశోరంబు దదీయలై వెలయు భాషాలక్ష్ములం జూచి త్ర్యం
బకభాగంబు మొఱంగి మైత్రికి శివాభాగంబ యేతెంచె నాఁ

చ చిలుకలకొల్కికల్కి యొకచేడియ నాటకసాలమేడపై
నిలువుననాడుచుండి ధరణీపతిఁ జూడఁ దలంచి యంచునన్
నిలిచి రహిం గనుంగొనుచు నెయ్యమునం దనువల్లియుబ్బి కం
చెల తెగిపడ్డఁ గేతనముచీరచెఱంగున మూసెఁజన్నులన్

(మను 5 . 69. 63)

ఒకేదృశ్యము నిద్దఱుమహాకవులుభావించినతీరు పరిశీలించినపెద్దనదే పయిచేయియగునని స్ఫురింపకపోదు. ఎట్లన ?

రెండవపదమును లాక్షారాగరంజితమొనరించుకొను నోపికలేక శ్రీకృష్ణునిఁజూడ పరుగులిడఁగా భూమిపై చిత్రితములైన ఒకేఒకకాలిలత్తుక ముద్ర లా ముదితను శివశరీరార్ధమునొందినగిరిజగాఁ జేసినవి మాఘకవి భావనలో, కాని పెద్దనకవీంద్రునిభావన యనన్యాదృశమై మనకు త్ర్యంబక భాగంబు మొఱంగిఁ యేతెంచినశివాభాగపుసమగ్రస్వరూపమునే సాక్షాత్కరింపఁ జేసినది. ఇది మొదటిదృశ్యము ఇఁక రెండవది—

వెన్నునిచూడవేడుకపడి మేడపైభాగమున నిలిచినయొకచేడియ తన చీరచెఱంగు గాలికిరెపరెపలాడగా ఆనగరికే పతాకయై నిలిచినదని మాఘకవి భావన కాఁగా "ఒకానొకతరుణి ధరణిపతిఁజూచుచు పరవశించఁ దనతనువల్లి యుబ్బి కుచపట్టికతెగిపడగా కేతనపుచీరచెఱంగున తనకుచముల మఱఁగు పఱచుకొనె"ననునది ఆంధ్రకవితాపితామహుఁడు భావించినతీరు—ఇదియే కడుం గడు మనోహరమనుట స్పష్టముకదా!

ఇట్లు పౌరాంగనలవిభ్రమములు కడుహృద్యముగా పదిపద్యములలో[32] వర్ణింపఁబడినవి

వివాహవర్ణనమున పూర్వకవులుతెలుపని యాంధ్రదేశమునందలి యనేకలౌకికాచారములను ప్రస్తావించుట ఇట విశేషము [33]

---

32 మను 5 61 - 70 33 ప్రబంధవాఙ్మయవికాసము పుట 334

[34]నగర–పర్వత-చంద్రార్కోదయాస్తవర్ణన లిందును చేయఁబడుటచే పునరావృత్తములైనను కొంగ్రొత్తపోకడలతో నొప్పుచు కవివతంసునిభావనా వైచిత్రిని చాటుచున్నవి

పారక్షితపోభంగమునకై పుంజికస్థలయనునచ్చర యేతెంచుసమయమున వసంతర్తువర్ణన (6 26 - 29) చేయఁబడినది. మంత్రదూత్యజైత్రయాత్రాదులు రసాననుగుణములగుటచే త్యజింపఁబడినవి మనోరమాస్వరోచుల వివాహమునకనుబంధులై యుండుటచే ఇందీవరాక్షునితో యుద్ధము స్వరోచి విజయమును వర్ణింపఁబడినవి [35] సంభోగశృంగార కుమారోదయములు అవసరప్రాప్తములగుటచే వరూథినీవృత్తముననేగాక[36] స్వరోచివృత్తాంతమునను[37] వర్ణితములైనవి. అంతమున దశావతారవర్ణన కవిభక్తిభావమును చాటుచున్నది.

ఇట్లు కథానుగుణములును రసోచితములును అగువర్ణనలతో నొప్పారుచున్న దీ మనుచరిత్రమహాప్రబంధము

## వ్యంగ్యప్రాధాన్యము :–

ఈ మహాప్రబంధ ముత్తమశ్రేణికిఁ జెందిన ధ్వనికావ్యము యథాప్రదేశ వినివేశితములగు నాయాపదములలోను పద్యములలోను పాత్రలస్వరూప స్వభావచిత్రణలోను సంభాషణావిధానములోను ప్రకృతివర్ణనలలోను ఏదో యొక రసమో భావమో అలంకారమో వస్తువో వ్యంగ్యమై యొప్పారుచునే యుండును.

ప్రథమాశ్వాసమున ప్రవరునివర్ణించుతఱి కవి యతని గుణగణములను విశేషించి పేర్కొని యతని శరీరలావణ్యమును గుఱించి 'మకరాంకశశాంక మనోజ్ఞమూర్తి'యనునొక్కమాటతోఁ జెప్పి విడిచివేసెనేకాని ప్రత్యవయవ లావణ్యమును నిర్వర్ణించియుండలేదు కాని దానినే వరూథినీముఖమున రెండుమార్లు వర్ణింపఁజేసెను

---

34 "ఇందీవరాక్షనగరము (5 . 30), మందరగిరి (5 4/–52) ప్రొద్దుగ్రుంకు నుండి వెన్నెల విరియువఱకు (5 . 31 - 38), వేగయి ప్రొద్దుపొడుచుట (5 . 40)" ఇవి పునరావృత్తములైన వర్ణనాంశములు

35 మను. 4 95 - 116, 36 మను 3 117 - 123, 4 . 1 - 6

37 మను. 6 . 3–8, 6 . 99, 100,

ప్రవరుని జూచిన వరూథిని యతని చక్కదనము నిట్లు తలపోసినది—

సీ వదనప్రభూతలావణ్యాంబుసంభూత-
కమలంబులన వీనికన్నులమరు,
నిక్కి వీనులతోడ నెక్కసక్కెములాడు
కరణినున్నవి వీనిఘనభుజములు,
సంకల్పసంభవాస్థానపీఠిక వోలె
వెడదయై కనుపట్టు వీనియురము,
ప్రతిఘటించు చిగుళ్ళపై నెఱ్ఱవాఱిన
రీతినున్నవి వీని మృదుపదములు

గీ॥ నేరెటేటియసల్ తెచ్చి, సీరజాప్తు
సానఁబట్టిన రాపొడి చల్లి, మెదపి
పదనుసుధనిడి చేసెనో పద్మభవుఁడు
వీనిఁగాకున్నఁగలదె యీ మేనికాంతి (మను 2 . 36)

వదనము లావణ్యవారాశియనియు, కన్నులు విశాలమనోజ్ఞములై ముఖ-శోభనినుమడించుచున్నవనియు భుజములున్నతములై యున్నవనియు, ఉరము వైశాల్యము ఆశ్లేషేచ్ఛను కలుగఁజేయుచున్నదనియు, పదములు పల్ల-వాధిక సౌకుమార్యారుణ్యములు కలిగియున్నవనియు, మేనికాంతి కన్నుల నమృతముకురియుచు వన్నెదఱుగకయున్నదనియు వరూథినీహృదయగత భావము

ఇందు ప్రవరుఁడాలంబనవిభావము అతనిలోకోత్తరసౌందర్య ముద్దీవన విభావము ఏతాదృశవర్ణన మనుభావము వితర్కము వ్యభిచారిభావము వీనిచే వరూథినికి ప్రవరునియెడఁగల రతి యభివ్యక్తమగుచు శృంగారరసధ్వని యగుచున్నది

అయినను—ప్రవరుని ప్రత్యవయవలావణ్యము లోకోత్తరమైయున్నట్లు వరూథినియూహించినతీరు - "కాకున్న కలదె యీమేనికాంతి" యనుటచే నిశ్చయరూపమైనందున నిందు వితర్కమను[38] వ్యభిచారిభావము శృంగారరసపరి

38 సందేహానంతరం జాయమాన ఊహో వితర్కః । స చ నిశ్చయానుకూలః॥
(రసగం ప్రథమా. భావధ్వని.)

పోషక మగుచు ప్రధానముగా ధ్వనించుచున్నది 'ప్రాధాన్యేన వ్యపదేశా భవంతి' అను న్యాయమున దీనిని రసధ్వనియనుటకన్న భావధ్వనియనుటయే సమంజసమైయున్నది [39]

ఇట్లప్రవరతిరస్కృతయై పరితపించుచున్నవరూథిని—

ఉ. కమ్మనికుదనంబు కసుగందనిమేనెలదేఁటిదాఁటులఁ
బమ్మెరవోవఁదోలుఁదెగబారెఁడువెండ్రుక లిందుబింబముం
గిమ్మనసీదు మోము గిరిక్రేపులు మూఁపులు కౌను గానరా
దమ్మకచెల్లః వానివికచాంబకముల్ శతపత్రజైత్రముల్ (మను 3. 6)

ఇట్లు వానియందమును తలపోసినది ఇట చింతావిశేషము విభావము 'అమ్మకచెల్లః' అనుటచే నాక్షిప్తమగు భ్రూన్నయనాదులు అనుభావములు దీనిచే "స్మృతి" యను వ్యభిచారిభావము విప్రలంభశృంగారపరిపోకమగుచు ప్రధానముగా ధ్వనించుచున్నది

ఈ వర్ణనలు కవి మొదటనే చేసిన నీభావధ్వని యుండెడిది కాదు

ప్రకృతివర్ణనలనైనను కవి తనకు తానై చేయక ప్రాత్రలముఖమున చేయించుచు వానికొకయందము చేకూర్చినాడు

వరూథినితో పలుకుచెలిపలుకులలో చంద్రాస్తమయవర్ణనమిది—

ఉ. పాటన సేయమిం గురులు పైఁబడి శీర్ణపటీరపంకలా
లాటికమై దరస్మితవిలాసపుచంద్రిక డొంకి వాడుటం
దేట దొఱంగి విన్ననగునీమొగమోః యన మాసి చంద్రుడో
పాటలగంధి వ్రాలెనదె భానురుచిం దన కందు మీఱఁగన్
(మను 3. 53)

చంద్రునకు వరూథినీముఖసాదృశ్యము చెప్పుటచే నిట ప్రతీపాలంకారము[40] వాచ్యము. దీనిచే-'చెలీః చంద్రుడిట్లునిన్నోచినపాప మూరకపోక

---

39 "ముఖ్యే రసేఽపి తేఽంగిత్వం ప్రాప్నువంతి కదాచన"
(తే భావశాంత్యాదయః అంగిత్వం రాజానుగతవివాహప్రవృత్తభృత్యవత్॥)
—కావ్యప్రకాశ. 4 51 సూ

40. "ప్రతీపముపమానస్యోపమేయత్వప్రకల్పనమ్॥" (చంద్రా శ్లో 12)

తన (చంద్రుని)పతనమునకు కారణమైనది చూచితివా' అనునూరడింపు(వస్తువు) ధ్వనించుచున్నది

చెలిగాక కవియే ఈవర్ణనచేసిన నీధ్వని యుండెడిదికాదు

ఈసందర్భమునందలి మఱియొకవర్ణన—

మ. ఉరుసంధ్యాతపశోణమృత్కలితమై యొప్పారుబ్రహ్మాండమ
న్గరడిం గాలపుహొంతకాఁడు చరమాగస్కంధముం జేర్చుని
బ్బరపుఁసంగడమోయనన్ శశి డిగెం బ్రాగ్భూమిభృత్కైతవే
తరబాహాగ్రపుసంగడంబనఁగ మార్తండుండు దోచెన్ దివిన్ ॥
(మను. 3 59)

ఒకవైపుచంద్రుఁడస్తమించుచుండ మఱోవైపు సూర్యుఁడుదయించుటను తీర్చిదిద్దినపద్యమిది

ఇట కాలపుహొంతకాఁడు చరమాగస్కంధముం జేర్చునిబ్బరపుఁ సంగడము"కవికల్పితోపమానమేయగుటవిది[41] యుత్ప్రేక్షాలంకారము దీనిచే 'వృద్ధిక్షయములు సుఖదుఃఖములును ఏకాంతభోగ్యములై యుండక చక్రనేమి క్రమమున పరివర్తననొందునవియగుటచే, "చెలీ! అధైర్యపడకుము, విరహము తొలఁగి ఇష్టజనసంయోగసుఖమనతికాలముననే సంప్రాప్తించు"నను ఊరడింపు ధ్వనించుచున్నది

ప్రతీయమానచ్ఛాయయే కదా కవివాక్కునకందమునందఁజేయునది[42]

ఇవియన్నియు పాత్రలముఖమునచేసినవర్ణనలు-కాఁగా కవి స్వయముగా చేసిన ప్రవరునియాకారవర్ణనమిధి

సీ అర్ధచంద్రుని తేటనవఘళించులలాట
వట్టిఁదీర్చిన గంగమట్టితోడఁ
జెక్కుటద్దములందు జిగిపెల్లువలుచిందు
రమణీయమణికుండలములతోడఁ

---

41. "యదాఽయముపనాంశః అసిద్ధః కవికల్పితః।
తదోత్ప్రేక్షైవ యేనేవశబ్దః సంభావనాపరః॥" (చిత్రమీమాంసా ఉపమా)

42. "ముఖ్యా మహాకవిగిరామలంకృతిభృతామపి।
ప్రతీయమానచ్ఛాయైవ భూషా లజ్జేవ యోషితామ్॥ (ధ్వన్యా 3 . 37)

బసిడిప్రాతచెఱంగు మిసిమిదోఁపఁజెలంగు
నరుణాంశుకోత్తరీయంబుతోడ
సరిలేనిరాకట్టు జాళువామొలకట్టు
బెడఁగారు నీర్కావిపింజెతోడ

గీ॥ ధవళధవళములగు జన్నిదములతోడఁ
గౌశికాముద్రయిడిన యుంగరముతోడ
శాంతరసమొల్కు బ్రహ్మతేజంబుతోడఁ
బ్రవరుఁడయ్యె వియచ్చరప్రవరుఁడపుడు (మను 3 71)

ఈ యాకారసంపదతో నొప్పుచున్న ప్రవరుఁడు విభావమై సంభోగ శృంగారరసపర్యవసాయియగుట[43] నిచ్చటివిశేషము. ఈవర్ణన కవి తాను మొదట ప్రవరునిగుణగణదినచర్యాదివర్ణనప్రస్తావమున చేసియుండిన రస పర్యవసాయియగుటలోని చమత్కారము లేకుండెడిది

ఇట్లాయా వర్ణనలన్నియు యథాప్రదేశవినివేశితములగుటచే రసాది వ్యంగ్యపరములై శోభిల్లినవనగా సంభాషణలవిషయము వేఱుగాచెప్పవలయునా?

వరూథినీప్రవరులసంభాషణము ప్రతిపదమున నేదోయొకయభిప్రాయ విశేషమును వ్యక్తీకరించుచు అద్భుతమనోజ్ఞమై యున్నది

తనకడ్డమై నిలిచిన వరూథినితో ప్రవరుఁడు తన పురంబు జేరు నుపాయము తెలియఁగోరి పలికిన పలుకులివి—

ఉ॥ ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ! యొంటిఁజరించె దోట లే
కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిన్
గ్రొవ్వున నిన్నగాగ్రమునకున్ జనుదెంచి పురంబుఁజేర నిం
కెవ్విధి గాంతు? దెల్పఁగదవే! తెరువెద్ది? శుభంబు నీకగున్॥
(మను 2 39)

ఈ మాటలలోని ప్రవరునియభిప్రాయ మొకతీరై యుండ వరూథిని భావించినతీరు మఱోవిధమైయున్నది

---

43. కిం తు విభావ ఏవ సుందరత్వాత్ కథంచిత్ రసపర్యవసాయీ॥
(రసగం ప్రథమ స్మృతిభావధ్వని.)

ఈపద్యమున ప్రవరునియభిప్రాయమిట్లు ధ్వనించుచున్నది –

'ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ'

స్త్రీకి సహజాలంకారమగు లజ్జవీడి సంభ్రమమున నాదరికడ్డమై నిలిచిన నీవు ఏదోయాపదలో చిక్కుకొంటివని భ్రమించితిని కాని నీబిత్తరపుఁజూపుల లోని వైలక్షణ్యము గమనించిన నివు బీతుపుకాదు బీతహరిణేక్షణవని పొడకట్టిన దను ప్రవరునియభిప్రాయము 'భీతహరిణేక్షణ'యను సంబుద్ధిపదద్యోత్యము –

''ఒంటిఁజరించెదోటలేకివ్వనభూమి''

'ఈ + వనభూమి' అనుసమాసమునందలి 'ఈ' పదముచే 'వనభూమి మానవమాత్రునకు చొరరాక భయంకరమైయుండునది'యనునర్థము ధ్వనించు చున్నది ఇట్టి యరణ్యానిలో సంచరించునివు సామాన్యమానవకాంతవు కావనియు, నీకీపరిసరములన్నియు తెలిసియేయుండుననియు, కాన నేనడుగ బోవుప్రశ్నకుత్తరము చెప్పజాలువాఁడు వేఱొకఁడు కానరాకుండుటచె నీవే చెప్పవలసియుండుననియు ప్రవరునియభిప్రాయము పైవాక్యార్థమున భాసించును

'భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడన్'

నీబిత్తరపుఁజూపులోని విలక్షణత స్వాభావికమనియే నేను భావించితిని, అట్లుగాక నీచూపులో నేదో భావమున్నట్లు పొడకట్టుచున్నది, కాని నీవిట్లు నాబోటి నైష్ఠికునిపై మక్కువపడుట పాడిగాదనునదియే, తాను బ్రాహ్మణుఁడ ననియు"ప్రవరుఁ"డను ఖ్యాతిగడించినవాఁడననియు చెప్పుటలోని పరమార్థము

'త్రోవతప్పితిన్ గ్రొవ్వున నిన్నగాగ్రమునకున్ జనుదెంచి'

ఇట 'క్రొవ్వునన్' అనుపదముచె క్రిందుమీదరయక ఏతెంచి యిట్లాప దలో చిక్కుకొంటిననునర్థము ధ్వనించుచున్నది

'పురంబుఁజేర ............శుభంబునీకగున్'

'ఇంకెవ్విధిఁగాంతు'ననుటచే నేను మాయూరుచేరునుపాయము తెలియని వాఁడననియు, 'తెల్పఁగదవే'యనుటచే ఈయాపదనుండి గట్టెక్కింప నేను నీ పైననే ఆధారపడియున్నాననియు, 'శుభంబు నీకగున్' అనుటచే నాపరాధీనత సాకుగాఁగొని నానుండి మఱేదో కోరఁదగదనియు, నేనిచ్చుశుభాశీస్సులనే ప్రతి ఫలముగా భావించఁదగుననియు ధ్వనించుచున్నది

బ్రాహ్మణుఁడు కార్యార్థియై ఇతరుల నాశ్రయించునపుడు తనకు తానై మొదటనే యాశీర్వచనము చేయవలసియుండును కాని ప్రవరుఁడట్లు చేయలేదు తాను వరూధినిని చూచినప్పుడాయమ భీతిల్లియుండినట్లుపొడకట్టి విభ్రాంతుఁడై యుండుటయే దానికి కారణము కాని యదిభీతిల్లుట కాదు. తనపై మక్కువ పడుటయే చూపులలోనిభావము, అది తగదని సూచించుచు తానిలుచేరునుపాయము నర్థించెను దానికి తానిచ్చు మూల్యము శుభాశీస్సులే యని తెలుపుటకై చివర నాశీఃప్రయోగము చేయఁబడినది.

ఇది యంతయు వక్తయగు ప్రవరునియభిప్రాయరూపమైయున్నందున దీనిని వక్తృవైశిష్ట్యముచే నేర్పడినఅర్థశక్తిమూలవస్తుధ్వనియందురు.

ఈప్రవరునిమాటలనే వరూధినిభావించినతీరిట్లున్నది —

'భీతహరిణేక్షణ'యని సంబోధించినదే తడవుగా తనచూపులలోనిసోయగమున కాతఁడు ముగ్ధుఁడై తననువలచినట్లుగను, "ఒంటిఁజరించెదోటలేకివ్వనభూమి" అనిప్రశ్నించినంత-మనయభీష్టసిద్ధికేయాటంకములేకయుండునేకాంతప్రదేశమే కదా ఇది? యని యతనియభిప్రాయమును సూచించినట్లుగను, "భూసురుఁడ నే, ప్రవరాఖ్యుఁడ"నని నుడువుట సురకాంతయైనతనకు-సుపర్వుఁడనని తెలుపుచు తానును తగుదునని సూచించుటకే యనియు, 'ప్రవరాఖ్యుఁడన'ని చెప్పుట రూపలావణ్యాదులలో ఎవ్వరికిని దీసిపోనివాఁడనని తెలుపుటకే యనియు, 'త్రోవ తప్పితి'ననిపలుకుట బ్రాహ్మణ్యము మనస్వైరవిహారమునకంతరాయముగాఁదలంపకుమని తేటపఱచుటకేయనియు, 'క్రొవ్వున నిన్నగాగ్రమున కుంజనుదెంచి పురంబుఁజేర నింకెవ్విధిఁగాంతు' అని చెప్పుట క్రొవ్వితఈ పర్వతశిఖరమునకు వచ్చిన నేను అపూర్వలావణ్యరాశివగు నిన్నుజూచినపిమ్మట నిఁక నేవిధమునను మాయూరు పోఁజాలనని తనమోహపారవశ్యమును వ్యక్తము చేయుటకే యనియు, 'తెల్పఁగదవే! తెరువెద్ది'యని ప్రశ్నించుట తనయభ్యర్థనను మన్నించుమని వేడుకొనుటయే'యనియు, 'శుభంబునీకగు' అని కాంక్షించుట తానతనికోరికతీర్చిన అతనికిప్రాణదానము చేసినపుణ్యము దక్కునని తనవివశతను తెల్పుటకేయనియు వరూథిని భావించినది

ఇదియంతయు నకాముఁడగు ప్రవరునియభిప్రాయము కాకున్నను సకామయగు వరూథిని ఆప్రవరునిమాటలు వినునప్పుడు భావించినతీరు. కావున నిది బోద్ధవ్యవైశిష్ట్యమున నేర్పడిన వస్తుధ్వని

అట్లు భావించియున్నందుననే అతఁడు తనకథ నాద్యంతముగా వినిపించినను నమ్మక సెలవివాఱనప్పి తనయనుమోదమును వరూథినిఇట్లు సూచించెను.

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరి వేఁడెదు భూసురేంద్ర ! యే
కాంతమునందునున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించు లా
గింతియ కాక నీవెఱుగవే మునువచ్చినత్రోవ చొప్పు ని
కింత భయంబు లే కడుగ నెల్లిదమైతిమె? మాట లేటికిన్ (2 41)

వాచ్యార్థము పరిహాసగర్భితమై యుండుట తెలియనిదికాదు.
వ్యంగ్యార్థమేమన ?—

ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేఁడెదు భూసురేంద్ర !'

యనుటచే, 'ఇంతలు కన్నులు' వాచ్యార్థసందర్భమున ప్రవరునివేయయినను వ్యంగ్యార్థమున వరూథినివేయగుటవలన ఇంతలు కన్నులుగల ననుఁబోటి సౌందర్యరాశులు మఱెవ్వ రిటలేరనియు, సర్వవిధముల నీకు తగిన దానను నేనే యనియు నీవనినట్లు నీవు సుపర్వుఁడవే కాదు "సురేంద్రుఁడవు" అని సంభోధనపరమార్థమైనందున, అచ్చరలందఱిచేతను కోరఁదగిన తనువిభముగల నీవు నన్నర్థించుట నాభాగ్యమేయనియు, 'ఏకాంతమునందునున్న' అనుటచే నిదివిహారయోగ్యప్రదేశమనియు, 'జవరాండ్రఁ' అనుటచే తారుణ్యలావణ్యాదులచే నిన్నలరింపఁజాలుదుననియు, 'నెపంబడి పల్కరించు లాగింతయకాక' అని నుడువుటచే నీవు నాపై మక్కువపడుట తెలియనిదికాదనియు 'నీవెఱుగవే ? మునువచ్చిన త్రోవచొప్పు' అనుటవలన నీకట్టియభిప్రాయమే లేకున్న నీయూరిత్రోవ నీవే చూసికొనియుండెడివాఁడ వనియు, నీకింత భయంబు లే కడుగ నెల్లిదమైతిమె ? అను కాకువుచే నీవిట్లు సంకోచము లే కడుగుటలో లాఘవమేది లేదనియు, 'మాటలేటికిఁ' అనుటచే వృథాకాలయాపనతగదనియు వరూథిని తనయనుమోదరూపమగు నభిప్రాయవిశేషమును వ్యక్తముచేసెను

ఇట్లు పరమరమణీయమగు నీవ్యంగ్యార్థముయొక్క నిగూఢతను కవి 'నర్మగర్భంబుగాపలికిన' అనిచెప్పుచు శిథిలీకరించినవాఁడగుటనిది గుణీభూత

వ్యంగ్యమే[44] కాని ధ్వని కాదు [45]అయినను రామణీయకమున నేలోటులేదు

ఇట్లీకవి ప్రతివిషయమునను వ్యంగ్యమర్యాదతో కొంగ్రొత్తయందము నందఁజేయుచు తన ప్రబంధమును తీర్చిదిద్దినవాఁడగుటచే నిది ధ్వనికావ్యమైనది

ఇఁక నీమహాప్రబంధమునందాయాధ్వనివిశేషములెట్లు తీర్చిదిద్దఁబడినవో వివరింపఁబడును

వస్తుధ్వనివిశేషములు -

క) శబ్దశక్తిమూలవస్తుధ్వని—

మ స్ఫుటసౌగంధికరాగరక్తరుచిమైఁ బూనెం జపాసన్నిధి
స్ఫటికంబట్లుదయాద్రిగైరికశిరఃస్థానస్థితిం జంద్రుఁడ
చ్చటు వాయఁ శుచియయ్యెఁ నౌఁ బ్రకృతినచ్ఛుండైనసన్మార్గి యె
న్నటికిం గూటమివంకవచ్చు వికృతిన్మగ్నుండు గానేర్చునే ?
(మను 3 . 24)

ఇది చంద్రునియుదయకాలపుటారోహణక్రమమును వర్ణించు పద్యము ఉదయకాలీనారుణ్యము చంద్రునకు సాంక్రమికమేకాని స్వాభావికము కాదనియు, ధావళ్యమే యతనిసహజధర్మమనియు సమర్థించువాక్యము"ప్రకృతి నచ్ఛుండైన సన్మార్గి యెన్నటికిం గూటమివంకవచ్చువికృతిఁ మగ్నుండు గానేర్చునే" అనునది—ఇట ప్రకృతినచ్ఛుండైనసన్మార్గియనగా స్వభావముచే నిష్కల్మషుఁడైన సత్ప్రవర్తనాశీలుఁడగు పురుషుఁడేగాక స్వభావముచేతనే తెల్లనికాంతిగలిగి నక్షత్రపథమున సంచరించువాఁడును అగుచంద్రుఁడును అగుటచే నీయర్థాంతరన్యాసము శ్లేషభిత్తికాభేదాధ్యవసాయమూలకమగు చున్నది ఇట్లు ప్రకృతవర్ణ్యాంశము ముగిసినపిమ్మట ప్రవరకథాప్రకరణాను సంధానసహకృతమగు "సన్మార్గి" పదమునకుఁగల శబ్దశక్తిమహిమచే సత్స్వ భావుఁడును సచ్చరితుఁడును అగు ప్రవరుఁడు వరూథినీప్రలోభనజన్యకామ

---

44 "శబ్దార్థశక్త్యాఽఽక్షిప్తోఽపి వ్యంగ్యోఽర్థః కవినా పునః ।
యత్రావిష్క్రియతే స్వోక్త్యా సోఽన్యైవాలంకృతిర్ధ్వనేః ॥ (ధ్వన్యా 2 23)

45 గుణీభూతమపి దుర్దైవవశతో దాస్యమనుభవద్రాజకళత్రమివ కామపి కమ నీయతామావహతి ॥ (రసగం. ప్రథమ )

వికారాదులకు లోనుకాకుండుట యతని స్వభావమునకు తగియేయున్నదను వస్తువు ధ్వనించుచున్నది కావున ఇది శబ్దశక్తిమూలవస్తుధ్వని

'తరుణిననన్యకాంతఁ' (3/10) అనుపద్యమున వరూథినీశీలమును కొని యాడినను ప్రవరుని మహీసురాధమునిగా చిత్రించి తప్పుచేసితినని భావించిన కవిచంద్రుఁడు 'నభోమణి'యనుపదముచె నది జడులకు తోచునర్థమేకాని నిజ మునకు ప్రవరుఁడట్టివాఁడు కాఁడని వ్యంజింపఁజేసియు, తృప్తిపడక ప్రవరుఁ డట్లు వరూథినీవిషయమున ప్రవర్తించుట అతనికే చెల్లునని ఇటశబ్దశక్తిధ్వనన ముఖమున శ్లాఘించుచు తన నిష్కళంకతను చాటుకొనెననియు గమనింప వలసియున్నది

ఖ) అర్థశక్తి మూలవస్తుధ్వని -

ఇది పలువిధములై యున్నది

1) వక్తృవైశిష్ట్యమున నేర్పడిన వస్తుధ్వని .—

హిమాలయపర్వతమున చిక్కువడి తనయూరుచేరుట కుపాయము నర్థించిన ప్రవరునితో వరూథిని—

ఉ ఎక్కడియూరు ? కాల్ నిలువకింటికిఁబోయెద నంచుఁబల్కెదీ,
వక్కట మీ కుటీరనిలయంబులకుఁ సరిరాకపోయెనే ?
యిక్కడి రత్నకందరము లిక్కడినందనచందనోత్కరం
బిక్కడిగాంగసైకతము లిక్కడి యీ లవలీనికుంజముల్ ?
(మను. 2 50)

అని పలికినది ఈపలుకులలో "ఇట రత్నకందరాదివివిధ విహారయోగ్య ప్రదేశములుండ, కాదని పూరిగుడిసెల కాసపడు నినుఁబోటివాని నెందుఁజూడ ననియు కావున నీ మూర్ఖపుపట్టువీడి ఈ విహారప్రదేశములలో నను గూడి దివ్య భోగముల ననుభవింపుమను వరూథినియభిప్రాయరూపమగు వస్తువు ధ్వనించు చున్నది

వరూథినికి ప్రవరునియెడ నభిలాష యున్నట్లు 'ఎక్కడివాఁడొ' (2 35) అను నాయమపలుకులలో నవగతమై యుండుటచే నీయర్థవిశేష స్ఫూర్తి కలిగినది

కాన నిది వక్తృవైశిష్ట్యముచేనేర్పడిన అర్థశక్తిమూలకమగువస్తుధ్వని.

2) వక్తృబోద్ధవ్యవైశిష్ట్యముచే నేర్పడిన వస్తుధ్వని –

ఉ ఏనిఁక నిల్లుసేరుటకు నెద్దియుపాయము మీ మహత్త్వముల్
మానిని! దివ్యముల్ మదిఁదలంచిననెందును మీ కసాధ్యముల్
గానము,గాన తల్లి! ప్రజలన్ ననుఁగూర్పుమటన్న లేఁత న
వ్వాననసీమఁ దోఁప ధవళాయతలోచన వాని కిట్లనున్ (౨. 49)

వరూధినిని తల్లి యని సంబోధించుచు తనయూరుసేరుటకుపాయము నడుగు ప్రవరుని పలుకులివి–

వరూథిని పలికిన నర్మగర్భభాషణములలోనియాకూతమును గమనించిన ప్రవరుఁడు వరూథినిని "తల్లి"యని సంబోధించుటచే – మీబోటిదేవతాస్త్రీలు మాకు తల్లులవంటివారనియు, ఇట్టినీవు ననుగోరుట తగదనియు, దారితప్పిన తనయుని ఇల్లుసేర్చుట తల్లులధర్మమనియు, ఇట ధ్వనించుచున్నది-

వక్తయగు ప్రవరుని పరస్త్రీపరాఙ్ముఖత్వమును బోద్ధవ్యయగు వరూథిని యతనిపై మరులుగొనియుండుటయును అనుసంధించితిమేని ఈ యర్థవిశేషమేర్పడును లేదేని తల్లియను సంబోధనము లోకరీతిననుసరించి చేసినట్టు భావింపఁబడుటచే నీ ధ్వనియుండదు

కావుననిది వక్తృబోద్ధవ్యవైశిష్ట్యమున నేర్పడిన వస్తుధ్వని.

౩) ప్రస్తావవైశిష్ట్యమున నేర్పడిన వస్తుధ్వని –

క చావుఁదలపోసి మానవుఁ
డే వగ దుష్కీర్తివొరయకే దినములు పొం
దై వెడలునట్లు నడవఁగ
దైవం బఁటమీద మేలు తాన ఘటించున్ (మను. 4 107)

రక్కసిరూపైయున్న ఇందీవరాక్షునిధాటి కాగలేక పాఱిపోవు తనసైనికులఁజూచి స్వరోచి పలికిన ఈ పలుకులలో– అపరిహార్యము అవశ్యంభావియును అగు మృత్యువునకోడి శత్రువులకు వెన్నిచ్చి పాఱిపోయి అపకీర్తిని కొని తెచ్చుటకంటె స్వధర్మమని భావించి శత్రువునెదుర్కొని పోరుసల్పిన దైవము ధర్మపక్షమై నిలిచి మనకు విజయము చేకూర్చకపోదు కావున పాఱిపోక ధైర్యముతో పోరు సల్పుడు" అను వస్తువు ధ్వనించుచున్నది.

ఇది యుద్ధప్రకరణము కావున నీయర్థవిశేషము స్ఫురించినది. వేఱొక ప్రకరణమైన నీయర్థవిశేషస్ఫూర్తియుండదు

కావున నిది ప్రస్తావవైశిష్ట్యమున నేర్పడిన వస్తుధ్వని.

4) వాచ్యార్థవైశిష్ట్యముచేనగు వస్తుధ్వని –

తన్నాడఁబఱచుటకై వరూధిని ప్రవరునితో–

ఉ. ఎన్నిభవంబులం గలుగు నిక్షుశరాసనసాయకవ్యథా
ఖిన్నత వాడి వత్తలయి కేలఁ గపోలము లూది చూపులన్
విన్నఁదనంబు తోఁపఁ గనువేఁదుఱునం బయగాలిసోఁకినన్
వెన్నవలెం గరంగు నలివేణులఁగౌఁగిటఁజేర్చుభాగ్యముల్

(మను 2. 57)

అని పలికినది ఇట "ఇక్షుశరాసనసాయకవ్యథాఖిన్నత వాడి వత్తలయి" అనుటచే "నేను భవద్విరహానలదోదూయమానమానసననియు, "కేలఁ గపోలములూఁది చూపులన్ విన్నఁదనంబు తోఁప" యనుటచె నీవు ప్రేమభిక్ష పెట్టి ఎప్పుడనుగ్రహింతువో యని ఎదరిచూచుదాననియు, 'కనువేదుఱునన్' అనుటచే స్వయంవశంవదనై యున్నందున స్వయంగ్రహాశ్లేషసౌఖ్యమున నోలలాడింతుననియు, 'ఎన్నిభవంబులన్ గలుగు ?' అనుటచే నిట్టి ననుఁబోటివారి పొందు దుర్లభమనియు ధ్వనించుచున్నది దీనిచే ఈ వచ్చిన యవకాశము జారవిడువక ననుగూడి నీవు దివ్యభోగముల ననుభవింపుమను వరూథినియభిప్రాయము వ్యక్తమగుచున్నది.

ఈ యర్థవిశేషస్ఫూర్తికి వాచ్యార్థమునకుగల వైలక్షణ్యమే కారణము కాన ఇది వాచ్యార్థవైశిష్ట్యమున నేర్పడిన వస్తుధ్వని

5) అర్థశక్తిమూలకవస్తుధ్వనుల సంసృష్టి -

"ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ" (2.39)

ఈపద్యమునందలి ధ్వనివిశేషములు వినివేదితపూర్వములు (పు 387). ఇఁక గమనించవలసినదేమన–"ప్రవరుఁడు పలికినతీరులో నతనిభావ మొకవిధమై యుండ నాపలుకులలోని యాంతర్యమును వరూథిని గ్రహించినతీరు వేఱై యున్నది ఇట్టి పద్యమున రెండు ధ్వనివిశేషములున్నవి- మొదటిది వక్తృవైశిష్ట్యమున నేర్పడగా రెండవది బోద్ధవ్యవైశిష్ట్యముననేర్పడిన ధ్వని ఈ

రెండువ్యంగ్యములును పరస్పరనిరపేక్షములై యుండుటచే నిది వక్తృబోద్ధవ్య వైశిష్ట్యకృత వస్తుధ్వనుల సంసృష్టి"— అని

6) అర్థశక్తిమూలవస్తుధ్వనుల సంకరము —

"ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరి వేఁడెదు ?" (2/41)

అను పూర్వోదాహృతపద్యమున 'ఎవ్వరి వేడెదు?' అనుకాకుస్వరవైశిష్ట్యమున ఇంతలు కన్నులుగల ననుఁబోలుసౌందర్యరాశు లిట మఱెవ్వరు లేరనియు కావున నిను కామునిబారినుండి కాపాడుదానను నేనే యనియు ధ్వనించుచున్నది ఇట్లే "నీవెఱుఁగవే? మునువచ్చిన త్రోవచొప్పు" "నీకింతభయంబు లేకడుగనెల్లిదమైతిమే?" అనునప్పుడు వివరింపఁబడిన ధ్వనులును కాకుస్వరవైశిష్ట్యమున నేర్పడినవి 'ఇంతలుకన్నులు' అనునప్పుడు కన్నులవైశాల్యము చేష్టావైశిష్ట్యముచే ధ్వనించుచున్నది ఈధ్వనికిని "తెరు వెవ్వరి వేడెదు" అనువాక్యశేషమందలికాకుస్వరవైశిష్ట్యకృతధ్వనికిని అంగాంగిభావసంకరము. మఱియు దీనికిని ఇతరకాకుస్వరవైశిష్ట్యకృతధ్వనులకు తిలతండులన్యాయమున సంసృష్టి ఈపద్యమందలి మఱియొక విశేషమని గమనింపవలసియున్నది

వస్తుకృత వస్తుధ్వని :-

చ. పలుకులు నేర్పువేళఁ గలభాషిణి ! నీవిటులుండఁ బంజరం
బుల నరగన్నువెట్టి ముఖముల్ చరణాగ్రనఖాళి గోఁకుచున్
నిలుగుచు నావలించుచు వనీవిహగోత్కర మెట్లు పల్కున
ప్పలుకులె యెత్తులెత్తి విని పల్కెడు వింటివె కీరశారికల్ (3 58)

విరహాంబుధిలో మునిగితేలి యలమటించుచున్న వరూథిని నుల్లాసపఱచుటకై చెలికత్తియపలికిన పలుకులివి మృదుమధురములై 'ముద్దులొల్కు పలుకులు గల నీకే శుకశారికలకు పాటలు నేర్పుయోగ్యత కలదనియు, అట్టి యోగ్యత మాకు లేదనియు, కావున అగతికములై యాశుకశారికలడవిపక్షుల కూతలననుకరించుచున్నవనియు, కాన నీవిట్లు బేలవై యుండక నీప్రాభాతిక విధుల నిర్వర్తించి మమ్మానందింపఁజేయు మను వస్తువిట ధ్వనించుచున్నది

కొందఱు వ్యాఖ్యాతలిట భ్రాంతిమదలంకారమని నుడివిరి అది సరి కాదు ఎట్లన ? ఏదోయొక ధ్వనిననుకరించుట పక్షులస్వభావమైయున్నందున అట్లడవిపక్షుల కూతలను శుకశారికలనుకరించుట జరిగినది కాని ఆ ధ్వని

వరూథినిదని భావించికాదు అట్లైని వరూథినీ కంఠస్వరము వనవిహగోత్కర ధ్వనిని బోలి పరుషము కావలసివచ్చును కదా ? ఇఁక 'కలభాషిణి'యను సంబోధన మెట్లుపపన్నమగును ? కావున నిట భ్రాంతిమదలంకార ప్రసక్తిలేదు ఇట్టి వ్యంజకమగు వాచ్యార్థము నిరలంకారమగు వస్తుమాత్ర మగుటచే నిది వస్తుకృతవస్తుధ్వని యయినది

మఱియు - ఇంతవఱకుదాహరించిన పద్యములలోని వ్యంగ్యార్థము వ్యంజకమగు వాచ్యార్థమును నిరలంకారములగు వస్తువులేకావున నివియన్నియు వస్తువుచే నేర్పడిన వస్తుధ్వనులేయని గమనించఁదగును

అలంకారకృతవస్తుధ్వని —

ఉ అక్కట వాఁడు నాతగుల మాఱిడిసేసి దయావిహీనుడై
చిక్కక త్రోచి పోయెఁ దరిఁజేరగఁరానివియోగసాగరం
బెక్కడ నీదుదాన ? నిఁక నికొఱనోములు నోఁచినట్టి నే
నెక్కడ ? వానికౌఁగిలది యెక్కడ? హా విధి యేమి సేయుదున్॥ (3.5)

విరహతాపమునకు తాళలేక తన్ను తా నిందించుకొను వరూథిని పలుకులివి - ఇట 'కొఱనోములు నోచినట్టినేనెక్కడ? వానికౌఁగిలది యెక్కడ? అని అననురూపవస్తుఘటనానిబంధనరూపమగు విషమాలంకారము వాచ్యము. దీనిచే అతిలోకసౌందర్యరాశియగు ప్రవరుని యాశ్లేషము బహుపుణ్యలభ్యమని యతని సౌభాగ్యాతిశయమును, ఆయాశ్లేషసౌఖ్యము దక్కని తా నదృష్టహీను రాలనని వరూథిని దౌర్భాగ్యాతిరేకమును వ్యంగ్యములగుచున్నవి

ఇది యలంకారకృతవస్తుధ్వని

స్వతఃసిద్ధార్థశక్తిమూలవస్తుధ్వని .—

ఉదా —

శా శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁబాఱెం బక్షు లుష్ణాంశుపా
షాణవ్రాతము కోష్ణమయ్యె, మృగతృష్ణావార్థు లింకెన్ జపా
శోణంబయ్యెఁబతంగబింబము, దిశాస్తోమంబు శోభాదరి
ద్రాణంబయ్యె సరోజషండములు నిద్రాణంబులయ్యెం గడున్.
(3 12)

కన్నులకు కట్టినట్లు వర్ణింపఁబడిన ఈప్రకృతిదృశ్యము సాయంసమయ మాయెనను వస్తువును ధ్వనింపఁజేయుచున్నది.

వ్యంజకమగు నీయర్థమెల్ల లోకమున సంభావ్యమేయగుటచే నిది స్వతః సిద్ధార్థశక్తిమూలవస్తుధ్వని

మఱియు పూర్వోదాహృతధ్వనులలోను వ్యంజకమగు వాచ్యార్థము లోకరీతిననుసరించి యేర్పడినదే కాని కవిప్రౌఢోక్తిచేనేర్పడినది కాదు. కావున పైన పేర్కొనిన వస్తుధ్వనులన్నియును స్వతఃసిద్ధార్థశక్తిమూలకములే యగును

కవిప్రౌఢోక్తి సిద్ధార్థశక్తిమూలవస్తుధ్వని -

మ వరణాద్వీపవతీతటాంచలమునన్ వప్రస్థలీచుంబితాం
బరమై సౌధసుధాప్రభాధవళితప్రాలేయరశ్మిండలీ-
హరిణంబై యరుణాస్పదం బనఁగ నార్యావర్తదేశంబునం
బుర మొప్పున్ మహికంఠహారతరళస్ఫూర్తిన్ విడంబించుచున్

(1. 49)

అరుణాస్పదపురవర్ణన మిది. ఇట ప్రాకారములాకాశమును చుంబించుటయు మేడలసున్నపుకాంతులు చంద్రునిలోనిమచ్చను మాయఁజేయుటయు, కవిప్రౌఢోక్తియే కాని లోకసహజము కాదు. ఇట్లు చెప్పుటచే ఆ పట్టణపుకోటలు ఆకాశమునొరయునంత ఎత్తుగానున్నవనియు, భవనములు చంద్రమండలము వఱకు వ్యాపించియున్నట్లు కానవచ్చునౌన్నత్యము కలిగియున్నవనియు వ్యక్తమగుచున్నది

ఇది కవిప్రౌఢోక్తిచేనేర్పడిన వస్తుధ్వని

కవి నిబద్ధవక్తృప్రౌఢోక్తి సిద్ధార్థశక్తిమూలవస్తుధ్వని:-

మ ఇనుఁడస్త్రాద్రికిఁబోవఁగొల్లగొని నేఁడేతేరఁదద్దీప్తినం
జనసంబంధజ బాంధవంబున రతిక్రాంతాంగనానేత్రకో
ణనికాయంబుల డాఁచి తద్దవశిమం దాఁ బూనెనో? చొప్పు మా
ర్పననీ వెల్వెలఁబాఱె దీపకళికావ్రాతంబు శాతోదరీ!.   (3.56)

విరహతాపభరమూర్ఛితయై శీతలోపచారములచే తెలివొందినపిదప వరూథినితో నొకచెలియపలికిన పలుకులివి

దీపకళికలు వెల్వెలఁబాఱుటకు హేతువు, -ఇనుఁడస్త్రాదికిఁబోవ నతని దీప్తిని కొల్లగొని దానిని రతిక్రాంతాంగనానేత్రకోణనికాయంబులఁడాఁచి వాని ధావళ్యమును తాఁబూని చొప్పుమార్చుట,అనునదియేయఁట కావున ఇది హేతూత్ప్రేక్షాలంకారము ఇనునిదీప్తిని అంగనానేత్రకోణనికాయములలో దాఁచుటకు అంజన సంబంధపుబాంధవంబు కారణము కాన నిది పదార్థహేతుకకావ్యలింగాలంకారము ఈరేండలంకారములు పరస్పరసాపేక్షములగుటచె వీనికంగాంగిభావసంకరము

ఈసంకరాలంకారముచే తూర్పుతెలతెలవాఱెననియు రాత్రియంతయు కోరికలు దైవార మెలకువతో గడిపినయంగనలకనుకొలుకు లెఱ్ఱవారి వారి సౌభాగ్యాతిశయమును తెల్పుచున్నవనియు ధ్వనించుచున్నది

ఈవ్యంగ్యముచె—అట్లే నీవుకూడ నచిరకాలముననే ప్రియసాన్నిధ్య సౌభాగ్యము నొందగలవు అధైర్యపడకుము— అనునూరడింపు వ్యక్తమగుచున్నది

ఇంతేకాక— ఈపద్యమున నర్థాంతరన్యాసాలంకారమును ధ్వనించుచున్నది— ఎట్లన? 'ఇనుఁడు' 'కొల్లగొని' అనుపదములకుఁగల శబ్దశక్తిమహిమచే రాజు అవసానదశయందుండగా నతనిసొత్తును కొల్లగొని యెచటనో దాఁచి అది బయల్పడకుండుటకై చోరులు చొప్పుమార్చుచుందురను సామాన్యార్థము సమర్థకమై ధ్వనించుచుండుటచే నిది అర్థాంతరన్యాసాలంకారధ్వనియునగుచున్నది

సూర్యుఁడస్తమించునప్పుడు తనకాంతులను అగ్నియందుంచుననుట 46"అగ్నిం వా వాఽఽదిత్యః సాయం ప్రవిశతి" అను శ్రుతిసిద్ధము- ఈయర్థమునే కవి 'కొల్లగొని'యనుటచే నధ్యవసించెను కొల్లగొనిన సూర్యదీప్తిని దీపములు రతిక్రాంతాంగనానేత్రకోణములయందుంచుట ప్రౌఢోక్తిచే నేర్పడినదే కాని లోక రూఢినసుసరించి కాదు కావుననిది కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిచేనేర్పడినవస్తుధ్వని

**వివక్షితాన్యపరవాచ్యధ్వని :-**

క. బ్రాహ్మణుఁడింద్రియవశగతి
జిహ్మచరణైక నిపుణచిత్తజ నిశితా
జిహ్మగములపాలై చెడు
బ్రహ్మానందాధిరాజ్యపదవీచ్యుతుఁడై (మను 2 60)

46 ఉద్ధృతము "సర్వంకషా" మల్లినాథవ్యాఖ్య (శిశు 9 . 13 శ్లో ) నుండి

ప్రవరుఁడు వరూథినితో పలికిన పలుకులలో— "తాను కామాయత్త చిత్తుఁడనై బ్రహ్మానందమునకు దూరము కాఁజాల"నని స్వాభిప్రాయమును వెలువరించగా, దానిని త్రోసిపుచ్చుచు వరూథిని ఇట్లనెను—

శా. ఎందె డెందము గందళించు రహిచే నేకాంతతన్ నిర్వృతిం
జెందుం గుంభగతప్రదీపకళికాశ్రీదోఁప నెందెందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబు గను నాయింపే పరబ్రహ్మ 'మా
నందో బ్రహ్మ'యటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా (2 62)

ఇట—"ననుఁగూడి దివ్యభోగములననుభవించినచో నీకు బ్రహ్మానంద మయత్నసిద్ధమయియుండ బ్రహ్మానందమునకు దూరుఁడనగుదునని భావించుటయు, దానికై వేఱెందో వెతుకుటయు వ్యర్థ" మను వరూథిని యభిప్రాయ రూపవ్యంగ్యమే వాచ్యార్థవిశ్రాంతిధామమై నిలిచినది ఏలన? వరూథిని స్వాభిప్రాయమును వెలువరించుటకే ఇట్లు పలికినదికాని బ్రహ్మానంద మెట్లుండునో నిర్వచించుటకు కాదుకదా? ఇట్టిది వివక్షితాన్యపరవాచ్యధ్వనియయినది

ఇంతవఱకుదాహరించిన ధ్వనులన్నియును వాచ్యార్థమున నేర్పడినవే ఇఁక లక్ష్యార్థమున నేర్పడిన ధ్వనులు—

**అవివక్షితవాచ్యధ్వని :—**

శా. ఆహా! ధన్యుఁడనైతి మద్విమలవంశాచారవిద్యాతప
శ్శ్రీహోమాదులు నేఁడుగా తుది ఫలించెన్ నాగవాసంబు మ
ద్గేహక్షోణికి బిడ్డ వేడుటకు నేతేఁగాంచుటన్ బ్రాహ్మ్యమిం
కోహో చాలుఁ బొకాలిపోయెదరొ? పోరో? నోటిక్రొవ్వేటికిన్ (6 . 45)

తనకూఁతును కళావతినిమ్మని యడుగవచ్చిన దేవాపియను గంధర్వుని జూచి ఈసడించుకొనుచు పారర్షి తానుధన్యుఁడనైతినని, తనయాచారవిద్యాతపములు ఫలించెననియు పలుకుట వక్త్రభిప్రాయవిరుద్ధమై పొసఁగుట లేదు కావున ధన్యుఁడనుపదమున కధన్యుఁడననియు, ఫలించెననుటకు నిష్ఫలములాయెననియు లక్ష్యార్థములిట వివక్షితము దీనిచే తనదు దౌర్భాగ్యాతిశయము మాటలతో చెప్పనలవికానిదను వస్తువు వ్యంగ్యము

వాచ్యార్థమిట వివక్షితముకాకుండుటచే నిది అవివక్షితవాచ్యధ్వని యయినది.

అత్యంతతిరస్కృత వాచ్యధ్వని -

ఇదియే అత్యంతతిరస్కృతవాచ్యధ్వనియనగుచున్నది ఇందలి వాచ్యార్థము వక్త తాను చెప్పఁదలచినయర్థమునకు పూర్తిగా విరుద్ధమగుటచె నత్యంత తిరస్కృతమయి అవివక్షితమయినది కదా!

ఈ వ్యంగ్యార్థము "పోకాలిపోయెదరో? పోరో? నోటిక్రొవ్వేటికిఁ" అను వాచ్యార్థమును సిద్ధింపఁజేయుటచె నిది వాచ్యసిద్ధ్యంగమగు గుణీభూతవ్యంగ్యమగుచున్నది

మరియొక యుదాహరణము :

"చేదు మ్రింగెదనంచు దెలఁగి నవ్వె ఘృతాచి" (3 109)

కపటభూసురుఁడు వరూథిని నేలుకొందునని యొడంబడుటనభినందించుచు వరూథినిచెలి – 'చేదుమ్రింగెదనని' పలుకుటలోని'చెదు' 'తీపి' యే యగునుకాని చేదుకాదుకదా! కాన నీ వాచ్యార్థమత్యంతతిరస్కృతమయినది దీనిచే–ఇంత వఱకు వరూథినిపొందునుచేదుగాభావించిననీవిపుడు దానిమాధుర్యమును గుర్తించుట మాకానందదాయకమ'ను వస్తువు వ్యంగ్యము.

అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని :-

శా హుంకారంబొనరించి వే తలఁగుఁ డోహో నేను స్వారోచినే
పంకేజాక్షులతోడ నెల్లపుడు దర్పస్ఫూర్తిఁగ్రీడింప, ల
జ్జాంకూరంబడఁగించినారు, తలపోయన్ నాకు రోతయ్యె, మీ
రింకం బోయి వరింపుడొక్కరుని బోగేచ్ఛన్ నివారించితిన్ (6 79)

తననుకోరి చుట్టుచేరిన యాడలేళ్ళను అదలించుచు హరిణముపలికిన ఈ పలుకులలో–హరిణమునకు స్వరోచియందుగల ఏహ్యభావమువ్యక్తమగుచున్నది ఎట్లన? తాను స్వరోచియా! ఏవిధముననను కానేకాడు అయినను "నేను స్వారోచినే" యని నుడువుటలో తాను స్వరోచినికానని వెలువరించెను ఈనిషేధ మెందులకు? అనుపపన్నమేకదా' కావున స్వరోచిపదమునకు కామోపభోగపరాయణుఁడును బహుస్త్రీలోలుఁడును అగు స్వరోచి యనునది లక్ష్యార్థము దీనిచే హరిణమున కాతనియం దాభావము వ్యక్తీకరింపఁబడినది మఱియు'స్వరోచినే' యని అనవలసియుండ "స్వారోచినే"యని దీర్ఘించుటయు, ఈభావమునే బలపఱు

మచున్నది స్వరోచిపదము ధర్మవైశిష్ట్యమున పరిణతమగుటచేనిది అర్థాంతర సంక్రమితవాచ్యము

ఈయర్థాంతరసంక్రమితవాచ్యము, అత్యంతతిరస్కృతవాచ్యము అను రెండు ధ్వనులును లక్ష్యార్థాముచే నేర్పడినవి

## వ్యంగ్యార్థముచేనగు వస్తుధ్వని -

శా ఈపాండిత్యము నీకుఁదక్క మఱియెందేఁ గంటిమే, కామశా
స్త్రోపాధ్యాయివి నా వచించెదవు, మేలోహో త్రయీధర్మముల్
పాపంబుల్, రతి పుణ్యమంచు నిఁకనేలా తర్కముల్, మోక్షల
క్ష్మీపార్యాగమసూత్రపంక్తి కివెపో మీసంప్రదాయార్థముల్ (2.64)

బ్రహ్మానందమును వైషయికానందపరముగా వ్యాఖ్యానించినవరూథినితో ప్రవరుఁడువలికినఈపలుకులలో 'ఆనందో బ్రహ్మ'యను నుపనిషద్వాక్యము నకు మీటోటిభోగపరాయణులు చెప్పునర్థమది యగునే కాని నిజమున కాయుప నిషద్వాక్యమునకది సరియగునర్థము కాదని, 'మీసంప్రదాయార్థముల్'పదముచే ప్రధానముగా ధ్వనించుచున్నది ఈవ్యంగ్యార్థముచే "నేనునీవనుకొనినబ్రహ్మా నందమునాసించువాఁడనుకా'దను మఱియొక వ్యంగ్యార్థము వస్తువుధ్వనించు చున్నది.

## పదద్యోత్యమగు వస్తుధ్వని -

చ. కొలకొలఁగూయుఁ బైనొాఱగుఁ గుత్తుకఁగుత్తుకఁజుట్టుఁబాఱుచి
ల్వలక్రియఁ గానరానిగతులన్ మయి మైఁబెనచున్ జనించు న
త్తు లఱుత నొత్తు సోలు నిలుచున్ విధిచాతురిఁ గూడియున్ రతిం
దలపవు కంటె పాసినవెతల్ దలపించుచుఁగోకదంపతుల్. (3.62)

విరహతాపభరాలసయై యున్న వరూథినిని వినోదింపఁజేయుచు చెలియ పలికినపలుకులివి ప్రాభాతికవర్ణనాపరములు-ఇందు విధిచాతురిఁగూడియున్' అనుపదములచే (సంయోగవియోగములుదైవాధీనములనియు, వానికై ఇంత వగవఁబనిలేదనియు ధ్వనించుచున్నది. దీనిచే దైవానుకూల్యమున ఆప్రవ రుఁడు కూడ విరహవిదీర్ణహృదయుఁడై నిను సమీపించకపోఁడు' అనుసఖీ సమాశ్వాసనము వ్యక్తమగుచున్నది

ఇది 'విధిచాతురి' పదద్యోత్యమగు వస్తుధ్వని

మఱియొక యుదాహరణము ..

క అనుటయు ప్రవరుండిట్లను వనజేక్షణ యట్లుపలుకవరుసయె వ్రతులై
దినములు గడిపెడు విప్రులఁ జనునే కామింప మది విచారము వలదే
(2 52)

'ఇంతలు కన్నులుండ' (2 . 41) అను నర్మగర్భభాషణములోని యాంతర్యమును నిక్కముఁదాపనేల' (2 . 51) అని స్పష్టముగా వెల్లడించిన వరూధినితో ప్రవరుఁడు పలికిన పలుకులివి

"తన కన్నుల సోయగము ఎవరినైనను ముగ్ధలనుగాఁజేసి తనకు లోబర్చునను భావన వరూథినికి తగద"ని సూచించుటకైయే ఆయమను 'వనజేక్షణ'యని సంబోధించెనేకాని ప్రవరుఁడు తానాయమకన్నులసోయగమునకు లోబడికాదు

కావున 'వనజేక్షణ'యను సంబుద్ధిపదముచే వరూథినికి గల యహంకారము నెత్తిపొడిచినవిధమిందు ధ్వనించుచున్నది.

ఇది 'వనజేక్షణ'సంబుద్ధిపదద్యోత్యమగువస్తుధ్వని

వేఱొక యుదాహరణము :-

ఉ ఎంతతపంబు సేసి జనియించినవారొకొ ! మర్త్యభామినుల్
కాంతుఁడవజ్ఞ సేసినను గాయము వాయుదురే నమర్త్యనై
చింతలవంతలం జివికి సిగ్గఱితిక్ష మృతిలేని నాదుచె
ల్వింతయు శూన్యగేహమున కెత్తినదీపిక యయ్యెనక్కటా ! (3 . 8)

ప్రవరతిరస్కృతయై వియోగదుఃఖమున నలమటించు వరూధిని తన్నుతా నిందుచుకొను సందర్భమునందలి పద్యమిది

ఇట- 'నేను త్రోపువడియు జీవించియున్నాననిన నా దురదృష్టము నేమని చెప్పుదాన ననునర్థము (వరూధినియభిప్రాయము) 'అవజ్ఞసేసినను' అను పదమునందలి ఉకారరూప నిపాతముచే ధ్వనించుచున్నది.

ఈ వ్యంగ్యము 'ఏనమర్త్యనై' అను మాటలలో స్పష్టీకరింపఁబడుటచే నిది వాచ్యాయమానమైనది కావున నిది అగూఢమగు గుణీభూతవ్యంగ్యము.

ఇంకొక యుదాహరణము .

తే. అనిన నేమియు ననక యవ్వనజగంధి
మేనిజవ్వాదివస కదంబించు నొడలు
గడిగికొని వార్చి ప్రవరుండు గార్హపత్య
వహ్ని నిట్లని పొగడె భావమునఁ దలఁచి (2 74)

త్రోపువడిన వరూథిని ఏమెమోచెప్ప దానిని పెడచెవినిపెట్టిన ప్రవరిని స్థితి ఇందు ప్రస్తుతమైనది

ఇట "ఏమియు" అను పదమందలి "ఉ" అను నిపాతముచే చెప్పవలసిన దెంతోయున్నను స్వార్థగ్రహగ్రస్తులు దానిని చెవినిబెట్టరని ధ్వనించుచున్నది

ఇది నిపాతరూపపదద్యోత్య ధ్వని

**వాక్యద్యోత్యధ్వని :-**

చ. మరునకొసంగఁ గాలము తమశ్చట గాటుకగా నవోదయ
స్ఫురదరుణప్రభాపథికశోణితసిక్తసితోడుభక్తముల్
హరిహయదిఙ్ముఖస్థలమునన్ బలిచల్లి వటాంకముల్ వసూ
త్కరభరితంబునై వెలుఁగఁగాంచి సుధానిధి నెత్తె నత్తరిన్.
(మను. 3 . 21)

తృతీయాశ్వాసమున చంద్రోదయవర్ణనాపరమగు పద్యమిది. ఇట రూపకాలంకారవిశిష్టమగు వాక్యార్థముచే చీకటులలుముకొనిన మఱుక్షణముననే ఉదయారుణకాంతులాకాశమున ప్రసరించెననియు, అచ్చటచ్చట చుక్కలు తోచెననియు, క్రమముగా చంద్రుఁడుదయించెననియు, తోడనే మన్మథుఁడు విజృంభించెననియు ధ్వనించుచున్నది. ఇది వాక్యద్యోత్యమగు వస్తుధ్వని

ఇట్లే పూర్వోదాహృతములలో వాక్యద్యోత్యధ్వనులెన్నోయుండుట గమనించఁదగును

**ప్రబంధద్యోత్యమగు ధ్వని :-**

పెండ్లికొడుకైన స్వరోచిని గజారూఢునిఁజేసి యూరేగించునపుడు కౌతుకముతోఁజూచుపౌరాంగనల విలాసచేష్టలు పదిపద్యములలో వర్ణింపబడినవి

మచ్చునకు రెండుపద్యములు —

ఉ అంచెలు గట్టి కాలితొడుసై చననీవు గదమ్మ ప్రోదిరా
యంచ లి వేటి సంగడములయ్యెను దయ్యమ ! యేటివేడ్క నా
కంచుఁ బదంబునన్ మొరయునందియ యూఁడఁగఁ దన్ని పోయి వీ
క్షించె లతాంగియోర్తు మురజన్నిటు సాగరమేఖలావిటున్ ॥

చ వలపులపల్లవుండొకఁడు వట్టిచలంబున నేఁప దీనయై
యలుకలు తీర్చి తీర్చి యొకయచ్చర వచ్చి నృపాలు నన్నగ
ర్వెలువడి చూచెఁ గాముకుఁడు వెంటనె రా నపు డాత్తఘుర్మయై
వెలవెలఁబాఱెఁ దన్ముఖము వెల్వెలఁబాఱె విటాననాబ్జమున్॥

(మను 5 . 61, 62)

ఈమున్నగు పద్యములందలి వాక్యసమూహాత్మక ప్రబంధముచె స్వరోచి యొక్క సౌందర్యము లోకోత్తరమను కవివివక్షితార్ధరూపవస్తువు ధ్వనించు చున్నది.

ఇది ప్రబంధద్యోత్యధ్వని— ఇవి వస్తుధ్వని విశేషములు

**అలంకారధ్వని విశేషములు :-**

**శబ్దశక్తిమూలాలంకారధ్వని :-**

మ. వికసిల్లం బ్రజ చక్రపాలనము గావించెం గరవ్యాపృతిం
గకుబంతంబుల నాక్రమించె బొసఁగంగా నేర్చె వర్ణాళి, గాం
తికిఁ బాపెం బెఱరాజకోటిఁ దుది శాంతిం బొందె దైవంబుసేఁ
తకు దాపం బిఁకనేలనంగ నినుఁడస్తప్రాప్తుఁ డయ్యెం గడున్.

(5 . 32)

ఇది సూర్యాస్తమయవర్ణనపరమగు పద్యము ఇందు సూర్యవృత్తాంతము ప్రాకరణికార్థము చక్ర—కర వర్ణ-రాజ-తాప-ఇన-పదములకుఁగల అర్థాంతర బోధకతాశక్తిమహిమచేనగు రాజవృత్తాంతము అప్రాకరణికార్థము అసంబద్ధార్థాభిధాయిత్వనివృత్తికై సూర్యునకు రాజునకును ఉపమానోపమేయభావము కల్పింపఁబడుటచే నిది యుపమాలంకారధ్వని యయినది విశేష్యవాచకమగు 'ఇన' పదముకూడ శ్లిష్టమైయున్నందున నిది ప్రకృతాప్రకృతశ్లేష కాదు శ్లిష్ట

ములగు చక్రకరాదిపదములను తొలఁగించిన నీయర్థస్ఫూర్తి యుండదు కావున నిది శబ్దశక్తిమూలధ్వని

శ్లిష్టపదములకుగలరెండవయర్థము, "ఉన్న"దనితెలియుటకై ఏదేని నిబంధన ముండునేని ఆరెండవయర్థము వాచ్యమగుటచే శ్లేష యగును, అట్లేనిబంధనము లేకున్నపుడే శబ్దశక్తిమూలధ్వనియగును

సాదృశ్యమూలకాలంకారములలో ఉపమానోపమేయములు రెండును పృథక్పదవాచ్యములయియుండుటయే తఱచుగా నిబంధనమయి యుండును ఎట్లన?—

సీ. *తొలుదొల్తఁ గమలమిత్రునివంక రూపౌట
　　దక్షాధ్వరధ్వంసి తన్నుఁగనుటఁ
బరివేషమిషమునఁ బాశంబు దాల్చుటఁ
　　గప్పు దేహమునందుఁ గానఁబడుట
గాలవశంబునఁగాని తోఁపక యుంట
　　సతతనిష్ఠురగదాన్వితతఁ[1] గనుటఁ
బూని పాండుక్షేత్రమునఁ బ్రవర్తించుటఁ
　　బ్రకటానురాగ[2]తారకుఁ డగుటను

తే నంతరం బెద్ది యాత్మలో నరసిచూడ
రాజ! నీకును నల ధర్మరాజునకును
బ్రాణిలోకంబు బాధలఁబఱుచునపుడు
ధర్మపదమొక్కఁడెక్కుడా ధన్యునందు. (3 . 37)

వరూథినిచేసిన చంద్రదూషణమది.

ఇట చంద్రునకు యమధర్మరాజుతో, 'కమలమిత్రుని వంకరూపౌట' 'దక్షాధ్వరధ్వంసితన్నుఁగనుట'మున్నగు విశేషణములద్వారా నిర్వహింపఁబడినసాధర్మ్యము "ధర్మపదమొక్కఁడెక్కుడా ధన్యునందు" అని నుడువుట వలన ఉపమేయాపకర్షపర్యవసాయియగుటచే వ్యతిరేకాలంకారము

ఉపమేయోపమానములగు చంద్రయములు పృథక్పదవాచ్యులగుటయే 'తన్నుఁగనుట' 'గదాన్వితతఁగనుట' మున్నగు శ్లిష్టవిశేషణములలోని రెండవ

---

* ఈపద్యమునపాఠాంతరములు · 1) గదాన్వితుఁడవౌట 2) తారకుఁడవగుట

యర్థమును సాధించుటకు దోహదమైనది కాన నీరెండవయర్థము వాచ్యమే యగును ఏ విధమైన నిబంధనములేక భావుకుల భావనాబలముననే కలిగిన శ్లిష్టపదములలోని యర్థాంతరము వ్యంగ్యమగును కావున నిది వ్యతిరేక-చ్ఛాయానుగ్రాహియగు శ్లేషయేకాని శబ్దశక్తిమూలధ్వని కాదు

ఆర్థశక్తిమూలాలంకారధ్వని —

చ మరునకొసంగ గాలము తమశ్చట గాటుకగా నవోదయ
స్ఫురదరుణప్రభాపధికశోణితసిక్తసితోడుభక్తముల్
హరిహయదిజ్నభస్థలమునన్ బలి చల్లి వటాంకముల్ వసూ-
త్కరభరితంబునై వెలుగఁ గాంచి సుధానిధి నెత్తె నత్తఱిన్ (3 21)

చంద్రోదయమును వర్ణించు నీ పద్యము కవిభావనానైపుణికి చక్కని నిదర్శనము

ఇందు తమశ్చట నిధినివెతుకుటకై కన్నులకు పెట్టుకొనుకాటుకయనియు ఉదయించునపుడాకాశమునువ్యాపించియున్న ఎఱ్ఱనికాంతులు (బలిగొనిన)విరహిజనులరక్తమనియు, ఉదయారుణకాంతులు వ్యాపించిన తారకలు, ఆవిరహిజనులనెత్తుటితోఁ దడిపి తూరుపుదిక్కున బలిగాపెట్టినయన్నపుముద్దలనియు, రూపించుట కవిప్రౌఢోక్తివిలసితము దీనిచే కాలము నిధిసాధించుపురుషుఁడను రూపణము గమ్యమగుటచె నిది రూపకాలంకారధ్వని

అవయవావయవిరూపణములలో నొకటి వాచ్యమగుచుండఁ వేఱొకటి గమ్యమగునేని ఏకదేశవివర్తిరూపకాలంకారమని ఆలంకారికులు చెప్పుదురు. అయినను గమ్యమగు రూపణము అర్థశక్తిచే నేర్పడినదేయగుటచే నిది ధ్వని యగుటలో నేవిప్రతిపత్తి లేదు

కావుననే పండితరాయలు ఏకదేశవివర్తియగు నపహ్నవాలంకారమును అపహ్నవధ్వనిగా నుదాహరించియున్నారు [47]

---

47. "దయితే ! రదనత్విషాం మిషాదయి ! తేఽమీ విలసంతి కేసరాః । అపి చాలకవేషధారిణో మకరందస్పృహయాళవోఽళయః॥" అత్ర పూర్వోత్తరార్ధ-వర్తినీభ్యామపహ్నుతిభ్యాం న త్వం నారీ కిం తు నలినీతి తృతీయాపహ్నుతిర్వ్యజ్యతే ॥ (రసగం ద్వితీ అర్థశక్తి ధ్వని)

ఇది యర్థశక్తిమూలకమగు రూపకాలంకారధ్వని
ఒకవేళ దీనిని 'వాచ్యసిద్ధ్యంగమగు గుణీభూతవ్యంగ్యమని' యందురేమో?

ఇదుగో - మఱియొక యుదాహరణము –

క మీ మాటలు మంత్రంబులు
మీమెట్టిన, యెడ ప్రయాగ మీ పాదపవి
త్రామలతోయము లలఘు
ద్యోమార్గఝురాంబుపౌనరుక్త్యము లుర్విన్॥ (1 62)

ఇవి అభ్యాగతుఁడగు నౌషధసిద్ధుని ప్రశంసించు ప్రవరుని మాటలు. వీనిలో నీవు సాక్షాత్తుమహావిష్ణుఁడవను రూపకము అర్థసామర్థ్యముచే ధ్వనించు చున్నది "మీమాటలు మంత్రంబులు" మున్నగు రూపకములు గమ్యమగు రూపకమున పేక్షింపకయే ఉపపన్నములగుచున్నవి ఎట్లన? మీ మాటలు మంత్రంబులనుటచె మాకవశ్యాచరణీయములనియు, మీమెట్టినయెడప్రయాగ యనుటచే మీరాకతో మాయిల్లు ఎంతో పవిత్రత సంతరించుకొనిన దనియు, మీపాదతోయములు గంగాంబుపౌనరుక్త్యములనుటచే, వీనిని శిరమున చల్లుకొని మేము పునీతులమైతి మనియు ప్రవరుని ధన్యంమన్యతను వ్యక్తీకరించుచు చరితార్థములగునే కాని స్వసిద్ధికై రూపకాంతరమున పేక్షించుట లేదు కావున పిమ్మట అర్థసామర్థ్యాక్షిప్తమగు నీరూపకము ధ్వనియే కాని వాచ్యసిద్ధ్యంగము కాదు

ఇది భావుకులభావనాబలముచే నర్థసామర్థ్యమున నేర్పడినది కాన రూపకాలంకారధ్వని

వస్తురూపవాచ్యార్థముచేనగు నలంకారధ్వని –

ఉ అంచెలు గట్టి కాలితొడుసై చననీవుగదమ్మ ప్రౌఢిరా
యంచ లి వేటి సంగడములయ్యెను దయ్యమ! యేటివేడ్క నా
కంచుఁ బదంబునన్ మొరయునందియ యూడఁగఁ దన్ని పోయి వీ
క్షించె లతాంగియోర్తు మురజిన్నిభు సాగరమేఖలావిభున్. (5. 61)

పెండ్లికొడుకై యూరేగుచున్న స్వరోచిని కన్నులింతలుచేసి చూడ నేతెంచుచున్న పౌరాంగనలవిలాసచేష్టల వర్ణించుసందర్భమునందలి దీ పద్యము (ఉదాహృతపూర్వము. పుట. 403)

స్వరోచినిఁ జూడవేడ్కఁ జను నొకచెడియ, తన్నంటి వెంటవచ్చు పెంపుడు రాజహంసలపీడ వదలించుకొనుటకై కాలియందెలి నూడఁదీసివైచి వెళ్ళెనను వాచ్యార్థము, ఏయలంకారము లేనిదగుటచే వస్తురూపము దీనిచే నా పెంపుడురాజహంసలు అందెలరవళిని తమజాతిపక్షులు తమ్ముపిలుచుటకై చేయు క్రేంకారధ్వనులని భావించియా? యనునట్లు ఆ విలాసిని వెంటపరుగెత్తె నను హేతూత్ప్రేక్షాలంకారము ధ్వనించుచున్నది

ఆ పెంపుడురాజహంసలు అందెలరవళిని క్రేంకారముగా భ్రమించి కాదు అట్లు వెంటనంటిచనుట-మఱేమన? ఆయమను విడిచి యవియుండలేకుండుటయే దానికి కారణము ఆసుందరి తనయందెలనూడఁదీసివైచుటయు వానినదలించుటకే కాని హంసలకట్టిభ్రాంతి యున్నదని తలఁచి కాదు

కావున వాస్తవమున కిట భ్రాంతి లేదు కాని అవియట్లు వెంటనంటి చనుటకు ఆభ్రాంతి హేతువైనట్లు భావుకులమనమున నర్థశక్తిచే భాసించుచున్నది ఇట్టిది హేతూత్ప్రేక్షాధ్వనియే కాని భ్రాంతిమదలంకారధ్వని కాదు

ఇది యర్థశక్తిమూలకమగు వస్తుకృతాలంకారధ్వని

అలంకారముచేనగు నలంకారధ్వని .—

సీ. అచటివిప్రులు మెచ్చ రఖిలవిద్యాప్రౌఢి
 ముదిమది దప్పిన మొదటివేల్పు
నచటిరాజులు బంటు నంపి భార్గవునైన
 బింకానఁ బిలిపింతు రంకమునకు
నచటిమేటికిరాటు లలకాధిపతినైన
 మును సంచిమొద లిచ్చి మనుప దక్షు
లచటినాలవజాతి హాలముఖాత్తవిభూతి
 నాదిభిక్షువుభైక్షమైన మాన్చు

తె. నచటివెలయాండ్రు రంభాదులైన నౌరయఁ
గాసెకొంగున వారించి కడపఁ గలరు
నాట్యరేఖాకళాధురంధరనిరూఢి
నచటఁబుట్టిన చిగురుఁగొమ్మైనఁ జేవ॥ (1 . 50)

ఇది యరుణాస్పదపురమునందలి చాతుర్వర్ణ్యాదుల వర్ణించు పద్యము.

అచటవిప్రులు మొదటివేల్పునైనను మెచ్చరనుట కవిప్రౌఢోక్తియే కాని నైసర్గికముకాదు బ్రహ్మను మెచ్చనివారనుట అసంబంధాతిశయోక్త్యలంకారము. ఇట్లు క్షత్రియులు వైశ్యులు శూద్రులు వెలయాండ్రును, 'భార్గవుడు' మున్నగు వారివిషయమున ప్రవర్తించినతీరు కవికల్పితమే. కాని నిజమునకు క్షత్రియాదులకట్లుప్రవర్తనాసంబంధము లేదు కాన నివియన్నియు అసంబంధాతిశయోక్త్యలంకారములే యగును ఈయతిశయోక్త్యలంకారములచె నచటివిప్రాదులయుత్కర్షరూపవ్యతిరేకము వ్యంగ్యము ఎట్లన ? అచటివిప్రులు ముదిమదిదప్పినవాఁడనియెంచి బ్రహ్మనైనను మెచ్చరని వర్ణించుటచే "వారనేర్చిన సకలవిద్యలును ప్రమాదమనునది లేక మిక్కిలి తేజోవంతములై యున్నవి" అను వస్తువు వ్యంగ్యము ఈ వ్యంగ్యముచే వారు తమ విద్యలను అధీతిబోధాచరణప్రచారణములచే సార్థకము చేసికొనినవారనునది మఱియొక వ్యంగ్యము ఇంతేగాక మొదటివేల్పును మెచ్చరను వాక్యార్థమునకు "ముదిమదిదప్పిన" అను విశేషణపదార్థము హేతువై యుండుటచే కావ్యలింగాలంకారము దీనిచే అచటివిప్రులు అధ్యయనవిషయమున బ్రహ్మకంటె గొప్పవారను వ్యతిరేకాలంకారము ధ్వనించుచున్నది

భార్గవరాముఁడిరువదియొకమారులు భూమండలమునందలి క్షత్రియజాతిని నిశ్శేషముగా నంతమొందించి క్షత్రియజాతికే అడలై నిల్చినవాఁడు అతనినే 'బంటునంపి బింకాన పిలువనంపు'నంతటివా రీపట్టణపురాచవారనిన వారికితరులగు నృపాలు రొకలెక్కయా ? యను నర్థాపత్త్యలంకారము వ్యంగ్యము ఇట్లుకిరాటాదులవిషయమునను అతిశయోక్త్యలంకారముచే [48]అర్థాపత్త్యలంకారము వ్యంగ్యమగును దీనిచే నచటి క్షత్రియాదులు బలక్రమాదులవిషయమున దేశాంతరవాసులగు క్షత్రియాదులకంటె ఎంతో గొప్పవారను ఉత్కర్షపర్యవసాయియగు వ్యతిరేకము ధ్వనించుచున్నది

ఇది అలంకారముచేనగు నలంకారధ్వని

స్వతఃసంభవియగు నర్థశక్తిమూలాలంకారధ్వని :—

చ ఉడుపతిబారికిఁ వెఱచి యూఱట యౌ నని పేరుటామనిఁ
ముడివడు కంతుసేనలకు ముయ్యేలగు ట్టయినట్టి యిందు రా

48 "కైముత్యేనార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తిరిష్యతే॥" (చంద్రా శ్లో. 120)

నడఁగునె తాపవహ్ని మనమై హరిణేక్షణ! ముల్లుపుచ్చి కొ
ఱ్ఱడిచినచందమయ్యెఁ బొదమా యెలదోఁటఁ జరింప కింటికిన్. (3 34)

విరహిణియగు వరూధినిని గూర్చి చెలికత్తియపలుకు లివి.

ఇట–'ముల్లుపుచ్చికొఱ్ఱడిచినచందమయ్యె' ననుట లోకప్రవాదాను కృతియ కావున నిది లోకోక్త్యలంకారము. దీనిచే చంద్రునిబారినుండి కాపాడుకొనుటకై ఉద్యానము ప్రవేశింప నది తీరకపోగా మలయమారుతశుకపికాలాపగతుల విరహతాపమతిశయించుటచే తదుపద్రవమును సంప్రాప్తమయినందున అనిష్టావాప్తిరూపమగు విషమాలంకారము [49] ధ్వనించుచున్నది

వ్యంజకమగు నీలోకోక్త్యలంకారము[50] లోకరూఢిననుసరించి యేర్పడినదేకాని కవికల్పనావిలసితము కాదు కావున నిది స్వతఃసంభవియగునర్థశక్తిమూలకాలంకారధ్వని

కవిప్రౌఢోక్తిచేనగు నర్థశక్తిమూలాలంకార ధ్వని :–

సీ ఉరుదరీకుహరసుప్తోత్థశార్దూలముల్
ఝరవారి శోణితశంకఁ ద్రావ
వనకుంజమధ్యశాద్వలచరన్మృగపంక్తి
దావపావకభీతిఁ దల్లడిల్ల
నాశ్రమాంతరభూరుహాగ్రముల్ మునికోటి
బద్ధకాషాయవిభ్రాంతిఁ జూడ
ఘనసానుశృంగశృంగాటకంబులఁ గాంచి
యమరులు హేమాద్రి యనుచుఁ ద్రావఁ

తే గాసెఁ బేశలరుచిఁ గిశుంకప్రవాళ
ఘసృణకిసలయకంకేళికుసుమగుచ్ఛ
బంధుజీవజపారాగబాంధవంబు
లన్నగంబున జరఠారుణాతపములు. (3 . 11)

---

49 అనిష్టస్యాప్యవాప్తిశ్చ తదిష్టార్థసముద్యమాత్ ।
భక్ష్యాశయా హి మంజూషాం దష్ట్వాఽఽఖుస్తేన భక్షితః॥ (చంద్రా శ్లో 90)

50 లోకప్రవాదానుకృతిర్లోకోక్తిరితి భణ్యతే ॥ (చంద్రా శ్లో 157)

సూర్యాస్తమయవర్ణనమిది_జరరాతపారుణ్యము ఝురవారినావరించి యుండునపుడు సుప్తోత్థితశార్దూలములకు శోణితభ్రాంతి కలిగించినదనియు, వనకుంజములనావరించియుండునపుడు మృగములకు దావపావకభీతిని కలిగించినదనియు, ఆశ్రమాంతరభూరుహాగ్రముల వ్యాపించి మునికోటికి కాషాయభ్రాంతి కలిగించెననియు, మహీధరశిఖరాగ్రములనావరించి సురలకు హేమాద్రిభ్రాంతిని కలుగఁజేసెననియు, వర్ణించియుండుటచే నిది భ్రాంతిమదలంకారములసంసృష్టి దీనిచే జరరారుణాతపములు 'ఝురవారి'మున్నగు వానిని నెఱ్ఱవాఱజేయుచు క్రమముగా నాయాప్రదేశములలో నిలిచెనను పర్యాయాలంకార మిందు ధ్వనించుచున్నది

ఒకవస్తువు క్రమముగా ననేకస్థలములలోనుండుటయే పర్యాయాలంకారము [51] ఎండ ఎల్లెడలవ్యాపించి యుండుటలో క్రమములేకున్నను దాని యారుణ్యము మొదట క్రిందిప్రదేశములనావరించి వానిని వీడి క్రమముగాపైకెగప్రాకుట యనుభవసిద్ధమై యుండుటచే నిది పర్యాయాలంకారధ్వనియనుట చెల్లినది కావుననే కవి ఆతపముల కారుణ్యవైశిష్ట్యమును ప్రత్యేకముగా సమకూర్చెను

సుప్తోత్థితశార్దూలాదులకు కలిగిన భ్రాంతి కవికల్పనావైచిత్రిచే నేర్పడినదే కాని లోకసిద్ధము కాదు కావున నిది కవిప్రౌఢోక్తిచే నేర్పడిన అర్థశక్తిమూలాలంకారధ్వని యయినది

### కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిచేనగు నలంకారధ్వని :_

చ  జడ నొక యింతలేని నెఱచక్కఁదనంబుల నెల్లఁ గూర్పఁగాఁ
బొడవయినట్టిధన్యుఁడవు భోగివి పూవిలుకాఁడ విట్టిసీ
వెడపక నిష్ఠురత్వమున కెట్లలవాటుగఁ జేసి తక్కటా!
పడతులమీదనేయ రతిపయ్యెదకుఁ ననువైన చేతులఁ (3 48)

విరహతప్తయగు వరూధిని చేయుమన్మథదూషణ మిది మన్మథుఁడు లోకములోనియందములనెల్ల నొకటిగాఁజేయగాఁనేర్పడినవాఁడని చెప్పుటచే నతనియాకృతి యత్యంతసుకుమారమనియు, పూవిలుకాఁడనుటచే సాధనసంపత్తియు మృదువైనదే యనియు, 'రతిపయ్యెదకుఁ ననువైన చేతులఁ'

51. పర్యాయో యది పర్యాయేణైకస్యానేకసంశ్రయః ॥ (చంద్రా శ్లో 110)

అనుటచే, చేతలుకూడ సుకుమారములే యనియు ధ్వనించుచున్నది దీనిచే సౌకుమార్యమే రూపెత్తిన నీవెక్కడ? మముఁబోంట్లబాధించు ఈ నిష్ఠుర ప్రవృత్తి ఎక్కడ? అను విషమాలంకారము (అననురూపఘటనాత్మకము) ధ్వనించుచున్నది

ఇట చక్కఁదనంబులనెల్లఁగూర్పఁగాఁబొడవయియుండుటయు[52], రతి పయ్యెదకుఁ ననువైనచేతులఁ నిష్ఠురత్వమునకలవాటుగఁ జేయుటయు వరూధినిప్రౌఢోక్తియే కదా? కావున నిది కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిచె నగు నలంకారధ్వని

పదద్యోత్యమగు నలంకారధ్వని -

ఉ ఇందునిభాస్య! వాఁడనఁగ నింద్రుఁడొ? చంద్రుడొ? యాయుపేంద్రుఁడో?
యిందులకై వగం బొగుల నేటికి? నేఁటికి నందుఁబోద మా
నందనభూమి భూమిసురనందనుఁ డుండకపోఁడు, రమ్మనీ
చందము నందముం గనిన జవ్వని! యెవ్వని వెఱ్ఱిఁజేయదే (3 63)

వరూధినినూరడించుచు సకియలు పలికిన పలుకులివి

ఇట లోకోత్తరసౌందర్యరాశివగు నీ యందచందముల నీక్షించిన ఆ ప్రవరుఁడు కూడ కామబాణావిద్ధుఁడై నీదరిఁజేరకపోఁడను ప్రకృతార్థమునకు సమర్థకముగా 'ఎవ్వని' అనుపదసామర్థ్యమున 'ఎంతటి విరక్తుఁడైనను మద వతుల యందచందములకు లొంగిపోనివాడుండ"డను సామాన్యార్థము స్ఫురించుటచే నిది [53]యర్థాంతరన్యాసాలంకారధ్వని, పదద్యోత్యము

వాక్యద్యోత్యమగు నలంకారధ్వని .—

మ అలపోత్రిప్రభుదంష్ట్రి భోగివరభోగాగ్రాళిరా లుద్భటా
చలకూటోపలకోటి రూపుచెడ నిచ్చల్ రాయఁగా నైన మొ
క్కలు భూకాంతకు నున్ననయ్యె నరసక్ష్మాపాలుశ్రీకృష్ణరా
యలబాహామృగనాభిసంకుమదసాంద్రాలేప పంకంబునన్ (1 35)

---

52 'నెఱచక్కఁదనంబులనెల్ల గూర్పఁగాఁబొడవయునట్టివాఁడవన' అని నిబంధించిన నిది యుత్ప్రేక్షాలంకారమగును అట్లు సంభావనావాచకపదము లేకుండుటచే నిది గమ్యోత్ప్రేక్షాలంకారమయినది. —రచయిత.

53. "ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్య విశేషయోః" (చంద్రా. శ్లో. 122)

శ్రీకృష్ణరాయల భూభారవహనక్షమత్వమును వర్ణించున దీ పద్యము ఇట భూకాంతకు మొక్కలునున్నవఁట యనునది కవిప్రౌఢోక్తి విలసితమే కాని సహజము కాదు ఇది సంబంధాతిశయోక్త్యలంకారము దీనిచే "భూభారవహన విషయమున ఆదివరాహాదులకంటెను కృష్ణరాయఁడు కడు నేర్పరి" యను వ్యతిరేకాలంకారము ధ్వనించుచున్నది

ఇది ఈ పద్యమందలి సమగ్రవాక్యార్థసామర్థ్యముచే నేర్పడినది కావున వాక్యద్యోత్యమగునలంకారధ్వని

ఇంతేగాక పూర్వోదాహృతములలో నెన్నో వాక్యద్యోత్యధ్వనులున్నవి గమనించఁదగును

ఇఁక ప్రబంధద్యోత్యమగు నలంకారధ్వని .—

ప్రవరుఁడాదర్శగృహస్థుడు - పెద్దన మహాకవి వానినిట్లు వర్ణించెను—

ఉ ఆపురిఁబాయకుండు మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి భా
షాపరశేషభోగి వివిధాధ్వరనిర్మలధర్మకర్మదీ
క్షాపరతంత్రుఁ డంబురుహగర్భకులాభరణం బనారతా
ధ్యాపనతత్పరుండు ప్రవరాఖ్యుఁ డలేఖ్యతనూవిలాసుఁడై

ఆ వానిచక్కఁదనము వైరాగ్యమునఁ జేసి
కాంక్ష సేయు జారకామినులకు
భోగబాహ్యమయ్యెఁ బూచినసంపెంగ
పొలుపు మధుకరాంగనలకుఁ బోలె

ఉ యౌవనమందు యజ్వయు ధనాఢ్యుఁడునై కమనీయకౌతుక-
శ్రీవిధిఁ గూకటుల్ గొలిచిచేసినకూరిమిసోమిదమ్మ సౌ-
ఖ్యావహయై భజింప సుఖులై తలిదండ్రులు గూడి దేవియుం
దేవరవోలె నుండి యిలు దీర్పఁగ గాఁపురమొప్పు వానికిన్.

సీ వరణాతరంగిణీదరవికస్వరనూత్న-
కమలకషాయగంధము వహించి,
ప్రత్యూషపవనాంకురములు పైకొనువేళ
వామనస్తుతిపరత్వమున లేచి,

సత్పాత్రుఁడగుచు నిచ్చలు నేగి నయ్యేట
నఘమర్షణస్నానమాచరించి,
సాంధ్యకృత్యము దీర్చి సావిత్రి జపియించి
సైకతస్థలి కర్మసాక్షి కెఱఁగి

గీ. ఫలసమిత్కుశకుసుమాదిబహుపదార్థ
తతియు నుదికినమడుగుధోవతులు గొంచు
బ్రహ్మచారులు వెంట రా బ్రాహ్మణుండు
వచ్చునింటికిఁ బ్రజ తన్ను మెచ్చి చూడ

శా. శీలంబుం గులముఙ్ శమంబు దమముం జెల్వంబు లేఁబ్రాయముం
బోలం జూచి యితండె పాత్రుఁడని యే భూపాలుఁడీవచ్చినఙ్
సాలగ్రామము మున్నగాఁగొనఁడు మాన్యక్షేత్రముల్ పెక్కుచం
దాలం బండునొకప్పుడుం దఱుఁగ దింటం బాఁడియుంబంటయుఙ్

తే. వండ నలయదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియౌ నతనిగృహిణి
యతిథు లేతేర నడికిరేయైనఁబెట్టు
వలయుభోజ్యంబు లింట నవ్వారి గాఁగ

సీ తీర్థసంవాసు లేతెంచినారని విన్న
నెదురుగా నేఁగు దవ్వేంతయైన
నేఁగి తత్పదముల కెఱఁగి యింటికిఁ దెచ్చుఁ
దెచ్చి సద్భక్తి నాతిథ్య మిచ్చు
నిచ్చియి(మృ)ష్టాన్న సంతృప్తులఁగాఁ జేయుఁ
జేసి కూర్చున్నచోఁ జేరవచ్చు
వచ్చి యిద్దరఁ గల్గు వనధిపర్వతసరి-
త్తీర్థమాహాత్మ్యముల్ దెలియ నడుగు

గీ నడిగి యోజనపరిమాణ మరయు నరసి
పోవలయుఁ జూడ ననుచు నూర్పులు నిగుడ్చు
ననుదినమున తీర్థసందర్శనాభిలాష
మాత్మనుప్పొంగ నత్తరుణాగ్నిహోత్రి (మను 1 . 51 _ 57)

ఈ పద్యములలో ప్రవరుని సౌశీల్యరూపవిత్వాదులు అప్రతిగ్రహము, ధర్మతత్పరత, విధినిర్వహణము అతిథిసేవాపరాయణత, మున్నగునవి వర్ణితములైనవి దీనిచే ఇతరగృహస్థులకంటె ఇతనికిగల యుత్కర్ష ప్రతీయమానమగుటచే నిది వ్యతిరేకాలంకారధ్వని వాక్యసమూహాత్మకప్రబంధద్యోత్యము

ఇవి యలంకారధ్వనివిశేషములు

రసాదిధ్వని విశేషములు :—

శృంగారరసధ్వని .—

కేళీసదనమున మనోరమయెడల స్వరోచిప్రవర్తించిన తీరిట్లున్నది—

సీ. దట్టంబు నీకట్టినట్టిచెంగావికి
        బాగుగాదని కేలఁ బయట నిమిరె
గోరంటో? గొళ్ళనిక్కువపుఁగెంపో? యని
        చెయిపట్టి నయమున సెజ్జ సేర్చె
నగరుధూపముచేత నయ్యో! తనూవల్లి
        సెకసోకెనని యెదఁజెయ్యిపెట్టె
మృగనాభికామకరికలఁ గప్రము మించె
        నని మూరుకొనుచు జుంబన మొనర్చె

తే గీ. హారమణులిటు నూపు,నాయఱుతనున్న
హారమణులకుఁ గాంతి సీడౌనా కావో
యనుచు నక్కునఁ గదియించు నానెపమున
గంపమును బొందు సతిమేను గౌఁగిలించె. (6 8)

ఇట మనోరమ ఆలంబనవిభావము-తదీయలోకోత్తరలావణ్యము ఏకాంతప్రదేశమును ఉద్దీపనవిభావములు, పయటనిమురుట, సెజ్జసేర్చుట, చెయ్యిపట్టుట, అధరమునాస్వాదించుట, ఆశ్లేషించుట, యనునవి యనుభావములు ఆక్షిప్తములగు ఔత్సుక్యహర్షాదులు వ్యభిచారిభావములు వీనిచే స్వరోచికి మనోరమయెడఁగలరతి యభివ్యక్తమగుచు సంయోగకాలీన మగుటచే సంభోగశృంగారరసధ్వని యగుచున్నది

మఱియొక యుదాహరణము —

మ. అవనీశత్రిదశేంద్రుచూపులకు కన్యాగండపాళిద్వయీ-
నవలావణ్యరసంబుఁ గొల్లగొని యంతం జెంత ఫాలంపురా
జు విలోకించి చలించి క్రైకొనిన యాసొమ్మెల్ల ఘర్మాంబుకై
తవమొప్పన్ వెస డించి తూలెఁ గబరీతాపింఛకుంజాంతమున్ (5 82)

వివాహసందర్భమున మధ్యనున్న తెరచీర వంచఁగా మనోరమా ప్రత్యవయవలావణ్యమును తదేకముగా నిరీక్షించురాజునుత్కంఠ ఈ పద్యమున వర్ణితమయినది

ఇట మనోరమ ఆలంబనవిభావము - తదీయలోకోత్తర లావణ్యాదు లుద్దీపనవిభావము ప్రత్యవయవము నాదరమునఁ గాంచుట, చెమర్పుటయును అనుభావములు. ఆక్షేపగమ్యములగు హర్షాదులు వ్యభిచారిభావములు వీనిచె స్వరోచికి మనోరమయెడఁగల రతి యభివ్యక్తమగుచు శృంగారరసధ్వని యగుచున్నది

అపహ్నుత్యనుప్రాణితమైన సావయవరూపకాలంకార మిట [54] రసాను గుణమై శోభాహేతువగుట విశేషము.

విప్రలంభ శృంగారరసధ్వని :—

ఉ అక్కట ! వాఁడు నాతగుల మాఱడి సేసి దయావిహీనుడై
చిక్కక త్రోచిపోయె దరిఁజేరఁగరాని వియోగసాగరం
బెక్కడ నీదుదాన నిఁక నీకొఱనోములు నోఁచినట్టి నే
నెక్కడ ! వాని కౌఁగిలది యెక్కడ ? హా ! విధి యేమి సేయుదున్
(3 . 5)

ప్రవరతిరస్కృతయై తన్నుతా నిందించుకొను వరూథిని పలుకు లివి. ఇట ప్రవరుఁడాలంబనవిభావము - 'వాఁడు' అనుపదముచే నాక్షిప్తము లయిన ప్రవరునిలోకోత్తరసౌందర్యాదు లుద్దీపనవిభావము - దైన్యచింతావిషా దములు వ్యభిచారిభావములు. వీనిచే ప్రవరునియెడ వరూధినికిఁగల రతి యభి వ్యజ్యమానమగుచు వియోగకాలీనమగుటచే విప్రలంభశృంగారరసధ్వని యగు చున్నది

---

54 ధ్వన్యాత్మభూతే శృంగారే సమీక్ష్య వినివేశితః ।
రూపకాదిరలంకారవర్గ ఏతి యథార్థతామ్॥ (ధ్వన్యా 2 17)

భయానక రసధ్వని :—

క ఆవిపినాంతరమున హా!
హా! వనిత ననాథ నబల నార్త విపన్నం
గావరె యీ పుణ్యమునం
బోవరె యని పలుకువాడు మొఱ వినఁబడియెన్. (4 66)

రాక్షసుఁడు తన్ను కవళింప వెంటనంటి రాఁగా నాక్రోశించుచున్న మనోరమపలుకులివి—ఇట రాక్షసుఁడు తన్నువెంటాడుట విభావము. అతని యాకృతి దర్శనాదు లుద్దీపనవిభావము శరణువేడుట, పరుగిడుట మున్నగునవి యనుభావములు ఆక్షిప్తములగు దైన్యశంకాదులు వ్యభిచారిభావములు వీనిచే మనోరమకుఁగల స్వాత్మహానిరూపమహానర్థవిషయకమగు వైక్లవ్యాఖ్యచిత్తవృత్తి విశేషరూపభయ మభివ్యక్తమగుచు భయానకరసధ్వని యయినది

భావధ్వని :—

శా. నీవైశిష్ట్యము తిట్టులన్ మెఱయునే నీకంటె నేఁదక్కువే?
యీవే కన్యకనీవుగాక మఱి మద్వృత్తాన్వయాచారముల్
నీవా పేర్కొనుపాటివాఁడ విలఁ గానీ నిల్తు గాకేమి? పో
పో విప్రాధమ! నిన్నుఁబోల నిఁక నల్పుల్ లేరు దంభవ్రతా॥ (6 49)

పారర్షికూతు నడుగఁబోయి యతనిచే తిట్టుబడినదేవాపి యనుగంధర్వుని పలుకులివి— ఇట పారర్షి పిల్లనీయకపోగా తన్నవమానించి పరుషోక్తులాడుట విభావము 'పో పో విప్రాధమ' ఈమున్నగు భర్త్సనావాక్యములు వదేచ్ఛయును అనుభావములు. వీనిచే నిర్దయాత్మకచిత్తవృత్తిరూపమగు[55] నుగ్రతారూపభావము ధ్వనించుచున్నది—కావున నిది భావధ్వని.

---

55 నృపాపరాధోఽసద్దోషకీర్తనం చోరధారణమ్।
విభావాః స్యు రథో బంధో వధస్తాడనభర్త్సనే।
ఏతే యత్రానుభావా స్తదౌగ్ర్యం నిర్దయతాత్మకమ్॥
(రసగం. ద్వితీ. బావధ్వని)

రతిభావధ్వని .-

తే మౌనినాథ ! కుటుంబజంబాలపటల
మగ్నమాదృశగృహమేధిమండలంబు
నుద్ధరింపంగ నౌషధమొండు గలదె
యుష్మదంఘ్రిరజోలేశ మొకటి దక్క (1 64)

'అభ్యాగతః స్వయం విష్ణుః' అని భావించిన ప్రవరుని ప్రశంసావాక్యము లలో నతనికి ఔషధసిద్ధునియెడఁగల రతిభావ మభివ్యక్తమగుచున్నది

మౌనివిషయకమగు నీరతిభావము సంచారియేకాని స్థాయిభావముకాదు * కాన ఇది భావధ్వని

రసాభాసధ్వని :-

మనోరమ బాల్యచాపలమున చేసినయపరాధమును సహించని జీర్ణముని యమానుషత్వ మిట్లు ప్రస్తుతమైనది

క జననాథ ! యేమి చెప్పుదు
కనలుచు నవ్వగ్రతపసి కటము లదరఁగాఁ
దనచేతినాగబెత్తముఁ
గొని పసరముఁగొట్టినట్లు గొట్టె నదయుఁడై (4 85)

ఇట మనోరమ యాలంబనవిభావము ఆయమ బాల్యచాపల్యమున చేసిన వదననేత్రకుహరాదిపరామర్శన ముద్దీపనవిభావము. మండిపడుట కటము లదరుట నిర్దయతాడనాదులును అనుభావములు తాడనభర్త్సనాదులచే నభివ్యక్తములగు నుగ్రతాగర్వాదులు వ్యభిచారిభావములు వీనిచే నాజీర్ణమునికి మనోరమయెడఁగల క్రోధ మభివ్యక్తమగుచు స్త్రీయెడనింతటి క్రోధమును కనఁబఱచుట తగినదికాకుండుటచే నిది అనుచితవిభావాలంబనకమగు[56] రౌద్రరసాభాసమగుచున్నదికాని రౌద్రరసము కాదు ఇది రౌద్రరసాభాసధ్వని

---

* "రతిర్దేవాదివిషయా వ్యభిచారీ" (ప్ర రు రసప్రక )

56. అనుచితవిభావాలంబనత్వం రసాభాసత్వమ్॥ (రసగం. ప్రథమ. రసాభాస)

మఱియుక యుదాహరణము —

క  అంతటఁ బ్రాచి నిశాపతి
యంతికగతుఁడౌట విని ముఖాలంబితమః
కుంతలములు దీర్పఁగఁగొను
దంతపుదువ్వెన యనంగ ధవళిమ దోఁచెన్॥  (3 20)

నిశాపతియను నాయకుఁ డాలంబనవిభావము అతఁడంతికగతుఁడగుట యుద్దీపనవిభావము. కేశాలంకరణాదులకై త్వరపడుట యనుభావము ఆక్షిప్తము లగు ఔత్సుక్యాదులు వ్యభిచారిభావములు వినిచే నభివ్యక్తమగు చంద్రాలంబనక ప్రాచీగతరతి శృంగారరూపమున పరిణతినొందునని యనరాదు నిశాశశుల యందు నాయకత్వారోపమున సమాసోక్త్యపస్కృతమగుటచే[57] నిది శృంగార రసాభాసధ్వని యగునే కాని రసధ్వని కాదు

భావాభాసధ్వని :—

స్వరోచి పెండ్లికొడుకై యూరేగు సందర్భమున ఒకానొకపౌరవిలాసిని అతనిని గాంచి పరవశభావమునొందినవిధ మిట్లు వర్ణితమైనది—

చ  పరవశదైన్య మాడుకొను ప్రౌఢలఁ గానదు ఘర్మవారిచేఁ
గరఁగి స్రవించు చిత్రకము గాన దనాదృతవీటిపాటలా
ధరమున నున్న మంటినవిధంబును గానదు నవ్వుటాలకా
భరణము గొన్నఁగాన దొకబాల నృపాలుని జూచి నివ్వెఱన్।
(5 65)

స్పృహణీయమూర్తియగు స్వరోచి నట్లుచూచుట విభావము ఆవశ్య కర్తవ్యములగు—ఘర్మవారివేఁగరిఁగి స్రవించుచిత్రకమును సరిచేసికొనుట, అధర

57 సూ॥ నిరింద్రియేషు తిర్యగాదిషుచారోపాత్ రసాభాసభావాభాసౌ॥54
... . . ... ఆదిశబ్దాత్ నిశాచంద్రమసో
ర్నాయకత్వాధ్యారోపాత్ సంభోగాభాసో యథా(కుమా 8 63) —
"అంగుళీభిరివ కేశసంచయం సన్నియమ్య తిమిరం మరీచిభిః।
కుడ్మలీకృతసరోజలోచనం చుంబతీవ రజనీముఖం శశీ॥"
(కావ్యానుశాసన 2 54 సూ. ఉదా)

మునసంటిన సున్నమును తుడుచుకొనుట మున్నగువానిని కానకుండుట యను భావము వీనిచే "జడత" యను[58] వ్యభిచారిభావమాభాసరూపమై ధ్వనించుచున్నది. ఆవిలాసిని స్వరోచియందాసక్తభావము చూపుచున్న దేకాని నిజమునకు స్వరోచి కాయమయందాభావము లేశమాత్రమును లేదు కదా! కావున నిది అనుభయ నిష్ఠాత్మక రతి యగుట శృంగారరసాభాసము_దానిని పోషించుసంచారిభావ మగు జడతయు ఆభాసరూపమగుటచె నిది భావాభాసధ్వని యగును

**భావోదయధ్వని :-**

ఇందీవరాక్షుఁడు కపటముగా నాయుర్వేదవిద్యను సంగ్రహించి గురు వగు బ్రహ్మమిత్రుని పరిహసింప నాతఁడు కోపోద్దీపితుఁడై నవిధమిట్లు వర్ణింపఁ బడినది—

మ అనిమం గన్నులు జేవుఱింప నధరంబల్లాడ వేల్లత్పునః
పునరుద్యద్భ్రుకుటీభుజంగయుగళీఫూత్కార ఘోరానిలం
బన నూర్పుల్ నిగుడన్ లలాటఫలకంబందంద ఘర్మాంబువుల్
చినుకన్ గంతుదిదృక్షురూక్షనయనక్షేళాకరాళధ్వనిన్॥ (5 . 18)

అట్లిందివరాక్షుఁడు తన్నవమానించుట విభావము కన్నులెఱ్ఱవాఱుట, అధరమల్లాడుట, ఊర్పులునిగుడుట, ఫాలమున స్వేదముద్భవించుట యనునవి అనుభావములు. వీనిచే బ్రహ్మమిత్రునకు కోపముపొడసూపెననుట వ్యంగ్యము. కావున నిది భావోదయధ్వని

"ఉద్బుద్ధమాత్రః స్థాయీ చ భావ ఇత్యభిధీయతే' (సా ద 3 260) అను లక్షణమున నీకోపము ఉద్బుద్ధమాత్రావస్థలోనున్నందున సంచారియే కాని స్థాయిభావము కాదు

కావున నిట భావోదయధ్వని యని వ్యవహరింపఁబడినది

---

58.క) కార్యావివేకో జడతా పశ్యతః శృణ్వతోఽపి వా ।
తద్విభావాః ప్రియానిష్ట దర్శనశ్రవణే రుజా॥
(రసగం ప్రథమా భావధ్వని.)

ఖ) జాడ్యమప్రతిపత్తిః స్యాదిష్టానిష్టాగమోద్భవా॥ (ప్ర. రు రసప్రక )

**మఱియొకయుదాహరణము :—**

క కడు నవ్వించుచుఁ జెఱఁగులు
ముడివెట్టఁగ బేరటాండ్రు ముదిత కనుబొమల్
ముడివెట్టె నాలిసిగ్గున,
ముడివెట్టెఁగ నారి చెఱకుమోసున మరుఁడున్ (5 94)

మనోరమాస్వరోచులవివాహవర్ణనప్రస్తావమునందలి దీ పద్యము ఇట పేరటాండ్రు నవ్వించుచు చీరచెఱఁగులు ముడివెట్టుట విభావము కనుబొమలు ముడివెట్టుట యనుభావము - వీనిచే రోషోదయము వ్యంగ్యము "రత్యాదయో ఽప్యనియతే రసే స్యుర్వ్యభిచారిణః" (సా ద. 3 272) అను నభియుక్తోక్తి ననుసరించి శృంగారరసపరిపోషకమగు నీ రోషము సంచారియే కాని స్థాయి భావము కాదు కదా ?

ఇట రోషోదయమే కడు రమణీయతను చేకూర్చుటచే నిది భావోదయ ధ్వని యయినది

**భావశాంతిధ్వని :—**

"అసురభావము నొందు"మను శాపమున స్రుక్కి తన్ను శరణువేడిన ఇందీవరాక్షుని బ్రహ్మమిత్రుఁడనుగ్రహించిన తీ రిట్లున్నది

చ అనినఁ బ్రసన్నుఁడై ముని కరాబ్జములన్ నను నెత్తి వత్స ! మ
త్సునిశితశాపశూలహతి స్రుక్కి తిగా యిఁకఁగొన్నినాళ్ళపైఁ
దనయను మ్రింగఁబోయి యొకధన్యుని దివ్యశరార్చిఁ బ్రేలి వే
కనియెదు భద్రమన్నఁ దురగంబుపయిం బడి ప్రొద్దుగ్రుంకఁగన్.
(5 . 21)

అట్లి దీవరాక్షుఁడు తన్ను శరణువేడుట విభావము— ముఖప్రసాదము. ఇందీవరాక్షుఁని లేవనెత్తుట మృదుమధురోక్తులుపలుకుటయును అనుభావములు, వీనిచే కోపశాంతి వ్యక్తమగుచుండుటచే నిది భావశాంతిధ్వని

**భావసంధిధ్వని :—**

సకియలు మనోరమను కేళీసదనమునకంపుట ఎట్లు హృద్యముగా వర్ణితమైనదో చూడుడు —

క. తెచ్చుటయు కేళిభవనము
చొచ్చెనొ చొరదో యనంగ సుదతులపిడం
జొచ్చి పయిఁగొప్ప దోఁపగ
నచ్చెడియ తలుపుదండ నల్లన నిలిచెన్ (6 6)

సకియలు తన్నంటివెంటవచ్చుటచేఁగలిగిన లజ్జయొక్కయు, ప్రియుని యతిలోకసౌందర్యము నాస్వాదింపవలెనను నుత్కంఠచే పొడమిన ఔత్సుక్యము యొక్కయు సంధి కేళిసదనప్రవేశాప్రవేశములమేలుకలయికయగు తలుపు దండనల్లననిలుచుటయను యనుభావముచె వ్యక్తమగుటవలన నిది భావసంధి ధ్వని

ఇట కేవలమగు లజ్జచేతనే కాని కేవలమగునౌత్సుక్యముచేతనే కాని అందములేదు ఆలజ్జౌత్సుక్యములసంధియే చర్వణాగోచరమగుచు పరమ రమణీయమగుచున్నది కాన నిది భావసంధి (ధ్వని)యని వ్యవహరింపఁబడుచున్నది

**భావశబలతాధ్వని :—**

మాయాప్రవరుని చేరఁజనునప్పుడు వరూథినిస్థితి ఇట్లున్నది—

సీ తొలుదొల్తవానిఁగన్నులఁగాంచినప్పుడ
పల్లవాధరగుండె జల్లుమనియె
నట రెండు మూఁడంజలరుగునప్పుడ కాళ్ళఁ
బంకజాక్షికి దొట్రుపాటు గదిరె
డాయంగఁజనునప్పుడ ముఖాంబుజమునఁ
గంబుకంధరకు దైన్యంబు దోఁచెఁ,
గదిసి నిల్చినయప్డ కనుదోయిరెప్పల
లలనకు మిగులఁ జంచలత బెరసెఁ

తే. గటకటా! యనునపుడ గద్గదిక వొడమెఁ
జెఱఁగు పట్టినయపుడ లేఁజెమటగ్రమ్మె
సొలసి మాటాడనుంకింపఁ దలఁచి మోముఁ
దేఱి చూచిన యపుడ కన్నీరు వొడమె (3 91)

ఇట గుండెజల్లుమనుటచే నతనిగంభిరాకృతిదర్శనజన్యమగుత్రాసమును, కాళ్ళు తడబడుటచే తన్నతఁడాదరించునో లేదో యను శంకయును,

ముఖదైన్యముచే అతనినోడఁబఱచుకొనునుపాయము కానవచ్చుటలేదే యను విషాదమును, కనురెప్పలచాంచల్యముచే అతని లోకోత్తరసౌందర్యమును దర్శించుచాపలమును, కటకటా! నన్నట్లు మోసపుచ్చితివి గదా! యను ఇష్టాప్రాప్తిజనితమగు చింత గద్గదికవోడముటచేనగు సంతాపాతిశయముచేతను, చెఱఁగు ఒట్టి యతనినోడఁబఱచుకొనునావేగము లేఁజెమటగ్రమ్ముటచేతను, మాటాడనుంకింపఁదలచి మోము దేఱిచూచినయపుడుపొడమిన ఇష్టలాభజనితమగుహర్షము కన్నులనీరొలుకుటచేతను వ్యక్తములగుచున్నవి

ఇట్లీ పద్యమున [59] త్రాసశంకావిషాదచాపలచింతావేగహర్షములనెడు భావములు వ్యక్తములయి శృంగారరసాంగములగుచు చమత్కారాతిశయము నొనఁగూర్చుచున్నవి—

కావున నిది భావశబలతాధ్వని

భావశబలతలో భావములు పూర్వపూర్వభావోపమర్దకములై యుండవలె నను నియమము లేదని ప్రాచీనుల యుదాహరణముల పరిశీలనవలన తెలియు

---

59 త్రాసాదులలక్షణమిట్లున్నది—

క) "ఆకస్మికభయాచ్చిత్తక్షోభస్త్రాసః ప్రకీర్తితః" (ప్ర రు రస శ్లో 62)

ఖ) అనర్థప్రతిభా శంకా పరక్రౌర్యాత్ స్వదుర్ణయాత్ ।
వైవర్ణ్యకంపవైముఖ్యపార్శ్వాలోకాస్యశోషకృత్॥
(కావ్యప్రదీప. చతుర్థ పుట. ౘ6)

గ) విషాదశ్చేతసో భంగ ఉపాయాభావచింతనైః ॥ (ప్ర రు రస శ్లో 49)

ఘ) చాపలం త్వనవస్థానం రాగద్వేషాదిసంభవమ్॥ (ప్ర రు రస. శ్లో. 44)

ఙ) సంతాపః స్మరణం చైవ కార్శ్యం దేహానుపస్కృతిః ।
అధృతిశ్చానుభావాః స్యుః సా చింతా పరికీర్తితా ॥
(రసగం. ప్రథమ. పు 101)

చ) ఆవేగో రాజవిద్రావరత్యాదేః సంభ్రమో మతః ।
తత్ర విస్మరణం స్తంభః స్వేదః కంపః స్ఖలద్గతిః ॥
(కావ్యప్రదీప. చతుర్థ. పుట 87)

ఛ) ప్రసత్తిరుత్సవాదిభ్యో హర్షః స్వేదాశ్రుకంపకృత్ ॥
(ప్ర. రు రస. శ్లో 45)

చున్నదని పండితరాయలభిప్రాయపడుటచే[60] నిట పూర్వాపూర్వభావోపమర్దనము లేకున్నను భావశబలతాధ్వనియే యయినది

**పదద్యోత్యమగు రసాదిధ్వని :—**

ఉ. ఎక్కడివాఁడొ ! యక్షతనయేందుజయంతవసంతకంతులం
జక్కఁదనంబునన్ గెలువఁజాలెడువాఁడు, మహీసురాన్వయం
బెక్కడ ? యీతనూవిభవమెక్కడ ? యేలనిబంటుగా మరున్
దక్కఁగొనంగరాదె యకటా ! నను పేఁడు పరిగ్రహించినన్. (2 35)

ఇది ప్రవరునియందమునకు లోఁబడినవరూథిని తలంపు ఇట 'ఎక్కడివాఁడొ !' అను పదముచివరి సందేహమును దెలుపు 'ఓ'కారము నేనింతటి యందగానినెందును జూడలేదనుటను వ్యక్తపఱచి తద్ద్వారా ప్రవరునిలావణ్యము లోకోత్తరమైనదని ఉద్దీపనవిభావోత్కర్షను ధ్వనింపఁజేయుచు ఆ వరూథినికి ప్రవరునియెడఁ గల నభిలాష నినుమడింపఁజేయుటలో ప్రాధాన్యమునొందుచు అభిలాషహేతుక విప్రలంభశృంగారరస పరిపోషకమగుటచే నిది నిపాతరూప పదద్యోత్యమగు రసధ్వని

**పదాంశద్యోత్యమగు రసధ్వని —**

అక్కట ! వాఁడు నాతగుల మాఱడి సేసి దయావిహీనుఁడై
చిక్కక త్రోచి పోయె దరిఁజేరఁగరాని వియోగసాగరం
బెక్కడ నీదుదాన నిఁక నికొాఱనోములు నోఁచినట్టి నే
నెక్కడ ? వాని కౌఁగిలది యెక్కడ ? హా ! విధియేమిసేయుదున్.
(3 5)

విరహదోదూయమానమానసయగు వరూథిని ప్రవరుని తలపోయుచు పలికిన పలుకులివి—

---

60. యత్తు-కావ్యప్రకాశటీకాకారైః - ఉత్తరోత్తరేణ భావేన పూర్వపూర్వభావోపమర్దః శబలతా" ఇత్యభ్యధీయత, తన్న। "పశ్యేత్ కశ్చిత్" (కావ్య 5 123) ఇత్యత్ర శంకాసూయాధృతిశ్రమదైన్యమత్యౌత్సుక్యానాముపమర్దలేశశూన్యత్వేఽపి శబలతాయా రాజస్తుతిగుణత్వేన పంచమోల్లాసే మూలకృతైవ నిరూపణాత్ ॥ (రసగం ప్రథమ పుట. 126)

ఇట "కౌఁగిలది"అనునప్పుడు'కౌగిలి'విశేషణమగు'అది'యను సర్వనామ పదమందలి ప్రకృత్యంశము ఆకౌఁగిలిచే కలిగిన సౌఖ్యానుభూతి యనిర్వచనీయమని అనుభూతార్థవిషయకస్మృతినభివ్యక్తీకరించుటద్వారా ఉత్కంఠాతిశయమును ధ్వనింపఁజేయుచు విప్రలంభశృంగారరసపరిపోషణమున ప్రాధాన్యము నొందుచుండుటచే నిది ప్రకృత్యంశద్యోత్యమగు రసధ్వని

విభక్తిప్రత్యయముతో నిమిత్తము లేక ప్రకృత్యంశమే రసవ్యంజకమగుటలో ప్రాధాన్యమునొంది యుండుటచే నిది పదాంశద్యోత్యరసధ్వని యయినది

వాక్యద్యోత్యమగు రసధ్వని -

సీ. నను నిముసంబు గానక యున్న నూరెల్ల
 నరయు మజ్జనకుఁడెంత దడలునొక్కొ!
యెపుడు సంధ్యలయందు నిలు వెళ్ళనీక న
 న్నొమెడు తల్లి యెంతొఱలు నొక్కొ
యనుకూలగతి నాదు మనసులో వర్తించు
 కులకాంత మదినెంత కుందునొక్కొ
గెడఁదోడు నీడలై క్రీడించు సచ్ఛాత్రు
 లింతకునెంత చింతింతు రొక్కొ

తే. యతిథిసంతర్పణంబు లేమయ్యె నొక్కొ
యగ్ను లేమయ్యె నొక్కొ నిత్యంబులైన
కృత్యములఁ బాపి దైవంబు కినుక నిట్లు
పాఱవైచితె మిన్నేఱు వడ్డచోట (2 17)

హిమవత్పర్వతమున చిక్కి ఇలుసేరనుపాయముగానక చింతించు ప్రవరుని పలుకులివి

ఇట పాదలేపనము కరఁగిపోవుట విభావము ఇలుసెరు నుపాయము చెప్పువాఁడెవఁడును కానరాకుండుట ఉద్దీపనవిభావము దైవనింద యను భావము స్మృతిచింతలు వ్యభిచారిభావములు వీనిచే ప్రవరునికిఁగల చిత్తవైక్లవ్యరూపశోకస్థాయికమగు కరుణరసము వ్యక్తమగుచున్నది

ఇట వాక్యార్థమంతయును వ్యంజకమే కావున నిది వాక్యద్యోతమగు రసధ్వని

**వర్ణద్యోత్యమగు రసధ్వని :—**

ఉ. కమ్మనికుందనంబు కనుగందని మే నెలదేఁటిదాఁటులన్
ఒమ్మరవోవఁదోలుఁదెగబారెఁడు వెండ్రుక లిందుబింబమున్
గిమ్మననీదు మోము గిరికేపులు మూఁపులు, కౌను గానరా
దమ్మకచెల్ల! వాని వికచాంబకముల్ శతపత్రజైత్రముల్ (3 6)

ప్రవరుని చక్కఁదనము దలంచుకొని చింతించువరూధిని పలుకు లివి ఇట స్మృతి యను వ్యభిచారిభావము ధ్వనించుచు విప్రలంభశృంగారరసపరి పోషకమగుచున్నది

ఈపద్యమునందలి వర్గప్రథమతృతీయవర్ణములు[61] ఒందుపూర్వక డకారబకారములు మున్నగు వర్ణములన్నియును విప్రలంభశృంగారరసగత మాధుర్యగుణాభివ్యంజకము లగుచున్నవి కావున నిది వర్ణద్యోత్యమగు రసధ్వని

**రచనాద్యోత్యమగు రసధ్వని :—**

స్రగ్ధర గళగర్జక్రోడనిర్యత్కహకహనినదోద్గాఢహాసంబు భూభృ
ద్బిలముల్ మ్రోయింపఁ గాదంబినిగతిని బొగల్ పెంప మిన్నెల్ల మైగాఁ
జలితాస్యక్రూరదంతక్షతరదవసనక్షారకీలాలవేల్ల
జ్జ్వలనజ్వాలాభజిహ్వాంచలుఁడగుచు గదన్ జాళెముల్ ద్రిప్పకొంచున్.
(4 95)

రక్కసిరూపైయున్న ఇందీవరాక్షుడు స్వారోచినెదుర్కొను తీ రిందు వర్ణితము

ఇట స్వారోచి యాలంబనవిభావము. తానుకవళింపఁదలచిన మనోరమను కాపాడుట యుద్దీపనవిభావము ఆక్షిప్తములగు గర్వోగ్రతాదులు వ్యభిచారి

---

61 తత్ర టవర్గవర్జితానాం వర్గాణాం ప్రథమతృతీయైః శర్భిరతస్త్రైశ్చ ఘటితా, నైకట్యేన ప్రయుక్తైరనుస్వారపరసవర్ణైః శుద్ధానునాసికైశ్చ శోభితా, వక్ష్యమాణైః సామాన్యతో విశేషతశ్చ నిషిద్ధైః సంయోగాద్యైః రచుంబితా అవృత్తిర్మృదువృత్తిర్వా రచనాఽఽనుపూర్వ్యాత్మికా మాధుర్యస్య వ్యంజికా॥ (రసగం ప్రథమ. 80 పు.)

భావములు దంతపీడనవధోద్యమాదు లనుభావములు వీనిచే రాక్షసునకు స్వరోచియెడగల క్రోధమభివ్యక్తమగుచు రౌద్రరసధ్వని యగుచున్నది

ఇట సంయోగపరహ్రస్వవర్ణప్రాచుర్యమును దథవర్ణఘటితమును దీర్ఘ సమాసజటిలమును అగు రచన ఓజోగుణదీప్తిని కలుగఁజేయుచు రౌద్రరసము నకు వ్యంజకమగుటచే నిది రచనాద్యోత్యమగు రసధ్వని

ప్రబంధద్యోత్యమగు రసధ్వని –

వరూథిని ప్రవరుని చూచి వలచినతీరిట్లు వర్ణింపఁబడినది–

"ఉ ఆబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁగాంతి పె
ల్లుబ్బి కనీనికల్ వికసితోత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁగా
గుబ్బమెఱుంగుఁజన్గవ గగుర్పొడువన్ మదిలోనఁగోరికల్
గుబ్బతిలంగఁ జూచె నలకూబరసన్నిభు నద్ధరామరున్

ఉ చూచి ఝుణంఝుణత్కటకనూచితవేగపదారవిందయై
లేచి కుచంబులుం దుఱుము లేనడుమల్లలనాడ నయ్యెడం
బూచినయొక్క పోఁకనునుబోదియఁ జేరి విలోకనప్రభా-
వీచికలం దదీయపదవిం గలశాంబుధి వెల్లిగొల్పుచున్

మ మునుమున్ పుట్టెడుకొంకు లౌల్యము నిడన్ మోదంబు విస్తీర్ణతం
జొనుపన్ గోర్కులు గ్రేళ్ళుదాట మదిమెచ్చుల్ రెప్పలల్లార్ప న
త్యనుషంగస్థితి రిచ్చపాటొదవు నొయ్యారంబునన్ జంద్రికల్
దనుకం జూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్లన్నేత్రపద్మంబులన్ "

(మను 2 28-30)

వరూథినికి ప్రవరునియెడఁగల నభిలాషను వ్యక్తముచేయు చక్షుప్ప్రీతి యను మన్మథావస్థ ఈ మూడుపద్యములలో వర్ణితమైనది

తోడనే సాత్వికభావోదయమైనవిధమిట్లు ప్రస్తుతమైనది–

"క పంకజముఖి కప్పడు మై
నంకురితములయ్యెఁ బులక లావిష్కృతమీ-
నాంకానల సూచకధూ
మాంకురములు వోలె మఱియు నతనిం జూడన్.

ఉ తొంగలితెప్పలం దొలఁగఁద్రోయుచుఁ బైపయివిస్తరిల్లి క
న్నుంగవ యాక్రమించుకొనునో ముఖచంద్రు నటించుఁబోవనీ
కంగజు డానవెట్టి కదియం గుటి ప్రాసెననంగ జాతె సా
రంగమదంబు లేఁజెమట గ్రమ్మ లలాటము డిగ్గి చెక్కులన్

మ అనిమేషత్వము మాన్చె చిత్తరపుఁజూ పస్వేదతావృత్తి మా
న్చె నవస్వేదసమృద్ధి బోధకళ మాన్చెన్ మోహవిభ్రాంతి తో
డనె గర్వాణవధూటికిన్ భ్రమరకీటన్యాయ మొప్పన్ మను
ష్యుని భావించుట మానుషత్వమె మెయిం జూపట్టెనా నత్తఱిన్."
(2 31–33)

మొదటిరెండుపద్యములలో 'రోమాంచ స్వేదము" లను సాత్వికభావములు వర్ణితములైనవి ఇఁక మూడవపద్యమున స్వేదము, మోహవిభ్రాంతిరూప ప్రళయము అను సాత్త్వికభావములతోపాటు చిత్తరపుచూపుచే గమ్యమగు 'నౌత్సుక్య'మను వ్యభిచారిభావమును కడుహృద్యముగా నిరూపితములైనవి

రసపరిపోషమునకు వ్యభిచారిభావములదే పైచేయియగును కాన కవి వాని నిట్లు సమావేశపఱచినాడు

"వ ఇట్లతని రూపరేఖావిలాసంబులకుం జొక్కి యక్కమలపత్త్రేక్షణ యాత్మగతంబున—

ఉ ఎక్కడివాఁడొ ! యక్షతనయేందుజయంతవసంతకంతులన్
జక్కఁదనంబునన్ గెలువఁజాలెడువాఁడు, మహీసురాన్వయం
బెక్కడ ! యీతనూవిభవమెక్కడ ! యేలనిబంటుగా మరున్
దక్కఁగొనంగరాదె యకటా ! నను వీఁడు పరిగ్రహించినన్.

సీ వదనప్రభూతలావణ్యాంబుసంభూత
కమలంబులన వీని కన్ను లమరు
నిక్కి వీపులతోడ నెక్కసక్కెములాడు
కరణి నున్నవి వీని ఘనభుజములు
సంకల్పసంభవాస్థానపీఠికవోలె
వెడదయై కనుపట్టు వీనియురము
ప్రతిఘటించుచిగుళ్ళపై నెట్టివాటిన
రీతినున్నవి వీని మృదుపదములు

తే నేరెచేటియసల్ తెచ్చి నీరజాప్తు
సానఁబటినరావొడి చల్లి మెదిపి
పదనుసుధనిడి చేసెనో? పద్మభవుఁడు
పినిఁగాకున్నఁగలదే? యీ మేని కాంతి

క సురగంధర్వోరగ నరఖేచరకిన్నరసిద్ధసాధ్యచారణ విద్యా
ధరగంధర్వకుమారుల నిరతము గనుగొనమె పోల నేర్తురె? వీని౯"
(మను 2 34_37)

ఉద్దీపనవిభావములగు ప్రవరుని రూపరేఖావిలాసములయుత్కర్ష ఈ పద్యములలో ప్రస్తుతమైనది దీనిని మొదటిపద్యమందలి వితర్కచింతలును, రెండవపద్యమందలి వితర్కమును, మూడవపద్యమందలి స్మృతియును చక్కగా వ్యక్తపఱచుచు విప్రలంభశృంగారరసపరిపోషకము లగుచున్నవి

ఈ పద్యసమూహఘటిత వాక్యాత్మక ప్రబంధమున ప్రవరుఁ డాలంబన విభావము తదీయలోకోత్తరలావణ్యాదులు ఏకాంతప్రదేశమును ఉద్దీపనవిభావములు హర్షావేగౌత్సుక్యవితర్కస్మృతిచింతాదులు వ్యభిచారిభావములు స్వేద రోమాంచసాదరదర్శనాదులు అనుభావములు వీనిచే వరూధినికి ప్రవరుని యెడఁగల నభిలాషరూపరతి వ్యక్తమగుచు విప్రలంభశృంగారరసధ్వని యగుచున్నది కావుననిది ప్రబంధద్యోత్యమగురసధ్వని

**అసంలక్ష్యక్రమధ్వని :_**

రసాదులు చప్పునస్ఫురించునవికావు కావున వీనిలో వస్త్వలంకార ధ్వనులయందున్నట్లు ఒక క్రమము లేదు

కావున పూర్వోదాహృత రసాదిధ్వనులన్నియును అసంలక్ష్యక్రమ ధ్వనులే యగును.

**సంలక్ష్యక్రమ ధ్వని :_**

ఇది వస్త్వలంకారాదిరూపము. పూర్వోదాహృతవస్త్వలంకారధ్వనులన్నియును ఈ కోవకే చెందును.

ఇట్లు సంగ్రహముగా మనుచరిత్ర ప్రబంధమునందలి ధ్వనివిశేషములు వివరింపఁబడినవి



# ధ్వని – మనుచరిత్రము

## నవమ ప్రకరణము

### ధ్వనికావ్య వైశిష్ట్యము

శ్లో॥ ముఖ్యా మహాకవిగిరామలంకృతిభృతామపి
ప్రతీయమానచ్ఛాయైవ భూషా లజ్జేవ యోషితామ్॥ (ధ్వన్యా 3 . 37)

**కావ్యప్రవృత్తి-ముఖ్యప్రయోజనము :–**

"రసోవై సః రసగ్గ్ం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి॥" (తైత్తిరీయోపనిషత్ - బ్రహ్మవల్లీ) ఇత్యాదిశ్రుతిప్రతిపాదితమగు బ్రహ్మానందమునకు సహోదరము కావ్యానందము. కావ్యముచదువునప్పుడు పరితయగు సహృదయుఁడు బాహ్యప్రపంచమునే మఱచి భావనాప్రపంచమున విహరించుచు ఏదో యనుభూతిని పొందును ఆయనుభూతిని వివరించుటకు మాటలు లేవు మధురపదార్థము లివి ఇట్లుండునని వివరించి చెప్పఁగలమే కాని వాని మాధుర్య మెట్లుండునో వివరించిచెప్పగలమా? రుచి చూచినగాని దాని యనుభూతి తెలియదు జిహ్వేంద్రియమును తృప్తిపఱచు నొకయనుభూతి యని మాత్రము చెప్పఁగలము ఇట్లీవైషయికసుఖములు ఆయాయింద్రియములను మాత్రము తృప్తిపఱచగలవు బ్రహ్మానందము సర్వేంద్రియసుఖాస్వాదరూపమైనది దాని నెవరు నిర్వచింపఁజాలుదురు? అది అనుభవైకవేద్యము. "రసో వై సః (తై ఉ బ్రహ్మవల్లీ) "ఆనందో బ్రహ్మేతి వ్యజనాత్"(తై ఉ భృగువల్లీ) ఇత్యాదిశ్రుతిప్రామాణ్యమున బ్రహ్మము రసరూపము ఆనందరూపమును కావున బ్రహ్మానందమనినను రసానందమనినను అభిన్నములే యగును కావ్యమున శృంగారాదిరసములవలన ఆనందము కలుగుచున్నది ఇదియును రసానందమే యగునుకదా? ఇట్లు కావ్యరసానందము బ్రహ్మానందసహోదరమైనది ఇట్టియానందానుభూతిని కలుగఁజేయుటయే కావ్యమునకున్న విశేషము సహృదయులు ఆ రసానందము నొందవలయు ననియే కావ్యపరన్ముఖులు

అగుదురు ఒకఁడు ధనమును సంపాదించును ఆధనసంపాదన మెందుకనఁగా తాను తనయాలుబిడ్డలను పోషించుటకనును ఆలుబిడ్డలను పోషించుటకు ప్రయోజనము తానుసాంసారికసుఖముల ననుభవించుటకట మఱి తానట్లు సుఖముననుభవించుటకు ప్రయోజనమేమి? అని ప్రశ్నించినచో, ప్రశ్నయే మిగులును కాని దానికి సమాధానము రాదు ఇట్లు సుఖమనుభవించుటయే ప్రతి వ్యక్తి కోరఁదగిన పరమార్థము. సాంసారికసుఖాదులు దుఃఖబహుళములు అనిత్యములును- బ్రహ్మానందమో? అఖండానందరూపమగుటయే గాక శాశ్వత మైనది "ఆనందో బ్రహ్మ" (తై ఉ భృగువల్లి)అనుశ్రుతిని కవితాపితామహుఁ డిట్లు నిర్వచించెను (మను 2 62)-

శా ఎందే డెందము కందళింప రహిచే నేకాంతతం నిర్వృతిం
జెందుం గుంభగతప్రదీపకళికాశ్రీదోఁప నెందెందు బో
కెందే నింద్రియముల్ సుఖింపఁ గను నాయింపే పరబ్రహ్మమా
నందో బ్రహ్మ"యటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా.

ప్రవరునితో పలకిన ఈ పలుకులలో వరూథిని యభిప్రాయమున ఆనందపదము అంగనాలింగనాదిజన్యసౌఖ్యపరమే యయినను ఆ సందర్భము నటుంచి చూచిన, బ్రహ్మానందమెట్లుండునో కవి నిర్వచించినట్లైనది.

ఇట్టి యనుభూతి కావ్యపఠితలకు కలుగఁజేయుటయే తన కవితా ప్రయత్నపరమార్థమనియు సూచితము పఠితల కట్టియానందము కలుగవలె నన్న కావ్యము రసనిర్భరమై యుండవలెను ఎడనెడ రసముప్పతిలి సహృదయపాఠకులకు విగళితవేద్యాంతరమగునానందానుభూతిని కలుగఁజేయవలెను

**రసమెప్పుడును వాచ్యముకాదు :-**

ఆయా రసములను సనామనిర్దేశముగా చెప్పినమాత్రమున రసముప్పతిల్లదు.

శ్లో॥ శృంగారీ గిరిజాననే సకరణో రత్యాం ప్రవీరః స్మరే
బీభత్సోఽస్థిభి రుత్ఫణీ చ భయకృన్మూర్త్యాఽద్భుతస్తుంగయా ।
రౌద్రో దక్షవిమర్దనే చ హాసకృన్నగ్నః ప్రశాంతశ్చిరా-
దిత్థం సర్వరసాత్మకః పశుపతి ర్భూయాత్ సతాం భూతయే॥

(కావ్యాను. 3 . 1 సూ. ఉదా )

ఇట శివుఁడు నవరసాత్మకుఁడుగా వర్ణింపఁబడియున్నాఁడు కాని ఈ పద్యార్థమును భావించిన సహృదయులమనముల నేరసానుభూతియు కలుగుట లేదు కారణము ? శివుఁడు శృంగారరసము కలవాఁడని చెప్పినమాత్రమున శృంగారరసమనుభవగోచరమగునా ? కాదు ఆ రసము విభావానుభావాది ముఖమున సహృదయహృదయములందు స్ఫురించునట్లు చేయవలెను అట్లు గాక కేవలము రసనామనిర్దేశము చేసిన నేమియు సిద్ధింపదు సరికదా, అట్లు చేయుట దోషమై[1] నిలుచును. కావున రసము విభావాదులచే నిట్లభివ్యక్తము కావలెను—

శ్లో॥ దూరాదుత్సుకమాగతే వివలితం సంభాషిణి స్ఫారితం
సంశ్లిష్యత్యరుణం గృహీతవసనే కించాంచితభ్రూలతమ్ ।
మానిన్యాశ్చరణానతవ్యతికరే బాష్పాంబుపూర్ణేక్షణం
చక్షుర్జాతమహో! ప్రపంచచతురం జాతాగసి ప్రేయసి॥ [2]

(అమరుక శ్లో 49)

ప్రియుని యనునయమును తిరస్కరించి పశ్చాత్తప్తయైనప్రేయసి మరల తన ననునయించుటకై వచ్చు ప్రియుని చూచుచూపుతీరు కడు మనోహరమై శృంగారమునొలికించుచు సహృదయులనానందవార్ధిలో నోలలాడించుచున్న దనుటలో సందియము లేదు. ఆయమచూపు—ప్రియుఁడు దూరముననుండ నుత్సుకతను కనఁబఱచినది దరిఁజేరగా తిర్యగ్భావము నొందినది అనగా తన యౌత్సుక్యము నాతఁడు గమనించెనేమో యని సిగ్గు కనఁబఱచిన దనుట-అతఁడు మాటాడునప్పుడు విప్పారినది అనఁగా సంతోషము కనఁబఱచిన దనుట ఆశ్లేషించఁగా నెఱ్ఱబాఱినది. అనగా తాను ప్రసన్నురాలుకాకమునుపే ప్రియుఁడట్లు చేయుటచే కోపముచూపిన దనుట చీరచెఱఁగు గ్రహించుచుండ బొమముడిపడినది అనగా తానట్లు కోపమున వెళ్ళనుద్యమించగా తనరోషము నుపశమింపఁ జేయకయే చీరచెఱఁగును లాగుటచే అసూయకలిగినదనుట ప్రియుఁడు పాదములపైఁబడ కన్నీరొలికినది అనగా తానింతవఱకు కరఁగకుండ మొండి

---

1 "రసస్థాయివ్యభిచారిణాంస్వశబ్దవాచ్యత్వం దోషః ॥"

(కావ్యాను 3 1 సూ వృ.)

2. ఈ శ్లోకము కావ్యప్రకాశమున (4 29) నుదాహృతము

ధైర్యముతో నుంటినే ? యని ప్రియునిపై సానుభూతితో కూడిన ప్రసాదము కలిగినదనుట ఇట్లు వ్యభిచారిభావములగు ఔత్సుక్యవ్రీడాహర్షకోపాసూయా ప్రసాదములు అమానవతికి ప్రియునియెడఁగలరతి నభివ్యక్తీకరించుచుండుటచే నిది శృంగారరసధ్వనియయినది సహృదయులకీ శ్లోకార్థమును భావించు నపుడు కలిగెడుననుభూతి కేవలము 'శృంగారరసముకలిగెను' అని చెప్పుటచేఁ గలుగునా ? కలుగదు కావున రసము ధ్వననవ్యాపారముచె నభివ్యక్తమగును కాని అది ఎప్పుడును స్వశబ్దవాచ్యము కాదు [3]

కావ్యమున రసమే ప్రధానము -

కావ్యమున రసమే ప్రదానమనియు, కావున రసాభివ్యక్తికనుగుణముగా శబ్దార్థములను సమకూర్చవలసియుండుననియు ధ్వనికారులు నొక్కివక్కాణించిరి. వారి పలుకులివి—

"అయమేవ హి మహాకవేర్ముఖ్యో వ్యాపారో, యద్రసాదీనేవ ముఖ్యతయా కావ్యార్థీకృత్య తద్వ్యక్త్యనుగుణత్వేన శబ్దానామర్థానాం చోపనిబంధనం"

(ధ్వన్యా 3 32 కా వృత్తి)

రసప్రధానమగు కావ్యము ధ్వనికావ్యమగుటయే తటస్థించును కావున లాక్షణికులు ధ్వనికావ్యమే ఉత్తమశ్రేణికిఁ జెందిన కావ్యమని ముక్తకంఠముగా నుద్ఘోషించిరి ధ్వనికావ్యలక్షణమిట్లు నిర్వచింపఁబడినది —

---

3 క) యస్తు స్వప్నేఽపి న స్వశబ్దవాచ్యో న లౌకికవ్యవహారపతితః కింతు శబ్దసమర్ప్యమాణహృదయసంవాదసుందరవిభావానుభావ సముచితప్రాగ్వినివిష్టరత్యాదివాసనానురాగసుకుమార స్వసంవిదానందచర్వణా-వ్యాపారరసనీయరూపో రసః, స కావ్యవ్యాపారైకగోచరో రసధ్వని-రితి, స చ ధ్వనిరేవేతి॥ —లోచన (ధ్వన్యా 1 . 4 కా వృత్తి)

ఖ) రసాదిలక్షణస్త్వర్థః స్వప్నేఽపి న వాచ్యః। స హి రసాదిశబ్దేన శృంగారాదిశబ్దేన వాభిధీయేత ?। న చాభిధీయేత। తత్ప్రయోగేఽపి విభావాద్యప్రయోగే తస్యాప్రతిపత్తేః, తదప్రయోగేఽపి విభావాదిప్రయోగే తస్య ప్రతిపత్తేశ్చేత్యన్వయవ్యతిరేకాభ్యాం విభావాద్యభిధానద్వారేణైవ ప్రతీయతే ఇతి నిశ్చీయతే, తేనాసౌ వ్యంగ్య ఏవ ॥

(కావ్య. 5 . 46 కా వృత్తి)

"యత్రార్థః శబ్దో వా తమర్థముపసర్జనీకృతస్వార్థౌ ।
వ్యంక్తః కావ్యవిశేషః స ధ్వనిరితి సూరిభిః కథితః ॥
—ఆనందవర్ధనాచార్యః (ధ్వన్యా 1 13)

ఈ యర్థమునే రసగంగాధరకారులిట్లు సూత్రీకరించిరి—

"శబ్దార్థౌ యత్ర గుణీభావితాత్మానౌ కమప్యర్థమభివ్యంక్తః తదాద్యమ్ ॥" ఆద్యమనగా నుత్తమోత్తమము - రసగంగాధరకారులు- కావ్యమును చతుర్విధముగా విభజించి ధ్వనికావ్యమును త్తమోత్తమమనిరి కావ్యప్రకాశకారులు- "ఇదముత్తమమతిశయని వ్యంగ్యే వాచ్యాద్ధ్వనిర్బుధైః కథితః ॥" వ్యంగ్యార్థప్రధానమగు కావ్యమే ధ్వనికావ్యమనియు, అదియే ఉత్తమమనియు నిర్వచించిరి

కావ్యమున రసమే ప్రధానమగుటకు కారణము సహృదయులు అలౌకిక రసానుభూతినాశించి కావ్యమును పఠించుటకు కడంగుటయే కావుననే కావ్యమునకు ముఖ్యప్రయోజనము ఆనందమే యగుచున్నది

**కావ్యప్రయోజనములు :—**

మఱికొన్నియు కావ్యప్రయోజనములు గలవు వానిని మమ్మటుఁడిట్లు సంగ్రహించెను. (కావ్య 1 2) —

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే ।
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే ॥"

కీర్తి ధనము వ్యవహారజ్ఞానము అమంగళనివృత్తి ఆనందము కాంతాసమ్మితమగు నుపదేశము అను నీయాఱు కావ్యప్రయోజనములు వీనిలో మొదటిరెండు కవికిని, వ్యవహారజ్ఞానాదులు పఠితయగు సహృదయునకును, అమంగళనివృత్తి యుభయులకును చెకూరును వీనిలో నానందము ప్రధానమైన ప్రయోజనమని ఈ కారికావృత్తిలోనిట్లు వివరింపబడినది—

"సకలప్రయోజనమౌళిభూతం సమనంతరమేవ రసాస్వాదసముద్భూతం విగళితవేద్యాంతరమానంద"మ్మని

ఆనందము తరువాత నెన్నఁదగిన ముఖ్యప్రయోజనము ఉపదేశము

**కావ్యముపదేశించుతీరులోని వైలక్షణ్యము —**

ఉపదేశించుటకు వేదశాస్త్రపురాణాదులున్నను కావ్యముపదేశించుతీరులో విశేషమున్నది. ఎట్లన ? —

ఉపదేశించుటకు మూడు పద్ధతులున్నవి రాజులు శాసింతురు మిత్రులు ఆపనిలోని మంచిచెడ్డలు మాత్ర ముదాహరణముఖమున వివరించి తాటస్థ్యమును వహింతురు కాంతలు తమసౌశీల్యాదులచే పురుషులహృదయ ములనావర్జించి కర్తవ్యాకర్తవ్యములను వ్యంజనాముఖమున సూచింతురు రాజ శాసనమువలన ప్రవృత్తినివృత్తులుకలగినను అవి బలాత్కారకృతములేకాని స్వచ్ఛందకృతములు కావు రాజశాసనమును ప్రశ్నింపవీలులేదు కదా! మిత్రుల యుపదేశమొకప్పుడు అతఁడు పెడచెవిని కూడ పెట్టవచ్చును కావున దీనిలో ప్రవృత్తికి నియతత్వము లేదు ఇఁక కాంతలు హృదయమునావర్జించి చేసిన సూచనచే పురుషుఁడు తనకుతానై నియతముగా నాకార్యమున ప్రవర్తించును. అకార్యమయిన నివర్తించును కావున ఈమూడింటిలో చివరిదే శ్రేష్ఠము

ప్రకృతమున మొదటిపద్ధతికిఁజెందినవి వేదములు అవి పురుషని రాజుల వలె శాసించును అట్లు ప్రవర్తించకున్నచో రాజులు శిక్షింతురు వేదములు ప్రత్యవాయమును కలుగఁజేయును రాజశాసనములవలె వేదమంత్రములును యథాతథముగా గ్రహింపవలెను అన్యథాపార—అపపారములవలన ప్రత్యవాయము కలుగును. కావున వేదములు ప్రభుసమ్మితములై శబ్దప్రధానము లగుచున్నవి.

రెండవపద్ధతికిఁజెందినవి పురాణాదులు అవి మిత్రులవలె అర్థవాద ప్రధానములై పరితలను తత్కార్యములందు ప్రవర్తింపఁజేయును. కావున నవి మిత్రసమ్మితములై అర్థప్రధానములగుచున్నవి.

ఇఁక కావ్యము మూడవపద్ధతికిఁజెందినది కాంత రసప్రవణమగు తన ప్రవృత్తిచే సౌశీల్యాదిగుణములచేతను పురుషని హృదయమును రంజింపఁ జేసినట్లె కావ్యకాంతయు రసానందమును కలుగఁజేయుచు నాతనియాభిముఖ్య మును సంపాదించి కర్తవ్యాకర్తవ్యములను వ్యంజనాముఖమున వ్యక్తీకరిం చును. కావుననే భామహుఁడు (కావ్యా 5 3) —

"స్వాదు కావ్యరసోన్మిశ్రం వాక్యార్థముపభుంజతే ।
ప్రథమాలీఢమధవః పిబంతి కటు భేషజమ్ ॥"

"చేదుమందు త్రాగించవలయుననిన తీయనితేనె మొదట నాకించవలసి యుండును అట్లు సహృదయులగు పరితలును మొదట శృంగారాదిరసాస్వాద

లోలువులైయే ప్రవర్తింతురు పిమ్మట చేదు ఉపదేశమునైనను గ్రహింతురు" అని వివరించెను

ఇట్లు శబ్దప్రధానములగు వేదములకంటెను అర్థప్రధానములగు పురాణాదులకంటెను, శబ్దార్థము లప్రధానములై వ్యంగ్యార్థమే ప్రధానమైయుండు కావ్యమే ఉపదేశవిధానమున సర్వశ్రేష్ఠమై వెలయుచున్నది

విద్యాధరుఁడీ విషయమునిట్లు సంగ్రహించెను –

"పాణినిప్రముఖైస్తైస్తైః సర్వశాస్త్రవిశారదైః ।
ఇహ తావత్ త్రిధా శాస్త్రమభ్యధీయత తత్ర చ ॥
శబ్దప్రధానం వేదాఖ్యం ప్రభుసమ్మితముచ్యతే ।
ఈషత్ప్రారాన్యథాపారే ప్రత్యవాయస్య దర్శనాత్ ॥
ఇతిహాసాదికం శాస్త్రం మిత్రసమ్మితముచ్యతే ॥
అస్యార్థవాదరూపత్వాదుచ్యతేఽర్థప్రధానతా ॥
ధ్వనిప్రధానం కావ్యం తు కాంతాసమ్మితమీరితమ్ ।
శబ్దార్థౌ గుణతాం నీత్వా వ్యంజనప్రవణం యతః ॥

(ఏకావళి ప్రారంభమున)

ఆనందము, ఉపదేశము అనునీరెండు ప్రయోజనములను చేకూర్చునదియే ఉత్తమకావ్యము కావుననే రసనిర్భరమగు కథావస్తువును గ్రహించి ఉత్తమ నాయకాశ్రయముగా కావ్యము నిబంధించవలెను, లేదేని ఆ కావ్యము పరిత్యాజ్యమే యగునను ప్రాచీనలాక్షణికుల యభిప్రాయమును విద్యానాథుఁడిట్లు సంగ్రహించెను "యథా రామగుణవర్ణనం రామాయణవల్మీకజన్మనోః మహాప్రతిష్ఠాకారణం తథా మహాపురుషగుణవర్ణనేన హి శ్రేయస్కరీ ప్రబంధస్థితిః ।...... యత్రపునరుత్తమపురుషచరితం న నిబద్ధ్యతే తత్కావ్యం పరిత్యాజ్యమేవ । తన్మూలా చేయం స్మృతిః - "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" ఇతి ॥

(ప్రరు ఉపోద్ఘాత)

రసమెప్పుడును వాచ్యము కాకుండుటచే దానివలన కలిగిన యానందమను మొదటి ప్రయోజనము వ్యంగ్యమర్యాదచే నేర్పడినదే యగును. ఇఁక రెండవప్రయోజనమగునుపదేశమును వ్యంజనాసాపేక్షమే యగుచున్నది

కాంతాసమ్మితముగా నుపదేశించుటయనఁగా నాయుపదేశము రసోన్మిశ్రితమై వ్యంగ్యమర్యాదచే సూచింపఁబడుటయే ఉదా –

సీ ఉర్వీధరము లెక్కి యుఱుకనే కుచకుంభ
యుగమొల్లఁగాక తానుఱుకుమనిన
వాఁడికైదువులపై వ్రాలనే నిడుఁజూపు
డాలొల్లఁగాక తా వ్రాలుమనిన
మున్నీటసుడివడిమునుఁగనే నతనాభిఁ
గననొల్లఁగాక తా మునుఁగుమనినఁ
బెడఁగారు కాలాహిఁదొడుకనె నూఁగారు
తొడుసొల్లఁగాక తాఁ దొడుకుమనినఁ

తే జెప్పి గురుఁడేమి పనిచినఁజేయలేనె ?
కావె తనసొమ్ము మామకకాయకర్మ
గతులు "మొఱ్ఱో యనంగ లింగంబు గట్టు
జంగ"మన నంగనలఁగూర్పఁ జనదుగాక (పాండు. 5 . 184)

పాండురంగమహాత్మ్యమున అయుతుఁడు తాను వివాహమాడ నిరాకరించుట ఈపద్యమునందలి విషయము. ఇట సాంసారికసుఖము 'క్లేశబహుళము'అను విషయము వ్యంగ్యమర్యాదచే స్ఫురించుచు విరక్తికై ప్రేరేపించుచున్నది సంసారరథమును లాగుట పర్వతములెక్కి యుఱుకుటకంటెను కష్టతరమనియు, అప్పుడప్పుడు వచ్చిపడునాపదలవలన కలిగెడు దుఃఖము వాడికైదువులుగ్రుచ్చుకొనునప్పటి బాధకంటెను మిక్కుటమనియు, మున్నీటిసుడిలోఁబడి తేరుకొనవచ్చునే కాని భార్యాపుత్రాదిమమకారములోఁబడి తేరుకొనుట అసాధ్యమనియు, కాలాహిని బట్టినపుడు దానివాతఁబడిన నొకపరి మరణము సంభవించును కాని సంసారమున దినదినము మృత్యువే యనియు, కావున తుచ్ఛమగుసాంసారికసుఖముపై భ్రాంతివీడి వైరాగ్యము నాశ్రయించుట మేలనియు ధ్వనించుచున్నది.

ఇట శాంతమునకు విరుద్ధములైయుండు శృంగారవిభావాదులగు కుచకుంభాదుల పరిగ్రహణము పరితలను స్వోన్ముఖులఁజేసి బోధించుటకొఱకే కాని వేఱొండు కాదు కావుననే ధ్వనికారులు ఇట్టి సందర్భములలో విరుద్ధరసస్పర్శ దోషముకాదని నుడివిరి వారిపలుకులివి—

వినేయానున్ముఖీకర్తుం కావ్యశోభార్థమేవ వా ।
తద్విరుద్ధరసస్పర్శః తదంగానాం న దుష్యతి ॥ —ధ్వన్యా. 3 . 30.

మఱియొక యుదాహరణము–

మ తలఁబక్షచ్చటఁ గ్రుచ్చి బాతువులు కేదారంపుఁగుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁజూచి యారెకు లుషస్స్నాతప్రయాతద్విజా
వలి పిండీకృతశాటికల్పవి దదావాసంబుఁజేర్పంగ రే
వుల డిగ్గన్వెసఁ బాఱు వానిఁగని నవ్వున్ శాలిగోప్యోఘముల్
(అముక్త 1 65)

కృష్ణరాయనియుదాత్తభావనావైభవమును వ్యక్తముచేయు నీపద్యములో సున్నితమగు హాస్యము చర్వణాగోచరమగుచున్నది ఎవరేదైన మఱచిన వారి సొత్తును వారికందఁజేయుటయే మానవసామాన్యధర్మమనునీతి ఇందుపదేశింపఁ బడినది

సుకవులవర్ణన యేదియైనను వానిలోనేదో నీతి ఇమిడియేయుండును ఆముక్తమాల్యదలో గోదాదేవియౌవనావిర్భావమిట్లు వర్ణింపఁబడినది–

సీ వాతెఱ తొంటికైవడి మాటలాడదు,
కుటిలవృత్తి వహించె కుంతలములు
అక్షులు సిరులురా నఱగంటఁ గనుఁగొనె,
నాడించె బొమగొని యాననంబు
ననుగొమల్నొగయ వక్షముపేక్షఁగడకొత్తె,
బాణిపాదము లెఱ్ఱవాఱఁ దొడగె
సారెకు మధ్యంబు దారిద్ర్యముల చెప్పె
యౌచ్చోర్చ్వకిటు లోఁగఁజొచ్చె మేను.

తే వట్టిగాంభీర్యమొక్కఁడు వెట్టుకొనియె
నాభి నానాటికీగతి నాఁటిప్రియము
చవుకయైనట్టి యిచ్చటఁజనదు నిలువ
ననుచు జాఱినకరణి బాల్యంబు జాఱె (అముక్త 5 . 7)

వాతెఱమున్నగు గోదాదేవియవయములతో బాల్యమునకు తొంటియట్లు పొందు లేదట అందుకే అది యాయమ శరీరమును వీడిపోయెనట ఇది హేతూత్ప్రేక్షాలంకారము మిత్రవ్యవహారసమారోపమున సమాసోక్తియును. వీనికంగాంగిభావసంకరము దీనిచే నిట్లు వ్యక్తమగుచున్నది–

"ఎంతమందిమిత్రులున్నను నేమిప్రయోజనము. ఒకఁడు తనతో మాటాడడు ఒకఁడు కటిలముగా ప్రవర్తించును. ఒకనికి క్రొత్తగాసిరివచ్చుటచె తన్నుపేక్షచెయును ఒకఁడెప్పుడును ఎందుకనియో కనుబొమముడిపెట్టు చుండును ఒకఁడు క్రొత్తగావచ్చినవానితోనే ప్రొద్దుపుచ్చునుకాని తన్నాదరించడు ఒకఁడు తనను చూచినంతనే మండిపడును ఒకఁడు తనకు లేదని చెప్పునేకాని ఆర్థికసాహాయ్యమెన్నడును చేయఁడు ఒకఁడెప్పుడును తానుపలుకరించినపలుకక బింకముతో నుండును ఇట్టివారొకప్పుడు మిత్రులైనను ప్రస్తుతము వీరిలో మిత్రలక్షణము మృగ్యము మిత్రుఁడన నిట్లుండును—

"దదాతి ప్రతిగృహ్ణాతి గుహ్యమాఖ్యాతి పృచ్ఛతి ।
భుంక్తే భోజయతే చైవ షడ్విధం ప్రీతిలక్షణమ్ ॥"

అనగా ఇచ్చును పుచ్చుకొనును తనరహస్యమును దాచక చెప్పును తానడిగి తెలిసికొనును తా నతనింట తినును అతనికి తనయింట తినిపించును— ఈయాఱును ప్రీతిలక్షణములు అట్టి లక్షణములు లేనివారితో కలిసి యుండుట శ్రెయస్కరము కాదనువిషయము వ్యంగ్యమర్యాదచె సుబోధితమైనది

వర్ణనలలోనే కాదు తిట్టులలోను నీతి నుద్బోధించుట సుకవులరచనలలో కాననగును

వసుచరిత్రమున గిరిక విరహతాపముచే చంద్రుని దూషించిన తీరిట్లున్నది

శా. రాజీవాక్షులనేచుపాతకివి చంద్రా! రాజవా? నీవు నీ
రాజత్వంబున చక్రముల్ మనియెనో రంజిల్లె సత్సంతతుల్
తెజంబందెనొ డిందెనో యహిభయోద్రేకంబు తాఁజెల్లరే
రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే రాజౌట దోషార్థమే? (వసు. 4 27)

ఈ పద్యమున రాజధర్మము హృదయాహ్లాదకరముగా వ్యక్తీకరింపఁబడినది రాజీవాక్షులమానసంరక్షణము, స్వరాష్ట్రప్రజలు సుఖశాంతులతో తులతూగునట్లు పరిపాలనము, శిష్టరక్షణము దేశోపద్రవదూరీకరణము కరరూపమున ప్రజలనుండి గైకొనినధనమును ప్రజాక్షేమమునకై వినియోగించుట అనునవి రాజునకు ఆవశ్యకవిధులు కావున రా జిట్లుండవలెనను నర్థము వ్యతిరేకాలంకారధ్వనిముఖమున సూచింపఁబడినది విశేష్యమగు రాజుపదము శ్లిష్టమగుటచే నిది శబ్దశక్తిమూలవ్యతిరేకాలంకారధ్వనియే కాని శ్లేష కాదు.

ఇంతేగాక ఈ పద్యమందు విప్రలంభశృంగారపరిపోషకమగుచు "చప లత' యను సంచారిభావమును ధ్వనించుచున్నది ఈ రససంస్పర్శనమున నీ యర్థమెంతోహృద్యమై సహృదయుల నాకట్టుకొనుచున్నది

మనుచరిత్రమునను రాజధర్మ మిట్లు వ్యక్తికరింపఁబడినది—

మ వికసిల్లం బ్రజ చక్రపాలనము గావించెం గరవ్యాపృతిం
గకుభంతంబుల నాక్రమించెఁబొనఁగంగా నేర్చె వర్ణాళి గాం
తికిఁ బాపెం బెఱరాజకోటిఁ దుది శాంతింబొందె దైవంబు చేఁ
తకుఁ దాపంబిఁక నేలనంగ నినుఁడ స్తప్రాప్తిఁ డయ్యెం గడున్ ॥
(మను 5 32)

ఇది సూర్యాస్తమయవర్ణనము ఇందు రాజధర్మ మిట్లు వ్యక్తమగు చున్నది రాజు ప్రజలు తృప్తిఁజెందునట్లు రాష్ట్రమును పరిపాలించవలెననియు ఎల్లవర్ణములవారు తమతమ విధులు సక్రమముగా నిర్వర్తించునట్లు చేయవలయు ననియు, పెఱరాజుల జయించి వారి పౌరుషము నడంచవలెనే కాని వారిని పదభ్రష్టులఁజేయఁదగదనియు, విజితులై స్వస్వపదారోపితులై యున్న రాజులవలన కరమును గైకొనునంతవఱకే రాజ్యవిస్తరణాకాంక్ష తగుననియు ధ్వనించుచున్నది

విశేష్యవాచకమగు 'ఇన'పదమును శ్లిష్టమగుటచే నిది శబ్దశక్తిమూల ధ్వని కాని శ్లేషకాదు

ఒకప్పుడుపదేశము గుణీభూతవ్యంగ్యమై కానవచ్చును

సీ ఉష్ణాని హోమాగ్ని యూఁదనొల్లఁడు గాని
 విరహజ్వరార్తితో వెచ్చనూర్చు
సంధ్యకు ప్రార్థనాంజలిఘటింపఁడు గాని
 యెరఁగు నీర్వ్యాకషాయితల కర్థి
నాగమవాదంబు లౌ గా దనఁడు గాని
 విటవాదములు తీర్చు వేగి లేచి
కంబుభృత్పాదోదకంబు గ్రోలఁడు గాని
 యౌవతాధరశీధు వాని చొక్కుఁ

తే బుణ్యచిహ్నంబు లపఘనంబున ఘటింప
సిగ్గు పడుగాని కరనఖశిఖరలసిత
జాతనూత్నక్షతాంకముల్ సమ్మతించు
నారజము మీరి యాదుర్విహారహారి (పాండు 3.12)

పాండురంగమాహాత్మ్యమునందలి దీ పద్యము నిగమశర్మ బ్రాహ్మణ విధులయం దనాదరము చూపుటయు యౌవతోపచారములం దాదరము వహించుటయు ఈ పద్యమున వర్ణితములు బ్రాహ్మణునకు నిత్యాగ్నిహోత్రము సంధ్యావందనము వేదాధ్యయనము భగవత్పాదతీర్థసేవనము, భస్మాదిధారణము అనునవి నిత్యవిధులు, ఈ విషయము శృంగారరసోన్మిశ్రితముగా వ్యక్తీకరింపబడి సహృదయుల హృదయముల నావర్జించుచున్నది

ఈ వ్యంగ్యము గూఢత లేక స్పష్టముగా భాసించుటచే నిది అగూఢమగు గుణీభూతవ్యంగ్యము

కావ్యరసానందమువలె నుపదేశమును వ్యంజనాయత్తమై యుండుటయే యభ్యర్హితము అయినను మహాకవు లాయాసందర్భములలో రసవత్కథాంశములలో నిమిడియుండునట్లు సూక్తిరత్నముల వెలయించినారు

మనుచరిత్రమున గర్భభరాలసయగు వరూథినిని వీడి చన నుద్యమించి యామెతో గంధర్వుఁడు పలికిన పలుకులివి—

ఉ ఎవ్వఁడు మీఁదెఱుంగక యథేచ్ఛ సుఖైకరతిం జరింపఁగా
నవ్వల వంశహాని వ్రతహాని యశోధనహాని పుట్టుఁ దా
నవ్వెడఁగమ్మనుష్యపశువయ్యవివేకి చెడుఁ జగంబునఁ
నవ్వఁగఁబాలు రౌరవమునం బడఁబాలును నిందపాలునై (3.135)

సందర్భమునటుంచి చూచిన ఈ పద్యము తనకుతానే ఒక స్వతంత్ర సూక్తిరత్నమై నిలిచినది కావ్యరసోన్మిశ్రితమగుటచే సహృదయుల యాభిముఖ్యము చూరగొనినది ఇది సాధారణోపదేశమై యుండుటయే గాక గంధర్వుని పశ్చాత్తాపమును కూడ వ్యక్తము చెయుచున్నది.

ఆదికవియగు నన్నయ మహాభారతమున నెన్నియోసూక్తిరత్నములు గలవు మచ్చునకొకటి —

క. సతియును గుణవతియుఁ బ్రజా
వతియు ననువ్రతయునైన వనిత నవజ్ఞా
న్వితదృష్టిఁ జూచు నతిదు
ర్మతి కిహముం బరము గలదె మతిఁబరికింపన్॥ (ఆది 4 82)

తన్ను గాంధర్వవిధిచే పెండ్లియాడియు తెలియనివానివలె పరిగ్రహించుటకు నిరాకరించుచున్న దుష్యంతునితో శకుంతల పల్కినపలుకులివి సందర్భముతో నిమిత్తము లేక తనకుతానై నిలిచిన ఈ సూక్తిరత్నము –

"వృద్ధౌ చ మాతాపితరౌ పత్నీ సాధ్వీ సుతః శిశుః ।
అప్యకార్యశతం కృత్వా భర్తవ్యా మను రబ్రవీత్ ॥"

అను మానవధర్మశాస్త్రమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది

ఆదికవి మార్గానుసారులై తరువాతికవులందఱును సూక్తిరత్నములను కథలో గ్రుచ్చి వెలువరించుట జరిగినది

కావ్యోపదేశము సరసమై యుండవలెనే కాని నీరసమై యుండరాదు నీరసములగు కావ్యములో నుపదేశమున్నను ప్రధానమగునానందాంశము[4] లేకుండుటచే నది కాంతాసమ్మితమెట్లగును ?

కావున రసనిర్భరమైయున్న కావ్యమున నుపదేశము వాచ్యమైయున్నను ఆరసానందముచే నున్ముఖులగు సహృదయు లుపదేశమునందును స్వారసిక ప్రవృత్తిగలిగియుందురు

ఇట్లు కావ్యమున రసనిర్వహణము ముఖ్యమగుచున్నది.

రసములలో శృంగారమును నిర్వహించుట చాలకష్టము. శృంగారమెల్లరకును అనుభవగోచరమయినరసము కవి యారసనిర్వహణమున చిన్న పొరపాటు చేసినను అది సహృదయులకు వైరస్యమును కలిగించుచుండును. కావుననే ధ్వనికారులు–

---

4 తథాపి తత్ర ప్రీతిరేవ ప్రధానమ్। అన్యథా ప్రభుసమ్మితేభ్యో వేదాదిభ్యో మిత్రసమ్మితేభ్యశ్చేతిహాసాదిభ్యో వ్యుత్పత్తిహేతుభ్యః కోఽస్య కావ్యరూపస్య వ్యుత్పత్తిహేతోః జాయాసమ్మితత్వలక్షణో విశేష ఇతి ప్రాధాన్యేనానంద ఏవోక్తః ॥ –లోచన (ధ్వన్యా ప్రథమ పుట 40)

"అవధానాతిశయవాౝ రసే తత్రైవ సత్కవిః ।
భవేత్తస్మిౝ ప్రమాదో హి ఝటిత్యేవావభాసతే ॥" (ధ్వన్యా. 3 29)
అనినుడివి యున్నారు

**మనుచరిత్రమున రసనిర్వహణము -**

మనుచరిత్రమున ప్రధానరసమగు శృంగారమును నిర్వహించినతీ రద్భుతముగానున్నది కావుననే దాని కెనలెనిఖ్యాతికలిగినది సహృదయులు దానిని పఠించుటకువిశ్వారుచుందురు రసానందమే కదా పఠితలను ప్రవృత్త్యున్ముఖులను గాఁజేయునది

**రసనిర్వహణమున అనౌచిత్యపరిహారము –**

రసనిర్వహణమున ప్రధానమైనది అనౌచిత్యపరిహారము అనౌచిత్యము రసభంగమునకు కారణము కావున దానిని పరిహరించి ఔచిత్యపోషణము చేసిన రసమును తీర్చిదిద్దినట్లగును ఈవిషయమును ధ్వనికారులిట్లు వక్కాణించిరి—

"అనౌచిత్యాదృతే నాన్యద్ రసభంగస్య కారణమ్ ।
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్ పరా॥" (ధ్వన్యా 3 14కా వృత్తి)

దేశకాలవయోఽవస్థాప్రకృత్యాదివిరుద్ధమంతయు అనౌచిత్యమే యగును కావున దివ్యప్రకృతియగు వరూధినియందు స్వేదాదిసాత్త్వికభావోదయము ప్రకృతివిరుద్ధమగుటచె తద్వర్ణన మనౌచిత్యదోషావహమే యగును కవి దానినిట్లు పరిహరించెను—

మ అనిమేషత్వము మాన్చె బిత్తరపుఁజూ పస్వేదతావృతి మా
న్చె నవస్వేదసమృద్ధి బోధకళ మాన్చెౝ మోహవిభ్రాంతి తో
డనె గీర్వాణవధూటికిౝ భ్రమరకీటన్యాయ మొప్పౝ మను
ష్యుని భావించుట మానుషత్వమె మెయిం జూపట్టెనా నత్తఱిౝ
(మను 2 33)

అనిమేషత్వము అస్వేదతావృత్తి బోధకళ అను నీమూడును దేవతలకుండులక్షణములు కావున తద్విరుద్ధములగు బిత్తరపుఁజూపు నవస్వేదసమృద్ధి మోహవిభ్రాంతి యను నీ మూడును దేవతలకుండవలసిన లక్షణములు కావు అయినను ప్రవరుని లోకోత్తరసౌందర్యమునకు ముగ్ధయైన వరూధిని యతనిని చూచిన చూపులోని సోయగమిట్లు వర్ణింపఁబడినది –

మ మునుముఁ బుట్టెడుకొంకు లౌల్యము నిడఁ మోహంబు విస్తీర్ణతం
జొనుపఁ గోర్కులు గ్రేళ్ళుదాట మది మెచ్చుల్ రెప్పలల్లార్ప, న
తనుషంగస్థితి ఱెప్పపాటొసఁగ నొయ్యారంబునం జంద్రికల్
దనుకం జూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్లన్నేత్రపద్మంబులన్॥

(మను 2 30)

వరూధిని తనచూపులతో వెన్నెలలు కురియించుచు ఒయ్యారమున ప్రవరునిఁ జూచెను సహజముగా అనిమేషలగు దేవతాస్త్రీలకు రెప్పపాటుండదు ఇక భ్రూవిలాసములెట్లుండును. అయినను కవి వరూధినిచూపులలో నొయ్యారము నొలకించి శృంగారమునకు వన్నెతెచ్చెను. ప్రవరుఁడు సమీపించిన కొలది వరూధినిచూపులొ నేయే మార్పులు కలిగి ఒయ్యారపువదులు దాటెనో కవి ఇట్లు వర్ణించెను "మనుష్యునకు చొరరాని ఈ ప్రదేశమున మనుష్యుఁడా? ఇదెట్లు' అను సంకోచము, నిశ్చలమైయుండువరూధినికన్నులలో కనుబొమల నెగురవేయునట్లుచెసి చాంచల్యమును మొదట రేకెత్తించినదనియు, అతనియతిలోకసౌందర్యమును గాంచుటచేఁగలిగినసంతోషాతిశయము కన్నుల విప్పారఁ జేసినదనియు, తనలోనికోరికలు పెల్లుబుకఁగా నతనియలోక సామాన్యలావణ్యమును మదిమెచ్చుకొనుటలు కన్నులరెప్పలల్లార్పఁ జేసిన వనియు, అతఁడు సమీపించఁగా నతనిసౌందర్యమును త్రాగుచున్నదా యను నట్లు కన్నులునిశ్చలములై యుండెననియు–ఇట్లు వరూధిని చూపులలోని యొయ్యారమును కవి వర్ణించెను

ఇట చక్షుఃప్రీతి యను మన్మథావస్థ చెప్పఁబడినది అట్లే వరూధినికి కలిగిన "స్వేద"మనుసాత్త్వికభావము కడుహృద్యముగా వర్ణింపఁబడినది–

ఉ తొంగలిరెప్పలం దొలఁగఁ ద్రోయుచుఁ బైపయివిస్తరిల్లి, క
న్నుంగవ యాక్రమించుకొనునో ముఖచంద్రు నటంచుఁబోవకే
కంగజుఁ డానవెట్టి కదియన్ గుఱిత్రావెనెననంగ జాఱె సా
రంగమదంబు లేఁజెమట గ్రమ్మ లలాటము డిగ్గి చెక్కులన్

(మను. 2 32)

లలాటమున లేఁజెమట గ్రమ్మి కస్తూరిబొట్టు చెక్కిళ్ళపై జాఱినది. దానిని కవి భావించినతీరు అద్భుతమనోజ్ఞమై యున్నది ప్రవరునియందము నెంతచూచినను తనివితీరక వరూధినికన్నులు విప్పారుచునే యుండెనట మన్మథుఁడది చూచి ఈకన్నులు ముఖచంద్రునే యాక్రమించుకొనునేమో?యని

శంకించినాఁడట అట్లు జరుగకుండ కన్నులవిస్తారమునరికట్టుటకై ఈగుర్తు దాటకూడదని యాజ్ఞాపించి కస్తూరిరేఖ గీచినాఁడట అదియే ఈజాతిన కస్తూరి బొట్టు

సాత్త్వికభావోదయ మనురాగమునకు చిహ్నము కదా ! కావున రసో-చితముగా నాయనుభావాదులు వర్ణింపవలసినవే కాని వరూథినికట్లు వర్ణించుట (దివ్య)ప్రకృతివిరుద్ధమై అనౌచిత్యము నావహించుచున్నది.

ఇట్లే మఱియొకయనౌచిత్యమును కానవచ్చుచున్నది దేవజాతిత్వజనిత విమలజ్ఞానముగల వరూథిని గంధర్వవంచితయైనట్లు వర్ణించుటయు అనౌచిత్యా వహమే

ఇట్టి మూడును రసభంగహేతువులు వీనిని పరిహరించినకాని రసాస్వా-దము సుగమమైయుండదు కావున కవి వానిని 'అనిమేషత్వము'అనుపూర్వపద్య మున నిట్లు పరిహరించెను బిత్తరపుచూపు, నవస్వేదసమృద్ధి, మోహవిభ్రాంతి, యను మానవధర్మములు మనుష్యుని(ప్రవరుని)భావించుటచే వరూథినికబ్బిన వనియు, దానిచే అనిమేషత్వము, అస్వేదతావృత్తి, బోధకళ, అనుదివ్యలక్షణ ములు అంతరించినవనియు, అట్లు మానవధర్మములబ్బుటకు ఆయమభావనా బలమే కారణమునియు, దీనికి నిదర్శనము భ్రమరకీటన్యాయమనియు, సోపపత్తి కముగా నిరూపించి ఈమూడనౌచిత్యములను పరిహరించెను

ఔచిత్యపోషణమున స్వభావోక్త్యలంకారము అగ్రస్థానమునొందుచున్నది —

చ ముడివడుకంకణప్రభల ముత్తెపుసేసలు దోయిలించి యె
త్తెడుతఱి బాహుమూలకుచదీప్తులపైఁ బతిదృష్టి పర్వినం
బొడమినలజ్జ బాణియుగముజ్ఞ వెస వంచియ మౌళిమీఁదికై
పొడవునఁ జల్లె లెనగవు పొల్తుకఱెప్పల నప్పళించుచుఁ (5 85)

మనోరమ సర్వోచిపై తలంబ్రాలుపోయు మనోహరదృశ్యమిది. తాను ముత్తెపుసేసలు దోయిలించి పతిపై పోయుటకుపైకెత్తగా పతి తననట్లుచూచుట మనోరమసిగ్గుపడుటకు కారణము సిగ్గువడుటయు సేసలుపైకెగఁజల్లుటయు సంతసమును కప్పిపుచ్చుటయు ముగ్ధయగునవవధువుస్వభావము. అది సహజ సుందరముగా నీపద్యమున తీర్చిదిద్దఁబడినది

ఈసహజసుందరమగు దృశ్యము కృష్ణరాయలహృదయమున హత్తు కొనిపోయి యతనిఆముక్తమాల్యదలో చోటుచేసికొనినది చూడుఁడు —

తే ఇంతి దోయిట సేసఁబ్రాలెత్తుచోట
గుబ్బపాలిండ్లఁ కేవ గ్రక్కున మురారి
గన్నువేయుటఁ గని లజ్జ గదుర బాహు
లెత్తక కరాగ్రములన పైకెగురఁ జల్లె. (ఆముక్త 7. 69)

ఇట గోదాదేవి రంగనాథునిపై తలంబ్రాలుపోయుట మనోహరముగా చిత్రించఁబడినది

సాహిత్యదర్పణమున ముగ్ధాస్వభావ మిట్లు వివరింపఁబడినది

దృష్ట్వా దర్శయతి వ్రీడాం సమ్ముఖం నైవ పశ్యతి।
ప్రచ్ఛన్నం వా భ్రమంతం వాతిక్రాంతం పశ్యతి ప్రియమ్॥
(సా ద తృతీ కా. 111)

ఒక స్వభావోక్తియే కాదు ఏయలంకారమైనను రసానుగుణమై అమరియున్న ఔచిత్యమును పోషించుచు రసోపస్కారక మగును

ధ్వనికారులు రసనిర్వహణమున నలంకారవిషయవ్యవస్థ నిట్లేర్పఱిచిరి—

రసాక్షిప్తతయా యస్య బంధః శక్యక్రియో భవేత్।
అపృథగ్యత్ననిర్వర్త్యః సోఽలంకారో ధ్వనౌ మతః॥
ధ్వన్యాత్మభూతే శృంగారే సమీక్ష్య వినివేశితః।
రూపకాదిరలంకారవర్గ ఏతి యథార్థతామ్॥ (ధ్వన్యా 2 16, 17)

అలంకారములకూర్పు రసాక్షిప్తమై యుండవలెను దానికై కవి విశేష యత్నము చేయరాదు కావ్యమున ప్రధానరసమై యుండు శృంగారమున రూపకాద్యలంకారవర్గమును యథాయోగ్యముగా విచారించి కూర్చవలసి యుండును ధ్వని నలంకరించునవికావుననే కదా రూపకాదులలంకారములైనవి

కవిపితామహుఁ డాయాయలంకారములను సమకూర్చి శృంగారము నలరింపఁజేసినతీరు కడుహృద్యముగా నుండును ఎట్లన?—

ఉ ఆకమలాక్షియింపున దృగంచల మించుకమూసి హర్షబా
ష్పాకులకోణశోణరుచు లగ్రమునం జనఁజూచుచూపు తీ
రై కనుపట్టెఁ దమ్మరస మంటుకొనన్ వెదవింటివాఁడు క్రో
ధైకధురీణతం గఱచి యేసిన సింగిణికోలయో? యనన్. (3. 90)

ప్రవరతిరస్కృతయైన వరూథిని యతనిని వెదకివెదకి వేసారి మాయా ప్రవరుని జూచినంతనే కలలోనివస్తువును తెలివొంది కాంచినయట్లు హర్షాతిరేకము నొందెను ఆ హర్షాతిరేకము అరమోడ్పుకనులలో కానవచ్చినది కన్నుల నీరొలికినది తదేకముగా నతనినే చూచినది. కనుకొలకులలోని ఎఱ్ఱదనము ఆ చూపులలో మిళితమై యున్నది ఆ ఎఱ్ఱదనము జాగరమను మన్మథావస్థను సూచించుచున్నది వరూధిని యప్పటిస్థితి సహృదయుల యంతరంగమున సజీవమై వెలసినది వరూధిని యీచూపెంతమదనోద్దీపక మాయెనో కవిచేసినయుత్ప్రేక్ష వ్యక్తము చేయుచున్నది మన్మథునకు ప్రవరునిపై కోపమఁట తానిదివఱకతనిపై విక్రమించి విఫలుఁడాయెను అందుకే ఆ కోపము, ఆపట్టుదల - బాణము నొడుగఱచుటయే ఆపట్టుదలను సూచించును ఆబాణమే వరూథిని చూపు ఆయమకనుకొలఁకులలోనియారుణ్యమే బొడుగఱచినపుడు బాణముపుంఖభాగమున తమ్మరసమంటుకొనఁగా నేర్పడిన యెఱ్ఱఁదనమట ఇట్లు గట్టిపట్టుదలతో సేసిన యీబాణమిఁక లక్ష్యభేదనమొనర్చుటలో నెట్టి సంశయము లేదు ఈ యుత్ప్రేక్ష భావికథానుగుణమై రసోద్దీప్తిని కలిగించుచున్నది కవి కావలయునని ఇమిడ్చినది కా దీ యలంకారము రసాక్షిప్తమై యీయర్థమున కమరియుండుటచే నిఁక రసాస్వాదమున నేయంతరాయమును లేదు.

రసమున నలంకారములవినివేశన మనిన నిట్లుండవలెను

విరుద్ధరసాంగగ్రహణము శోభాహేతువగుట :—

ఒకప్పుడు విరుద్ధరసాంగములు ప్రకృతరసమునకంగములై శోభాహేతువు లగుచుండును—

శా॥ మట్టెల్ మ్రోయఁగ గబ్బిచన్నఁగవ గంపంబంద వేణీభరం
బట్టిట్టై కటిఁ జిమ్మచీఁకటులుగా నశ్రుప్రజం బోడికల్
గట్టం జూపులు చిమ్మరేఁగి దివి రోలంబాళిఁ గల్పింపఁగా
మిట్టాడంగ నరుండులేని యడవిం మీనాక్షి దీనాకృతిన్ (మను 4 68)

రాక్షసత్రస్తయైన మనోరమ శరణార్థినియై పరుగలిడిన దృశ్యమిది శృంగారము పైకిస్ఫురించినట్లు తోచును. కాని నిజమునకిది శృంగారరసము కాదు భయానకరసమిది. రక్కసియై వెంటాడు ఇందీవరాక్షుడు విభావము.

నిర్జనారణ్యముద్దీపనము పరుగులిడుట, కంపము కన్నీరు, శూన్యాలోకనము శరణువేడుట యనుభావములు చింతావేగాదులు సంచారిభావములు, వీనిచె మనోరమకు రాక్షసునివలనకలిగిన భయమభివ్యక్తమగుచు భయానక రసమగుచున్నది

శృంగారభయానకములు పరస్పరవిరోధులే[5] యయినను ఈ యనుభావము లీరెంటికిని సహజములే యగుటచె నే విరోధము లేదు[6]

ఇట్లు శృంగారానుభావములను కూర్చుటచె నిట క్రొంగ్రొత్తశోభ చేకూరినది

విభావాద్యౌచిత్యమున రసపోషణము –

విభావాదులను తీర్చిదిద్దుటలో పెద్దన కృతహస్తుడు మచ్చునకొక పద్యము–

మ అనిశం జిత్తము జల్లనన్ సొరగుస య్యంభోజపత్రాక్షి లో
చనగోళంబులఁ జిమ్మలై చిలువలై జాలై తరంగంబులై
చనుదోయిం గొనబౌ కురంగమదచర్చల్ జాఱిపో నొక్క మెం
డున బాష్పాంబురుఝరంబు లుప్పతిలెఁ బోటుంబాటుగా నెంతయున్
(మను 3 136)

గర్భభరాలసయగు తన్ను వీడిపోనుద్యుక్తుఁడైన (మాయా)ప్రవరుని వీడ లేక దుఃఖితయగు వరూథిని కన్నీరుమున్నీరై ప్రవహించుటలోని సొగసు ఈ పద్యమున స్ఫురించుచున్నది.

ఈకన్నీరు విప్రలంభశృంగారాంగమగు సాత్త్విక భావము

ఉద్దీపనవిభావమగు నాయకసౌందర్యాదులవర్ణనము యథాప్రదేశవిని- వేశితమై రసావహమగుచుండుటయు స్మృత్యాదిసంచారిభావధ్వనులలోని

---

5 శృంగారవీరరౌద్రాఖ్య హాస్యశాంతైర్భయానకః ।
. . . ఇత్యాఖ్యాతా వరోధితా ॥ సా ద. 3 257.

6 అంగభావం ప్రాప్తానాం చ తేషాం విరోధిత్వమేవ నివర్తతే । అంగభావ- ప్రాప్తిర్హి తేషాం స్వాభావికీ, సమారోపకృతా వా ॥
—(ధ్వన్యా 3 20 కా వృత్తి)

యందమును పూర్వప్రకరణములో వివరింపఁబడియుండుటచే నిట ఉదాహరింపఁబడలేదు

రసపుష్టికై కావలసిన మెలఁకువ పరిపాటించుటలో కవి చూపిన నేర్పెంతింత యనరాదు

**రసపోషణమున ఉద్దీపనప్రశమనములు –**

ఏరసమైనను నిరంతరముగా నాస్వాద్యమానమగుచుండెనేని సుకుమారమగు మల్లెపూవువలె తొందరగవాడిపోవును ఇఁక శృంగారవిషయమున వేఱుగా చెప్పవలెనా ?[7] కావుననే భరతముని–

> యద్వామాభినివేశిత్వం యతశ్చ వినివర్తతే ।
> దుర్లభత్వం యతో నార్యాః కామినః సా పరా గతిః ॥
> –లోచనోద్ధృతము (ధ్వన్యా తృ పు 341)

"ప్రతికూలాచరణము, అభిలాషనిరాకరణము, నాయిక దుర్లభమైయుండుట అనునీమూడును శృంగారరస విషయమున పరమప్రీతిహేతువులు" అని నుడివెను.

ప్రకృతమున వరూధిని చూచినదే తడవుగా ప్రవరునెంతగానో ప్రేమించినది. కాని ప్రవరుఁడందుకు సమ్మతింపక యామె ప్రేమను తిరస్కరించెను ఇట్లు శృంగారరసమునకు నాయకదౌర్లభ్యమున విచ్ఛిత్తి యేర్పడవలసియుండగా నాయికకు నాకాశాబంధము కల్పించి విప్రలంభశృంగారమును నిర్వహించుట ప్రకృతసంభోగశృంగారమునకెంతో పుష్టిని చేకూర్చినది.[8] 'న వినా విప్రలంభేన శృంగారః పుష్టిమశ్నుతే" అని కదా అభియుక్తోక్తి యథావసరముగా నడుమనుద్దీపనప్రశమనములు చేయుటయే రసమునకు పుష్టి చేకూర్చునని ధ్వనికారులును వాక్రుచ్చిరి [9]

---

7. గాఢం హ్యనవరతమ్మృదితో రసః సుకుమారమాలతీకుసుమవత్ఝుటిత్యేవ మ్లానిమవలంబేత। విశేషతస్తు శృంగారః॥ –లోచన (ధ్వన్యా తృ పు. 341)

8 సాహిత్యదర్పణమున నుద్ధృతము (తృతీ కా. 213 వృత్తి )

9. "ఉద్దీపనప్రశమనే యథావిభవమంతరా ।
రసస్యారబ్ధవిశ్రాంతే రనుసంధానమంగినః॥" (ధ్వన్యా 3 . 13)

తృతీయాశ్వాసమున విప్రలంభశృంగారము కడురమణీయముగా తీర్చఁబడినది

ఉ కమ్మనికుందనంబు కసుగందని మే నెలదేఁటిదాఁటులన్
బమ్మెరవోవఁ దోలు దెగబారెఁడు వెండ్రుక లిందుబింబముం
గిమ్మననీదు మోము గిరిక్రేపులు మూఁపులు కౌను గానరా,
దమ్మకచెల్ల వానివికచాంబకముల్ శతపత్రజైత్రముల్ (3 6)

వరూధిని ప్రవరతిరస్కృతియైనను అతనిపై నాశ వదలుకొనలేక అతనికై వగచుచు అతనిలోకోత్తరలావణ్యమును తన మనమున భావించిన తీరిది—ఇది విప్రలంభశృంగారపరిపోషకమగు స్మృతియను సంచారిభావ ధ్వని దీనిచే వరూధినికి ప్రవరునియెడఁగల రతి యనవచ్చిన్నమై యున్నతీరు హొద కట్టుచున్నదికదా! ఇది (మాయా)ప్రవరసమాగమమును సుగమముచేయుచు సంభోగశృంగారరూపమున పరిణమించినది

రచనావైశిష్ట్యముచే రసపోషణ :—

శృంగారమున నుదాత్తమగు రచన యవసరము. పరమమధురమగు రసము శృంగారమే కదా। కావున కవి రసానుగుణముగా ద్రాక్షాపాకవిలసితమును ప్రసాదగుణగుంఫితమును అగు మదురరచన సాగించెను మచ్చునకొక పద్యము —

ఉ. ఎన్నిభవంబులం గలుగు నిక్షుశరాసనసాయకవ్యథా
ఖిన్నత వాడి వత్తలయి కేలఁ గపోలము లూది చూపులన్
విన్నఁదనంబు తోఁపఁ గనువేఁదుఱునం బయిగాలి సోకినన్
వెన్నవలెం గరంగు నలివేణులఁ గౌఁగిటఁ జేర్చుభాగ్యముల్ (2 57)

ప్రవరుని నొడఁబఱచుటకై వరూధిని యనిన పలుకులివి ఇట మనసారప్రేమించిననన్నుపేక్షించుట తగదను నభ్యర్థనతోపాటు వరూధినికిఁ గల లోకోత్తరసౌందర్యప్రయుక్తగర్వమును "ఎన్నిభవంబులన్ గలుగు?" అను మాటలలో ధ్వనించుచున్నది దీనిచే ప్రవరునియెడఁగలరతి పోషింపబడి ఇది శృంగారరసధ్వనియు నగుచున్నది ఈశృంగారరసముననున్న మాదుర్య గుణము నీరచన వ్యక్తము చేయుచున్నది చిత్తద్రుతిని కలుగఁజేయు గుణము మాధుర్యము దానిని రసగంగాధరకారు లిట్లు నిర్వచించిరి—

"సంయోగపరహ్రస్వాతిరిక్తవర్ణఘటితత్వే సతి
పృథక్పదత్వం మాధుర్యమ్॥" (రసగం. ప్రథమ.)

అనఁగా సంయుక్తాక్షరములవెనుక హ్రస్వవర్ణములు లేకయు, పదములు సమాసవిశిష్టములుకాకయు విడివిడిగానుండునపుడే మాధుర్యగుణము భాసించు ననిసూత్రసారాంశము పైపద్యమున మన్మథునిపై కోపము వ్యంజింపఁ జేయుటకా? యనునట్లు 'ఇక్షుశరాసనసాయకవ్యథాభిన్నత' అనునొక దీర్ఘసమాసముదక్క అలతియలతిపదములతో సాగిన ఈరచన శృంగారరసగత మాధుర్యగుణమును చక్కఁగా నభివ్యక్తీకరించుచు రసము నాస్వాద్యతమముగా నొనరించుచున్నది

ఇట్లు రసభంగహేతువులగు ననౌచిత్యాదులను పరిహరించుటచేతను, విరుద్ధరసాంగములను కావ్యశోభార్థమై ప్రకృతరసాంగములుగా తీర్చిదిద్దుటచేతను విభావానుభావవ్యభిచారిభావములను సముచితముగా సమకూర్చుటచేతను రసము విచ్ఛిన్నముకాకుండునట్లు యథావసరమున తదుద్దీప్తిని కలిగించుటచేతను ప్రబంధప్రధానరసమగు శృంగారము సముచితముగా పోషింపఁబడినది

**రసధ్వని వైశిష్ట్యము :—**

రసధ్వని అసంలక్ష్యక్రమమై యుండుటచే ఝటితిస్ఫూర్తికమై సహృదయుల నుల్లాసపఱుచును. వస్త్వలంకారధ్వనులు క్రమసాపేక్షములై యుండుటచే ఝటితిస్ఫూర్తికములు కాకుండుటవలన తదాస్వాదమున కొంత విలంబ మేర్పడుచున్నది వస్త్వలంకారములు వాచ్యావస్థయందువలె వ్యంగ్యావస్థయందును విభావాదిరూపమున రసపర్యవసాయులే యగును

**వస్తుధ్వని రసపర్యవసాయియగుట కుదాహరణము :—**

మ బహురత్నద్యుతిమేదురోదరదరీభాగంబులం బొల్చు ని
మ్మిహికాహార్యమునం జరింతు మెపుడుం బ్రేమన్ నభోవాహినీ
లహరీశీతలగంధవాహపరిఖేలన్మంజరీసౌరభ
గ్రహణేందిందిరతుందిలంబు లివి మత్కాంతారసంతానముల్
(మను 2 45)

"ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ"యని ప్రశ్నించుచు తానిలు సేరుటకుపాయ మెద్ది యని యడిగిన ప్రవరునితో మొదటిచూపులోనే యతనియందమున కబ్బురపడి వలచిన వరూథినిపలికిన పలుకులివి—"హిమవత్పర్వతగుహాభ్యంతరములు, పగలు రాత్రి యను భేదము లేక ఎప్పుడును రత్నద్యుతులతో నొప్పుచు నిర్జనములైయుండుటచేత, మఱి ఈవనప్రదేశములు పూలపొదరిండ్లతో నొప్పారుచు శీతలమందమారుతమున రతిశ్రమాపనోదనసమర్థములై యుండుటచేతను విహారయోగ్యములై యున్నవి"అను వస్తువు ఉద్దీపనవిభావగతవైశిష్ట్యరూపమై ధ్వనించుచు, ఇట్టి దుర్లభములగు విహారయోగ్యప్రదేశములలో నను

గూడి సుఖింపుమను వరూధిని యభిప్రాయవిశేషమును "మత్"అను పదసాహా-య్యమున వ్యక్తపఱుచుచున్నది ఇది వరూథినికి ప్రవరుని యెడఁగల రతిలో పర్యవసించుటచే శృంగారరసపరిపోషకమగుచున్నది

**అలంకారధ్వని రసపర్యవసాయియగుట కుదాహరణము –**

ఉ పాటున కింతులోర్తురె కృపారహితాత్మక నీవు త్రోవ ని
చ్చోటఁ బవన్నఖాంకురము సోకెఁ గనుంగొను మంచుఁ జూపి య
ప్పాటలగంధి వేదననెపం బిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటినవిచ్చుగుబ్బచనుమిట్టల నశ్రులు చిందువందుగన్. (మను. 2 79)

ప్రవరునివలన త్రోపువడి ఘనలజ్జాపరవశయై యతనిని చుఱచుఱ చూచుచు వరూథిని పలికిన పలుకులివి ఇట కృపారహితాత్మక' అను సంబోధనముచే దయపిడి నన్నిట్లు త్రోయఁదగునా? యను విశేషరూపార్థము నకు సమర్థకముగా 'భూతదయార్ద్రబుద్ధిలేనివాడెన్ని పుణ్యములు చేసినను ప్రయోజనము లేదను సామాన్యరూపార్థము ధ్వనించుచుండుటచె నర్థాంతరన్యాసా లంకారధ్వని ఇది [10]పరనిందాకారణీభూతచిత్తవిశేషరూపమగు "నసూయ"యను సంచారిభావమున పర్యవసించుచు విప్రలంభశృంగారపరిపోషక మగుచున్నది

వస్త్వలంకారధ్వనులు పార్యంతికముగా రసపర్యవసాయులే యయినను కావ్యమునకు వీనివలననే చమత్కారాతిశయము కలుగునపుడు ప్రాధాన్యము నొంది 'రాజానుగతవివాహప్రవృత్తభృత్య'న్యాయమున భావధ్వనులవలె ప్రత్యే కాస్తిత్వమును నిలుపుకొనుచున్నవి

కావుననే త్రివిధధ్వనులును కావ్యమున ప్రధానములే యగునని పలువురు లాక్షణికులు వక్కాణించిరి.

**మనుచరిత్రమున ఉపదేశము .—**

పండితుఁడు పామరుఁడు అను భేదము లేక సకలజనాదరణపాత్ర మగుటకు కారణము, మనుచరిత్రము శృంగారరససముంచితమై ద్రాక్షాపాకమునే నొప్పారుచుండుటయే భరతముని - "స చ స్త్రీపురుషహేతుక ఉత్తమయువ ప్రకృతిః (నాట్య 6-46 కా వృత్తి) అని శృంగార ముత్తమయువప్రకృ తికమై యుండవలెనని నిర్దేశించుటచే అసత్యశృంగార మెప్పుడును కావ్య మున నుపాదేయము కాదు కావ్యకథావస్తువును ఉత్తమనాయకాశ్రయమై

---

10 "పరోత్కర్షదర్శనాదిజన్యః పరనిందాకారణీభూతశ్చిత్తవృత్తివిశేషోఽసూయా ॥ (రసగం ప్రథమ)

యుండునదియే యగుటచే "ఉపదేశ"మనుప్రయోజనము కావ్యమున నయత్న ముగా సిద్ధించును

మనుచరిత్రమున ప్రధానములగు కథాంశములవలన వ్యక్తమగు నుపదేశ మిట్లున్నది—

ప్రవరవృత్తాంతముచే బాహ్యప్రలోభములకులోనుగాక స్వవిహితధర్మము ననుష్ఠించిన తప్పక మేలు చేకూరుననియును, వరూథినీవృత్తముచే అవిమృశ్య కారిత్వమనర్థహేతువనియేకాక భావనాబలమున నెట్టికార్యమైనను చేకూరు ననియు, స్వరోచిచరితముచే - "న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి। హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభి వర్ధతే॥" అన్నట్లు విషయోప భోగము లెంతకాల మనుభవించినను తనివి తీరదనియు, మనోరమకథవలన విశ్వాసపాత్రులతో సుఖదుఃఖములు పంచుకొనవలయుననియు, స్వారోచిషుని యాఖ్యానమున కర్మానుసారముగా సంప్రాప్తించు నైహికభోగములకై కాక తురీయపురుషార్థముకొఱకే భగవంతునాశ్రయించవలయుననియు వ్యక్తమగు చున్నది

స్వవిహితకర్మానుష్ఠానప్రాముఖ్యము నభివ్యక్తీకరించుటతో ప్రారంభింపఁ బడిన ఈమహాప్రబంధము తురీయపురుషార్థప్రాముఖ్యమును వ్యంగ్యమర్యాదచే బోధించుచు ముగియుచున్నది

**ఉపసంహారము :—**

రసానందలోలుపులై సహృదయులగు పఠితలు కావ్యమున ప్రవర్తింతురు. వారప్రయత్నముగనే కావ్యోపదేశమును గ్రహించి తీరుదురు

కావ్యము కాంతాసమ్మితమై స్వారసికప్రవృత్తిని కలుగఁ జేయుననుట లోని పరమార్ధ మిదియే

ఇట్లు కావ్యమునకుగల ముఖ్యప్రయోజనములగు 'ఆనందము-ఉపదేశము అను నీరెండును వ్యంజనాయత్తములే యగుటచే నారెండుప్రయోజనములను చేకూర్చుధ్వనికావ్యమే ఉత్తమశ్రేణికిఁజెందిన కావ్యము కాఁగలిగినది.

అట్టియుత్తమశ్రేణికిఁజెందిన ధ్వనికావ్య మీ మనుచరిత్ర మనుటలో నే యతిశయోక్తియులేదు.

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః ।
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయమ్ ॥

ఓం 'శాంతిః శాంతిః శాంతిః'



# ధ్వని – మనుచరిత్రము

## అనుబంధము

### ప్రవరుని కథాసంగ్రహము – కుతపకాల ప్రసక్తి

ఈ ప్రబంధమునకు కవి సముద్దిష్టనామము స్వారోచిషమనుసంభవము స్వారోచిషమనువు చతుర్దశమనువులలో రెండవవాఁడు ఇతఁడు స్వరోచి కుమారుఁడు. కావుననే "స్వారోచిషుఁ"డను నామమేర్పడెను స్వరోచియు వరూథినియను గంధర్వాంగనకుమారుఁడు వరూథినియనునీయప్సరోభామిని ప్రవరుఁడను నొకనైష్ఠికగృహస్థుని వలచినది కాని యతఁడామెను చేపట్ట నిరాకరించెను ఈయదనుగైకొని యొకానొక గంధర్వుఁడు ప్రవరునిరూవుగైకొని ప్రవరునియనిఁచట్లు ప్రవర్తించుచు నమ్మించి వరూథినిని చేపట్టెను వారిద్దరికి జన్మించినవాఁడు స్వరోచి, ఇతడే స్వారోచిషమనువుజనకుఁడు

ఈ స్వారోచిషమనుసంభవమున ప్రవరునకుఁ గలసంబంధము ఏతావన్మాత్రమే. గంధర్వుఁడు మోసగించినను ఆమోసము వరూథినికి తెలియదు వరూథిని ప్రవరునే చేపట్టినట్లు భావించినది ఆమేభావనయంతయు ప్రవరుని యందే రూపుదిద్దుకొనినది వరూథినిభావనలో దూర్తగంధర్వునిప్రసక్తియే లేదు కావుననే తన పౌత్రుడు స్వారోచిషుఁడు ధర్మమూర్తియై లోకమును ధర్మముగా పాలించుమనువులలో ద్వితీయస్థానమలంకరించినాడు కావున ఈ కావ్యము ప్రవరునిచరిత్రతో ప్రారంభమైనది.

ప్రవరుఁడు వరణానదీతీరమందలి అరుణాస్పదపురనివాసి అచటి ప్రజలు స్వస్వధర్మనిరతులు [1]ప్రవరుని నడవడి సాటిగృహస్థుల కాదర్శము. అతఁడు ప్రత్యూషపవనాంకురములు పైకొనువేళ వామనస్తుతిపరత్వమున మేల్కాంచును శిష్యసమేతుఁడై వరణానదీస్నానార్థము వెళ్ళును అఘమర్షణ మంత్రములతో స్నానమాచరించును సంధ్యావందనము ప్రారంభించి గాయత్రీ జపము చేయుచుండును. ఇంతలో సూర్యుడుదయించును సూర్యోపస్థానము చేయును పూలు పండ్లు కుశలు సమిధలు మున్నగు హోమద్రవ్యములు

1. మను 1 54, 55 (ఉదాహృతములు. పు 412)

గైకొని శిష్యులు వెంటరాఁగా ఇల్లు చెరును అతనింట దేనికిని కొదువలేదు అతఁడు పరప్రతిగ్రహమొల్లఁడు అతిథ్యర్చనలతో స్వాహాస్వధాకారాములతో అతని గృహము పావనమైయుండును అతడెంతరూపవంతుడో అంతటి స్వధర్మనిరతి గలవాఁడు నిరంతరము నిత్యకర్మానుష్ఠానము మాతాపితృసేవ అభ్యాగతసేవ వేదాధ్యయనాధ్యాపనాదులు వాని నిత్యకృత్యములు

కుతపకాలమనఁగానేమి ?

ఒకనాఁడతనింటికి ఒకానొకయతిథి వచ్చెను అది కుతపకాలము దినమందలి ఎనిమిదవ ముహూర్తమును "కుతప"మందురు దినప్రమాణము 30 ఘడియలైయుండ ప్రతిముహూర్తప్రమాణము రెండుఘడియలగును దినప్రమాణమున 15వ భాగము ముహూర్తము కావున కుతపముహూర్తము 14 నుండి 16 ఘడియలమధ్యకాలము ఘడియయన 24 నిముషములు రెండున్నర 2½ ఘడియలకు ఒక గంటయగును ఈవిధమున విచారించగా కుతపకాలమన గం 11.36 నుండి 12.24 గంటలవఱకుఁగల మధ్యాహ్నకాలమని తేలినది "కు"(కుత్సితము) అనగా పాపమనియు దానిని తపింపఁజేయునది (నశింపఁజేయునది) కావున కుతపము – ఈకాలము మధ్యాహ్నమే యగునని నిర్ణయసింధువు నుడువుచున్నది — "అన్యాన్యపి పృథివీచంద్రోదయే మాత్స్యే–"మధ్యాహ్నః ఖడ్గపాత్రం చ తథా నేపాలకంబలః। రౌప్యం దర్భాస్తిలా గావో దౌహిత్రశ్చాష్టమః స్మృతః"॥ "పాపం కుత్సిత మిత్యాహు స్తస్య సంతాపకారిణః। అష్టావేతే యత స్తస్మాత్ కుతపా ఇతి విశ్రుతాః॥" (నిర్ణయ తృ. ప.)

కుతుపముహూర్తమని యనక కుతపకాలమనియనుటచే[2] నది మధ్యాహ్నకాలమని తెలియుచున్నది. అభ్యాగతసేవకు తగినసమయ మదియే కదా !

ప్రవరునింటికేతెంచిన యాయభ్యాగతుఁడు సామాన్యుఁడుకాదు అతఁడు ఔషధసిద్ధుఁడు [3] అనగా ఓషధిప్రక్రియతెలిసినవాఁడు, కేవలము తెలియుటయే కాదు. దానిలో నాతడు సిద్ధిపొందినవాఁడు అతఁడారససిద్ధిచే నరనిమిషములో భూమండలనే చుట్టిరాగల సమర్థుడు. ఓషధిరససిద్ధిచే సాధించరానిదేది యుండును ? సువర్ణకరణమహాసర్పవిషహారణాదులు ఓషధిప్రక్రియాసాధ్యములనుట ప్రసిద్ధమేకదా !

---

2. మను. 1 . 58 3 మను 1 . 59

ఇంటికివచ్చినయాయతిథికి ప్రవరుడు సకలోపచారములు చేసెను ఇష్ట మృష్టాన్నకలన సతుష్టుఁజేసి చేరవచ్చి 'ఇష్టాగోష్ఠి'సలిపెను అతడు చూసిన వింతలు యాత్రావిశేషముల విని యబ్బురపడెను ఓషధిరసప్రభావమున భూమండలిని చుట్టివచ్చినతీరు విని తనలోని తీర్థసంసేవనాభిలాష చిగురించెను ఇఁక ఓపికపట్టలేక "నను మీశిష్యుని తీర్థయాత్రవలనఁ ధన్యాత్ముఁగాఁజేయరే" (1/77) అని ఆ సిద్ధుని ప్రవరుఁడు వేడుకొనెను

దానికాసిద్ధుఁడు సమ్మతించి ఒకానొకపసరు నాప్రవరునికాలికి పూసి వెడలిపోయెను.

క ఆమందిడి యతఁడరిగిన
భూమీసురుఁడరిగెఁ దుహిన భూధరశృంగ
శ్యామల కోమల కానన
హేమాఢ్య దరీ ఝరీ నిరీక్షాపేక్షఁ (1 . 79)

పిమ్మట ప్రవరుఁడు హిమాలయము చూడ నభిలషించి ఒషధిరసప్రభావ మున ఆపర్వతమునకు వెళ్ళెను చని యచ్చటనాతఁడు నరనారాయణచర ణాంబురుహద్వయభద్రచిహ్నముద్రితబదరీవనస్థలిని సగరుముమ్మను మండు(భగీరథుఁడు)తపముగైకొనినచోటు జగతికి మున్నేఱు(ఆకాశగంగ)దిగిన చోటు, గిరికన్య పతికై తపముచేసినచోటు ఈమున్నగునెన్నియో పుణ్యస్థల విశేషములను దర్శించెను ఇంకను చూడవలసిన విశేషములు మెండుగా నుండుట గాంచిన ప్రవరుఁడు —

మ తలమే బ్రహ్మకునైన నీనగమహత్త్వం బెన్న ? నేనియ్యెడం
గల చోద్యంబులు రేపు గన్గొనియెదం గాకేమి నేఁడేగెదఁ
నలినీబాంధవభానుతప్తరవికాంతస్యందినీహారకం
దళచూత్కారపరంపరల్ పయిపయిఁ మధ్యాహ్నముం దెల్పెడిఁ.
(2 . 12)

నేఁడు మధ్యాహ్నమయినది ఇక్కడనున్న మిగిలిన విశేషములను రేపు చూతునని గృహోన్ముఖుఁడాయెను కాని మంచుపేటిచే యతనిపాదలేపము కరఁగిపోవుటచే తిరిగిపోజాలకుండెను ఆపాదలేపనపుటోషధి ఏదో తెలియ కుండుటచే ఇఁక తా నిలు చేఱుట యెట్లని వగచుచు దైవమును తూలనాడెను. తన

యవిచార్యకారితకు తన్నే నిందించుకొనెను తుదకొక వరూథినియను గంధ ర్వాంగనను చూచి తనయరుణాస్పదపురముత్రోవ చూపుమని యడిగెను కాని యతిలోకలావణ్యశేవధియగు ప్రవరునిరూపమును చూచి యాశపడిన ఆగంధ ర్వాంగన తన్ను చేరఁదీసి ఇక్కడే యుండిపొమ్మనెనే కాని తనకు ఇలుచేరు నుపాయము తెల్పదయ్యెను ఇఁక ప్రవరుఁడు తాను నమ్మినదైవమగు అగ్ని హోత్రుని ప్రార్థించి యతని యనుగ్రహమున నిలుచేరెను

ఇది స్వారోచిషమనుసంభవమునందలి ప్రవరుని కథాసంగ్రహము

## హిమాలయ గమన సమయ మేది ? :—

ఇచ్చట ప్రవరుని హిమాలయగమనసమయమేది ? అనుజిజ్ఞాస యుద యించుచున్నది సిద్ధుఁడు ప్రవరునింటికేతెంచిన దినమా ? మరుసటిదినమా ? సిద్ధుఁడేతెంచినదినమే యనుకొనిన పూర్వాపరవిరోధము—ప్రవరునింటికి సిద్ధుఁ డే తెంచినకాలము కుతపకాలము అనఁగా మధ్యాహ్నకాలము ప్రవరుఁడు హిమవ త్పర్వతమునఁగల విశేషముల వీక్షించి ఇంటికి మరలుసమయము మధ్యాహ్న కాలము ఒక దివసమున మధ్యాహ్నములు రెండుండునా ? అతిథిభోజనాది కృత్యముల నొకక్షణముననే ముగించుకొని హిమవన్నగమున కెగెనని యను కొనినను అచ్చటిచింతలు విశేషములు దర్శించి గృహోన్ముఖుఁడగునప్పటి సమ యము సాయాహ్నమగునే కాని మధ్యాహ్నమెట్లగును? కావున ఆనాఁడె యనుట పొసగదు

ఇక మఱుసటిదినమనుకొందుమేని యదియు పొసఁగదు. సిద్ధుఁడామందు (పసరు) కాలికిపూసి వెడలిన పిమ్మట ప్రవరుడును హిమాలయమున కేగెనని తెల్పఁబడినది కాని మరుసటిదినమేగినట్లు చెప్పఁబడలేదు సిద్ధుఁడు మందిడి యానాఁడె యరిగెను ప్రవరుఁడు మాత్రము మఱునాఁడు హిమాలయ మునకు వెడలెనని భావించినను కుదురకున్నది పరమనైష్ఠికుఁడగు ప్రవరుఁడు కాలికిపూసినయాపసరు పోవునను భయమున ఆరాత్రియంతయు పాదప్రక్షాళ నాదులు చేసికొనక ఎట్లుండును ? మఱునాటియుదయముననే సిద్ధుఁడు ప్రవరుని కాలికి పాదలేపము పూసివెడలుటయు ప్రవరుఁడును హిమాలయమునకేగుటయు జరిగినదని భావింతుమేని కాలూనికలేనియాసిద్ధుఁడు ఆరాత్రియంతయు అచ్చట ఎట్లుండును ? అది అతని ధర్మప్రవృత్తికిని విఘాతము కాదా? కావున మఱునాఁ డనుటయు పొసఁగకున్నది

ఇట్లుండ కొందఱు — ప్రవరునినైష్ఠికత్వవిఘాతాపాదకమగు పరదినము కంటె మధ్యాహ్నకాలము ద్విరావృత్తిగావించిన యనౌచిత్యదోషము కవితా పితామహునకాపాదించి పూర్వదినమే మేలని వాదింతురు కాని మధ్యేమార్గము నన్వేషింపరైరి మఱికొందఱు ఆసిద్ధుఁడును ఆరాత్రియంతయు ఆయూరనే గడపి మఱునాటియుదయమున ప్రవరునకు పాదలేపనము చేసి వెడలెనని భావించిన ఈరెండు దోషములును పరాస్తములగును కావున పరదినమే మేలని చెప్పుదురు కాని దానికి ప్రోద్బలకమగు గ్రంథస్థప్రమాణమేదియును చూపరైరి.

ఈవాదోపవాదములు పండితలోకమునకు తెలియనివి కావు.

"ఉభయితఃపాశా రజ్జుః" అను విధముననున్న ఈసమస్యకు పరిష్కారమన్వేషింపవలసియున్నది—

సమయనిర్ణయమున గ్రంథస్థప్రమాణము .—

ఇలుసేరనుపాయముగానక వరూధినిని జేరిన ప్రవరుఁడామెతో నిట్లనును —

ఉ వేలిమియున్ సురార్చనయు విప్రసపర్యయుఁ జిక్కె భుక్తికిన్
వేళ యతిక్రమించె జననీజనకుల్ కడువృద్ధులాకటన్
సోలుచుఁ జింతతో నెదురుసూచుచునుందురు రాహితాగ్ని నేఁ
దూలు సమస్తధర్మములుఁదొయ్యలి నేఁడిలు సేరకుండినన్ (2 53)

ప్రవరునియీపలుకులవలన తేలినదేమన - ప్రవరుడు హిమవత్పర్వత విశేషములదర్శించి ఇంటికి బయలువెడలునప్పటికి తననిత్యకర్మానుష్ఠానమున అగ్నికార్యము దేవతార్చన అతిథిసంతర్పణ యనునవి మిగిలియున్నవనియు అతఁడవి యనుష్ఠింపకయే హిమవత్పర్వతవిశేషముల దర్శింప బయలువెడలెనని తెలియుచున్నది ఆయౌషధసిద్ధుడేతించిననాఁడే హిమవత్పర్వతమునకెగెనని భావించిన ప్రవరునిఈపలుకులు పొసఁగవు అనాఁడతఁడు అతిథిసంతర్పణ చేసెనని చెప్పుటకు 'ఇష్టమృష్టాన్నకలన సంతుష్టుఁజేసి' (1 60) అనుగ్రథస్థ వాక్యమే ప్రమాణము అగ్నికార్య—దేవతార్చనలు తత్పూర్వమే అనుష్ఠేయములు కావున అవియును అతఁడు చేసియే యుండెననుటలో సందియము లేదు. అతిథిసంతర్పణతోడనే నిత్యభోజనాదులును ముగియును కావున అనాఁడే యనిన ప్రవరుని ఈపలుకులన్నియును అసంగతములగును పరమనైష్ఠికుఁడును అహితాగ్నియునునగు ప్రవరునకు అసత్యవాదితాదోషము నంటగట్టవలసి

వచ్చును అట్లు కూడదు కదా : ప్రవరునిపలుకులయందలి ప్రామాణ్యబుద్ధిచే విచారించిన నతఁడు మఱునాటియుదయముననే హిమగిరివిశేషములు దర్శింప నేగెననుట స్పష్టము ఎట్లన ? —

**ఆహితాగ్ని దినచర్యాక్రమము .—**

ఆహితాగ్నియగు గృహస్థుఁడు ప్రాతఃకాలమున సంధ్యావందనాదులు నిర్వర్తించుకొని వేదశాస్త్రాధ్యయన—అధ్యాపనాదులచే ద్వితీయభాగము*గడుప వలయును

"ద్వితీయభాగే వేదశాస్త్రాభ్యాసః। "పఠేదధ్యాపయేద్వేదాన్ జపేచ్చైవ విచారయేత్। అవేక్షేత చ శాస్త్రాణి ధర్మాదీని ద్విజోత్తమః"

(ధర్మసింధు—తృ ప)

దేవతార్చన ప్రాతఃకాలమందే కాని లేదా మధ్యాహ్నమున బ్రహ్మ యజ్ఞానంతరమే కాని చేయవలయునని ధర్మశాస్త్రనిర్ణయము.

"దేవతార్చనమపి ప్రాతర్హోమోత్తరం వా చతుర్థభాగే బ్రహ్మయజ్ఞోత్తరం వా కార్యం। విధాయ దేవతాపూజాం ప్రాతర్హోమాదనంతరం ॥ కుర్వీత దేవతా పూజాం జపయజ్ఞాదనంతరమ్॥ ఇత్యాదిద్వివిధస్మృతేః॥" (ధర్మసింధు-తృ ప)

దినతృతీయభాగమున ధనార్జనోపాయములు యాజనాదులు చతుర్థ భాగమున మాధ్యాహ్నికసంధ్య బ్రహ్మయజ్ఞాదులు, పంచమభాగమున వైశ్వ దేవపంచమహాయజ్ఞ-అతిథి సంతర్పణాదులు నిర్వర్తింపవలెను

ఆహితాగ్నియగు ప్రవరుఁడును ప్రాతఃకాలమున సంధ్యాజపాదులు నిర్వ ర్తించుకొని దేవతార్చన బ్రహ్మయజ్ఞానంతరమున అనగా మధ్యాహ్నకాల మునను నిర్వర్తింపవచ్చును కావున దానిని ముగింపకయే, ఇఁక ద్వితీయ తృతీయభాగములయందు (ఉదయం 7 30 గం నుండి 10 30 వరకు) నిర్వ ర్తింపవలసిన అధ్యయనాధ్యాపనాదులు నాటికి మానుకొని హిమవత్పర్వతము నకేగెను అధ్యపనము ప్రవరునకు జీవికార్థము నిర్వహింప పనిలేకున్నను

---

* దినమును ఎనిమిది భాగములుగా విభజించి ఆ యా సమయములందు ఆహితాగ్ని అనిష్ఠింపవలసిన నిత్యకృత్యములు ధర్మసింధువు మున్నగు ధర్మశాస్త్రగ్రంథములయందు నిర్దేశింపఁబడినవి — —రచయిత

ఎంతోమంది శిష్యులు అతనియొద్ద నుచితముగా వేదశాస్త్రాదుల నభ్యసించు చుండిరని "సచ్ఛాత్రుఁడగుచు" అను పదముచె తెలియుచున్నది ఉదయము ననే యేగి మధ్యాహ్నమువఱకును అచ్చటివిశేషములు చూడవచ్చునని తలంచుటలో తప్పేమి యుండును? కర్మలోపము కూడ కలుగదు అల్లే ఆసిద్ధుని నోడంబఱచుకొని కాలిపసరు మరుసటిదినమున నుదయముననే నతనినుండి సంగ్రహించెను మధ్యాహ్నమున వచ్చిన యాయతిథికి ఇష్టమృష్టాన్నములతో నుపచరించుటతో నాటిమధ్యాహ్నము ముగిసి యపరాహ్ణములో కొంతభాగమును హరించిపోవును

"  మృష్టాన్న సంతృప్తులఁగాఁజేయు
జేసికూర్చున్నచో చెరవచ్చు
వచ్చియిద్దరఁగల్గు వనధిపర్వతసరిత్
తీర్థమాహాత్మ్యముల్ దెలియడుగు"* (1 57)

అని చెప్పియుండుటచే ఆసిద్ధుఁడు బడలాయాసము తీర్చుకొని విశ్రాంతిగా కూర్చున్న సమయమున ఆతనిని వెరి తీర్థయాత్రాసల్లాపములతో నాటిసాయాహ్నమున కొంతభాగము హరించుటతో కర్మలోపభయమున నాటిసాయంతనమున హిమవత్పర్వతమునకు గాని మఱో పుణ్యతీర్థమునకైనను ఏగి వచ్చుట యసంభవము కావున మరునాటియుదయమున తన్ప్రయాణము నిశ్చయించుకొనియుండును సిద్ధుఁడును 'గ్రామైరాత్రి"ముండు వాఁడుకావున మఱు నాటియుదయమున నాతఁడును ప్రాతఃకాలీనస్నానసంధ్యాదులు నిర్వర్తించుకొని ప్రవరునకు పాదలేపము పూసి వెడలెను ప్రవరుడును హిమాలయము చేరెను

శ్లో. ఏకరాత్రం వసేద్ గ్రామే
నగరె పంచరాత్రకమ్ ।
వర్షాభ్యోఽన్యత్ర వర్షాసు
మాసాంశ్చ చతురో వసేత్ ॥ (ధర్మసింధు తృ ప్ర)

అని గ్రామైకరాత్రనివాసము యతులకే విహితమైయుండ ఇఁక ఆ సిద్ధుఁడానాటిరాత్రి ఆయూరనే దేవాలయాదులలో గడిపియుండుటలో నే ధర్మలోపమును లేదు

---

* ఉదాహృత పూర్వము (పు 413)

